శ్రీ బాదరాయణీయ

# బ్రహ్మసూత్ర బోధామృత లహరి



నారాయణ

ప్రకాశకులు :
శ్రీ సీతారామ సేవాసదన్
మంథని

# శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి

**నారాయణ**

*ప్రథమ ముద్రణ : గురు పూర్ణిమ, తేది 19-07-2016*

*మూల్యము : శుద్ధి, శ్రద్ధ, జిజ్ఞాస, దీక్ష*

*ప్రతులు :500*

Printed by Courtesy from : **Excel Industries Limited,** Mumbai, **Excel Cropcare Limited,** Mumbai.

*ప్రచురణ:*

**శ్రీ సీతారామ సేవాసదన్**

మంథని-505 184, కరీంనగర్ జిల్లా,
తెలంగాణా. ఫోన్: 08729-278439.

*గ్రాఫిక్స్ & అక్షరాలంకరణ :* **వడ్లకొండ శ్రావణ్ కుమార్, చిప్ప ప్రసాద్**
**గోలి వేణుగోపాల్, అంకాలపు వేణుకృష్ణ & అంకాలపు లక్ష్మీపతి**

*ముద్రణ:* **ప్రొ॥ జక్కని ప్రభాకర్**
**సత్యనారాయణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

4-6-143, తిలక్‌రోడ్, కరీంనగర్, తెలంగాణ. ఫోన్: 0878-2243026.

*ప్రకాశకులు :*

**శ్రీ సీతారామ సేవాసదన్**

గోదావరి రోడ్, మంథని - 505 184. కరీంనగర్ జిల్లా - (తెలంగాణ) ఫోన్ : 08729-278439.

*కవరుపేజీ వర్ణము :* **ఆకాశ వర్ణము. "ఆకాశస్తల్లింగాత్" బ్ర.సూ. (22) I-1-22. "ఆకాశము పరబ్రహ్మవాచకము" "ఈ సమస్త భూతములు ఆకాశమున పుట్టి, అందే లీనమగుచున్నవి". ఈ "శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి" అనే సమస్త విజ్ఞాన ప్రవాహము ఆకాశ వర్ణమున వ్యాకృతమై అందే పూర్ణమై సంపన్నమగుచున్నది. విజ్ఞానమునకు మొదలు ముగింపు లేవు.**

*కవరుపేజీ పైన :* **అన్నమయ-ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ-ఆనందమయ పంచకోశముల ఆత్మజ్యోతి, దీప-సూర్య-చంద్ర-తారా-బ్రహ్మాండ పంచజ్యోతుల బ్రహ్మజ్యోతి, సప్తవర్ణముల కాంతి జ్యోతి, శ్రీకృష్ణపరబ్రహ్మ నెమలి పింఛము, సత్య-జ్ఞాన-అనంత-ఆనంద-అమృతముల పంచామృతబిందువులు, సాధువులకు-ఉపాధ్యాయులకు-ఆచార్యులకు-సిద్ధులకు-ముక్తాత్మలకు పంచ నమస్కారములు.**
**నారాయణ స్వానుభూతి వర్ణచిత్రము. బ్ర.సూ. (370) III-3-11**

*కవరుపేజీ లోన :* **బ్రహ్మము,జగత్తు-బింబము, ప్రతిబింబము-పరమాత్మ, జీవాత్మ-హిమాలయము, ధర్మశాలలో సుజన,నారాయణలకు దర్శనము. ఉదయము 6 గంటల ఫోటో. బ్ర.సూ. (103) I-3-40**

*వెనకపేజీ లోపల :*

**పరమాత్మ-జీవాత్మ, భగవంతుడు-భక్తురాలు, ఉపాస్యము-ఉపాసకురాలు, శ్రీ భిక్షేశ్వర ఆలయములో శ్రీ భిక్షేశ్వర అనుగ్రహము, శ్రీమతి సుజన గారి భిక్షేశ్వర దర్శనము మరియు కుండలినీ దర్శనము. బ్ర.సూ. (342)III-2-24**

*వెనుక పేజీ కవరు :*

**ఒకే చెట్టు కొమ్మపైన కూర్చున్న రెండు పక్షులు. "ద్వా సుపర్ణా సయుజా సఖాయా". పరమాత్మ-జీవాత్మ వర్ణచిత్రము. కుమారి కృప శర్మ, 15 సం॥ల వయస్సు. బ్ర.సూ. (393) III-3-34, (39) I-2-8**

## శ్రీ గణేశ వందనము

శ్రీకార రూపమై వెలుగువాని, గణములపతియై నిర్వహించువాని
బుద్ధిసిద్ధులు సహితమై దర్శనమిచ్చువాని, వినాయకునికి నాయకునికి నమస్సులిడుదు

## శ్రీ సరస్వతి వందనము

శ్రీ మంత్రపురిని దీవించు శారదమ్మ, గౌతమీతటిన వెలసిన బ్రహ్మరాణి
విజ్ఞాన వివేక సంపదలు మాకొసగు తల్లి, విద్యా సరస్వతీదేవికి నతులనిడుదు

## శ్రీ బాదరాయణ వందనము

నాల్గుముఖములు నీకు లేకున్నగూడ, నాల్గు అధ్యాయముల బ్రహ్మముఖములు వెలిగించినావు
రెండు చేతులె నీకుయున్నగూడ, నాల్గునాల్గుల విష్ణుపాదముల రచియించినావు
నుదుట కన్ను నీకు లేకున్నగూడ, వేదాంతదర్శన శుభశివదృష్టి కలిగించినావు
పరబ్రహ్మ తత్త్వ సూత్రములు ప్రసాదించినట్టి, శ్రీ బాదరాయణ భగవంత ! నతులు నతులు నీకు

## శ్రీ ఆది శంకర వందనము

శ్రీ శివగురు ఆర్యాంబలకు జనియించి చిన్ననాడె విద్యనేర్చి సన్యసించినావు
గురుగోవిందుల కృపనంది విష్ణు సహస్రనామ భాష్యము వ్రాసినావు
ఉపనిషత్తుల బ్రహ్మసూత్రముల భగవద్గీతల భాష్యము చేసినావు
అన్ని మతముల నన్వయించి అద్వైత మార్గము చూపినావు
నాల్గు మఠముల స్థాపించి నాల్గు వాక్యముల వెలిగించినావు
నలుగురు శిష్యులతో గూడి అనేక మహాజ్ఞానుల జగతికిచ్చినావు
బ్రహ్మ సత్యము జగన్మిథ్య యనుచు జీవుడే బ్రహ్మమని తెలిపినావు
భారత చైతన్యము పైకి లేపిన జగద్గురు శ్రీ శంకర భగవంత ! నతులు నతులు నీకు

## శ్రీ గురుపరంపర వందనము

శ్రీ వాణీపతికి వందనంబు లిడుచు, శ్రీ లక్ష్మీపతికి వేయి నతుల నిడుచు
శ్రీ శైలజాపతికి నమస్కారమ్ము లిడుచు, శ్రీ పరబ్రహ్మకు ప్రణామమ్ము లిడుచు
శ్రీ వేదవ్యాస బాదరాయణ మహర్షులకు ప్రణతు లిడుచు
శ్రీ శంకరభగవత్పాదులకు శిరము వంచి
శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములకు అంజలి ఘటించి
శ్రీ అద్వయానంద భారతి స్వాములకు చేతులెత్తి
శ్రీ జనార్ధనానంద సరస్వతి స్వాములకు వందనమ్ములిడుచు
శ్రీ గురువులందరకు నమస్సు లిడుదు

(ii)

# ఉపనిషత్తుల శాంతి మంత్రములు

వేదాంత విజ్ఞాన ఖనులైన 108 ఉపనిషత్తులు 4 వేదములలో విస్తరించి వున్నాయి. ప్రతి ఉపనిషత్తుకు వేదము, ఆ వేదానికి సంబందించిన శాంతి పాఠము నియమించబడి వున్నాయి. ప్రతి ఉపనిషత్తు యొక్క అధ్యయనము, పఠనమునకు ముందు మరియు తర్వాత శాంతి పాఠమును గురువు, శిశ్యులు కలిసి ప్రార్థనగా, సంకల్పముగా గానము చేయాలి. అన్ని వేదములకు సంబందించిన శాంతి పాఠములు ఈక్రింది విధము :

## 1. ఋగ్వేద శాంతి మంత్రము :

ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా - మనో మే వాచి ప్రతిష్ఠితం, అవిరావీర్మఏధి, వేదస్యమ అణిస్థః - శ్రుతంమేమా ప్రహాసీః - అనేనాధీతేన అహోరాత్రాన్ సందధామి - ఋతం వదిష్యామి - సత్యం వదిష్యామి - తన్మామవతు - తద్వక్తారమవతు - అవతుమాం - అవతువక్తారం.

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

## 2. శుక్లయజుర్వేద శాంతి మంత్రము :

ఓం పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణమేవావశిష్యతే ॥

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

## 3. కృష్ణయజుర్వేద శాంతి మంత్రము :

ఓం - సహనావవతు - సహనౌభునక్తు - సహవీర్యం కరవావహై -
తేజస్వినావధీతమస్తు - మావిద్విషావహై ॥

ఓం-శం నో మిత్ర శ్శం వరుణః । శం నో భవ త్వర్యమా । శం నో ఇంద్రో బృహస్పతిః। శం నో విష్ణు రురుక్రమః। నమో బ్రహ్మణే। నమస్తే వాయోత్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి। ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి। తన్మా మవతు। తద్వక్తార మవతు। అవతు మామ్ అవతు వక్తారమ్ ।

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

# ఉపనిషత్తుల శాంతి మంత్రములు

## 1. ఋగ్వేద శాంతి మంత్రము :

ఓం. ఈ నా వాక్కు మనస్సునందు ప్రతిష్ఠితముగా వుండుగాక. మనస్సు వాక్కునందు ప్రతిష్ఠితము యగునుగాక. ఓ! ఆవిర్భూతమైన పరమ చైతన్యమా ! నా అవిద్యను లేకుండ చేసి ప్రకాశమునను గ్రహించుము. ఓ! వాక్కు, మనస్సులారా! పరస్పరానుకూలమైన మీరు నాకు విజ్ఞానమును నొసంగుటకు సమర్థులగుదురు గాక. నేను వినిన, చదివిన విద్యను నేను గ్రహించి మరవకుండా వుండునుగాక. ఈ విద్య అహో రాత్రములు నాయందు అనుసంధానము యగునుగాక. ఋతమును వచించెదను గాక. సత్యమును వచించెదను గాక. ఆ పరబ్రహ్మము నన్ను కాపాడును గాక. ప్రవక్తయైన నా గురువును కాపాడుగాక !

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

## 2. శుక్లయజుర్వేద శాంతి మంత్రము :

ఓం. పూర్ణము అదియును (పరము) పూర్ణము ఇదియును (ఇహము). పూర్ణము నుండి పూర్ణము ఉద్భవము యగుచునుండును. పూర్ణము నుండి పూర్ణము వెడలి వచ్చినపుడు పూర్ణమే మిగిలియుండును.

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

## 3. కృష్ణయజుర్వేద శాంతి మంత్రము :

ఓం. కూడి మమ్ములను ఆ పరమాత్మ రక్షించు గాక
కూడి మమ్ములను ఆ పరమాత్మ పోషించు గాక
కూడి మేము వీర్యతన శుభకార్యములు చేసెదము గాక
కూడి మేము తేజముతో విద్య నేర్చెదము గాక
కూడి మేము యుండెదము గాక ద్వేషంబు లేక
ఓం మిత్రుండు శాంతిగ, సంతసముగ నుండుగాక
వరుణుండు శాంతిగ, సంతసముగ నుండుగాక
ఆర్యముడు శాంతిగ, సంతసముగ నుండుగాక
ఇంద్రుండు శాంతిగ, సంతసముగ నుండుగాక
బృహస్పతి శాంతిగ, సంతసముగ నుండుగాక
విష్ణువు, విక్రముండు శాంతిగ, సంతసముగ నుండుగాక
బ్రహ్మమునకు నమస్కారంబు లివియె,
వాయువునకు నమస్కారంబు లివియె,
నీవే ప్రత్యక్షముగ బ్రహ్మమ్ము, నిజము,
నీవే ప్రత్యక్షము బ్రహ్మమని వచించెదను నేను
ఋతమును వచించెదను నేను, సత్యమును వచించెదను నేను
నన్ను ఎపుడును కాపాడుమయ్య
నా ప్రవక్తను, ఆచార్యుని ఎపుడు కాపాడుమయ్య
నన్ను ఎపుడును కాపాడుమయ్య
నా ప్రవక్తను, ఆచార్యుని ఎపుడు కాపాడుమయ్య

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

## 4. సామవేద శాంతి మంత్రము :

ఓం అప్యాయన్తు మమాంగాని, వాక్ ప్రాణ శ్చక్షు శ్శ్రోత్రమథో, బలమిన్ద్రియాణిచ సర్వాణిః, సర్వం బ్రహ్మోపనిషదః, మాహం బ్రహ్మ నిరాకుర్యాం, మామా బ్రహ్మ నిరాకరోత్, అనిరాకరణ మస్త్వనిరాకరణం, మేఽస్తుః తదాత్మనిః నిరతే య ఉపనిషత్సు ధర్మాః తే మయినన్తు తే మయివన్తు.

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

## 5. అథర్వవేద శాంతి మంత్రము :

ఓం భద్రం కర్ణేభిః శ్రుణు యామ దేవాః, భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః, స్థిరై రంగై స్తుష్టువాంన స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః॥ స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః – స్వస్తి నః పూషా విశ్వవేదా, స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః, స్వస్తినో బృహస్పతిర్దధాతు ॥

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*



## 4. సామవేద శాంతి మంత్రము :

ఓం నా అంగములను, వాక్కును, ప్రాణము, చక్షువు, శ్రోత్రము మరియు బలము సర్వ ఇంద్రియములను ఉపనిషత్ప్రతిపాదితమైన బ్రహ్మము రక్షించుగాక. బ్రహ్మము నన్ను నిరాకరించకుండును గాక. నేను బ్రహ్మమును నిరాదరించనట్లు అనుగ్రహము కలుగు గాక. నా విషయమున బ్రహ్మము యొక్క ఆదరణ, అనుగ్రహము కలుగుగాక.

నేను ఆత్మయందు నిరతడును అయివుందుగాక. ఉపనిషత్తులలో బోధించబడిన ధర్మములు నాయందు స్థిరముగ నిలచుగాక. నిలచుగాక.

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*

## 5. అథర్వవేద శాంతి మంత్రము :

ఓం మనము భద్రమైన దానిని, శుభమైన దానిని ఈ కర్ణములతో వినుచుందుము గాక. యజన శీలురమై భద్రమును చూచెదము గాక. స్థిరమైన అంగములతో మిమ్ముల స్తుతిచేస్తూ దేవహితమైన మాకు విధించిన ఆయువు వరకు జీవించెదము గాక.

పురాతనుడు, ప్రసిద్ధుడు అయిన ఇంద్రుడు మాకు స్వస్తి కలిగించును గాక. విశ్వవేద్యుడైన పూష మాకు స్వస్తి కలిగించును గాక. తార్క్ష్యుడు, అరిష్టనేమి మాకు స్వస్తి కలిగించుగాక. బృహస్పతి మాకు స్వస్తి కలిగించుగాక.

*ఓం శాన్తిః శాన్తిః శాన్తిః*



# అనుక్రమణిక

# సమర్పణము

"వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥"

"అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరోహరిః ।
అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥"

"శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్ ।
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః ॥"

"శ్రుతి స్మృతి పురాణానామాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్ ॥"

సమస్త భారత సంస్కృతిని జ్ఞానమార్గములో పురోగమించటానికి, విశ్వ చైతన్యముగా ప్రసరించటానికి, ప్రకాశించటానికి స్ఫూర్తి మరియు ప్రేరణ తమ అమృత స్వరూప రచనల ద్వారా కలిగించిన పరమ పూజ్యులు మరియు సమస్త మానవాళికి ముక్తి మార్గములు దర్శింపచేసిన

**దివ్యద్రష్టలు**

## శ్రీశ్రీశ్రీ వేదవ్యాస బాదరాయణ మహర్షులకు

**మరియు**

బ్రహ్మసూత్రముల భగవద్గీతల మరియు ఉపనిషత్తుల భాష్యములు రచించి అనేక అధ్యాత్మిక గ్రంథములు వ్రాసి అద్వైత సిద్ధాంతమును సుస్థిరము చేసి విద్యా, జ్ఞాన, విజ్ఞాన చైతన్య క్షేత్రములలో భారత దేశాన్ని ఒకటిగ చేసిన

**జగద్గురువులు**

## శ్రీశ్రీశ్రీ ఆదిశంకరాచార్య భగవత్పాదులకు

### శిరసా ప్రణామములతో పూర్ణభక్తితో

# అంకితము

❋❋❋❋ ❋❋❋❋ ❋❋❋❋ ❋❋❋❋

*గురు పూర్ణిమ, తేది 19-07-2016*

# ప్రణామములు

ఈ జన్మనిచ్చి పెంచి, పెద్దచేసి, జీవనము సార్థకము కావటానికి అవసరమైన విలువలను తెలిపి తదుపరి నడచి, నిలచి, అందరితో కలసి మెలసి భక్తి ప్రగతి మార్గములో నుండుటకు చేయూత, ధైర్యము, ఆత్మవిశ్వాసము, మనోవైఖరి కలిగించిన

తల్లితండ్రులు

శ్రీమతి మరియు శ్రీయుతులు

**గట్టు సీతమ్మ రామన్న గార్లకు**

**వాసాలమర్రి అహల్యమ్మ నరహరి శాస్త్రి గార్లకు**

మరియు

గీతామకరందము ద్వారా చైతన్య

మార్గద్వారము తెరిపించి స్వానుభూతి

వైపు పురోగమించటానికి స్ఫూర్తి, ప్రేరణలను కలిగించిన

సద్గురువర్యులు

**శ్రీ విద్యా ప్రకాశనందగిరి స్వాముల వారికి**

భక్తి శ్రద్ధలతో

ధన్యవాదయుత ప్రణామములు

❋❋❋❋❋

**సుజన +నారాయణ**

# పరమాత్మీయ ధన్యవాదములు

పరమాత్మ కరుణ వలన మహర్షులు, ఆచార్యులు మరియు పూర్వీకులు, వరిష్ఠుల అనుగ్రహము మరియు ఎందరో మహానుభావుల సహకారముతో అస్తిత్వమునందిన ఈ స్వాధ్యాయ సంహిత **"శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి"** ని అవలోకించి, అధ్యయనము చేసి, పరిశీలించి, సమీక్షించి ఎన్నియో అమూల్యమైన సలహాలు, సవరణములు, సుధారణలు, సుహృద్భావములు అందించి ప్రేరణాకారకము మరియు స్ఫూర్తిదాయకములైన ముందుమాటలు వ్రాసిన ఆత్మీయులు మరియు సప్తర్షి సదృశులైన,

**ఆచార్య సార్వభౌమ డా॥ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు**
**ఆచార్య శ్రీ కుప్పా వేంకటకృష్ణమూర్తి గారు**
**ఆచార్య డా॥ హరి శివ కుమార్ గారు**
**సేవాయోగి శ్రీ పీయూష్ భాయి డవే గారు**
**అధ్యాత్మ విద్యా తపస్వి డా॥ ముద్దు రామకృష్ణ గారు**
**భాగవత కళా ప్రపూర్ణ బ్ర॥శ్రీ॥ మంగళంపల్లి వేణుగోపాల శర్మ గారు**
**ఉత్తరకాశీ తపస్వి  శ్రీ స్వామి సూర్య భాస్కరేంద్ర సరస్వతి గారలకు**

గౌరవపూర్వక, ప్రేమపూర్వక, హృదయపూర్వక
ఆత్మీయ ధన్యవాదములు

**సుజన -నారాయణ**

❀❀❀❀❀❀❀

# ప్రకాశకీయము

# బ్రహ్మదర్శనము

**వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమకల్మషం ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః**

శ్రీ సీతారామ సేవాసదన్‌ను స్థాపించి పదమూడు సంవత్సరములు పూర్తి అగుచున్నవి. బ్రహ్మశ్రీ గట్టు నారాయణ గురూజీ గారు తమ జన్మభూమిపై కల ప్రేమగౌరవాలతో వారి తల్లితండ్రులైన అమృత స్వరూపులు శ్రీమతి,శ్రీ గట్టు సీతమ్మరామన్నల జ్ఞాపకార్థము ఈ సేవా సదనము శ్రీ సువర్ణ లక్ష్మణ రావు గారు మరియు నిర్వహణ సమితి సభ్యులతో కూడి స్థాపించినారు. వారి చింతన “మానవసేవయే మాధవసేవ” మరియు "Serve and Deserve".

వారు స్థాపించిన ఈ సేవాసంస్థ ద్వారా మంథనిలోని వృద్ధులకు, మహిళలకు, బాలబాలికలకు, విద్యార్థులకు, ఆర్థికముగా కష్టముండి అవసరమున్న వారికి సేవచేసే భాగ్యము మాకు లభించినది.

ఇటీవల శ్రీ సురాభాండేశ్వరము వద్ద సభామందిర వ్యవస్థీకరణము, రుద్రపాదములవద్ద పునరుద్ధరణ మరియు మార్గనిర్మాణము, ఆధ్యాత్మిక కార్యక్రమముల నిర్వహణ, శ్రీ సీతారామాశ్రమ ధ్యానమందిర నిర్మాణము, శ్రీ గోవర్ధన గోశాల ప్రారంభము కావించబడినవి. ఇవే కాక కంప్యూటర్ శిక్షణ, పర్యావరణ రక్షణ, పేద విద్యార్థులకు నోటు బుక్కుల పంపిణీ, పాఠశాలలో వసతులు కల్పించుట, శ్రీ మంత్రపురి దర్శన్ అనే చారిత్రక సాంస్కృతిక ప్రదర్శనశాల, శ్రీపాద బాలోద్యానము, శశికృప బాల వికాస కేంద్రము, ముద్దు రామకృష్ణయ్య యువజన వికాస కేంద్రము, శ్రీ మాణిక్యమ్మ రాఘవరెడ్డి ఉద్యానవనము మొదలైనవాని నిర్మాణము నిర్వహణ మరియు సాహిత్య సేవ జరుగుచున్నవి.

దీనిలో మంథని వారల మరియు శ్రేయోభిలాషుల సహాయసహకారములు బాగుగా లభించుచున్నవి. సాహిత్య కార్యక్రమములలో శ్రీ గురూజీ ఆంగ్లములో రచించిన గ్రంథములను తెలుగు వారికి అందచేయటము జరిగినది. వారి తెలుగు రచనలు మన వేద సంస్కృతిని ఆధ్యాత్మిక చింతన ద్వారా బలపరుచుటకు తోడ్పడు గ్రంథములు. అట్లు తెలుగు భగవద్గీత, విష్ణుసహస్ర నామ బోధామృత లహరి, శ్రీ శివసహస్రనామ బోధామృత లహరి, శ్రీ లలితా సహస్రనామ బోధామృత లహరి, శ్రీ శంకరబోధామృత లహరి, శ్రీ పాతంజల యోగసూత్ర బోధామృత లహరి, శ్రీ నారద భక్తి సూత్ర బోధామృత లహరి అనే గ్రంథములను ప్రచురించుట మాకు ఆనంద దాయకము అయినది.

శ్రీ నారాయణ గురూజీ రచనలేకాక ఎందరో పండితులు విజ్ఞానమూర్తులైన శ్రీ ముద్దు బాలంభట్టు, శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, శ్రీ గజానన్ తామన్, డా॥ వి.వి.ఎల్. నరసింహారావు, డా॥ రంగి కమల, శ్రీ వెల్ది రామారావు, శ్రీ తోట లక్ష్మణ్ రావు, శ్రీ కేశవరెడ్డి గారలు మొదలైన వారి రచనలు ప్రచురించి తెలుగువారికి అందించటమైనది.

ఈ సాధనలో, సాహిత్యసేవలో ఈ "శ్రీ బాదారాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి" అనే తులసీమాల మీకు అందించటము మాకు ఒక ముఖ్యమైన సోపానము.

ప్రపంచానికి జ్ఞానబోధ చేసి, ఆత్మపరమాత్మల సంబంధాన్ని వివరింపచేసి ఎవరు, ఎక్కడ, ఎప్పుడు, ఏమి, ఎలా, ఎందుకు అనే ప్రశ్నావళికి సమాధానమైన పరబ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకొనుటకు జ్ఞానోపకరణములు బ్రహ్మసూత్రములు.

విష్ణురూపమునకు అభేద రూపమైన సాక్షాత్తు వ్యాసభగవానులైన శ్రీ బాదరాయణ మహర్షి రచించినవి ఈ బ్రహ్మసూత్రములు. కఠినతరమైన బ్రహ్మసూత్రముల చైతన్య సందేశాన్ని సులభగ్రాహ్యము కావించునది భగవద్గీత.

శృతి, స్మృతి, న్యాయప్రస్థానములలో ముఖ్యమైనవి బ్రహ్మసూత్రములు. గురుకృప, భగవదనుగ్రహము మరియు తపో మార్గ సాధన వలననే ఈ సూత్రములు అవగతమౌతాయి. బ్రహ్మసూత్రములు అర్థమైతే బ్రహ్మములో ఐక్యము చెందే మార్గము సుగమము అయినట్లే. భారతీయ వేదాంత తత్త్వదర్శనమైన సర్వోన్నతమైన సాహిత్యము ఈ శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్రములు.

**"శ్రుతి స్మృతి పురాణానామాలయం కరుణాలయం ।**
**నమామి భగవత్పాదం శంకరం లోకశంకరం ॥"**

అన్నట్లుగా జగద్గురువులైన శ్రీ ఆదిశంకరాచార్యులవారు పరమ ద్రష్టలైన శ్రీ కృష్ణద్వైపాయనులుగా అభికీర్తించబడిన, వ్యాసమహర్షిగా తెలియబడిన శ్రీ బాదరాయణుల వారి నిగూఢమైన బ్రహ్మసూత్రములను విడదీసి వివరించి, విశదీకరించి, ఒక విజ్ఞాన ఖనిగా దివ్యమైన వ్యాఖ్యరూపములో మనకందించినారు.

నాలుగు అధ్యాయములు, 16 పాదములు, 191 అధికరణములు, 555 బ్రహ్మసూత్రములు కలిగిన ఈ మహత్తర రచనను మనకందించిన శ్రీ బాదరాయణ భగవానులకు శిరసా నమస్కారములు.

పరమ దుర్గమమైన శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్రబాష్యము పఠనమే కష్టము. పఠించిన గూడ ధారణ పరమ దుర్లభము. ఋషులకు, ద్రష్టలకు మాత్రమే ధారణ కాగలుగునవి ఈ బ్రహ్మసూత్రములు.

లోకవ్యవహారములలో నిత్యజీవనక్రియలలో నిమగ్నులైనవారి కోసము తాను తపించి, శోధించి, సాధించి తరించిన ఆనందమయులైన జ్ఞాన ద్రష్ట అయిన మా గురూజీ ఒక తపస్విగా, తత్త్వ దర్శనము చేసిన ద్రష్టగా ఈ శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరిని రచించి ఐహిక భవసాగరము దాటించే విధముగా అమృతపానము చేయకలిగించే విధముగా అచ్చ తెలుగు పదాలతో పండు వొలచి పెట్టిన విధముగా ప్రదానము చేసినారు.

శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి బ్రహ్మజ్ఞానతత్త్వ శోధకులకు, సాధకులకు మార్గదర్శిగా ఉపయుక్తమై జీవన్ముక్తిని సుగమం చేయునని మా నమ్మకము. ఈ గ్రంథము ఒకసారి చదివినవారి మనోవైఖరిలో పరబ్రహ్మస్థితి ఏర్పడక తప్పదు. శ్రీ సీతారామ సేవా సదన్ ద్వారా ఈ మహోత్కృష్ట గ్రంథము అయిన **"శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి"**ని అందించుటకు చాలా ఆనందముగా ఉన్నది.

ఇది తెలుగువారికి, మన మంథని వారికి చైతన్య మార్గములో ప్రగతి కావటానికి ఉపయుక్తము అవుతుందనే విశ్వాసముతో, ప్రార్థనలతో మీకందరికీ సమర్పణము.

సదా మీ సేవలో...

**సువర్ణ లక్ష్మణరావు**
శాశ్వత గౌరవ అధ్యక్షులు

**కె.వి.ఎల్.యన్. హరి**
అధ్యక్షులు

**దుద్దిళ్ళ గణపతి**
కార్యదర్శి

**శ్రీ సీతారామ సేవా సదన్**
**మంథని.**

# మనవి

శ్రీ బాదరాయణ మహర్షుల బ్రహ్మ సూత్రముల సందేశమును, శ్రీ ఆదిశంకరాచార్యుల లక్ష్యమును స్వయము అర్థము చేసుకొని, అనుభూతి నందటానికి గత పన్నేండ్లుగా చేసిన సాధనయే ఈ **"శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి".**

దానితో పాటు ఆ అర్థమును మరియు అనుభూతిని మహామాన్యులు, మాన్యులు, సామాన్యులు, అసామాన్యులతో పంచు కొనుటములో సార్థకత అంది ఆనందము అవుతుంది.

ఇది నారాయణ సర్వస్వామ్యము కాదు. ఇది సర్వస్వామ్యము. ఎందుకంటే ఇది **శ్రీ బాదరాయణుల** నుండి, **శ్రీ ఆదిశంకరుల** నుండి **శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల గీతా మకరందము** నుండి, వేదాంత యోగి **శ్రీ నరహరి శాస్త్రి** గారి నుండి, పన్నేండేండ్ల శ్రీ జనార్ధనానంద సరస్వతి సంస్కృతి ట్రస్టు వారి వేద సభల మరియు ఆత్మ బంధువులు పరమాత్మ బంధవులు అయిన కుప్పా, తూములూరి, పసుమర్తి వారల సాంగత్యము నుండి, నేర్పునేర్చువారల నుండి, గ్రహించి స్వాధ్యాయము చేసి స్వాంతరము చేసికొని మీకు అందించినది. ఎందరో రచయితల, మహానుభావుల భావములు వాక్యములు ఇందులో కనిపిస్తాయి, స్ఫురిస్తాయి. వారందరికీ ధన్య ధన్య వాదములు.

ఈ ప్రక్రియలో సహయోగము, సహాధ్యాయము చేసిన చైతన్య సహగామినికి, జీవన భాగస్వామిని **శ్రీమతి సుజనాదేవి** గారికి సౌహార్ద ప్రేమ పూర్వక ధన్యవాదములు.

ఈ సాధనలో గత సంవత్సరముగా తోడుగా వుండి అనేక విధములుగా, అన్ని రీతుల సహకారము, సహాయము, సహాయసాధన, సేవచేసిన హిమాలయములలోని ఉత్తరకాశీ తపస్వి- **శ్రీ సూర్యభాస్కరేంద్ర సరస్వతీ స్వాముల** వారికి హార్దిక అభినందనలు, ధన్యవాదములు.

వేదభాష, సంస్కృతము క్షుణ్ణముగా తెలియకపోయినా, శ్రుతులు శాస్త్రీయముగా అభ్యాసము చేయకపోయినా, ఛందస్సు వ్యాకరణముల లోతుపాతులు పూర్తిగా అవగాహన లేకపోయినా కేవలము గురుకృపతో, మహనీయుల మన్ననతో, సహచరుల సహాయ్యముతో, స్వాధ్యాయము, తపస్సు, నిష్ఠతో స్వానుభూతి కొరకు మరియు నాలాంటి వారికి అర్థము అనుభూతి కావటానికి కొంత ఉపయోగము కావటానికి వ్రాసిన, స్వకీయ గమనికల పుస్తకము (Personal Note Book) వంటి, ఈ **"శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి"** లోని తప్పులన్నీ స్వీకరిస్తూ, ఒప్పులన్నీ మీకు సమర్పిస్తూ, నమస్తే

**నారాయణ**

గురుపూర్ణిమ 19-07-2016

ఆచార్య సార్వభౌమ
ప్రొ॥ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ శివాయ గురవే నమః

"శారదా పీఠం"

# ఆప్త వాక్యం

ఈశ కేన కఠ ప్రశ్నాది దశోపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, శ్రీమద్భగవద్గీత అనే మూడింటికీ ప్రస్థానత్రయమని వ్యవహారం. జననమరణ రూపమైన సంసార (అజ్ఞాన) బంధం నుండి విడువడి తన స్వరూపమైన బ్రహ్మత్వాన్ని అనుభవించడానికి ఆ గ్రంథత్రయం మార్గనిర్దేశకమైనది. జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులు ఈ ప్రస్థాన త్రయానికి అద్వైత సిద్ధాంతపరంగా భాష్యాన్ని సంతరించారు. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః" అనే తత్త్వాన్ని సప్రమాణంగా నిరూపించారు. "భాష్యేషు శాంకరం శ్రేయః" అని ఆ భాష్యం విద్యత్ప్రశంసలు అందుకొన్నది. తెలుగులో ఆ శాంకర భాష్యానికి పెక్కు అనువాదాలు కూడా వెలువడ్డాయి.

జగద్గురువులు "శ్రుతి స్మృతి పురాణానామాలయమ్" అని స్మృతింపబడుతున్నారు. తమ అద్వైత భాష్య రచనలో శంకరభగవత్పాదులు శ్రుతివాక్యాలు, స్మృతివచనాలు, పురాణోక్తులు, వీటితోపాటు అనుభవ సిద్ధములైన యుక్తులు ప్రమాణంగా స్వీకరించారు.

"బృహంతీతి బ్రహ్మ" అని బ్రహ్మశబ్దవ్యుత్పత్తి. సర్వవ్యాపకమైనదని తాత్పర్యం. అది శుద్ధ బుద్ధ నిరాకార నిరంజన చైతన్య స్వరూపం. వాక్కులతో వర్ణింపశక్యంగానిది. "యత్రవాచో నివర్తంతేఽప్రాప్య మనసాసహః" అని శ్రుతి. అది ఏకమైనది. అవయవరహితమైనది. అద్వితీయమైనది. అనుభవైక వేద్యమైనది. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని శ్రుతివాక్యం. "సత్యం జ్ఞానమనంతరం బ్రహ్మ" అనేది బ్రహ్మము యొక్క స్వరూపలక్షణం. "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ ప్రయంత్యభిసంవిశంతి" అనేది తటస్థ లక్షణం.

అట్టి బ్రహ్మమును అనుభవించడానికి ప్రతిబంధకమైనది జగత్తు. అది భ్రాంతిమూలకమైనది మాత్రమే. మాయ. అధ్యాసవల్ల జగత్తు అనుభవంలో గోచరిస్తుంది. "అతస్మిన్ తద్బుద్ధిః" అని అధ్యాస లక్షణం. వస్తువు కాని దానియందు వస్తు జ్ఞానం ప్రాప్తించదు. అది రజ్జు సర్పభ్రాంతివంటిది. బ్రహ్మ భిన్నమైన మరొక వస్తువు లేకపోయినా భ్రాంతివల్ల జగత్తు భాసిస్తోంది. బ్రహ్మానుభవం కల్గిన ఆ క్షణంలోనే జగత్తుయొక్క అనుభవం నశిస్తుంది. సర్వమూ బ్రహ్మలీలగానే భాషిస్తుంది. ఉన్నది త్రాడే అని స్పష్టంగా తెలిసిన ఆ క్షణంలోనే అప్పటివరకు కల్గిన సర్పభ్రాంతి సమూలంగా నశిస్తుంది. అది త్రాడుగానే అనుభవించబడుతుంది. జడార్థంగా జీవుడు అనే వాడు కూడా లేనే లేడు. ఉన్న బ్రహ్మము ఒక్కటే అయినప్పుడు జీవుడు మాత్రం ఎక్కడనుండి వస్తాడు? జీవత్వానుభవం కూడా భ్రాంతి మూలమే.

సర్వజ్ఞత్వ కించిదజ్ఞత్వాదులు తొలగిస్తే ఈశ్వరుడు జీవుడు అభిన్నులే. జీవుడు లేనేలేడు అని స్పష్టంగా అవగతమవుతుంది. "జీవో బ్రహ్మైవ నా పరః" అనే విషయ అనుభవింపబడుతుంది. ఇదంతా అద్వైత సిద్ధాంత సారసంగ్రహం. దీన్ని వివిధ శాస్త్రసంప్రదాయాలలో శ్రుతి స్మృతి పురాణోక్తులతో యుక్తులతో శంకరభగవత్పాదులు తమ భాష్యంలో నిరూపించారు. ఈ సూత్రభాష్యంలో జగద్గురువులు ఈ శరీరాన్ని విడిచిన జీవుడు ఎక్కడకు వెళ్తాడు? మళ్లీ మరో శరీరాన్ని ఎలా పొందుతాడు? బ్రహ్మప్రాప్తికి అధికారులు ఎవరు? మున్నగు ఎన్నో ఆసక్తి కరములైన విషయాలని చక్కగా వివరించారు.

ఈ బాదారాయణ మహర్షి విరచితములైన బ్రహ్మసూత్రాలకి శారీరక మీమాంస అని కూడా నామాంతరం. శారీరుడు అంటే జీవుడు. జీవతత్త్వ నిరూపణకు గావింపబడిన మీమాంస కాబట్టి శారీరక

మీమాంస అని ప్రసిద్ధి ఏర్పడింది. ఈ గ్రంథం నాల్గు అధ్యాయాలలో రచింపబడింది. ఒక్కొక్క అధ్యాయం నాల్గు పాదాల విభాగం గలది. ప్రతిపాదమూ కొన్ని అధికరణములుగా విభజింపబడింది. గ్రంథం సమస్తం సూత్రాలలో కూర్చబడింది.

శ్రీ గట్టు నారాయణ గురూజీ అపూర్వ ప్రతిభాశాలి. అనిదం పూర్వ ప్రజ్ఞా వైదుష్య నిధి. అసమాన విభవ సంపన్నులు. గురుముఖతః అధ్యయనం చేయకపోయినప్పటికీ సంస్కృతాంధ్ర సాహిత్యాలలో లోతైన పరిజ్ఞానంగలవారు. అనుత్తమ వేదాంత జ్ఞాన సంపదగలవారు. "ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః" అనే కాళిదాసోక్తికి సముదాహరణీయ చరిత్రులు. వారు శ్రీమద్భగవద్గీతని అనువదించిన సందర్భంలో వారి పరిచయ భాగ్యం లభించింది. అది రెండున్నర శతాబ్దాలుగా వర్ధిల్లుతూ "త్వమేవాఽహమ్" అన్న స్థితిని అందుకొంటోంది. వారి సౌజన్యం అమేయమైనది. వారి సౌహార్దం అనితర లభ్యమైనది. వారి సతీమణి ॥ల॥సౌ॥ సుజన గారు ఉత్తమ సాధ్వీమణి. ఆ దంపతులని మా దంపతులు ఎప్పుడూ అత్రి అనసూయా దంపతులుగా సంభావిస్తూ ఉంటాము. శ్రీ నారాయణ గురూజీ నిగూఢ తపస్సంపన్నులు. ఆ పరమసాధ్వి సహధర్మచారిణి. శిల్పి నేత్రాలని చెక్కని పూర్వం శ్రీ లలితా పరాభట్టారిక విగ్రహాన్ని స్వీకరించి తమ ధ్యానమందిరంలో నిల్పి వారు ధ్యానంలో ఉండగా ఆ విగ్రహానికి అందమైన నేత్రాలు అమరడం విశేషం. అది శ్రీమతి సుజన గారి తపస్సిద్ధికి తార్కాణము. శ్రీ గురూజీ ఆదిత్యదేవతని ధ్యానంలో నిల్పుకోగా సూర్యదేవతకిరణం ఒకటి పూజామందిరంలో ఉన్న లలితాదేవి విగ్రహంపై ప్రసరించడం ఒక అపూర్వమైన సన్నివేశం. ఈ గ్రంథంలో చిత్రపటంలో అది మనకి స్పష్టంగా గోచరిస్తోంది. ఆ పుణ్యందపతుల తపశ్శక్తి అంతమహిమ గలది.

ఒకనాడు శ్రీ గురూజీ స్వప్నంలో వ్యాసభగవానుని సాక్షాత్కారం పొందారు. అనంతరం శ్రీమద్భగవద్గీతని సరళమైన వచన కవితలో అనువదించారు. మరికొంత కాలానికి స్వప్నంలో బ్రహ్మదరర్శనం పొంది ఆ పిమ్మట బ్రహ్మసూత్ర భాష్య రచనకి ఉపక్రమించినారు. ఆ విధంగా భగవత్ప్రేరణతో శ్రీ నారాయణ గురూజీ పవిత్ర వేదాంత గ్రంథ రచనకి శ్రీకారం చుట్టడం చిరస్మరణీయమైన విషయం.

బాదరాయణ మహర్షి రచించిన బ్రహ్మసూత్రాలకి శ్రీ శంకరభగవత్పాదుల భాష్యాన్ని అనుసరించి తెలుగులో జిజ్ఞాసువులని తరింపజేయడం కోసం "శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి" అనే గ్రంథాన్ని రచించడం అస్మదాదులకు పరమ హర్షదాయకం. వ్యాఖ్య విద్వజ్జనశ్లాఘ్యంగా సాగింది. సాధనచతుష్టయ సంపన్నుడైన ముముక్షువు ఆ బోధామృతలహరిలో తప్పక ఓలలాడగలడు. వేల జన్మలనుండి ప్రాప్తిస్తున్న సంసారాన్ని తప్పక తరింపగలడు.

ఇది కేవలం శంకరభాష్యానికి అనువాదం మాత్రమే కాదు. అక్కడక్కడ శంకరభాష్యంలో పేర్కొబడని ఉపనిషద్వాక్యాలని ఉదహరిస్తూ శ్రీ గురూజీ విషయ సమన్వయం చేయడం విశేషం. విషయంపై సమగ్రమైన అవగాహన గల వారికి మాత్రమే అది సాధ్యమౌతుంది. అది వారి బహుముఖమైన ఉపనిషత్పరిజ్ఞానానికి ప్రబల నిదర్శనం. విషయ సమన్వయంలో అక్కడక్కడ రచయిత విశేషాంశాలు వివరిస్తూ "నారాయణ వాక్యం" అని స్వానుభవాన్ని జోడించడం వారి ప్రత్యేకత.

గ్రంథారంభంలో షడ్దర్శనాల స్వభావాన్ని అత్యంత సంగ్రహంగా రచయిత పరిచయం చేసారు. భాష్యాధ్యయనానికి దర్శన పరిజ్ఞానం ఎంతో అవసరం. అట్లే విషయాన్ని సామాన్య పాఠకులు కూడా సులభంగా గ్రహించాలన్న సత్సంకల్పంతో రచయిత అధ్యాయాల అంతంలో ఆ అధ్యాయాల సారాన్ని క్లుప్తంగా రచించారు. గ్రంథాంతంలో కూడా సర్వాధికరణ సమాసము, సర్వాధికరణ సార సంగ్రహము అనే రెండు శీర్షికలలో కూడా మొత్తం గ్రంథం యొక్క విషయసారాన్ని శ్రీ నారాయణ గురూజీ నిరూపించారు. సూత్ర భాష్యం సమస్తమూ చదువడానికి తీరిక చిక్కనివారు కనీసం ఆ రెండు శీర్షికలలోని విషయాన్ని గ్రహింప గల్గినప్పటికీ

మొత్తం గ్రంథం యొక్క సారం సులభంగా మనస్సులో నిలుస్తుంది. ఏదో విధంగా బ్రహ్మసూత్ర తాత్పర్యాన్ని పాఠకులకి అందచేయాలన్న గురూజీ దీక్ష అత్యంత ప్రశంసార్హమైనది. శంకర భగవత్పాదుల శతశ్లోకి, దశశ్లోకి, ఏకశ్లోకి రచనా మార్గాన్ని గురూజీ అనుసరించడం సర్వజన సమభినంద్యం. బ్రహ్మసూత్రాలలో ఆచార్యులు-విచారబోధలు అనే గ్రంథ పరిశిష్ఠంలోని ప్రకరణం కూడా ఎంతో విజ్ఞానదాయకమైనది.

"ఆనందమయం, పంచాగ్ని విద్య, పంచకోశములు" మున్నగు అంశాలని పట్టికలలో చిత్రాలలో రచయిత నిరూపించారు. విషయ గ్రహణలో పాఠకులకి ఎంతో సౌలభ్యం చేకూర్చినారు. ఇది ఆధునిక రచనా పద్ధతి. అంతేగాదు. గ్రంథ ఆరంభంలోని అధ్యాయాల పాదాలలోని సూత్రాల వరుసక్రమం, గ్రంథాంతమందలి అకారాది సూత్రక్రమం అనే రెండూ కూడా పాఠకుడు సందేహం పొందినపుడు ఏ సూత్రం ఏ పుటలో వివరింపబడిందో గ్రహించడానికి ఎంతగానో ఉపకరిస్తాయి.

శంకరభాష్యంలో పేర్కొబడిన పూర్వవ్యాఖ్యాతలు, శంకర భాష్యానికి వచ్చిన ఇతరానువాదాలు మున్నగు ఎన్నో అంశాలని శ్రీ గురూజీ తమ బోధామృతలహరిలో పేర్కొన్నారు. బ్రహ్మసూత్రాలకి సంబంధించిన సమగ్ర పరిజ్ఞాన సంపాదనకి ఈ వ్యాఖ్య ఎంతో ప్రాముఖ్యం వహిస్తుంది. ఇట్టి మహత్తరమైన గ్రంథాన్ని రచించి లోకానికి సమర్పిస్తున్న శ్రీ గట్టు నారాయణ గురూజీ సార్థక జన్ములు. "స్వయం తీర్ణః పరాంస్తారయతి" అనే సంప్రదాయానికి చెందినవారు. పాఠకులు ఈ భాష్యాన్ని చదివి ఆస్వాదించి సంసార మహాసాగరాన్ని తరింతురుగాక ! *శుభం భూయాత్*

విద్వజ్జన విధేయుడు

10-04-2016

**వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి**

ఆచార్య సార్వభౌమ శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు తెలుగులోను, సంస్కృతములోను M.A., Ph.D. పట్టభద్రులై ఆంధ్రా యూనివర్సిటీలో ఆచార్యులు, రీడర్, ప్రొఫెసర్, తెలుగు శాఖాధ్యక్షులుగా యోగ దానము చేసినారు. ఆచార్య యస్వీ జోగారావు, ఆచార్య అప్పల్లపల్లి సోమేశ్వర శర్మ గారలు మొదలైన వారలు ఆయన గురువర్యులు.

వరూధినీ ప్రవరమ్, తత్త్వమసి అనే సంస్కృత రూపకాలు, అధ్యాత్మిక వ్యాసమంజరి, భారతంలో శాంతి పర్వం, శివానంద లహరి వ్యాఖ్య, సౌందర్యలహరి వ్యాఖ్యా, అధ్యాత్మ రామాయణము, రామాయణ ప్రసంగలహరి, వివేక చూడామణి వివరణ, ఆదిశంకరుల ఐదు ప్రకరణాలు, రామాయణములో పురుషార్థాలు మొదలైనవి ఆయన ఉత్తమ రచనలు.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఆచార్య సార్వభౌమ, విజ్ఞానవివేకభూషణ, ఆధ్యాత్మిక రత్న, ఆంధ్రరత్న మొదలైన గౌరవ నామములతో సత్కరించబడినారు. ఆయన శ్రీ కంచి కామకోటి మహా సంస్థానము వారి సువర్ణ సింహలలాటముతో, శ్రీ శివానంద ఎమినెంట్ సిటిజన్ ఎవార్డుతో, శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద సరస్వతి వారిచే సువర్ణ కంకణముతో అభిభూషించబడినారు.

వివిధ రచనల ద్వారా ప్రసంగముల ద్వారా, అధ్యయన అధ్యాపనముల ద్వారా ఆయన గావించిన సాహిత్యసేవ, వాగ్దేవతా పరివస్య అభినందనీయము.

వారు విద్యా సంపన్నురాలైన ఆయన సతీమణి ప్రభావతి గారితో పాటు వారి ఆశ్రమ సదృశమైన 'శారదా పీఠము'లో దైవోపాసనతో, బ్రహ్మచింతనతో మహర్షి జీవనములో వున్న పవిత్రాత్ములు. ఈ దివ్యదంపతుల సుజననారాయణుల సంబంధము ఆత్మీయము, పరస్పర ప్రేమాభిమాన గౌరవ సహితము.

(x)

# బ్రహ్మసూత్ర దివ్యలీల

శ్రీ నారాయణ గురూజీగారి జన్మే విశిష్టమైనది. వారికి వారి తల్లితండ్రుల అపూర్వ పుణ్యరాశి ప్రత్యేక హక్కుగా సంక్రమించింది. దానివల్ల ఆయన ఏ శాస్త్రాన్ని అధ్యయనం చేసినా, ప్రాచీన నవీన భేదం లేకుండా వాటి మధ్య గల సమన్వయం ఆయనకు అప్రయత్నంగా దర్శనమిస్తుంది.

విద్యారీత్యా ఇంజనీరైనా, వృత్తిరీత్యా వారు "మేనేజ్‌మెంట్ గురు". ఒకానొక బృహత్తర కంపెనీ చిక్కుల్లో పడ్డది. ఆ మేనేజ్‌మెంటువారు గత్యంతరం లేక శ్రీ నారాయణ గురూజీ దగ్గరకు వచ్చి, తమ సమస్యలను వినిపించారు.

అది వింటూనే "దీనికి ఇప్పుడు బ్రహ్మసూత్ర మేనేజ్‌మెంట్ అప్లైచేద్దాం" అన్నారు గురూజీ.

"బ్రహ్మసూత్ర మేనేజ్‌మెంట్" - ఏమిటని విస్తుపోతున్నారు కంపెనీ యజమానులు.

గురూజీ - "బ్రహ్మసూత్ర మేనేజ్‌మెంట్ అంటే, మొదట సమన్వయం, తరువాత అవిరోధం, దానివెంట సాధన, చివరిగా ఫలప్రాప్తి. ఈ సూత్రాలను అన్వయిస్తే మీ భాగస్వాములలోవున్న విరోధాలు తొలగుతాయి, సమన్వయం లభిస్తుంది. దానివల్ల సరియైన సాధన, తత్పర్యవసానంగా మంచి ఫలితమూ, లభిస్తాయి" అని వివరిస్తూనే, ఇవే వాక్యాలను మేనేజ్‌మెంట్ పరిభాషలో మళ్ళీ వివరించేసరికి, వేదాంతానికీ, మేనేజ్‌మెంటు విద్యకూ ఇంత దగ్గరి సంబంధం వుందా అని ఆశ్చర్యపోవటం అక్కడి మేనేజ్‌మెంటు జీవుల వంతయింది.

మేనేజ్‌మెంటు జీవులకే గాదు, వేదాంత వీరులకు గూడా ఇది "ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చిదేనం" వంటిదే.

నారాయణ గురూజీగారు పురాణాలనైనా సరే, సహస్రనామాలనైనా సరే, యోగ సూత్రాలనైనా సరే, షడ్దర్శనాలనైనాసరే, ఇంజనీరింగునైనా సరే, మేనేజ్‌మెంటునైనా సరే దేనికది విడిగా చూడరు. ఒకటి చూస్తే పది కనిపించటం ఆయన జీవధర్మం. ఆ విషయం వారింతకు ముందు పుంఖాను పుంఖంగా ప్రకటించిన గ్రంథాలలో స్పష్టాతి స్పష్టంగా కనిపిస్తూనే ఉంది.

ఇది గాక గురూజీగారి ఇంగ్లీషు బలం అసాధారణం. కానీ తెలుగు రచనలో వారికొక సొంత శైలి వుంది. అది వచన కవిత్వానికీ, గేయరీతికీ మధ్యగా సాగిపోతూ వుంటుంది.

ఇన్ని విశేషాలున్నా, వీరికి బ్రహ్మసూత్ర భాష్యాన్ని పట్టుకునే అర్హత వుందా అని సందేహం కలగటం సహజం. ఆ సందేహానికి మీ చేతుల్లో వున్న ఈ బృహత్తర బ్రహ్మసూత్ర బోధామృత లహరే సరియైన సమాధానం !

ఇది భాష్యం కాదు, వృత్తి కాదు, వివృతి కాదు, టీక కాదు, వ్యాఖ్యానం కాదు, విమర్శకాదు, విశ్లేషణ కాదు. అన్నింటికీ మించిన ఆత్మానుభూత్యావిష్కరణ దీనిలో వుంది. అందువల్లే ఇది బ్రహ్మసూత్రాల మీద తెలుగులో వచ్చిన ఇతర రచనలకన్నా విభిన్నంగా, విశిష్టంగా, ఆత్మీయంగా మన హృదయాలను తాకుతోంది.

వీరి విషయ చిత్రీకరణ ఈ గ్రంథంలో గూడా పట్టికల రూపంలోనూ, రేఖాచిత్రాల రూపంలోనూ పురివిప్పుకుంది. ఇందుకు ఈ గ్రంథంలోని 46, 228, 253, 335 పేజీలు ఉదాహరణలు మాత్రమే.

ఇక వివరణశైలిలో గురూజీ గారిది ఎప్పుడూ స్వీయ మార్గమే. ఐతే ఈ గ్రంథంలోగల అర్థగౌరవాన్ని దృష్టిలో వుంచుకుని, వీరు ప్రతిసూత్రానికీ పద విభాగము, ప్రతిపదార్థ వివరణ, శ్రుతి సమన్వయము, చేసి శంకర భాష్య సారాన్ని స్థూలాక్షరాలలో ప్రదర్శించి, మొత్తం భాష్యార్థాన్ని చందమామ కథలాగా

సులభీకరించిన విధానం అనితర సాధ్యం.

ఉదాహరణకు పారిప్లవాధికరణం మీమాంసా పరిభాషలతో సంక్లిష్టంగా సాగే ఘట్టం. దాన్ని గురూజీ గారు ఎంత సరళవిశదం చేశారో 329వ పుటలో గమనించండి. ఇలాంటి వివరణ సందర్భాలలో కొన్ని చోట్ల "నారాయణ వాక్యము" అనే పేరుతో వీరు సంతరించిన స్వీయ వివరణలు మధ్యమెరుపుల వంటివి.

ఎంతైనా నారాయణ గురూజీ గారిది భక్తి మార్గం. కనుక తన జ్ఞానమార్గ, భక్తిమార్గ సమన్వయ సాధన ప్రక్రియలను తన సాధనలలోనూ, తన శ్రీమతి గారి సాధనలలోనూ ఎలా ఆవిష్కరించారో "బ్రహ్మ దృష్టిరుత్కర్షాత్" (పేజి.370) వంటి సన్నివేశాల్లో పాఠకులు దర్శించగలరు.

వ్యక్తిగా గృహస్థవానప్రస్థుడై, సాధకుడుగా బ్రహ్మచర్య సంన్యాస స్థానీయుడై, గురువుగా సర్వమార్గ సమన్వయ ప్రదర్శకుడై, రచయితగా సమగ్రతా శిల్పి అయిన శ్రీ నారాయణ గురూజీ గారి కలం వెంట బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానం వ్యక్తం కావటం ఒక దివ్యమైన దైవలీల.

దీనిలో ఆనందమయంగా ఓలలాడేందుకు తెలుగు పాఠకులందరికీ స్వాగతం పలుకుతూ

నమో గురుభ్యః

గురుజనవినీతుడు

భాగ్యనగరము

06.04.2016

**కుప్పా వేంకట కృష్ణమూర్తి**

అధ్యక్షుడు, I-SERVE

విద్యాధికారి, అవధూత దత్తపీఠమ్

ఆచార్య కుప్పా వేంకట కృష్ణమూర్తి గారు వేదవేదాంగ వేదాంత నిలయమైన కుప్పా పరివారమునకు చెందినవారు. వేదవేదాంగ వేదాంత శ్రౌతస్మార్త విద్యలు మరియు శాస్త్రములను క్షుణ్ణంగా అధ్యయనము, అధ్యాపనము చేసిన సాంగ స్వాధ్యాయ భాస్కర శ్రీ కుప్పా లక్ష్మావధాని గారు (తరువాత శ్రీ జనార్దనానంద సరస్వతి స్వాముల వారు) ఆయన పితృపాదులు.

కృష్ణమూర్తి గారు ఆధునిక విద్యలైన B.Sc., M.A. (Maths) లో ఉత్తీర్ణులే కాక సంస్కృతము, తెలుగు, ఆంగ్ల భాషలలో పేరెన్నిక గల నిష్ణాతులు మరియు వేదాంత శాస్త్ర పారంగతులు. ఆయన ప్రస్తుతము Institute of Scientific Studies in Vedas (I-Serve) అనే వేద సేవా సంస్థకు Chairman మరియు Managing Trustee, శ్రీ గణపతి సచ్చిదానంద స్వాముల వారి అవధూత దత్త పీఠములో విద్యాధికారి, భక్తిమాల అనే మాసపత్రికకు ముఖ్య సంపాదకులు మరియు School of Vedic Studies and Research లో ప్రాచార్యులు. ఎన్నియో సంస్థలలో బాధ్యతలలో ఆయన చేసిన వేదసేవ, వేదాంతసేవ, సాహిత్య సేవ అమూల్యము.

ఆయన ఆంధ్రప్రదేశ ప్రభుత్వము వారి ఉగాది పురస్కారము, భాసర సరస్వతీ మందిరము వారి జ్ఞాన సరస్వతి పురస్కారము, శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము వారి ధర్మనిధి పురస్కారము, నోరి నరసింహశాస్త్రి ట్రస్టు వారి వేదవ్యాస పురస్కారము స్వీకరించిన మహామాన్యులు.

I-Serve Chairman గా ఆయన ఎన్నియో శ్రాస్త, విద్యా సభలు నిర్వహించినారు.

శ్రీ కృష్ణమూర్తి గారు ప.పూ. శ్రీ గణపతి సచ్చిదానంద స్వాముల వారి జీవన చరిత్రతో పాటు సంస్కృతము, తెలుగు, ఆంగ్లములలో 36 పుస్తకములు రచించిన జ్ఞానయోగి. దూర దర్శనములో ఆయన భారత సంస్కృతిపై, సాహిత్యము పై, వేద వేదాంతములపై, ఇతిహాసములపై భాషణములు, ఉపన్యాసములు ఇచ్చినారు.

జీవితాన్ని వేద, శాస్త్ర, ధర్మ సమ్మతముగా కర్మ, భక్తి, జ్ఞాన, ధ్యానయోగ మార్గములలో పరమ లక్ష్యము వైపు పురోగమనం కావిస్తున్న ధన్యాత్ములు.

(xi)

# అద్వైతామృతధార

## గుట్టు తెలిసి బ్రహ్మమయ్యె "గట్టు"

-ఆచార్య హరి శివకుమార్

శతాధిక గ్రంథ రచయిత అయిన శ్రీ గట్టు నారాయణ 'గురూజీ' గారు తమ పుస్తకానికి ముందుమాటలు నాలుగువ్రాయమని స్వయంగా అడగటం ఎవరికైనా జీవితంలో మరిచిపోలేని గొప్ప అదృష్టం ! దానికి ఎంతో పూర్వజన్మ సుకృతం ఉండాలి. ఎందుకంటే - వారి గ్రంథాలు బహుముఖీనమైన విషయాలతో కూడినవి. ప్రతి సంవత్సరం వెలువరించే పంచాంగాలలాగా ఒకే విధంగా ఉండవు. కొన్ని స్తోత్రాలు, కొన్ని కథలు, కొన్ని యోగ సంబంధులు, కొన్ని ఉపనిషత్సంబంధులు, మరికొన్ని వేదాంత సంబంధములు, ఇవన్నీ సంస్కృతం నుంచి తెనుగులోకి తెచ్చినవైతే, మరికొన్ని ఆంగ్లంలో వ్రాసిన మేనేజ్‌మెంట్‌కు సంబంధించినవి. వారి రచనలో ఇంత వైవిధ్యానికి కారణం వారి వృత్తి అనేక ప్రసిద్ధ పారిశ్రామిక సంస్థలకు అధ్యక్షులో, దర్శకులో, మార్గదర్శకులో అయితే, వారి ప్రవృత్తి ఆధ్యాత్మిక ప్రబోదము. వారు వ్రాసిన ప్రతి గంథమూ ఒక ఆణిముత్యము. ఏదోఒక ప్రత్యేక దృష్టితో వ్రాసినదే ! అన్ని గ్రంథాల రచనలోను పూలదండలోని దారంలాగా కనిపించేది సులభంగా అందరికీ అర్థమయ్యేటట్లు బోధించటం. అందుకే వాటికి 'బోధామృతలహరి' అనే పదబంధం అనుబంధంగా ఉంటుంది. దాని అంతరార్థం - తాను సుబోధకం చేయదలచుకొన్న విషయం అమృత ప్రవాహంలాగా పవిత్ర హృదయాలలో శాశ్వతంగా (అమృత) నిలిచి వుండాలనే తపన. ఒక రకంగా చెప్పాలంటే - 'బోధామృత లహరి' అనేది గురూజీ గారి 'Brand Name'. ఆ మకుటంతో వచ్చిన పుస్తకాలే - శ్రీ లలితాసహస్రనామ బోధామృత లహరి మొదలైనవి.

ఇప్పుడు అదే ధోరణిలో వెలువడుతున్న మరొక ఉద్గ్రంథం శ్రీ బాదారాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి. ఈ శీర్షికతో వచ్చిన గ్రంథాలన్నింటికీ 'Brand Ambassadors' చాలా వరకు Celebrity అయి ఉంటారు అంటే వివిధ ఉత్పత్తులకు Ambassadors గా ఉండే 'Big B' అంటే అమితాబ్ బచ్చన్ అని, 'ఐష్' అంటే ఐశ్వర్యారాయ్ అని పూర్తిగా చెప్పనవసరం ఉండదు కదా ! అట్లాగే ఈ బోధామృతలహరి బ్రాండ్‌కు నారాయణ గారే Celebrity, ఆయనే 'Brand Ambassador ! అందుకే రచయిత అన్నచోట కేవలం 'నారాయణ' అనే ఉంటుంది. ముందువెనకా ఏమిలేక,... "బోధామృతలహరి - నారాయణ" అని ఏ గ్రంథానికి ఉన్నా అది శ్రీ గట్టునారాయణ గురూజీదే అని స్పష్టమవుతుంది.

ఇలాంటి పుస్తకాలు వ్రాయాలంటే ఎంతో వ్యుత్పత్తి అంటే బహుగ్రంథ పఠనం ఉండాలి. గురూజీ ముంబాయిలోని ఎక్సెల్ ఇండస్ట్రీస్‌కు Chairman Emeritus, అదికాక 10-15 కార్పొరేట్ సంస్థలకు అధ్యక్షులు, దర్శకులు, మార్గదర్శకులుగా యోగ దానము చేసినారు. క్షణం తీర్పాటులేని లౌకిక కార్యకలాపాలలో తలమునకలై ఉండి కూడా ఇన్ని ఆధ్యాత్మిక గ్రంథాలు చదవటానికి వారికి సమయం ఎక్కడిదనేది సందేహాస్పదవిషయమే ! బహుశః లౌకిక కార్యకలాపాలకు పగటిని, ఆధ్యాత్మిక కార్యకలాపాలకు రాత్రిని కేటాయించినట్లు అనిపిస్తుంది. అంటే రాత్రిళ్లు కూడా నిద్రపోకుండా చదువుతూనే వ్రాస్తూనో ఉంటారన్నమాట. "యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ" - అన్నమాట గురూజీ విషయంలో సార్థకమన్నమాట ! లేదా, పూర్వజన్మలోనే అభ్యసించిన బహుగ్రంథ పాండిత్యం కావచ్చు.

కాళిదాస మహాకవి చెప్పినట్లు "ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యా".

మరొకటి–భగవద్గీత, శంకరగ్రంథ రత్నావళి, బ్రహ్మసూత్రములు వంటి గ్రంథాలు చదవటం ఒక ఎత్తయితే, వాటిని అర్థంచేసుకోవటం మరొక ఎత్తు. అర్థమైన విషయాలను అందరికీ సుబోధకంగా పునర్నిర్మించటము ఇంకా పెద్ద భారమైన పని. ఇవన్నీ కుదిరితేనే అది "బోధామృత లహరి" అనిపించుకుంటుంది. కనుక ఇలాంటి గ్రంథాలు వ్రాయటానికి గురూజీ రాత్రింబవళ్లూ ఎంత కష్టపడుతున్నారో అర్థం చేసుకోవచ్చు.

వేద విభజన చేసి, అష్టాదశ మహాపురాణాలను, మహాభారత సంహితను నిర్మించిన వేదవ్యాసమహర్షే – ఇన్ని గ్రంథాలను వ్రాసి ఉండడు. 'వ్యాస' అన్నది వ్యక్తి నామం కాదు, అది ఒక వంశనామము, ఆ వంశంలో పుట్టిన వారందరూ వ్యాసులే అన్న కొందరి వాదంతో, సాక్షాత్తు నారాయణ స్వరూపుడు ("వ్యాసో నారాయణో హరిః") అయిన వ్యాసమహర్షి కూడా నేటి హేతువాదుల విమర్శలకు గురి అయినాడు. తమ తపఃశక్తితో వేల సంవత్సరాలు జీవించిన మహర్షులను కూడా ఆధునిక మానవుల సగటు వయస్సు అయిన "శతమానం"తో మార్చి విమర్శించటం ఏమి సమంజసం? ముందురోజులలో ఈ "నారాయణ" అన్నది ఇంటి పేరు కాని వ్యక్తి పేరు కాదు, అది వంశనామము అని విమర్శించేవారు వచ్చినా ఆశ్చర్య పడవలసిన పనిలేదు. 'తస్మాత్‌జాగ్రద'!

**భారతీయ ఆధ్యాత్మిక ప్రస్థానము :–**

ప్రపంచంలోని నాగరిక దేశాలన్నింటిలోనూ భారతదేశాన్ని శిఖరాయమానం చేసింది మన మహర్షుల ఆధ్యాత్మిక అన్వేషణా ప్రస్థానము. పాశ్చాత్యులు పదార్థాన్ని (Material) గురించి అన్వేషిస్తే మనవారు యథార్థాన్ని (శాశ్వతమైన విషయాన్ని) గురించి విచారించి నిగ్గుతేల్చారు. మానవుడు బ్రతికి ఉన్నంతకాలం ఏమి చెయ్యాలో పాశ్చాత్య తాత్వికులు ఆలోచిస్తే, చనిపోయిన తరువాత ఆత్మ ఏమవుతుంది, పునర్జన్మ లేకుండా చేసుకోవాలంటే ఏం చెయ్యాలో వివరించారు భారతీయ మహర్షులు. అందుకే ఐన్‌స్టీన్ మహాశయుడు – "ఎక్కడ సైన్స్ ఆగిపోతుందో అక్కడ పరమాత్మ ప్రస్థానం ప్రారంభమవుతుంది." – అని ఎంతో గొప్పగా మన సంస్కృతిని ప్రశంసించాడు. అందుకే దానిని 'మహా ప్రస్థానం' అన్నారు.

ప్రస్థానం అంటే ప్రకృష్టమైన స్థానం. అంటే మహోన్నతమైన స్థానం. ఒక మహోన్నతమైన స్థానాన్ని పొందిన వారెవ్వరూ అక్కడి నుంచి వెనకకు రావాలని కాని పతనమవ్వాలని కాని ఆశించరు. అందుకే దానిని 'ప్రస్థానము' అన్నారు. మరణించిన తరువాత ఆత్మ ఏమవుతున్నది, అది తిరిగి ఏ శరీరంలోకీ ("శీర్యతే ఇతి శరీరం" క్షీణించిపోయేది కనుక శరీరము) ప్రవేశించకుండా దానిని పరమాత్మతో సంధానిస్తే, జనన మరణ చక్రం నుండి ఎట్లా విముక్తమవుతుందో అన్న విషయాన్ని గురించి విచారించి, దానికి మార్గాన్ని చూపారు మన మహర్షులు. అది తెలిసిన వారికి మరణాన్ని గురించిన భయం ఉండదు.

**"వాసాంసి జీర్ణాని యథావిహాయ, నవాని గృహ్ణాతి నరో పరాణి ।**
**తథా శరీరాణి విహాయజీర్ణానన్యాని సంయాతి నవాని దేహీ ॥"** (భ.గీ. 2–22)

చిరిగిపోయిన వస్త్రాన్ని పారేసి క్రొత్త వస్త్రాలను శరీరధారులు ఎట్లా ధరిస్తారో, అట్లాగే జీర్ణమైన దేహాన్ని వదలి ఆత్మ మరొక దేహాన్ని ఆశ్రయిస్తుంది అని గీతోపదేశం. పునర్జన్మ రహితమైన ప్రస్థానాన్ని పొందటానికి

మార్గాన్ని ఉపదేశించినవి మన ఆధ్యాత్మిక గ్రంథాలు. వాటిలో ప్రధానమైనవి ప్రస్థాన త్రయము !

**ప్రస్థాన త్రయము :-**

ప్రతిజీవి చేరుకోవలసిన ప్రస్థానాన్ని గురించే మన ఆధ్యాత్మిక గ్రంథాలన్నీ ఉపదేశించినప్పటికీ, వాటిలో అత్యంత ప్రధానమైనవి మూడు అవి 1. దశోపనిషత్తులు, 2. బ్రహ్మ సూత్రములు, 3. భగవద్గీత.

భారతీయ సంస్కృతికి మూలకందములైన వేదాలలోని విషయములు అతిగహనమైనవి. అవి అందరికీ తేలికగా అర్థమయ్యేవి కావు. అందువలన ఆ వేదాలలోని విషయాలను ఉపాఖ్యానాల రూపంలోను ఉపదేశాల రూపంలోను ఆవిష్కరించినవి ఉపనిషత్తులు. ఉపనిషత్తుల సంఖ్యలో భేదాభిప్రాయాలు ఉన్నా, ప్రధానమైనవి 108 అని నిర్ధారించారు. వాటిలోనూ అత్యంత ప్రాముఖ్యమైనవి 10. అవి : ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు. అందుకే శంకరభగవత్పాదులు ఈ ప్రధాన దశోపనిషత్తులకే భాష్యం వ్రాశారు.

రెండవది బ్రహ్మసూత్రములు. వేదవ్యాస కృత బ్రహ్మసూత్రములు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించేవి. లోకంలో ఏదైనా విషయం "నాకర్థం కాలేదు"-అని అంటే "ఇదేమైనా బ్రహ్మపదార్థమా అర్థం కాకపోవటానికి?" అని అంటారు. శ్రీ శంకర భగత్పాదులు ఆ గ్రంథానికి "బ్రహ్మసూత్ర భాష్యము"ను వ్రాశారు. దానికి శ్రీ గోవిందానంద భగవత్పాదులు "భాష్యరత్న ప్రభా" అనే వ్యాఖ్య వ్రాయగా, శ్రీ సదాశివేంద్ర సరస్వతీ స్వామివారు "బ్రహ్మసూత్ర వృత్తి"ని వ్రాశారు. దానిని వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్ వారు 1937లో ప్రచురించారు. ఆవ్యాఖ్య మహామహా పండితులకు కూడా అర్థం కాదు. అందుకనే దానిని అర్థంచేసుకున్నవారు భాష్యప్రవచనం చేస్తూ ఉంటే విని అర్థం చేసుకొనే సంప్రదాయం ఏర్పడింది. భారతదేశంలో ఆనాడు విజృంభించి ఉండిన వివిధ అవైదిక మతాలను ఖండించి, అద్వైత మతాన్ని ప్రతిష్ఠించిన శ్రీ శంకరులు కాశీకి వెళ్లినపుడు అక్కడ గంగాతీరంలో ఆయనకు శ్రీ వేదవ్యాస మహర్షి దర్శనమైందని, ఆ మహర్షి తన బ్రహ్మసూత్రాలకు శ్రీ శంకరులు వ్రాసిన భాష్యాన్ని విని సంతోషించి ఆమోదముద్ర వేశారని ప్రతీతి.

ఆ బ్రహ్మసూత్రాలకు ఎందరో మహానుభావులు తమ మత సంప్రదాయాలకు అనువుగా వ్యాఖ్యానాలు వ్రాసినా శ్రీ శంకరులదే పరమప్రామాణికంగా భావింపబడుతున్నది.

ఇక ప్రస్థానత్రయంలో మూడవది-శ్రీమద్భగవద్గీత. దశోపనిషత్తులు బ్రహ్మసూత్రములు ఋషి ప్రోక్తములైతే, భగవద్గీత సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుని ముఖతః వెలుగు చూసినది. పంచమవేదమైన మహాభారతంలో వేదవ్యాసమహర్షి దానిని నిక్షిప్తం చేసి మనకు అందించినప్పటికీ, అది సాక్షాత్తు శ్రీకృష్ణుడు అర్జునునకు యుద్ధరంగంలో ఉపదేశించి, విషణ్ణుడైన అతనిని కర్తవ్యోన్ముఖుని చేశాడు. దానిని విన్న అర్జునుడు "నష్టోమోహః స్మృతిర్లబ్ధా" (భ.గీ. 18-73) అని ఆనందించి, కర్తవ్య నిర్వహణ చేశాడు. మనం కూడా ఈ ప్రాపంచిక మోహాదుల నుంచి వెలువడి, అసలైన జ్ఞానాన్ని పొందటానికి భగవద్గీతే ప్రధాన సాధనం ! అలాంటి భగవద్గీత యొక్క గొప్పతనం ఒక్కమాటలో చెప్పాలంటే, కేవలం 700 శ్లోకాలలో ఉన్న ఆ చిరుగ్రంథం మీద ఎన్ని వందల వ్యాఖ్యానాలు వచ్చాయో అన్ని రకాల వ్యాఖ్యానాలు ప్రపంచంలోని మరేగ్రంథం మీద రాలేదనటం అతిశయోక్తికాదు. శ్రీ నారాయణ గురూజీ కూడా "శ్రీ

మదాంధ్ర భగదద్గీత" అని తెలుగులో, "Song Supreme" అని ఆంగ్లంలో అనువదించటమే కాక "Responsible Leadership in Gita", "Work Ethics in Gita", "Stable and Able", "Sacred ways to Spirituality," "Krishna - The Management Guru" మొదలైన గ్రంథాలు వ్రాశారు.

భగవద్గీతవంటి మహోత్తమమైన గ్రంథం ప్రపంచసాహిత్యంలోనే మరొకటి లేదని ప్రాచ్య–పాశ్చాత్య విపశ్చిద్వర్యులు అందరూ ముక్తకంఠంలో ప్రశంసించారు. అందుకే తిలక్ మహాశయుడు – "ప్రపంచమున గల సాహిత్యమంతటిలోను గీతకు దీటు రాగల పుస్తకము వేరొకటిలేదు" అని, మదనమోహనమాలవీయ మహాశయుడు – "నాకు తెలిసినంతవరకు విశ్వవాఙ్మయమున భగవద్గీతను మించిన గ్రంథము ఇంకొకటి లేనే లేదు" అని కీర్తించారు. "సర్వశాస్త్ర మయీగీతా", "భారతామృత సర్వస్వం", "సర్వోపనిషత్సారం గీత" అని దానిని ప్రశంసించారు. శ్రీ శంకరభగవత్పాదులు గీతా భాష్య ప్రారంభంలో – "తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థ సారసంగ్రహం" అని కీర్తించారు.

ఇంత ప్రసిద్ధిగాంచిన కనుకనే దశోపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలను కలిపి "ప్రస్థాన త్రయం" అని వ్యవహరిస్తారు.

**బ్రహ్మసూత్ర బోధామృత లహరి :–**

1. ఇది శ్రీ నారాయణ గారు వ్రాసిన ఆంధ్రవ్యాఖ్య. వేదవ్యాస మహర్షి కృత సంస్కృత గ్రంథం సూత్రాలలో ఉన్నది. అందువలననే దానిని "బ్రహ్మసూత్రములు" అన్నారు. అంటే బ్రహ్మమును తెలుసుకోవడానికి కావలసిన జ్ఞానాన్ని బోధించేవని అర్థము. అందుకే అందులోని మొదటి సూత్రము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని ప్రారంభమవుతున్నది. జిజ్ఞాసా అంటే "జ్ఞాతుం ఇచ్ఛా జిజ్ఞాసా" – తెలుసుకోవాలనే తీవ్రమైన కుతూహలం – అని బ్రహ్మజిజ్ఞాసా అంటే బ్రహ్మమును గూర్చి తెలుసుకోవాలన్న తీవ్ర కుతూహలము. ఆ కోరిక కలవారికోసం ఈ బ్రహ్మసూత్రము చెప్పబడుతున్నాయి అని మొదటి సూత్ర భావము.

"ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ", ఓం అనే అక్షరమే బ్రహ్మము. అందువలననే సన్యాసులందరూ ఒక్క ఓంకారాన్నే జపించాలని శాస్త్రాలు చెబుతున్నాయి. అదే వారికి బ్రహ్మపదార్థ జ్ఞానానికి దోహదపడుతుంది. మరి అలాంటి బ్రహ్మజిజ్ఞాస కలిగినవారికి మార్గోపదేశకమైన ఈ బ్రహ్మసూత్ర గ్రంథం ఓంకారంతో కాక 'అథ' అనే పదంతో ప్రారంభంకావటం విశేషం ! దానికి కారణం వ్యాఖ్యానంలో ఉన్నది.

**"ఓంకారథశ్శబ్దశ్చ, ద్వావేతాబ్రహ్మణా పురా ।**
**కంఠం భిత్వావినిర్యాత్, తస్మాన్మాంగళికా ఉభౌ"**

ఓంకారము, అథ శబ్దము అనేవి రెండు మొట్టమొదటిసారిగా బ్రహ్మదేవుని ముఖము నుండి బయటకు వచ్చినాయట. అందువలన ఓంకారము ఎంత మంగళ ప్రదమైతే,అథశబ్దముకూడా అంతే మంగళ ప్రదమైనది. అందుకు వ్యాసమహర్షి ఈ ప్రయోగమే నిదర్శనము. అందుతను "ఓంకారం"తో ప్రారంభం కావలసిన ఈ బ్రహ్మసూత్రాలు 'అథ'తో ప్రారంభకావటమే గొప్ప ఉదాహరణము !

2. వ్యాసమహర్షికృత బ్రహ్మసూత్రములు 4 అధ్యాయములలో ఉన్నాయి. మళ్ళీ ఒక్కొక్క అధ్యాయములో 4 పాదములు ఉన్నాయి. తిరిగి ఆ 16 అధ్యాయములు, 191 అధికరణాలుగా విభజింపబడినాయి. మొత్తం అన్నింటిలో కలిపి 555 సూత్రాలు ఉన్నాయి.

సూత్రము అంటే

**"అల్పాక్షర మసందిగ్ధం, సారవద్విశ్వతో ముఖమ్ ।**
**అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః॥"**

కొద్ది అక్షరములు మాత్రమే కలది, సందేహము కలింగించనది, ఎక్కువ పరిధి గలది, దోషరహితమైనది, తనకు మరొకటిసాటిలేనిది – అయినది సూత్రము. మొత్తం మీద అల్పాక్షరములలో అనల్పార్థమును ఇమిడ్చుకొని ఉండేది సూత్రముమనబడుతుంది.

ఆ సూత్రాలని విడదీసి వివరంగా వ్యాఖ్య –

**"పరిచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహవాక్యయోజనా**
**ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్"**

అంటే సూత్రంలోని పదాలను విడదీయటం, ఆ పదాలకు అర్థాలను చెప్పటం, అందులోని పదాలకు వివరణ ఇవ్వటం లేదా వాటికి విశేషార్థాలను చెప్పటం, ఆ సూత్రంలోని వాక్యనిర్మాణ నైపుణ్యాన్ని వివరించటం వాటి మీద ఏమైనా సందేహాలు వస్తే వాటికి సమాధానం చెప్పటం, అనే ఐదు వ్యాఖ్యాన లక్షణాలు.

వీటినన్నంటినీ సమన్వయపరిస్తే మన ప్రాచీనుల వ్యాఖ్యాన లక్షణం అర్థమవుతుంది. పూర్వం కావ్యాలలోని శ్లోకాలను గురుకులాలోని విద్యార్థులకు బోధించేటప్పుడు శ్లోకం చదవటం, అందులోని పదాలను అదేవరుసలో విడదీసిచెప్పటం, ఆ తరువాత ఆ పదాలను అర్థవంతంగా ఉండేటట్లు ఒక క్రమపద్ధతిలో ఉంచి వాటికి అర్థం చెప్పటం, తరువాత దానికి తాత్పర్యం వివరించటం, ఆ తరువాత ఆ శ్లోకంలోని సమాసాలకు విగ్రహవాక్యాలు చెప్పటం, అవి ఏ సమాసాలో చెప్పటం, ఆ శ్లోకంలోని పదాలలోని ఛందో వ్యాకరణ అలంకార విశేషాలను చెప్పటం, చివరకు ఆ శ్లోకంలోని విశేషాలను వ్యాఖ్యానించటం – అనే పద్ధతిని అనుసరించేవారు. ఇన్ని విశేషాలను బోధించటం వలన, ఆ శ్లోకాలు అప్పటికప్పుడే కంఠస్థమయ్యేది. అంతేకాక, కావ్య–ఛందో–వ్యాకరణ–అలంకార శాస్త్ర పరిజ్ఞానం సమగ్రంగా కలిగేది. ఇదే దృక్పథంలో బ్రహ్మసూత్రాది గ్రంథాలకు వ్యాఖ్యాలను వ్రాశారు. అందువలననే అవి తడిసి మోపెడయ్యాయి. ఉదాహరణకు–బాదరాయణ బ్రహ్మసూత్రములలోని – "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అన్న మొదటి సూత్రానికే 36 పుటల వ్యాఖ్య అయింది. 555 సూత్రాలకు 1200 పుటల బృహత్ గ్రంథమైంది. కాని ఆధునిక కాలంలో అవి అర్థం చేసుకొనేవారులేరు. అర్థంచేసుకొన్నప్పటికీ వినేవారులేరు. అందువలన దానికి అర్థం బోధపడాలన్న ఉద్దేశ్యంతో శ్రీ నారాయణ గారు ఆ సూత్రాల అర్థాన్ని భావాన్ని వివరించారు. అవసరమైన చోట్లలో వివిధ రీతుల వివరణ, విశ్లేషణ, విశదీకరణ ఇచ్చారు. అంటే 'Kuppu Swamy made difficult' అన్నదానిని 'Made Easy' చేశారు.

ఇవికాక శ్రీ నారాయణ గారి వ్యాఖ్యానంలో మరికొన్ని విశేషాలు ఉన్నాయి.

**1. ముందుమాట :** ఈ గ్రంథంలోని విస్తృతమైన నారాయణ గారి ముందుమాట చదివితే, దీనిలోని వివరాలన్నీ విశదమవుతాయి.

**2. చిత్రాలు, పట్టికలు :**

"గురూజీ" పేరుకుతగ్గటు మంచి అధ్యాపకుడు. చెప్పవలసిన విషయాన్ని ఎన్ని విధాలుగా వివరిస్తే సామాన్యులకు కూడా అర్థమవుతుందో అన్ని విధాలుగా వివరిస్తారు. ఉదాహరణకు – షడ్దర్శనములను వివరించేటప్పుడు – మొదటి దానిని గురించి వివరించి (పీఠిక పుట (43)), దానిని సూక్ష్మంగా చెప్పటానికి ఒక చిత్రంలోను (పీఠిక పుట (46) ), దానిని ఇంకా వివరంగా ఒక పట్టికలోను (పీఠిక పుట (47) ) వివరించారు. దానివలన చదివేవారికి ఆ పటాలు చూడగానే, ఆయా విషయాలు సుబోధమవుతాయి. ఈ విధానాన్ని శ్రీ లలితా సహస్ర నామ బోధామృత లహరి వంటి గ్రంథాలలో కూడా గమనించవచ్చును.

అట్లాగే, 370వ బ్రహ్మసూత్రములో తాను దర్శించిన పంచజ్యోతులు, శ్రీకృష్ణ పరబ్రహ్మ నెమిలిపింఛము, అమృత బిందువు, పంచ నమస్కారములను కవరు పేజీ పైభాగంలోను చిత్రీకరించి వివరించినారు. 103వ బ్రహ్మసూత్రములో ధర్మశాలలో తాను, తన ధర్మపత్ని గారు దర్శించిన బ్రహ్మము, జగత్తు, పరమాత్మ, జీవాత్మల దర్శనము, వెనుకనున్న కవరు పేజీ లోపలను, 342వ బ్రహ్మసూత్రములో ఆ దంపతులకు శ్రీ భిక్షేశ్వర ఆలయంలో అయిన కుండలినీ దర్శనము – స్వామి దర్శనములను, ఆ అనుభూతులను మనము కూడా చక్కగా చిత్రాలలో చూడవచ్చును.

ఈ విధంగా విషయ విశ్లేషణము గురూజీ రచనలలోని ప్రత్యేకత !

**3. బాలాదపి సుభాషితమ్ :-**

"చిన్న పిల్లలు చెప్పినా మంచి గ్రహింపవలసినదే" అనేది ఆర్యోక్తి. "బాలవాక్కు బ్రహ్మవాక్కు" అనేది మరొక సుభాషితం! దానిని వినటమేకాక, ఆచరణలో పెడతారు గురూజీ. తాతగారు "గురూజీ" బొమ్మలు వేయటం చూసి తానూ ఒక చిత్రాన్ని వేసింది 15 సంవత్సరాల మనుమరాలు చి॥ కృపశర్మ. అది ఒక నదీతీరంలోని చెట్టుమీద ఉన్న రెండు పక్షుల చిత్రము. 393వ బ్రహ్మసూత్రము క్రింది వ్యాఖ్యలో ఉదాహరింపబడిన "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" అన్న ముండకోపనిషత్తు (III-1-1) లోని భావానికి చిత్రరూపం. ఇది యాదృచ్ఛికమే అయినా, నారాయణ గారి మనుమరాలు కావటమే కారణం అనక తప్పదు. వారిద్దరిలోనూ ప్రవహిస్తున్నది ఒకే రక్తం కదా ! విజ్ఞాన శాస్త్రీయ పరంగా చెప్పాలంటే 'జీన్స్' ప్రభావం అది.

**4. ఆత్మకథ :-** ఈ బ్రహ్మసూత్ర బోధామృత సారాన్ని "ఆత్మకథ" అని గురూజీ చెప్పారు. దాని భావం ఇది ఆత్మకు లేదా పరమాత్మకు సంబంధించిన కథ. సర్వవేదాంత సారమును ప్రసరించిన అద్వైతామృతధార. దీనిని ఎవరు చదివితే వారికి అన్వయించుకోదగిన కథ – కనుక అందరి ఆత్మకథ – సర్వాత్మకథ. ప్రతి మనిషిలో అంతర్హితమైన ఆత్మరూపియైన పరమాత్మకథ. అందుకే ఇది "ఆత్మకథ" (పుట– (63) ).

**5. గుట్టు తెలిసి బ్రహ్మమయ్యె "గట్టు" :-** గురూజీ తమ ఇంటిపేరుతో ప్రతి గ్రంథానికి ఒక "ముద్ర" వేస్తారు. కీర్తనల చివర తత్కర్తలు తమ పేర్లను చెప్పుకొనటం పరిపాటి. త్యాగరాజస్వామి తమ కీర్తనలలో చివర "త్యాగరాజకృత" అని చెప్పుకొన్నారు. అట్లాగే ముత్తుస్వామి దీక్షితార్ "గురు గుహ" అని చెప్పుకొన్నారు. దానిని "ముద్రాలంకారం" అంటారు. అట్లా గురూజీ తమ ఇంటి పేరైన 'గట్టు' లోని 'ట్టు' అనే ప్రాసాక్షరంతో చక్కని ఒక గీతం వ్రాశారు దానిని సారము – బ్రహ్మమునకు పుట్టుకలేదు.

అది సత్యమైనది. దానికి అంతములేదు. అనిత్యమైన దేహంలో అది వెలుగుతూ ఉంటుంది. దేహాంతమయినపుడు ఆ ఆత్మ కట్టెవంటి దేహాన్ని (దహించవలసినది) వదిలి వేస్తుంది. దానితోపాటు నేను బ్రహ్మము అనే జ్ఞానము వచ్చినపుడు ఆ దేహాన్ని ఆశ్రయించి యుండిన కర్మలు కూడా వదలి లేకుండా పోతాయి. అప్పుడు ఆత్మపరమాత్మను చేరిపోతుంది. ఆ విధంగా పరమాత్మ గుట్టును గురూజీ “అహంబ్రహ్మాస్మి” అని తెలుసుకొన్నారు. ఈ విషయాన్ని తెలుసుకోవటమే ప్రజ్ఞానము – “ప్రజ్ఞానం బ్రహ్మ”!

6. గ్రంథారంభంలో ఇచ్చిన సూత్రానుక్రమణిక, గ్రంథాంతంలో ఉన్న అకారాది సూత్రాను క్రమణికలు ఎంతో ప్రయోజనకరంగా ఉన్నాయి.

అంత జటిలమైన బ్రహ్మమును విశదీకరించే బ్రహ్మసూత్రాలను దశాబ్దికి పైగా కఠోర శ్రమచేసి, మనకు అమృతలహరిగా ఆస్వాదయోగ్యం చేసిన శ్రీ గురూజీ ధన్యజీవి. “స్వయం తీర్త్వా పరాంస్తారయేత్” అన్నట్లు ముందుగా తాను తరించి, మననూ తరింపజేస్తున్న గురూజీ “జీవన్ముక్తులు”! వారికి అన్ని వేళలా చేదోడు వాదోడుగా నిలిచి ఉండే సహధర్మచారిణి శ్రీమతి సుజన గారు ధన్యజీవి ! ఆ పుణ్యదంపతులకూ, వారి చిరంజీవులకూ ఆ పరమాత్మ ఆయురారోగ్యఐశ్వర్యాలను ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను. శ్రీ గురూజీ ఇంకా ఇతోధికంగా గ్రంథరచన చేసి మనను కూడా ధన్యజీవులను చేయాలని పరమేశ్వరుని వేడుకొంటున్నాను.

*సర్వం శుభం భూయాత్ !*

ఓరుగల్లు
ది. 10-4-2016

**హరి శివకుమార్**
(చరవాణి : 94405 80084)

ఆచార్య డా॥ హరి శివకుమార్ గారు ఆంధ్రాంగ్ల సంస్కృత భాషా కోవిదులు, సాహిత్యనిధి, అనేకోత్తమగ్రంథ రచయితలు, తెలుగు సంస్కృతికి అపూర్వ సేవ చేసిన కర్మజ్ఞాన యోగులు, చారిత్రక పరిశోధనా దక్షులు మరియు నిరంతర భగవద్ధ్యాన తత్పరులు. డా॥ శివ కుమార్ గారు చాలా కాలము కాకతీయ విశ్వవిద్యాలయములో ఆచార్యులుగా, Dean of Arts గా, తెలుగు శాఖలో అధ్యక్షులుగా యోగ దానము చేసినారు.

తెలుగు, సంస్కృతి మరియు చరిత్ర విషయములలో పరిశోధన, పరిశీలన చేసి భద్రకాళీ దేవాలయ చరిత్ర, హనుమకొండ రుద్రేశ్వరాలయము, కాకతీయ వైభవము, ఓరుగల్లు అసలు చరిత్ర మొదలైన అమూల్య రచనలు చేసినారు.

అవే కాక అనేక చారిత్రక శాసనములు, శిల్పములు, ఆలయముల గూర్చి పరిశోధన చేసి వాటి గురించి వ్రాసినారు. శ్రీ శివ కుమార్ గారు కాకతీయ చరిత్రకు, సాహిత్యానికి, శిల్పానికి అక్షర రూపము అని ఈనాడు, ఆంధ్రజ్యోతి పత్రికలు ప్రశంసించినాయి.

తరతరాల నుండి ‘హరి’ కుటుంబము వారు శ్రీ విద్యోపాసకులు మరియు ఆధ్యాత్మ విద్యా నిష్ణాతులు. వారి పూర్వతరము వారు ఉపనిషత్తుల మహావాక్య రత్న ప్రభావళి, శ్రీ భట్ట నారాయణ విరచితమైన లలితా సహస్రనామ జయమంగళ వ్యాఖ్య అనే గ్రంథాలను అందించినారు.

**Piyush M. Dave**
'Sharirak'-Vadodara-2nd March, 2016

# SIPS OF NECTAR

After a very long Journey of birth by birth "Jiva" gets finally the "Human" form as a valuable gift from God, in that reference Pujya Aadi Shankaracharya Said, Jantunam Manush Janma Shreshthah "**जन्तूनां मानुषजन्मः क्षेष्ठः।**" To make the best use of this obtained human form, what "JIVAS" are required to do and not to do are described in our Vedas at length. All the teachings ultimately direct towards **Liberation** only.

Vedas define "KARMA-UPASANA AND JNANA" as an instrument by which a "Jiva" can make his way of life with full of happiness. Jaimini Muni the disciple of Veda Vyasa composed a book on the principle of "KARMA" and "UPASANA" showing the process for the internal cleanliness of mind (Chitt) and for preparing the self for liberation. That book is called "Purva Mimamsa".

But, as one performs Karmas, sooner or later one will be lured by the fruits of "Karmas" which will make the person deviate from the goal of Liberation resulting in Punarapi Jananam-Punarapi Maranam **पुनरपि जननं पुनरपि मरणं ।.**

Then the reality was established as - **Without knowledge no Liberation - ऋते ज्ञानातू न मुक्तिः।.** It means only Knowledge based on Keval-Advaita principle through Upasana and Jnana can lead to Liberation. Then, the eleven main Upanishads widely known as Vedanta, which is a collection of end portion of all the four Vedas, came into light.

The vision of the Vedas unfolded in the Vedantic Upanishads was analyzed throughly and described by 555 Sutras in a Granth called Brahma Sutras which is called Uttar Mimamsa by Bhagavan Badarayana.

The cause and origin of the world, the identity of "Jagat and Jiva" and the inter conflict between several sentences of the Upanishads are well defined, and the method Purva-Paksha-Uttar-Paksha, the argument and settlement was established to arrive at "Tatparya," the Conclusion of the Vedanta.

Having arrived at its Tatparya, no doubts and questions remain, **शास्ता-शास्त्र-शिष्य** all become one.

With the vanishing knowledge of the Sanskrit language, and the thinning of knowledgable teachers, it is now-a-days difficult to read and understand the original books by one's own self.

For the last so many months, I have observed Guruji keenly writing and simplyfying the explanations while adding his own insights on the Sutras in his language and the nectar is now in front of all of us in the form of **Brahma Sutra Bodhamruta Lahari,** the only aim of which is to enlighten the beings that humbly worship HIM. I have been lucky and blessed to have some sips of this nectar too.

Two days before, when we were looking at the prepared sample book, Guruji asked me to write a few words about the subject and the book. I was very much pleased to have

వున్న పటలములను చూడగలరు.)

కృష్ణద్వైపాయనుడు బదరీ (రేగు) వృక్షములచే నిండియున్న బదరిక క్షేత్రంలో ఉండటం వలన ఆయనకు బాదరాయణుడని పేరు వచ్చినదనుట యథార్థమని అనిపిస్తుంది.

వ్యాసమహర్షి అనేక సంవత్సరములు బదరీవనము, బదరికాశ్రమములో తపస్సు చేసినందువలన బాదరాయణుడని అనబడెనని భాగవతము (I-7-3) లో కలదు. భాగవతము, మత్స్య పురాణము, కౌండిన్యాయన కోశముల ప్రకారము వ్యాసులే బాదరాయణులు. భాగవతము ప్రకారము వ్యాసపుత్రుడైన శుక మహర్షి బాదరాయణి అని అనబడినాడు.

ఈ బాదరాయణీయ బ్రహ్మ సూత్రములు క్రీ.పూ. 200 నుండి క్రీ.పూ. 500 వరకు వ్రాయబడినవని బుధజన సమ్మతము. భారత సంస్కృతిని కర్మకాండ నుంచి జ్ఞానకాండ వైపు మళ్లుటకు కారణమైన, వేదాంత శాస్త్రములలో తలమానికమైన, ఉపనిషత్తులనే అరణ్యములో క్రొత్త బాటవేసి సమన్వయమందించిన, శ్రీ ఆదిశంకరాచార్యులు మొదలైన పరమ ఆచార్యులు భాష్యము చేసిన, ముక్తిమార్గ జ్యోతి అనబడిన ఈ బ్రహ్మసూత్రములు దివ్యములు, అమృతము మరియు అసమానము.
"శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృతలహరి"లో మునకవేయటానికి స్వాగతము.

## నమస్తే

-నారాయణ

**ఈ గ్రంథములో ఉపయోగించబడిన రచనల సంక్షిప్త సూచనా పదముల అర్థములు**

**సూ.=సూత్రము, క్ర.=క్రమము, ప్ర.అ.=ప్రతిపదార్థము-అర్థము, వి=వివరణ**

| | | | |
|---|---|---|---|
| ఈ.ఉ. | - ఈశావాస్యోపనిషత్తు | బ్ర.సూ. | - బ్రహ్మసూత్రములు |
| ఐ.అ. | - ఐతరేయ అరణ్యకము | ముం.ఉ. | - ముండక ఉపనిషత్తు |
| ఐ.ఉ. | - ఐతరేయోపనిషత్తు | శ్వే.ఉ. | - శ్వేతాశ్వతరోపనిషత్తు |
| కౌ.ఉ. | - కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు | సు.ఉ. | - సుబాలోపనిషత్తు |
| ఛాం.ఉ. | - ఛాందోగ్యోపనిషత్తు | కై.ఉ. | - కైవల్య ఉపనిషత్తు |
| జా.ఉ. | - జాబాలోపనిషత్తు | నా.య.ఉ. | - నారాయణీయా యాజ్ఞిక్యుపనిషత్తు |
| తై.అ. | - తైత్తిరీయ అరణ్యకము | శ.ప.బ్రా | - శతపథబ్రాహ్మణము |
| తై.ఉ. | - తైత్తిరీయ ఉపనిషత్తు | ఋ.వే | - ఋగ్వేదము |
| ప్ర.ఉ. | - ప్రశ్నోపనిషత్తు | య.వే | - యజుర్వేదము |
| బృ.అ. | - బృహదారణ్యకోపనిషత్తు | మ.స్మృ | - మనుస్మృతి |
| మ.నా. | - మహానారాయణోపనిషత్తు | భ.గీ. | - భగవద్గీత |
| మా.ఉ. | - మాండూక్యోపనిషత్తు | బ్ర.పు. | - బ్రహ్మ పురాణము |
| నా.ఉ. | - నారాయణోపనిషత్తు | ప.ప. | - పంచపాదిక |
| పై.ఉ. | - పైంగల ఉపనిషత్తు | మ.భా | - మహాభారతము |

గమనిక : **1. వివరములు కావలసినచో ఆయా రచనలను గ్రంథములను చూడవచ్చును.**

**2. ప్ర.అ. (ప్రతిపదార్థము, అర్థము) చదువుతున్నప్పుడు ప్రతిపదము యొక్క అర్థమేకాక సమానము (=) కు కుడివైపున వున్న పెద్ద అక్షరముల పదములన్నీ ఒకేసారి గొలుసుగా చదువుతే సూత్రము యొక్క మొత్తము అర్థము మూల సూత్రములో వున్నట్లుగనే స్ఫురిస్తుంది.**

# ప్రస్థానత్రయ త్రివేణీసంగమము

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు కలిసి ఒకే సందేశమునిచ్చిన సంగమస్థానము, బాదరాయణ మహర్షి, వ్యాస మహర్షి మరియు ఉపనిషత్తుల దృష్టలు ఒకటియేనన్న సంగతి భగవద్గీతలో పదమూడవ అధ్యాయమైన క్షేత్ర క్షేత్రజ్ఞ యోగములో దాగియున్నది. గీతలో కృష్ణభగవానుడు అర్జునునికి చెప్పిన రహస్య ఆధ్యాత్మిక సందేశము ఈ విధము.

ప్రస్థానత్రయమైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతల ధ్యేయము, లక్ష్యము, గమ్యము, సందేశము ఒకటియేనన్న సత్యము భగవద్గీతలో వున్నది.

(ప్రస్థానత్రయ బ్రహ్మవిద్యలు–పేజీ (554) చూడగలరు.)



# ప్రస్థానత్రయ త్రివేణీసంగమము

1. ఇదం శరీరం కౌంతేయ
క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥

2. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం
యత్తద్ జ్ఞానం మతం మమ ॥

3. తత్క్షేత్రం యచ్చ యాదృక్చ
యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ
తత్సమాసేన మే శృణు ॥

4. ఋషిభిర్బహుధా గీతం
ఛందోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదశ్చైవ
హేతుమద్భిర్వినిశ్చితైః ॥

(భగవద్గీత XIII-1 నుండి 4 వరకు)



# ప్రస్థానత్రయ త్రివేణీసంగమము

1. తెలియుశరీరమును క్షేత్రమంద్రు
తెలిసిన వాని దానిని క్షేత్రజ్ఞుడంద్రు
తెలిసినవానికివి రెండు తెలియు
తెలియచెప్పెద నీవు తెలిసికొనుము

2. సర్వక్షేత్రములందు వెలిసియున్న
క్షేత్రజ్ఞుడ నేను భారత నీవు కన్న
క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞానమదియె జూడ
పరమజ్ఞానంబు చాల తరచిచూడ

3. క్షేత్రంబు యెట్లు దాని విధములెట్లు
యదిపుట్టెనెట్లు దాని వికారంబు లెట్లు
క్షేత్రజ్ఞుదిట్లు నతని ప్రభావమెట్లు
కొంత చెప్పెద నీకిపుడు వినుమునిట్లు

4. మహాఋషులచేత వేదములచేత
బహువిధములనది చాలాచెప్పబడెను
సహేతువులతోడి వినిశ్చితంబు అయిన
బ్రహ్మసూత్రములు కూడ చెప్పెనట్లు



ఈ అద్భుతమైన శ్లోకముల వలన ఇలా తెలుస్తున్నది. క్షేత్రము అంటే శరీరము. ఆ క్షేత్రము అనే శరీరమును తెలిసినవాడు క్షేత్రజ్ఞుడు. ఆ క్షేత్రజ్ఞుడే పరమాత్మ. ఆ పరమాత్మయే అన్నిక్షేత్రములలో, అన్ని శరీరములో వెలుగుచున్నాడు.

శరీరములో వున్న పరమాత్మయే శారీరకుడు. ఆ శారీరకుడే, అంతరాత్మయే, పరమాత్మ. ఈ శరీరము మరియు శారీరకుల జ్ఞానము, ఇక్కడ భగవద్గీతలో చెప్పబడినది.

మహాఋషుల చేత మరియు వేదములచేత, అంటే వేదములు, ఉపనిషత్తుల చేత బహువిధముల, ఎన్నో తీర్ల చాలా చెప్పబడినది.

అదియే హేతుపూర్వకముగా నిశ్చయముగా బ్రహ్మసూత్రములలో చెప్పబడినది. (అందుకే తన బ్రహ్మసూత్రభాష్యాన్ని శ్రీ ఆదిశంకరాచార్యులవారు శారీరక భాష్యము అని అన్నారు!)

శ్రుతిలో పలువిధములుగా, మరల మరల చెప్పబడిన శరీర–శారీరక సత్యమే మరియు బ్రహ్మసూత్రములలో హేతుపూర్వకముగ చెప్పబడిన సత్యమే, భగవద్గీతలో సారముగ, సంక్షిప్తముగ, సమాసముగ, సులభముగ గానము చేయబడినది.

ఈ విధముగా ఇక్కడ భగవద్గీతలో క్షేత్ర క్షేత్రజ్ఞ యోగములో చెప్పినది వేదమహర్షుల, బాదరాయణుల, వేదవ్యాసుల త్రివేణి సంగమము అంటే ఉపనిషత్తుల, బ్రహ్మసూత్రముల, భగవద్గీతల పవిత్ర త్రివేణీ సంగమము, ప్రస్థానత్రయ సమాసము, సారము. ఇంకొక ముఖ్యమైన విషయము భగవద్గీతకు ఏవిధముగా వేదములు ప్రమాణమో, బ్రహ్మసూత్రములు కూడా ప్రమాణమే.

భగవద్గీత వేదములనేకాక బ్రహ్మసూత్రములను కూడా ప్రమాణముగా తీసుకొన్నది. అయితే బ్రహ్మసూత్రములలో భగవద్గీతను ఎన్నో సార్లు ఆధారముగా, ఉదాహరణగా తీసుకొనబడినది అని శ్రీ శంకర భాష్యములో సూచించబడినది. ఏదైన గ్రంథము ఇంకొక గ్రంథమును ఉదహరిస్తే ఉదహరించబడిన రచన ఉదహరణగా తీసుకొన్న రచనకన్న ముందు రచించబడాలి కదా !

అయితే భగవద్గీత బ్రహ్మసూత్రములను, బ్రహ్మసూత్రములు భగవద్గీతను (మహాభారతమును కూడా) ఉదాహరణగా తీసుకుంటే అవి రెండూ ఒకే సమయములో రచించబడాలి లేక ఒకరి చేతనే రచించబడాలి.

కావున వ్యాస భగవానులు, బాదరాయణ భగవానులు ఒకరే అని లేక ఒకే సమయములో వుండినారని తెలుస్తున్నది. వారికి ఇదే మన ప్రణామములు, వందనములు.

**"వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమో వైబ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥"**

విష్ణురూపము గల వ్యాసునకు, వ్యాసరూపము గల విష్ణువునకు, వేదనిధికి, వసిష్ఠ వంశజునకు నమస్కారము, నమస్కారము.

**"అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరోహరిః ।**
**అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥"**

భగవంతుడైన బాదరాయణుడు నాల్గు ముఖములు లేని బ్రహ్మ, రెండు చేతులు కల విష్ణువు మరియు మూడవ కన్నులేని శంభువు.

ఈ విధముగా బాదరాయణ, వ్యాసులు ఒకే తత్త్వము అన్నా, ఒకరే అన్నా ఒకటే ! ఒకరేనని నారాయణ మతము. అ వ్యాస బాదరాయణులకు ఈ నరనారాయణ వందనములు, వందనములు, వందనములు.



# బ్రహ్మసూత్ర భాష్యములు

శ్రీ బాదరాయణ మహర్షి బ్రహ్మసూత్రములలో తన సిద్ధాంతమునే కాక ఇతర మహర్షులు, ఆచార్యుల అభిమతములను కూడ ఉదాహరించినారు. వారిలో కొందరు ప్రతివాది రూపములో వున్నను బాదరాయణులు వారికి గౌరవము, మన్నన అందచేసినారు.

బ్రహ్మసూత్రములలో మనకు కనిపించే ఆచార్యులు బాదరాయణులు, జైమిని మహర్షి, ఆత్రేయ, ఆశ్మరథ్యుడు, ఔడులోమి, కార్ష్ణాజిని, కాశకృత్స్నుడు, బాదరి. పూర్వమీమాంసా దర్శనమైన ధర్మ సూత్రకారుడు ఐన జైమిని మహర్షికి బాదరాయణులు చాలా మన్నన, గౌరవము, స్థానము ఇచ్చినారు. శ్రీ బాదరాయణ మహర్షికి, జైమిని మహర్షి శిష్యుడే కాక కొంతవరకు ప్రతివాది అని కూడ చెప్పవచ్చును.

బాదరాయణులది విజ్ఞానమార్గమైతే జైమిని వారిది కర్మమార్గము. నిగూఢమైన, లోతైన, బహుళార్థ సముదాయమైన జ్ఞానవిజ్ఞాన చైతన్య బోధలు నేరుగా గ్రహింపబడలేవు, అర్థము కావు.

కనుక వాటిపైన భాష్యము, వ్యాఖ్య, వివరణము, వార్తికములు అవసరము. వేదములపై **శ్రీ సాయణాచార్యుల** వారి భాష్యము చాలా ఉపయోగము. బ్రహ్మసూత్రములు చాలా గూఢమైన, లోతైన, రహస్యమయమైన, కఠినములైన జ్ఞాన సంపుటము.

కనుక బ్రహ్మసూత్ర భాష్యములు అవసరము, ఆవశ్యకము మరియు అతి ముఖ్యము. బ్రహ్మసూత్ర భాష్యములలో ప్రముఖము, అత్యుత్తమము మరియు మహోన్నతమైనది **శ్రీ ఆదిశంకరాచార్యుల** వారి శారీరక మీమాంసా భాష్యము.

మహాదివ్యమైన బ్రహ్మసూత్రములను మరియు బ్రహ్మసూత్ర భాష్యమును రచించి మనకనుగ్రహించిన శ్రీ బాదరాయణ మహర్షులు మరియు శ్రీ ఆది శంకరాచార్య భగవత్పాదులు మరల మరల వందనీయులు.

**"శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం ।**
**సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః ॥"**

"శంకర స్వరూపులైన శంకరాచార్యులకు, కేశవ స్వరూపులైన బాదరాయణులకు సూత్రములను భాష్యమును రచించిన వారికి, భగవంతులకిద్దరికీ మరల మరల వందనములు"

**శ్రీ ఆదిశంకరాచార్యుల** కన్న ముందు కొందరి వ్యాఖ్యలు, భాష్యములు లభ్యముగా వుండెను. వారిలో ఉపవర్షులు, బోధాయనులు ముఖ్యులు. ఆదిశంకరులు తన భాష్యములో ఉపవర్షుల వారికి చాలా గౌరవ స్థానమునిచ్చి **"భగవాన్ ఉపవర్ష"** అని అన్నారు. బోధాయనులు కూడ చాలా గౌరవనీయులైన గృహ్యసూత్రకారులు.

శ్రీ ఆదిశంకరుల భాష్యము ఒక జ్ఞానజ్యోతి వలె వెలిగి తరువాత వచ్చిన వారికి మార్గదర్శియై ఒక ప్రమాణమైనది. తన పరమగురువులైన గౌడపాదులు, గురువులైన గోవిందభగవత్పాదులు ప్రారంభించిన అద్వైతవాదాన్ని ఒక ప్రముఖమైన అద్వైత మతముగా స్థాపించి భారతదేశములో, ప్రపంచములో

వ్యాప్తిచెందించి అద్వైత మార్గానికి స్వీకరణ, మన్నన అందింపచేశారు ఆది శంకరులు.

బ్రహ్మసూత్రములను వెలుగులోకి, ప్రాచార్యములోనికి విద్యలోనికి, అభ్యాసములోనికి రావటానికి కారణము శ్రీ ఆదిశంకరాచార్య భగత్పాదులు. ఆయన సాక్షాత్తు శంకరుల అవతారమని ఎందరో జ్ఞానుల, వేదాంతుల, సాధకుల విశ్వాసము.

సాక్షాత్తు విష్ణురూపమైన వేదవ్యాసుల, భగవాన్ బాదరాయణుల, బ్రహ్మసూత్రములకు సాక్షాత్తు శంకర రూపమైన ఆదిశంకరులు భాష్యము రాయటము హరిహరుల ఏకత్వానికి, అద్వైతమునకు నిదర్శనము.

**"భాష్యము"** అంటే ఏమిటి? **"భా"** అంటే వెలుగు. భాను, భాస్కర, విభా, అభా, భారవి, అనునవి వెలుగు గూర్చియే కదా ?

**"ష"** అంటే వెలుపలికి, పైకి వచ్చేది, ఉష, నిష, ప్రత్యూష, వేష అనే వాటిలో ఉన్నది పైకి వచ్చేది అన్నమాట. **"భాష"** అంటే పైకి వచ్చే, ప్రకటమయ్యే లోపలి వెలుగు. లోపలి వెలుగు అంటే జ్ఞానము, విజ్ఞానము, గ్రహించిన అర్థము, ఆలోచన, విచారము, వివేక విచారధార.

భాష్యము అంటే ఒక గ్రంధములో, రచనలలో, బోధలో వున్న వెలుగును పైకి తెచ్చి ప్రకటితము చేసేది. బ్రహ్మసూత్ర శాంకర భాష్యము బ్రహ్మసూత్రములలోని వెలుగును, అర్ధాన్ని, భావాన్ని, విచారమును, సందేశమును బాగుగా వెలుగులోకి తెచ్చి **"భాష్యము"** అనే దానిని సార్ధకము చేసినది.

దాదాపు క్రీ.శ. 650-700 ప్రాంతములో కేరళ ప్రదేశములో **కాలడి** అనే గ్రామములో శ్రీ శివగురు, శ్రీమతి ఆర్యాంబలకు జన్మించి, బాల్యములోనే వేదవేదాంగములు నేర్చి, సన్న్యసించి, శ్రీ గౌడపాద శిష్యులైన శ్రీ గోవింద భగత్పాదులను గురువుగా స్వీకరించి, శ్రీ విష్ణు సహస్ర నామ భాష్యము, ముఖ్య ఉపనిషత్తుల భాష్యములు, బ్రహ్మసూత్ర భాష్యము, భగవద్గీతా భాష్యము మొదలైన వాటిని వ్రాసి, ఆత్మబోధ, అద్వైత సిద్ధి, ఉపదేశ సాహస్రి, వివేక చూడామణి, వేదాంత డిండిమ, దక్షిణామూర్తి స్తోత్రము, భజ గోవిందము, శతశ్లోకీ, దశశ్లోకీ, ఏకశ్లోకీ, అనేక స్తోత్రములు, సౌందర్యలహరి, శివానందలహరి, మొదలైనవి వ్రాసి, దేశమంతా పర్యటించి, తనతో సమానులైన శిష్యులను అనేక మందిని వెలిగింపచేసి, అద్వైత సిద్ధాంతమును సుస్థిరముగా చేసి నాలుగు మఠములను స్థాపించి విద్యా, జ్ఞాన, విజ్ఞాన, చైతన్యక్షేత్రాలలో భారతదేశాన్ని ఒకటిగ చేసిన మహా అవతార మూర్తి శ్రీ ఆదిశంకరులు.

**"జీవోబ్రహ్మైవ నాపరః"** జీవుడు బ్రహ్మమే, వేరు కాదు, అంటే జీవునిలో శివుడు, మానవునిలోనే మాధవుడు వున్నాడు అని చాటి చెప్పి అన్ని బోధనలలో, రచనలలో అందరికీ **"నీవే అది"** **"నీవే పరమజ్యోతి"** అని బోధించిన యుగపురుషులు శ్రీ ఆదిశంకరాచార్యులు.

ఆయన వెలికి తెచ్చిన బ్రహ్మసూత్ర భాష్యము అర్థపూర్ణము, అతి సుందరము, ఆనంద దాయకము, అనుభవైక వేద్యము, మరియు ఆత్మ సంతృప్తి కారకము.

బ్రహ్మసూత్ర భాష్యములో 555 సూత్రములు 4 అధ్యాయములు, 16 పాదములు, 191 అధికరణములుగా వ్యవస్థ చేయబడినవి.

ప్రతి సూత్రమునకు షడ్విధలింగములు, ఆరు లక్షణాలు వున్నాయి. ఈ ఆరు లింగములు 1. ఉపక్రమము (ప్రారంభము), 2. ఉపసంహారము (ముగింపు), 3. అభ్యాసము (మరల చెప్పుట), 4. అపూర్వత (క్రొత్త దనము), 5. ఫలము (ఫలితము, లక్ష్యము), 6. అర్థవాదము (వివరణ), 7. ఉపపత్తి (కారణ న్యాయబద్ధత), వుంటాయి. దీని వలన ప్రతి సూత్రము వ్యవస్థగా, సహేతుకముగ, క్రమముగా, సంపూర్ణముగా చర్చించబడి చెప్పబడుతుంది.

శ్రీ శంకరభాష్యము బ్రహ్మసూత్రములను ఉపనిషత్తులలోని బోధల వెలుగులో వివరించినది. శ్రీ బాదరాయణుల విధమును శ్రీ ఆది శంకరులు గ్రహించిన ఉపనిషత్తులు, స్మృతులు ఈ విధము.

**I - ఉపనిషత్తులు :** 1. ఈశావాస్యోపనిషత్తు, 2. ఐతరేయోపనిషత్తు, 3. కఠోపనిషత్తు, 4. కేనోపనిషత్తు, 5. కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు, 6. ఛాందోగ్యోపనిషత్తు, 7. జాబాలోపనిషత్తు, 8. తైత్తిరీయోపనిషత్తు, 9. ప్రశ్నోపనిషత్తు, 10. బృహదారణ్యకోపనిషత్తు, 11. మహానారాయణోపనిషత్తు, 12. ముండకోపనిషత్తు, 13. శ్వేతాశ్వతరోపనిషత్తు, 14. సుబాలోపనిషత్తు

**II - ఆరణ్యకములు :** 1. ఐతరేయ ఆరణ్యకము 2. తైత్తిరీయ ఆరణ్యకము

**III - బ్రాహ్మణములు :** 1. తైత్తిరీయబ్రాహ్మణము, 2. శతపథబ్రాహ్మణము

**IV - వేదములు :** 1. ఋగ్వేద సంహిత, 2. తైత్తిరీయ సంహిత, 3. యజుర్వేద సంహిత

**V - కారికలు :** 1. మాండూక్య కారిక

**VI - భగవద్గీత :** II, III, IV, V, VI, VII, VIII, X, XIII, XIV, XV, XVIII, XVIII-61

**VII - మహాభారతము (శాంతి పర్వము) :** (233-24, 232-9, 339-29, 351-14-19, 352-2, 352-3, 336-28, 353-4, 338-20, 239-23).

ఇలాంటి ఆదర్శనీయమైన భాష్యము తరువాత వచ్చిన భాష్యకారులకు మార్గదర్శియైనది.

## బ్రహ్మసూత్ర భాష్యముల విధము

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ ఆదిశంకరులు | 788-720 క్రీ.శ. | అద్వైతము |
| 2. | శ్రీ భాస్కరాచార్యులు | 966-1061 క్రీ.శ. | భేదాభేదము |
| 3. | శ్రీ యాదవ ప్రకాశులు | 1000 క్రీ.శ. | భేదాభేదము |
| 4. | శ్రీ రామానుజులు | 1017-1127 క్రీ.శ. | విశిష్టాద్వైతము |
| 5. | శ్రీ మధ్వాచార్యులు | 1238-1317 క్రీ.శ. | ద్వైత |
| 6. | శ్రీ నింబార్కులు | 1250 క్రీ.శ. | ద్వైతాద్వైత |

| | | | |
|---|---|---|---|
| 7. | శ్రీ కంఠాచార్యులు | 1270 క్రీ.శ. | శైవ-విశిష్ఠాద్వైత |
| 8. | శ్రీ శ్రీపతి ఆచార్యులు | 1400 క్రీ.శ. | భేదాభేదాత్మక |
| 9. | శ్రీ వల్లభాచార్యులు | 1479-1544 క్రీ.శ. | శుద్ధాద్వైత |
| 10. | శ్రీ శుకాచార్యులు | 1550 క్రీ.శ. | భేదవాద |
| 11. | శ్రీ విజ్ఞానభిక్షు | 1550 క్రీ.శ. | ఆత్మ-బ్రహ్మైక్యభేదవాద |
| 12. | శ్రీ బలదేవ ఆచార్యులు | 1725 క్రీ.శ. | అచింత్య భేదాభేద |

ఇవియేకాక ఎన్నియో వ్యాఖ్యానములు, వ్యాఖ్యలు, వివరణలు విచారధారలు బ్రహ్మసూత్రములు, బ్రహ్మసూత్రముల తత్త్వము గూర్చి వచ్చినవి. ఈ చైతన్య సరిత ఇంకా ప్రవహిస్తూనే ఉన్నది. ఉపనిషత్తులలోని, బ్రహ్మసూత్రములలోని భగవద్గీతలోని ఆత్మబ్రహ్మతత్వమును తెలిపేవి అయిన నాలుగు మహావాక్యములు, శ్రీ ఆదిశంకరాచార్యుల వారి ఏకశ్లోకీ మరియు నారాయణ వాక్యమైన ఆత్మకథలో చెప్పినవి తెలుసుకొని **"శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి"**లో మునకలు వేసి ఆనందముతో ఆత్మానుభూతి నందటానికి ఇదే మీకు స్వగతానికి స్వాగతము.

**నమస్తే**

**నారాయణ**



# నాలుగు మహావాక్యములు

నాలుగు వేదములలోని 1180 ఉపనిషత్తులందలి నాలుగు ఉపనిషత్తులలో గల నాలుగు వాక్యములను మహావాక్యములని, సర్వవేదాంత తత్త్వమని తెలుపబడినది. ఆ నాలుగు వాక్యములు ఈ విధము.

**1. ప్రజ్ఞానం బ్రహ్మ** (ప్రజ్ఞాన విద్య పేజీ (549))

**చైతన్యము బ్రహ్మము**-ఋగ్వేదము, ఐతరేయోపనిషత్తు-III, 3. అందరియందు, అన్నిటియందు, అంతటా వెలుగుతున్న ఈ చైతన్యమే ఆ బ్రహ్మము. **ఇది లక్షణ వాక్యము.** బ్రహ్మము యొక్క గుర్తు అంటే చైతన్యము బ్రహ్మ. **ఇది బ్రహ్మ స్వనామము.**

**2. అయమాత్మా బ్రహ్మ** (మాండూక్య విద్య పేజీ (550))

**ఈ ఆత్మ బ్రహ్మము -** అథర్వ వేదము, మాండూక్యోపనిషత్తు-2. అన్ని జీవులందు విరాజమానమైన ఈ ఆత్మయే ఆ బ్రహ్మము. **ఇది సాక్షాత్కార వాక్యము.** బ్రహ్మమును మనలోనే చూడవచ్చును. ఇది బ్రహ్మదర్శనము అంటే ఆత్మ బ్రహ్మరూపము. **ఇది బ్రహ్మ స్వరూపము.**

**3. అహం బ్రహ్మాస్మి** (వామదేవ విద్య పేజీ (550))

**నేను బ్రహ్మమును -** యజుర్వేదము, బృహదారణ్యక ఉపనిషత్తు-III. 4.10. బ్రహ్మము ఎక్కడనో లేదు, ఈ నేనే ఆ బ్రహ్మము. ఇది స్వానుభవ వాక్యము. నాలో నేనే బ్రహ్మమును అనుభూతి చెందుతున్నాను. ఇది బ్రహ్మానుభూతి. అంటే **"నేను"** బ్రహ్మ స్థానము. **ఇది బ్రహ్మ స్వానుభవము.**

**4. తత్త్వమసి** (శ్వేతకేతు విద్య పేజీ (551))

**అదియే నీవు**-సామవేదము, ఛాందోగ్యోపనిషత్తు-VI. 15. 3. నీవే ఆ బ్రహ్మము. నేను బ్రహ్మమునని అనుభూతినంది, తెలిసి **"నీవే ఆ బ్రహ్మము"** అని బోధించటము ఉపదేశము. **అదియే నీవు. ఇది ఉపదేశ వాక్యము.**

బ్రహ్మమును గుర్తించి, చూసి అనుభూతినంది **"అది నీవు"** అని చెప్పవచ్చును. అంటే **"అది నీవు" బ్రహ్మోపదేశము**, గురుబోధ ఇది **గురూపదేశము, సద్బోధ.**



# ఆత్మకథ
## (బోధామృత సారము)

ఇది ఆత్మకథ. మన అందరి ఆత్మకథ. ఆత్మకథ సర్వ వేదాంతసారమై, ప్రతి వాక్యములోనూ ఉపనిషత్ ప్రతిపాదకమైన, అద్వైతామృతధారను కురిపిస్తుంది. ఇది మీ అందరి ఆత్మకథ. మన ఆత్మకథ. సర్వాత్మ కథ. పరమాత్మ కథ. ఇదిగో "ఆత్మ" కథ.

**1. పుట్టు**

**పుట్టులేదు నాకు నేను బ్రహ్మ**
**యెట్టిదనయది సత్యమంద్రు**
**యెట్టిచోటంత వెలుగుయుండు**
**యెట్టి దానికి అంతంబు లేదు.**

**2. మెట్టు**

**మెట్టితిని నేను దేహమందు**
**యెట్టి దానిని అసత్యమంద్రు**
**యెట్టిచోట చీకటియెయుండు**
**యెట్టి దానికి అంతంబు ధ్రువము.**

**3. గుట్టు**

**అట్టి అసత్యమున సత్యమగుచు**
**గట్టి చీకటిని వెలుగు చేసి**
**కట్టె దానికి జీవంబు నిచ్చి**
**మట్టిని మణిగ చేసితిని నేను.**

**4. గట్టు**

**గిట్టికట్టె అయ్యె దేహమ్ము నేను వీడ**
**గుట్టు, అదియె నేనని తెలిసికొనగ**
**పట్టియుండిన కర్మలు తుదకు వదలి**
**పుట్టులేని గట్టున వెలసితిని వెలిగి**
**అట్లు బ్రహ్మ బ్రహ్మముగ నున్న ఆత్మ నేను.**

### ఇది ఆత్మకథ

(భృగువారుణి విద్య–పేజీ 532, ఆనందమయవిద్య–పేజీ 533, అమృతవిద్య–పేజీ 551, సద్విద్య–పేజీ 547, సత్యవిద్య–పేజీ 536, పరమపురుష విద్య–పేజీ 544, జ్యోతిషాంజ్యోతి విద్య–పేజీ 556, పర్యంకవిద్య–పేజీ 552, దేవయానమార్గము–పేజీ 426, బ్ర.సూ.-536, తై.ఉ.II-1, పైంగల.ఉ.-2)

# ఏకశ్లోకీ

## జగద్గురు శ్రీ ఆది శంకరాచార్య భగవత్పాదులు

1. కిం జ్యోతిస్తవ
2. భానుమానహాని మే రాత్రౌ ప్రదీపాదికం
3. స్యాదేవం రవిదీప దర్శన విధౌ కిం జ్యోతిః
4. ఆఖ్యాహి మే చక్షుః
5. తస్య నిమీలినాది సమయే కిం
6. ధీః
7. ధియో దర్శనే కిం
8. తత్రాహం
9. అతోభవాన్ పరమకం జ్యోతిః
10. తదస్మి ప్రభో !



# ఏకశ్లోకీ

## జగద్గురు శ్రీ ఆది శంకరాచార్య భగవత్పాదులు

1. అన్నిటిని ప్రకాశింపచేయు జ్యోతి యేది నీకు ?
2. పగలు సూర్యుడు రాత్రి దీపములు తారాచంద్రులు జ్యోతి నాకు
3. వాని చూపింప చేయు విధమైన జ్యోతి యేది నీకు ?
4. కన్నులు వానిని చూపించ జేయు జ్యోతి నాకు
5. అవి మూసినపుడు వెలుగు జ్యోతి యేది నీకు ?
6. కన్నులు మూసినపుడు వెలుగు జ్యోతి బుద్ధి నాకు
7. మరి యేజ్యోతి బుద్ధిని వెలిగించుచుండు ?
8. నేనె యా జ్యోతి ఏది బుద్ధిని వెలిగించుచుండు
9. నాయన ! నీవె కాద లోన బయటనన్ని వెల్గించు పరమజ్యోతి
10. ప్రభో ! నేనె ! నేనె ! యా బాహ్యాంతర దివ్య పరమజ్యోతి

పైన వున్న 9వ వాక్యము **"తత్త్వమసి"** **"అదియే నీవు"** అనే బోధ.
10వ వాక్యము **"అహం బ్రహ్మాస్మి"-"నేను బ్రహ్మమును"** అనే స్వానుభవము.

(జ్యోతిషాంజ్యోతివిద్య-పేజీ 556, శ్వేతకేతు విద్య-పేజీ 551, వామదేవ విద్య-పేజీ 550)



# అధ్యాయ పాద క్రమము

## I. సమన్వయము

1. స్పష్ట బ్రహ్మలింగ వాక్య విచారణ
2. అస్పష్ట బ్రహ్మ లింగ సంబంధ వాక్య విచారణ
3. జ్ఞేయ బ్రహ్మ సంబంధ వాక్య విచారణ
4. బ్రహ్మము కాని వాని నిరాకరణ

## II. అవిరోధము

1. సాంఖ్యాది మత నిరాకరణ
2. శ్రుత్యసమ్మత మార్గ నిరాకరణ
3. స్వావిరోధ నిరూపణ
4. ప్రాణాదివాక్య విరోధ పరిహారము

## III. సాధన

1. దేహాంతర గమనము
2. జీవాత్మ పరమాత్మ తత్త్వ విచారణ
3. అంతరంగ సాధన
4. బహిరంగ సాధన

## IV. ఫలము

1. జీవన్ముక్తి
2. ఉత్క్రాంతి
3. దేవయాన మార్గము
4. విదేహముక్తి

# అధ్యాయ-పాద-అధికరణ-సూత్ర వ్యవస్థ

| అధ్యాయములు | పాదములు | అధికరణమలు | సూత్రములు |
|---|---|---|---|
| 1వ-సమన్వయ అధ్యాయము | 4 పాదములు | 39 అధికరణమలు | 134 సూత్రములు |
| 2వ-అవిరోధ అధ్యాయము | 4 పాదములు | 47 అధికరణమలు | 157 సూత్రములు |
| 3వ-సాధన అధ్యాయము | 4 పాదములు | 67 అధికరణమలు | 186 సూత్రములు |
| 4వ-ఫల అధ్యాయము | 4 పాదములు | 38 అధికరణమలు | 78 సూత్రములు |
| **మొత్తం 4 అధ్యాయములు** | **16 పాదములు** | **191 అధికరణమలు** | **555 సూత్రములు** |

**ప్రథమ అధ్యాయము (సమన్వయము)**

| | | |
|---|---|---|
| 1వ పాదము | 11 అధికరణమలు | 31 సూత్రములు |
| 2వ పాదము | 7 అధికరణమలు | 32 సూత్రములు |
| 3వ పాదము | 13 అధికరణమలు | 43 సూత్రములు |
| 4వ పాదము | 8 అధికరణమలు | 28 సూత్రములు |
| **4 పాదములు** | **39 అధికరణములు** | **134 సూత్రములు** |

**ద్వితీయ అధ్యాయము (అవిరోధము)**

| | | |
|---|---|---|
| 1వ పాదము | 13 అధికరణమలు | 37 సూత్రములు |
| 2వ పాదము | 8 అధికరణమలు | 45 సూత్రములు |
| 3వ పాదము | 17 అధికరణమలు | 53 సూత్రములు |
| 4వ పాదము | 9 అధికరణమలు | 22 సూత్రములు |
| **4 పాదములు** | **47 అధికరణములు** | **157 సూత్రములు** |

**తృతీయ అధ్యాయము (సాధన)**

| | | |
|---|---|---|
| 1వ పాదము | 6 అధికరణమలు | 27 సూత్రములు |
| 2వ పాదము | 8 అధికరణమలు | 41 సూత్రములు |
| 3వ పాదము | 36 అధికరణమలు | 66 సూత్రములు |
| 4వ పాదము | 17 అధికరణమలు | 52 సూత్రములు |
| **4 పాదములు** | **67 అధికరణములు** | **186 సూత్రములు** |

**చతుర్థ అధ్యాయము (ఫలము)**

| | | |
|---|---|---|
| 1వ పాదము | 14 అధికరణమలు | 19 సూత్రములు |
| 2వ పాదము | 11 అధికరణమలు | 21 సూత్రములు |
| 3వ పాదము | 6 అధికరణమలు | 16 సూత్రములు |
| 4వ పాదము | 7 అధికరణమలు | 22 సూత్రములు |
| **4 పాదములు** | **38 అధికరణములు** | **78 సూత్రములు** |
| **16 పాదములు** | **191 అధికరణములు** | **555 సూత్రములు** |

# శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి
# అధ్యాయ-పాద-అధికరణ సూచిక

## చతుర్థ పాదము - బ్రహ్మము కాని వాని నిరాకరణ 71



# అధ్యాయము II- అవిరోధము 87

## ప్రథమ పాదము-సాంఖ్యాది మత నిరాకరణ 88

## చతుర్థ పాదము - బహిరంగ సాధన 310

## అధ్యాయము IV- ఫలము 363

### ప్రథమ పాదము - జీవన్ముక్తి 364

## ద్వితీయ పాదము - ఉత్క్రాంతి 401



## తృతీయ పాదము - దేవయాన మార్గము 423



## చతుర్థ పాదము - విదేహముక్తి 441

# శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి
# అధ్యాయ-పాద-సూత్ర సూచిక

## ద్వితీయ పాదము - అస్పష్ట బ్రహ్మ లింగ సంబంధ వాక్య విచారణ 22

## తృతీయ పాదము - జ్ఞేయ బ్రహ్మ సంబంధ వాక్య విచారణ 41

## చతుర్థ పాదము - బ్రహ్మము కాని వాని విచారణ 71

**తృతీయ పాదము - స్వావిరోధ నిరూపణ** **130**

## తృతీయ పాదము - అంతరంగ సాధన 244

# శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి

## వివరణ చిత్ర సూచిక

# 1
# శ్రీ బాదరాయణీయ
# బ్రహ్మసూత్ర బోధామృత లహరి

## I
## ప్రథమ అధ్యాయము
## (సమన్వయము)

ఆత్మయే బ్రహ్మమని తెలియవలెను
సత్యము బ్రహ్మమని తెలియవలెను
చైతన్యము బ్రహ్మమని తెలియవలెను
ఆనందము బ్రహ్మమని తెలియవలెను
సచ్చిదానందము బ్రహ్మమని తెలియవలెను
ఓహో! ఆనందమానందమానందమాయె
అదియే నేను ! అదియే నేను ! అదియే నేను !

# I.1
# ప్రథమ అధ్యాయము - ప్రథమ పాదము

## స్పష్ట బ్రహ్మలింగ సంబంధ వాక్యముల విచారణ

## 1. జిజ్ఞాసాధికరణము (1)

### (1) I.1.1

**సూ. అథాతో బ్రహ్మజిజ్ఞాసా**

**క్ర. అథ, అతః, బ్రహ్మజిజ్ఞాసా**

ప్ర.అ. అథ = **ఇపుడు,** అతః = **కావున,** బ్రహ్మజిజ్ఞాసా = **బ్రహ్మమును తెలిసి కొనుటకు వివేచన, విచారణ (శీలము, శుద్ధిమార్గములో నుండి సాధన చతష్టయమందినపుడు)**

వి. ఇపుడు నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగ విరాగము, శమదమాది సాధన సంపత్తి (శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము), ముముక్షుత్వము అనే సాధన చతుష్టయము లభించి అర్హతనందినపుడు పరమ జ్ఞేయము పరమాత్మ కనుక పరమాత్మయైన బ్రహ్మమును గూర్చి వివేచన, విచారణ చేయవలయును.

"అథయ ఇహాత్మానమనువిద్య" (ఛాం.ఉ. VIII-1-6)

"ఇపుడు ఇట్టి ఆత్మను తెలిసికొనవలయును" అని ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడినది.

తైత్తిరీయ ఉపనిషత్తులో ఇలా వుంది.

"భృగువను పేరు గల వరుణ పుత్రుడు బ్రహ్మవిద్యను తెలిసికొననిచ్ఛ కలవాడై తండ్రియగు వరుణుని వద్దకు పోయి "ఓ భగవంతా! బ్రహ్మమును గూర్చి బోధించుము" అని వేడుకొనెను." (తై.ఉ. 3-1)

"బ్రహ్మ విదాప్నోతి పరం" (తై.ఉ. 2-1)

"బ్రహ్మము గూర్చి తెలిసికొన్న జ్ఞాని పరబ్రహ్మమును పొందుచున్నాడు."

**కావున బ్రహ్మజిజ్ఞాస ఆవశ్యకము.**

(ఛాం.ఉ. VIII-1-6; తై.ఉ. 2-1, తై.ఉ. 3-1)

## 2. జన్మాద్యధికరణము (2)

### (2) I.1.2

**సూ. జన్మాద్యస్య యతః**

**క్ర. జన్మాది, అస్య, యతః**

ప్ర.అ. జన్మాది = **జన్మ, స్థితి, లయము,** అస్య = **ఈ జగమునకు,** యతః = **దేని వలన కలుగుచున్నదో.**

వి. **దేనివలన ఈ జగమునకు జన్మ, స్థితి మరియు లయములు కలుగునో అదియే బ్రహ్మము.**
తండ్రియైన వరుణుండు, తనయుండునైన భృగువుకిట్లనియె:

"దేని నుండి భూతములు జనియించుచుండు,
జనియించి దేనివలననవి జీవించుచుండు,
దేనియందు మరల యవి కలియుచుండు
అదియె బ్రహ్మమని నీవు తెలియుచుండు" (తై. 3-1)

బ్రహ్మము ఈ జగత్తుకు జన్మ, స్థితి, లయములకు కారణము అని చెప్పబడినది.

అయితే

"ఆనందాద్ధ్యేవ ఖల్విమానిభూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయన్త్యభిసంవిశంతి" (తై.ఉ.3.6)

"ఈ భూతములు ఆనందమునుండియే జనిస్తున్నాయి. ఆనందము వల్లనే జనించి జీవిస్తున్నాయి. ఆనందాన్ని చేరి దానియందు కలిసిపోతున్నాయి."

"తన్నిత్యముక్తమ్ అవిక్రియం సత్యజ్ఞానానంతానంద, పరిపూర్ణం సనాతనమ్ ఏక మేవాద్వితీయం బ్రహ్మ" (పైంగల ఉపనిషత్తు-2)

"ఆ సద్వస్తువైన బ్రహ్మము నిత్యముక్తము, అవికారము, అవిక్రయము, సత్యజ్ఞానాందమున పరిపూర్ణము, సనాతనము, ఒకటియే మరి రెండవది లేనిది."

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై.ఉ. 2-1)

"బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతము" అని కూడా శృతిలో చెప్పబడినది.

**జగత్కారణము అనేది బ్రహ్మము యొక్క తటస్థ లక్షణము. సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము అనేది బ్రహ్మము యొక్క స్వరూప లక్షణము, అట్టి బ్రహ్మమే జగత్కారణము.**

(తై.ఉ. 2-1, 3-1, 3-6, పై.ఉ.-2)

## 3. శాస్త్రయోనిత్వాధికరణము (3)

## (3) I.1.3

**సూ. శాస్త్రయోనిత్వాత్**

**క్ర. శాస్త్రయోనిత్వాత్**

ప్ర.అ. శాస్త్ర = **శాస్త్రములు వేదముల,** యోనిత్వాత్ = **మూలము అయినందు వలన**

**వి. శాస్త్రములకు మూలము బ్రహ్మము కనుక బ్రహ్మమునకు సర్వజ్ఞత కలదు.**

బృహదారణ్యక ఉపనిషత్తులో,

"అస్యమహతో భూతస్య నిశ్వసితమేతదృగ్వేదో యజుర్వేద స్సామవేదోధర్వాంగిరస ఇతిహాస పురాణం విద్యా ఉపనిషదస్సూత్రాణి"

(బృ.ఉ. II-4-10)

"ఈ మహంతుని, పరమాత్మ యొక్క నిశ్వాసముల వలన ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, ఇతిహాసము, పురాణము, సకలవిద్యలు, ఉపనిషత్తులు, సూత్రములు కలిగినవి."

"నిష్వాస భూతా మే విష్ణోర్వేదా జాతా స్సువిస్తరా
తిలేషు తైలవద్వేదే వేదాంత స్సుప్రతిష్టితః" (ముక్తి.ఉ. 1-3)

"విష్ణు స్వరూపమైన నా నుండి నిశ్వాసముల వలె సువిస్తారమైన వేదములు జనించినవి.

నువ్వులలో నూనెవలె వేదములలో వేదాంతము సుప్రతిష్ఠితము అయినది."
భగవద్గీత కూడా అలానే చెప్పినది."
"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాంతకృద్వేదవిదేవ చాహమ్". భ.గీ. XV-15
"సర్వవేదముల వలన వేద్యుండ నేను
అరసి వేదములు వేదాంతము చేసితేను"
**అన్ని శాస్త్రములు బ్రహ్మమునుండియే జనించినవి.**
(బృ.ఉ.II-4-10, ముక్తి.ఉ.1-3, భ.గీ.XV-15)

## 4. సమన్వయాధికరణము (4)

## (4) I.1.4

**సూ. తత్తు సమన్వయాత్**

**క్ర. తత్, తు, సమన్వయాత్**

ప్ర.అ. తత్ = **ఆబ్రహ్మము,** తు = **ఆప్రకారము,** సమన్వయాత్ = **బ్రహ్మము గూర్చి చెప్పిన వేదాంత వాక్యముల సమన్వయము ద్వారా**

వి. వేదాంతములైన అనేక ఉపనిషత్తులు బ్రహ్మము గూర్చి యెన్నియో తీర్ల చెప్పినవి.
**బ్రహ్మమును గూర్చి బోధించిన వివిధ వేదాంత వాక్యములైన ఉపనిషద్వాక్యముల సమన్వయము ద్వారా పరస్పర విరోధములేని ఏకాభిప్రాయము వలన ఆ బ్రహ్మమును గూర్చి తెలిసికొనవచ్చును.**
[**నారాయణ వాక్యము :** ఉపనిషత్తులలో కొన్ని చోట్ల పరబ్రహ్మము నిరాకారమని, కొన్ని చోట్ల సాకారమని, కొన్ని చోట్ల సర్వాకారమని, కొన్ని చోట్ల వికార స్వరూపమైన జీవాత్మ నిర్వికార స్వరూపమైన పరమాత్మ రూపమందుతుందని చెప్పబడినది.

కొన్నిచోట్ల బ్రహ్మము నిర్గుణమని, కొన్ని చోట్ల సగుణమని, కొన్నిచోట్ల సగుణము మరియు నిర్గుణమని కూడా చెప్పబడినది. కొన్ని చోట్ల పరబ్రహ్మమునకు ఏ అవయములు లేవనిచెప్పి మరికొన్ని చోట్ల అవయవములున్నవని చెప్పబడినది. కొన్నిచోట్ల సూక్ష్మాతిసూక్ష్మమని, కొన్నిచోట్ల స్థూలాతిస్థూలమని అనబడినది. ఒకచోట బ్రహ్మము పరిమాణాతీతము, కొలతలు లేనిదని ఇంకొకచోట బ్రహ్మము పరిమాణ సహితమని, అంగుష్ఠమాత్రమని, ఆదిత్యునిలోనని అక్షిస్తమని, హృదయస్తమని కొలతలతో కొలవబడినది.

ఈ విధముగా పలువిధములుగా భిన్న భిన్న రూపములలో చెప్పబడిన వేదాంత వాక్యములను సమన్వయపరిచి పరబ్రహ్మము గూర్చి సహేతుకముగా, సమగ్రముగా, సమ్మతముగా, సమాధాన సహితముగా దర్శించుకొనవచ్చును. ఇదియే "సమన్వయాత్" అన్నదాని అర్థము, లక్ష్యము.]

## 5. ఈక్షత్యధికరణము (5)

## (5) I.1.5

**సూ. ఈక్షతేర్నాశబ్దమ్**

**క్ర. ఈక్షతేః, న, అశబ్దమ్**

ప్ర.అ. ఈక్షతేః = **ఈక్షించెను,** న = **కాదు,** అశబ్దమ్ = **జడము, ప్రధానము.**

వి. ఉద్దాలక ఆరుణి ముని తన తనయుడైన శ్వేతకేతువుకు ఇలా అన్నాడు.

"సత్త్వైవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్

తదైక్షత బహస్యాం ప్రజయామేతి" (ఛాం.ఉ. II-2-3.)

"సత్తుగానున్న పరబ్రహ్మమే మొట్టమొదటయుండెను. ఒకటియే వుండెను. రెండవదేదీ లేకుండెను. ఆ సద్రూప బ్రహ్మము నేను బహురూపముల ధరించెదనని మొదట సంకల్పించెను. (ఈక్షించెను, ఆలోచించెను, చూచెను.)"

శ్వేతాశ్వతర ఉపనిషత్తులో ఇలా ఉన్నది

"స విశ్వకృద్విశ్వవిద్" (శ్వే.ఉ.6-16)

ఆ పరమాత్మయే విశ్వకర్త, విశ్వవిదుడు

**ఉపనిషత్తులో చెప్పబడిన "ఈక్షించెను, ఆలోచించెను, చూచెను" అనునది జడపదార్థమైన, వేదములో చెప్పబడని, అచేతనమైన, సాంఖ్యములో చెప్పబడిన ప్రధానమునకు లేదు. కావున ప్రధానము, మూలప్రకృతి జగత్తునకు కారణము కాదు.**

(ఛాం.ఉ. 6-2-1, 6-2-3; శ్వే.ఉ. 6-16; బ్ర.సూ. 1-1-1, 1-1-2; ప్ర.ఉ. 6-3; ముం.ఉ. 1-1-9)

## (6) I.1.6

**సూ. గౌణశ్చేన్నాత్మశబ్దాత్**

**క్ర. గౌణః, చేత్, న, ఆత్మశబ్దాత్**

ప్ర.అ. గౌణః = **గౌణము (గుణముగా ప్రయోగింపబడినది),** చేత్ = **అని అంటే,** న = **అట్లు కాదు,** ఆత్మశబ్దాత్ = **ఆత్మ శబ్దము వలన.**

వి. **ఇంతకుముందరి సూత్రము (5) (I-1-5)లో చెప్పబడిన ఈక్షణము గౌణము, జడపదార్థమైన ప్రధానమునకు కూడ వర్తిల్లును అంటే అట్లు కాదు. ఎందుకనిన ఆత్మ అను శబ్దము ఈక్షణమునకు సంబంధించి ప్రయోగింపబడినందువలన.**

"సేయం దేవతైక్షత హన్తాహమిమాస్తిస్రో

దేవతా అనేన జీవాత్మనా సుప్రవిశ్య నామ రూపే వ్యాకరవాణీతి" (ఛాం.ఉ.6-3-2)

"ఆ దేవత ఇట్లు ఈక్షించెను (చూచెను, ఆలోచించెను, చూచెను, సంకల్పించెను)" "సత్తుగానున్న ఈ దేవతను నేనిక ఈ జీవాత్మ రూపములో ఈ ముగ్గురు దేవతల యందు, అనగా అగ్ని జలాన్నములయందు, ప్రవేశింపచేసి నామ రూపములను వ్యక్తపరుచవలెనని ఆలోచించెను. అనేక నామరూపములచే సృష్టించవలెనని సంకల్పించెను."

అని చెప్పి అదే ఛాందోగ్యోపనిషత్తులో, అదే ప్రకరణములో "స ఏషోऽణిమై తదాత్మ్యమిదం

సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో” (ఛాం.ఉ. 6-14-3)

“ఓ శ్వేతకేతూ ! ఈ సద్రూపమనేది చాలా సూక్ష్మమైనది, ఇదంతా సద్రూపమే. అది సత్యము. అది ఆత్మ. ఆ ఆత్మవు నీవే !” అని ఉద్దాలక మునిచే తన కుమారుడైన శ్వేతకేతువుకు చెప్పబడినది.

**ఆ ఈక్షించిన దేవతయే ఇక్కడ చెప్పబడిన ఆత్మ ! ప్రధానము కాదు.**

(ఛాం.ఉ. 6-3-2, 6-14-3)

## (7) I.1.7

సూ. **తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్**

క్ర. **తత్‌నిష్ఠస్య, మోక్షఉపదేశాత్**

ప్ర.అ. తన్నిష్ఠస్య = **ఆ జగత్కారణమైన బ్రహ్మయందు నిష్ఠ కలిగినవానికి,** మోక్షోపదేశాత్ = **మోక్షము కలుగునని చెప్పటము వలన**

వి. **బ్రహ్మమందు నిష్ఠుడైనవానికి మోక్షము సంభవించును.** అట్లు ఛాందోగ్యోపనిషత్తునందు **ఉద్దాలకుడు శ్వేతకేతువుకు చేసిన ఉపదేశము ప్రకారము కలదు.**

ఆచార్యవాన్ పురుషోవేద తస్యతావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథసంపత్స్య ఇతి (ఛాం.ఉ.6-14-2)

“ఆచార్యుడు (గురువు) కలిగినవాడు సద్రూపమైన బ్రహ్మమును తెలుసుకొంటాడు. అటువంటి ఆత్మనిష్ఠునికి శరీరము పాతము కాగానే మోక్షము లభిస్తుంది. తాను బ్రహ్మము అవుతాడు” (ఛాం.ఉ.6-14-2) అని ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఉపదేశము చేసి వెంటనే “తత్త్వమసి” (ఛాం.ఉ.6-9-4) “ఆ ఆత్మవు నీవే!” అని చెప్పినాడు.

(ఛాం.ఉ.6-14-2, ఛాం.ఉ.6-14-3)

జడపదార్థమైన ప్రకృతి, ప్రధానమందు స్థితమైనవానికి మోక్షము లభించదు. **కావున జడపదార్థముయైన ప్రకృతి, ప్రధానము ఈ జగత్తునకు కారణము కాదు.**

(ఛాం.ఉ.6-14-2) (ఛాం.ఉ.6-9-4) (ఛాం.ఉ.6-14-3)

## (8) I.1.8

సూ. హేయత్వావచనాచ్చ

క్ర. **హేయత్వ + అవచనాత్, చ**

ప్ర.అ. హేయత్వ = **విడువతగినది,** అవచనాచ్చ = **అని చెప్పబడక పోవటము వలన**

వి. **గౌణవృత్తిచే ఆత్మశబ్దము ప్రకృతి సంబంధమైన యెడల మున్ముందు ఆ ప్రకృతిని విడువతగినదని, విడువాలని చెప్పవలసి వస్తుంది. కాని అట్లు చెప్పబడలేదు. ఆత్మనిష్ఠ గూర్చి మాత్రమే కలదు. కావున ప్రకృతి జగత్కారణము కాదు. బ్రహ్మమే జగత్కారణము.**

## (9) I.1.9

**సూ. స్వాప్యయాత్**

**క్ర. స్వ, అపి, అయాత్**

ప్ర.అ. స్వ = **తనయందు,** అప్యయాత్ = **విలీనమగునని అనినందువలన**

వి. **సుషుప్తిలో జీవులు పరమాత్మను పొంది లీనమౌతున్నారు అని చెప్పటము వలన ఆ కలువబడేది. బ్రహ్మములో కాని ప్రధానములో కాదు. అచేతనమైన ప్రధానము చేతనమైన జీవాత్మలో లీనము కాదు.**

ఆరుణియైన ఉద్దాలకుడు శ్వేతకేతువుకు ఇలా బోధించినాడు.
"ఓ సౌమ్యా ! నిద్ర యొక్క స్వరూపము గూర్చి బాగుగా తెలిసికొనుము. ఈ పురుషుడు నిద్రించినపుడు సద్రూపాత్మతో అభేదము నొందుచున్నాడు. తనయందు, ఆత్మయందు, లయమొందుచున్నాడు."
"తస్మాదేవం స్వపితీత్యాచక్షతే, స్వంహ్యాపీతో భవతి"
"అందువలన నిద్రించుచున్నాడు (స్వపితి) అని చెప్పుదురు." (ఛాం.ఉ.6-8-1)
బృహదారణ్యక ఉపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు జనకునితో ఇలా అన్నాడు.

"తద్వా అస్యైతదతిచ్ఛందా అపహత పాప్మాఽభయం రూపం, తద్యాథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యంకించన వేదనాంతరమేవమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యంకించన వేదనాంతరం. తద్వా అస్యై తదాప్తకామమాత్మ కామమకామం రూపం శోకాంతరం" (బృ.ఉ.4-3-21)

"ఈ ఆత్మకు అదియే రూపము, కామరహితము, పాపరహితము, భయరహితమైన రూపము. అక్కడ ప్రియురాలగు స్త్రీతో ఆలింగనము చేసికొనినపుడు ఏకమైయున్నట్లు ఈ పురుషుడు (ఈ జీవుడు) స్వాభావికమగు పరమార్థ స్వరూపమైన స్వకీయాత్మతో ఏకస్వరూపమై, వెలుపలనున్న దానిని లోపలనున్న దానిని తెలిసికొనడు. అదియే ఈ ఆత్మకు స్వరూపము. అది ఆప్తకామము, ఆత్మకామము, కామములేనిది, శోకాంతమైన రూపము"

ఈ విధముగా సుషుప్తిలో జీవులు పరమాత్మలో లీనము అవుతున్నారు.

**చేతనమైన జీవులు అచేతనమైన ప్రధానములో లీనము అవటము కుదరదు.**

**చేతనమైన జీవులు చేతనమైన పరమాత్మయందు లీనమగుట యుక్తము, సమంజసము, సత్యము.**
(ఛాం.ఉ.6-8-1; బృ.ఉ.4-3-21)

---

## (10) I.1.10

**సూ. గతిసామాన్యాత్**

**క్ర. గతిసామాన్యాత్**

ప్ర.అ. గతి = **ఉపనిషత్ బోధనా ప్రవాహములు,** సామాన్యాత్ = **ఒకే తీరుగా వెళ్లుచున్నాయి కనుక**

వి. వివిధ ఉపనిషత్తులు అన్నీ బ్రహ్మమే, చైతన్యమే, జగత్కారణము అని ఉద్ఘోషించి బోధిస్తున్నాయి కనుక బ్రహ్మమే జగత్కారణము.

"ప్రజ్వలించే అగ్ని నుండి నిప్పురవ్వలు అన్ని దిక్కులకు వెదజల్లబడునట్లు, ఈ ఆత్మ నుండి సమస్త ప్రాణములు, ఇంద్రియములు, యథా స్థానములలో భూమ్యాది మండలములలో పుట్టుతున్నాయి. ప్రాణముల నుండి వాటికధిదేవతలైన సుర్యాదులు ప్రకటమౌతున్నారు. ఆ దేవతల వలన లోకములు (ఇంద్రియములకు విషయములైన రూపాదికాలు) పుడుతున్నాయి." (కౌశీ. ఉ.3-3)

"తస్మాద్వా ఏ తస్మాదాత్మన ఆకశస్సంభూత;, ఆకాశాద్వాయు:, వాయురగ్ని:, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నమ్, అన్నాత్పురుషః" (తై.ఉ. 2-1)

"ఈ బ్రహ్మము నుండి సమస్త భూతములకు అవకాశము, ఆధారము ఇచ్చు ఆకాశము జనించినది. ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథివి, పృదివి నుండి ఔషధులు, ఔషధుల నుండి పురుషుడు జనించినవి."

అంటే సమస్త సృష్టి బ్రహ్మము నుండియే జన్మించినది.

"ఆత్మన ఏష ప్రాణో జాయతే", (ప్ర.ఉ. 3-3)
ఈ ప్రాణము ఆత్మ నుండియే జన్మించుచున్నది.

"ఆత్మన ఏవేదం సర్వం" (ఛాం.ఉ.7-26-1)
"ఆత్మ నుండియే (బ్రహ్మము నుండియే) ఈ సర్వమూ, సమస్తమూ కలిగినవి.

**ఈ విధముగా ఉపనిషత్తుల బోధనా ప్రవాహములు ఒకే రీతిగా, బ్రహ్మమే జగత్కారణమనుచు వెళ్ళుచున్నాయి.**
(కౌశీ.ఉ.3-3; తై.ఉ.2-1; ప్ర.ఉ.3-3; ఛాం.ఉ.7-26-1)

## (11) I.1.11

సూ. **శ్రుతత్వాచ్చ**

క్ర. **శ్రుతత్వాత్, చ**

ప్ర.అ. శ్రుతత్వాత్= **శ్రుతిలో, ఉపనిషత్తులలో చెప్పుట వలన,** చ = **కూడ మరల మరల**

వి. ఉపనిషత్తులలో మరల మరల, వేరు వేరు విధములలో బ్రహ్మమే జగత్కారణమని చెప్పబడినది.
"సకారణం కరణాధిపాధిపో నచాస్య జ్జనితా నచాధిపః" (శ్వే.ఉ. 6-9)
"అతడే సర్వకారణము. అతడే అధిపులైన సూర్యాదులకు అధిపుడు. అతనికి జనకుడు కాని అధిపుడు కాని లేడు."
**కావున బ్రహ్మము జగన్మూలము, జగత్కారణము. జడమైన ప్రధానము కాదు.**
(శ్వే.ఉ. 6-9)

## 6. ఆనందమయాధికరణము (6) (ఆనందమయ విద్య)

## (12) I.1.12

సూ. **ఆనందమయోఽభ్యాసాత్**

క్ర. **ఆనందమయః, అభ్యాసాత్**

ప్ర.అ. ఆనందమయః = **ఆనందమయ శబ్దము,** అభ్యాసాత్ = **మరల మరల ప్రయోగింపబడినందున**

వి. **ఆనందమయ శబ్దము మరల మరల బ్రహ్మము కొరకే ప్రయోగింపబడినందున ఆనందమయుడంటే పరమాత్మయే తప్ప జీవుడు కాదు.**

"అన్యోంతరాత్మానందమయ" (తై.ఉ.2-5)

"ఇంకొక అంతరాత్మ ఆనందమయుడు"

"రసోవైసః రసం హ్యేవాయం లబ్ధ్వాஉనందీ భవతి." (తై.ఉ.2-7-1)

"ఆ పరబ్రహ్మము ఆనందకరమైన రసస్వరూపముగానున్నది. అట్టి రసస్వరూపమును పొంది జీవి ఆనందమందుచున్నాడు."

"ఏతమానందమయాత్మానముప సంక్రామంతి"

"అట్లు ఆనందమయ ఆత్మను అందుచున్నాడు" (తై.ఉ.2-8)

"ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్" (తై.ఉ.3-6)

"ఆనందమే పరబ్రహ్మమని తెలిసికొనెను" (తై.ఉ.2-8)

**అట్లు ఆనందమయుడు అంటే పరబ్రహ్మమే.**

(తై.ఉ. 2-5, 2-7, 2-8, 2-9, 3-6)

## (13) I.1.13

సూ. **వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్,**

క్ర. **వికారశబ్దాత్, న, ఇతి, చేత్, న, ప్రాచుర్యాత్**

ప్ర.అ. వికారశబ్దాత్ = **మయట్ ప్రత్యయము వికార బోధకమని చెప్పుట వలన ఆనందమయ శబ్దము బ్రహ్మావాచకము,** న = **కాదు అని,** చేత్ = **చెప్పినచో,** న = **అది సరికాదు,** ప్రాచుర్యాత్ = **మయట్ శబ్దము ఇచట ప్రాచుర్య అర్థబోధకము.**

వి. ఆనందమయుడు అనే శబ్దంలోని "మయట్" ప్రత్యయం "వికార" అర్థ బోధకం (వేరురూపం చెందటాన్ని సూచించేది), కావున బ్రహ్మ విషయంలో ఆనందమయుడనే శబ్దము వాడటం సరికాదు అని అనటం సరికాదు. ఎందుకంటే, "మయట్" ప్రత్యయం ప్రాచుర్యాన్ని (విస్తారాన్ని) పెంపును సూచించటానికి ఉపయోగించబడుతుంది.

**అందువలన ఆనందమయుడు పరమాత్మయే.**

## (14) I.1.14

సూ. **తద్ధేతువ్యపదేశాచ్చ**

క్ర. **తత్+హేతువ్యపదేశాత్, చ**

ప్ర.అ. తత్ = ఆ, హేతు = **కారణము,** వ్యపదేశాత్ = **చెప్పుట వలన,** చ = **కూడ**

వి. **ఆ ఆనందానికి హేతువు, కారణము అని చెప్పటము వలన కూడా ఆనందమయుడంటే బ్రహ్మము, పరమాత్మ అని గ్రహించాలి.**

"ఏషహ్యేవానందయాతి" (తై.ఉ. 2-7-1)

"ఈ పరమాత్మయే లోకమును ఆనంద పరుచుచున్నాడు."

పరమాత్మ, పరబ్రహ్మమే ఆనందకరమునకు హేతువు, కారణము.

**కావున ఆనందమయుడు అంటే పరమాత్మయే**

(తై.ఉ. 2-7)

## (15) I.1.15

సూ. **మాంత్రవర్ణికమేవ చ గీయతే**

క్ర. **మాంత్రవర్ణికమ్, ఏవ, చ, గీయతే**

ప్ర.అ. మాంత్రవర్ణికమ్ = **మంత్రాక్షరాలలో ఎవరిని గూర్చి వర్ణించబడెనో,** ఏవ = **ఆ బ్రహ్మమే,** చ = **ఇంకగూడ,** గీయతే = **బ్రాహ్మణమునందు ప్రతిపాదించబడినది.**

వి. ఉపనిషత్తు యొక్క మంత్రాక్షరములతో చెప్పబడిన "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని అనబడిన బ్రహ్మమే, (తై.ఉ. 2-1), "అన్యోంతర ఆత్మా ఆనందమయః" (తై.ఉ. 2-7) అని గానం చేయబడినది. **కావున ఆనందమయుడు బ్రహ్మము అనియే తెలుస్తున్నది.**

(తై.ఉ. 2-1, 2-5, 2-7)

## (16) I.1.16

సూ. **నేతరో ఽనుపపత్తేః**

క్ర. **న, ఇతరః, అనుపపత్తేః**

ప్ర.అ. న = **కాదు,** ఇతరః = **బ్రహ్మముకన్న వేరైన జీవాత్మ,** అనుపపత్తేః= **పూర్వాపర వర్ణన లేకపోవుట వలన**

వి. పరబ్రహ్మముకంటే ఇతురుడైన జీవుడు, ఆనందమయుడనే శబ్దానికి అర్థం కాదు. ఎందువలననంటే సృష్టికి పూర్వం కోరటం మొదలైనవి జీవునికి వర్తించవు.

"సోఽకామయత, బహుస్యాంప్రజయాయేతిః"

"ఆ పరమ్మాత్మ అనేక విధములుగా జనించవలెనని కోరుకొనెను. (తై.ఉ. 2-6-2)

సృష్టి చేయాలనే కోరిక పరమాత్మకే వర్తిస్తుంది.

**కావున ఆనందమయుడు, పరమాత్మయైన బ్రహ్మమే.**

(తై.ఉ. 2-6-2)

## (17) I.1.17

సూ. **భేదవ్యపదేశాచ్చ**

క్ర. **భేదవ్యపదేశాత్, చ**

ప్ర.అ. భేద = **భేదము,** వ్యపదేశాత్ = **చెప్పటం వలన,** చ = **కూడా**

వి. జీవాత్మకు మరియు పరమాత్మకు భేదం వున్నట్లు చెప్పటం వలన గూడ ఆనందమయుడు జీవుడు కాదు అని తెలుస్తున్నది.

"రసోవైసః రసంహ్యేవాయంలబ్ధ్వాఽనందీ భవతి" (తై.ఉ. 2-7)

"ఆ బ్రహ్మము రసస్వరూపము. అట్టి రస స్వరూపమును పొంది జీవుడు సుఖవంతుడు అగుచున్నాడు."

పొందేది, పొందబడేది అనే రెండింటిలో బేధం వుంది కదా!

(పొందిన తరువాత బేధము వుండదు!)

**కావున ఆనందమయుడు అంటే పరమాత్మయే**

(బృ.ఉ. 3-7-23; తై.ఉ. 2-7)

## (18) I.1.18

సూ. **కామాచ్చ నానుమానాపేక్షా**

క్ర. **కామాత్, చ, న, అనుమానాపేక్షా**

ప్ర.అ. కామాత్ = **కామము అను శబ్దము,** చ = **కూడా** న = **లేదు,** అనుమాన = **అనుమానము,** అపేక్షా = **ఉద్ధేశ్యము**

వి. ఆనందమయ ప్రసంగములో "సోఽకామయత" (తై.ఉ. 2-6) అని కోరిక గూర్చి చెప్పినందువలన సాంఖ్యుల ప్రధానం అనేది ఆనందమయ పదానికి అర్థం అనే ఉద్దేశ్యం అవసరం లేదు. **ఆనందమయత్వము జడప్రకృతికి వర్తించదు.**

(తై.ఉ. 2-6)

## (19) I.1.19

సూ. **అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి**

క్ర. **అస్మిన్, అస్య, చ, తత్, యోగం, శాస్తి**

ప్ర.అ. అస్మిన్ = **ఈ రీతిగా,** అస్య = **ఈ జీవాత్మకు,** చ = **మరియు,** తద్యోగమ్ = **ఆయోగము,** శాస్తి = **శాస్త్రం చెప్పుచున్నది.**

వి. ఆనందమయుని యందు ఈ జీవునకు కూడిక (యోగము) కలదని ఉపనిషత్తు చెప్పుచున్నది. "ఇట్టి రసస్వరూపమైన, ఆనందమయుడైన పరమాత్మను పొంది జీవి ఆనందమందుచున్నాడు." (తై.ఉ. 2-7)

**కావున జీవుడు కాని, ప్రధానం కాని ఆనందమయుడు కాదు. బ్రహ్మమే ఆనందమయుడు.**

(తై.ఉ. 2-7, 2-6)

## 7. అంతరధికరణము (7) (అక్షి విద్య-అంతరాదిత్య విద్య)

## (20) I.1.20

సూ. **అన్తస్తద్ధర్మోపదేశాత్**

క్ర. **అన్తః, తత్ధర్మఉపదేశాత్**

ప్ర.అ. అంతః = **లోపలయుండు,** తత్ = ఆ, ధర్మ = **ధర్మములు,** ఉపదేశాత్ = **ఉపదేశమువలన**

వి. ఉపనిషత్తు వాక్యములలో చెప్పబడిన ఆదిత్యమండలములోని పురుషుడు, అక్షి పురుషుడు

"యఏషోஉన్తరాదిత్యే", (ఛాం.ఉ. 1-6-6, 7) "యఏషోஉన్తరక్షిణి పురుషో దృశ్యతే" (ఛాం.ఉ. 1-7-1,5) బ్రహ్మమే కాని సంసారియైనట్టి ఉత్కర్షను పొందినట్టి జీవుడు కాడు. అది శుద్ధమైన ధర్మోపదేశము వలన.
(కౌషీ. ఉ. 1-3-15 ; ఛాం.ఉ. 1-6-6 ; ఛాం.ఉ. 1-6-7,8)

## (21) I.1.21

సూ. **భేదవ్యపదేశాచ్చాన్యః**

క్ర. **భేదవ్యపదేశాత్, చ, అన్యః**

ప్ర.అ. భేద = **భేదము,** వ్యపదేశాత్ = **చెప్పబడుటచేత,** చ = **అట్లే,** అన్యః = **పరమేశ్వరుడు అగునుగాని జీవుడు కానేరడు.**

వి. శ్రుతియందు సూర్యునికి, పరమాత్మకు భేదాన్ని చెప్పటం వలన సూర్యుని కంటే, సూర్యునియందు వున్న హిరణ్మయుడైన బ్రహ్మము వేరు.
**"సూర్యుని యందు వుండి సూర్యునికి తెలియక, సూర్యుడు శరీరముగా కలిగి, సూర్యుని నియమించునది బ్రహ్మము."** (బృ.ఉ. 5-7-9)
(బృ.ఉ. 5-7-9)

## 8. ఆకాశాధికరణము (8) (ఆకాశ విద్య)

## (22) I.1.22

సూ. **ఆకాశస్తల్లింగాత్**

క్ర. **ఆకాశః, తత్‌లింగాత్**

ప్ర.అ. ఆకాశః = **ఆకాశము,** తత్ = **ఆ,** లింగాత్ = **లక్షణముల వలన**

వి. ఛాందోగ్యోపనిషత్తులోని **ఆకాశము పరబ్రహ్మావాచకము.** ఎందుకంటే అందుచెప్పబడిన లక్షణములు బ్రహ్మ యొక్క లక్షణములే కాని వేరుకావు. **"ఈ సమస్త భూతములు ఆకాశమున పుట్టి అందే లీనమగుచున్నవి."** (ఛాం.ఉ. 1-9-1) (పృథివి, ఆపః, తేజః, వాయుః, ఆకాశములనబడే, భూతాకాశములు అన్ని పరమాకాశమగు పరబ్రహ్మానుండియే వచ్చి వెడలిపోతున్నాయి.) భూతాకాశమునకు అది సంభవము కాదు. **పరమాత్మాకాశము భూతాకాశముకన్న మిన్న మరియు పరాయణము.**
(చిదాకాశము→ఆకాశము→వాయువు→తేజము→జలము→పృథివి)

## 9. ప్రాణాధికరణము (9) (ప్రాణ విద్య)

## (23) I.1.23

సూ. **అత ఏవ ప్రాణః**

క్ర. **అతః, ఏవ, ప్రాణః**

ప్ర.అ. అతః ఏవ = **ఇందువలననే,** ప్రాణః = **ప్రాణ శబ్దము**

వి. **శ్రుతియందు చెప్పబడిన బ్రహ్మలక్షణములైన జన్మ, స్థితి, లయములు ప్రాణ శబ్దమునకు వర్తిస్తాయి కనుక ప్రాణము అనగా బ్రహ్మము, ప్రాణవాయువు కాదు.** "ప్రాణము బ్రహ్మమని తెలిసి దానతడు"-తైత్తిరీయోపనిషత్తు. "సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభి సంవిశన్తి ప్రాణమభ్యుజ్జిహతే" (ఛాం.ఉ. 1-11-5)

**"నిశ్చయంగా ఈ సమస్త భూతములు ప్రాణంలోనే లయమౌతున్నాయి. ప్రాణం నుండే పుడుతున్నాయి."**

(ఛాం.ఉ. 1-11-5)

## 10. జ్యోతిశ్చరణాధికరణము (10) (గాయత్రి విద్య) (మధు విద్య)

## (24) I.1.24

సూ. **జ్యోతిశ్చరణాభిధానాత్**

క్ర. **జ్యోతిః, చరణఅభిదానాత్**

ప్ర.అ జ్యోతిః = **జోతిస్సుకు,** చరణఅభిధానాత్ = **నాలుగు చరణము లున్నవని చెప్పబడినందున**

వి. ఛాందోగ్యపనిషత్తులో గాయత్రి గురించి చెప్తుతూ

**"గాయత్రీవా ఇదం సర్వం"** (ఛాం.ఉ. 3-12-1)

"ఇది అంతయు గాయత్రియే" అని అనబడినది."

మరల **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** (ఛాం.ఉ. 3-14-1) అని తెలుపబడినది.

(ఇదం సర్వం అనేది బ్రహ్మముకు మరియు గాయత్రికి అన్వయము అని గమనించాలి.)

స్థూలమైన గాయత్రీ నామముతో, గాయత్రీ ఛందముతో, మంత్రముతో, సూక్ష్మమైన మరియు మహత్తు ఐన బ్రహ్మము చెప్పబడినది.

అట్టి గాయత్రీ నామముతో బ్రహ్మమునకు చిత్తము అర్పించవలయునని అర్థము. దీనివలన గాయత్రిగా వెలుగుతున్నది బ్రహ్మ చైతన్యమని తెలుస్తున్నది.

ఇంకా **"సైషాచతుష్పదాషడ్విధా గాయత్రీ తదేతదృచాభ్యసూక్తమ్"** (ఛాం.ఉ. 3-12-4)

"ఈ ప్రశస్తమైన గాయత్రి బ్రహ్మము నాలుగు పాదములుగాను, ఆరు విధములుగా తెలుపబడినది." అని వెంటనే

**"తావానస్య మహిమా తతోజాయాంశ్చ పురుషః**

**పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదాఽస్యామృతందివి"** (ఛాం.ఉ. 3-12-6)

"గాయత్రి బ్రహ్మము మహిమ ఇంత గొప్పది. పురుషుడు (పరబ్రహ్మము) ఇంతకంటె మహిమకలవాడు. ఈ జగత్తు, సర్వభూతములు ఈ పరబ్రహ్మము యొక్క ఒకపాదమే (నాల్గవ వంతు) మిగతా మూడు దివి యందు అమృతముగానున్నవి."

వెంటనే అదే ఛాందోగ్యోపనిషత్తులో అదే సందర్భములో

# చతుష్పదా గాయత్రి - గాయత్రి విద్య

| | | 1వ పాదము | 2వ పాదము | 3వ పాదము | 4వ పాదము |
|---|---|---|---|---|---|
| 1 | గాయత్రి | భూతము | పృథివి | శరీరము | హృదయము |
| 2 | గాయత్రి మంత్రము | తత్సవితుర్వరేణ్యం | భర్గోదేవస్య ధీమహి | ధీయోయోనః ప్రచోదయాత్ | పరోరజసిసావదోం |
| 3 | ఓంకారము | అ | ఉ | మ | • |
| 4 | వ్యాహృతులు | భూః | భువః | సువః | మహా.... సత్యం |
| 5 | అధ్యాత్మము | దేహము | మనస్సు | బుద్ధి | ఆత్మ |
| 6 | ఆత్మ | వైశ్వానరుడు | తైజసుడు | తేజోముఖుడు | తురీయము |
| 7 | బ్రహ్మము | సత్యము | జ్ఞానము | అనంతము | ఆనందము |

(ఛాం.ఉ. 3-12-1, 3-14-1, 3-12-6, 3-13-7) బ్ర.సూ. (24) I-1-24, (25) I-1-25, (26) I-1-26, I-1-27

# షడ్విధా గాయత్రి - మధు విద్య

| | సమయము | రూపము | వర్గము | అమృతము | అనుభవించు వారు |
|---|---|---|---|---|---|
| 1 | ఉదయము | అరుణ రూపము | నల్లని-ఎరుపు-తెలుపు | మొదటి అమృతము | వసువులు |
| 2 | మధ్యాహ్నము | సూర్య రూపము | తెలుపు | రెండవ అమృతము | రుద్రులు |
| 3 | సాయంత్రము | వరుణ రూపము | తెలుపు-ఎరుపు-నల్లని | మూడవ అమృతము | ఆదిత్యులు |
| 4 | రాత్రి | సోమ రూపము | నల్లని | నాల్గవ అమృతము | మరుత్తులు |
| 5 | లోపల | అంతర రూపము | వర్ణ రహితము | ఐదవ అమృతము | సాధ్యులు |
| 6 | అంతట | పరమ రూపము | సర్వ వర్ణములు | ఆరవ అమృతము | బ్రహ్మ జ్ఞానులు |

**(ఛాం.ఉ. 3-1-1 నుండి 3-11-6 వరకు) బ్ర.సూ. (24) I-1-24, (25) I-1-25, (26) I-1-26, I-1-27**

**ఈ మధు విద్యను బ్రహ్మ తన ప్రథమ పుత్రుడగు ఉద్దాలక ఆరుణి మునికి బోధించెను.**

"అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు అనుత్తమేషూత్తమేషు లోకేష్విదం వావ తద్యదిదమస్మిన్నంతః పురుషే జ్యోతిః" (ఛాం.ఉ.3-13-7)

"ఏ పరమజ్యోతి స్వర్గముకు పైన, అన్నింటికంటె పైన, విశ్వమునకు పైన, ఉత్తమ లోకములలోను, అనుత్తమ లోకములలోను అంతటను దీపించుచున్నదో (వెలుగుచున్నదో, ప్రకాశించుచున్నదో) ఆ జ్యోతియే ఈ పురుషుని (మనుజుని) శరీరము లోపల కూడ వెలుగుచున్నది."

**ఈ విధముగా గాయత్రి మహిమను తెలుపుచు గాయత్రికి నాలుగు పాదములు వున్నవని తెలుపబడినది.**

**తరువాత పురుషుని (పరబ్రహ్మము) యొక్క మహిమ ఇంకా గొప్పది అని తెలిపి పురుషుని ఒక పాదము మాత్రమే జగత్తు అని మూడు పాదములు దివిన వున్నవని అనబడినది. తరువాత అదే సందర్భములో పరబ్రహ్మము స్వర్గము కంటె, అన్నింటికంటె, సర్వవిశ్వము పైన వున్న పరమజ్యోతి అని తెలిపి, ఆ పరబ్రహ్మమే జీవుని శరీరములో వెలుగుచున్నది అని తెలుపబడినది. అందువలన జ్యోతిస్సు శబ్దము బ్రహ్మమునకే వర్తిస్తుంది.**

(ఛాం.ఉ. 3-12-1, 3-14-1, 3-12-4, 3-12-6, 3-13-7)

---

## (25) I.1.25

**సూ. ఛందోఽభిధానాన్నేతి చేన్న తథా చేతోర్పణనిగదాత్తథా హి దర్శనమ్**

**క్ర. ఛందోఽభిదానాత్, న, ఇతి, చేత్; న, తథా, చేతోర్పణనిగదాత్, తథా, హి, దర్శనమ్**

ప్ర.అ. ఛందోఽభిదానాత్ = **గాయత్రి ఛందమును గూర్చి చెబుతున్నది కావున,** న ఇతి = **కాదు,** చేత్ = **అనినన,** న = **అట్ల సరికాదు,** తథా = **ఆ ప్రకారము,** చేతోర్పణనిగదాత్ = **అచట బ్రహ్మాయందు చిత్తమును సమర్పించమని చెప్పబడినది,** తథా హి = **అట్లే,** దర్శనమ్ = **వేరుచోటుల దర్శించబడుచున్నది.**

వి. "తావానస్య మహిమా" (ఛాం.ఉ. 3-12-6) అనే వెనుకటి మంత్రం గాయత్రీ ఛందస్సును గూర్చి చెప్పుచున్నది. కావున అది బ్రహ్మమును గూర్చి చెప్పినది కాదు అని అనినచో అది సరికాదు. శ్రుతిలో గాయత్రీ ఛందస్సు ద్వారా గాయత్రియందు అనుగతమై యున్నట్టి "గాయత్రీ వా ఇదం సర్వం" అని అనబడిన బ్రహ్మమందు ఏకాగ్రం చేయాలి అని అనినందువలన, బ్రహ్మమునే చతుష్పాదములు కలిగినట్లు చెప్పబడినది.

**కాబట్టి జ్యోతిస్సు శబ్దము బ్రహ్మమునకే వర్తిస్తుంది.**

(ఛాం.ఉ. 3-12-6, ఛాం.ఉ. 3-12-6)

---

## (26) I.1.26

**సూ. భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవమ్**

**క్ర. భూతాదిపాదవ్యపదేవోపపత్తేః, చ, ఏవమ్**

ప్ర.అ. భూతాది = **భూతాదిని,** పాదవ్యపదేశోపపత్తేః = **పాదముగా చెప్పుట యుక్తము, సరియైనది,** చ

ఏవమ్ = **అందువలన కూడ పైన చెప్పినది సరియైనది.**

వి. ఛాందోగ్య ఉపనిషత్తులో గాయత్రికి భూత, పృథివి, శరీర, హృదయ రూపములగు నాలుగు పాదములు చెప్పబడినవి. (ఛాం.ఉ. 3-12-3 నుండి ఛాం.ఉ. 3-12-9 వరకు) ఇది గాయత్రిని ఛందోవాచకముగాకాక, బ్రహ్మవాచకముగా చెప్పినపుడే కుదురును.

**కావున ఇక్కడ గాయత్రీ శబ్దముచే బ్రహ్మమే సూచించబడినది.**

(ఛాం.ఉ. 3-12-3 నుండి ఛాం.ఉ. 3-12-9 వరకు)

## (27) I.1.27

సూ. **ఉపదేశభేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్**

క్ర. **ఉపదేశభేదాత్, న, ఇతి, చేత్; న, ఉభయస్మిన్, అపి, అవిరోధాత్**

ప్ర.అ. ఉపదేశభేదాత్ = **ఉపదేశభేదము వలన,** నేతిచేత్ = **గాయత్రి బ్రహ్మవాచకము** కాదనిన = **అట్లు కాదు,** ఉభయస్మిన్ = **రెండు చోటుల,** అపి = **కూడ,** అవిరోధాత్ = **విరోధము లేనందున**

వి. ఛాందోగ్యోపనిషత్తులో
"త్రిపాదస్యాఽమృతం దివి" (ఛాం.ఉ. 3-12-6)
"ఆ బ్రహ్మము యొక్క మూడు పాదములు దివి యందు అమృతముగానున్నవి."
"యతఃపరోదివోజ్యోతిర్దీవ్యతే" (ఛాం.ఉ. 3-13-7)
"ఏ పరమజ్యోతి అన్నింటికంటే పైన దివిలో వెలుగుచున్నదో"
అని రెండు తీర్ల చెప్పబడినది.
అయితే మొదలు బ్రహ్మము గూర్చి తరువాత జ్యోతి గూర్చి వున్నందున అవి వేరు అని చెప్పరాదు.

**ఉపదేశాల భేదం వల్ల గాయత్రి బ్రహ్మ వాక్యం కాదనరాదు.** రెండు చోటుల వర్ణనములో బేధమున్నా కూడా అది శైలీభేదమే కాని వాస్తవభేదము కాదు. రెండు చోట్ల ఉపనిషత్తు యొక్క ఉద్దేశ్యముగా **గాయత్రీ శబ్దవాచ్యము, జ్యోతిశ్శబ్దవాచ్యము అయిన బ్రహ్మ సర్వోపరిధామముననున్నట్లు చూపించుటయే లక్ష్యము అని తెలిసికొనవలెను.**

(ఛాం.ఉ. 3-12-3, 3-15, 5-6)

## 11. ప్రతర్దనాధికరణము (11) (ప్రతర్దన విద్య)

## (28) I.1.28

సూ. **ప్రాణస్తథానుగమాత్**

క్ర. **ప్రాణః, తథా, అనుగమాత్.**

ప్ర.అ. ప్రాణః = **ప్రాణశబ్దము,** తథా = **ఆ ప్రకారముగా,** అనుగమాత్ = **పూర్వాపర వాక్యముల విచారణ వలన**

వి. కౌశీతకీ బ్రాహ్మణోపనిషత్తులో ఇలా వున్నది.

"ప్రాణమే బ్రహ్మము. ప్రాణబ్రహ్మమును పైంగ్య అని పలుకుదురు. ఈ ప్రాణబ్రహ్మము అంతర్యామిగానున్నది. వాక్కును పలికించుచున్నది. నేత్రమును ప్రకాశింపచేయుచున్నది. శ్రోత్రమును స్పందింపచేయుచున్నది. మనస్సును ప్రాణవంతముచేయుచున్నది. అనగా సర్వమూ ప్రాణ బ్రహ్మమే" (కౌశీ.ఉ. II-2)

అదే కౌశీతకీ బ్రాహ్మణోపనిషత్తులో తరువాత ఇలా వున్నది. ఇంద్రుడు తనతో యుద్ధము చేయవచ్చిన దైవోదాసి ప్రతర్దనుని ఒక వరము కోరుకొనుమని అనినాడు. ప్రతర్దనుడు మానవులకు మేలైనది, తానే నిర్ణయించి అదియే ఈయమని అనినాడు. ఇంద్రుడు జ్ఞానబోధ చేస్తూ "మామేవ విజానీహి" (కౌశీ.ఉ. 3-1)

"నన్నుయే తెలుసుకొనుము" అని చెప్పి

"సహోవాచ ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృత మిత్యుపాస్స్వాయుః" (కౌశీ.ఉ. 3-2)

ఇంద్రుడిట్లనెను. "నేను ప్రాణాత్మను మరియు ప్రజ్ఞాత్మను కూడ. అందువలన ఆయువుగా అమృత మూర్తిగా నన్ను ఉపాసించుము."

ఇంకా ఇంద్రుడిట్లా చెప్పినాడు.

"ప్రాణశ్వాసలు నిరంతరము అనంత ప్రాణములో కలియుచున్నవి అని కొందరు చెప్పుచున్నారు. ప్రాణ చైతన్యము ప్రధానతత్త్వము" (కౌశీ.ఉ. 3-2).

సందర్భాన్ని బట్టి అర్థము గ్రహించటము యుక్తము. ఇంద్ర ప్రతరర్దనుల సంవాదములోని ప్రాణం అనే శబ్దమును, పూర్వాపర వాక్యాలను విచారణ చేసి, శబ్దార్థాలను సమన్వయం చేస్తే, **ప్రాణశబ్ధమునకు ప్రాణవాయువనియో, ఇంద్రుడనియో, జీవాత్మయనియో చెప్పుట తగదు. ఇచటి ప్రాణశబ్దము బ్రహ్మమునకే వర్తిస్తుంది. అట్లు ప్రాణము బ్రహ్మము.**
(కౌశీ.ఉ.2-2, 3-1, 3-2; ముం.ఉ.2-2-9; శ్వే.ఉ.3-8)

## (29) I.1.29

**సూ.** **న వక్తురాత్మోపదేశాదితి చేదధ్యాత్మసంబంధభూమా హ్యస్మిన్**

**క్ర.** **న, వక్తుః, ఆత్మోపదేశాత్, ఇతి, చేత్, అధ్యాత్మసంబంధభూమా, హి, అస్మిన్**

**ప్ర.అ.** న = **కాదు,** వక్తుః = **వక్తయైన ఇంద్రుని యొక్క ఉద్దేశ్యము,** ఆత్మోపదేశాత్ = **తాను చెప్పదలచిన ఉపదేశము ప్రాణశబ్దము వలన,** ఇతిచేత్ = **అని చెప్పినచో,** హి = **ఎందుకనగా,** అస్మిన్ = **ఈ ప్రకరణమునందు,** అధ్మాత్మాసంబంధభూమా = **అధ్మాత్మ సంబంధమనియే బహు సమ్మతము.**

**వి.** **ఈ ప్రకరణమున వక్తయైన ఇంద్రుడు తనను గూర్చియే ప్రాణశబ్దముచే చెప్పుచున్నాడు. అందువలన ప్రాణశబ్దమునకు ఇంద్రుడని చెప్పవలయును అని అనుట సరియైనది కాదు.** ఎందుకంటే ఈ ప్రకరణంలో అధ్యాత్మసంబంధమైన వర్ణన చేయబడినది. అధిదైవికము కాదు. అందువలన **ఉపాస్యరూపముగా చెప్పబడిన తత్త్వము ఇంద్రుని గూర్చి కాదు. కావున ప్రాణశబ్దము బ్రహ్మమే.** (కౌషీ.ఉ. 3-1, 3-2; బృ.ఉ. 4-5-19

## (30) I.1.30

**సూ. శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్**

**క్ర. శాస్త్రదృష్ట్యా, తు, ఉపదేశః, వామదేవవత్**

ప్ర.అ. శాస్త్రదృష్ట్యా = **శాస్త్రదృష్టితోన,** తు = **అయితే,** ఉపదేశః = **ఇంద్రుడు ప్రాణ శబ్దముచే తనను గురించి చెప్పుట,** వామదేవవత్ = **వామదేవునివలె**

వి. బృహదారణ్యకములో వామదేవుడు "'నేనే బ్రహ్మమును' అని భావించి సర్వస్వరూపములు పొందెను." (బృ.ఉ.I-4-10) అని చెప్పబడినది. అట్లే ఇంద్రుడు కూడా "మామేవ విజానీహి' (కౌషీ.ఉ.III-1) (నన్నే-ఆత్మనైన నన్నే తెలుసుకొనుము) అని ఉపదేశించటం శాస్త్రదృష్ట్యా బ్రహ్మమును గూర్చి భోదించినాడనుట సముచితము అవుతుంది.

**కావున ప్రాణశబ్దం బ్రహ్మపరము అని భావము.**

(బృ.ఉ.I-4-10), (కౌషీ.ఉ.III-1,III-2,III-8)

## (31) I.1.31

**సూ. జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేన్నోపాసాత్రై విధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్**

**క్ర. జీవముఖ్యప్రాణలింగాత్, న, ఇతి, చేత్, న, ఉపాసాత్రైవిధ్యాత్, ఆశ్రితత్వాత్, ఇహ, తద్యోగాత్**

ప్ర.అ. జీవముఖ్యప్రాణలింగాత్ = **జీవుని యొక్కయు, ముఖ్యప్రాణము యొక్కయు లింగము వలన (జ్ఞాపనం, తెలియచేయటం వలన), ప్రాణశబ్దము,** న = **బ్రహ్మవాచకము కాదు,** ఇతి = **అని,** చేత్ = **అనినచో,** న = **అది సరికాదు,** ఉపాసాత్రైవిధ్యాత్ = **మూడు రకముల ఉపాసనలు సంభవించుట వలన,** ఆశ్రితత్వాత్ = **ఆ సర్వలక్షణములు బ్రహ్మమునే ఆశ్రయించుట వలన,** ఇహ తద్యోగాత్ = **ఇక్కడ ఆ బ్రహ్మలక్షణముల యోగము ఉండుట వలన**

వి. **జీవుని యొక్కయు, ముఖ్యప్రాణం యొక్కయు లింగము వలన** (తెలియచేయటము వలన) **పరబ్రహ్మమనే అర్థం కాదు అని అనతగదు.** మూడు రకాల ఉపాసనలు ఒకేసారి చెప్పరాదు. (జీవలింగం, ముఖ్యప్రాణలింగం, బ్రహ్మము) ప్రాణమనే పదానికి "అతః ఏవప్రాణః" అన్నచోట పరబ్రహ్మ అనే అర్థం వుండటం వలన, ఈ సందర్భములో లింగము (హేతువు) వున్నందువలన **ముఖ్య ప్రాణము, బ్రహ్మము ఒకటే అయినందున రెండు రకాల ఉపాసనలే ఉంటాయి. అది సమంజసము. కావున ప్రాణశబ్దానికి పరబ్రహ్మమనే అర్థమే తీసుకోవాలి.**

(కఠ.ఉ. 2-5-5)

ఇట్లు

**ప్రథమాధ్యాయ ప్రథమ పాదము**

# I.1. ప్రథమాధ్యాయ ప్రథమ పాద సమాసము
## స్పష్ట బ్రహ్మలింగ వాక్యముల విచారణ

**1. జిజ్ఞాసాధికరణము**

బ్రహ్మమును గూర్చి జిజ్ఞాస, విచారణ అవసరము.

**2. జన్మాద్యధికరణము**

బ్రహ్మము ఈ జగమునకు జన్మ, స్థితి, లయములకు మూలము మరియు కారణము.
బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతము మరియు ఆనందము

**3. శాస్త్రయోనిత్వాధికరణము**

సర్వజ్ఞత కలిగిన బ్రహ్మము శాస్త్రములకు మూలము.

**4. సమన్వయాధికరణము**

బ్రహ్మమును గూర్చి చెప్పిన వేదాంత వాక్యముల సమన్వయము ద్వారా, పరస్పర విరోధము లేని ఏకాభిప్రాయము వలన, ఆ బ్రహ్మమును గూర్చి తెలిసికొనవచ్చును.

**5. ఈక్షత్యధికరణము**

ప్రధానము జగత్తునకు కారణము కాదు. ప్రధానము అచేతనము. బ్రహ్మముయే చేతనము.

**6. ఆనందమయాధికరణము**

ఆనందమయ పురుషుడు బ్రహ్మమే. జీవుడు కాని, ప్రధానము కాని ఆనందమయుడు అన్నదానికి అర్థము కాదు.

**7. అంతరధికరణము**

ఆదిత్యమండలములోని పురుషుడు, అక్షిస్థపురుషుడు బ్రహ్మమే.

**8. ఆకాశాధికరణము**

ఆకాశము పరబ్రహ్మవాచకము.

**9. ప్రాణాధికరణము**

ప్రాణము అనగా బ్రహ్మము.

**10. జ్యోతిశ్చరణాధికరణము**

జ్యోతిస్సు అనగా బ్రహ్మము.

**11. ప్రతర్దనాధికరణము**

ప్రాణశబ్దము బ్రహ్మపరము.

ఇట్లు

ప్రథమాధ్యాయ ప్రథమపాద సమాసము

# ప్రథమాధ్యాయ ప్రథమ పాద సారము

## స్పష్ట బ్రహ్మలింగ వాక్యముల విచారణ

జిజ్ఞాస చేయవలసినది, ఈ జగమునకు జన్మ, స్థితి, లయములకు మూలము, కారణము మరియు సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము. సర్వజ్ఞత కలిగి సర్వశాస్త్రములకు మూలము, సర్వవేదాంతవాక్యముల లక్ష్యము మరియు గమ్యము, మూలచైతన్యము, ఆనందమయము, ఆదిత్యమండల పురుషుడు మరియు అక్షిస్థపురుషుడు, ఆకాశము, ప్రాణము, జ్యోతిస్సు మరియు ప్రాణ శబ్దార్థము అన్నియు బ్రహ్మముయే.

ఇట్లు

ప్రథమాధ్యాయ ప్రథమపాద సారము

# I.2

# ప్రథమాధ్యాయము - ద్వితీయ పాదము

## అస్పష్ట బ్రహ్మ సంబంధ వాక్యములు

### 1. సర్వత్రప్రసిద్ధ్యధికరణము (12) (శాండిల్య విద్య)

### (32) I.2.1

**సూ. సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్**

**క్ర. సర్వత్ర, ప్రసిద్ధఉపదేశాత్**

**ప్ర.అ.** సర్వత్ర = **వేదాంత వాక్యాలన్నిటియందు,** ప్రసిద్ధ = **ప్రసిద్ధంగా వున్నది,** ఉపదేశాత్ = **ఉపదేశించటం వలన**

**వి.** ఛాందోగ్యోపనిషత్తు (3.14.1)లో "సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలా నితి శాంతఉపాసీత అథఖలు క్రతుమయః పురుషోయథా క్రతురస్మింల్లోకే పురుషోభవతి తథేతః ప్రేత్య భవతి సక్రతుల కుర్వీత"

"మనోమయః ప్రాణశరీరో భారూపస్సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మాసర్వకామస్సర్వగంధ స్సర్వరసస్సర్వమిదమభ్యాత్తోఽ వాక్యనాదరః" (ఛాం.ఉ.3-14-1/2)

"నామ రూపాత్మకమగు ఈ జగత్తు అంతయును పరబ్రహ్మమే అయివున్నది. సృష్టి స్థితి లయములు ఈ బ్రహ్మమునందే కలుగుచున్నవి. కావున శాంతముతో బ్రహ్మమునుపాసించవలెను. పరమాత్మ యజ్ఞమయుడు. ఈ లోకములో మానవుడు ఎట్టి పుణ్యకర్మలు చేయునో, అందుకు తగిన పుణ్యలోకములను మరణము తరువాత పొందుచున్నాడు."

"ఆ బ్రహ్మము మనోమయుడు, ప్రాణశరీరుడు, మహాకాంతి రూపుడు, సత్యసంకల్పుడు, ఆకాశమే ఆత్మగా కలవాడు. సర్వకర్మలు, సర్వకామములు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు బ్రహ్మమే. బ్రహ్మము వాక్కు మొదలైన ఇంద్రియములు లేక యుండియు సర్వేంద్రియ కార్యములు చేయువాడు." అని చెప్పబడినది.

**ఉపనిషత్తు వాక్యాలన్నింటియందు జగత్కారణమని ప్రసిద్ధినందిన బ్రహ్మము గూర్చి ఇక్కడ ఉపదేశించటము వలన "సర్వంఖల్విదం బ్రహ్మ" అని ఉపాస్యము పరమాత్మయైన బ్రహ్మము అని అర్థము, భావము.**

(ఛాం.ఉ.3-14-1, 3-14-2)

### (33) I.2.2

**సూ. వివక్షితగుణోపపత్తేశ్చ**

**క్ర. వివక్షిత, గుణోపపత్తేః, చ**

**ప్ర.అ.** వివక్షిత = **ఉద్దేశింపబడిన,** గుణ = **గుణముల,** ఉపపత్తేః = **అన్వయత్వము వలన,** చ = **ఆ ప్రకారంగా**

వి. **ఉపనిషత్తుల ద్వారా ఉపాసన కోసం ఉద్దేశించబడ్డ గుణములు అయిన సత్య సంకల్పత్వము, భారూపత్వము మొదలైనవి బ్రహ్మముయందు చక్కగా వర్తిస్తాయి.**

"యఆత్మాఽపహత పాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్యకామ స్సత్యసంకల్పస్సోఽన్వేష్టవ్యస్స విజిజ్ఞాసితవ్య స్స సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్యస్తమాత్మనః మను విద్య విజానాతీతి హ ప్రజాపతి రువాచ" (ఛాం.ఉ. 8-7-1)

"ఆత్మ పాపరహితమైనది, ముసలి తనము లేనిది, మరణములేనిది, సత్యసంకల్పమును అయివున్నది. అట్టి ఆత్మను శ్రద్ధగా వెతికి తెలిసికొనవలెను. ఈ రీతిగా తెలిసికొన్నవాడు, అన్ని లోకములను, అన్ని కోరికలను పొందుచున్నాడని ప్రజాపతి చెప్పెను."

ఇట్లు దేవతలకు, అసురులకు ప్రజాపతి చెప్పెను.

దేవతలనాయకుడు ఇంద్రుడు, అసురుల నాయకుడు విరోచనుడు అది తెలిసి బ్రహ్మవిద్యకొరకు ప్రజాపతి వద్దకు నమ్రతతో వేరువేరుగా వెళ్లిరి.

**కావున ఉపాస్యదైవముగా చెప్పబడినది బ్రహ్మము తప్ప అన్యము కాదు.**

(ఛాం.ఉ. 8-7-1)

## (34) I.2.3

సూ. **అనుపపత్తేస్తు న శారీరః**

క్ర. **అనుప పత్తేః, తు, న, శారీరః**

ప్ర.అ. అనుపపత్తేః = **శ్రుతిలో వర్ణింపబడిన గుణము లేక పోవుట వలన,** తు = నే, శారీరః = **జీవాత్మ,** న = **ఉపాస్యదైవము కాజాలదు.**

వి. **ఉపాసనకోసం ఉపనిషత్తులలో చెప్పబడిన సత్యసంకల్పాది గుణములు జీవుని యందు సమన్వయము కానందున శారీరుడు, జీవుడు, ఉపాస్యుడు కాదు. బ్రహ్మమే ఉపాస్యుడు.**

## (35) I.2.4

సూ. **కర్మకర్తృవ్యపదేశాచ్చ**

క్ర. **కర్మ, కర్తృ, వ్యపదేశాత్, చ**

ప్ర.అ. కర్మ = **ఉపాసనకర్మ,** కర్తృ = **ఉపాసనకర్త,** వ్యపదేశాచ్చ = **చెప్పబడుట వలన కూడ**

వి. చాందోగ్యోపనిషత్తులో ఇలా ఉంది.

"ఏష మ ఆత్మాంతర్హృదయ ఎతద్బ్రహ్మ,
ఎతమితఃప్రేత్యాభిసంభవితాఽస్మీతి" (ఛాం.ఉ. 3-14-4)

"నా హృదయమందున్నదియే ఆత్మ, ఇదియే బ్రహ్మము

శరీరము నుండి విముక్తి చెంది ఆ పరమాత్మను పొందుతాను." అనే శ్రుతివాక్యం వలన జీవుడు

ఉపాస్యుడుకాడని, జీవుడు ఉపాసకుడని, ఉపాస్యదైవము మనోమయాది గుణవిశిష్టుడైన పరబ్రహ్మమని తెలిసికొనవలెను.

**ఉపాస్యదైవము యొక్క ప్రాప్తిక్రియ సంబంధమైన కర్మ చేయుటకు యోగ్యుడైన కర్తగా చెప్పబడుటచేత గూడ జీవాత్మ, ఉపాస్యము కానేరదు.**

(ఛాం.ఉ. 3-14-3, 3-14-4)

---

## (36) I.2.5

**సూ. శబ్దవిశేషాత్**

**క్ర. శబ్దవిశేషాత్**

**ప్ర.అ.** శబ్ద = **ఉపాస్య ఉపాసక శబ్దముల,** విశేషాత్ = **బేధము వలన**

**వి. ఉపాస్య ఉపాసకులకు సంబంధించి శబ్దముల బేధము వలన ఉపాస్యుడు జీవుడు కాదని తెలియుచున్నది.** పై సూత్రము (35) I-2-4లో ఏషః, ఆత్మా, బ్రహ్మ అను ప్రథమాంత శబ్దములు ఉపాస్య దేవునకు ఉపయోగించబడినవి. "మే" (నాయొక్క) అను షష్ఠ్యంత్య శబ్దము ఉపాసకునకు ఉపయోగించబడినది.

**అట్లు ఉపాసకుడు జీవుడని ఉపాస్యుడు బ్రహ్మమని తేటతెల్లమగుచున్నది.**

(ఛాం.ఉ.3-14-3, 3-14-4)

---

## (37) I.2.6

**సూ. స్మృతేశ్చ**

**క్ర. స్మృతేః, చ**

**ప్ర.అ.** స్మృతేః = **స్మృతి వలన,** చ = **కూడా**

**వి.** స్మృతియైన భగవద్గీతలో చెప్పిన దానివలన కూడ జీవుడు, బ్రహ్మల భేదం చూపబడినది. కావున బ్రహ్మయే ఉపాస్యుడు.

భగవద్గీతలో
"ఈశ్వరః సర్వభూతానాం, హృద్దేశే అర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతానాం, యంత్రారూఢాని మాయయా ॥" (భ.గీ. 18-61)

"సర్వభూతములకు ఈశ్వరుండైనవాడు
అర్జున! హృద్దేశమందు యుండి
సర్వభూతముల భ్రమియింపచేయు
యంత్రా రూఢుడగుచు మాయతోడ"

**ఈ విధముగా స్మృతి కూడా జీవబ్రహ్మల బేధము చూపిస్తుంది.**

## (38) I.2.7

**సూ. అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న**
**నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ**

**క్ర. అర్భకఓకస్త్వాత్, తత్‌వ్యపదేశాత్, చ, న, ఇతి, చేత్;**
**న, నిచాయ్యత్వాత్, ఏవం, వ్యోమవత్, చ**

ప్ర.అ. అర్భకౌకస్త్వాత్ = **ఉపాస్యదేవుడు హృదయాంతరమున సూక్ష్ముడగుట వలన,** తద్వ్యపదేశాత్ = **అట్లు చెప్పబడినందువలన,** చ = **కూడ,** న = **అతడు బ్రహ్మ కాదని,** ఇతిచేత్ = **అనినచో,** న = **అది సరికాదు,** నిచాయ్యత్వాత్ = **అతడు హృదయమందు దృష్టవ్యుడై యున్నాడు,** ఏవం = **అందువలన అట్లు చెప్పబడినది,** వ్యోమవత్ = **ఆకాశమువలె అతడు సర్వవ్యాపకుడైవున్నాడు.**

వి. **"ఈ నా హృదయకమలములో వున్న ఆత్మ ధాన్యపుగింజకంటే, ఆవగింజకంటే, చామగింజకంటే, చామబియ్యపుగింజకంటే సూక్ష్మమైనది. ఈ నాఆత్మ భూమికంటే, అంతరిక్షముకంటే, ద్యులోకముకంటే, ఈ అన్నిలోకాలకంటే గొప్పది శ్రేష్ఠమైనది".** (ఛాం.ఉ. 3-14-3)

గొప్పదైన పరమాత్మ చిన్నదైన హృదయంలో వున్నాడంటే; చిన్నగా వున్నది జీవుడు, గొప్పగా వున్నది పరమాత్మ అని అంటే, అది సరికాదు. ఆకాశం భూమినంతా ఆవరించి కూడా, సూదిమొనలోకూడా వుంటుంది. పెద్ద ఏనుగు చిన్న అద్దంలో వున్నట్లు, పరమశివుడు పంచాక్షరిలో వున్నట్లు, చైతన్యమైన బ్రహ్మము అన్నిటికన్నామిన్న అయినా, అదే చైతన్యరూపములో అన్నిటికన్నా చిన్నదానిలో కూడా వుంటాడు. చైతన్యము పరిమాణాతీతము. విశ్వాకాశమునంతటా వుండే పరమాత్మ హృదయాకాశములో కూడా వున్నాడు. ఆకాశము వలె పరమాత్మ అంతటా వ్యాపించి, చేరివుంటాడు.

**కావున విశ్వాకాశములో వున్నది దేవుడు హృదయాకాశములో వున్నది జీవుడు అని అనటానికి అవకాశం లేదు. అన్ని ఆకాశములలో వుండేది దేవుడే.**

## (39) I.2.8

**సూ. సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్**

**క్ర. సంభోగప్రాప్తిః, ఇతి, చేత్; న, వైశేష్యాత్**

ప్ర.అ. సంభోగప్రాప్తిః = **అందరి హృదయములలో వుండుట వలన, చైతన్యము అగుట వలన బ్రహ్మకు సుఖదుఃఖముల భోగము కూడ ప్రాప్తించును,** ఇతిచేత్ = **అని అంటే,** న = **అది సరికాదు,** వైశేష్యాత్ = **జీవాత్మ కంటే పరమాత్మకు విశేషము వుండుట వలన.**

వి. **పరమాత్మయైన బ్రహ్మము అందరి హృదయములలో వుండుట వలన అందరి భోగానుభవం ఆ పరమాత్మకు కూడా అంటుతుంది అని అంటే అది సరియైనది కాదు.**

"సమానే వృక్షే పురుషోనిమగ్నో,
అనీశయా శోచతి ముహ్యమానః
జుష్ఠం యదా పశ్యత్యన్యమీశం
అస్యమహిమానమితి వీతశోకః" (ముం.ఉ.III-1-3) (శ్వే.ఉ.IV-7)

**ఒకే చెట్టుమీద కూర్చున్నను జీవుడైన ఒక పక్షి అజ్ఞాన మోహములో మునిగినదై దుఃఖించుచున్నది. పూజ్యుడైన రెండవ పక్షియగు ఈశ్వరుని, అతని మహిమను ఎప్పుడైతే చూచుచున్నడో మొదటి పక్షియైన జీవుడు గూడ దుఃఖము నుండి విముక్తుడగుచున్నాడు.**

జీవుడు, పరమాత్మ భిన్నమైనవారు. జీవుడు దేహమనోబుద్ధి అహంకారములతో కూడి వున్నాడు.

అందువలన జీవాత్మకు సుఖదుఃఖసంభోగము వున్నది. ఆ అంటు వదలినప్పుడు జీవుడు సమ్యక్జ్ఞానమంది జీవన్ముక్తి చెంది జీవాత్మ పరమాత్మ ఒకటి అవుతుంది. అప్పుడు జీవాత్మకు కూడా సంభోగము, కర్తృత్వము, భోక్తృత్వము వుండవు. పరమాత్మకు ఎవరి దేహమనోబుద్ధి చిత్తాహంకారాములతో అంటులేదు. కనుక పరబ్రహ్మకు ఏ సంభోగప్రాప్తి లేదు. 'ఆకాశము నలుపు' అని అనేది మిథ్యాజ్ఞానము. 'పొగ నలుపు', 'ఆకాశము స్వచ్ఛము' అనేది సమ్యక్జ్ఞానము.

**జీవాత్మకు సుఖదుఃఖముల అంటు, సంభోగము ఉన్నది. కాని పరమాత్మకు సుఖదుఃఖముల అంటులేదు. సంభోగప్రాప్తి కూడ లేదు.**

(బృ.ఉ.3-7-23, ముం.ఉ.III-1-3, శ్వే.ఉ.IV-7)

## 2. అత్త్రధికరణము (13)

## (40) I.2.9

సూ. **అత్తా చరాచరగ్రహణాత్**

క్ర. **అత్తా, చరాచరగ్రహణాత్**

ప్ర.అ. అత్తా = **భోక్త,** చరాచర = **చరఅచరములు,** గ్రహణాత్ = **గ్రహించుట వలన**

వి. **స్థావరజంగమాత్మకమైన ఈ ప్రపంచాన్ని గ్రహించి లీనంచేసుకొనేది, ఆ విధంగా అన్నిటినీ భుజించేది పరమాత్మయైన, పరబ్రహ్మయైన బ్రహ్మము సర్వభోక్త.**

"యస్యబ్రహ్మాచక్షత్రంచ, ఉభేభవతి ఓదనః,
మృత్యుర్యస్యోపసేచనంచ, క ఇత్థావేద యత్రసః"
(కఠ.ఉ. 1-2-25)
"ఎవరికి బ్రహ్మ, క్షత్రియ జాతులు రెండును అన్నమగుచున్నవో, మృత్యువు ఊరగాయ అగుచున్నదో, ఆ ఆత్మ ఎచటనున్నదని ఎవరు తెలుసుకొనగలరు?"
**కావున పరబ్రహ్మము సర్వబోక్త**
(కఠ.ఉ. 1-2-25)

## (41) I.2.10

**సూ. ప్రకరణా చ్చ**

**క్ర. ప్రకరణాత్, చ**

**ప్ర.అ.** ప్రకరణాత్ = **ప్రకరణము వలన**

**వి.** కఠోపనిషత్తులో పరమాత్మ వర్ణనము, మహాత్మ్యములో, మృత్యువు పరమాత్మకు ఊరగాయ అని చెప్పబడినది. (బ్ర.సూ. 1-2-9)

**కావున బ్రహ్మమే సర్వభోక్త.**

(కఠ.ఉ. 1-2-14, 15, 18, 25)

## 3. గుహాప్రవిష్టాధికరణము (14)

## (42) I.2.11

**సూ. గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్**

**క్ర. గుహామ్, ప్రవిష్టౌ, ఆత్మానౌ, హి, తద్దర్శనాత్**

**ప్ర.అ.** గుహాం = **గుహను,** ప్రవిష్టౌ = **ప్రవేశించిన,** ఆత్మానౌ = **జీవాత్మ, పరమాత్మలు,** హి = **కదా,** తద్దర్శనాత్ = **శ్రుతులలో కనిపించుట వలన**

**వి.** "ఋతంపిబంతౌ సుకృతస్యలోకే
గుహాంప్రవిష్టౌ పరమే పరార్ధే
ఛాయా తపౌ బ్రహ్మవిదోవదంతి" (కఠ.ఉ. III-3-1)

"ఆ పరమాత్మకు స్థానమైన హృదయ కుహరములో కూర్చుని తమ పుణ్య ఫలాన్ని అనుభవించేవారు ఇద్దరున్నారు. బ్రహ్మవిదులు వారిద్దరినీ వెలుగు నీడలని చెప్పుచున్నారు."

**హృదయమనే గుహను ప్రవేశించి ఉన్నారని ఉపనిషత్తులో చెప్పబడిన ఆ ఇద్దరు జీవాత్మ పరమాత్మలు, నీడ ఎండల వంటివారు.**

పరమాత్మ సర్వజ్ఞుడు, జీవాత్మ అల్పజ్ఞుడు. ఆ అల్పజ్ఞానము కూడా పరమాత్మనుండి వచ్చినదే. నీడపై కనిపించే వెలుగులాగ జీవాత్మకు ఛాయాపురుషుడని పేరు కలదు. ఇద్దరు అనే సంఖ్య వచ్చినపుడు, అది ఒకే సంఖ్య, ఒకే రకమైన వారి గురించి చెప్పినపుడు అందరిని కలిసి ఒక సంఖ్యలో చెబుతారు కదా! అన్నివైపుల నుండి పూర్తి వెలుగు వస్తే నీడలేకుండా పోయి వెలుగే వుంటుంది కదా!

**జీవునికి పూర్ణజ్ఞానము వచ్చినపుడు అదే జీవాత్మ పరమాత్మగా తెలియబడుతుంది.**

(కఠ.ఉ. 1-3-1)

## (43) I.2.12

**సూ. విశేషణా చ్చ**

**క్ర. విశేషణాత్, చ**

**ప్ర.అ.** విశేషణాత్ = **వేరు వేరు విశేషణములు చెప్పబడినందున,** చ=**కూడ**

**వి.** ఆత్మను రథికునిగాను, శరీరాన్ని రథముగాను ఉపనిషత్తులో పోల్చబడినది.

"ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవచ
బుద్ధింతు సారథిం విద్ధి, మనః ప్రగ్రహమేవచ"

"ఇంద్రియాణి హయానాహు ర్విషయాంస్తేషుగోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం, భోక్తేత్యాహుర్మనీషిణః" (కఠ.ఉ.I-3-3/4)

"ఆత్మను రథికునిగా తెలిసికొనుము. శరీరమును రథముగా, బుద్ధిని సారథిగా, మనస్సును పగ్గములుగా, ఇంద్రియములను అశ్వములుగా, విషయములను అశ్వముల గోచరములుగా కూడ తెలిసికొనుము.

ఆత్మను దేహేంద్రియ మనస్సులతో కూడియున్నపుడు భోక్త అని మనీషులు అనెదరు."

"యస్త్వవిజ్ఞాన వాన్భవత్యయుక్తేన మనసా సదాః
తస్యేంద్రియాణ్యవశ్యాని, దుష్టాశ్వాఇవసారథే"

"యస్తు విజ్ఞాన వాన్భవతి యుక్తేన మనసా సదాః
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వాఇవసారథే" (కఠ.ఉ.I-3-4/5)

"విజ్ఞానము లేక ఆయుక్తమైన మనస్సు కలిగిన వాని ఇంద్రియములు, పగ్గముల అదుపులో లేని మరియు సారథి వశములో లేని దుష్టాశ్వముల వలె వుండును."
(అట్టి సారథి, రథికుడు గమ్యము చేరలేరు)

"విజ్ఞాన వానుడై యుక్తమైన మనస్సు కలిగిన వాని ఇంద్రియములు, పగ్గముల అదుపులో వుండి మరియు సారథి వశములో వున్న మంచి అశ్వముల వలె వుండును."
(అట్టి సారథి, రథికుడు గమ్యము చేరగలరు)

"విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః
సోఽధ్వనః పారమవాప్నోతి తద్విష్ణోః పరమం పద" (కఠ.ఉ.III-3-9)

"ఎవరికి విజ్ఞానమను సారథి, స్వాధీనములో వున్న మనస్సు అనే కళ్లెమును వుండునో అతడు జీవనమార్గము యొక్క గమ్యమైన విష్ణుపదమనే, పరమ పదమును, పరబ్రహ్మపదమును, మోక్షమును అందుచున్నాడు."

విజ్ఞానాత్మను రథికునితో ఎందుకు పోల్చారనగా అతడు సంసారానికీ, మోక్షానికి వెళ్ళేవాడు కనుక. జీవుడు సంసార మార్గాన్ని దాటి పరమపదమైన ఆవలి ఒడ్డును పొందుతాడు అని ఉపనిషత్తులో చెప్పబడినది. పరమపదమనేది పరమాత్మకు విశేషణము.

**ఆ విధంగా గంతవ్యుడు-గంత అనబడినవారు పరమాత్మ-జీవాత్మలు. ఈ రీతిగా గుహలోవున్న ఇద్దరు పరమాత్మ జీవాత్మలు.**

(కఠ.ఉ.1-3-3, 1-3-9)

## 4. అన్తరాధికరణము (15) (ఉపకోశల విద్య)

## (44) I.2.13

**సూ. అంతర ఉపపత్తేః**

**క్ర. అంతరః, ఉపపత్తేః**

ప్ర.అ. అంతరః = **నేత్రమునందు,** ఉపపత్తేః = **పూర్వాపర ప్రసంగమువలన ఇది ఉపస్థితమగుచున్నది.**

వి. **కంటి యందు కనిపించు పురుషుడు (అక్షిస్థపురుషుడు) పరమాత్మ.**

సత్యకామ జాబాలి ఉపకోసలునితో ఇలా అన్నాడు.

"య ఏషోఽ క్షిణి పురుషోదృశ్యత ఏష ఆత్మేతి
హోవాచ ఎతదమృతమభయమేతద్బ్రహ్మ"

"ఈ కంటిలో కనిపించే పురుషుడు ఆత్మ. అతడు అమృతుడు, అభయుడు. అతడే బ్రహ్మ. (ఛాం.ఉ. 4-15-1)

"ఏష ఉ ఏవ భామనీ రేషహి సర్వేషు లోకేషు భాతి", (ఛాం.ఉ. 4-15-4)
"అతడు సర్వలోకములలో (ఆదిత్యుడు, చంద్రుడు మొదలైన లోకాలలో) వెలుగుతున్నందు వలన అతనిని "భామని" అని అన్నారు."

**కంటియందు కనిపించు అక్షిస్థ పురుషుడు బ్రహ్మమే.**

(ఛాం.ఉ. 4-10 నుండి 4-15 వరకు)

## (45) I.2.14

**సూ. స్థానాదివ్యపదేశాచ్ఛ**

**క్ర. స్థాన, ఆది, వ్యపదేశాత్, చ**

ప్ర.అ. స్థాన = **స్థాన,** ఆది = **మొదలైన (స్థానము, రూపము, నామము) వాటిని,** వ్యపదేశాత్ = **చెప్పటం వల్ల,** చ = **కూడా**

వి. **ఉపనిషత్తులలో అక్కడక్కడ ఉపాసనకోసం స్థానం, రూపం, నామం మొదలైన విశేషాలు చెప్పటం వలన కూడా, నేత్ర అంతర్వర్తి పురుషుడు బ్రహ్మమే అగుచున్నాడు.**

బృహదారణ్యక ఉపనిషత్తులో (3.7.3), (3.7.18) "ఏది భూమియందున్నదై, భూమికంటే అభ్యంతరమైనదో, పృథివి దేనిని తెలుసుకొనలేదో, పృథివి ఎవరికి దేహమో, ఏది పృథివిని

నియమించుచున్నదో, అదియే నీయొక్క అంతర్యామి రూపమైన ఆత్మస్వరూపము" అని చెప్పి పృథివి, జలము, అగ్ని, అంతరిక్షము, వాయువు, దివి, ఆదిత్యుడు, దిక్కులు, చంద్ర తారకలు, ఆకాశము, తపస్సు, తేజస్సు, సర్వభూతములు, ప్రాణము, వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు, త్వక్కు, విజ్ఞానము, రేతస్సు అని ఎన్నియో స్థానాలను బ్రహ్మ (ఆత్మ) స్థానములుగా చెప్పబడినది. కావున నేత్రాంతర్గత పురుషుడు బ్రహ్మమే.

**పరబ్రహ్మ నిర్గుణుడు. పరబ్రహ్మకు స్థాన, రూప, నామములు లేనేలేవు. కాని ఉపాసనకోసం నామ, రూప, స్థాన, వర్ణములు చెప్పబడినవి.**

(బృ.ఉ. 3-7-3 నుండి 3-7-23 వరకు)

## (46) I.2.15

**సూ. సుఖవిశిష్టాభిధానాదేవ చ**

**క్ర. సుఖవిశిష్టఅభిధానాత్, ఏవ, చ**

ప్ర.అ. సుఖవిశిష్టాభిధానాత్ = **నేత్రానువర్తియైన పురుషుడు ఆనంద యుక్తుడు అని చెప్పబడుట,** చ = **కూడ,** ఏవ = **బ్రహ్మమే**

వి. "ప్రాణము బ్రహ్మము, సుఖము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మము" అని ఉపనిషత్తుతో చెప్పబడినది. **అంటే పరబ్రహ్మ ప్రాణస్వరూపుడు. ఆ బ్రహ్మమే అక్షి(ణి)స్థ పురుషుడని కూడ చెప్పబడినది. కావున నేత్రస్థ పురుషుడు ఆనందమయుడైన బ్రహ్మమే.**

(ఛాం.ఉ. 4-10-5, 4-11-6, 4-12-7)

## (47) I.2.16

**సూ. శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ**

**క్ర. శ్రుతఉపనిషత్కగతిఅభిధానాత్, చ**

ప్ర.అ. శ్రుతఉపనిషత్క = **శ్రుతి ఉపనిషత్తులు వినువారికి,** గతి = **గతి, మార్గము,** అభిధానాత్ = **చెప్పబడినది.**

వి. ఇచట నేత్రాంతర్వర్తి పురుషుని ఎరిగినవానికి దేవలోక మార్గము, (దేవయాన మార్గము) బ్రహ్మలోకమార్గము ఐన అర్చిరాదిమార్గము లభించి జన్మరాహిత్యము కలుగును అని చెప్పబడినది. ప్రశ్నోపనిషత్తులో బ్రహ్మోపాసకులైన వారికి అత్యుత్తమస్థానము లభించి, తిరిగి మరల జన్మించరు అని చెప్పబడినది. ఆ విధంగా **నేత్రాంతర్వర్తి పురుషుని ఉపాసన (సగుణోపాసన) చేసినవారికి, బ్రహ్మోపాసకులకు ఒకే జన్మరాహిత్యస్థితి లభిస్తుంది. కావున నేత్రాంతర్వర్తి పురుషుడు పరబ్రహ్మమే.**

(భ.గీ. 8-24; ఛాం.ఉ. 4-15-5; ప్ర.ఉ. 1-10)

## (48) I.2.17

**సూ. అనవస్థితేరసంభావాచ్చ నేతరః**

**క్ర. అనవస్థితేః, అసంభవాత్, చ, న, ఇతరః**

ప్ర.అ. అనవస్థితేః = **నేత్రము యందు ఇతరమైన వాని స్థితిలేనందున,** అసంభవాత్ = **శ్రుతియందు చెప్పబడిన అమృతాది గుణములు ఏ అన్యమునందున సంభవించని కారణమున,** చ = **కూడ,** న = **కాదు,** ఇతరః = **బ్రహ్మము తప్ప మరి ఏ అన్యము.**

వి. **ఛాయాపురుషుడు కాని, ప్రతిబింబము కాని నేత్రమున నెల్లపుడు నుండవు. అమృతత్వము, నిర్భయత బ్రహ్మమునకే వర్తించును. వేరు ఎవరికి కాదు. కావున నేత్రస్థుడైన అక్షిపురుషుడు బ్రహ్మమే.**

---

### 5. అంతర్యామ్యధికరణము (16) (అంతర్యామి-ఉద్దాలక ఆరుణి విద్య)

## (49) I.2.18

**సూ. అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్**

**క్ర. అంతర్యామి, అధిదైవాదిషు, తత్ధర్మవ్యపదేశాత్**

ప్ర.అ. అంతర్యామి = **లోపల వున్నది,** అధిదైవాదిషు = **అధిదైవము, అధిభౌతికము మొదలైన వాటియందు,** తత్ = **ఆ బ్రహ్మయొక్క,** ధర్మ = **ధర్మములు,** వ్యపదేశాత్ = **చెప్పబడినందువలన**

వి. **"భూమియందుండి, భూమికి వేరుగా నుండి దేనిని భూమి తెలియలేదో, దేనికి భూమి శరీరమో, ఏది భూమిని నియమించునో, అది నీ యొక్క అంతర్యామి రూపమైన ఆత్మ, అమృతము."**
(బృ.ఉ. 3-7-3)
అదే విధముగా జలము, అగ్ని, వాయువు, ద్యులోకము, ఆదిత్యుడు, దిక్కులు, చంద్ర తారకలు, ఆకాశము, తపస్సు, తేజస్సు, సకలభూతములు, ప్రాణము, వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు, త్వక్కు, విజ్ఞానము, రేతస్సులో ఉండి దేనిని అవి తెలియదో, అవి దేనికి శరీరములో, **వాటియందునుండి వాటినే నియమించునో, అదియే అంతర్యామి, అమృతము, ఆత్మ, బ్రహ్మము.** ఈ విధముగా అంతర్యామియైన బ్రహ్మమునుగూర్చి, ఆ ధర్మములను గూర్చి బృహదారణ్యకములో ఉద్దాలక ఆరుణిమునికి యాజ్ఞవల్క్యునిచే చెప్పబడినది.
(బృ.ఉ.3-7-3)

---

## (50) I.2.19

**సూ. న చ స్మార్త మతద్ధర్మాభిలాపాత్**

**క్ర. న, చ, స్మార్తమ్, అతద్ధర్మాభిలాపాత్**

ప్ర.అ. న = **అంతర్యామి కాదు,** చ = **కూడ,** స్మార్తమ్ = **సాంఖ్యస్మృతి ద్వారా ప్రతిపాదితమైనది,** అతద్ధర్మాభిలాపాత్ = **ఇక్కడ చూపబడిన ధర్మములు లేనందున**

వి. **సాంఖ్యస్మృతిలో చెప్పబడిన జడప్రకృతి ధర్మములు అంతర్యామి కొరకు చెప్పబడలేదు మరియు అంతర్యామికి అన్వయించవు.**

పరబ్రహ్మము యొక్క ధర్మములు అంతర్యామికి వర్తిస్తాయి. కాని ప్రధానమునకు వర్తించవు. చైతన్యము, దృష్టత్వము ప్రధానమునకు లేదు.

"దృష్టికి కనిపించదు, దృష్టయై యుండును. శ్రోతకు వినిపించదు, శ్రోతయైయుండును. మనస్సుకు గోచరించదు, మంతయైవుండును. బుద్ధికి విజ్ఞాతము కాదు, విజ్ఞాతయైయుండును. ఆ అంతర్యామి ఆత్మయే. తాను దృష్ట, శ్రోత, మంత మరియు విజ్ఞాత. అదియే నీ ఆత్మ, అంతర్యామి, అమృతము. ఈ అంతర్యామి, పరమాత్మ కన్నా వేరైనది నశించుపోవుచుండును" (బృ.ఉ.3-7-23)

కనిపించకుండా చూసేది, వినబడకుండా వినేది, అనిపించబడకుండా అనుకునేది, తెలియబడకుండా తెలిసేది, అంతర్యామియైన ఆత్మయే. అదియే పరమాత్మ-పరబ్రహ్మ.

**ఈ అంతర్యామి ఆత్మయేగాని, ఆత్మకు అభిన్నంగా చూసేది, వినేది, అనుకునేది, తెలిసికొనేది వేరేదేమీ లేదు.**

(బృ.ఉ.3-7-23)

## (51) I.2.20

సూ. **శారీరశ్చోభయేఽపి హి భేదేనైనమధీయతే**

క్ర. **శారీరః, చ, ఉభయే, అపి, హి, భేదేన, ఏనం, అధీయతే**

ప్ర.అ. శారీరః = **శరీరముయందుండు జీవాత్మ,** చ = **కూడా,** న = **కాదు,** హి = **ఎందుకంటే,** ఉభయేఽపి = **మాధ్యందిన మరియు కాణ్వశాఖీయులు ఇద్దరు,** ఏనం = **ఈ జీవాత్మను,** భేదేన = **అంతర్యామి కంటే వేరుగా తలచి,** అధీయతే = **అధ్యయనం చేయుచున్నారు.**

వి. "యః ఆత్మని తిష్ఠన్" అని "ఎవరైతే ఆత్మయందు ఉండి" అని మాధ్యందినశాఖీయులు అన్నారు (శతపథబ్రాహ్మణము 14.5.30)

"యో విజ్ఞానే తిష్ఠన్" అని కాణ్వశాఖీయులు అన్నారు (బృ.ఉ. 5-7-22) "ఆత్మయందుండి" అని అన్నప్పుడు జీవుడు, "విజ్ఞానమందుండి" అని అన్నప్పుడు **శారీరుడు, అవిద్యవలన వేరనిపించును కాని, విద్య వెలిగినపుడు జీవుడు, శారీరుడు-అంతర్యామి అని తెలుస్తుంది.**
(శతపథబ్రాహ్మణ ఉ.14-5-30; బృ.ఉ. 5-7-22)

# 6. అదృశ్యత్వాధికరణము (17)

## (52) I.2.21

సూ. **అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః**

క్ర. **అదృశ్యతాదిగుణకః, ధర్మోక్తేః**

ప్ర.అ. అదృశ్యతాదిగుణకః = **అదృశ్యత్వాది గుణములు కలవాడు,** ధర్మోక్తేః = **చెప్పబడిన ధర్మముల వలన**

వి. "యస్సర్వజ్ఞః సర్వ విద్యస్య జ్ఞానమయం తపః
తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచ జాయతే" (ముం.ఉ. 1-1-9)

"ఎవరు అన్నీ తెలిసిన సర్వజ్ఞుడో, ఎవరు సర్వము సర్వదా తెలిసియుండునో, ఎవరి తపస్సు జ్ఞానమయమో ఆ పరబ్రహ్మమునుండియే సృష్టికర్తయగు కార్యబ్రహ్మ, నామరూపాత్మకమగు ఈ సమస్త ప్రపంచము, అన్నాది సర్వ ఆహారములు జనియించును."

**అదృశ్యత్వాది గుణములు, సర్వజ్ఞత్వాది ధర్మములుకలవాడు సర్వభూతయోనియైన పరమాత్మయే తప్ప, ప్రధానంగాని, జీవుడు కాని కాదు.**

(ముం.ఉ. 1-1-9)

---

## (53) I.2.22

**సూ. విశేషణభేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ**

**క్ర. విశేషణభేదవ్యపదేశాభ్యాం, చ, న, ఇతరౌ**

ప్ర.అ. విశేషణభేదవ్యపదేశాభ్యాం = **విశేషములను, భేదాన్ని చెప్పటం వలన,** చ = **కూడా,** న = **కాదు,** ఇతరౌ = **వేరిద్దరూ**

వి. "దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యంతరోహ్యజః
అప్రాణోహ్యమనాః శుభ్రోహ్యక్షరాత్పరతః పరః" (ముం.ఉ. 2-1-2)

అంగీరసుడు శౌనకునితో ఇలా అన్నాడు :

"ఆ పరబ్రహ్మము నిరాకారమై, చైతన్య స్వరూపమై బాహ్యాభ్యంతరములలో నిండినదై, పరిపూర్ణమై ప్రకాశించుచున్నది మరియు ప్రాణము లేనిదై , మనస్సులేనిదై, శుభ్రమై, అక్షరముకన్న పరాత్పరమై వెలుగుచున్నది."

దివ్యుడు, మనోహరుడు, మూర్తిరహితుడు, పురుషుడు, బాహ్యంభతరాలలో వుండేవాడు, ప్రాణరహితుడు, మనస్సులేనివాడు, పరిశుద్ధుడు అనే విశేషణములు (జీవునికి వర్తించనివి) చెప్పటము వలన మరియు పరమైన అక్షరము (ప్రధానము) కంటే **పరమైనవాడు అనే బేధము చెప్పటము వలన ఆ చెప్పబడినది భూతయోనియైన పరబ్రహ్మయే కాని జీవుడు, ప్రధానము రెండు కావు.**

(ముం.ఉ. 2-1-2)

---

## (54) I.2.23

**సూ. రూపోపన్యాసాచ్చ**

**క్ర. రూపఉపన్యాసాత్, చ**

ప్ర.అ. రూప = **రూపము,** ఉపన్యాసాత్ = **ఉపన్యాసము వలన,** చ=**కూడ**

వి. ఉపనిషత్తులో "ఆ పురుషుని నుండి ప్రాణములు, మనస్సు, అన్ని ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అన్నియు జనించుచున్నవి"(ముం.ఉ.2-1-3) అని చెప్పి, ఎవరికి ద్యులోకం శిరస్సుయో, చంద్రసూర్యులు నేత్రములో, దిక్కులు చెవులో, వేదాలు వాక్కుయో, వాయువు ప్రాణాలో, విశ్వము హృదయమో, ఎవని పాదాలనుండి ఈ పృథివి పుట్టినదో, ఎవనికి

పృథివియే పాదాలో, ఆ దైవమే 'సర్వభూతాంతరాత్మ' అని ఉపన్యాసం చేయబడింది. ఈ వికారసృష్టిని అంతనూ ఆ పరమాత్మరూపంగా చెప్పబడింది.

**ఈ రూపవర్ణనం స్వల్ప మహిమగల జీవునికి అన్వయించదు. సర్వభూతాలకు అంతరాత్మగా ఉండటం జడమైన ప్రధానానికి అన్వయించదు. కాబట్టి పరబ్రహ్మమే భూతయోని మరియు ప్రధానానికి, జీవునికి మించినది మరియు వేరైనది.**

(ముం.ఉ. 2-1-3)

## 7. వైశ్వానరాధికరణము (18) (వైశ్వానర విద్య)

### (55) I.2.24

సూ. **వైశ్వానరః సాధారణశబ్దవిశేషాత్**

క్ర. **వైశ్వానరః, సాధారణశబ్దవిశేషాత్**

ప్ర.అ. వైశ్వానరః = **పరబ్రహ్మము,** సాధారణశబ్దవిశేషాత్ = **సాధారణంగా వైశ్వానరుడు అంటే జఠరాగ్ని అయినా ఉపనిషత్తులో విశేషార్థమైన పరబ్రహ్మగా వాడబడినందున**

వి. ఛాందోగ్యోపనిషత్తులో బ్రహ్మజ్ఞాని ఐన అశ్వపతిరాజు, మహర్షి ఉద్దాలకునికి మరియు ఆయన శిష్యులు 1) ప్రాచీనశాల, 2) సత్యయజ్ఞ, 3) ఇంద్రద్యుమ్న, 4) జన 5) బుడిల అనే ఐదుగురు ఋషులతో వైశ్వానరాత్మను గూర్చి ఇలా చెప్పాడు "ఆ వైశ్వానరునకు ద్యులోకము శిరస్సు, సూర్యుడు నేత్రములు, వాయువు ప్రాణము, ఆకాశము శరీరమధ్యభాగము, జలము వస్తి స్థానము (మూత్రస్థానము), పృథివి పాదాలు, ధర్భలు రోమములు, గార్హాపత్యాగ్ని హృదయము, అన్వాహార్యవచనాగ్ని మనస్సు, ఆహవనీయ అగ్ని ముఖము" (ఛాం.ఉ. 5-18-2) ఇక్కడ విశ్వమునకు ఆత్మరూపుడైన విరాట్పురుషుని గూర్చియే వైశ్వనరాత్మగా చెప్పబడినది. కనుక **ఇచట అశ్వపతి రాజు వైశ్వానర విద్యతో పాటు ప్రాణాగ్ని హోత్ర విద్యను కూడా బోధించినాడు. వైశ్వానర శబ్దమునకు సాధారణ అర్థమైన జఠరాగ్ని కాక, పరబ్రహ్మముగా నిర్దేశించబడినది.**

(ఛాం.ఉ. 5-18-2) (ఛాం.ఉ. 5-11 నుండి 5-24 వరకు)

### (56) I.2.25

సూ. **స్మర్యమాణమనుమానం స్యాదితి**

క్ర. **స్మర్యమాణమ్, అనుమానం, స్యాత్, ఇతి**

ప్ర.అ. స్మర్యమాణమ్ = **స్మృతిలో గల విరాట్ పురుషుని రూపవర్ణనము,** అనుమానమ్ = **మూలభూత శృతివచనమునకు, అనుమానము సృజించి వైశ్వానర బ్రహ్మమనెడు నిశ్చయము చేయుచున్నందున,** ఇతి స్యాత్ = **ఇచట వైశ్వానరుడు పరమాత్మయే**

వి. **స్మృతియైన విష్ణుపురాణములో "ఎవనికి అగ్నిముఖము, ద్యులోకము శిరస్సు, ఆకాశం నాభి, భూమి పాదాలు, సూర్యుడు చక్షుస్సు, దిక్కులు శ్రోత్రాలు అయివున్నవో అటువంటి పరమాత్మకు**

# వైశ్వానర విద్య




బ్ర.సూ.(55)I-2-24, (56)I-2-25,(416)III-3-57, ఛాం.ఉ.V-18 నుండి V-24 వరకు

కేకయ రాజగు అశ్వపతిరాజు ఉద్దాలకుడు మరియు ప్రాచీనశాలుడు,
సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనుడు, బుడిలుడు, అను వారికి బోధించిన విద్య

**నమస్కారము" అని చెప్పబడినది.** (వైశ్వానరః, సాధారణ శబ్ద విశేషాత్) **24వ సూత్రములో చెప్పబడిన ఉపనిషత్తు వాక్యాన్ని, రూపాన్ని తలపింప, ఊహింపచేస్తున్నది. ఇందువలన వైశ్యానర శబ్దము పరబ్రహ్మవాచకమే.**

## (57) I.2.26

సూ. **శబ్దాదిభ్యోఽ_న్తః ప్రతిష్ఠానచ్చ నేతి చేన్న తథాదృష్ట్యుపదేశాత్ అసంభవాత్పురుషమపి చైనమధీయతే॥**

క్ర. **శబ్దాదిభ్యఃఅన్తఃప్రతిష్ఠానాత్, చ, న, ఇతి చేత్; న, తథాదృష్టి ఉపదేశాత్, అసంభవాత్, పురుషమ్, అపి, చ, ఏనమ్, అధీయతే**

ప్ర.అ. శబ్దాదిభ్యః = **అన్య శ్రుతులందు వైశ్వానరశబ్దము, గార్హపత్యాది అగ్నులకుగాను అంగమనెడు అర్థమున చెప్పబడుట చేత,** చ = **ఇంకను,** అన్తః ప్రతిష్ఠానాత్ = **శ్రుతియందు, స్మృతియందు శరీరములోపలనున్నట్లు చెప్పబడుటవలనను,** న = **వైశ్వానర శబ్దము పరబ్రహ్మవాచకము కాదు,** ఇతి చేత్ = **అని అనిన యెడల,** న = **అదిసరికాదు,** తథా దృష్ట్యుపదేశాత్ = **వైశ్వానరుని యందు బ్రహ్మదృష్టి కలుగుట కట్లు చెప్పబడుట వలనను,** అసంభవాత్ = **కేవలం జఠరాగ్ని విరాట్ స్వరూపునిగా వర్ణించుట అసంభవము కనుకను,** చ = **ఇంకను,** ఏనం = **ఈ వైశ్వానరుని,** పురుషమ్ = **పురుషునిగా పరిగణించి,** అపి = **కూడ,** అధీయతే = **పఠించుట చేతను.**

వి. ఈ ప్రకరణమున వైశ్వానరశబ్దము పరబ్రహ్మకే వాచకమగును. (భగవద్గీతలో కూడా "అహం వైశ్వానరోభూత్వా, ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపాన సమాయుక్తః, పచామ్యన్నం చతుర్విధం" (భ.గీ. 15-14) ఇక్కడ **పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణ భగవానుడు "అహంవైశ్వానరోభూత్వా" (నేను వైశ్వానరుడనగుచు) అనటం వైశ్వానరుడనే శబ్దం పరబ్రహ్మ వాచకంగా తెలుసుకోవాలి. ఈ విధముగా వైశ్వానరశబ్దము పరబ్రహ్మవాచకమే.**
(భ.గీ. 15-14; ఛాం.ఉ. 5-19-1)

## (58) I.2.27

సూ. **అత ఏవ న దేవతా భూతం చ**

క్ర. **అతః, ఏవ, న, దేవతా, భూతం, చ**

ప్ర.అ. అతః ఏవ = **పై చెప్పబడిన కారణములచేతనే,** దేవతా = **ద్యులోకాదులకు అధిష్ఠాతలైన దేవగణము,** భూతమ్ = **భూతగణము,** చ=**కూడ,** న=**వైశ్వానరశబ్దమునకు అర్థములు కావు.**

వి. **పరిమితమైన శక్తితో కూడినట్టి అగ్న్యభిమానియైన దేవతకుగాని, అటువంటి అగ్నిదేవతకు కాని, భూతాగ్నికిగాని, శ్రుతివాక్యములో చెప్పబడిన మూడు లోకాలూ శరీరమవటం (త్రైలోక్య శరీరత్వం**

**ద్యులోకము, ఆకాశము, పృథివీ) సంభవం కాదు. కాబట్టి ఈ వైశ్వానరుడు పరమాత్మ అనే గ్రహించాలి.**

(ఛాం. ఉ. 5-18-2)

## (59) I.2.28

సూ. **సాక్షాదప్యవిరోధం జైమినిః**

క్ర. **సాక్షాత్, అపి, అవిరోధం, జైమినిః**

ప్ర.అ. సాక్షాత్ = **సాక్షాత్తుగా ఇది పరమేశ్వరోపాసనం అని తలచుటలో,** అపి = **కూడ,** అవిరోధం = **విరోధములేదని,** జైమినిః = **జైమిని మహర్షి చెప్పినారు.**

వి. **జైమిని మహర్షి వైశ్వానరశబ్దము సాక్షాత్తుగా పరమాత్మ వాచకమని స్వీకరించటములో ఏమీ విరోధము లేదని చెప్పినారు.** కావున వైశ్వానరాత్మ పరమాత్మయే.

(ఛాం.ఉ. 15-18-2)

## (60) I.2.29

సూ. **అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః**

క్ర. **అభివ్యక్తేః, ఇతి, ఆశ్మరథ్యః**

ప్ర.అ. అభివ్యక్తేః = **భక్తులను అనుగ్రహించుకొరకు హృదయాది స్థానములలో, ప్రదేశములలో అభివ్యక్తము వలన,** ఇతి = **అని,** ఆశ్మరథ్యః = **ఆశ్వరథ్యుడు చెప్పుచున్నాడు.**

వి. **పరమేశ్వరుడు ఉపాసకులను అనుగ్రహించటము కోసము హృదయాది స్థానములలో అభివ్యక్తము, ప్రాకట్యము అవుతున్నాడు.** అని ఆశ్మరథ్య ఆచార్యుని మతము. ఆయన అభివ్యక్తికి ఆధారమైన స్థానాన్ని బట్టి ప్రాదేశికమాత్రుడు స్వల్ప పరిమాణముకలవానిగా చెప్పారు కాని పరమాత్మ విశ్వరూపుడే, అనంతరూపుడే. కావున **వైశ్వానర పరమాత్మ పరిమాణమునకు పరిమితము కాదు. పరిమాణము మన కొరకు మాత్రమే.**

(ఛాం.ఉ. 15-18-2)

## (61) I.2.30

సూ. **అనుస్మృతేర్బాదరిః**

క్ర. **అనుస్మృతేః, బాదరిః**

ప్ర.అ. అనుస్మృతేః = **ధ్యానము వల్ల అని,** బాదరిః = **బాదరి అనే ఆచార్యుని అభిప్రాయము**

వి. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు అపరిచ్ఛిన్నుడు, పరిమాణ పరిమితుడు కాడు (సర్వతః పాణిపాదం, సర్వతోక్షి శిరోముఖం, సహస్ర శీర్షాపురుషః). అయినను ధాన్యమును గిద్దెడు, కుంచెడు, సోలెడు

అన్నపుడు కొలత మన కొరకు, **ధాన్యము కొలతకు పరిమితము కాదు. ధ్యానము కొరకు పరమాత్మ ప్రాదేశికముగా చెప్పబడినది అని బాదరి ఆచార్యుని అభిమతము. పరబ్రహ్మ పరిమాణాతీతుడు. పూర్ణుడు.**

## (62) I.2.31

**సూ. సంపత్తేరితి జైమినిస్తథాహి దర్శయతి**

**క్ర. సంపత్తేః, ఇతి, జైమినిః, తథా, హి, దర్శయతి**

**ప్ర.అ.** సంపత్తేః = **పరబ్రహ్మ అనంత ఐశ్వర్య సంపత్తి కలవాడగుట వలన స్థాన, దేశవిదేశములతో సంబంధమున్నదనుట వలన విరోధము లేదు.** ఇతి = **అని,** జైమినిః = **జైమిని మహర్షి తలచుచున్నాడు,** హి = **ఎందుకనగా,** తథా = **అదే భావము,** దర్శయతి = **శ్రుతి కూడా చెప్పుచున్నది.**

**వి. వాజసనేయ బ్రాహ్మణములో ద్యులోకం మొదలుకొని, పృథివీ పర్యంతము, ఆ త్రైలోక్యాత్మకుడైన వైశ్వానరునికి శిరస్సు మొదలుగా పాదముల వరకు అవయములు కల్పించి చెప్పబడిన విధంగా ప్రాదేశికం చెప్పబడింది. కావున ఏ విరోధము వుండదు అని జైమిని మహర్షి అభిమతము.**

## (63) I.2.32

**సూ. ఆమనన్తి చైన మస్మిమ్**

**క్ర. ఆమనన్తి, చ, ఏనమ్, అస్మిన్**

**ప్ర.అ.** ఆమనన్తి = **పతిపాదనము చేయుచున్నారు,** చ = **కూడ,** ఏనం = **ఈ ప్రకారము,** అస్మిన్ = **ఈ వైదిక సిద్ధాంతమందు**

**వి.** జాబాల ఉపనిషత్తు ప్రకారము అనంతుడు, అవిచ్ఛిన్నుడు, అవ్యక్తుడు అయిన ఆత్మ జీవునియందు ప్రతిష్ఠితమై వున్నది. **ఆ జీవుడు దేనియందు ప్రతిష్ఠితమైవున్నాడు? వారణకు (భ్రూ), అసికి–నాసికకు (ముక్కు) మధ్యభాగంలో! సర్వపాపాలను వారించేది 'వారణ' అని, సర్వపాపాలను నశింపచేసేది 'నాసి' అని, భ్రూ–నాసికలో మధ్య భాగం 'వారణాసి' అని అది ద్యులోకానికి, పరలోకాలకు సంధి అని జాబాలోపనిషత్తులో చెప్పబడినది. అందువలన పరబ్రహ్మను ప్రాదేశమాత్రస్థితిలో భావించుటము యుక్తి యుక్తమే. కనుక ఈ ప్రకరణములోని వైశ్వానర శబ్దానికి పరమేశ్వరుడనే అర్థం చెప్పబడినది.**

(జాబాల ఉపనిషత్ – 1)

ఇట్లు

**ప్రథమాధ్యాయ ద్వితీయ పాదము**

# ప్రథమాధ్యాయ ద్వితీయ పాద సమాసము

## అస్పష్ట బ్రహ్మ సంబంధ వాక్యముల విచారణ

**1. సర్వత్రప్రసిద్ధ్యధికరణము**

ఉపనిషత్తుల ద్వారా ఎన్నో చోట్ల చెప్పబడిన ఉపాస్యదైవము బ్రహ్మమే. జీవుడు ఉపాస్యదైవము కాదు. జీవుడు ఉపాసకుడు. ఉపాస్యదైవము సూక్ష్మ స్థలమున వున్నట్లు చెప్పబడినా బ్రహ్మము సర్వవ్యాపకము, అవిచ్ఛిన్నము. బ్రహ్మము ఆవగింజకన్నా సూక్ష్మమైనది మరియు సర్వలోకముల కన్నా గొప్పది. బ్రహ్మ చిన్న కన్న చిన్న మరియు పెద్ద కన్న పెద్ద. బ్రహ్మమునకు సంభోగప్రాప్తిలేదు. జీవునకు సంభోగప్రాప్తి కలదు.

**2. అత్త్రధికరణము**

బ్రహ్మము సర్వ ప్రపంచములను గ్రహించి లీనము చేసుకొంటుంది. బ్రహ్మ సర్వభోక్త.

**3. గుహా ప్రవిష్టాధికరణము**

హృదయమైన గుహను ప్రవేశించిన ఇద్దరు పరమాత్మ జీవాత్మలు. వారు వెలుగునీడలవలె ఒకటి అయినా రెండుగా కనిపిస్తారు. అవిద్య అనే నీడ లేకుంటే ఇద్దరు ఒకటి అవుతారు.

**4. అంతరాధికరణము**

నేత్రము లోపలి అక్షిస్థపురుషుడు బ్రహ్మము. పరబ్రహ్మ స్థానాతీతుడు. ఉపాసనకోసము స్థాన, నామ, రూపాదులు చెప్పబడినవి. నేత్రస్థ పురుషుడు ఆనందమయుడు.

**5. అంతర్యామ్యధికరణము**

అంతర్యామి పరబ్రహ్మ. అన్నిటియందు వుండి వాటిని తెలిపి, వాటిచే తెలియకుండా వాటిని నియమించునది అంతర్యామి. అదియే ఆత్మ.

**6. అదృశ్యత్వాధికరణము**

అదృశ్యత్వాది గుణములు, జ్ఞాతాది ధర్మములుకలవాడు, సర్వభూతయోనియైన పరమాత్మయే. ప్రధానము కాని, జీవుడు కాని కాదు.

**7. వైశ్వానరాధికరణము**

వైశ్వానరుడు కేవలము జఠరాగ్నికాక పరబ్రహ్మమే. వైశ్వానరునికి విరాట్స్వరూపము, త్రైలోక్య శరీరత్వము కలదు. అనంతుడు, అవిచ్ఛిన్నుడు ఐన పరమాత్మ ప్రదేశమునకు, స్థానమునకు అతీతుడు. ఉపాసనకోసము ప్రదేశములు, స్థానములు, రూపములు, నామములు చెప్పినారు. సమస్త విశ్వమైన నరుడు, సమస్త జీవులకు నరుడు, సమస్త జీవులు అతనికి సంబంధించినవారు వైశ్వానరుడు. విశ్వనరుడే వైశ్వానరుడు.

ఇట్లు

**ప్రథమాధ్యాయ ద్వితీయపాద సమాసము**

# ప్రథమాధ్యాయ ద్వితీయ పాద సారము

## అస్పష్ట బ్రహ్మ సంబంధ వాక్యముల విచారణ

సర్వత్ర ప్రసిద్ధమైన ఉపాస్యదైవము, సర్వ ప్రపంచములను గ్రహించిలీనము చేసుకొనునది, హృదయగుహలో ప్రవేశించిన ఇద్దరు పరమాత్మ, జీవాత్మల మూల ఐక్యరూపము, నేత్రమందున్న అక్షిస్థపురుషుడు, అందరియందుండి నియమించు అంతర్యామి, అదృశ్యత్వాద్ది గుణములు జ్ఞాతాది ధర్మముతో కలది, వైశ్వానరుడు అన్నియు పరబ్రహ్మ వాచకములే.

ఇట్లు
ప్రథమాధ్యాయ ద్వితీయపాద సారము

I.3

# ప్రథమ అధ్యాయము - తృతీయ పాదము

## జ్ఞేయ బ్రహ్మసంబంధ వాక్య విచారణ

## 1. ద్యుభ్వాద్యధికరణము (19)

### (64) I.3.1

**సూ. ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్**

**క్ర. ద్యు, భూ, ఆది, ఆయతనం, స్వశబ్దాత్**

**ప్ర.అ.** ద్యు = **స్వర్గము,** భూః = **భూమి, పృథివి;** ఆది = **మొదలైన వానికి,** ఆయతనం = **ఆధారము,** స్వ = **తన (ఆత్మ),** శబ్దాత్ = **శబ్దము వలన**

**వి.** ముండకోపనిషత్తులో (2-2-5) "దేనియందు ద్యులోకము, భూమి, అంతరిక్షము, సకల ప్రాణాది కరణములతోకూడి మనస్సు ఓతమై (సమర్పితమై, గర్భితమై) వున్నదో, ఆ అక్షరబ్రహ్మమునే అద్వితీయముగాను, మీ యొక్క ఆత్మగా (స్వశబ్దము-ఆత్మగా) తెలిసికొనుడు. ఇతర విద్యలను (వచనములను) వదలివేయుడు. ఈ ఆత్మజ్ఞానము అమృతమునకు, మోక్షమునకు సేతువుయై వున్నది." అని చెప్పబడినది.

ఇక్కడ ఆత్మ అనేదే స్వశబ్దము. సేతువు అంటే మార్గము, లక్ష్యము, గమ్యము అని గ్రహించాలి. వేరే ఏ ఒడ్డు లేదు. ఆత్మయే సేతువు, మార్గము మరియు ఒడ్డు.

ఛాందోగ్యోపనిషత్తులో (6-8-7) "ఈ సమస్త ప్రజలకు మూలము సత్. సత్ అనేదే ఆయతనం. సత్ అనేదే ప్రతిష్ఠ". **అన్నిటికి ఆయతనము, ఆధారము బ్రహ్మమే.**

(ఛాం.ఉ. 6-8-7; ముం.ఉ. 2-1-10,11; ముం.ఉ. 2-2-5)

### (65) I.3.2

**సూ. ముక్తోపసృప్యవ్యపదేశాత్**

**క్ర. ముక్త, ఉపసృప్య, వ్యపదేశాత్**

**ప్ర.అ.** ముక్త = **ముక్తులైన వారికి,** ఉపసృప్య = **ప్రాప్తవ్యము, పొందదగినది,** వ్యపదేశాచ్చ = **అని చెప్పబడుటవలన**

**వి.** "నదులు సముద్రములో కలిసి నామరూపాలు వదిలి సముద్రములో ఐక్యమై సముద్రమే అయినట్లు, ధీరులైన ఆత్మజ్ఞానులు పరాత్పరుడైన పరబ్రహ్మమును పొందుతున్నారు" (ముం.ఉ. 3-2-8).
"ఓంకారమనే ధనస్సుతో, ఆత్మ అనే శరమును, బ్రహ్మ అనే లక్ష్యమునకు సంధించి, అప్రమత్తంగా వేస్తే, ఈ ఆత్మ ఆ బ్రహ్మములో, శరము లక్ష్యములోవలె ప్రవేశించి, తన్మయత్వము అందుతుంది"

(ముం.ఉ.2-2-4) ఈ రీతిగా ఎన్నో చోట్ల ముక్తులు పొందేది స్వయమైన ఆత్మ అనే పరబ్రహ్మమే అని చెప్పబడినది. **అందరికి ఆధారము, లక్ష్యము, గమ్యము, ఆయతనము బ్రహ్మమే.** (ముం.ఉ. 3-2-8, 2-2-9; బృ.ఉ. 4-4-7)

## (66) I.3.3

**సూ. నానుమానమతచ్ఛబ్దాత్**

**క్ర. న, అనుమానమ్, అతచ్ఛబ్దాత్**

**ప్ర.అ.** న = **కాదు,** అనుమానమ్ = **అనుమానమైన (ప్రధానమైన),** అ = **లేదు,** తత్ = **ఆ,** శబ్దాత్ = **శబ్దము వలన**

**వి.** ప్రధానాన్ని గూర్చి ఏ శబ్దమూ ఈ ప్రకరణములో లేనందువలన జడప్రకృతియైన ప్రధానాన్ని స్వర్గము, పృథివి మొదలైనవానికి ఆధారము అని అనరాదు.

## (67) I.3.4

**సూ. ప్రాణభృచ్చ**

**క్ర. ప్రాణభృత్, చ**

**ప్ర.అ.** ప్రాణభృత్ = **ప్రాణములను భరించునది,** చ = **కూడ**

**వి.** ప్రాణములను భరించు జీవుడు కూడా ద్యు, భూమి ఆదులకు ఆయతనము, ఆధారము కాదు. జీవుని ప్రసక్తి కూడా ఈ ప్రకరణములో లేదు.

**జీవునికి సర్వజ్ఞత లేదు. ఆనందమయ, అమృతమయ శబ్దములు పరమాత్మకే వర్తించును.**

## (68) I.3.5

**సూ. భేదవ్యపదేశాత్**

**క్ర. భేద వ్యపదేశాత్**

**ప్ర.అ.** భేద = **భేదము,** వ్యపదేశాత్ = **చెప్పబడుట వలన**

**వి.** ముండక ఉపనిషత్తులో (2-2-5) "తమేవైకం జానథ ఆత్మానమ్" "ఆ ఒకదానినే ఆత్మగా తెలుసుకో" అని అనబడినది. పరమాత్మకు (జ్ఞేయునికి), ముముక్షువుయైన జీవునికి (జ్ఞాతకు) ఈ విధంగా భేదం చెప్పబడినది. కావున జీవుడు కూడా ద్యుభ్వాయతనుడైన బ్రహ్మము కాదు. **జ్ఞేయుడైన బ్రహ్మ ఆత్మశబ్దవాచ్యుడు. ఆ జ్ఞేయుడే ద్యు, భూ మొదలైన వాటికి అధిష్ఠానము, ఆయతనము.**

(ముం.ఉ. 2-2-5)

## (69) I.3.6

**సూ. ప్రకరణాత్**

**క్ర. ప్రకరణాత్**

ప్ర.అ. ప్రకరణాత్ = **ప్రకరణము వలన**

వి. **ఈ ప్రకరణము** (ముం.ఉ. 2-2-5, 2-1-10, 2-1-11) **పరబ్రహ్మకు చెందినది. అందువలన ద్యులోక, పృథివ్యాదులకు జీవాత్మ** కాని జడ ప్రకృతియైన, ప్రధానము కాని ఆధారములు అని చెప్పవీలుకాదు.

**అన్నిచోట్ల బ్రహ్మమే అన్నింటికి ఆధారమని, ఆయతనమని చెప్పబడినది.**
(ముం.ఉ. 2-2-5, 2-1-10, 2-1-11)

## (70) I.3.7

**సూ. స్థిత్యదనాభ్యాం చ**

**క్ర. స్థితిఅదనాభ్యాం, చ**

ప్ర.అ. స్థితి = **స్థిరంగా, ఉదాసీనంగా వుండటం,** అదన = **అనుభవించటం, ఆభ్యాం = రెండింటిని, చెప్పటం వలన,** చ = **కూడ**

వి. ఒకే చెట్టు మీద రెండు పక్షులు అన్యోన్యమైత్రి కలిగి నివసించుచున్నవి. అందులో ఒకటి సంతోషముతో ఫలము ననుభవించుచుండగా, రెండవది తినకుండా దానిని చూచుచున్నది. (ముం.ఉ.3-1-1) ఇదే అర్థంలో వుండే ఇంకొక మంత్రము శేతాశ్వతరోపనిషత్తులో (4-7) వున్నది.

**అనుభవించే పక్షి జీవాత్మ. సాక్షిగా వుండి ఏమీ చేయనిది పరమాత్మ. కర్మఫలభోక్త అయిన, ఉపాధితోకూడిన జీవునికి స్వర్గ పృథివ్యాదులకు ఆయతనమవడము సంభవముకాదు. కావున పరమాత్మయే ద్యుభ్వాయతనం అని నిశ్చయించతగును.**

(ముం.ఉ. 3-1-1; శ్వే.ఉ. 4-7)

### 2) భూమాధికరణము (20) (భూమ విద్య)

## (71) I.3.8

**సూ. భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్**

**క్ర. భూమా, సంప్రసాదాత్, అధిఉపదేశాత్**

ప్ర.అ. భూమా = **అన్నింటికన్నా ఉత్కృష్టము, శ్రేష్ఠము మరియు గొప్పది,** సంప్రసాదాత్ = **ప్రాణశబ్ద వాచ్యమైన, జీవాత్మకంటేగూడ,** అధి = **గొప్పదిగా,** ఉపదేశాత్ = **ఆ బ్రహ్మ అని చెప్పబడుట వలన**

వి. ఛాందోగ్య ఉపనిషత్తులో నారదుడు సనత్కుమారుడిని "ఆత్మవేత్త ఐననతడు శోకాన్ని తరిస్తాడని,"

# భూమ విద్య

## బ్ర.సూ. (71) I-3-8




సనత్కుమారుడు నారదునకు బోధించిన భూమ విద్య (ఛాం.ఉ. VIII-1-3)

తరింపచేసే మార్గము బోధించమనీ అభ్యర్థించినాడు. సనత్కుమారుడు "నామమే పరమాత్మ" అని చెప్పాడు. నారదుడు నామాన్ని ఉపాసించి "నామము కన్న గొప్పది ఏమైనా వున్నదా?" అని అడిగితే సనత్కుమారుడు "వాక్కు నామము కన్నా గొప్పది" అని అన్నాడు. అపుడు నారదుని ప్రశ్నలకు సనత్కుమారుడు వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, జలము, తేజస్సు, ఆకాశము, స్మరణము, ఆశ, ఆశకంటే ప్రాణం గొప్పదని చెప్పినాడు. ఇక్కడ ప్రాణశబ్దము చేత జీవాత్మయే చెప్పబడెను. తరువాత సనత్కుమారుడు "భూమయే తెలుసుకోవాలి. ఏది తెలిసిన తరువాత మరియొక దానిని చూడడో, వినడో, తెలిసికొనడో అది భూమము. ఏది తెలిసినపుడు ఇంకొక దానిని చూస్తాడో, వింటాడో, తెలిసికొంటాడో అది అల్పము, నిరతిశయమైన సుఖాన్ని కోరేవాడు, భూమాన్నే తెలుసుకోవాలి." అని చెప్పాడు. "సుషుప్తిలో జాగరూకమైన ప్రాణమే సంప్రసాదం".

**ప్రాణము కన్నా పైన అనిచెప్పిబడినందు వలన భూమము, ప్రాణము కన్నా జీవాత్మకన్నా మిన్న అయిన పరమాత్మయే.**

(ఛాం.ఉ. 7-1-3)

## (72) I.3.9

**సూ. ధర్మోపపత్తేశ్చ**

**క్ర. ధర్మ ఉపపత్తేః, చ**

**ప్ర.అ.** ధర్మః = **ధర్మము,** ఉపపత్తేః = **చెప్పబడుటచేత,** చ = **కూడ**

**వి.** ఛాందోగ్యములోని ఈ ప్రకరణములో అన్ని వైపులవుండు, ఆనందము, అమృతము మొదలైనవి భూమము యొక్క ధర్మములు అని కూడ చెప్పబడినవి. ఆ ధర్మము వలన భూమము బ్రహ్మమే. **అమృతము, ఆనందము మొదలైనవి భూమము యొక్క ధర్మములు. అవియే ఆత్మ ధర్మములు.** (ఛాం.ఉ. 7-1-3)

### 3) అక్షరాధికరణము (21) (గార్గి అక్షర విద్య)

## (73) I.3.10

**సూ. అక్షరమంబరాంతధృతేః**

**క్ర. అక్షరమ్, అంబరాంత, ధృతేః**

**ప్ర.అ.** అక్షరమ్ = **ఇక్కడ అక్షరము అంటే పరమాత్మ అనే అర్థమే,** అంబరాంత = **పృథివి మొదలు ఆకాశము వరకు గల సమస్త వికారమైన ప్రపంచమును, జగమును,** ధృతేః = **ధరించుట వలన**

**వి.** సమస్త సృష్టి ఆకాశములో ఓతప్రోతము అని చెప్పి, అన్నింటికి అధిష్ఠానం ఐన ఆకాశం అక్షరములో ఓతప్రోతమైనదని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడినది (బృ.ఉ. 3-8-9).

**కావున ఆకాశముతో సహా సర్వమును ధరించుటం పరమాత్మకే అన్వయము అవుతుంది. అక్షరమంటే పరమాత్మ బోధకము. "అక్షరం బ్రహ్మపరమం"** (భ.గీ.7-3)

## (74) I.3.11

**సూ. సా చ ప్రశాసనాత్**

**క్ర. సా, చ, ప్రశాసనాత్**

**ప్ర.అ.** సా = **అది,** చ = **కూడ,** ప్రశాసనాత్ = **ప్రశాసనము (ఆజ్ఞ) వలన,** అ = **సర్వమును, అంతటినీ, అక్షరము శాసించునదిగా చెప్పబడటము వలన**

**వి.** "ఈ అక్షరము యొక్క ప్రశాసనమందు సూర్యచంద్రులు తమ తమ చోట్లల్లో ధరించబడివున్నారు. అటులనే ద్యులోకము, పృథివి, కాలము సర్వము విశేషరూపముచే ధరించబడి ఉన్నవి. అక్షరము ప్రశాసనముచే నదీనదములు ప్రవహించుచున్నవి" (బృ.ఉ. 3-8-9) అని యాజ్ఞవల్క్యుడు గార్గికి చెప్పినాడు.

**అన్నింటినీ శాసించి, అన్నింటిని ధరించేది అక్షరము. అచేతనమైన ప్రధానము ఇది చేయలేదు. కావున అక్షరము పరబ్రహ్మమే.**

(బృ.ఉ. 3-8-9)

## (75) I.3.12

**సూ. అన్యభావ వ్యావృత్తేశ్చ**

**క్ర. అన్యభావ, వ్యావృత్తేః, చ**

**ప్ర.అ.** అన్యభావ = **వేరుభావము,** వ్యావృత్తేః = **లేకపోవటము వలన,** చ = **కూడ**

**వి. పరమాత్మకు భిన్నమైన భావము అక్షరునిలో లేకపోవటము వలన అక్షరుడు పరమాత్మయే కాని జడపదార్థము కాదు.** ప్రదానముకు సంబంధించిన ధర్మములు బ్రహ్మములో లేవు. "కనిపించబడని ద్రష్ట, వినిపించబడని శ్రోత, తెలియబడని విజ్ఞాత, మననం చేయబడని మంత" (బృ.ఉ. 3-8-11) అనే ధర్మాలు పరమాత్మకే అన్వయం అవుతాయి.

(బృ.ఉ. 3-8-11)

## 4) ఈక్షతికర్మాధికరణము (22)

## (76) I.3.13

**సూ. ఈక్షతి కర్మ వ్యపదేశాత్సః**

**క్ర. ఈక్షతి, కర్మ, వ్యపదేశాత్, సః**

**ప్ర.అ.** ఈక్షతి = **ఈక్షతి, చూచును, ధ్యానించును,** కర్మ = **క్రియను కర్మను,** వ్యపదేశాత్ = **చెప్పబడుట వలన,** చ = **కూడ**

**వి.** ఓంకారము మూడు మాత్రలు కలది. అ, ఉ, మ అనునవి మూడు మాత్రలు. ఓంకారమును

గూర్చి ధ్యానించు విద్వాంసుడు పర, అపరబ్రహ్మములలో ఒక దానిని అనుసరించుచున్నాడు. ఏకమాత్రతో 'అ' గూర్చి ధ్యానించిననతడు, ఈ భూమి యందు సంపన్నుడగును. 'అ' మరియు 'ఉ' గూర్చి రెండు మాత్రలతో ధ్యానించునతడు చంద్రలోకసుఖమునను భవించి (భావానుభవము) తిరిగి భూమికి చేరును. **ఎవరు అ, ఉ, మ అను త్రిమాత్రాత్మకం అయిన ఓంకారమును ధ్యానించి, సూక్ష్మపరమైన పరబ్రహ్మను ఉపాసించునో అతడు ఈ స్థావర జంగమములకంటే పరుడైనవాడును, హిరణ్యగర్భ బ్రహ్మకన్న పరుడును, సర్వశరీరములందుయున్నవాడును అగు పరమేశ్వరుణ్ణి, పరమ పురుషుణ్ణి ఈక్షించును. (చూచును) (ప్ర.ఉ.5-5).**

ఈ విధముగా చూచే కర్మగా (ఈక్షతి కర్మగా) పరమపురుషుని చెప్పినందున ఇక్కడి ధ్యేయము, ఉపాస్యము పరమాత్మయే. మొదటి రెండు (అ, ఉ) అపరబ్రహ్మ అనుభూతినిచ్చును. (ఓం, అ, ఉ, మ) పరబ్రహ్మ అనుభూతినిచ్చును.
(ప్రశ్న.ఉ. 5-1, 5-2, 5-5)

## 5) దహరాధికరణము (23) (దహర విద్య)

### (77) I.3.14

**సూ. దహర ఉత్తరేభ్యః**

**క్ర. దహర, ఉత్తరేభ్యః**

ప్ర.అ. దహర = **'దహర' (చిన్నది) శబ్దముచే ఏ జ్ఞేయతత్త్వము యొక్క వర్ణనము చేయబడినదో అది బ్రహ్మమే,** ఉత్తరేభ్యః = **తర్వాతి వచనముచే ఇది సిద్ధించుచున్నది.**

వి. "బ్రహ్మకు పురమువంటిదైన ఈ శరీరంలో సూక్ష్మమైన పద్మపుష్పం ఆకారంలో వుండే హృదయమనే ఇంటిలోపల ఏ దహరాకాశం (సూక్ష్మాకాశం) వున్నదో, ఆ ఆకాశంలోపల వున్నవాడే వెదుకదగినవాడు - తెలిసికొనదగినవాడు" అని ఛాందోగ్యోప నిషత్తులో వున్నది. (ఛాం.ఉ. 8-1-1) వెంటనే **"బాహ్యాకాశం ఎంత పరిమాణం కలదో, ఈ దహరాకాశం కూడా అంత వుంది. దానిలో స్వర్గము, పృథివీ రెండు వున్నాయి".** (ఛాం.ఉ. 8-1-3). "ఈ ఆత్మ పాపములు లేనివాడు, జరా, మరణ, శోక రహితుడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు" (ఛాం.ఉ.8-1-5) ఈ ధర్మములన్నీ పరమాత్మవే. జీవునివి కావు. **'దహర' పదముచే జ్ఞేయము పరమాత్మయే.**
(ఛాం.ఉ. 8-1-1; ఛాం.ఉ. 8-1-3; ఛాం.ఉ. 8-1-5)

### (78) I.3.15

**సూ. గతిశబ్దాభ్యాం తథా హి దృష్టం లింగం చ**

**క్ర. గతిశబ్దాభ్యాం, తథా, హి, దృష్టం, లింగం, చ**

ప్ర.అ. గతి = **పోవుట,** శబ్దాభ్యాం = **శబ్దములుండుటవలన,** తథా = **ఆ విధముగ,** హి = **నే,** దృష్టం = **ఉపనిషత్తుయందు కనబడుట వలన,** లింగం = **లక్షణము,** చ = **మరియు**

వి. "ఈ జీవసముదాయము ప్రతిదినమందు సుషుప్తికాలమున బ్రహ్మలోకమునకు పోవుచుండును.

కాని అసత్యముచే ఆవరింపబడుట వలన ఈ విషయమునెరుంగబడకనున్నది, భూమిలో కప్పబడిన ధనము ఎరుంగజాలబడనట్లు" (ఛాం.ఉ. 8-3-2).

**పరమాత్మను బ్రహ్మలోకమనే శబ్దంతో చెప్పి, జీవులన్నీ దహరాకాశం పోవటాన్ని (గతి) చెప్పినారు. ఈ విధంగా దహరాకాశము అంటే పరమాత్మయే.**

(ఛాం.ఉ. 8-3-2; ఛాం.ఉ. 6-8-1)

## (79) I.3.16

సూ. **ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మిన్నుపలబ్దేః**

క్ర. **ధృతేః, చ, మహిమ్నః, అస్య, అస్మిన్, ఉపలబ్ధేః**

ప్ర.అ. ధృతేః = **ధరించుశక్తి,** చ = **కూడ,** మహిమ్నః = **మహిమ, మహాత్మ్యం,** అస్య = **దీనియొక్క,** అస్మిన్ = **ఈ పరబ్రహ్మము నందు,** ఉపలబ్ధేః = **వున్నదని వేరుచోట చెప్పబడుట వలన**

వి. **ఈ దహరమందు సమస్తలోకములను ధరించుశక్తి వున్నదని చెప్పబడుటవలన కూడ ఇది పరబ్రహ్మవాచకము.** ఈ మహిమ పరబ్రహ్మకు కలదని బృహదారణ్యక ఉపనిషత్తు (4-4-32) లో కూడ చెప్పబడినది.

**కావున 'దహర' శబ్దము పరబ్రహ్మమునకే అన్వయము.**

(ఛాం.ఉ. 8-4-1 ; బృ.ఉ. 4-4-2)

## (80) I.3.17

సూ. **ప్రసిద్ధే శ్చ**

క్ర. **ప్రసిద్ధేః, చ,**

ప్ర.అ. ప్రసిద్ధేః = **ప్రసిద్ధమై వున్నది కావున,** చ = **కూడ**

వి. **ఈ దహరాకాశములోని ఆకాశ శబ్దము పరమాత్మ అని ప్రసిద్ధమై వున్నది.** తైత్తరీయ ఉపనిషత్తులో "ఈ ఆనందస్వరూపమైన ఆకాశము (పరమాత్మ) లేనిచో ఎవరు జీవించును? ఎవరు ప్రాణక్రియను చేయగలరు?" (తై.ఉ. 2-7-1) ఛాందోగ్యోపనిషత్తులో "ఈ సర్వభూతములు ఆకాశము నుండి పుట్టుచున్నవి" (ఛాం.ఉ. 1-9-1) అని చెప్పబడినవి.

**ఈ విధముగా కూడా దహరాకాశము పరమాత్మయే.**

(ఛాం.ఉ. 8-1-1; తై.ఉ. 2-7-1; ఛాం.ఉ. 1-9-1)

## (81) I.3.18

సూ. **ఇతరపరామర్శాత్ స ఇతి చేన్నాసంభవాత్**

క్ర. **ఇతరపరామర్శాత్, సః, ఇతి, చేత్, న, అసంభవాత్**

ప్ర.అ. ఇతర = **వేరు,** పరామర్శాత్ = **అర్థమునుసరించి,** సః = **అది,** న = **సరికాదు,** ఇతి చేత్ = **అని అంటే,** అసంభవాత్ = **సంభవము కాదు కనుక.**

**వి.** ఛాందోగ్యోపనిషత్తులో "ఈ సంప్రసాదుడైనవాడు ఈ శరీరం నుండి పోయి పరంజ్యోతిని పొంది దైవస్వరూపంలో (ఆత్మలో) ఉంటాడు." అంటే సంప్రసాదం సుషుప్తిలో వున్న జీవుణ్ణే లేపుతుంది అని అంటే అది సరికాదు.

**ఉపాధి ధర్మాభిమానియైన జీవునికి, బుద్ధి మొదలైన వాటిచేత పరిచ్ఛిన్నుడైన జీవునికి, ఆకాశంతో సమానత్వంకాని, పాపములనుండి విముక్తికాని (అపహతపాప్మా) సంభవము కాదు. సత్యకామ, సత్యసంకల్పాది లక్షణములు జీవునివి కావు.**

(ఛాం.ఉ. 8-3-4)

## (82) I.3.19

**సూ. ఉత్తరాచ్చేదావిర్భూత స్వరూపస్తు**

**క్ర. ఉత్తరాత్, చేత్, అవిర్భూతస్వరూపః, తు**

**ప్ర.అ.** ఉత్తరాత్ = **తరువాత వచ్చు వర్ణనము వలన,** చేత్ = **అని అనిన యెడల,** అవిర్భూత = **ఆ మంత్రమందు వచ్చు,** స్వరూపః = **వర్ణనము వలన,** తు = **అది సరికాదు**

**వి.** "ఏ సంప్రసాదము కలదో అది ఈ శరీరము నుండి నిర్గమించి పరంజ్యోతిని పొంది, తన శుద్ధస్వరూపముతో సంపన్నమగును. ఇదియే ఆత్మ, అది అమృతము, అభయము. ఇదే బ్రహ్మ. ఇట్టి బ్రహ్మ యొక్క పేరు సత్యము". (ఛాం.ఉ. 8-3-4)

ఇక్కడ "సంప్రసాద నామముచే జీవాత్మయే వర్ణనచేయబడినది. జీవాత్మకే అమృతము, అభయము అను విశేషణములు ఉపయోగించబడినవి. ఈ లక్షణము జీవాత్మకు వుండుట అసంభవము కాదు. కావున 'దహర' శబ్దము జీవాత్మకవాచకము అనుటలో ఆటంకము లేదు" అని శంకించుట సరికాదు. **ఎందుకంటే, ఆ మంత్రములో తన శుద్ధ స్వరూపముతో సంపన్నమగు జీవాత్మకు అమృతాది లక్షణములు అన్వయించబడినవి.**

**కావున 'దహర'శబ్దము జీవాత్మవాచకము కాదు. పరమాత్మవాచకమే.**

(ఛాం.ఉ. 8-3-4)

## (83) I.3.20

**సూ. అన్యార్థశ్చ పరామర్శః**

**క్ర. అన్య, అర్థః, చ, పరామర్శః**

**ప్ర.అ.** అన్య=**వేరొక,** అర్థః=**ప్రయోజనము కొరకు,** చ = **కూడ,** పరామర్శః = **జీవలక్ష్యముగా చేయబడిన సంకేతములు, లక్షణములు.**

**వి.** ఈ ప్రకరణమందు జీవలక్ష్యముగా చేయబడిన సంకేతములు, లక్షణములు ఆ ప్రకరణమందు ఏ జీవాత్మను లక్ష్యము చేయు శబ్దములు వాడబడినవో, ఆ దహరశబ్దములు గ్రహణము కొరకు కాదు. అది వేరొక ప్రయోజనము కొరకు వాడబడినవి.

**దహరశబ్దవాచ్యమైన పరమాత్మ యొక్క పూర్తి స్వరూపజ్ఞానము కలిగిన తరువాత జీవాత్మ అట్టి**

**గుణములు కలదియగును అని చెప్పుట కొరకు అట్లు వాడబడినవి. నీడయైన జీవాత్మకూడ యథార్థజ్ఞానమందినపుడు వెలిగి, వెలుగుయైన పరమాత్మ స్వరూపమునందును.**
(భ.గీ. 14-2)

## (84) I.3.21

**సూ. అల్పశ్రుతేరితి చేత్తదుక్తమ్**

**క్ర. అల్పశ్రుతేః, ఇతి, చేత్, తత్, ఉక్తమ్**

ప్ర.అ. అల్పశ్రుతేః = **శ్రుతియందు మిక్కిలి చిన్నగా చెప్పబడినందున (అర్భకౌకస్త్వాత్-బ్ర.సూ. 1-2-7),** ఇతి = **ఇది జీవాత్మ అనుకొనవలెను.** చేత్ = **అనిన,** తదుక్తమ్ = **దానికి ఉత్తరము చెప్పబడుచున్నది.**

వి. **శ్రుతియందు దహరాకాశము అత్యంత సూక్ష్మమని చెప్పబడినది. అందువలన కూడ అది జీవాకాశమే అని శంకించుట సరికాదు.** ఇది (బ్ర.సూ. 1-2-7) లో వివరించినబడినది. కావున మరల మరల దహరమనగా జీవాత్మ అనే అవసరము లేదు.

**దహర శబ్దము పరమాత్మ వాచకము.**
(బ్ర.సూ. 1-2-7)

## 6) అనుకృత్యధికరణము (24)

## (85) I.3.22

**సూ. అనుకృత్యేస్తస్య చ**

**క్ర. అనుకృతేః, తస్య, చ**

ప్ర.అ. అనుకృతేః = **అనుకరించుట వలన,** తస్య = **ఆ జీవాత్మను,** చ = **కూడ**

వి. **జీవాత్మను అనుకరించుట వలన కూడ ఆ పరమాత్మను అల్పపరిమాణముగా చెప్పుట ఉచితము.** "పరమాత్మ ఈ జగత్తును సృష్టించి, స్వయముగా జీవాత్మతో కూడ అందు ప్రవేశించెను" (తై.ఉ. 2-6) "ఆ పరమాత్మయే త్రివిధ తత్త్వరూపమైన దేవతలు. వారి కార్యరూపమైన మానవ శరీరమందు జీవాత్మతో కూడ ప్రవేశించి, నామరూపములను విస్తరింపచేసెను" (ఛాం.ఉ. 6-3-3) "శుభకర్మరూపమైన మనుష్యశరీరమందు పరబ్రహ్మ నివాసస్థానమైన హృదయాకాశాంతర్గతమైన బుద్ధిరూప గుహయందు చేరుటకొరకు ప్రవేశించి, అందుగల ఋతమును పానయుచేయువారు ఇద్దరు జీవాత్మ పరమాత్మలు" (కఠ.ఉ. 1-3-1) ఈ విధంగా అనుకరించినది పరమాత్మయేనని విశదమైనది.

(తై.ఉ. 2-6; ఛాం.ఉ. 6-3-3; ఛాం.ఉ. 6-3-2; కఠ.ఉ. 1-3-1)

**(86) I.3.23**

**సూ. అపి చ స్మర్యతే**

**క్ర. అపి, చ, స్మర్యతే**

ప్ర.అ. అపి = **ఇంకను,** చ = **కూడా,** స్మర్యతే = **స్మృతియందు చెప్పబడినది.**

వి. **భగవద్గీతలో పరమాత్మ మనుష్య హృదయములో ప్రవేశించినట్లు మరీ మరీ చెప్పబడినది.**

"సర్వ హృదయంబుల సన్నివిష్టుండ నేను" (భ.గీ. XV-15)

"హృద్దేశమందు యర్జున తిష్ఠించి యుండి
భూతములన్నింటి కీశ్వరుండైన వాడు
యంత్రారూఢుడగుచు తన మాయ చేత
భూతములన్నింటిని భ్రమియింపజేయు." (భ.గీ. XVIII-61)

"సర్వ భూతముల నవిభక్తమ్మునగుచు
మరి విభక్తముగ స్థితమునగుచు" (భ.గీ. XIII-17)

"పరమజ్ఞానమ్ము జ్ఞేయమ్ము జ్ఞానమూలమ్ము
సర్వహృదయములందు విష్ఠితమ్ము" (భ.గీ. XIII-18)

"ఎవ్వడణువునందునణువు ననుస్మరించదగు వాడెవ్వడు" (భ.గీ. VIII-9)

ఇట్లు వర్ణించుట వలన **సర్వవ్యాప్తియైన పరమాత్మ స్థానమును బట్టి, సూక్ష్మాకారముగా చెప్పబడినాడు. ఈ విధంగా అది ఉచితమే కాని పరమాత్మ అనంతము పరిమాణాతీతము.**
(భ.గీ 8-9; 13-17; 15-15; 13-18; 18-61)

---

**7) ప్రమితాధికరణము (25)** **(అంగుష్ఠమాత్ర విద్య)**

---

**(87) I.3.24**

**సూ. శబ్దాదేవ ప్రమితః**

**క్ర. శబ్దాత్, ఏవ, ప్రమితః**

ప్ర.అ. శబ్దాత్ = **శబ్దముల వలన,** ఏవ = **నే,** ప్రమిత = **ప్రమణాము కలవాడు**

వి. కఠోపనిషత్తులో "అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి" (కఠ.ఉ. 2-1-12), అంగుష్ఠమాత్రః పురుషోజ్యోతిరాధూమకః, ఈశానో భూతభవ్యస్య సః ఏవాద్య సః ఉశ్వః, ఏతద్వైతత్" (కఠ.ఉ. 2-1-12)

"అతడంగుష్ఠమాత్రుండు పురుషుండు తెలియ
అంతరంగమున తాను తిష్ఠించియుండు
భూతభవ్యముల ఈశానుడతడు
అంతభయములేదు, ఇదియే నదియ" (కఠ.ఉ.2-1-12)

"అతడంగుష్ఠమాత్ర పురుషుండు తాను.
ఇంతయు ధూమంబులేని జ్యోతి తాను.
భూతభవ్యముల యొక్క ఈశానుడతడు.
అతడే నిన్న, నేడు, మరునాడు, నిదియే నదియ" (కఠ.ఉ.2-1-13)

అని ఈ విధముగ చూచిన అంగుష్ఠమాత్రుడగు పురుషుడు జీవుడేనని తెలుస్తున్నది అని అంటే అట్లు కాదు. ఇక్కడనే ఆ అంగుష్ఠమాత్రుడుగా చెప్పబడిన పురుషుడు భూతభవ్యముల ఈశానుడని చెప్పబడినాడు. అతడు నిన్న, నేడు, మరునాడు, ఎప్పుడూ వున్నాడని కూడా చెప్పబడినాడు త్రికాలాధిపత్యము కలిగి, ఎప్పుడూ వుండేవాడు జీవుడు కాదు. **కావున ఆ అంగుష్ఠమాత్రుడని చెప్పబడిన పురుషుడు పరిమాణాతీతుడైన పరమాత్మయే.** (ఏ విధంగా అంగుష్ఠము అంగుళము కన్న అతీతమో, పరమాత్మ జీవునికన్నా అతీతుడు అని అర్థము).

**[నారాయణ వాక్యము : ఎట్లు బొటన వేలు, వ్రేలు కన్న అతీతమో, పరమాత్మ జీవాత్మ కన్న అతీతము.]**

(కఠ.ఉ. 2-4-12; మ.భా. 3-297-12)

## (88) I.3.25

సూ. **హృద్యపేక్షయా తు మనుష్యాదికారత్వాత్**

క్ర. **హృది, అపేక్షయా, తు, మనుష్యఅధికారత్వాత్**

ప్ర.అ. హృది = **హృదయమందు,** అపేక్షయా = **కోరికతోడనే,** తు = **కాని ఇతర జీవజంతువులతో వాటి విషయం చెప్పటం లేదు,** మనుష్యాధికారత్వాత్ = **మనుష్యులను ఉద్దేశించి, మానవుల విషయం చెబుతుంది.**

వి. **ఉపనిషత్తులలో చెప్పబడిన బ్రహ్మవిద్య మరియు పరబ్రహ్మమును తెలిసికొను అధికారము మనుష్యజాతికే కలదు. కనుక పరమాత్మ హృదయములందు వున్నదని చెప్పబడినది. హృదయము అంగుష్ఠ మాత్రముగా వర్ణించబడినది. కావున అంగుష్ఠమాత్రమని చెప్పబడినది పరబ్రహ్మమే కాని, జీవుడు కాదు.**

**[నారాయణ వాక్యము :**
జిజ్ఞాస చేయగలిగే అవకాశము, అధికారము మనుష్య జాతికి అనుగ్రహము బ్ర.సూ. I-1-1]

## 8) దేవతాధికరణము (26)

## (89) I.3.26

సూ. **తదుపర్యపి బాదరాయణః సంభవాత్**

క్ర. **తత్ఉపరి, అపి, బాదరాయణః, సంభవాత్**

ప్ర.అ. తత్ఉపరి = **మనుష్యులకు పైన వున్నవారికి,** అపి = **కూడా,** బాదరాయణః = **బాదరాయణులు,** సంభవాత్ = **అగుట వలన**

వి. **మనుష్యులకు పైనవున్న దేవతలకు కూడా బ్రహ్మవిద్యాధికారం వున్నదని బాదరాయణులు తలచుచున్నారు.** మొదలు వేదములు, బ్రహ్మవిద్య నేర్చుకున్నది ప్రథమదేవతయైన చతుర్ముఖబ్రహ్మయే

అని, ఇంద్రుడు ప్రజాపతి వద్ద బ్రహ్మ విద్య నేర్చుకున్నాడని ఉపనిషత్తులో వున్నది. ఇంద్రదేవుడు ప్రతర్ధనునికి బ్రహ్మ విద్య నేర్పినాడు. (వేదములు-పురుషుడు-యజ్ఞము-సృష్టి-దేవతలు చిత్ర పటలము చూడవచ్చును.)

(కౌ.ఉ. 3-1) (బ్ర.ఉ. 4-5-19)

## (90) I.3.27

**సూ. విరోధః కర్మణీతి చేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్**

**క్ర. విరోధః, కర్మణి, ఇతి, చేత్, న, అనేక, ప్రతిపత్తేః, దర్శనాత్**

ప్ర.అ. విరోధః = **విరోధము,** కర్మణి = **యజ్ఞాది కర్మములయందు,** చేత్ = **అని అంటే,** న = **సరికాదు,** ప్రతిపత్తేః = **అనేక రూపములు,** దర్శనాత్ = **శాస్త్రము, శ్రుతి వలన**

వి. దేవతలకు మనుష్యులవలె శరీరధారములున్నయెడల ఒకే సమయమందు జరుగు అనేక యజ్ఞములందు వారికివ్వబడు హవిస్సులనెట్లు గ్రహించగలరు? అని అంటే ఆ విరోధముండదు, ఎందుకంటే **దేవతలు ఒకేసారి అనేక రూపములు ధరించగలరు.** (బృ.ఉ. 3-9-1.2) **కావున దేవతలకు శరీరత్వము ఉన్నదనుట వలన విరోధము లేదు.**

(బృ.ఉ. 3.9 - 1,2)

## (91) I.3.28

**సూ. శబ్దః ఇతి చేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్**

**క్ర. శబ్దః, ఇతి, చేత్; న, అతః, ప్రభవాత్, ప్రత్యక్షఅనుమానాభ్యామ్**

ప్ర.అ. శబ్దః = **శబ్దము, వేదమునందు,** ఇతి చేత్ = **విరోధమేర్పడుచున్నది అనిన,** న = **సరికాదు,** అతః = **వేదమువలననే,** ప్రభవాత్ = **దేవతల ఉత్పత్తివలన,** ప్రత్యక్ష = **శ్రుతి,** అనుమానాభ్యాం = **స్మృతుల వలన**

వి. **నిత్యమైన వేదము, శబ్దమునందు, అనిత్యమైన దేవతలకు సంబంధము వున్నదంటే విరోధము ఏర్పడుతుంది అని అంటే, అది సరికాదు. ఎందుకనిన, నిత్యమైన ఆ వేదమునుండే దేవాదులంతా ప్రభవించటము వలన** (బృ.ఉ. 1-2-4) ఇది ప్రత్యక్షమైన శ్రుతులవలన మరియు స్మృతుల (మహాభారతము, మనుస్మృతి, పురాణములు) వలన తెలుస్తున్నది. **కావున దేవతలకు బ్రహ్మవిద్యాధికారం వున్నది.**

(బ్ర.సూ. II- 4-20; బృ.ఉ. 1-2-4; మ.భా. XII-233-34)

## (92) I.3.29

**సూ. అతఃఏవ చ నిత్యత్వమ్**

**క్ర. అతఃఏవ, చ, నిత్యత్వమ్**

ప్ర.అ. అతఃఏవ = **ఇందుచేతనే,** చ = **కూడ,** నిత్యత్వమ్ = **నిత్యత్వము**

వి. **సృష్టికర్తయైన పరమాత్మ వేదము ననుసరించియే సమస్త జగముల రచన చేయునని చెప్పబడినది. కావున వేదములు నిత్యము.** సృష్టికర్త మరల మరల ఆవిర్భవించుటచే వేదములు మరల మరల ఆవిర్భవించుటలేదు. వేదములు అనాది, నిత్యము.

**వేదములు అనాది, నిత్యము కనుక ప్రతికల్పమున ప్రతికల్పాదిన చతుర్ముఖబ్రహ్మ వేద ప్రకారము సృష్టికావించును. జగము మారినా వేదము మారదు. నిత్యమైన వేదముల నుండియే కల్పకల్పములకు కలుగు దేవతలకు బ్రహ్మవిద్యాధికారము కలదు అని అర్థము.**

(పురుష సూక్తము-ఋ.వే. 10-71-3), (బ్రహ్మపురాణము-19.12 నుండి 19.50)

## (93) I.3.30

సూ. **సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ**

క్ర. **సమాననామరూపత్వాత్, చ, ఆవృత్తౌ, అపి, అవిరోధః, దర్శనాత్, స్మృతేః, చ**

ప్ర.అ. సమాన = **ఒకే,** నామరూపత్వాత్ = **నామరూపములవలన,** చ= **కూడ,** ఆవృత్తౌ అపి = **కలిగినప్పటికి కూడా,** అవిరోధః = **విరోధములు లేదు,** దర్శనాత్ = **శ్రుతివలన,** స్మృతేశ్చ = **స్మృతివలన కూడ**

వి. **వేదములలో, ఉపనిషత్తులలో, స్మృతులలో సృష్టికర్త ఆవిర్భవించి నిత్యమైన వేదముల ప్రకారము పూర్వ నామరూపములకు దేవతలను మరల మరల కల్పిస్తున్నాడని చెప్పబడినది. కావున దేవతలకు కూడ బ్రహ్మవిద్యాధికారము వున్నది.**

(ఋ.వే. 10-190-3; శ్వే.ఉ. 6-18, బ్రహ్మపురాణము 92.1 నుండి 92.50 వరకు)

## (94) I.3.31

**(మధు విద్య)**

సూ. **మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః**

క్ర. **మధుఆదిషు, అసంభవాత్, అనధికారం, జైమినిః**

ప్ర.అ. మధుఆదిషు = **మధువిద్య మొదలైన, విద్యలయందు,** అసంభవాత్ = **అధికారములేదు,** జైమినిః = **జైమిని మహర్షి అభిమతము**

వి. ఛాందోగ్యోపనిషత్తులోని (ఛాం.ఉ. 3-1-1) మధువిద్యలో ఆదిత్యుడే దేవతలకు మధువు. ఆదిత్యుణ్ణి మధురూపంలో ఉపాసన చేయాలి. అది మధువిద్య మనుష్యుల ఉపాసనామార్గం. అయితే దేవతలకు మధువు స్వతహాగా అందుతుంది. కావున వారికి మధువిద్య అవసరములేదు. మనుష్యులకు వేదవర్ణితమైనవిద్యలద్వారా స్వర్గము ప్రాప్తియగును. కాని **దేవతలకు స్వర్గము స్వతహాగా ప్రాప్తము. వారికి యజ్ఞవిద్య కూడా అవసరములేదు. కావున మధుమిధ్య, యజ్ఞవిద్య మొదలైన వేదవిద్యలయందు దేవతలకు అవసరము, అధికారము లేదని జైమిని మహర్షి అనినారు.**

(ఛాం.ఉ. 3-1-1)

# వేదములు-పురుషుడు-యజ్ఞము-సృష్టి-దేవతలు

(చతుర్ముఖబ్రహ్మ వేదజ్ఞానము ద్వారా సమస్త సృష్టిని దేవతలను ఉత్పత్తి చేసిన విధము)

బ్రహ్మోవాచ:-
ఆకాశవాణ్యువాచ -

"బ్రహ్మన్ కురు జగత్సృష్టిం స్థావరస్య చరస్యచ"
"ఓ బ్రహ్మ ! స్థావర జంగమాత్మకమైన జగత్‌సృష్టి గావించుము" (బ్ర.పు. 92-12)
"యజ్ఞంకురు తతః శక్తిస్తే భవిత్రే నసంశయః
యజ్ఞో వై విషురిత్యేషా శ్రుతిర్బ్రహ్మన్ సనాతనీ"

"యజ్ఞమును చేయుము. దానివలన మీకు శక్తి కలుగును. సంశయము లేదు. ఓ బ్రహ్మ! యజ్ఞమే విష్ణువని సనాతమైన శ్రుతి చెప్పుచున్నది" (బ్ర.పు. 92-15)

"సంకల్పం కురు యజ్ఞస్య సతే యజ్ఞ సమాప్యతే"
యద్వదంతఖిలా వేదా విద్యైతత్తత్సమాచర"

"యజ్ఞమునకు సంకల్పించుము. ఆ నీ యజ్ఞము సమాప్తము కాగలదు. నీ సంకల్పము కాగానే, వేదములు విధి కొరకు ఏమి చెప్పునో అది ఆచరించుము" (బ్ర.పు. 92-25/26) బ్రహ్మ నారదునికి చెప్పెను.

"ఇతిహాస పురాణాని యదన్యశ్శబ్ద గోచరమ్
స్వతోముఖే మనుప్రాయాదభూచ్చ స్మృతి గోచరమ్"

"ఇతిహాస పురాణములు మొదలైనవి. ఇతర శబ్దగోచరములు అన్నియు స్వతహాగా నా ముఖమున చేరినవి. మరియు అవి అన్నియు మెల్లమెల్లగా నా స్మృతి గోచరమును పొందినవి."

"వేదార్థశ్చ మయా సర్వో జ్ఞాతోఽసౌతత్‌క్షణేనచ
తతః పురుష సూక్త తదస్మరం లోక విశ్రుతమ్"

"అదే క్షణమున వేదార్థమంతయును నాచే యెరుంగబడినది. తరువాత లోకవిస్తరమైన పురుషసూక్తమును స్మరించితిని" (బ్ర.పు. 92-28)
ఆకాశవాణి ఇట్లనెను

"పౌరుషేణాఽథ సూక్తేన స్తుహి తం పురుషం పరమ్"
(బ్ర.సూ. (92) I-3-29, (93) I-3-30)

"పురుష సూక్తముచే ఆ పరుడైన పురుషుని స్తుతించుము" (బ్ర.పు. 92-41)
"అట్లేనని ఆకాశవాణి పలుకులంగీకరించి నా తండ్రియైన పరమ పురుషుని భక్తితో పురుష సూక్తముతో స్తుతించి, అతనిని యజ్ఞపశువుగా ప్రోక్షణము చేసితిని." (బ్ర.పు. 92-44)

"అంతలో అక్కడ ఆ పరమపురుషుని నుండి ఈ చరాచరము కలిగినది. అతని ముఖము నుండి బ్రాహ్మణులు కలిగిరి. బాహువుల నుండి క్షత్రియులు కలిగిరి. ముఖము నుండి ఇంద్రుడు, అగ్నియు పుట్టరి. ప్రాణము నుండి వాయువు కలిగెను. శ్రోత్రము నుండి దిక్కులు, శిరము నుండి సమస్త స్వర్గము, మనస్సు నుండి చంద్రుడు, నేత్రము నుండి సూర్యుడు జనించిరి. నాభి నుండి అంతరిక్షము కలిగెను. (బ్ర.పు. 92-43 నుండి 47 వరకు) ఆ దేవదేవుని నుండి స్థావర, జంగమాది దృశ్యాదృశ్యములు అన్నియు కలిగెను. సకల దేవతలు నా వలన పుట్టిరి. అట్లు సర్వము సంపూర్ణమాయెను" (బ్ర.పు. 92-50 నుండి 53 వరకు)

ఇట్లు ప్రతి కల్పాదిన చతుర్ముఖ బ్రహ్మ వేద ప్రకారము సృష్టికావించును. (బ్ర.సూ. (92) I-3-29)
శ్రీ వ్యాసమహర్షి కృతమైన పదునెనిమిది పురాణములలో మొట్టమొదటిది బ్రహ్మపురాణము.
"బ్రాహ్మంపురాణం ప్రథమం" కూర్మపురాణము I-1-34
"ఆద్యం సర్వపురాణానాం పురాణం బ్రాహ్మముచ్యతే" - విష్ణు పురాణము
"అన్ని పురాణములలోనూ బ్రహ్మపురాణము మొదటిది." బ్రహ్మపురాణము వేదముల కాలము నాటిదే. వేదములకున్న ప్రాధాన్యత, గౌరవము ప్రామాణ్యత విద్వానులచే బ్రహ్మపురాణమునకు గూడా నివ్వబడినది. ఇందులో సృష్టి కథనము, దేవాసురుల ఉత్పత్తి, మన్వంతర కీర్తనము, ఆదిత్యవంశవర్ణనము మొదలైన వాటితో బాటు గౌతమీ మహత్మ్యమునకు ముఖ్య స్థానము నివ్వబడినది."

బ్రహ్మసూత్రములలో స్పష్టముగా చెప్పబడిన పరబ్రహ్మమే జగత్కారణమనే సత్యము యొక్క విశదీకరణ, వివరణ బ్రహ్మపురాణములో వున్నది. పరబ్రహ్మము వలన చతుర్ముఖ బ్రహ్మయైన కార్యబ్రహ్మ ద్వారా ప్రతి కల్పము ప్రారంభములో అనంతనిత్యమైన వేదస్మృతి, జ్ఞానము ద్వారా దేవతల ఉత్పత్తి, జగత్‌సృష్టి, సర్వ జీవసృష్టి ఎలా జరిగింది అన్న సంగతి బ్రహ్మపురాణములోని ఈ 92వ ఆధ్యాయమైన కుశతర్పణ తీర్థవర్ణనమైన ప్రణీతసంగమ కాళేశ్వర తీర్థ వర్ణనములో గలదు.

ఆదిదేవతయైన చతుర్ముఖ బ్రహ్మ బ్రహ్మవిద్య నేర్చి వేద ప్రకారము దేవతల ఉత్పత్తి, సకల సృష్టి కావించినాడు.
(బ్ర.సూ.(91) I-1-28, (92) I-1-29, (93) I-3-30 చూడగలరు.)

## (95) I.3.32

**సూ. జ్యోతిషి భావాచ్చ**

**క్ర. జ్యోతిషి, భావాత్, చ**

ప్ర.అ. జ్యోతిషి = **జ్యోతిర్మయలోకములయందు,** భావాత్ = **స్థితియుండుట వలన,** చ = **కూడ**

వి. **దేవతలు స్వభావముచేతనే జ్యోతిర్మయ లోకములైన దేవాది లోకములయందు** (సువః, మహః, జనః, తపః, సత్యః) **ఉంటున్నారు.** అక్కడ సకలైశ్వర్యములను అనుభూతినందుచున్నారు. **కావున వారికి యజ్ఞాదికర్మవిద్యలయందు అవసరము, అధికారము లేదు. అదే విధముగా బ్రహ్మవిద్యయందు కూడ అధికారములేదు అని కూడ జైమినిమహర్షి అభిమతము.**

## (96) I.3.33

**సూ. భావం తు బాదరాయణోఽస్తిహి**

**క్ర. భావం, తు, బాదరాయణః, అస్తి, హి**

ప్ర.అ. భావం = **ఉన్నదని,** తు = **అయితే,** బాదరాయణః = **బాదరాయణుడు,** అస్తి = **ఉన్నది,** హి = **ఎందుకనగా**

వి. **బాదరాయణ మహర్షి బ్రహ్మవిద్యయందు దేవతలకు అధికారం వుందని అంగీకరిస్తున్నారు.** దేవతలు శరీరధారులని వేదములలో, శాస్త్రములలో, శ్రుతి, స్మృతులలో, బ్రహ్మపురాణములో కలదు. సృష్టికర్త బ్రహ్మ సృష్టి కొరకై ప్రణీతసంగమతీర్థములో వేదప్రకారము యజ్ఞము చేసినారు. (బ్ర.పు. ప్రణీతా సంగమ తీర్థము) తైత్తరీయ సంహిత ప్రకారము (2-3-3) ప్రజాపతి "జన్మించెదను" అని అనుకొని అగ్నిహోత్రమథనము చేసి, సూర్యోదయసమయములో హవనము చేసినాడు. ఛాందోగ్యో పనిషత్తులో ఇంద్రుడు, విరోచనునితోపాటు బ్రహ్మసేవలో వుండగా అనేక సంవత్సరములు తపస్సు వలన బ్రహ్మవిద్య ప్రాప్తమైనది. ఛాందోగ్యోపనిషత్తులో బ్రహ్మమానసపుత్రుడైన దేవర్షినారదుడు సనత్కుమారుని నుండి బ్రహ్మవిద్యను అందుకొన్నాడు. ఈ విధంగా బాదరాయణమహర్షి అభిమతము ప్రకారము దేవతలకు బ్రహ్మవిద్యయందు అధికారము వున్నదని స్వీకరించాలి. (తై.బ్రా.ఉ. 2-1-2-8, 1-3-33; తై.సం.ఉ. 2-3-3; బృ.ఉ. 1-4-10)

## 9) అపశూద్రాధికరణము (27)

## (97) I.3.34

**సూ. శుగస్య తదనాదరశ్రవణాత్తదాద్రవణాత్సూచ్యతే హి**

**క్ర. శుక్, అస్య, తత్, అనాదరశ్రవణాత్, తే, తత్ ఆద్రవణాత్, సూచ్యతే, హి**

ప్ర.అ. శుక్ = **శోకము అయినది,** అస్య = **ఆ జానశ్రుతికి,** తత్ = **ఆ,** అనాదరశ్రవణాత్ = **ఆ హంస యొక్క అనాదరంతో కూడిన మాటలు వినినందువలన,** తత్ = **ఆ,** ఆద్రవణాత్ = **రైక్వుని ఉద్దేశించి వెళ్లటము వలన,** సూచ్యతే = **సూచించబడుచున్నది.** హి=**కావున**

**vi.** ఛాందోగ్యోపనిషత్తులో (4-1-1) ఒక ఉదంతము వున్నది. మహా అన్నదాతయైన జానశ్రుతి అనే రాజు ఒకనాడు మేడ మీద పవళించి యుండగా, అతని గుణాలకు సంతసమందిన ఇద్దరు దేవర్షులు హంసలరూపాన్ని ధరించి, పైనించి ఎగిరివెళ్లుచుండిరి. అపుడు ముందుపోతున్న పక్షిని ఉద్దేశించి రెండవ పక్షి ఇలా అన్నది. "ఓ భల్లాక్ష! భల్లాక్ష! దృష్టిలోపించిందా? జానశ్రుతియొక్క కీర్తి ఆకాశమంతా వెలుగుతున్నది. దాన్ని తాకవలదు. అది నిన్ను కాల్చివేయగలదు." అప్పుడు భద్రాక్షుడనే పక్షి ఇలా అన్నది. "ఓ అజ్ఞానీ! ఈ స్వల్పునిలో ఏమి ఘనత వున్నది? ఆ మహాత్ముడు బంది రైక్వునివలె కీర్తించుచున్నావు?" మొదటి హంస ఆ రైక్వుని గూర్చి చెప్పమంటే, రెండవహంస "రైక్వుడు పరమ ఆత్మజ్ఞాని. ఎల్ల ప్రజల పుణ్యమంతా ఆ రైక్వుని చేరుచున్నది. రైక్వుని జ్ఞానమే జ్ఞానము" అని అన్నది. హంసలు ఎగిరిపోయాయి. జానశ్రుతి పై దయతోనే, అతనికి గొప్ప జిజ్ఞాసకలిగి జ్ఞానమందాలనే భావముతోనే ఆ దేవర్షి పక్షులు అలా మాట్లాడి ఎగిరిపోయినాయి. అది విని జానశ్రుతి తనసేవకులతో బ్రహ్మజ్ఞానియైన రైక్వుణ్ణి వెతికించినాడు. ఒక బండి క్రింద రైక్వుణ్ణి రాజసేవకులు కనుగొనినారు.

జానశ్రుతి రాజు, రైక్వుని దగ్గరకు వెళ్లి "ఓ! రైక్వుడా! ఈ 600 గోవులు, నగలను, రథమును స్వీకరించి నీ దివ్య జ్ఞానమును నాకు బోధించుము" అని అన్నాడు.

అప్పుడు రైక్వుడు ఇలా అన్నాడు.

"ఓయ్! శూద్రా! నీ గోవులు, రథము, నీ వద్దనే వుంచుకో" అని అన్నాడు. ఈ సూత్రములోని విషయము ఇదే. శూద్రునికి బ్రహ్మ విద్యాధికారము వున్నదా? లేదా? అని. ఈ సూత్రములో చెప్పినట్టు సూత్రము అర్థము ఇలా వస్తుంది "పక్షి మాటలలోని అనాదరము వినిన జానశ్రుతికి శోకము వచ్చి, రైక్వుని కొరకై వెళ్లటము వలన ("శునాదుద్రావతః ఇతి శూద్రః=శోకముతో పరుగిడి వచ్చినవాడు" అని అర్థములో) రైక్వుని 'శూద్రః' అని అన్నారు.

జానశ్రుతి శూద్రుడుకాక రాజే. మరల జానశ్రుతి రైక్వునికి వెయ్యిగోవులు, ఆభరణములు, తన పుత్రికను సమర్పించినాడు. అతని పుత్రిక నిర్మలను విద్యాముఖిగా తెలుసుకొని రైక్వుడు సంతసించి బ్రహ్మజ్ఞానము బోధించినాడు. రైక్వుడు జానశ్రుతికి బోధించినది సంవర్గ విద్య. (ఛాం.ఉ. IV-3-1 నుండి IV-3-8 వరకు, బ్ర.సూ. (402) (III-3-43))

దీనిలో ఈక్రింది అంశాలు గమనించాలి.

1. జానశ్రుతి జాతి శూద్రుడు కాదు.
2. శోకముతో ఉద్రవించేవాడు (వెళ్ళేవాడు) శూద్రుడు.
3. జానశ్రుతికి రైక్వుడు బ్రహ్మజ్ఞానము బోధించినాడు.

శూద్రునికి విద్యాధికారం గురించి మాట్లాడినపుడు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు ఉపనయనం అయి, ద్విజులు అవుతారు. గాయత్రీ మంత్రస్వీకారము వలనవారు ద్విజులు బ్రహ్మజ్ఞానాధికారం అందుతారు. **అయితే గాయిత్రీ స్వీకారం కాని వారందరూ (బ్రహ్మ, వైశ్య, క్షత్రియ, శూద్రజాతులలో జన్మించినవారు**

**కూడా) శూద్రులే అని ఈ సూత్రము అర్థము. శూద్రునికి ఉపనయనము లేదు కనుక వేదాధ్యయనం వుండదు కనుక బ్రహ్మవిద్యాధికారం వుండదు అని అర్థము.**

(ఛాం.ఉ. 4-1-1, ఛాం.ఉ. 4-3-1 నుండి 4-3-8 వరకు)

## (98) I.3.35

సూ. **క్షత్రియత్వగతేశ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్**

క్ర. **క్షత్రియత్వగతేః, చ, ఉత్తరత్ర, చైత్రరథేన, లింగాత్**

ప్ర.అ. క్షత్రియత్వగతేః = **జానశ్రుతికూడ క్షత్రియుడని నిశ్చయింపబడుట వలన (ప్రమాణము వలన),** చ=**కూడ,** ఉత్తరత్ర = **రాబోవు వాక్యమునందు జానశ్రుతి,** చైత్రరథేన = **క్షత్రియుడగు చైత్రరథునితో చెప్పబడినాడు,** లింగాత్ = **ఆ సూచన వలన**

వి. జానశ్రుతి ప్రసంగమును సాగిస్తూ ఛాందోగ్యోపనిషత్తులో "పూర్వము ఒకప్పుడు కపి గోత్రీయుడైన శౌనకుడును, రక్షసేనాత్మజుడగు అభిప్రతారి భోజనముచేయుచుండుగా, ఒక బ్రహ్మచారి వచ్చి భిక్షనర్థించెను" అని వున్నది. ఈ అభిప్రతారికి సుప్రసిద్ధ క్షత్రియుడైన చైత్రరథునితో, అభిప్రతారితో జానశ్రుతికి సంబంధం వున్నది. (ఛాం.ఉ. 4-3-5)

**ఆ విధంగా జానశ్రుతి జన్మతో క్షత్రియుడే. కావున అతనికి బ్రహ్మవిద్యాధికారం వున్నది. గాయిత్రీ ఉపదేశంలేని శూద్రునికి ఆ అధికారం లేదు అని భావము.**

(ఛాం.ఉ. 4-3-5)

## (99) I.3.36

సూ. **సంస్కారపరామర్శాత్తదభావాభిలాపా చ్చ**

క్ర. **సంస్కారపరామర్శాత్, తత్అభావఅభిలాపాత్, చ**

ప్ర.అ. సంస్కారపరామర్శాత్ = **వేద విద్యనభ్యసించుటకు ముందు ఉపనయన సంస్కారము జరుగవలెనని చెప్పబడుట వలన,** చ = **ఇంకను,** తదభావాభిలాపాత్ = **శూద్రునకీ సంస్కారము చెప్పబడక పోవుట వలనను**

వి. **వేదవిద్యనభ్యసించుటకు పూర్వము ఉపనయనము, గాయత్రీ ఉపదేశము అవసరము. అప్పుడే బ్రహ్మజ్ఞానమునకర్హతనందును.** శూద్రులకు ఉపనయనము చెప్పబడలేదు. కావున శూద్రులకు బ్రహ్మవిద్యధికారము లేదు అని భావము.

## (100) I.3.37

**(సత్యకామ విద్య)**

సూ. **తదభావ నిర్ధారణే చ ప్రవృత్తేః**

క్ర. **తదభావ నిర్ధారణే, చ, ప్రవృత్తేః**

# వజ్ర సూచికోపనిషత్తు

## సామవేదము

ఓం అజ్ఞానమును ఛేదించునదియును, జ్ఞానహీనులకు దూషణము, జ్ఞానచక్షువులకు భూషణమును అయిన వజ్రసూచిని తెలుపుతున్నాము. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనే నాలుగు వర్ణములున్నవనియును, ఆ నాలుగు వర్ణములలో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడనియును అని వేదవచనానుసారము స్మృతులు అభివ్యక్తము చేసినవి. ఈ విషయములను విచారించవలెను. బ్రాహ్మణుడనగానెవరు? అతడు జీవుడా? దేహమా? మొదలుచెప్పిన జీవుడు బ్రాహ్మణుడనటానకి వీలులేదు. ఎందుకంటే గడచిపోయినది, రాబోవునవి అగు అనేక దేహములు జీవునకు సమానములు. జీవుడు ఒక్కడే కర్మాధీనత వలన అనేక శరీరములను ధరించుచున్నాడు. సమస్త శరీరములందు జీవుడు ఒకే రూపములోనున్నాడు. అందుచేత జీవుడు బ్రాహ్మణుడని చెప్పుట సరిపోదు.

ఈ శరీరమే బ్రాహ్మణుడు అని చెప్పుట కూడ సరిపోదు. ఈ శరీరము పంచభూత నిర్మితమైనందువలనను, అన్ని వర్గముల, జాతుల మానవులందరు ఒకే ఆకారము గలిగియుండుటవలనను, వృద్ధాప్యము-మరణము-ధర్మాధర్మములు అందరికీ సమానముగానున్నందువలనను, బ్రాహ్మణులు తెల్లగానుండాలని, క్షత్రియుడు ఎర్రగానుండాలని నియమము ఏదీ లేనందువలనను, పిత్రాదుల శరీరములను దహనము చేయునపుడు పుత్రాదులకు బ్రహ్మ దోషము రావటము అసంభవమైనందువలనను ఈ శరీరమును బ్రాహ్మణుడు అని చెప్పటము సరిగాదు.

ఇంకను వర్ణమే బ్రాహ్మణుడని చెప్పుట కూడ పొసగదు. ఋష్యశృంగుడు జింక వలనను, కౌశికుడు దర్భల నుండి, వాల్మీకి పుట్ట నుండి, వ్యాసుడు మత్స్యగంధివలనను, గౌతముడు కుందేటి వీపు నుండి, వసిష్ఠుడు ఊర్వశి నుండి, అగస్త్యుడు కుంభము నుండి జన్మించినట్లు తెలియుటవలనను, వీరందరిలో అనేకులు జాతి ప్రసక్తియే లేక జ్ఞానులు, మహర్షులు ఐనందున వర్ణమే బ్రాహ్మణుడనుట సరిపోదు.

జ్ఞానము బ్రాహ్మణుడనుట కూడ సమంజసము కాదు. క్షత్రియులు ఎందరో బ్రహ్మ జ్ఞానమును కలిగినారు. అందువలన జ్ఞానము బ్రాహ్మణుడనుట సరిపోదు. సర్వజీవులకు ప్రారబ్ధము, సంచితము, ఆగామి అనే మూడు కర్మలు సమానముగా కనిపించుచున్నందు వలన కర్మము బ్రాహ్మణుడు అని అనరాదు. ధార్మికుని కూడ బ్రాహ్మణుడని చెప్పుట సరిపోదు. క్షత్రియులు, వైశ్యులు గూడ ధనమును, సంపత్తిని దానము చేయుచున్నారు. అందువలన ధార్మికుని కూడ బ్రాహ్మణుడని అనరాదు.

**మరి బ్రాహ్మణుడనగా ఎవరు ?**

ఎవరైనను అద్వితీయుడును, జాతిగుణక్రియా రహితుడును, షడూర్ములు మరియు షడ్భావ వికారాది దోషములు లేనివాడును, సత్యజ్ఞానానందానంత స్వరూపుడును, నిర్వికల్ప సంకల్పుడును, సకలకల్పములకు నాధారుడును, సమస్త భూతములకు అంతర్యామియు, ఆకాశము రీతిగా బాహ్యాభ్యాంతరములలో వ్యాపించియున్నవాడును, అవిచ్ఛిన్నమైన ఆనందస్వరూపుడును, అప్రమేయుడును, స్వానుభవముతో గ్రహింపదగినవాడును, స్వయంప్రకాశుడునునగు భగవంతుని కరతలామలకము వలె ప్రత్యక్షము చేసుకొని కృతార్థుడైనవాడును, దోషరహితుడును, శాంత్యాది సద్గుణములు కలవాడును, లోభమోహాది దోషరహితుడును, దంబాహంకారములను లోనికి చేరనీయనివాడును ఐనట్టి సద్గుణములు కలవాడే బ్రాహ్మణుడని శ్రుతి, స్మృతి, పురాణేతిహాసముల యొక్క అభిప్రాయమై వున్నది. పై లక్షణములు లేనిచో బ్రాహ్మణత్వ సిద్ధియే లేదు.

పరమాత్మను సచ్చిదానంద స్వరూపునిగను, అద్వితీయునిగను, పరబ్రహ్మముగను భావించవలెను. పరబ్రహ్మముగను భావించవలెను.

**ఇట్లు వజ్ర సూచికోపనిషత్తు**
**సంపన్నము**



**(బ్ర.సూ. (97) I-3-34 నుండి (101) I-3-38 వరకు)**

# సత్యకామ విద్య

(ఛాం.ఉ.IV-4 నుండి IV-9 వరకు) (బ్ర.సూ.(100) I-3-37)

| క్ర. సం. | గురువు | బ్రహ్మము - నాలుగు కళలు | | | | నామము | ఉపాసన ఫలము |
|---|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | | |
| 1 | వృషభము | తూర్పు | పడమర | దక్షిణము | ఉత్తరము | ప్రకాశవాన్ | ప్రకాశ లోకములు |
| 2 | అగ్ని | పృథివి | అంతరిక్షము | ద్యులోకము | సముద్రము | అనంతవాన్ | అనంత లోకములు |
| 3 | హంస | అగ్ని | సూర్యుడు | చంద్రుడు | విద్యుత్ | జ్యోతిష్మాన్ | జ్యోతిర్మయ లోకములు |
| 4 | ముద్గ నీటిపక్షి | ప్రాణము | చక్షుస్సు | శ్రోత్రము | మనస్సు | ఆయతనవాన్ | ఆయతనవాన్ లోకములు |
| 5 | సద్గురువు గౌతముడు | 16 కళలు సమస్తము | | | | సర్వవాన్ | బ్రహ్మలోకము |

ప్ర.అ. తదభావ = **శూద్రత్వములేదని,** నిర్ధారణే = **నిశ్చయము చేయుటయందు,** ప్రవృత్తేః చ = **ఆచార్యునికి ప్రవృత్తి పనికి వచ్చును.**

వి. శూద్రత్వము లేదని ఆచార్యులు, గురువులు నిర్ణయించవచ్చును. ఛాందోగ్యోపనిషత్తులో (4-4-1,2,3) ఈ విషయములో ఒక వృత్తాంతము కలదు. సత్యకామ జాబాలుడనే అతడు గురుశూశ్రష చేసి విద్యను పొందాలని హరిద్రుమసగౌతముని వద్దకు వెళ్ళినాడు. గౌతముడు సత్యకాముని గోత్రం అడిగాడు. సత్యకాముడు "నా గోత్రము నాకు తెలియదు. మా తల్లి జబాలను అడిగితే "బాబా! యవ్వనములో ఎన్నో చోట్ల పనిచేసినాను. అప్పుడు నీవు జన్మించితివి. నీ గోత్రము తెలియదు. నీ పేరు సత్యకాముడు" అని తెలిపినది." అని చెప్పినాడు.

అది విని గౌతముడు "నీవు దాచకుండా సత్యము చెప్పినావు. సత్యము పలుకుట బ్రాహ్మణుల లక్షణము. నీకు ఉపనయనము చేసి బ్రహ్మవిద్య బోధింతును" అని అలాగే చేసినాడు. ఆవిధంగా ఉపనయనం చేసినపుడే బ్రహ్మవిద్యకు అధికారం అందుతుంది.

[**నారాయణ వాక్యము :** సత్యం పలకటం బ్రాహ్మణ లక్షణం. బ్రహ్మణుడు సత్యం పలుకుతాడు. ఆ విధంగా సత్యం పలికేవాడు. బ్రహ్మణుడు అవుతాడు కదా! నిరంతరము సత్యమార్గములో వుండేవాడు, జాతికి ఆతీతంగా, బ్రహ్మవిద్యా అధికారం పొందుతాడు కదా! ఈ కాలంలో చాలమంది ద్విజులు గాయత్రీ చేయటము లేదు. యజ్ఞోపవీతం ధరించుటము లేదు. సత్యం పలికేవారు తగ్గిపోయినారు. బ్రహ్మ విద్యాభ్యాసానికి అధికారం (ఎవరైనా) ఈ విధంగా అందవచ్చునని నారాయణ మతము. 1. సత్యము పలుకవలెను. 2. ధర్మమున నడువవలెను. 3. గాయత్రీ మంత్రము ఉపదేశము చేయించుకొని ప్రతిదినము జపించవలయును. 4. సాధనచతుష్ఠయమును పొందవలెను. వజ్రసూచిక ఉపనిషత్తులో చెప్పబడిన గుణములు అభ్యసించవలయును. ఆచరించవలయును. అప్పుడు ఎవరైనా బ్రహ్మవిద్యాధికారమునందవచ్చును. రామానుజాచార్యులవారు గుడి గోపురంపై నిలబడి నారాయణ మంత్రమును బోధించినారు. స్త్రీలకు, ద్విజులుకాని వారికి నారాయణ మంత్రము చెబితే నరకం వస్తుందని కొందరు అంటే, ఆయన "నేను 100 సార్లు నరకానికి వెళుతాను కాని, నారాయణ మంత్రము తప్పక బోధిస్తాను" అన్నారు.

స్వామి దయానంద సరస్వతి వారు ఆర్య సమాజ వ్యవస్థ చేసి జాతిభేదం, లింగభేదం లేకుండా మగవారికి, ఆడవారికి ఉపనయన వ్యవస్థ చేసారు. స్వామి నారాయణ సంస్థలో అందరూ సాధు నియమాలు పాటించటము వలన జాతికి అతీతంగా బ్రహ్మవిద్యకు అర్హులే.

రామకృష్ణ మఠం ద్వారా, శివానంద ఆశ్రమం ద్వారా, చిన్మయమిషన్ ద్వారా, దయానంద ఆర్షవిద్యాగురుకులం మొదలైన సంస్థల ద్వారా జిజ్ఞాస మరియు సాధనచతుష్టయం పొందిన వారందరు బ్రహ్మవిద్యకు అధికారులే అవుతున్నారు. అయితే బ్రాహ్మణుడనగానెవరు అనే దానికి సమాధానము వజ్రసూచికోపనిషత్తులో కలదు. పక్క పేజీలో చూడగలరు.

**గురువు నిర్ణయము ముఖ్యము.**

**ప్రతి జీవుడుదేవుడు కావాలంటే అందరు బ్రహ్మవిద్యకు అధికారులే. అయితే శుద్ధి, శౌచము, సాధనచతుష్టయ సంపత్తి అవసరము.**]

(ఛాం.ఉ. 4-4-1,2,3)

## (101) I.3.38

**సూ. శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ స్మృతేశ్చ**

**క్ర. శ్రవణఅధ్యయనఅర్థ, ప్రతిషేధాత్, స్మృతేః, చ**

ప్ర.అ. శ్రవణ = **శ్రవణము,** అధ్యయన = **అధ్యయనము,** అర్థ = **అర్థము,** ప్రతిషేధాత్ = **నిషేధించబడుట వలన,** స్మృతేః = **స్మృతి వలన చెప్పబడినందు వలన,** చ = **కూడ**

వి. వేద శ్రవణము, మనస్మృతి, పరాశరస్మృతుల ప్రకారము అధ్యయనము, అర్థజ్ఞానము, అనుష్ఠానము అనేవి నిషేధించబడినందువలన గూడా శూద్రునకు బ్రహ్మవిద్యాధికారము లేదని భావము.

[**నారాయణ వాక్యము :** అయితే శూద్రులని అనబడిన విదురాదులు, ధర్మవ్యాధులు మొదలైన వారికి జ్ఞానమెట్లు అందెను. ధర్మమెట్లు అర్థమాయోను? వారు స్వయము ధర్మబోధ చేసినారు కదా? సంజయుడు ధర్మమునర్థము చేసుకొనినాడు కదా?

వేదముల, శ్రుతుల శ్రవణాధ్యాయనార్థములు నిషేధించబడినను శూద్రులకు పురాణములు, ఇతిహాసములు, రామాయణ, భాగవత, మహాభారత, భగవద్గీతాదాలను వినుటము, చదువుటము, అర్థము చేసుకొనటము నిషేధించబడలేదు. వాటియందు వేదజ్ఞానము, శ్రుతి విజ్ఞానము, ధర్మసారములు నిండివున్నవి కదా? భక్తి శ్రద్ధలు నిషేధించబడలేదు కదా. "శ్రద్ధావాన్‌లభతే జ్ఞానం" (భగవద్గీత 4-39). ఆ విధముగా వారు జ్ఞానులు, ధర్మనిరతులు అయినారు. **పురాణేతిహాసములు జ్ఞానమునకు సులభ మార్గములు.**]

## 10) కంపనాధికరణము (28)

## (102) I.3.39

**సూ. కంపనాత్**

**క్ర. కంపనాత్**

ప్ర.అ. కంపనాత్ = **కంపనము వలన, చలనము వలన**

వి. **దేనివలన సమస్త జగత్తు (జనించి) ఉద్భవించి, చలిస్తున్నదో** (కంపనమౌతుందో) **అదియే ప్రాణరూపమైన బ్రహ్మము.** కఠ ఉపనిషత్తులో ఇలా వున్నది.

"యదిదం కించ జగత్సర్వం
ప్రాణః ఏజతి నిస్సృతం
మహద్భయం వజ్రముద్యతం
యః ఏత ద్విదురమృతాస్తే భవంతి" (కఠ.ఉ. II-6-2)

"అన్ని జగములు యున్నవి, ఏవి గూడ
దాని వల్లన ప్రాణముగ కంపించుచుండు
కన మహద్భయము యుద్యుతవజ్రమదియ
దాని తెలియ అమృతత్వంబు కలుగు"

దేనివలన సమస్త జగత్తు ప్రాణరూపముగ ఆవిర్భవించి (జనించి, కలిగి) కంపిస్తున్నదో (చలిస్తున్నదో) అది బ్రహ్మము. అది ఎత్తిన వజ్రాయుధమువలె భయమును కల్గించును. ఇక్కడ బ్రహ్మము ప్రాణరూపము (వజ్రముకాని, భయకారణముకాని కాదు) ప్రాణవాయువు కూడా కాదు. ప్రాణవాయువు కూడ ఆ పరమాత్మవలననే కంపిస్తుంది (Vibration) చలిస్తుంది.

భగవద్గీతలో

"ఈశ్వరః సర్వభూతానాం, హృద్దేశే అర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని, యంత్రారూఢాని మాయయా॥"

(భ.గీ. 18-61)

"హృద్దేశమందు యర్జున తిష్ఠించియుండి
భూతములన్నింటి కీశ్వరుండైనవాడు
యంత్రారూఢుడగుచు తన మాయచేత
భూతములన్నిటి భ్రమింపజేయు" (భ.గీ. 18-61)

ఈ విధంగా **ఆ పరబ్రహ్మ వలననే జగములన్నీ, జీవులన్నీ జనించి, ప్రాణమంది, చలించుచున్నాయి.**

(కఠ.ఉ.II-6-2, భ.గీ. 18-61)

## 11) జ్యోతిరధికరణం (29) (జ్యోతిషాంజ్యోతి విద్య)

### (103) I.3.40

**సూ. జ్యోతిర్దర్శనాత్**

**క్ర. జ్యోతిః, దర్శనాత్**

**ప్ర.అ.** జ్యోతిః = **జ్యోతి శబ్దము,** దర్శనాత్ = **శ్రుతియందు చెప్పబడినందు వలన**

**వి.** **'జ్యోతిః' అనే శబ్దము పరమాత్మవాచకము.** ఛాందోగ్యోపనిషత్తులో "యః ఆత్మా అపహతపాప్మా" (ఛాం.ఉ.VIII-7-1) "ఈ ఆత్మ పాపరహితమైనది" అని చెప్పి "పరంజ్యోతిః ఉపసంపద్య, స్వేనరూపేణ అభినిష్పద్యతే। సః ఉత్తమః పురుషః, సః తత్ర పర్యేతి" (ఛాం.ఉ.VIII-12-2, 3) "ప్రత్యగాత్మ ఈ శరీరము నుండి వెడలి, పరంజ్యోతియందునొకటియై స్వరూపమున ప్రకాశించును" ఈ విధముగా జ్యోతి మరియు పరంజ్యోతి పరబ్రహ్మవాచకములు.

"తమసోమా జ్యోతిర్గమయ" (బృ.ఉ.III-3-28) "అసత్తు నుండి సత్తుకు, తమస్సు నుండి జ్యోతికి,



హిమాలయములలో ధర్మశాలలో సుజననారాయణలకు జ్యోతి, బింబ-ప్రతిబింబ దర్శనము (లోపలి కవరు పేజి చూడగలరు.) "జ్యోతి అనే శబ్దము పరమాత్మ వాచకము", "ప్రత్యగాత్మ ఈ శరీరము నుండి వెడలి, పరంజ్యోతి యందు ఒకటియై స్వరూపమున ప్రకాశించును." బ్ర.సూ. (103) I-3-40. ఈ అద్భుత చిత్రంలో పరంజ్యోతి స్వరూపమైన సూర్యుని మరియు ప్రత్యగాత్మ స్వరూపములైన మూడు ప్రతిబింబములను చూడవచ్చును. సూర్యుడు పైకి వచ్చినప్పుడు ఈ మూడు ప్రతిబింబములు ప్రభాకరునితో కలిసిపోయి ఆ రూపములోనే వెలుగును. బుడుగలు (శరీరము) పోగానే ప్రతిబింబము (జీవాత్మ), సూర్యుడు (పరమాత్మ) ఒకటి అవుతాయి. ముక్త పురుషుడు బ్రహ్మతో అవిభక్త రూపంలో వుంటాడు. బ్ర.సూ. (537) IV-4-4

మృత్యువు నుండి అమృతమునకు నన్ను తీసుకొనివెళ్లుము” కావున **జ్యోతి అంటే సత్తు, అమృతము అయిన ఆత్మయే, పరబ్రహ్మమే.**

(ఛాం.ఉ. 8-7-1, 8-6-5, 8-12-3)

## 12) అర్థాంతరత్వాదివ్యపదేశాధికరణము (30)

### (104) I.3.41

**సూ. ఆకాశో ௨ర్థాంతరత్వాదివ్యపదేశాత్**

**క్ర. ఆకాశః, అర్థాంతరత్వాదివ్యపదేశాత్**

**ప్ర.అ.** ఆకాశః = **ఆకాశ శబ్దము,** అర్థాంతరత్వాది = **నామరూపజగత్తున కంటే వేరైనదిగా,** వ్యపదేశాత్ = **చెప్పబడుట వలన**

**వి.** ఛాందోగ్యోపనిషత్తులో “ఆకాశో వై నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ, తదమృతం, సఆత్మా” (ఛాం.ఉ. 8-14-1)

“ఆకాశమనునది నామరూపముల వలన వ్యక్తము చేయబడును.. (కాగితం పైన అక్షరాలలాగ) **ఈ నామరూపములు** (అక్షరాలు) **ఏ ఆత్మయందున్నవో (తెల్లకాగితం వలె) అదియే బ్రహ్మము”.** బ్రహ్మసూత్రము (I-1-22) లో కూడా ఆకాశము భూతాకాశము మాత్రమే కాదనీ, బ్రహ్మమేయనీ చెప్పబడినది. మరల ఉపనిషత్తు

“అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి ఇతి” (ఛాం.ఉ.6-3-2) “ఈ జీవాత్మలో ప్రవేశించి నేను నామరూపాలను విస్తరింపచేస్తాను” మరల **బ్రహ్మమే నామ రూపాలుగా విస్తారమవటం గూర్చి చెప్పబడినది. అట్లు ఆకాశము పరబ్రహ్మావాచకమని అర్థం చేసుకోవాలి.**

(ఛాం.ఉ. 8-14-1, 6-3-2; బ్ర.సూ. I-1-22)

## 13) సుషుప్త్యుత్క్రాన్త్యధికరణము (31)

### (105) I.3.42

**సూ. సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన**

**క్ర. సుషుప్తిఉత్క్రాన్త్యోః, భేదేన**

**ప్ర.అ.** సుషుప్తి = **గాఢ నిద్రలో,** ఉత్క్రాన్త్యోః = **మరణసమయమందు,** భేదేన = **జీవాత్మ పరమాత్మలకు భేదము చెప్పుట వలన**

**వి.** బృహదారణ్యకోపనిషత్తులో “ఈ పురుషుడు (జీవుడు) ప్రాజ్ఞాత్మతో కలిసి బాహ్యాభ్యంతరాల్లో దేనినీ తెలిసికొనడు” అని చెప్పబడినది. (బృ.ఉ. 4-3-21) ఉత్క్రాంతిలో కూడా (మృత్యుసమయములో) “ఈ శరీరాత్మ (జీవుడు) ప్రాజ్ఞాత్మచే అధిష్టించబడినదై, ప్రాణోత్క్రమణ, సమయములో ఘోరమైన శబ్దం చేస్తూ వెడుతున్నాడు” (బృ.ఉ. 4-3-35) అని చెప్పబడినది. ఈ రెండు చోట్ల జీవాత్మకు,

ప్రాజ్ఞాత్మయైన పరమాత్మకు భేదం చూపబడినది. **ఆ విధంగా నామరూపములు వున్నది జీవాత్మ. నామరూపాలులేని ఆకాశమువంటిది పరమాత్మ అని భావము.**

(బృ.ఉ. 4-3-7, 4-3-21, 4-3-35, 4-2-14, 4-3-12)

## (106) I.3.43

**సూ. పత్యాది శబ్దేభ్యః**

**క్ర. పతిఆది, శబ్దేభ్యః**

**ప్ర.అ.** పతి=**పతి-మహేశ్వర,** ఆది=**మొదలైన,** శబ్దేభ్యః = **శబ్దముల వలన**

**వి. ఉపనిషత్తులలో "పరమం పతి, పతినా పరమం చ దైవతం, సర్వస్య వశీ, సర్వస్య ఈశానః, సర్వస్య అధిపతిః"** (బృ.ఉ.4-4-22) **అనే పదములు జీవుడు కాని ఆ పరమాత్మను గూర్చియే చెబుతున్నాయి.**

(బృ.ఉ.4-2-22)

ఇట్లు

**ప్రథమాధ్యాయ తృతీయ పాదము**



# ప్రథమాధ్యాయ తృతీయ పాద సమాసము

## జ్ఞేయ బ్రహ్మసంబంధ వాక్య విచారణ

**1. ద్యుభ్వాద్యధికరణము**
ద్యులోకానికి, భూలోకానికి, సమస్తమునకు ఆయతనము ఆధారము బ్రహ్మమే.

**2. భూమాధికరణము**
భూమము అన్నిటికన్న మిన్నయైనది. భూమము పరబ్రహ్మమే.

**3. అక్షరాధికరణము**
అన్నిటినీ శాసించేది, ధరించేది అక్షరము. అక్షరము పరబ్రహ్మము.

**4. ఈక్షతికర్మాధికరణము**
ఈక్షించేవాడు, ధర్శనీయుడు పరమాత్మయే.

**5. దహరాధికరణము**
హృదయాకాశము, దహరాకాశము పరమాత్మవాచకమే.

**6. అనుకృత్యధికరణము**
బ్రహ్మము స్వప్రకాశము. జీవాత్మను అనుకరించునది బ్రహ్మము.

**7. ప్రమితాధికరణము**
అంగుష్ఠమాత్రుడు పరమాత్మయే.

**8. దేవతాధికరణము**
దేవతలు బ్రహ్మవిద్యకు అధికారులు.

**9. అపశూద్రాధికరణము**
మనుష్యులకు మాత్రమే బ్రహ్మవిద్యాశాస్త్రమునందు అధికారము వున్నదని కాక, దేవతాదులకు సైతం బ్రహ్మవిద్యాధికారం ఉన్నదని నిరూపించబడినది కదా! అలాగే, కేవలం ద్విజులైన వారికి మాత్రమే - బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు మాత్రమే - బ్రహ్మవిద్యాధికారం ఉన్నదనే నియమాన్ని విస్తృతముచేసి, సాధనచతుష్టయసంపత్తి కలిగిన శూద్రునికి (ఎవరికైనా) సైతం బ్రహ్మవిద్యాధికారము కలదని ఛాంధోగ్యంలో, చతుర్థాధ్యాయంలో జానశ్రుతి అనే రాజుకి, బ్రహ్మజ్ఞాని అయిన రైక్వునికి సంబంధించిన కథ ద్వారా చెప్పవచ్చును. ఉపనయనము లేక వేదవిద్యాధికారము లేదు. గాయత్రి బ్రహ్మ విద్యాద్వారము.

**10. కంపనాధికరణము**
సమస్తమును కంపింపచేసేది, చలింపచేసేది, నడిపింపచేసేది ఐన ప్రాణము బ్రహ్మమే.

**11. జ్యోతిరధికరణము**
జ్యోతిః శబ్దము పరంజ్యోతియైన బ్రహ్మవాచకమే.

**12. అర్థాంతరాత్వాదివ్యపదేశాధికరణము**
నామరూపాలను విస్తరింపచేసేది, దానికొరకు జీవాత్మలో ప్రవేశించేది పరబ్రహ్మమే.

**13. సుషుప్త్యుత్క్రాన్త్యధికరణము**
సుషుప్తియందు, ఉత్క్రాంతి (మృత్యువు) యందు జీవాత్మతో ప్రాజ్ఞాత్మగా ఉండు పురుషుడు బ్రహ్మమే.

ఇట్లు

**ప్రథమాధ్యాయ తృతీయపాద సమాసము**

# ప్రథమాధ్యాయ తృతీయ పాద సారము

## జ్ఞేయ బ్రహ్మసంబంధ వాక్య విచారణ

ద్యు, భూలోకములకు ఆయతనము మరియు ఆధారము, భూమము, అక్షర పురుషుడు, ఈక్షించేవాడు మరియు దర్శనీయుడు, హృదయ దహరాకాశము, స్వప్రకాశమై జీవాత్మనానుకరించేది, అంగుష్ఠమాత్ర పురుషుడు, దేవతలకు తెలిసికొన అధికారమున్న జ్ఞానగమ్యము, ఉపనయనము కవాటమై గాయత్రీ ద్వారముగా కలది, సాధన చతుష్టయసంపత్తి ద్వారమున బ్రహ్మవిద్యాధికార లక్ష్యము ఐనది, సమస్త జగములను జీవులను కంపనము, చలనము చేయించేది, జ్యోతులకు జ్యోతి పరంజ్యోతి, జీవాత్మలో ప్రవేశించి నామరూపాలను విస్తరింప చేసేది మరియు గాఢనిద్రయందు మరియు మృత్యువునందు జీవుడు కలియునది అన్నియు పరబ్రహ్మమే.

ఇట్లు

ప్రథమాధ్యాయ తృతీయపాద సారము

# I.4
# ప్రథమాధ్యాయము - చతుర్ధ పాదము
## బ్రహ్మము కాని వాని విచారణ

### 1. అనుమానికాధికరణము (32) (పరమపురుష విద్య)

### (107) I.4.1

**సూ. అనుమానికమప్యేకేషామితి చేన్న శరీరరూపక విన్యస్తగ్రహీతేర్దర్శయతి చ**

**క్ర. అనుమానికమ్, అపి, ఏకేషాం, ఇతి, చేత్; న, శరీరరూపకవిన్యస్తగృహీతేః, దర్శయతి, చ**

ప్ర.అ. అనుమానికమ్ = **అనుమాన కల్పితమైన జడ ప్రకృతి,** అపి=**కూడ,** ఏకేషాం=**కొందరిమతమున వేదప్రతిపాదితము,** ఇతి చేత్ = **అని అనినచో,** న = **అది సరికాదు,** శరీరరూపకవిన్యస్తగృహీతేః = **శరీరమే రథరూపకమున అలంకారము చే రథరూపముగా నిరూపింపబడినట్లు, విన్యస్తమై అవ్యక్త శబ్దముచే గ్రహించబడినది.** దర్శయతి చ = **ఇదే విషయము శ్రుతి చూపుచున్నది.**

వి. కఠోపనిషత్తులో శరీరము రథరూపకముగా చెప్పబడినది.

“దెలియు ఆత్మను రథికుండు యనుచు
దెలియు శరీరమును రథము యనుచు
దిలియు బుద్ధిని సారథి యనుచు
దెలియు మనమును పగ్గములు యనుచు” (కఠ.ఉ.1–3–3)

“ఇంద్రియములను హయములంద్రు
ఇంద్రియార్థములను గోచరములంద్రు
ఆత్మ ఇంద్రియ మనోయుక్తమగుచు
భోక్తయందురు మనీషులైనవారు” (కఠ.ఉ.1–3–4)

మరల ఇంద్రియములు, మనము, బుద్ధి, ఆత్మల గూర్చి చెబుతూ
“ఇంద్రియములకన్న అర్థములు పరము
అర్థములకన్న మరియు మనము పరము
పొందుగ మనముకన్నను బుద్ధి పరము
బుద్ధికన్నను ఆత్మ మహత్పరము” (కఠ.ఉ. 1–3–10)

“అంత మహత్కన్న అవ్యక్తమ్ము పరము
అది అవ్యక్తముకన్న పురుషుండు పరము
లేదేదియును పురుషుని కన్న పరము
తుది యతడె పరమగతియు నతడు” (కఠ.ఉ. 1–3–11)

**ఇక్కడ అవ్యక్తమంటే ప్రధానమని కావున, ప్రధానము కూడా వేద ప్రతిపాదితమని అనుమానము ఆధారంగా కొందరు అంటే అది సరికాదు.** పైన చెప్పిన శరీర రథరూపకములో ఆత్మ, శరీరము, బుద్ధి, మనము, ఇంద్రియములు, ఇంద్రియార్థములను వరుసగా రథికుడు, రథము, సారథి, పగ్గములు, హయములు, గోచరములుగా పోల్చబడినవి. (కఠ.ఉ.1-3-3, 1-3-4) తరువాత ఇంద్రియములు, ఇంద్రియార్థములు, మనసు, బుద్ధి, ఆత్మ (మహత్), అవ్యక్తము, పురుషుడు క్రమముగా ఒకటికన్న మరొకటి మిన్న అని చెప్పబడినది. (1-3-10, 1-3-11)
ఈ వరస మొదలు (1-3-3, 1-3-4) ముందు చెప్పబడిన వరసకు విలోమముగా వున్నది. మొదటి వరసలో రథము అన్నచోట రెండవవరసలో అవ్యక్తముగా చెప్పబడినది. **ఈ అనుమాన ప్రకారము అవ్యక్తము అంటే ప్రధానము కాదు, శరీరమే అని తెలుస్తున్నది. కావున ప్రధానము శ్రుతి ప్రతిపాదితము కాదు.**

## (108) I.4.2

సూ. **సూక్ష్మం తు తదర్హత్వాత్**

క్ర. **సూక్ష్మం, తు, తత్అర్హత్వాత్**

ప్ర.అ. సూక్ష్మం = **సూక్ష్మము,** తు = **అవును,** తత్ అర్హత్వాత్ = **అర్హత వలన**

వి. అవ్యక్తపదానికి అర్థం శరీరం అయితే, శరీరం స్థూలము మరియు అవ్యక్తము అవుతుంది. మన స్థూలశరీరం వ్యక్తమేకదా! కనిపిస్తున్న ఈ వ్యక్త శరీరం అవ్యక్తం ఎలా అవుతుంది? అయితే స్థూలశరీరానికి ఆరంభకము, మూలము అయిన భూతసూక్ష్మమే అవ్యక్త శబ్దానికి అర్హమైనది. కాబట్టి సూక్ష్మభూతమైన కారణశరీరమే ఇచట అవ్యక్త పదానికి అర్థము. **కావున ప్రధానము శ్రుతి ప్రతిపాదితము కాదు. అవ్యక్తశబ్ధం ద్వారా కారణశరీరాన్ని గ్రహించాలి.**

## (109) I.4.3

సూ. **తదధీనత్వాదర్థవత్**

క్ర. **తత్అధీనత్వాత్, అర్థవత్**

ప్ర.అ. తత్ = **ఆ (పరమాత్మ), అధీనత్వములో వుండుట వలన,** అర్థవత్ = **ఈ ప్రకృతి సార్థకము.**

వి. సాంఖ్యుల ప్రకృతి లేక ప్రధానము స్వతంత్రము మరియు వారి మతములో అది జగత్కారణము. **కాని శ్రుతియందలి ప్రకృతి అట్టిది కాదు. ఇది పరబ్రహ్మయొక్క అధీనములో వుండును.** ఆ విధముగా సాంఖ్యుల ప్రధానము వేదప్రతిపాదితము కాదు.

## (110) I.4.4

సూ. **జ్ఞేయత్వావచనాచ్చ**

క్ర. **జ్ఞేయత్వావచనాత్, చ**

ప్ర.అ. జ్ఞేయత్వ = **జ్ఞేయత్వము,** అవచనాత్ = **చెప్పబడనందున,** చ = **కూడ**

వి. రథము గూర్చిన రూపకములో అవ్యక్తము గూర్చి తెలియబడుట (జ్ఞేయము) లేదు. కావున అవ్యక్తము ప్రధానము కాదు. సాంఖ్యమందలి ప్రకృతి జ్ఞేయము. సాంఖ్యుల ప్రకారము ప్రధానతత్త్వము, పురుషతత్త్వముల యొక్క వివేకజ్ఞానము ద్వారా కైవల్యం వస్తుందంటారు. అంటే వారిప్రకారం ప్రధానము పురుషుడు రెండు జ్ఞేయము. **వేదము ప్రకారము ప్రకృతి జ్ఞేయము కాదు. కనుక వేద ప్రకృతి మరియు ప్రధానము వేరువేరు. ఆ విధంగా కూడా ప్రధానము గురించి వేదములో ప్రసక్తిలేదు.**

## (111) I.4.5

**సూ. వదతీతి చేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్**

**క్ర. వదతి, ఇతి, చేత్, న, ప్రాజ్ఞః, హి, ప్రకరణాత్**

ప్ర.అ. వదతి = **చెప్పుచున్నది,** ఇతి = **ప్రకృతి కూడ జ్ఞేయమని,** చేత్ = **అనినచో,** న = **కాదు,** ప్రాజ్ఞః = **పరమాత్మయే జ్ఞేయమని సిద్ధమగును.**

వి. **ప్రధానాన్ని జ్ఞేయముగా చెప్పుచున్నది అని అంటే అదిసరికాదు. ఇది, పరబ్రహ్మకు చెందిన ప్రకరణము. ప్రధాన ప్రతిపాదకమైన ప్రకరణము కాదు.**

"శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు లేనట్టి అవ్యయము, అనాది, అనంతము అయినది, మహత్తుకంటే పరమైనది, నిశ్చలమైనది ఏదికలదో దానిని వెదికి తెలుసుకొన్న పురుషుడు మృత్యువు నుండి విముక్తుడౌతున్నాడు" (కఠ.ఉ. 3-15) అని చెప్పబడినదికదా. ఇక్కడ వెతికి తెలుసుకోదగినది ప్రధానమే అని అంటే ఇక్కడ ప్రధానం ప్రసక్తి లేదు. **"పురుషునికంటే శ్రేష్ఠమైనది మరొకటి లేదు. అదియే పరమగమ్యము"** (కఠ.ఉ. 3-11) అని అక్కడనే చెప్పబడినది. **కనుక పరమగమ్యము పరమాత్మయే కాని ప్రధానము కాదు.**

(కఠ.ఉ. 3-15; కఠ.ఉ.3-11, 12, 13)

## (112) I.4.6

**(నాచికేతాగ్ని విద్య)**

**సూ. త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ**

**క్ర. త్రయాణామ్, ఏవ, చ, ఏవం, ఉపన్యాసః, ప్రశ్నః శ్చ**

ప్ర.అ. త్రయాణామ్ = **మూడింటినిగూర్చి,** ఏవ = **యే,** చ = **కూడ,** ఏవం = **జ్ఞేయరూపమైన,** ఉపన్యాసః = **చర్చ (ప్రవదం),** చ = **ఇంకను,** ప్రశ్నః = **ప్రశ్నలు జరిగినవి**

వి. కఠోపనిషత్తులో (కఠ.ఉ.1-1, బ్ర.సూ. 1-4-1) యమ నచికేతుల సంవాదములో మూడు వరములను గూర్చి, మూడు ప్రశ్నలను గురించి వున్నది.

నచికేతుడు యమధర్మరాజును అడిగిన మూడు ప్రశ్నలు **అగ్ని, జీవము, పరమాత్మ** గురించి వున్నాయి. యమరాజు అతనికి మూడు సమాధానాలు **నచికేతాగ్ని** గురించి, **కర్మజ్ఞానానుసారము వచ్చే జన్మాంతర ప్రాప్తుల** గురించి మరియు **జన్మరాహిత్యమైన పరబ్రహ్మ** గురించి బోధించినాడు.

**మూడు ప్రశ్నోత్తరములలో ప్రధానమును గురించి ఏ ప్రసక్తిలేదు. కనుక పరమగమ్యము పరమాత్మయే కాని ప్రధానము కాదు.**

(కఠ.ఉ. 1-2-14, కఠ.ఉ.1-1; 1-1-15; 2-5-6,7)

## (113) I.4.7

సూ. **మహద్వచ్చ**

క్ర. **మహత్‌వత్, చ**

ప్ర.అ. మహత్ = **మహత్,** వత్ = **వలె,** చ = **కూడ**

వి. **ఏ విధముగా శ్రుతులలో మహత్ శబ్దము సాంఖ్యుల మహత్తు తత్త్వమును గూర్చి చెప్పలేదో, అదేవిధంగా శ్రుతలలో చెప్పే అవ్యక్తము సాంఖ్యుల అవ్యక్తము కాదు.** కావున శ్రుతిలో ప్రధానమును గూర్చి ప్రసక్తిలేదు.

(కఠ.ఉ.1-3-10, 1-1-22; శ్వేతా.ఉ. 3-8)

## 2) చమసాధికరణము (33)

## (114) I.4.8

సూ. **చమసవదవిశేషాత్**

క్ర. **చమసవత్, అవిశేషాత్**

ప్ర.అ. చమస = **చమసము (సోమరసపానము కొరకు చేయడు పాత్ర),** వత్ = **వలె,** అవిశేషాత్ = **ఏవిధమైన విషయము లేనందువలన**

వి. జన్మరహితుడైన అజుడు (జీవాత్మ, మేకపోతు) తన భోగం కోసం తెలుపు ఎరుపు నలుపుయైన జన్మరహితమైన అజను (మాయను, మేకను) సమీపించి అనేక ప్రజలను సృష్టిస్తున్నాడు. (శ్వేతా.ఉ.4-5) అని చెప్పబడినది. ఇందులో **'అజ' శబ్దము సాంఖ్యములో చెప్పబడిన ప్రకృతి అనుకొనుటకు విశేషము లేదు. ఏ విధముగా చమసము (లోపల లోయ పైన ఎత్తు) అనేది పాత్రగానే కాక శిరస్సు అనే అర్థం కలిగియున్నందున 'అజ' అనేది పుట్టులేని పరమాత్మ యొక్క ఆద్యశక్తిగానే కాని, సాంఖ్యుల ప్రధానము కాదు. కనుక ప్రధానము వేదప్రోక్తము కాదు.**

(శ్వేతా.ఉ.4-5)

## (115) I.4.9

సూ. **జ్యోతిరుపక్రమా తు తథా హ్యధీయత ఏకే**

క్ర. **జ్యోతిః, ఉపక్రమా, తు, తథా, హి, అధియతే, ఏకే**

ప్ర.అ. జ్యోతిః = **తేజస్సు,** ఉపక్రమా = **మొదలైన మూడు తీర్ల తత్త్వములు,** తు = **కావున,** తథా = **ఆ విధముగానే,** హి = **ఎందుకనగా,** అధీయతే = **అధ్యయనము చేస్తున్నారు,** ఏకే = **కొందరు**

వి. **ఎరుపు, తెలుపు, నలుపు (జలము, అగ్ని, అన్నము) అనేవి పరబ్రహ్మ యొక్క శక్తియైన రజస్సు,**

**సత్వము, తమస్సుకు వర్తిస్తాయి అని కొందరి మతము కనక 'అజ' అనేది పరమాత్మశక్తియే కాని, ప్రధానము కాదు.**

(ఛాం.ఉ. 6-4-1; శ్వేతా.ఉ. 1-3, 4-10, 11.)

## (116) I.4.10

**సూ. కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః**

**క్ర. కల్పనఉపదేశాత్, చ, మధ్వాదివత్, అవిరోధః**

**ప్ర.అ.** కల్పన = **'అజ' అను రూపకము,** ఉపదేశాత్ = **ఉపదేశము వలన,** చ = **కూడ,** మధ్వాది = **మధు మొదలైన,** వత్ = **వానివలె,** అవిరోధః = **విరోధములేదు**

**వి.** **'అజ'** (మేక) అను దానిని రూపకముగా చెప్పి, దానికి ఎరుపు, తెలుపు, నలుపు అను మూడురంగులు చెప్పబడినవి. ఈ మూడు రంగులు రజస్సు, సత్వము, తమస్సులతో పోల్చబడినవి.

**ఈ పోలిక "అసౌ వా ఆదిత్యో దేవ మధు" (ఛాం.ఉ. 3-1-1) "ఈ ప్రకాశించు సూర్యుడే దేవతలకు మధువు" అనుటలో మధువు కాని సూర్యున్ని మధువుతో పోల్చినట్టు కల్పన వున్నది. దానివలన 'అజ' అనేశబ్దం ప్రకృతిని బోధించుటలో (ప్రకృతి యందు అజత్వమును కల్పించిటములో) విరోధము లేదు. కావున ప్రధానము వేదోక్తముకాదు.**

(ఛాం.ఉ. 3-1-1; బృ.ఉ. 5-8)

## 3) సంఖ్యోపసంగ్రహాధికరణము (34)

## (117) I.4.11

**సూ.** న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ

**క్ర. న, సంఖ్యోపసంగ్రహాత్, అపి, నానాభావాత్, అతిరేకాత్, చ**

**ప్ర.అ.** న = **కాదు,** సంఖ్య = **సంఖ్యను,** ఉపసంగ్రహాత్ = **గ్రహించుట వలన,** అపి = **కూడ,** నానాభావాత్ = **అనేక విషయములను వేరు వేరుగా చెప్పుట వలన,** అతిరేకాత్ = **అధికముగా చెప్పుట వలన.**

**వి.** బృహదారణ్యకములో యాజ్ఞల్క్యుడు జనకునితో ఇలా అన్నాడు.

"యస్మిన్పంచ పంచజనా ఆకాశశ్చ ప్రనతిష్ఠితః తమేవ
మన్య ఆత్మానం విద్వాన్బ్రహ్మామృతోమృతం" (బృ.ఉ.4-4-17)

"అయిదుగురైదుగురగు జనులు (గంధర్వులు, పితరులు, దేవతలు, అసురులు, రక్షస్సులు) దేని యందు (అక్షర స్వరూపమునందు) ప్రతిష్ఠించబడెనో, ఆ పరమాత్మనే, ఆత్మస్వరూపముగా భావించుచున్నాను. నాశరహితమగు పరమాత్మను తెలిసికొని అమృతమయమగు బ్రహ్మమునైతిని."

పైన చెప్పిన బృహదారణ్యక మంత్రమందు (బృ.ఉ.4-4-17) సంఖ్యావాచకమైన పంచపంచజన శబ్దమును గ్రహించి (5×5=25) ఇరువదియైదు తత్త్వములని కల్పన చేయుట సరికాదు. ఈ

ఇరువదియైదు ఒప్పుకొన్నగూడ, మంత్రమందు చెప్పబడిన ఆకాశము, ఆత్మను కలిపిచూసిన ఇరువదిఏడు తత్త్వములగుచున్నవి. ఇది సాంఖ్యములో చెప్పినదానికన్న అధికముగానున్నది. కావున మంత్రములో, ఉపనిషత్తులలో చెప్పబడినది ప్రధానమనిగాని, పంచవింశతి (ఇరువది ఐదు) తత్త్వములని గాని తలంపరాదు. **పంచ పంచ** శబ్దములు పరబ్రహ్మకంటె విభిన్నమైన కార్యశక్తులని గ్రహించవలయును. **కావున సాంఖ్యప్రోక్త ప్రధానము వేదోక్తము కాదు.**

(బృ.ఉ. 4-4-17)

## (118) I.4.12

**సూ. ప్రాణాదయో వాక్యశేషాత్**

**క్ర. ప్రాణాదయః, వాక్యశేషాత్**

**ప్ర.అ.** ప్రాణాదయః = **ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, అన్నము, మనస్సు** వాక్యశేషాత్ = **వాక్యశేషము వలన**

**వి.** బృహదారణ్యక ఉపనిషత్తులో ఇలా ఉంది.

"ప్రాణస్యప్రాణముత చక్షుష చక్షురుత శ్రోత్రస్యశ్రోత్రం
మనసోయేమనోవిదుః తే నిచిక్యుర్బ్రహ్మపురాణమగ్ర్యమ్మృతం" (బృ.ఉ. IV-4-18)

"అక్షర స్వరూపమగు ఆత్మకు ప్రాణమునకు ప్రాణమై (ఆధారమై), నేత్రమునకు నేత్రమై (ఆధారమై), శ్రోత్రమునకు శ్రోత్రమై (ఆధారమై), మనస్సునకు మనస్సై (ఆధారమై) వుండునని తెలిసికొనిన వారే ఆ పరబ్రహ్మమును నిశ్చయముగా తెలిసికొనువారు" అని యాజ్ఞవల్క్యుడు జనకునికి చెప్పినాడు.

దీనిలో వున్న ప్రాణము, చక్షు, శ్రోత్రము, మనస్సు అనే నాలిగింటికి మాధ్యందినశాఖవారు "అన్నస్యఅన్నం" అని అన్నమును ఆ నాలిగింటికి వాక్యశేషముగా కలిపి "పంచ" (ఐదు) అనే దానిని పూర్తి చేస్తారు. కావున ఆ సంఖ్య ప్రధానము గూర్చి కాదు.

**కావున శ్రుతిలో ప్రధానము ప్రసక్తి లేదు.**

(బృ.ఉ. IV-4-18 మాధ్యందినశాఖ పాఠములో)

## (119) I.4.13

**సూ. జ్యోతిషైకేషామసత్యన్నే**

**క్ర. జ్యోతిషా, ఏకేషామ్, అసతి, అన్నే**

**ప్ర.అ.** జ్యోతిషా = **జ్యోతి ద్వారా,** ఏకేషామ్ = **కొందరి (కాణ్వాశాఖీయుల) పాఠమున,** అసతి = **లేకున్నను,** అన్నే = **అన్నము గూర్చి.**

**వి.** బృహదారణ్యక ఉపనిషత్తులో "ఆత్మను ప్రాణమునకు ఆధారముగాను, చక్షువునకు ఆధారముగాను, శ్రోత్రమునకు ఆధారముగాను, మనస్సుకు ఆధారముగాను తెలిసికొనువారే నిశ్చయముగా పరబ్రహ్మమును తెలిసుకొనినవారు." అని వున్నది. **"దీనిలో ప్రాణము, చక్షువు, శ్రోత్రము, మనస్సు అని నాలుగే వున్నాయి కదా? ఐదు లేవు" అని అంటే ఈ నాలుగింటితో మాధ్యందినశాఖవారు**

**అన్నమును కలిపి, కాణ్వశాఖవారు "జ్యోతిషాంజ్యోతి" అని జ్యోతిని కలిపి పంచజనత్వ సిద్ధి కావిస్తున్నారు.**
**కావున పంచజన అనునది ఆత్మకు సంబంధించినదే కాని, ప్రధానమునకు సంబంధించినది కాదు.**
(బృ.ఉ. IV-4-16)

## 4) కారణత్వాధికరణము (35)

## (120) I.4.14

**సూ. కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః**

**క్ర. కారణత్వే, న, చ, ఆకాశాదిషు, యథావ్యపదిష్టఉక్తేః**

ప్ర.అ. కారణత్వే = **కారణరూపముగా,** న = **కాదు,** చ = **కూడ,** ఆకాశాదిషు = **ఆకాశము మొదలైన వాటియందు,** యథా = **వర్ణింపబడినట్లు,** యథావ్యపదిష్టఉక్తేః = **సృష్టి కారణమును గూర్చి పూర్వవాక్యము ఏవిధముగా చెప్పెనో, ఆ విధముగానే తరువాత వాక్యములు పలుకుట వలన.**

వి. **వేదములలో, ఉపనిషత్తులలో జగమునకు కారణము బహు ప్రకారములుగా చెప్పబడినది. జగదుత్పత్తి క్రమముకూడ అనేక విధములుగా వర్ణింపబడినది. ఐనను జగత్తుకు కారణము పరబ్రహ్మమే అని అనుటయందు దోషమేమియులేదు. జగత్సృష్టికి రెండవకారణముగా ఆకాశాదులు చెప్పబడినా కూడ, వానికి పరమకారణముగా బ్రహ్మమునే చెప్పబడినది.** సృష్టి క్రమములు వేరుతీరుగా యున్నను, వాని వలన పరబ్రహ్మ మహత్త్వమే తెలియుచున్నది. అట్లు పరబ్రహ్మకు జగత్కారణత్వము చెప్పబడుట సమంజసము.
(ఛాం.ఉ. VI-2-1,2,3; III-19-1, I-4-7; బృ.ఉ. I-4-7;
తై.ఉ. 2-6; 2-7; ప్ర.ఉ. 6-4; ఐత.ఉ. VI-1-2)

## (121) I.4.15

**(సత్య విద్య)**

**సూ. సమాకర్షాత్**

**క్ర. సమాకర్షాత్**

ప్ర.అ. సమ = **పూర్ణముగా,** ఆకర్షాత్ = **ఆకర్షించి చెప్పబడినందున**

వి. **"ఒక చోట అసత్తు నుండి ఒక చోట సత్తు నుండి జగదుత్పత్తిని గురించి అనటంలో విరోధం లేదా?" అనే ప్రశ్నకు సమాధానం, సమాకర్షణ వల్ల విరోధము లేదు.** ఉపనిషత్తులలో కొన్ని, "జగత్తు అసత్ నుండి ఉత్పత్తి అయినది" అని; మరికొన్ని చోట్ల "సత్ నుండి అయినది" అన్నట్లు అనిపిస్తున్నది.

"అసద్వా ఇదమగ్ర అసీత్, తత్ వై సదజాయత" (తై.ఉ. 2-7)

"మొదట్లో ఇది అంతా అసత్. అసత్ నుండే సత్ జన్మించినది"

అంటే అసత్తు నుండే జగము వచ్చినది అని అనబడినది.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం; అనుచు తద్ధైక ఆహుః, అసత్ ఏవ ఇదమ్ అగ్ర ఆసీత్, ఏకమ్ ఏవ అద్వితీయం, తస్మాత్ అసతః సత్ అజాయత".

(ఛాం.ఉ. 6-2-1)

"కుత స్తు ఖలు సోమ్యేవగ్ం స్యాదితి హోవాచ, కథమ్ అసతః సత్ జాయత ఇతి, సత్ ఏవ సోమ్య ఇదమ్ అగ్ర ఆసీత్, ఏకమ్ ఏవ అద్వితీయమ్" (ఛాం.ఉ. 6-2-2)

"ఓ సౌమ్యా! మొట్టమొదలు సత్తు ఏకమై అద్వితీయమై యుండినది. అసత్తు గూడ వుండెనని కొందరు చెప్పినారు. కాని అది ఎట్లా వీలు అవుతుంది? అసత్తు నుండి సత్తు ఎలా పుట్టును? కావున సత్తుగానున్న ఏకము అద్వితీయమే మొదలు వుండెను" (ఛాం.ఉ.6-2-2)

మరల ఇక్కడ సత్తు నుండే జగమంతా వచ్చినదని చెప్పబడినది. మరి జగదుత్పత్తి అసత్తు నుండియా?, సత్తు నుండియా? అనే ప్రశ్న వస్తుంది. సత్తునుండే జగము వచ్చినది. అయితే "అసద్వా" అనినపుడు అసత్తు అనే శబ్దానికి "అభివ్యక్తం కాని నామరూపాత్మకమైన కారణవస్తువు (అంటే వున్నది-సత్), (నామరూపాలు బయటపడని కారణవస్తువు)" అని అనుకోవాలి.

"ఎవరు బ్రహ్మమును అసత్తు అనుకుంటాడో వాడు అసత్తే అవుతాడు. ఎవడు బ్రహ్మమును సత్తుగా గుర్తిస్తాడో వాడు సద్వస్తువుగానే గ్రహిస్తాడు. అంటే సత్తుయే కారణము.

**"అసత్" తో "సత్" నకు సమాకర్షణ (సంబంధం) వున్నది. కనుక జగత్కారణము "సత్" అనే అర్థము. పరమాత్మ జగత్కారణము అనుటలో వివిధ శ్రుతి వాక్యములలో విరోధము లేదు.**

(ఛాం.ఉ. 6-2-1, 6-2-2, తై.ఉ. 2-7) బ్ర.సూ.150,151 చూడుడు.

## 5) జగద్వాచిత్వాధికరణము (36) (బాలాకి విద్య)

## (122) I.4.16

**సూ. జగద్వాచిత్వాత్**

**క్ర. జగత్‌వాచిత్వాత్**

**ప్ర.అ.** జగత్ = **జగత్తు,** వాచిత్వాత్ = **వాచకము అయినందువలన**

**వి.** కౌషీతకీబ్రాహ్మణ ఉపనిషత్తులో బాలాకి మునికి, అజాతశత్రువు అనే రాజుకు అయినసంవాదంలో "యోవై బాలాకే! ఏతేషాం పురుషాణాం కర్తా, యస్య వా ఏతత్ కర్మ స వై వేదితవ్యః" (కౌషీ.బ్రా.ఉ. 4-18)

"ఓ బాలకీ! నీవు ఆదిత్య, చంద్ర, విద్యుత్, ఆకాశాల్లో వుండే (16 మంది) పురుషుల్ని బ్రహ్మం అని చెప్పావు. వీరు బ్రహ్మము కాదు. వీరందరికీ కర్త ఎవరో, ఇదంతా ఎవరి కర్మయో (పనియో) అతడే తెలుసుకోదగిన బ్రహ్మము" ఇక్కడ **"కర్మ" అనగా జడచేతనాత్మక జగత్తు. "కర్త" అనగా వేదితవ్యుడైన (తెలిసికోదగిన) పరబ్రహ్మము. కావున జడప్రకృతి జగత్తునకు కారణము కాదు. పరబ్రహ్మయే కారణము.**

(కౌషీ.బ్రా.ఉ. 4-18, 19)

## (123) I.4.17

**సూ. జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతమ్**

**క్ర. జీవముఖ్యప్రాణలింగాత్, న, ఇతి, చేత్, తత్, వ్యాఖ్యాతమ్**

ప్ర.అ. జీవ = **జీవము,** ముఖ్యప్రాణ = **ముఖ్య ప్రాణము (ప్రాణ, అపాన మొదలైనవానిలో మొదటిది ప్రాణము),** లింగాత్ = **లింగముల వలన,** న = **కాదు,** వ్యాఖ్యాతామ్ = **మొదలే వ్యాఖ్యానించబడినది.**

వి. పంచజన (బృ.ఉ. IV-4-17) అనుటలో ప్రాణ అనగా జీవుడు కాని, ముఖ్య ప్రాణము ప్రాణాపానాదులలో మొదటిది అని అనిన యెడల అది అట్లు కాదు. ఈ విషయము ప్రతర్దనాధికరణములో (బ్ర.సూ. I-1-11) లో వ్యాఖ్యానించబడినది. (బ్ర.సూ. I-1-28, 29, 30, 31) **అట్లు పంచజనలోని ప్రాణశబ్దము జీవముకు కాని ముఖ్యప్రాణమునకుగాని వర్తిల్లదు. జగత్కారణమైన బ్రహ్మమునకే వర్తిస్తుంది.**
(బ్ర.సూ. 1-11, 28, 29, 30, 31)

## (124) I.4.18

**సూ. అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపిచైవమేకే**

**క్ర. అన్యార్థం, తు, జైమినిః, ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం, అపి, చ, ఏవం, ఏకే**

ప్ర.అ. అన్యార్థం = **జీవముఖ్య ప్రాణముల వర్ణనము వేరొక ప్రయోజనమునకు చేయబడినది,** తు = **అని,** జైమినిః = **జైమిని మహర్షి,** ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం = **అది బాలాకి, అజాతశత్రు సంవాదములో (కౌషీ.బ్రా.ఉ. 4-18)లో వ్యాఖ్యానించబడినది,** అపి = **కూడ,** ఏకే = **కాణ్వశాఖీయులు.**

వి. **అజాతశత్రువు బాలాకీ సంవాదము (కౌషీ.బ్రా.ఉ. 4.18) గూర్చి జైమిని మహర్షి ప్రకారము ఆ ప్రకరణమునందు జీవప్రాణములు జగత్కారణముగా ప్రసంగించబడలేదు మరియు బ్రహ్మమే సమస్త లక్షణములకు ఆశ్రయమని చెప్పుటకు ప్రశ్నించబడినది. కావున బ్రహ్మమే జగత్కారణమని గ్రహించవలెను.**

## 6. వాక్యాన్వయాధికరణము (37) (మైత్రేయి విద్య)

## (125) I.4.19

**సూ. వాక్యాన్వయాత్**

**క్ర. వాక్యఅన్వయాత్**

ప్ర.అ. వ్యాక్య = **వ్యాక్యములకు,** అన్వయాత్ = **బ్రహ్మమునందే అన్వయము కల్గుతున్నందువలన.**

వి. బృహదారణ్యకోపనిషత్తులో మైత్రేయి తనభర్త యాజ్ఞ్యవల్క్యునితో "నేను దేనిచేత ముక్తురాలను కానో అ సంపదలను నేను ఏమి చేతును? దేనిచేత బ్రహ్మమును గుర్తెరుగుదునో దానిని నాకు బోధించుము" (బృ.ఉ. 4-5-4) అని అనగా యాజ్ఞ్యవల్క్యుడు ఆత్మజ్ఞానము బోధించెను. చివరకు

యాజ్ఞ్యవల్క్యుడు అమృతత్వం అంటే ఇంతటిది అని చెప్పినాడు.

కౌషీతకీ ఉపనిషత్తులో (కౌ.బ్ర.ఉ.4-18,19) పూర్వపదములలో బ్రహ్మమును గూర్చియే చెప్పబడినది. జీవాత్మ ప్రాణముల వర్ణనము బ్రహ్మయే జగత్కారణమని అనుటకు చెప్పబడినది. **కావున పూర్వాపరములలో చెప్పిన ఆత్మజ్ఞానము జీవుని గురించి కాదు. అమృతత్వము బ్రహ్మము గురించి కనుక తెలియదగినది, చూడదగినది బ్రహ్మమే కాని, జీవుడు కాదు.**

(బృ.ఉ. 4-5-3, 4-5-15), (కౌ.బ్ర.ఉ.4-18,19)

## (126) I.4.20

**సూ. ప్రతిజ్ఞాసిద్ధేః లింగమాశ్మరథ్యః**

**క్ర. ప్రతిజ్ఞాసిద్ధేః, లింగమ్, ఆశ్మరథ్యః**

**ప్ర.అ.** ప్రతిజ్ఞా = **మొదలు చేయబడిన ప్రతిజ్ఞ, సిద్ధేః = సిద్ధియగుట వలన,** లింగం = **జీవప్రాణ లక్షణవర్ణనము బ్రహ్మజగత్కారణము,** ఆశ్మరథ్యః = **ఆశ్మరథ్యాచార్యుల మతము.**

**వి.** "ఆత్మ తెలిస్తే ఈ దృశ్యజాతమంతా తెలుస్తుంది. ఏకవిజ్ఞానము వలన సమస్త విజ్ఞానము లభిస్తుంది". (ఇది ప్రతిజ్ఞ) (బృ.ఉ. 4-5-6) **జీవప్రాణముల లక్షణము బ్రహ్మ జగత్కారణము ఐనందువలన సిద్ధిస్తుంది. జీవాత్మ పరమాత్మలకు భేదము, అభేదము వున్నాయి. బ్రహ్మమే జగత్కారణము. అని ఆశ్మరథ్యాచార్యుల మతము.**

(బృ.ఉ.4-5-6)

## (127) I.4.21

**సూ. ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః**

**క్ర. ఉత్క్రమిషతః, ఏవం, భావాత్, ఇతి, ఔడులోమిః**

**ప్ర.అ.** ఉత్క్రమిష్యతః = **శరీరమును వదిలి,** ఏవం = **ఈ ప్రకారము,** ఇతి = **ఇట్లు,** ఔడులోమిః = **ఔడులోమి ఆచార్యులు చెప్పెను.** (ఔడులోమిః అనగా: ఉడుః ఇవ లోమాః యస్య సః ఔడులోమిః = **శరీరంలోని రోమములు నక్షత్రముల వలె మెరుస్తున్నాయి కాబట్టి ఔడులోమిః అని వ్యవహరిస్తారు**).

**వి. బ్రహ్మసాక్షాత్కారం ఐనతరువాత దేహాదిసంఘాతము నుండి ఉత్క్రమిస్తూ (లేచి వదిలి) జీవుడు పరమాత్మలో ఏకత్వాన్ని పొందుతాడు. కావున భవిష్యత్తులో జరుగనున్న ఈ అభేదాన్ని గ్రహించి జీవునిలో ఉపక్రమం చేయబడ్డదని ఔడులోమి ఆచార్యుని అభిప్రాయం.**

"మోక్ష సమయమున ప్రాణాదులైన పదిహేను కళలు తమ తమ కారణములను చేరిపోవును. సమస్త చక్షురాది ఇంద్రియ దేవతలు సూర్యాదులయందు చేరిపోవుదురు. కర్మలు, విజ్ఞానమయుడగు జీవాత్మ, అవ్యయమైన పరబ్రహ్మనందు విలీనమైపోవును" (ముం.ఉ.III-2-7)

"యదా నద్యః స్యందమానాః సముద్రే అస్తం గచ్ఛంతి, నామరూపే విహాయ, తథా విద్వాన్ నామరూపాత్ విముక్తః, పరాత్పరం పురుషమ్ ఉపైతి దివ్యమ్"

"ఈ విధంగా ప్రవహించు నదులు తమ నామరూపాలు, వదిలి సముద్రములో లీనమై పోతాయో, అదేరీతిగా ఆత్మజ్ఞాని నామరూపాల నుండి విముక్తుడై పరాత్పరుడైన దివ్యపురుషుని పొందుతున్నాడు". (ముం.ఉ.III-2-8)

కావున ఉత్పత్తి లయముమునకు బ్రహ్మమే కారణము. జీవాత్మ పరమాత్మల బేధము చూపబడినది. బ్రహ్మసత్యము. ఇది ఔడులోమి సత్యభేదవాదమును నిరూపించినాడు.

(ముం.ఉ.III-2-7-8)

## (128) I.4.22

**సూ. అవస్థితేరితి కాశకృత్స్నః**

**క్ర. అవస్థితేః, ఇతి, కాశకృత్స్నః**

ప్ర.అ. అవస్థితేః ఇతి = **జీవ బ్రహ్మములకు బింబ, ప్రతిబింబ భావముచే ఎంత మాత్రము భేదము లేకుండుట వలన ప్రకృత ప్రతిజ్ఞ సిద్ధము అగుచున్నదని,** కాశకృత్స్నః = **కాశకృత్స్న ఆచార్యుల అభిప్రాయము.**

వి. **ఆశ్మరథ్యుని మతములో జీవునికి పరమాత్మకు భేదము, అభేదము రెండూ వున్నాయి. ఔడులోమిః ప్రకారము ముక్తికి పూర్వము జీవాత్మకు, పరమాత్మకు భేదం వున్నది, ముక్తి తరువాత లేదు. జీవబ్రహ్మములకు బింబ ప్రతిబింబ భావముచే ఏ మాత్రము బేధము లేదని కాశకృత్స్న ఆచార్యుల మతము.**

"నేను అనేకంగా కావాలని" అతడు కోరాడు. (తై.ఉ. 2-1) "అతడు కోరాడు" (సోఽకామయత) అనే అభిధ్యానం (సంకల్పము) ఉపదేశించబడుట వలన కూడా ఆత్మ, నిమిత్తకారణము అని మరియు "నేను అనేకం కావాలి" (బాహుస్యాం) అనబడుట వలన ఆత్మ, ఉపాదానకారణం గూడా అవుతున్నది. అనుకునేది నిమిత్తము (కర్త), అయ్యేది ఉపాదానము (కర్మ) ఆ విధంగా **అనుకునేది, అయ్యేది అనగా నిమిత్తము మరియు ఉపాదానము, సృష్టికి పరబ్రహ్మమే.**

(తై.ఉ. 2-1)

## 7. ప్రకృత్యధికరణము (38)

## (129) I.4.23

**సూ. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతనుపరోధాత్**

**క్ర. ప్రకృతిః, చ, ప్రతిజ్ఞాదృష్టాంతనుపరోధాత్**

ప్ర.అ. బ్రహ్మము జగత్తునకు ప్రకృతి = **ఉపదానకారణము,** చ = **నిమిత్తకారణము గూడ నగుచున్నది,** ప్రతిజ్ఞాదృష్టాంతనుపరోధాత్ = **ఏక విజ్ఞానముచే సర్వవిజ్ఞానము గలుగునను ప్రతిజ్ఞకును మృతికాదృష్టాంతమునకును విరుద్ధము లేకుండుటవలన.**

వి. **బ్రహ్మ ఈ జగత్తుకు ఉపాదానకారణం, నిమిత్తకారణం కూడా. ఎందుచేతనంటే, ప్రతిజ్ఞా దృష్టాంతాల సామంజస్యము వలన.**

ప్రతిజ్ఞ-**"ఉత తమాదేశ మప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం"** (ఛాం.ఉ.6-1-3). "దేని వల్ల అశ్రుతము శ్రుతమౌతుందో, అమతం మతమౌతుందో, అవిజ్ఞాతం విజ్ఞాతమౌతుందో, అట్టి ఆదేశాన్ని గూర్చి గురువును అడిగావా?" అని ఉద్దాలక ఆరుణి ముని తన తనయుడైన శ్వేతకేతువును అడిగినాడు. ఇక్కడ ఆత్మజ్ఞానం వల్ల సమస్తము విజ్ఞాతమౌతుంది అని అనటం వల్ల ఆత్మ ఉపాదాన కారణం అని తెలుస్తోంది. కేవలం నిమిత్తకారణమే అయినట్లైతే సర్వజ్ఞానమూ కలగదు. కులాలుడుని తెలిసినంత మాత్రం చేత ఘటానికి సంబంధించిన విజ్ఞానమంతా మనకు తెలియదు. ఉపాదాన, ఉపాదేయాలు వ్యతిరేకమైనవికావు (ఒకటే) కనుక, ఉపాదానం తెలిస్తే దానికి కార్యమైన ఉపాదేయం తెలుస్తుంది.

అలాగే దృష్టాంతం - **"యథా సోమ్య! ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"** (ఛాం.ఉ. 6-1-4). "ఓ ప్రియదర్శనుడా! ఒక మృత్పిండానికి సంబంధించిన జ్ఞానం వల్ల, ఆ మృత్తిక యొక్క సమస్తవికారాలకు సంబంధించిన జ్ఞానము కలుగుతుంది. వికారమనేది వాక్కునాశ్రయించి ఉండే పేరు మాత్రమే! మృత్తికయే సత్యం" అని ఉద్దాలక మహర్షి బోధించాడు.

మృత్తికయే సత్యం అనటంవల్ల, ఉపాదానం తెలియటం వల్ల ఉపాదేయం (కుండ. మొ॥) పూర్తిగా తెలుస్తుందని చెప్పటం వల్ల బ్రహ్మము జగత్తుకు ఉపాదాన కారణము, నిమిత్తకారణము కూడా అవుతున్నాడు. **బ్రహ్మము, అభిన్ననిమిత్తోపాదాన కారణుడు అనే విషయాన్నే చెపుతున్నారు.**

(ఛాం.ఉ.6-1-3), (ఛాం.ఉ. 6-1-4)

## (130) I.4.24

**సూ.** **అభిద్యోపదేశాచ్చ**

**క్ర.** **అభిద్యోపదేశాత్, చ**

**ప్ర.అ.** అభిద్య ఉపదేశాత్ చ = **"సోఽకామయత" అతడు కోరెను అనుశ్రుతియందు జగత్సృష్టి చేయవలయునని వినవచ్చుట చేత సృష్టిసంకల్పమును ఉభయకారణత్వము అతనికి చెప్పవచ్చును.**

**వి.** **బ్రహ్మము పుష్కలముగా సంకల్పించెను. అని శాస్త్రము పలుకుట చేత ఆత్మ జగత్తునకు నిమిత్త ఉపాదాన కారణం అని తెలియవచ్చుచున్నది.** "నేనే అనేకముగా విస్తరించెదను." (తై.ఉ. 2-1) **"తానే విస్తరించెదనని అతడు ఆలోచించెను."** అని శ్రుతులు వినవచ్చుచున్నవి. ముందు ముందు సంకల్పించుట తరువాత స్వయముగా ప్రవర్తించుట - వీని వలన అత్మయొక్క కర్తృత్వము తెలియచున్నది. " నేనే విస్తరించెదను" అనుట చేత ప్రత్యగాత్మయె జగత్తుగా విస్తరించటకు సంకల్పించెననియు, అందువలన ఉపాదాన కారణము అవుతున్నదని తెలియుచున్నది.

(తై.ఉ. 2-1)

## (131) I.4.25

**సూ. సాక్షాచ్చోభయామ్నానాత్**

**క్ర. సాక్షాత్, చ, ఉభయామ్నానాత్**

ప్ర.అ. సాక్షాత్ = **సాక్షత్తు,** చ = **కూడ,** ఉభయామ్నానాత్ = **సృష్టి, లయములు రెండు చెప్పబడినందున,** చ = **కూడ**

వి. "ఈ సమస్త భూతములు ఆకాశం నుండియే పుట్టుతున్నాయి. ఆకాశంలోనే లీనమౌతున్నాయి". (ఛాం.ఉ.I-3-1) ఇందులో ఆకాశం అనే శబ్దము బ్రహ్మవాచకము. కావున బ్రహ్మమునుండియే సమస్తము ఉత్పత్తి, ప్రళయములు అవుతున్నాయి. **జగములు బ్రహ్మము నుండి వెడలి బ్రహ్మమునందే కలుస్తున్నాయి. పాత్రలు మట్టి నుండి వచ్చి మట్టిలో కలిసినట్లు. ఆ విధంగా బ్రహ్మము సమస్తమునకు ఉపాదానకారణము.**
(తై.ఉ.-3; ఛాం.ఉ. I-3-1)

---

## (132) I.4.26

**సూ. ఆత్మకృతేః పరిణామాత్**

**క్ర. ఆత్మకృతేః, పరిణామాత్**

ప్ర.అ. ఆత్మకృతేః = **స్వయముతానే తననుండి తనను సృజించుట వలన,** పరిణామాత్ = **జగత్తురూపంగా పరిణామము పొందినందువలన**

వి. "తదాత్మనం స్వయమకురుత" (తై.ఉ. 2-7) **పరమాత్మ తానే, తన నుండి తననె సృష్టించుకొనెను మరియు తానే జగద్రూపంగా పరిణమించెను. చేసుకొనేవాడు, చేయబడినది పరమాత్మయే ఆ విధంగా పరబ్రహ్మ ఈ జగత్తుకు నిమిత్తకారణము మరియు ఉపాదానకారణము.**
(తై.ఉ. 2-7)

---

## (133) I.4.27

**సూ. యోనిశ్చ హి గీయతే**

**క్ర. యోనిః, చ, గీయతే**

ప్ర.అ. యోనిః = **ఉపాదాన కారణము,** చ = **ఎక్కడి నుండి సృష్టి అవుతుందో అది నిమిత్తకారణము, ఎక్కడ లయమౌతుందో అది ఉపాదానకారణము కూడా,** గీయతే = **చెప్పబడినందున.**

వి. "యద్భూత యోనిం పరిపశ్యంతి ధీరాః" (ముం.ఉ. I-4-6)
"భూతములకు మూలమైనవానిని ధీరులు బాగుగా చూస్తారు" అని అనటంలో ఆత్మను ప్రకృతిరూపమైన యోనిగా చెప్పారు. **ప్రకృతి భూతాలకు ఉపాదానకారణం కావున, బ్రహ్మ సమస్తభూతములకు నిమిత్తకారణమేకాక ఉపాదానకారణం కూడా అవుతాడు.**
(ముం.ఉ. I-4-6)

---

## 8. సర్వవ్యాఖ్యానాధికరణము (39)

## (134) I.4.28

**సూ. ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః**

**క్ర. ఏతేన, సర్వే, వ్యాఖ్యాతాః, వ్యాఖ్యాతాః**

**ప్ర.అ.** ఏతేన = **ఈ విచారణ వలన;** సర్వే = **అందరి,** వ్యాఖ్యాతాః = **ప్రశ్నలకు సమాధానము చెప్పబడినవి యగుచున్నవి;** వ్యాఖ్యాతాః = **ప్రశ్నలకు సమాధానము చెప్పబడినవి అగుచున్నది (రెండవ వ్యాఖ్యాతాః శబ్దము అధ్యాయపరిసమాప్తిని సూచించును.)**

వి. **ప్రధాన కారణాన్ని నిరాకరించినందువలన వేరు అన్నివాదాలు నిరాకరించబడినవిగా అవుతాయి.** జడమైన ప్రధానాన్ని నిరాకరించిన పద్ధతిలోనే జడములైన అణువులు మొదలైన వాటి నన్నిటిని నిరాకరించటము అయినది. పరబ్రహ్మమే ఈ సృష్టికి, జగత్తుకు మూలము, కారణము.

ఇట్లు
**ప్రథమాధ్యాయ చతుర్థ పాదము**



# ప్రథమాధ్యాయ చతుర్థ పాద సమాసము

## బ్రహ్మము కాని వాని నిరాకరణ

1. **ఆనుమానికాధికరణము**
   ప్రధానము శ్రుతిప్రతిపాదితము కాదు. అవ్యక్తము అనే పదము శరీరమును గూర్చి చెబుతున్నది.

2. **చమసాధికరణము**
   అజము అనేది పరమాత్మశక్తియే కాని ప్రధానము కాదు.

3. **సంఖ్యోపసంగ్రహాధికరణము**
   "పంచజన" అనునది ఆత్మకు సంబంధించినదియే కాని, ప్రధానమునకు సంబంధించినది కాదు.

4. **కారణత్వాధికరణము**
   పరమాత్మ జగత్కారణము అనుటలో వివిధ శ్రుతివాక్యములలో విరోధము లేదు.

5. **జగద్వాచిత్వాధికరణము**
   వేదితవ్యుడైన పురుషుడు మరియు జగత్కారణము బ్రహ్మమే.

6. **వాక్యాన్వయాధికరణము**
   ద్రష్టవ్యము, శ్రోతవ్యము అయినది పరామాత్మయే. తెలియదగినది చూడదగినది, వినదగినది బ్రహ్మమే.

7. **ప్రకృత్యధికరణము**
   జగత్తుకు బ్రహ్మమే నిమిత్తకారణము మరియు ఉపాదానకారణము కూడాను.

8. **సర్వవ్యాఖ్యానాధికరణము**
   జడమైన ప్రధానాన్ని నిరాకరించటములో బ్రహ్మముకాని వాటినన్నింటినీ నిరాకరించటమే.

ఇట్లు

**ప్రథమాధ్యాయ చతుర్థపాద సమాసము**

# ప్రథమాధ్యాయ చతుర్థ పాద సారము

## బ్రహ్మము కాని వాని నిరాకరణ

ఏది ప్రధానముకన్నమించినదో, దేనికి అజము అనేది శక్తియో, పంచజన అనే శబ్దము దేనికి సంబంధము అవుతుందో, ఏది జగత్కారణమని శ్రుతివాక్యములన్నీ పరస్పరవిరోధము లేకుండా చెబుతున్నాయో, ఏది వేదితవ్యుడైన పురుషుడో, ఏది దృష్టవ్యము, శ్రోతవ్యము, జ్ఞాతవ్యమో, ఏది జగత్తుకు నిమిత్తకారణము మరియు ఉపాదానకారణమో (ఏది తాను తననే సృజించినదో), ఏది జగత్కారణములు కావని నిరాకరించబడిన జడములన్నింటికి ఆధారమైయుండి జగన్మూలమైనదో అదియే బ్రహ్మము.

ఇట్లు
ప్రథమాధ్యాయ చతుర్థపాద సారము

# శ్రీ బాదరాయణీయ
# బ్రహ్మసూత్ర బోధామృత లహరి

## II
## ద్వితీయ అధ్యాయము
### అవిరోధము

### అవిరోధము

వేదాంత వాక్యముల సమన్వయార్థమ్ము తెలిసి
సర్వమతముల సమాధానమ్ము చేసి
సంశయములన్ని తీర్చినపుడు
అవిరోధము యగుచుకలుగుచుండి
పూర్ణ అవగాహన కలుగు నుందు
సంపూర్ణ సమ్మతమ్మయగును.

# II.1
# ద్వితీయ అధ్యాయము - ప్రథమ పాదము

## సాంఖ్యాది మత నిరాకరణ

## 1. స్మృత్యధికరణము (40)

### (135) II.1.1

**సూ.** **స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి చేన్నా న్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్**

**క్ర.** **స్మృతిఅనవకాశదోషప్రసంగః, ఇతి, చేత్, న, అన్యస్మృతిఅనవకాశదోషప్రసంగాత్.**

**ప్ర.అ.** స్మృతి అనవకాశ దోష ప్రసంగః = **ప్రధానము జగత్తుకు కారణము కాదు అనిన సాంఖ్యస్మృతిని మన్నించలేదని దోషం వచ్చును,** ఇతి = **అని,** చేత్ = **అనిన యెడల,** న = **అట్లు కాదు,** అన్యస్మృతి అనవకాశదోషప్రసంగాత్ = **సాంఖ్యమును మన్నించిన ఇతర స్మృతులను మన్నింపని దోషము వచ్చును.**

**వి.** **మహాజ్ఞాని కపిలమహర్షి సాంఖ్యమున ప్రధానము జగత్కారణమనినాడు. కనుక అది మన్నించవలెను అని అనినచో ఇతర మహర్షులు చెప్పినది మన్నించని దోషము వస్తుంది.**

"సర్వభూతముల యొక్క బీజంబు నేను
పార్థ సర్వసనాతనంబు సర్వముదంబు నేను" (భ.గీ. VII-10)
"ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః
భూతగ్రామమిమం కృత్స్నం అవశం పృకృతేర్వశాత్" (భ.గీ IX-8)
"ప్రకృతి వశములవియుగాన నా ప్రకృతిని నేనవష్టంబు చేసి
నే సృజియింతును మరల మరల సర్వభూతములను తడవతడవ" (భ.గీ. IX-8)

వేదమునకు అనుకూలమైన మనుస్మృతి, అన్నియు పురాణములు జగముకు పరమాత్మయే కారణమని నొక్కి చెప్పుచున్నవి. కావున శ్రుతికి-శ్రుతికి, స్మృతులకు విరోధము లేదు. **శ్రుతికి, స్మృతికి విరోధమైనప్పుడు వేదమునే, శ్రుతినే ప్రమాణముగా స్వీకరించవలెను. లేనిచో వేదఋషులను, వ్యాసమహర్షిని, ఉపనిషత్తుల ఋషులను, మనువును మన్నించని దోషము వస్తుంది. కావున ప్రధానము జగత్కారణము కాదు.**

(భ.గీ. VII-10) (భ.గీ IX-8)

## (136) II.1.2

సూ. **ఇతరేషాం చానుపలబ్ధేః**

క్ర. **ఇతరేషాం, చ, అనుపలబ్ధేః**

ప్ర.అ. ఇతరేషాం = **ఇతర స్మృతులయొక్క మతమున,** చ, అనుపలబ్ధేః= **ప్రధానము జగమునకు కారణమని లేదు కనుక**

వి. **సాంఖ్యము దక్క ఏ ఇతర స్మృతులందు జగత్కారణము ప్రధానమని చెప్పబడలేదు. కనుక సాంఖ్యము ప్రమాణము కాదనుట ఉచితమే.** ప్రధానమునకు పరిణామములైన మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు కూడ సాంఖ్యస్మృతి కల్పితములు కాని వేదములందు చెప్పబడలేదు. **కావున సాంఖ్యము ప్రమాణము కాదు.**

## 2. యోగప్రత్యుక్త్యధికరణము (41)

## (137) II.1.3

సూ. **ఏతేన యోగః ప్రత్యుక్తః**

క్ర. **ఏతేన, యోగః, ప్రత్యుక్తః**

ప్ర.అ. ఏతేన = **ముందు చెప్పబడిన ఈ విచారణము వలన,** యోగః = **యోగశాస్త్రమును గూర్చి కూడ,** ప్రత్యుక్తః = **చెప్పబడినట్లు, నిరాకరించనట్లు అయినది.**

వి. **పతంజలి మహర్షి యోగము, కపిల మహాముని సాంఖ్యమును ఆధారముగా తీసుకొన్నది. కావున సాంఖ్యమును మరియు ప్రధానమును కాదనటములో యోగము కూడా నిరాకరించ బడినదైనది.**

## 3. విలక్షణత్వాధికరణము (42)

## (138) II.1.4

సూ. **న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్**

క్ర. **న, విలక్షణత్వాత్, అస్య, తథాత్వం, చ, శబ్దాత్.**

ప్ర.అ. న = **కాదు,** విలక్షణత్వాత్ = **కార్యరూపమైన జగత్తు, చైతన్యమైన కారణము కన్న విలక్షణము, అనగా జడము, అయినందువలన,** శబ్దాత్ = **శబ్ద ప్రమాణమైన వేదము వలన**

వి. **ఈ జగత్తు తన కారణమైన బ్రహ్మము కంటే విలక్షణమైనందువలన చేతనమైన బ్రహ్మము జగత్కారణమనటానికి వీలులేదు. అని తర్కవాదులు అంటారు.**

ఇది ప్రతివాదము.

## (139) II.1.5

సూ. **అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్**

క్ర. **అభిమాని వ్యపదేశః, తు, విశేషానుగతిభ్యామ్**

ప్ర.అ. అభిమాని వ్యపదేశః = **అది ఆయా తత్వముల అధిష్ఠాన దేవతల వర్ణనము,** తు = **అయితే,** విశేషానుగతిభ్యాం = **విశేష శబ్దముల ప్రయోగము చేత ఆ తత్త్వములందు దేవతల ప్రదేశమును గూర్చిన వర్ణనమని సిద్ధించుచున్నది.**

వి. **'భూమి అన్నది' 'నది అన్నది' అని అన్నమాటల వలన భూమి, నీరు చేతనమనిపించినా అది సరిగాదు. ఆ మాటలు అన్నది భూమి అధిష్ఠాన దేవత మరియ నదీ అధిష్ఠాన దేవత. కావున భూతములు జగత్తు జడమే.** అయితే చైతన్యమునుంచి జడము ఎలా వస్తుంది? అని ప్రతివాదులు అన్న ప్రశ్నకు సమాధానము ఇలా వున్నది.

## (140) II.1.6

సూ. **దృశ్యతే తు**

క్ర. **దృశ్యతే, తు.**

ప్ర.అ. దృశ్యతే = **కనిపించుచున్నది,** తు = **అయితే, కాని**

వి. **చైతన్యము నుండి విలక్షణమైన జడపదార్థములు వచ్చినట్లు వేదములలో కనిపిస్తున్నది.** చైతన్యమైన 'మనుష్యుల' నుంచి జడపదార్థములైన గోళ్లు, వెంట్రుకలు మొలచి పెరుగుతున్నాయి. అదే విధంగా చైతన్యమైన 'సాలె పురుగు' నుంచి జడమైన దారం వస్తుంది. మూలము నుంచి, కారణము నుంచి విలక్షణమైన పదార్థములు జనించటము ఆశ్చర్యము కాదు. చైతన్యమైన బ్రహ్మము నుంచి జడమైన భాగములు, భూతములు జనించుటము అస్వాభావికము కాదు. స్వాభావికమే. **కావున చైతన్యము నుంచి జడపదార్థములు రావటము సంభవము. జడపదార్థములు మాట్లాడుతున్నట్లు, క్రియలు చేస్తున్నట్లు వున్నా ఆ మాట్లాడేది ఆయా పదార్థములు దేవతలు కావున భూతములు జడములే. అయినా అవి బ్రహ్మము నుండి వచ్చినవే.**

## (141) II.1.7

సూ. **అసదితి చేన్న ప్రతిషేధమాత్రత్వాత్**

క్ర. **అసత్, ఇతి, చేత్, న, ప్రతిషేధమాత్రత్వాత్.**

ప్ర.అ. అసత్ = **అసత్కార్యవాదము, అనగా ఉనికి లేనిది ఉత్పన్నమెట్లుయగును,** ఇతిచేత్ = **అని అనిన,** న = **అట్లు కాదు,** ప్రతిషేధమాత్రత్వాత్ = **అభావబోధకము.**

వి. అభావము నుండి భావము యొక్క ఉత్పత్తి అసంభవమని చెప్పబడినది కాని, **సత్స్వరూపముయైన పరమాత్మ నుండి జగములు వచ్చుట అసత్తు నుండి సత్తువచ్చుట కాదు.** సత్తు నుండి జడములు వచ్చుట, గోళ్లవలె సంభవము. **సత్యస్వరూపమైన బ్రహ్మము నుండియే జగములు వచ్చుట యథార్థము.**

## (142) II.1.8

సూ. **అపీతౌ తద్వత్ప్రసంగాదసమంజసమ్**

క్ర. **అపీతౌ, తద్వత్, ప్రసంగాత్ అసమంజసమ్.**

ప్ర.అ. అపీతౌ = **అట్లు ఒప్పుకొన్నను,** తద్వత్ ప్రసంగాత్ = **బ్రహ్మమునకు ఈ సంసారమందలి జడత్వము, సుఖదుఃఖములతో కూడియుండుట మొదలైన ప్రసంగము తటస్థమగును కావున,** అసమంజసమ్ **= సమంజసము కాదు, యుక్తము కాదు.**

వి. **ప్రళయకాలమున ఈ సమస్త జగము ఆ పరమాత్మయందు లీనమగును అన్న యెడల, అప్పుడు బ్రహ్మకు జడత్వము, సుఖ దుఃఖముల అంటు కలుగును అన్న ప్రసక్తిరాగలదు అని అనిన అది అంగీకారముకాదు.** పరబ్రహ్మ జడత్వాది ధర్మములచే రహితమై, నిర్వికారము, విశుద్ధము అని చెప్పబడినది. సంసారము, జగము బ్రహ్మములో లీనమైనపుడు ప్రపంచమే కాదు, దాని దోషములు మరియు ధర్మములు కూడ కరిగి, తరిగి, లేకుండాపోవును (కర్పూరము అగ్నిలో ఇగిరిపోయినట్లు). **కావున బ్రహ్మము యొక్క శుద్ధత్వము, నిత్యము మరియు సత్యము. విశుద్ధమైన బ్రహ్మము నుండి జగత్తు కలిగి, తరిగి, తిరిగి, కలసిపోయి విశుద్ధమైన బ్రహ్మమే యుండుచుండును.**

---

## (143) II.1.9

సూ. **న తు దృష్టాన్తభావాత్**

క్ర. **న, తు, దృష్టాన్త భావాత్**

ప్ర.అ. న = **లేదు,** తు = **ఇంతకు ముందు చెప్పబడిన దోషము వేదసమ్మత సిద్ధాంతములందు లేదు,** దృష్టాంతభావాత్ = **ఎందుకంటే, అనేక దృష్టాంతములు వున్నవి (కారణమందు కార్యము లీనమైనను కారణమందు కార్యధర్మములు వుండవని సిద్ధించబడినవి).**

వి. **వెనుక చెప్పబడిన అసామంజస్యదోషం ఏమీ ఉండదు. కారణములో లీనమైన కార్యం, తనకు కారణమైన దానిని దూషితం చేయదు.** మట్టిలో కలిసిపోయిన మట్టికుండ, బంగారంలో కలిసిపోయిన బంగారు గాజు, నీళ్లలో కలిసిపోయిన మంచుగడ్డ, నీటిలో పడిన వర్షమువలె **బ్రహ్మము నుండి వచ్చిన జగము బ్రహ్మములో కలిసి తన అస్తిత్వాన్ని కోల్పోయి, బ్రహ్మములాగనే వెలుగుతుంది.**

---

## (144) II.1.10

సూ. **స్వపక్షదోషాచ్చ**

క్ర. **స్వపక్ష, దోషాత్, చ**

ప్ర.అ. స్వపక్ష = **సాంఖ్యుల సిద్ధాంతములయందు,** దోషాత్ = **అవే దోషములు వుండుట వలన,** చ = **కూడ**

వి. **పైన చెప్పబడిన దోషములు, వాటిపరిహారములు, సమాధానములు** సాంఖ్యుల సిద్ధాంతములలో కూడ వున్నాయి.

1) బ్రహ్మము కంటే జగత్తు విలక్షణమైనందున, బ్రహ్మముకు జగత్తుకు ప్రకృతి - వికృతి భావము కుదరదు.

2) ఉత్పత్తికి పూర్వము జగత్తుకు అసత్త్వ ప్రసక్తి కలుగుతుంది. 3) ప్రళయమందు జగము బ్రహ్మములో లీనమైనపుడు కార్యమైన జగత్తుకుండే లక్షణములు, ధర్మములు కారణమైన బ్రహ్మముకు

అందుతాయని, ఆ విధముగా జగత్తు దోషములు బ్రహ్మముకు అంటుతాయనీ అనటము కూడా సరికాదు (నీటిలో మంచువలె). ఈ మూడు దోషాలు ప్రధానము జగత్కారణమనే సాంఖ్యపక్షానికి కూడా వర్తిస్తాయి.

1) శబ్దాదిహీనమైన ప్రధానము నుండి శబ్దాదిభూతగుణములు కల ప్రపంచము వస్తుందని అనటం వలన, ప్రపంచము కూడా ప్రధానము కంటే విలక్షణమైనదే.

2) ప్రళయంలో శబ్దాదులులేని ప్రధానములో శబ్దాదిగుణములుకల జగత్తు లయమైనప్పుడు, ఆ జగత్తుకు గల దోషములు ప్రధానానికి సంక్రమించాలి.

**3) ప్రపంచము సత్యమని భావించే సాంఖ్యమతానికే ఈ దోషాలు వర్తిస్తాయి. ఈ జగత్తు అంతా మిథ్యాదృశ్యము అని నిరూపించే ఉపనిషత్తుల మొత్తానికి అది వర్తించదు. కావున ప్రపంచము బ్రహ్మములో లీనమైనపుడు ప్రపంచ ధర్మములు, దోషములు, గుణములు బ్రహ్మమునకు సంక్రమించవు అంటుకోబడవు.**

## (145) II.1.11

సూ. **తర్కాప్రతిష్ఠానాదప్యన్యథానుమేయమితి చేదేవమప్యవిమోక్ష ప్రసంగః**

క్ర. **తర్కాప్రతిష్ఠానాత్, అపి, అన్యథా, అనుమేయమ్, ఇతి, చేత్, ఏవమ్, అపి, అవిమోక్షప్రసంగః**

ప్ర.అ. తర్కాప్రతిష్ఠానాత్ అపి = **తర్కమునకు స్థిరత్వము లేకున్న గూడా,** అన్యథాఽనుమేయమ్ = **మరియొక విధముగా అనుమానము ద్వారా కారణమును నిశ్చయము చేయవలసి వున్నది,** ఏవమ్ అపి = **ఇట్టి పరిస్థితిలో కూడా,** అవిమోక్ష ప్రసంగః = **మోక్షము కలుగనట్టి ప్రసంగమే కాగలదు.**

వి. తర్కము అప్రతిష్ఠితము, తర్కమునకు నిలకడ లేదు. ఒక తార్కికుని చేత అనుమితమైన అర్థము వేరొక తార్కికునిచేత ఇంకొక విధముగా ఊహింపబడే అవకాశం వున్నది. వారిద్దరికంటే మేధావంతుడు ఐన తార్కికుడు మరొక విధంగా ఊహించగలడు. కావున బ్రహ్మమునందు వేదాంత వాక్యాల సమన్వయించటములో విరోధము లేదు. **అప్రతిష్ఠితమైన తర్కము వలన విరోధం వస్తుందేమోనని శంక అనవసరము. శ్రుతి సిద్ధాంతాన్ని అనుసరించి ఏర్పడిన తత్త్వమైన బ్రహ్మమే జగత్కారణము. పరమార్థ జ్ఞానము వలన మోక్షము వస్తుందని సిద్ధాంతము.** పరిపూర్ణమైన అవ్యభిచారమైన జ్ఞానమే సమ్యక్జ్ఞానము. శ్రుతిని ఆశ్రయించకుండా ముక్తిని, తర్కాన్ని ఆశ్రయించిన కపిల, కణాద, పతంజలుల చేత సిద్ధాంతం చేయబడిన పదార్థాలు గూడా వేరు వేరుగా కనిపిస్తున్నాయి. కావున అవి సమ్యక్ జ్ఞానము కాలేదు. **శ్రుతి ఆధారంలేని తర్కము అప్రమాణమే. అటువంటి తర్కములో వచ్చే విరోధము అప్రామాణికము.**

## 4. శిష్టాఽపరిగ్రహాధికరణమ్ (43)

## (146) II.1.12

సూ. ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః

క్ర. ఏతేన, శిష్టాపరిగ్రహాః, అపి, వ్యాఖ్యాతాః.

ప్ర.అ. ఏతేన = **అట్లు నిరూపించబడిన సిద్ధాంతముచే,** శిష్టాపరిగ్రహాః = **శిష్టపురుషుల ద్వారా స్వీకరింపబడని ఇతర మతములు,** అపి = **గూడ,** వ్యాఖ్యాతాః = **నిరాకరింపబడినవి.**

వి. **ఈ ద్వితీయ అధ్యాయములోని ప్రథమ పాదములో 5వ సూత్రము నుండి 11వ సూత్రము వరకు సాంఖ్యుల శంక నిరాకరింపబడి వైదిక సిద్ధాంతము ప్రతిపాదించబడినది.** సాంఖ్యులను అనుసరించిన మతములు కూడ నిరాకరించబడినవి. **అదే విధముగా శిష్టులు స్వీకరించని వేదవిరోధములైన ఇతర సిద్ధాంతములన్నీ నిరాకరింపబడుచున్నవి.**

## 5. భోక్త్రాపత్త్యధికరణము (44)

### (147) II.1.13

సూ. **భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్**

క్ర. **భోక్త్రాపత్తేః, అవిభాగః, చేత్, స్యాత్, లోకవత్**

ప్ర.అ. భోక్త్రాపత్తేః = **బ్రహ్మమునకు జగత్కారణత్వమును అంగీకరించ నప్పుడు భోక్త్రప్రసంగము రాగలదు. అందుచేత,** అవిభాగః = **జీవేశ్వర విభాగము, జీవ-జడ వర్గ విభాగము చేయుట సిద్ధించదు,** చేత్ = **అనిన,** స్యాత్ = **కాగలదు,** లోకవత్ = **లోకములోవలె**

వి. **బ్రహ్మము జగత్తుకు ఉపాదానకారణము అని అంటే భోక్తరూపములోను, భోగ్యరూపములోను కనిపించే జగత్తు బ్రహ్మమునకు వేరుకాదు. అప్పుడు భోగ్యము అనబడే శబ్దాది విషయములకు భోక్తయొక్క స్వరూపము బ్రహ్మముకు ఆపన్నమౌతుంది. అపుడు భోక్తభోగ్యవిభాగము ఉండదనే సమస్య వస్తుంది. అలా అంటే లోకములో అలాంటి ఉదాహరణలు వుండటము వలన సమస్యలేదు.** కుండ, మూత, గురిగి, మూకుడు లాంటి వస్తువులన్నింటిలో వున్నది మట్టియే. వస్తు భేదం వున్నా కారణరూపమైన మట్టిలో బేధము లేదు. సముద్రములో కనిపించే నీరు, అలలు, బుడగలు, నురుగు అన్ని సముద్రమే. **కావున జగత్తు తన ఉపాదానకారణమైన బ్రహ్మముకు వేరుకాకపోయినా వస్తురూపంలో భేదం కనిపించవచ్చు. భోక్త, భోగ్యాలకు కూడ బేధం ఉండటంలో సమస్య లేదు. బ్రహ్మము జగత్తుకు ఉపాదానకారణమే. నిమిత్త కారణము కూడ.**

## 6. ఆరంభణాధికరణము (45) (సద్విద్య)

### (148) II.1.14

సూ. **తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః**

క్ర. **తదనన్యత్వమ్, ఆరంభణ శబ్దాదిభ్యః**

ప్ర.అ. తదనన్యత్వమ్ = **కార్యము నుండి కారణమునకు అన్యత్వము,** ఆరంభణ శబ్దాదిభ్యః = **ఆరంభణ శబ్దము మొదలైన వాటి వలన**

వి. **కార్యమైన జగత్తుకు, దానికి కారణమైన బ్రహ్మతో అనన్యత్వము (అభిన్నత్వము, ఒకటిగానే**

**వుండటము) ఉన్నది, ఈ విషయము "వాచారంభణం వికారో నామధేయం" అను ఉపనిషద్వాక్యాల ద్వారా తెలుస్తున్నది.** ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహర్షి తన తనయుడైన శ్వేతకేతుతో ఇలా అన్నారు.

"యదగ్నే రోహితం రూపం, తేజసః తద్రూపం,

యచ్ఛుక్లం తదపాం, యత్ కృష్ణం తదన్నస్య అపాగాత్,

అగ్నే రగ్నిత్వం, వాచారంభణం వికారో నామధేయం,

త్రీణి రూపాణీత్యేవ సత్యమ్" (ఛాం.ఉ. VI-4-1)

"అగ్ని యొక్క రక్తవర్ణము తేజస్సు, శ్వేతవర్ణము జలము, నల్లటి రూపము పృథివి (అన్నము). ఈ వర్ణోత్పత్తులను విడచిన అగ్నిలో అగ్నితత్వములేదు. మిగిలినదంతయు వాచరంభణము (వట్టి గట్టిమాటలు). వికారములన్నియు నామమాత్రమే."

అదే విధంగా ఉద్దాలక మహర్షి ఇంకా ఇలా అన్నారు. "ఓ! సౌమ్యా! ఒక మృత్పిండానికి సంబంధించిన జ్ఞానము వలన, ఆ మట్టి యొక్క సమస్త వికారములకు సంబంధించిన జ్ఞానము కలుగుతుంది. వికారమంతా వాక్కునాశ్రయించి వుండే వాచారంభణమే. (వట్టిగట్టి మాట) మట్టియే సత్యము. కావున కారణము సత్యము, కార్యము అసత్యము. కారణానికి కార్యానికి అనన్యత్వము (అబేధము) వున్నది. అయినా కార్యము కారణము కంటే భిన్నమైనదికాదు. **కుండలన్ని మట్టి అయినట్లు బ్రహ్మవికారమైన జగత్తు బ్రహ్మకంటే భిన్నమైనది కాదు.**
(ఛాం.ఉ. VI-1-4; ఛాం.ఉ. VI-4-1)

## (149) II.1.15

**సూ. భావే చోపలబ్ధేః**

**క్ర. భావే, చ, ఉపలబ్ధేః**

ప్ర.అ. భావే = **కారణమందు,** చ = **కూడ,** ఉపలబ్ధేః = **దానికి ఉపలబ్ధి కలుగుట వలన**

వి. **బ్రహ్మము, జగత్తు అని ఈ రెండింటి అనన్యత్వానికి (భిన్నం కాదనటానికి) ఒక హేతువు ఏమనగా, కారణం (భావం) ఉన్నపుడే కార్యము యొక్క ఉపలబ్ధి (లభించటము) వుంటుంది. మట్టి వుంటేనే కుండలు లభిస్తాయి. దీనిని బట్టి కారణమైన బ్రహ్మము, కార్యమైన జగత్తు భిన్నము కావు. అనన్యమే (అభేదమే). మిగతాదంతా వట్టిమాటలే.**

## (150) II.1.16

**సూ. సత్త్వాచ్చావరస్య**

**క్ర. సత్త్వాత్, చ, అవరస్య**

ప్ర.అ. సత్త్వాత్ = **సత్త్వరూపమని చెప్పబడినందు వలన,** చ = **కూడ,** అవరస్య = **కార్యము, జగత్తు**

వి. **అవసరమైన కార్యానికి ఉత్పత్తికి పూర్వమే కారణరూపములో ఉనికి** (అస్తిత్వము) **ఉండటం వలన, కూడా** (కుండ కావటానికి పూర్వమే కుండలన్నీ మట్టిలో వున్నట్లు) **కార్య కారణాలకు అనన్యత్వము, భేదం లేకపోవటము వున్నది.** ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహర్షి శ్వేతకేతువుతో అనినారు. **"సదేవ సోమ్యేదమగ్ర ఆసీద్" (ఛాం.ఉ. VI-2-1) "నాయనా! సత్‌యే సృష్టికి మొదలు ఒక్కటిగా నుండెను". 'సత్' అంటే బ్రహ్మములో ఇదం (సృష్టి) వున్నదని సూచన. బ్రహ్మము కారణముగా జగత్తు (సృష్టి) కార్యములో మొదలే వున్నది. కావున బ్రహ్మమునకు జగత్తుకు భేదం లేదు. అవి వేరు కాదు.**

(ఛాం.ఉ. VI-2-1)

---

## (151) II.1.17

సూ. **అసద్వ్యపదేశాన్నేతిచేన్న ధర్మాంతరేణ వాక్యశేషాత్**

క్ర. **అసద్వ్యపదేశాత్, న, ఇతి, చేత్, న, ధర్మాంతరేణ, వాక్యశేషాత్**

ప్ర.అ. అసద్వ్యపదేశాత్ = **ఉత్పత్తికి పూర్వము ఈ జగత్తు అసత్తుచే చెప్పబడినది,** న = **కాదు,** ఇతిచేత్ = **కార్యము కారణమందు మొదటినించి లేదు అన్నయెడల,** న = **అది సరికాదు,** ధర్మాంతరేణ = **ధర్మాంతరముననుసరించి,** వాక్యశేషాత్ = **వాక్యము చివర చెప్పినదానిని బట్టి**

వి. తైత్తరీయ ఉపనిషత్తులో "అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సద జాయత, తథాత్మానం స్వయ మకురుత, తస్మా త్తత్సుకృత ముచ్యతే" (తై.ఉ.2-7) "అసత్తుయే దీనికన్న మొదలు యుండెను, దాని నుండియే సత్తు జనియెంచెను. అట్లు అది తననుండి తనను చేసికొనెను. అందువలన అదిసుకృతమని అనుచుందురు" (తై.ఉ.2-7) **ఉత్పత్తికి పూర్వము అసత్తు అని చెప్పటం వలన కార్యము కారణరూపములో లేదనుట సరికాదు. ఎందుకనగా తరువాత వాక్యములో అది తననుండి తనను చేసికొనెను అని అనబడినది కదా.** అంటే అది (బ్రహ్మము) లేక, వుండినది. అంటే మొదలు అవ్యాకృతముగా వుంది. తరువాత వ్యాకృతముగా తనను చేసుకొనెను. చెప్పలేని దానిగావుండి (కనిపించకుండా వుండి) చెప్పే దానిగా చేసికొనినది (కనిపించె దానిలాగ చేసికొనినది) మొదలే లేకుంటే తనను తాను ఎట్లా చేసుకోగలదు? **అప్రకటముగా నుండిన బ్రహ్మము ప్రకటనముగా తనను చేసుకొనెను అని అర్థము. కావున కార్యకారణాలకు, జగత్తుకు బ్రహ్మకు అనన్యత్వము సిద్ధిస్తున్నది.**

(తై.ఉ. 2-7)

---

## (152) II.1.18

సూ. **యుక్తేః శబ్దాన్తరాచ్చ**

క్ర. **యుక్తేః, శబ్దాన్తరాత్, చ**

ప్ర.అ. యుక్తేః = **యుక్తి వలన,** శబ్దాంతరాత్ = **మరి ఇతర శబ్దముల వలన,** చ = **కూడ, పై విషయము సిద్ధించుచున్నది.**

వి. ఏ వస్తువు వాస్తవముగా లేదో, అది తనను తాను చేసుకొనలేనిది, దాని ఉత్పత్తి కూడ జరుగదు. 'పెరుగు' పుట్టుటకు ముందు 'పాలు' వుండెను, 'కుండ' పుట్టుటకు ముందు 'మట్టి' వుండెను. 'బంగారు కడియము' కన్న ముందు 'బంగారము' వుండెను. 'బొమ్మ' కన్న ముందు 'కాగితము' వుండెను. 'చిత్రము' కన్నముందు 'పటము' వుండెను. అంటే 'పెరుగు' పుట్టక ముందు 'పాలలో' వుండెను. **తరువాత ప్రకటమైనది మొదట అప్రకటముగానుండెను.** (What is expressed later was impressed before!) **కార్యము ఉత్పత్తికి పూర్వము తన కారణములో వున్నది (చెట్టు, విత్తులో వున్నది అనే విషయము స్పష్టము).**

## (153) II.1.19

సూ. **పటవచ్చ**

క్ర. **పటవత్, చ**

ప్ర.అ. పటవత్ = **పటమువలె,** చ = **కూడ**

వి. **పటము అనగా వస్త్రము చుట్టబడియున్నపుడు అప్రకటముగా వుండును. చుట్ట విప్పినపుడు వస్త్రము ప్రకటమగును. వస్త్రము నేయబడనప్పుడు దారములో అప్రకటముగానుండును.** చిత్రము గీయబడనప్పుడు పటములో అప్రకటముగా దాగియుండెను. లేనట్లు నివసించును. గీయగానే ప్రకటమగును. **ఆ విధముగా కార్య కారణములు అభిన్నములు.**

## (154) II.1.20

**(అక్షర విద్య)**

సూ. **యథా చ ప్రాణాది**

క్ర. **యథా, చ, ప్రాణాది**

ప్ర.అ. యథా = **ఏవిధముగా,** చ = **కూడ,** ప్రాణాది = **ప్రాణము మొదలైనవి**

వి. **ప్రాణాయామములో ప్రాణవాయువును ఆపినపుడు నిలచిన వాయువులో ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము అనే పంచప్రాణములు అప్రకటితముగా వుండును.** గాలి వదలగానే నిలచిన ఆ ప్రాణవాయువు ఐదు పంచప్రాణాములుగా ప్రకటితము అగును. గాలి నిలచినపుడు పంచప్రాణములు లేకుండా పోలేదు. కనిపించకుండా వున్నాయి. అప్రకటితముగా వున్నాయి. **జగత్తు మొదలు బ్రహ్మములో అప్రకటితముగా వుండును. జగము, బ్రహ్మము ఎప్పుడు అనన్యములు.** (ఏక విజ్ఞానములో సర్వవిజ్ఞానము వస్తుంది. (ఛాం.ఉ.VI-1-4) ఒక మట్టి తెలిస్తే అన్నీ మట్టిపాత్రలు తెలుస్తాయి. ఒక పటం తెలిస్తే అన్నీ చిత్రాలు తెలుస్తాయి. ఒక దారం తెలిస్తే మొత్తం పటం తెలుస్తుంది).

ఒక బ్రహ్మము తెలిస్తే సర్వము సృష్టి తెలుస్తుంది

(ఛాం.ఉ.VI-1-4)

## 7. ఇతరవ్యపదేశాధికరణము (46)

### (155) II.1.21

**సూ. ఇతరవ్యపదేశాద్ధితాకరణాది దోషప్రసక్తిః**

**క్ర. ఇతరవ్యపదేశాత్, హితకరణాది దోషప్రసక్తిః**

ప్ర.అ. ఇతరవ్యపదేశాత్ = **ఇతరుడు అని చెప్పటము వలన,** హితకరణాది దోష ప్రసక్తిః = **హితము, అహితము చేసుకొనుట మొదలైన దోషము మొక్క ప్రసక్తి వచ్చును.**

వి. **బ్రహ్మము జీవరూపమున ఉత్పన్నమైనది అని చెప్పబడుట వలన బ్రహ్మమునందు తనకు హితము చేసుకొనుట, అహితము చేసుకొనుట అనే దోషము వాటిల్లే ప్రసక్తి వస్తుంది.** "తత్త్వమసి" (ఛాం.ఉ. 6-8-7) అని జీవునియందు బ్రహ్మత్వమును చెప్పటము వలన, "అనేన జీవాత్మనా" (ఛాం.ఉ. 6-3-3) అంటూ బ్రహ్మమందు జీవభావాన్ని చెప్పబడినందువలన గూడనూ, బ్రహ్మవలెనే జీవుడు గూడా స్పష్టము అవుతున్నాడు. అందువలన బ్రహ్మకు జీవుని ధర్మాలైన జన్మ, మరణ, జరాది అనర్థాలను చేయటం అనే దోషం వస్తుంది. **దాని వలన చైతన్యమైన బ్రహ్మజగత్కారణము అనుట సరికాదు అని పూర్వపక్షము అంటే దానికి సమాధానము ఈ తరువాతి సూత్రములో చెప్పుతున్నారు.**

(తై.ఉ. 2-6), (ఛాం.ఉ. 6-3-3)

### (156) II.1.22

**సూ. అధికం తు భేదనిర్దేశాత్**

**క్ర. అధికం, తు, భేదనిర్దేశాత్**

ప్ర.అ. అధికం = **జీవునికంటే అధికుడు,** తు = **కాని,** భేదనిర్దేశాత్ = **బ్రహ్మకు, జీవునకు భేదము చెప్పబడటము వలన.**

వి. **జీవునికంటే అధికుడు, సర్వజ్ఞుడు, పరమశక్తిమంతుడు అయిన బ్రహ్మమే జగత్స్రష్ట కాబట్టి బ్రహ్మయందు హితాహితాకరణ దోషములు అంటవు.** ఛాందోగ్యోపనిషత్తులో "ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" (బృ.ఉ. 2-4-5) "ఆత్మదర్శనార్థమైనది. కాబట్టి దానిని గురించి వినాలి. మననం చేయాలి." అనీ ఇంకెన్నోసార్లు కర్త, కర్మ భేదముతో బ్రహ్మకు, జీవునికి భేదం చెప్పబడింది. ఉపనిషత్తులో "జీవునికి బ్రహ్మకు ఉన్న భేదం ఉపాధికి సంబంధించినది మాత్రమే" అని మరల మరల చెప్పబడినది. **సదాముక్తుడు అయన బ్రహ్మమునకు, హితము అహితము రెండూ లేవు. కావున హితము, అహితము చేసుకోవటము అనే దోషము ఏమీ లేదు అని సమాధానం.**

(బృ.ఉ. II-4-5)

### (157) II.1.23

**సూ. అశ్మాదివచ్చ తదనుపపత్తిః**

**క్ర. అశ్మాదివత్, చ, తదనుప పత్తిః**

ప్ర.అ. అశ్మాదివత్ = **రాయి మొదలైనవానివలె,** చ = **కూడ,** తదనుపపత్తిః = **జీవాత్మ పరమాత్మలు అత్యంత అభేదముకలవారు కారు.**

వి. **భూమి నుండి పుట్టిన రాళ్ళవలె బ్రహ్మ యొక్క కార్యములో స్వరూప వైచిత్ర్యము యథార్థమే. కాబట్టి ఇతరము అనే దోషానికి ఉపపత్తి లేదు.** భూమి నుండి పుట్టి (కలిగే) వజ్రము, రత్నములు, చలువరాళ్లు, పరుపురాళ్లు, సామాన్యరాళ్ల భేదం కనిపిస్తుంది. ఒకే భూమిని ఆశ్రయించిన బీజముల నుండి రంగురంగుల పూలు, పండ్లు కలుగుతున్నాయి. **అదే విధముగా ఒకే బ్రహ్మము ఆశ్రయించి కార్యములలో ధర్మవైచిత్ర్యము రూపవైచిత్ర్యం, క్రియావైచిత్రము కలుగవచ్చు. కార్యవైచిత్ర్యములనగా కారణమైన భూమిలోకాని బ్రహ్మలోకాని భేదం రాదు.**

## 8. ఉపసంహారదర్శనాధికరణము (47)

## (158) II.1.24

సూ. **ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి**

క్ర. **ఉపసంహార దర్శనాత్, న, ఇతి, చేత్, న, క్షీరవత్, హి**

ప్ర.అ. ఉపసంహారదర్శనాత్ = **లోకములో కుండలు మొదలైనవి నిర్మించుటకు సాధన సామగ్రిని సమకూర్చుటము చూచున్నాము.** న = **బ్రహ్మ జగత్తుకు కర్త కాదు, ఎందుకనగా బ్రహ్మ వద్ద ఏ సాధన సామగ్రి లేదు,** ఇతిచేత్ = **అని అనన యెడల,** న = **ఇట్లు సరికాదు,** హి = **ఎందుకంటే,** క్షీరవత్ = **క్షీరమువలె**

వి. **లోకములో కర్తయైన కుమ్మరివాడు ఘటాదులు అనే కార్యాలను చేయటానికి నీరు, చక్రము, కఱ్ఱ మొదలైన సాధనాలను సమకూర్చుకొనటము చూస్తున్నాము. ఆ సాధనములు కుమ్మరికంటే భిన్నములైనవి.**

**జగత్తు నిర్మాణములో బ్రహ్మమునకు అటువంటి సాధనాలు ఏమీ ఉన్నట్లు కనిపించటము లేదు. కావున బ్రహ్మ జగత్తుకు కారణం కాదు అని అనటము సరికాదు. సాధనము, ఉపకరణము లేకపోయినా కార్యము కావటము లోకములో చూస్తున్నాము. పాలు పెరుగుగా తయారవటానికి ఏ సాధనాల అవసరము లేదు.** పాలను వేడి చేస్తున్నాము కదా అని అంటే తొందరగా కావటానికి వేడిచేస్తున్నాము. వేడి చేయకపోయినా పాలు పెరుగుగా మారుతుంది. పాలలో పెరుగు లేకపోతే పెరుగు అయ్యే గుణము లేకపోతే పాలను బలవంతంగా వేడిచేసి పెరుగుగా మార్చలేము. పాలలో పెరుగు అయ్యే గుణము లేకపోతే, ఏ సాధన వల్ల కూడా పాలను పెరుగుగా మార్చటము కాదు. **అందుచేత సర్వశక్తి సంపన్నుడైన పరమాత్మకు ఏ సాధనమూ అవసరము లేదు. జగన్నిర్మాణములో ఏ సాధనము అవసరములేదు.** ఉపనిషత్తులో ఇలా వుంది "బ్రహ్మకు కార్యము లేదు. కరణమూ లేదు. ఆయనతో సమానమైనవాడు కాని ఆయన కన్న శ్రేష్ఠుడు కానీ ఎవరూ లేరు. ఆయన శక్తి శ్రేష్ఠమైనది. అనంతమైనది. అది అనేక విధములుగా వుంటుందని విన్నాము. ఆయన జ్ఞానశక్తి, బలము, క్రియాశక్తి స్వాభావికము. కనుకనే అనేక విచిత్ర పరిణామాలు

కల్గుతుంటాయి" (శ్రేతాశ్వతరోపనిషత్తు 6-8) **పరబ్రహ్మము జగత్తుకు కారణమే. తనకు తానే జగత్తుగా అవటానికి కావలసిన స్వాభావికశక్తి ఆయనలో వున్నది.**
(శ్వేతా. ఉ. 6-8)

## (159) II.1.25

సూ. **దేవాదివదపి లోకే**

క్ర. **దేవాదివత్, అపి, లోకే**

ప్ర.అ. దేవాదివత్ = **దేవాదులవలె, దేవతలు మొదలైన వారివలె,** అపి = **కూడ,** లోకే = **లోకమున**

వి. **మంత్రములలో ఇతిహాసములలో దేవతలు ఏ సహాయము, ఉపకరణము, సాధనము లేకనే కార్యములు తమసంకల్ప బలముతోనే చేసినారని వింటున్నాము. సాలెపురుగు ఏ సాధనము లేకుండానే దారం, గూడు తయారు చేయటం వలె, పరబ్రహ్మ ఈ జగత్తును సృష్టిస్తున్నాడు.**

## 9. కృత్స్నప్రసక్త్యధికరణము (48)

## (160) II.1.26

సూ. **కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా**

క్ర. **కృత్స్న ప్రసక్తిః, నిరవయవత్వశబ్దకోపః, వా**

ప్ర.అ. కత్స్నప్రసక్తిః = **బ్రహ్మను జగత్కారణముగా స్వీకరించిన పిమ్మట, ఆయన పూర్ణరూపముతో జగద్రూపముగా పరిణమించినాడు అని ఒప్పుకొనటములో దోషము వచ్చును,** వా = **అట్లు కాకున్నను,** నిరవయత్వశబ్దకోపః = **ఆయనను అవయవరహితుడుగా చెప్పిన శ్రుతి ముందర శబ్దములతో విరోధము రాగలదు (అనిపూర్వపక్ష ఆక్షేపణము)**

వి. **బ్రహ్మము జగత్తుకు కారణము అని, పరబ్రహ్మమే జగత్తుగా సంపూర్ణముగా పరిణమించింది అంటే ఇక జగత్తుకన్న వేరు బ్రహ్మము లేకపోయినందువలన బ్రహ్మము అన్నిటికన్నమిన్న అన్నమాటలో దోషం వస్తుంది. జగత్తు బ్రహ్మకన్న వేరు అంటే బ్రహ్మకు అవయవము వచ్చినట్లు అవుతుంది. అపుడు బ్రహ్మ నిరవయవుడు, నిర్గుణుడు, నిష్కళుడు, నిరాకారుడు అన్న శ్రుతివాక్యాలకు అవకాశము వుండదు అని ప్రతివాదము.** దీనికి సమాధానము ఈ తరువాతి సూత్రం.

## (161) II.1.27

సూ. **శ్రుతేస్తు శబ్దమూలత్వాత్**

క్ర. **శ్రుతేః, తు, శబ్దమూలత్వాత్**

ప్ర.అ. శ్రుతేః = **ఉపనిషత్తుల వాక్యముల వలన,** తు = **కాని,** శబ్దమూలత్వాత్ = **శబ్దము, వేదము, మూలముగానున్నది కాబట్టి**

వి. **ఉపనిషత్తులో "ఈ సమస్త భూతములు ఆ పురుషుని యొక్క ఒక పాదమే. మిగతా మూడు పాదాలు అమృతమైన దివిలో వున్నాయి". అనబడినందున బ్రహ్మము ఈ జగత్తుకన్నమించినదని స్పష్టము. బ్రహ్మము జగత్తుకు కారణము, ఆశ్రయము మరియు అతీతము.**

## (162) II.1.28

**సూ. ఆత్మని చైవం విచిత్రాశ్చ హి**

**క్ర. ఆత్మని, చ, ఏవం, విచిత్రాః, చ, హి**

ప్ర.అ. ఆత్మని = **ప్రత్యగాత్మయందు,** చ = **కూడ,** ఏవం = **ఈ,** విచిత్రాః = **విచిత్రకల్పనలు,** చ = **కూడ,** హి = **కావున**

వి. స్వప్నద్రష్టయైన ఆత్మయందు అనేక రకములైన సృష్టులు అవుతున్నాయి. ఈ జగత్తు అంతా బ్రహ్మము యొక్క పరిణామము కనుక స్వప్న ప్రపంచములో వలెనె మాయతో కూడినది. **బ్రహ్మజగత్తుకు ఉపాదాన కారణము ఐనా స్వప్నములోని సాక్షి వంటివాడు. కావున కృత్స్నప్రసక్తి దోషములు రావు.**

"న తత్ర రథాః, న రథ యోగా, న పంథానో భవన్తి, అథ రథాన్, రథ యోగాన్, పథః సృజతేః" (బృ.ఉ. IV-3-10)

"స్వప్నములో రథములు, అశ్వములు, పథములు వుండవు. కాని, స్వప్నద్రష్ట కలగన్నవాడు - రథములను, అశ్వములను, మార్గములను సృష్టించుకొనుచున్నాడు తనయందే!" అలాగే స్వరూపనాశనం లేకుండానే వివిధ రకముల సృష్టి బ్రహ్మమునందు అవుతున్నది. (కల కనినాడు అంటే కలను చూచినాడు, అనిఅనబడినతడు ద్రష్ట, సాక్షి అవుతాడు. తల్లిదండ్రులు సంతానమును కనినారు అంటారు. సంతానము పుట్టగానే కన్నవాడు, సృష్టించినవాడు, చూచినవాడు ఒకటే. అదే రీతిగా విచిత్రంగా పరమాత్మ జగత్తును కనినాడు (పుట్టించినాడు) కనినాడు (చూచినాడు, ఈక్షించినాడు) (ద్రష్టయైనాడు, సాక్షియైనాడు) చూచినారా! కనినారా! తెలుగుభాషలో కనిపించే విచిత్ర కానుకలు, కనుటలు!)

బ్రహ్మము జగత్కారణము మరియు జగత్సాక్షి. (బృ.ఉ.IV-3-10)

## (163) II.1.29

**సూ. స్వపక్షదోషాచ్చ**

**క్ర. స్వపక్ష దోషాత్, చ**

ప్ర.అ. స్వపక్ష = **తమ పక్షములో వున్న,** దోషాత్ = **దోషముల వలన,** చ = **కూడ**

వి. **సాంఖ్యులు మొదలైనవారి మతములలో కూడా ఈ దోషాలు వున్నాయి. ఆ మతములో గూడా నిరవయవము, అవిచ్ఛిన్నము అయిన ప్రధానమును సావయవము, పరిచ్ఛిన్నము అయిన** జగత్తుకు కారణం అన్నారు. ప్రధానము సత్వరజస్తమముల కలయిక. అంటే అవయవములు వున్నట్లే. అప్పుడు దోషం వస్తుంది. **ఈ విధంగా కృత్స్న ప్రసక్తి వారికీ కల్గుతుంది.** బ్రహ్మమునకు ఆ దోషములు లేవని ఇంతకుముందే చూచినాము, కనినాము, స్వీకరించినాముకదా!

## 10. సర్వోపేతాధికరణము (49) (అక్షర విద్య, సర్వవిద్య)

## (164) II.1.30

**సూ. సర్వోపేతా చ తద్దర్శనాత్**

**క్ర. సర్వోపేతా, చ, తద్దర్శనాత్**

ప్ర.అ. సర్వోపేతా = **సర్వశక్తి సమస్వతము,** చ = **కూడ,** తద్ = **అది,** దర్శనాత్ = **చూడబడటము వలన**

వి. **ఆ పరబ్రహ్మ సర్వశక్తులతో, సర్వసమర్థత్వముతో ఉపేతమై కలిగియుండి విరాజిల్లుతున్నాడని శ్రుతులలో మరల మరల చెప్పబడినది.**

"మనోమయః ప్రాణశరీరో, భారూపః, సత్యసంకల్పః, ఆకాశాత్మా, సర్వకర్మా, సర్వకామః, సర్వగంధ, సర్వరసః, సర్వమిదమభ్యాతోஉ వాక్యనాదరః॥" (ఛాం.ఉ. III-14-2)

"ఆ బ్రహ్మము, మనోమయుడు, ప్రాణశరీరుడు, వెలుగేరూపముగాకలవాడు, సత్యసంకల్పుడు, ఆకాశమే ఆత్మగాకలవాడు. సర్వకర్మలు, సర్వకామములు, శబ్దస్పర్శరూపరస గంధములు పరబ్రహ్మమే. సర్వవ్యాపకుడు, వాగాది ఇంద్రియములు లేకయే సర్వేంద్రియ కార్యములు చేయువాడు ఆ బ్రహ్మము. (ఛాం.ఉ. III-14-2)

"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి, సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః, ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి, ద్యావా పృథ్వివ్యౌ విధృతే తిష్ఠతః, ఏతస్య వా అక్షరస్య గార్గి, నిమేషా ముమార్తా, అహోరాత్రాణి అర్థమాసా, మాసాః ఋతవః, సంవత్సరాః ఇతి, విధృతాః తిష్ఠంతి, ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి, ప్రాచ్యఃనద్యః స్యందంతే, శ్వేతేభ్యః పర్వతేభ్యః, ప్రతీచ్యోஉన్యా యాం యాం చ దిశమన్యే, తస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి, దదతో మనుష్యాః ప్రశగ్ంం సన్తి, యజమానం దేవాః, దర్వీం పితరో,உన్వాయత్తాః" (బృ.ఉ.III-8-9)

యాజ్ఞవల్క్యుడు అనెను "ఓ గార్గీ! ఈ అక్షరుని యొక్క ఆజ్ఞతో సూర్యచంద్రులు సంచరించుచున్నారు. ఈ అక్షరము యొక్క ఆజ్ఞతోనే భూమి అంతరిక్షములు శక్తి కలవిగానున్నవి. ఓ గార్గీ! ఈ అక్షరము యొక్క ఆజ్ఞవలననే నిమేషములు, ముహూర్తములు, పగళ్ళు, రాత్రులు, పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు అన్నియు ధరించబడినవై శక్తివంతముగానున్నవి. ఓ గార్గీ! ఈ అక్షరము యొక్క శాసనముతోనే హిమవత్పర్వతము నుండి నదులు తూర్పువైపు, పడమరవైపు ప్రవహిస్తున్నాయి. ఓ గార్గీ! ఈ అక్షరము యొక్క ఆజ్ఞతో దానమియ్యదగిన బంగారం మొదలైన వాటిని మనుజులు ప్రశంసించుతున్నారు. దేవతలు యజమానిని, పితరులు దర్వీహోమమును అనుసరించి వర్ధిల్లుతున్నారు" (బృ.ఉ. III-8-9)

"యస్సర్వజ్ఞః సర్వవిద్, యస్య జ్ఞానమయం తపః, తస్మాదేతద్బ్రహ్మ, నామ రూప మన్నం చ జాయతే" (ముం.ఉ.I-1-9)

"ఎవరు సర్వజ్ఞుడో, సర్వవిదుడో (సంపూర్ణ జ్ఞానముకలవాడో, అన్నీ తెలిసినవాడో) ఎవరి తపస్సు జ్ఞానమయమో,ఆ పరబ్రహ్మ నుండియే సృష్టికర్త, నామరూపాత్మకమైన ఈ విశ్వము, అన్నాది ఆహారములు మొదలైనవి జనియించినవి." (ముం.ఉ.I-1-9). **ఈ విధముగా బ్రహ్మము విచిత్రమైన కార్యశక్తి కలది, ఏ కరణములు, ఉపాధులు, సాధన సామగ్రి అవసరములేనిదని తెలుస్తున్నది.** (ఛాం.ఉ. III-14-2; బృ.ఉ. V-8-9; ముం.ఉ. I-1-9)

## (165) II.1.31

**సూ. వికరణత్వాన్నేతి చేత్తదుక్తం**

**క్ర. వికరణత్వాత్, న, ఇతి, చేత్, తత్, ఉక్తమ్**

ప్ర.అ. వికరణత్వాత్ = **ఇంద్రియములు లేనందున,** న = **అట్లు కాదు,** ఇతిచేత్ = **అనినచో,** తదుక్తమ్ = **అందుకు సమాధానము చెప్పబడినది.**

వి. **"శ్రుతులయందు బ్రహ్మమును ఇంద్రియరహితునిగా చెప్పటము వలన కర్త అనటానికి వీలులేదు" అని అనటము తగదు. ఈ విషయములో 25వ సూత్రము "దేవాదివదపి లోకే"లో (దేవాదుల వలె, లోకములో, కూడ) సమాధానము చెప్పబడినది. సర్వశక్తి వంతుడైన పరబ్రహ్మకు అంతయూ సంభవమే కదా!**

"అపాణిపాదో జవనోగ్రహీతా, పశ్యత్యచక్షు స్స శ్రుణోత్యకర్ణః, స వేత్తి వేద్యం, న చ తస్యాఽస్తి వేత్తా, త మాహు రగ్ర్యం పురుషం మహాంతమ్" (శ్వేతాశ్వతరోపనిషత్తు 3-19)

"ఆ పరబ్రహ్మ హస్తములు పాదములులేని వాడైనను నడచుచున్నాడు, గ్రహించుచున్నాడు. నేత్రములు లేకున్నను అంతా చూచుచున్నాడు. శ్రోత్రములు లేనివాడైనను సర్వమును వినుచున్నాడు. తెలిసికొన దగినది తెలియుచున్నాడు. అట్టి మహాత్ముని అగ్రగణ్యునిగను మహాంతుడైన పురుషునిగను చెప్పుచున్నారు" (శ్వే.ఉ.3-19)

**ఈ విధముగా పరబ్రహ్మ సర్వశక్తి సామర్థ్యమంతుడు, సర్వజ్ఞుడు. సంకల్ప మాత్రముననే సర్వము సంపన్నము చేయు సర్వాంతర్యామి ఆ బ్రహ్మము.**

(శ్వే.ఉ.3-19)

## 11. సప్రయోజనవత్త్వాధికరణము (50) (మైత్రేయి విద్య)

## (166) II.1.32

**సూ. న ప్రయోజనవత్త్వాత్**

**క్ర. న, ప్రయోజనవత్త్వాత్**

ప్ర.అ. న= **కాదు,** ప్రయోజనవత్త్వాత్ = **ప్రయోజనము వలన**

**వి.** ఎవరు ఏదైనా కార్యము చేస్తే తమ ప్రయోజనము కొరకు చేస్తారు. ప్రవృత్తులన్నీ ప్రయోజనాన్ని అపేక్షించియే జరుగుతున్నాయి.

ఉపనిషత్తు గూడా ప్రయోజనము గురించి ఇలా అన్నది.

"మైత్రేయి! అందరి ప్రయోజనము కొరకు అందరూ ప్రియులు కారు. తమ ప్రయోజనము కొరకే అందరూ ప్రియులు అవుతారు." (బృ.ఉ. IV-4-5)" **తనకు ప్రయేజనములేని ఏచిన్న పనియైనా ఎవరూ చేయరు. అప్పుడు జగద్రచన అనే మహాకార్యాన్ని బ్రహ్మము ఏ ప్రయోజనము లేకుండా ఎలా చేస్తున్నది? కావున జగద్కర్త జగత్తుకు కారణం, బ్రహ్మకాదు" అని ప్రతిపక్షవాదము.**

ఒక నిష్ప్రయోజనమైన జగద్రచన బ్రహ్మము చేస్తున్నాడంటే ఆయన సర్వజ్ఞాత్వానికి, స్వతంత్రతకు, అనపేక్షకు, ఏ ఉపాధి అవసరము లేని తత్త్వమునకు భంగము వస్తుంది. ప్రయోజనము లేకుంటే బ్రహ్మము జగత్సృష్టి చేయదుకదా? ప్రయోజనమువుంటే బ్రహ్మత్వమునకే భంగము వస్తుంది. కదా? అందుకోసము **బ్రహ్మము జగత్కారణము కాదు అనే వాదానికి సమాధానము తరువాతి సూత్రములో చెప్పబడుతున్నది.**

(బృ.ఉ. IV-4-5)

## (167) II.1.33

**సూ. లోకవత్తు లీలాకైవల్యమ్**

**క్ర. లోకవత్, తు, లీలాకైవల్యమ్**

ప్ర.అ. లోకవత్ = **లోకములోవలె,** తు = **కాని,** లీలాకైవల్యము = **కేవలము లీలామాత్రమే.**

వి. **జగత్సృష్టి పరబ్రహ్మము యొక్క లీలమాత్రమే. లోకములో ఎంతో మంది ఏమీ ప్రయోజనము లేకుండానే క్రీడలు, ఆటలు, సేవలు చేస్తుంటారు. అది ఒక లీలయే. ఆనందం కలిగించే లీలలకు ప్రయోజనము అనవసరము.** ఆపదలో వున్నవారికి సహాయ్యం చేయటానికి ప్రయోజనము లేకున్నా ఎంతో ఆసక్తితో చేస్తాము కదా. ఉచ్ఛాసనిశ్వాసలు స్వభావ జనితములే స్వభావకార్యములే. ఒక జగద్రచన భగవంతుని, పరబ్రహ్మయొక్క, స్వభావము, లీల. జగద్రచన మనకు మహోత్తరంగా, కఠినంగా అనిపించినా, పరబ్రహ్మకు అది ఒక లీల. చాలా తేలిక. తర్కము ద్వారాగాని శ్రుతి ద్వారాగాని పరబ్రహ్మ జగద్రచనకు ప్రయోజనం అంటించటము అసంభవము. **జగద్రచన పరబ్రహ్మ యొక్క నిష్కామ, ప్రయోజనరహిత, ఆనంద స్వరూపలీల. సంకల్పమాత్రముననే చేయగల లీల. శ్రుతి ప్రకారము పరబ్రహ్మ ఆప్తకాముడు.**

# 12. వైషమ్యనైర్ఘృణ్యాధికరణము (51)

## (168) II.1.34

**సూ. వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథాహి దర్శయతి**

**క్ర. వైషమ్యనైర్ఘృణ్యే, న, సాపేక్షత్వాత్, తథా, హి, దర్శయతి**

ప్ర.అ. వైషమ్యనైర్ఘృణ్యే = **పక్షపాతము, నిర్దయత్వము,** న = **లేదు,** సాపేక్షత్వాత్ = **అపేక్షించుటవలన,** తథా = **అట్లు,** హి = **కావున,** దర్శయతి = **శ్రుతులు, స్మృతులలో కనిపిస్తున్నది.**

వి. పక్షపాతము, నిర్దయత్వము అనే దోషాలు బ్రహ్మయందులేవు. బ్రహ్మ సాపేక్షుడై ఈ విషయసృష్టి నిర్మాణము చేస్తున్నాడు. జీవుల ధర్మాధర్మాలను అపేక్షించి వారి వారి శుభాశుభకర్మలను బట్టి

బ్రహ్మ సృష్టికావిస్తాడు.

"సాధుకారీ సాధుర్భవతి, పాపకారీ పాపోభవతి" (బృ.ఉ. VI-4-5) "మంచి పనులు చేసి సాధువు అగును, పాపకర్మలు చేసి పాపియగుచున్నాడు". దీనివలన పరమాత్మయందు దోషమురాదు. దోషుల నేరము నిర్ణయించే ప్రభువుకు, న్యాయాధికారికి దోషము రానట్లు.

"ఏవ రెట్లు నన్ను ఆశ్రయంబు చేయువారో, వారికి నేనట్లే అనుగ్రహము చేయుచుండు" (భ.గీ. 4-11)

**జీవుల ధర్మాధర్మములే వారి గతిని నిర్ణయిస్తాయి. పరబ్రహ్మ సాక్షి మరియు ధర్మాధికారియే.**

## (169) II.1.35

**సూ. న కర్మా విభాగాదితిచేన్నానాదిత్వాత్.**

**క్ర. న, కర్మ, విభాగాత్, ఇతి, చేత్, న, అనాదిత్వాత్**

**ప్ర.అ.** న = **కాదు,** కర్మవిభాగాత్ = **జీవుడు, కర్మ అనే విభాగము లేనందున,** ఇతిచేత్ = **అనిన యెడల,** న = **అట్లు కాదు,** అనాదిత్వాత్ = **జీవుడు, కర్మలు అనేది అనాది విషయమైనందు వలన**

**వి. సృష్టికి పూర్వము కర్మ అనేది లేదు. జీవుడు కర్మ అనే విభాగము లేదు కాబట్టి కర్మమనేది వుండదు. అప్పుడు కర్మాపేక్ష వలన ఈ విషయసృష్టి ఎలా జరిగింది అంటే సంసారం అనేది అనాది అయినది. బీజము, మొలక లాగాసృష్టి కర్మలకు కార్యకారణ భావము వున్నది. అందుచేతనే కర్మను అపేక్షించి ఈ సృష్టి జరిగింది. అంటే పూర్వసృష్టి యందలి సత్కర్మలు, దుష్కర్మలు (పుణ్యపాపాలు) పూర్తిగా నశించకుండా బీజరూపములో తరువాతి సృష్టికి కారణము అవుతున్నాయి. బ్రహ్మము కర్మాకర్మముల బట్టి సృష్టికావిస్తున్నది.**

## (170) II.1.36

**సూ. ఉపపద్యతే చాప్యుపలభ్యతే**

**క్ర. ఉపపద్యతే, చ, అపి, ఉపలభ్యతే, చ**

**ప్ర.అ.** ఉపపద్యతే = **సరిపోతుంది,** చ = **మరియు,** అపి = **కూడ,** ఉపలభ్యతే = **లభిస్తుంది**

**వి.** సృష్టి అనాది అనేది విచారిస్తే సరిపోతుంది, సరియైనదని తోచుతుంది, సమ్మతము అవుతుంది. మరియు 'ఆది' శ్రుతులందు స్మృతులయందు లభిస్తుంది. సృష్టి కర్మమనేది అనాదియైనది. బీజము లేనిదే చెట్టు లేదు. చెట్టు లేనిదే బీజము లేదు. అలాగే కర్మలేనిది శరీరము లేదు. శరీరములేనిదే కర్మలేదు. రెండు ఒకటినొకటి ఆశ్రయించి వుంటున్నాయి. ఆ విధంగా సంసారము కూడా అనాది ఐనది. సంసారము అవ్యక్తము, అప్రకటితముగా వున్నప్పుడు అవ్యక్తము మరియు ప్రకటితము ఐనపుడు సృష్టి. "ఈ జీవరూపములోఅను ప్రవేశించి నామరూపాలను విస్తరింపచేస్తాను".

(ఛాం.ఉ. VI-3-2)

"ధాతా యథాపుర్వ మకల్పయత్" (ఋ.వే. 10-190-3)

"సూర్యచంద్రులను వెనుకటి కల్పములో లాగా బ్రహ్మసృష్టించాడు" అనగా కల్పముల వెనుక కల్పములు,

కల్పముల తర్వాత కల్పములు వున్నాయని చెప్పబడినది. సృష్టి అనాది, అనంతము కూడా.
"న రూప మస్యేహ తథోపలభ్యతే, నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా" (భ.గీ. 15–3)
"ఆదాని రూపము తెలియరాదు. ఆది అంతము లేదు. సంప్రతిష్ఠ లేదు. సృష్టి ఆదిమధ్యాంతములు లేనిది" అని భగవద్గీత కూడా చెప్పుచున్నది.

**ఆది మధ్యాంతములులేని ఈ సృష్టిని జగత్తును కర్మాకర్మముల ప్రకారం, పక్షపాతము మరియు నిర్ఘృణత్వము లేకుండా లీలగా సృష్టిస్తున్నది ఆ పరబ్రహ్మము.**
(భ.గీ. 15–3)

## 13. సర్వధర్మోపపత్త్యధికరణము (52)

## (171) II.1.37

సూ. సర్వధర్మోపపత్తేశ్చ

క్ర. సర్వధర్మోపపత్తేః, చ

ప్ర.అ. సర్వధర్మోపపత్తేః = **సర్వధర్మములు కలిగి యుండుట వలన, చ = కూడ**

వి. **జగత్తుకు కారణము కావలసిన ధర్మములైన సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము మొదలైన సర్వధర్మములు తన యందు ఉపపన్నమైనందు వలన, ఉండుట వలన బ్రహ్మమే జగత్కారణము అనే సిద్ధాంతము దోషరహితము, సంశయాతీతము, నిత్యము మరియు సత్యము.**

ఇట్లు
**ద్వితీయాధ్యాయ ప్రథమ పాదము**



# ద్వితీయాధ్యాయ ప్రథమ పాద సమాసము

## సాంఖ్యాదిమత నిరాకరణ

**1. స్మృత్యధికరణము**

వేద ప్రమాణములేని సాంఖ్యమందు చెప్పబడిన ప్రధానము జగత్కారణము కాదు. శ్రుతులకు విరుద్ధమైన స్మృతులు ప్రమాణములు కావు.

**2. యోగప్రత్యుక్తధికరణము**

సాంఖ్యమును నిరాకరించుటవలన సాంఖ్యము ఆధారముగా గల యోగమును గూడా నిరాకరించుటమైనది.

**3. విలక్షణాత్వాధికరణము**

జగత్తుకు ఉపాదానకారణమైనందున బ్రహ్మస్వభావమునకు భంగము లేదు. జగత్తు బ్రహ్మములో లీనమైపుడు దోషములు లేకుండా పోవును. బ్రహ్మము యొక్క శుద్ధత్వము నిత్యము మరియు సత్యము. బ్రహ్మము నుండి వచ్చిన జగము బ్రహ్మములో లీనమై తన అస్తిత్వాన్ని కోల్పోయి బ్రహ్మమే ఉంటుంది.

**4. శిష్టాఽ పరిగ్రహాధికరణము**

శిష్టులు స్వీకరించని మతములు మరియు వేదవిరోధమైన మతములు నిరాకరించబడినవి.

**5. భోక్త్రాపత్త్యధికరణము**

భోక్త, భోగ్యాలకు భేదం వుండటములో సమస్యలేదు. వస్తుభేదం వున్నా కారణభేదం లేదు. బ్రహ్మము జగత్తుకు ఉపాదానకారణము మరియు నిమిత్తకారణము.

**6. ఆరంభణాధికరణము**

బ్రహ్మవికారమైన జగత్తు బ్రహ్మకు భిన్నముకాదు. కారణమైన బ్రహ్మము, కార్యమైన జగత్తు భిన్నముకావు. బ్రహ్మము, జగత్తులకు అనన్యత్వము కలదు. జగము మొదట బ్రహ్మములో అప్రకటితముగా వుండి ఆ తరువాత సృష్టిలో ప్రకటితముగా వుండును. బ్రహ్మమునకు జగత్తు ఎప్పుడూ అనన్యము. మిగతా అంతా వాచారంభణమే.

**7. ఇతరవ్యపదేశాధికరణము**

ఇతరుడైన జీవుడు సదాముక్తు కాడు. సదాముక్తుడైన పరబ్రహ్మకు హితము, అహితము రెండూ లేవు. కార్యవైచిత్రముల వలన కారణమైన బ్రహ్మములో భేదము కాని, భేదభావము కాని లేవు.

**8. ఉపసంహారదర్శనాధికరణము**

పరబ్రహ్మము జగత్తుకు కారణమే. తనకు తానే జగత్తుగా కావలసిన స్వాభావికశక్తి బ్రహ్మమునకు వున్నది. పరబ్రహ్మము ఏ సాధనము, సహాయము లేకుండా జగత్తును సృష్టించును.

### 9. కృత్స్నప్రసక్త్యధికరణము

బ్రహ్మము జగత్తుకు కారణము, ఆశ్రయము, సాక్షి మరియు అతీతము. బ్రహ్మము జగత్తుకన్న మిన్న. జగత్తు బ్రహ్మయొక్క ప్రకటితమైన ఒక పాదము మాత్రమే. మూడు పాదములు జగత్తుకు మించి వున్నాయి.

### 10. సర్వోపేతాధికరణము

పరబ్రహ్మము సర్వశక్తి సామర్థ్యవంతుడు, సర్వజ్ఞుడు. సంకల్ప మాత్రముననే సర్వము సంపన్నము చేయగల సర్వాంతర్యామి ఆ బ్రహ్మము. సర్వశక్తులు ఉపేతమైన పరబ్రహ్మ సర్వమూలము.

### 11. నప్రయోజనవత్త్వాధికరణము

జగద్రచన పరబ్రహ్మయొక్క ప్రయోజనరహిత ఆనందస్వరూపలీల. పరబ్రహ్మ ఆప్తకాముడు.

### 12. వైషమ్యనైర్ఘృణ్యాధికరణము

అనాది ఐన మరియు ఆది, మధ్యములు లేని ఈ జగత్తును కర్మ, అకర్మల ప్రకారము పక్షపాతము మరియు నిర్దయత్వము లేకుండా లీలగా సృష్టిస్తుంది పరబ్రహ్మము.

### 13. సర్వధర్మోపపత్త్యధికరణము

జగత్తుకు కారణము కావలసిన ధర్మములైన సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము మొదలైన సర్వధర్మములు తనయందు ఉపపన్నమైనందువలన, ఉండుటవలన, బ్రహ్మమే జగత్కారణము అను సిద్ధాంతము దోషరహితము, సంశయాతీతము మరియు సత్యము.

ఇట్లు

**ద్వితీయాధ్యాయ ప్రథమపాద సమాసము**



# ద్వితీయాధ్యాయ ప్రథమపాద సారము

## సాంఖ్యాదిమత నిరాకరణ

ఏది వేద ప్రమాణం కాని సాంఖ్యమునందు చెప్పబడనిదో; ఏది ప్రధానము కన్న మించినది మరియు చైతన్యవంతమైనదో; ఏది సాంఖ్యము మరియు యోగముల ద్వారా అర్థము, అనుభూతి కాజాలని అతీతమో; ఏది జగత్తునకు ఉపాదాన కారణమైనందున తన స్వభావమునకు భంగము లేనిదో; దేనిలో జగత్తు లీనమైనప్పుడు దోషములు లేకుండా పోవునో; ఏది శిష్టులు ఒప్పుకొనిన మతములు, వేదసమ్మతమైన మతములు స్వీకరించునదో; దేని విషయంలో వస్తు భేదము ఉన్నా, కారణ భేదము లేదో మరియు ఏది జగత్తుకు ఉపాదాన కారణము మరియు నిమిత్త కారణమో; దేని వికారమైన జగత్తు ఏదానికి భిన్నము కాదో; ఏది తానే కారణము మరియు కార్యమైన జగత్తో; దేనిలో జగత్తు మొదలు అప్రకటితముగా ఉండి తరువాత సృష్టిలో ప్రకటితముగా ఉండునో; దేనికి జగత్తు ఎప్పుడూ అనన్యమో; ఏది సదా ముక్తమో మరియు దేనికి హితము, అహితము రెండూ లేవో; కారణమైన దేనిలో కార్యవైచిత్ర్యముల వలన భేదము, భేద భావము లేవో; ఏది జగత్తుకు కారణమై, తనయందే జగత్తుగా కావలసిన స్వాభావిక శక్తి కలదో; ఏది ఏ సాధనము సహాయము లేకుండా జగత్తును సృష్టించునో; ఏది జగత్తునకు కారణము ఆశ్రయము, సాక్షి మరియు అతీతమో; ఏది జగత్తుకన్నా మిన్నయో; జగత్తు దేనియొక్క ప్రకటితమైన ఒక పాదము మాత్రమేనో మరియు దేని మూడు పాదములు జగత్తుకు మించి ఉన్నాయో; ఏది సర్వశక్తి సామర్థ్యవంతమో; ఏది సర్వజ్ఞుడు మరియు సంకల్ప మాత్రముననే సర్వము సంపన్నము చేయగల సర్వాంతర్యామియో; ఏది సర్వశక్తి ఉపేతము మరియు సర్వమూలమో; జగద్రచన దేనియొక్క ప్రయోజన రహిత ఆనందస్వరూపమో; ఏది ఆప్త కాముడో; ఏది అనాది మరియు ఆది మధ్యములు లేని ఈ జగత్తును కర్మ అకర్మల ప్రకారం పక్షపాతము మరియు నిర్దయత్వము లేకుండా లీలగా సృష్టిస్తుందో; ఏది జగత్తుకు కారణము కావలసిన ధర్మములైన సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము మొదలైన సర్వధర్మములు తన యందు ఉత్పన్నమైనందున దేనికి జగత్తు కారణము అను సిద్ధాంతము దోషరహితము, సంశయాతీతము మరియు సత్యమో అదియే బ్రహ్మము.

ఇట్లు
ద్వితీయాధ్యాయ ప్రథమపాద సారము



# II.2
# ద్వితీయాధ్యాయము - ద్వితీయ పాదము
## శ్రుత్యసమ్మత మార్గనిరాకరణ

## 1. రచనానుపపత్త్యధికరణము (53)

### (172) II.2.1

**సూ. రచనానుపపత్తేశ్చ నానుమానమ్**

**క్ర. రచనానుపపత్తేః, చ, న, అనుమానమ్**

ప్ర.అ. రచనానుపపత్తేః = **వివిధ ప్రకారములైన రచనలు సంభవము కానందున,** చ = **కూడా,** న = **ప్రధానము జగత్కారణము కాదు,** అనుమానమ్ = **వేదాధరములేని అనుమానము మాత్రమే ఐనందున**

వి. "జగత్తు సుఖదుఃఖమోహాత్మకమైన దాని నుండి ఉత్పన్నమైనది. ఎందుకు? జగత్తు సుఖదుఃఖ మోహమైనది కనుక కుండ మట్టి నుండి ఉత్పన్నమై మట్టిని కూడి వుండునట్లు" అని అంటే అది సరికాదు. పైన చెప్పినది కేవలము అనుమానమే. ఇది శ్రుతిలో చెప్పబడలేదు. **జడమైన దాని నుండి వివిధమైన విచిత్రమైన ఈ జగత్తు రాజాలదు. కావున ప్రధానము జగత్కారణముకాదు.**

### (173) II.2.2

**సూ. ప్రవృత్తేశ్చ**

**క్ర. ప్రవృత్తేః, చ**

ప్ర.అ. ప్రవృత్తేః = **ప్రవృత్తి వలన,** చ = **కూడ**

వి. **ప్రవృత్తి దృష్టిలో కూడ జడమైన ప్రధానము జగత్కారణము కాలేదు. జడపదార్థములకు ప్రవృత్తి, కదలికలేదు. చైతన్యమైన వాటికే ప్రవృత్తి కలదు.** మట్టి, రథం, బొక్కెన, బంగారం, కాగితము, కలము, బాణము మరియు శరము అచేతనములు. కుమ్మరివాడు లేకుండా కేవలము మట్టి, చక్రము మరియు కర్ర వలన కుండ కాలేదు. గుఱ్ఱములు, సారథి లేకుండా రథము నడువలేదు, తాడుతో లాగేవాడు లేకుండా బొక్కెన నీరు తేలేదు. స్వర్ణకారుడు లేకుండా స్వర్ణము స్వర్ణాభరణము కాలేదు. వ్రాసేవాడు లేకుండా కాగితము, కలములు వ్రాత వ్రాయలేవు. చేయితో బాణం వేసేవాడు లేకుండా బాణము శరము వేయలేడు. శరము దూసుకొని పోలేదు. చేతనము వలననే అచేతనములు ప్రవృత్తి చేయగలవు. "యతః ప్రవృత్తిర్భూతానాం" (భ.గీ.18-46) "దేని నుండియైతే, దేనివలనైతే ఈ పంచమహాభూతములు ప్రవృత్తమౌతాయో" అని అన్నట్లు

**జడపదార్థములైన పంచమహాభూతములు కూడా చైతన్యమైన బ్రహ్మము నుండియే వస్తాయి. బ్రహ్మము వలననే ప్రవృత్తియై నడుస్తావి. జడమైన ప్రధానమునకు స్వయం ప్రవృత్తిలేదు.** (భ.గీ.18-46)

## (174) II.2.3

సూ. **పయోఽంబువచ్చేత్తత్రాపి**

క్ర. **పయోఽంబువత్, చేత్, తత్ర, అపి**

ప్ర.అ. పయోఽంబువత్ = **పాలు, నీళ్ళవలె;** చేత్ = **అని అంటే,** తత్ర = **అపుడు,** అపి = **కూడ**

వి. **దూడకోసము పాలవలె, జనులకోసం నీరువలె ప్రధానమైన ప్రకృతి తానే ప్రవృత్తము అవుతుంది అని అంటే అట్లు కాదు.** ఎందుకంటే దూడపైన వాత్సల్యము వలన ఆవులో కదలిక కలిగి పాలు వస్తాయి. పల్లము భూమి వలన నీరు పారుతుంది. వాత్సల్యము, పల్లపుతనము చేతనములు. చేతనము కారణము అవటము వలననే అచేతనములైన జడములు ప్రకృతి, ప్రధానములు ప్రవృత్తము అవుతున్నాయి. ప్రధానము స్వయంప్రవృత్తము కాలేదు, కాదు. ప్రధానము ప్రధాని. ప్రధాని రాజు కాలేడు. **పరబ్రహ్మ రాజు, ప్రధానము ప్రధాని. (పరబ్రహ్మ యజమాని, ప్రధానము పాలేరు). ప్రధానికి రాజు యొక్క ఆధిపత్యము, అధికర్తృత్వము, సర్వజ్ఞత్వము వుండవు. ప్రధాని చేసేదంతా రాజు వలననే. రాజు అయిన బ్రహ్మమే కారణము.**

## (175) II.2.4

సూ. **వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్**

క్ర. **వ్యతిరేకానవస్థితేః, చ, అనపేక్షత్వాత్**

ప్ర.అ. వ్యతిరేకానవస్థితేః = **ప్రదానము కన్న వ్యతిరేకమైన ప్రవర్తకముకాని, నివర్తకముకాని లేకపోవుట వలన,** చ = **మరియు,** అనపేక్షత్వాత్ = **అపేక్షచేయనందు వలన**

వి. **సాంఖ్యమతముననుసరించి త్రిగుణముల కలయికయే, సామ్యావస్థయే ప్రధానము మరియు ఆ ప్రధానమును ప్రవర్తిల్ల చేసేది కాని నివర్తిల్ల చేసేది వేరే ఎవరూ లేరు.** పురుషుడు వున్నాడు కాని, సాంఖ్య ప్రకారము, పురుషుడు కేవలము తటస్థుడు, ఉదాసీనుడు. **అయితే ప్రకృతి తనంతట తాను జగద్రచన చేయలేదు.** పురుషుని సాన్నిధ్యములో ప్రకృతియే రచన చేస్తుంది అంతే దూడ సాన్నిధ్యములో ఆవు పాలు వస్తున్నాయి అన్నట్లు అవుతుంది కదా! దూడ వలన ఆవులో, ఆవుపాలలో చైతన్యం కలిగి పాలు వస్తున్నట్లు **పురుషుని సాన్నిధ్యములో ప్రకృతిలో చైతన్యము కలిగి, సృష్టి అవుతున్నది అన్నట్లు అవుతుంది. ఆ విధముగా కూడ ప్రధానము జగత్కారణము కాదు. పరమాత్మ, చేతనమైన పరమాత్మయే జగత్కారణము.**

## (176) II.2.5

**సూ. అన్యత్రాభావాచ్చ న తృణాదివత్**

**క్ర. అన్యత్ర, అభావాచ్చ, న, తృణాదివత్**

ప్ర.అ. అన్యత్ర = **స్త్రీలు, జంతువులు కాని వాటి విషయములో,** అభావాత్ = **అభావము వుండుట వలన,** చ = **కూడ,** తృణాదివత్ = **గడ్డి మొదలైన వానివలె,** న = **సిద్ధించును.**

వి. **ఆవులు మేసిన గడ్డి ఏ అపేక్ష లేకుండా పాలుగా మారినట్లు ప్రధానము కూడా ఏ అపేక్ష లేకుండా జగత్తుగా మారుతుంది అని అంటే అది సరికాదు. ఆవులు కాక, ఎద్దులు, దున్నపోతులు, మేసినగడ్డి, కోష్ఠములోనున్నగడ్డి పాలుగా మారటం లేదు.** నిమిత్తమైన ఆవు అనే చైతన్యము వలన గడ్డి పాలుగా మారుతున్నది. ఆవు తిన్న గడ్డి పాలుగా మారటం ఒక దైవకారణమైన ప్రక్రియయే. కావున ప్రధానము జగముగా కావటము తృణములవలె స్వాభావికము కాదు. **తృణములు పాలుగా మారటానికి గోచైతన్యము కారణము. ప్రధానము జగత్తుగా మారటానికి కారణము పరమాత్మయే.**

---

## (177) II.2.6

**సూ. అభ్యుపగమేఽప్యర్థాభావాత్**

**క్ర. అభ్యుపగమే, అపి, అర్థాభావాత్**

ప్ర.అ. అభ్యుపగమే = **అంగీకరించనప్పటికి,** అపి = **గూడ,** అర్థాభావాత్ = **అర్థములేనందున, ఏ ప్రయోజనము లేనందువలన అంగీకారము అనుపయోగము అవుతుంది.**

వి. **ప్రధానమునకు స్వాభావికమైన ప్రవృత్తిని అంగీకరించినగూడ, ఆ ప్రవృత్తికి తగిన ప్రయోజనము ఏది లేనందున దోష ప్రసక్తి వస్తుంది.** సాంఖ్యమతము ప్రకారము పురుషుడు అసంగుడు, ఉదాసీనుడు. ప్రధానము యొక్క ప్రవృత్తికి సుఖదుఃఖాలే ప్రయోజనమైతే మోక్షం ఎప్పటికీరాదు. సుఖదుఃఖాల వల్లనే ప్రధానము ప్రవృత్తి ఐతే, సుఖదుఃఖాలే ప్రయోజనము అయితే సుఖదుః ఖాల మోక్షము ఎలా అవుతుంది? పురుషుడు (బ్రహ్మము) ఎప్పటికీ మోక్షావస్థయందున్నాడు కనుక ప్రధానము యొక్క ప్రవృత్తికి, ప్రయోజనము అపవర్గము (మోక్షము) కాదు. దీని వలన **ప్రధానము (ప్రకృతి) పురుషుని (బ్రహ్మము) ప్రయోజనము కొరకు ప్రవృత్తి కావటము లేదు. ప్రధానమునకు స్వాభావికమైన ప్రవృత్తి లేదు. పురుషుడే సర్వప్రవృత్తులకు కారణము.**

---

## (178) II.2.7

**సూ. పురుషాశ్మవదితి చేత్తథాపి**

**క్ర. పురుషాశ్మ వత్, ఇతి, చేత్, తథాపి**

ప్ర.అ. పురుషాశ్మవత్ = **కుంటివానివలె, అయస్కాంతమువలె,** ఇతి = **అనిన,** చేత్ = **యెడల,** తథాపి = **అపుడు కూడ**

వి. **ఒకవేళ ప్రధానము పురుషుని సన్నిధానములో, కుంటివానివెంట వున్న గ్రుడ్డివానివలె మరియు అయస్కాంతము చెంతయున్న ఇనుమువలె ప్రవృత్తము కావచ్చుకదా అని అంటే కూడా దోషములు వస్తాయి. పురుషుని ప్రేరణవల్ల ప్రధానము ప్రవృత్తమైతే ప్రధానము స్వతంత్రము కాదు అనే (వారి మతమునకే) దోషము వస్తుంది. మరియు పురుషుడు ప్రధానమును ప్రేరణ చేస్తాడు అని అంటే పురుషుడు ఉదాసీనుడు, అనాసక్తుడు, వికారరహితుడు అనే సాంఖ్యుల మాటలకే దోషము వస్తుంది. ఆ విధముగా కూడ కేవల ప్రధానమే జగత్తుకు కారణము కాదు.**

[**నారాయణ వాక్యము :-** ప్రధానము కుంటిది మరియు గ్రుడ్డిది. జడమునకు చేతన వుండదు, జ్ఞానము వుండదు. బ్రహ్మము చూడగలడు మరియు నడువగలడు. మరియు చూపించగలడు మరియు నడిపించగలడు. చూపించగల నడిపించగల పురుషుడు (బ్రహ్మము) గ్రుడ్డి, కుంటి అయిన ప్రధానమును (ప్రకృతిని) చెప్పి నడిపిస్తాడు. బ్రహ్మము సర్వజ్ఞము సంపూర్ణ చైతన్యము. ప్రధానము జ్ఞానరహిత జడము.]

---

## (179) II.2.8

సూ. **అంగిత్వానుపపతేశ్చ**

క్ర. **అంగిత్వానుపపత్తేః, చ**

ప్ర.అ. అంగిత్వానుపపత్తేః = **సత్త్వరజస్తమత్వ గుణములకు ఉత్కర్ష, అపకర్షలు సిద్ధించనందున,** చ = **కూడ**

వి. **సత్త్వరజస్తమములను మూడు గుణముల సామ్యావస్థను ప్రధానమని సాంఖ్యము చెప్పుచున్నది. సామ్యము స్వభావమైనపుడు గుణములకు వైషమ్యము వుండదు.** సామ్యమునందు ఎక్కువ తక్కువలు, గుణములందు ఉపగుణముల భావము వుండదు. సామ్యము స్వభావముకాదంటే సదావైషమ్యము వలన సదా సృష్టి జరుగుచుండును, ప్రళయము వుండదు. కావున ప్రధానము ప్రవృత్తి కాలేదు. పురుషుడు ప్రేరణ చేయుట వలన ప్రకృతి క్షోభ అయి సృష్టి అవుతుంది అని అంటే పురుషుడు అసంగుడు, ఉదాసీనుడు, నిష్క్రియుడు అనే మాట సరిపోదు. **తిరిగి తిరిగి జగత్కారణము ప్రధానము కాదు, పురుషుడు జగత్కారణము అన్న మాట నిలిచిపోతుంది.**

---

## (180) II.2.9

సూ. **అన్యథాఽనుమితౌ చ జ్ఞశక్తివియోగాత్**

క్ర. **అన్యథా, అనుమితౌ, చ, జ్ఞశక్తివియోగాత్**

ప్ర.అ. అన్యథా = వేరురీతిగా, అనుమతౌ = అనుమానము చేసినను, చ = **గూడ,** జ్ఞశక్తి వియోగాత్ = **జ్ఞానశక్తి రహితములుగాన**

వి. **ప్రధానావస్థయందు గుణములు అన్యోన్య నిరపేక్షములు నిర్వికారములు, అప్రచలితములు అని చెప్పబడినను, గుణములకు సాపేక్షత్వమును, ప్రచలనము కలదని అనుమానముతో ఊహచేసినను, ఆ గుణములు జ్ఞానరహితములు గావున అసంఖ్యాక విచిత్రజీవులను సృజించుట జడ ప్రధానమునకు అసంభవము. జ్ఞానశక్తిలేనందున ప్రధానము గ్రుడ్డిదే అవును. జ్ఞానశక్తిలేని**

**ప్రధానము జగద్రచన చేయలేదు. జ్ఞానశక్తిమయుడు, సర్వజ్ఞుడు అయిన బ్రహ్మమే జగద్రచన చేయుటము వాస్తవము.**

## (181) II.2.10

**సూ. విప్రతిషేధాచ్చాసమంజసమ్**

**క్ర. విప్రతిషేధాత్, చ, అసమంజసమ్**

**ప్ర.అ.** విప్రతిషేధాత్ = **పరస్పర విరోధ వర్ణనముల వలన,** చ = **కూడ,** అసమంజసమ్ = **సాంఖ్యదర్శనము అసమంజసము**

**వి.** సాంఖ్యమతము "ఈశ్వరుడు జగత్తుకు కారణము" అని అనిన శ్రుతులతోను, స్మృతులతోను విరోధిస్తుంది. ఒకచోట అహంకారము నుండి పుట్టుతున్నాయని అని ఈ సాంఖ్యం అంటుంది. ఒకచోట జగములు, కర్మేంద్రియములు ఐదు అనీ, ఇంకొకచోట ఏడు అనీ చెప్పుతుంది. జ్ఞానకర్మేంద్రియములు పది అనీ, మరల పదకొండు అనీ (మనస్సుతోబాటు) అంటుంది. అంతః కరణములు నాలుగు (బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము) కాక మూడే అని అంటుంది. ఇంకొకచోట అంతఃకరణం అంటే ఒక బుద్ధే అని అంటుంది. ఈ విధముగా **పరస్పర విరుద్ధ విచారములుకల సాంఖ్యమతము అసంపూర్ణము, అసమంజసము. ఇక వేదాంత దర్శనము సర్వశ్రుతి వాక్యముల సమన్వయమై సమంజసము మరియు సంపూర్ణము.**

## 2. మహద్దీర్ఘాధికరణము (54)

## (182) II.2.11

**సూ. మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యామ్**

**క్ర. మహద్దీర్ఘవత్, వా, హ్రస్వపరిమండలాభ్యామ్**

**ప్ర.అ.** మహద్దీర్ఘవత్ = **మహత్తు, దీర్ఘము (త్ర్యణకము)కు మూడు అణువుల కలయికల ఉత్పత్తి నిరూపించుట.** వా = **వలె,** హ్రస్వపరిమండలాభ్యాం = **హ్రస్వ(ద్వ్యణకము, రెండణువుల కలయిక) పరిమండల (పరమాణు)ముల నుండి వైశేషికుల ప్రతిపాదన**

**వి.** **హ్రస్వములు (ద్వ్యణుకములు) పరిమండలాల (పరమాణువులు) వలన, మహత్తులు దీర్ఘములు (త్ర్యణుకములు) పుట్టినట్లే చేతన బ్రహ్మనుండి, అచేతనమైన జగత్తు పుడుతోంది.** వైశేషికుల ప్రకారము పరమాణువులు జగత్కారణము. ఈ మతము ప్రకారము కారణమైన పదార్థములకు ఏ గుణములు వుంటాయో అవియే గుణములు కార్యాలకు వుంటాయి. నల్లమట్టితో అయిన కుండలు నల్లగా వుంటాయి. తెల్లనూలుతో నేసిన వస్త్రాలు తెల్లగా వుంటాయి. తెల్లటి వెండి నగలు తెల్లగా వుంటాయి. కుండలు, వస్త్రములు, నగలు కార్యములు. మట్టి, నూలు, వెండి ఉపాదానకారణములు. కనుక చేతనమైన బ్రహ్మము నుండి అచేతనమైన జగత్తు పుట్టజాలదు. ఇది వారి ఆలోచనా క్రమము. హ్రస్వములు, పరమాణువులుగా పరిణామము చెందినపుడు

పరమాణువుల పరిమాణము (కొలత) హ్రస్వములకన్న రెండింతలు. పరమాణువులకన్న దీర్ఘములు మూడింతలు (త్ర్యణుకములు) అంటే కార్యము, కారణముకన్న వేరు! అదేవిధముగా కారణమైన పరమాణువులు కార్యములైన సముద్రములు మరియు వాయువు గుణములో పరస్పర భిన్నములు. చెట్లు, జంతువులు చైతన్యవంతము. పరమాణువులు జడము. **పరమాణువుల నుండి భిన్నమైన దీర్ఘములు, మహత్తు వచ్చినట్లు మరియు జడమైన పరమాణువు నుండి చైతన్యరూపమైన చెట్లు, జంతువులు వచ్చినట్లు, చేతనమైన బ్రహ్మము నుండి జడమైన జగత్తు రావటములో ఏమీ ఆశ్చర్యములేదు.** అయితే వారి తర్కవిధానమే వారికి సమస్య అవుతున్నది. కావున చేతనమైన బ్రహ్మమే జగత్కారణము. (చేతనము తన్ను తాను మార్చుకొనగల్గుతుంది, సాలీడు నుండి దారములాగా. కాని జడము తన్నుతాను చేతనముగా మార్చుకోలేదు)

## 3. పరమాణుజగదకారణత్వాధికరణము (55)

### (183) II.2.12

**సూ. ఉభయథాపి న కర్మాతస్తభావః**

**క్ర. ఉభయథా, అపి, న, కర్మ, అతః, తదభావః**

ప్ర.అ. ఉభయథా = **రెండింటిలో,** అపి = **కూడ,** న = **లేదు,** కర్మ = **కర్మము, చేయటము,** అతః = **కావున,** తదభావః = **అదికాదు**

వి. వైశేషికులు పరమాణువులతో జగత్తు యొక్క సృష్టి అవుతుంది అని అంటారు. అదే రీతిగా చూస్తే నూలు పోగులు వస్త్రముగా అవటానికి కర్మము, ఒక క్రియ అవసరము. పరమాణువుల సంయోగానికి కాని విభాగానికి కాని కర్మము అవసరమౌతోంది. కార్యమైన ఆ కర్మమునకు ఒక కారణం వుండాలి. **సృష్టికి పరమాణువులు కలవాలి. ప్రళయానికి అవి విడిపోవాలి. రెండూ కర్మములే వాటికి కారణం వుండాలి. పరమాణువులు జడములు కనుక వాటంతట అవి కలువలేవు మరియు విడిపోలేవు. కావున పరమాణువులు జగత్కారణము కావు.**

### (184) II.2.13

**సూ. సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః**

**క్ర. సమవాయాభ్యుపగమాత్, చ, సామ్యాత్, అనవస్థితేః**

ప్ర.అ. సమవాయాభ్యుపగమాచ్చ = **సమవాయసంబంధాన్ని, అన్యోన్య సంబంధాన్ని ఒప్పుకుంటే భేదం,** సామ్యాత్ = **సామ్యాము అనటము వలన,** అనవస్థితేః = **అవస్థాదోషం కలుగుతుంది.**

వి. రెండు పరమాణువుల వలన ద్వణుకము పుడుతుంది. ఆ ద్వణుకము ఆ పరమాణువుకన్న భిన్నమని, ఆ ద్వణుకం ఆ పరమాణువులతో సమవాయసంబంధములో వుంటుందని వైశేషికులవాదం. (సమవాయ సంబంధం అంటే ఆధారము మరియు ఆధారపడేవి). అదేవిధంగా ఆ సమవాయసంబంధం కూడా ఒక భిన్నపదార్థం అవుతుంది. అప్పుడు ద్వణుకము వలెనె ఈ

సమవాయ సంబంధానికి కూడా మరొక సమవాయ సంబంధం కల్పించాలి. అలా అనంత ప్రక్రియలు అవసరము అవుతాయి. **జగత్సృష్టిని సమవాయసంబంధము ద్వారా వివరింపలేము. జగత్సృష్టికి ఒక చైతన్యము అవసరము. బ్రహ్మమే ఆ చైతన్యము.**

## (185) II.2.14

సూ. **నిత్యమేవ చ భావాత్**

క్ర. **నిత్యమ్, ఏవ, చ, భావాత్**

ప్ర.అ. నిత్యమేవ = **ఎల్లప్పుడు,** చ = **కూడ,** భావాత్ = **సృష్టికాని ప్రళయము కాని ఎప్పుడూ జరుగుచునే వుండును.**

వి. **పరమాణువులకు ప్రవృత్తి భావాన్ని ఒప్పుకుంటే ప్రళయం వుండదు. నివృత్తి భావాన్ని ఒప్పుకుంటే సృష్టి వుండదు. ప్రవృత్తికాని, నివృత్తికాని నిత్యము కాజాలవు. ఏ ఒకటి నిత్యమైనా రెండవది కాలేదు. కావున పరమాణువులు జగత్కారణము కావు.**

## (186) II.2.15

సూ. **రూపాదిమత్వాచ్చ విపర్యయోః దర్శనాత్**

క్ర. **రూపాదిమత్వాత్, చ, విపర్యయోః, దర్శనాత్**

ప్ర.అ. రూపాదిమత్వాత్ = **పరమాణువులకు రూపరసాది గుణములు కలవని అనుకొంటారు,** చ = **ఇంకను,** విపర్యయోః = **అట్లు భావించిన దోషము,** దర్శనాత్ = **కనిపించుట వలన**

వి. **వైశేషికమతములో రూపరసాది గుణములున్న తరువాత నిత్యత వుండదు. రూపాదులు వున్న కుండలు మొదలైన వస్తువులు అనిత్యమని చూస్తున్నాముకదా. వారి ప్రకారము పరమాణువులకు రూపరసాది గుణములు వుంటాయి. అయితే రూపరసాదులు వుంటే నిత్యతవుండదు అట్లు వారి మతము ప్రకారమే పరమాణువులకు నిత్యత వుండకూడదు. ఇట్లు విరుద్ధములు కలిగిన వైశేషిక పరమాణువాదము సిద్ధింపదు.**

## (187) II.2.16

సూ. **ఉభయథా చ దోపాత్**

క్ర. **ఉభయథా, చ, దోషాత్**

ప్ర. ఉభయథా = **రెండు విధముల,** చ = **కూడ,** దోషాత్ = **దోషము వచ్చుట వలన**

అ. పృథివియందు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఐదు గుణములు వున్నాయి. జలముయందు శబ్ద, స్పర్శ. రూప, రసములైన నాలుగే వున్నాయి. అగ్నియందు శబ్ద, స్పర్శ, రూపములను మూడే వున్నాయి. వాయువునందు శబ్ద, స్పర్శలే వున్నాయి. ఆకాశమునందు శబ్దమొకటే వున్నది. అయితే వాటి పరమాణువులలో కూడా హెచ్చుతగ్గులు వుండాలి. అప్పుడు అవి పరమాణువులు ఎట్లా అవుతాయి? **అన్నిటికన్న చిన్న అని మరియు కొన్న చిన్నవి, కొన్ని ఇంకా చిన్నవి అంటే**

**దోషము. రెండో విధముగా, పరమాణువులు అన్నీ ఒకే విధము అంటే వాటి కార్యాలైన పృథివిః , ఆపః, అగ్నిః, వాయుః, ఆకాశములు ఒకే తీరుగా వుండాలి. మరి అవి ఒకే తీరుగా లేవు. అలా రెండు తీరులా దోషము వస్తుంది. కనుక పరమాణువులు జగత్కారణము కాజాలవు.**

## (188) II.2.17

**సూ. అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా**

**క్ర. అపరిగ్రహాత్, చ, అత్యంతమ్, అనపేక్షా**

ప్ర.అ. అపరిగ్రహాత్ = **స్వీకరించబడనందువలన,** చ = **కూడ,** అత్యంతం = **చాల,** అనపేక్షా = **ఉపేక్షించవలయును**

వి. ఈ పరమాణువు దాని అణువు, జైమిని మొదలైన వేదతత్త్వజ్ఞులైన శిష్యులు ఒప్పుకొనలేదు. కావున పరమాణువాదం యుక్తముకాదు. ఈ విధముగా వైశేషికవాదము యుక్తి సమ్మతము కాదు, ప్రమాణ సమ్మతము కాదు, శిష్టసమ్మతము కాదు అని నిరూపించబడినది.

## 4. సముదాయాధికరణము (56)

## (189) II.2.18

**సూ. సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః**

**క్ర. సముదాయ, ఉభయహేతుకే, అపి, తదప్రాప్తిః**

ప్ర.అ. సముదాయ = **సముదాయములు,** ఉభయహేతుకే = **రెండు హేతుకములు,** అపి = **కూడ,** తదప్రాప్తిః = **ఆ సముదాయము ప్రాప్తించుట లేదు**

వి. బౌద్ధమత అనుయాయులు నాలుగు రకాలుగా వున్నారు. బుద్ధ భగవానుని బోధను ఆయన శిష్యులు నాలుగురీతుల వివరించినారు. వారు 1) వైభాషికులు, 2) సౌత్రాంతికులు, 3) విజ్ఞానవాదులు - యోగాచారులు, 4) సర్వశూన్యవాదులు - మాధ్యమికులు. ఈ సూత్రములో వైభాషికులు, సౌత్రాంత్రికుల మతాన్ని నిరాకరిస్తున్నారు. **బౌద్ధము ప్రకారము లోకములోని పదార్థాలన్నీ బాహ్యము, అభ్యంతరము అని రెండు విధములు. బాహ్యము అంటే భూతము, భౌతికము. అభ్యంతరము అంటే చిత్తము, చైత్తము. పృథివ్యాది పంచభూతములు. శబ్దస్పర్శాది విషయములు భౌతికము. ఇవి పరమాణు సమూహములే. పరమాణువుల సంఖ్యాభేదము వలన భూతములలో గట్టితనము, ద్రవ్యత్వము, ఉష్ణము, చలనము కల్గుతాయి. అంతర పదార్థములు చిత్త-చైత్తములు. రూపస్కంధ, విజ్ఞానస్కంధ, వేదనాస్కంధ, సంజ్ఞాస్కంధ, సంస్కార స్కంధములని ఐదు విధములు. వీటిని అధ్యాత్మిక సముదాయములు అని అంటారు (పదార్థాలన్నీ క్షణికములు) బాహ్యసముదాయము పరమాణుహేతుకము. అధ్యాత్మిక సముదాయము స్కంధహేతుకము.**

**ఈ రెండు సముదాయములు అచేతనములు. ఈ అచేతనములైన భిన్న వస్తువులను**

సముదాయముగా చేసే చేతనమైన సంధానకర్త ఒకడు వుండాలి. ఇటువంటి కూటస్థుడు వున్నాడని బౌద్ధులు ఒప్పుకొనరు. కావున వీరు చెప్పే సమూదాయములు వాటంతట అవి కాలేవు. సిద్ధించవు. సముదాయములు జగత్కారణము కాదు.

## (190) II.2.19

సూ. **ఇతరేతరప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తిమాత్రనిమిత్తత్వాత్**

క్ర. **ఇతరేతరప్రత్యయత్వాత్, ఇతి, చేత్, న, ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్**

ప్ర.అ. ఇతరేతరప్రత్యయత్వాత్ = **అవిద్య, సంస్కారములు, విజ్ఞానము, నామము, రూపము మొదలైనవి పరస్పర కారణములు ఐనందున సముదాయము సిద్ధించును,** ఇతి చేత్ = **అనినయెడల,** న = **కాదు,** ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్ = **అవిద్య మొదలైనవి తరువాతి వానికి ఉత్పత్తి మాత్రమందే నిమిత్తములు కాని సముదాయము, సంఘాతమందు కావు.**

వి. **అవిద్య మొదలైనవి ఒకదానికొకటి కారణములైనందున చేతనుడు లేకపోయినా సముదాయోత్పత్తి అవుతుంది అంటే అది సరికాదు. అవిద్యాదులు ఒక దాని నుండి ఒకటి పుట్టటానికే కారణాలు అవుతాయి కాని సముదాయోత్పత్తికి కారణాలు కావు. సముదాయోత్పత్తికి చేతనుడు అవసరము.**

## (191) II.2.20

సూ. **ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్**

క్ర. **ఉత్తరోత్పాదే, చ, పూర్వనిరోధాత్**

ప్ర.అ. ఉత్తరోత్పాదే = **తరువాత కాబోవు ఉత్పత్తి సమయమున,** చ = **కూడ,** పూర్వనిరోధాత్ = **పూర్వక్షణమందు ముందువున్నది నశిస్తుంది కనుక.**

వి. **బౌద్ధమతము ప్రకారము ఉత్తరకార్యోత్పత్తి సమయానికి పూర్వకారణం నశిస్తుంది. కావున, కారణానికి అధీనమైన కార్యం కూడ జరుగలేదు. కార్యానికి ముందు కారణం నశిస్తే, ఇక కార్యం ఎలా అవుతుంది? కావున సముదాయము సిద్ధించదు.**

## (192) II.2.21

సూ. **అసతి ప్రతిజ్ఞోపరోధః యౌగపద్యమ్ అన్యథా**

క్ర. **అసతి, ప్రతిజ్ఞోపరోధః, యౌగపద్యమ్, అన్యథా**

ప్ర.అ. అసతి = **కారణము లేనప్పటికీ కార్యముంటుందని ఒప్పుకుంటే,** ప్రతిజ్ఞోపరోధః = **ప్రతిజ్ఞాభంగమగును,** యౌగపద్యమ్ = **కారణము, కార్యము ఒకసారివుండునని స్వీకరించాలి,** అన్యథా = **లేకుంటే**

వి. కారణం లేకుండానే కార్యోత్పత్తిని ఒప్పుకొన్నా కూడా వారు చెప్పినదానికి భంగం కలుగుతున్నది.

**కార్యం కలిగే వరకు కారణం వుంటుందనినప్పటికి కార్యకారణాలు రెండూ కూడా ఏకకాలంలో వుండటం వలన కూడా సర్వమూ క్షణికము అనేవారి ప్రతిజ్ఞకు భంగం వస్తుంది. రెండు విధాల వారి మతము నిలబడలేదు.**

## (193) II.2.22

సూ. **ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిరవిచ్ఛేదాత్**

క్ర. **ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యా, నిరోధాప్రాప్తిః, అవిచ్ఛేదాత్**

ప్ర.అ. ప్రతిసంఖ్యా అప్రతిసంఖ్యానిరోధఅప్రాప్తిః = **ప్రతిసంఖ్యా నిరోధము, అప్రతిసంఖ్యానిరోధము అను రెండు విధములైన నిరోధములు, సిద్ధించవు,** అవిచ్ఛేదాత్ = **ప్రవాహమునకు విచ్ఛేదము కలుగదు కనుక**

వి. **బౌద్ధమతము ప్రకారము ప్రతిసంఖ్యానిరోధము అంటే ఒక పదార్థానికి బుద్ధిపూర్వకంగా జరిగే నాశము. దీనినే స్థూలవినాశనము అని అంటారు. అప్రతిసంఖ్యానిరోధము అంటే సహజముగా జరిగే నాశము - వస్తువు తనంతట తానే ప్రతిక్షణము నశించటము.** ఈ రెండూ నాశములు వస్తువుకు (మట్టికి) వస్తు సంతానానికి (కుండలకు) జరుగాలి. కాని అది సంభవము కాదు. ఎందుకనగా వస్తువుకు, వస్తు సంతానానికి తెంపులేని ప్రవాహసంబంధ ముండటము వలన అది సంభవము కాదు. **వస్తువుకు, వస్తుసంతానానికి వ్యవధి లేనందున, వస్తు సంతానం నశించదు. కుండవున్నా, మట్టివున్నా మట్టి వుంటుంది. కనుక, వస్తు నాశనము జరుగదు.**

## (194) II.2.23

సూ. **ఉభయథా చ దోషాత్**

క్ర. **ఉభయథా, చ, దోషాత్**

ప్ర.అ. ఉభయథా = **రెండు ప్రకారములుగా,** చ = **కూడ,** దోషాత్ = **దోషము వచ్చుట వలన**

వి. యమ, నియమాలతో కూడిన సమ్యక్‌జ్ఞానము వలన అవిద్య నశిస్తుంది అని వారు అన్నారు. మరి వస్తువులు సహజంగా వాటంతట అవే నశిస్తున్నాయి అని కూడ అన్నారు. **అయితే అవిద్య అనే వస్తువు తనంతట తానే నశిస్తే సమ్యక్‌జ్ఞానం అనవసరం. ఒకవేళ అవిద్యనశించటానికి సమ్యక్‌జ్ఞానం కావాలి అని అంటే అవిద్యానాశనం సహజంగా జరుగదు. కనుక రెండు విధాలా దోషం వస్తుంది. ఆవిధంగా వైనాశికమతము సరికాదు.**

## (195) II.2.24

సూ. **ఆకాశే చావిశేషాత్**

క్ర. **ఆకాశే, చ, అవిశేషాత్**

ప్ర. ఆకాశే = **ఆకాశ విషయములో,** చ = **కూడ,** అవిశేషాత్ = **ఇతర భావపదార్థములకంటే దానియందు విశేషత ఏమీ లేదు.**

వి. పృథివి, జలము, తేజము మరియు వాయువు అనే వస్తువులు కాక బౌద్ధములో ఆకాశమనే

దానికి "ఆవరణ లేకపోవటము" అని అన్నారు. ప్రతిసంఖ్యా నిరోధము, అప్రతిసంఖ్యా నిరోధము, ఆకాశము అనేవి త్రయము. **అయితే ఆకాశము "ఆవరణ లేకపోవటము" అనే భావము అది వస్తువుకాదు అని అన్నారు. పంచభూతములలో ఒకటైన ఆకాశము కూడా మిగతా నాలిగింటివలె ఒక భూతము ఒక వస్తువు. ఆకాశము నుండే వాయువు మరి మిగతా మూడు కలిగినాయి.** "బ్రహ్మకు అభిన్నమైన ఆత్మ వస్తువు నుండి ఆకాశము పుట్టుతున్నది" (తై.ఉ.2.1) చెప్పుతున్నది. **తెల్లకాగితములాగా ఏమీ కనిపించని ఆకాశము వున్నది. కాగితంపైన బొమ్మలలాగా ఆకాశమునందు వాయువు, తేజము, జలము, భూమి వున్నాయి. భావరూపములో ఆకాశము వున్నది కదా!**

## (196) II.2.25

సూ. **అనుస్మృతేశ్చ**

క్ర. **అనుస్మృతేః, చ**

ప్ర.అ. అనుస్మృతేః = **పూర్వప్రసంగములు మరల మరల స్మరణము అవుతాయి,** చ = **కూడ**

వి. **బౌద్ధుల ప్రకారము సర్వము క్షణికము అని అంటారు.** అలా అయితే వారి పూర్వసంఘటనలు, ప్రసంగములు మరల మరల జ్ఞాపకము రావుటము వుందికదా! అవి ఆత్మవలన స్మృతివలన జ్ఞాపకం వస్తున్నాయి. **ఆత్మ క్షణికము కాదు కనుక అంతఃకరణమైన స్మృతి, పూర్వ అనుభూతలు క్షణికము కావు. కావున సర్వము క్షణికము అనే బుద్ధమతము నిరాకరించదగినది.**

## (197) II.2.26

సూ. **నా సతోఽదృష్టత్వాత్**

క్ర. **న, అసతః, అదృష్టత్వాత్**

ప్ర.అ. న = **కాదు,** అసతః = **అసత్తు నుండి, అదృష్టత్వాత్ = అది చూడబడనందున**

వి. **అసత్తు నుండి కార్యము యొక్క ఉత్పత్తి కాలేదు. ఎందుకంటే అటువంటిది ఎక్కడా, ఎప్పుడు చూడబడలేదు కనుక.** కుందేటి కొమ్ము, ఎండమావి నీరు, ఆకాశపుష్పము మొదలైనవి భ్రమలే. లేనిదాని నుండి ఉండేది రాలేదు. బీజము నుండి చెట్టు పుట్టినట్లు చైతన్యము నుండి వస్తువులు పుట్టుతాయి. పాల నుండి పెరుగు, వెన్న నుండి నెయ్యి, తల్లి నుండి పిల్ల, అండము నుండి బ్రహ్మాండము కలగటము వాస్తవము.

## (198) II.2.27

సూ. **ఉదాసీనానామపి చైమా సిద్ధిః**

క్ర. **ఉదాసీనానామ్, అపి, చ, ఏవం, సిద్ధిః**

ప్ర.అ. ఉదాసీనానామ్ = **ఉదాసీనులకు,** అపి = **కూడ,** చ = **మరియు,** సిద్ధిః = **కార్యసిద్ధి అవగలదు.**

వి. ఒకవేళ ఏ చేతనకర్త లేకుండా స్వతహాగా కార్య ఉత్పత్తి అవుతుందని ఒప్పుకొంటే, ఏ కార్యసిద్ధి కొరకు ఎవరైనా ప్రయత్నము చేసే అవసరము వుండదు కదా! పురుషార్థులవలె ఏమీ చేయని

సోమరులు కూడా, తాము కోరిన కార్యముల సాఫల్యము ఏమీ శ్రమ లేకుండానే పొందుతారు. అనాయాస సాఫల్యము అందితే ప్రయత్నశీలురు కూడా తమ ప్రయత్నము వదులుకుంటారు. ఇక భోజనము, వస్త్రములు మరియు ఇతర సామగ్రుల కొరకు ఏ ప్రయత్నములు అవసరముండదు! అప్పుడు నిష్క్రియాదోషము వస్తుంది. కార్యములు తమంతట తాము అయిపోవటము చూడబడలేదు! ఈ విధముగా బౌద్ధమతము సారహీనము మరియు అసంగతము.

## 5. అభావాధికరణము (57)

## (199) II.2.28

**సూ. నాభావ ఉపలబ్ధేః**

**క్ర. న, అభావః, ఉపలబ్ధేః**

ప్ర.అ. న = **లేదు,** అభావః = **అభావము, లేకపోవుట,** ఉపలబ్ధేః = **లభిస్తుంది కనుక**

వి. తెలుసుకొంటే బ్రహ్మపదార్థమును భ్రమయని కొని, లేదని కాని అనటము సరికాదు. ప్రత్యక్షాది ప్రమాణములతో అది కనిపిస్తుంది. కారణరూపములో, కార్యరూపము ఐన జగత్తుగా అది సదా సత్యము. ఒకవేళ అది స్వప్నమువలె, ఆకాశము యొక్క నీలిరంగువలె భ్రమయైన దాని ప్రాప్తి లభించక పోయివుండును. **విజ్ఞానము తప్ప వేరు పదార్థాలు లేవు అనే యోగాచార బౌద్ధవచనములు సరికావు. విజ్ఞానము కాని కుండలు, పటములు, వస్తువులు కనిపిస్తూనే వున్నాయికదా.**

## (200) II.2.29

**సూ. వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్**

**క్ర. వైధర్మ్యాత్, చ, న, స్వప్నాదివత్**

ప్ర.అ. వైధర్మ్యాత్ = **ధర్మములకు భేదముండుట వలన,** చ = **కూడ,** న = **కాదు,** స్వప్నాదివత్ = **స్వప్నములు మొదలైన వాటియందువలె**

వి. **స్వప్నావస్థయందు చూచి, విని, అనుభవించినవి జాగ్రదవస్థ రాగానే వాని ఉపలబ్ధి వుండదు. అవి లేకుండా పోతాయి. ఆ రీతిగనే జాగ్రదవస్థతో కూడా విజ్ఞానము తప్ప బాహ్యపదార్థము ఏది లేదు అని బౌద్ధులు అనేది సరికాదు.** కలకు, తెలివికి పోలికయేలేదు. కలలో కనిపించిన వస్తువు తెలివిరాగానే బాధితమౌతుంది, లేకుండాపోతుంది. అవిలేవు అనే నిశ్చయము అవుతుంది. జాగ్రదవస్థలో వస్తువులు వుంటున్నాయి. ఆ వస్తువులు లేనివి, అసత్యము అని అనిపించటము లేదు. పైగా అవి ఇంకొక రోజున కూడా అట్లాగే కనిపిస్తున్నాయి. వేరేవారికి కూడా అట్లాగే కనిపిస్తున్నాయి. స్వప్నములోని అనుభవం "స్మృతి" అవుతుంది. తెలివిలోని అనుభవం ప్రత్యక్షముగా లభించింది అవుతుంది. ఈ విధముగా స్వప్నజ్ఞానమునకు జాగ్రతజ్ఞానమునకు భేదం వున్నది. కావున బౌద్ధవిజ్ఞానవాదుల సిద్ధాంతము బాహ్యపదార్థములు సత్యము కాదనుట సరికాదు. అవి సత్యములని స్వీకరించుటయే యుక్తము. **కల కల్ల. తెలివి తేట.**

## (201) II.2.30

సూ. న భావోऽనుపలబ్ధేః

క్ర. **న, అభావః, అనుపలబ్ధేః**

ప్ర.అ. న = **కాదు,** భావః = **విజ్ఞానవాదులచే కల్పించబడిన వాసనాసత్తా,** అనుపలబ్ధేః = **అనుపలబ్ధి వలన**

వి. మొదలు ఉపలబ్ధమైన వస్తువుల సంస్కారములే వాసనారూపములో బుద్ధిలో కూడియుంది ప్రకటమౌతాయి. **పదార్థముల సత్తా ఉనికి స్వీకరించనపుడు వాటి ఉపలబ్ధి వుండనందున, వాసనల ఆస్తిత్వము సిద్ధికాదు. బాహ్యపదార్థముల సత్యము స్వీకరించనందున విజ్ఞానవాదుల మతము సరికాదు.**

## (202) II.2.31

సూ. క్షణికత్వాచ్చ

క్ర. **క్షణికత్వాత్, చ**

ప్ర.అ. క్షణితత్వాత్ = **క్షణికము అని అన్నారు కనుక,** చ = **కూడ**

వి. **బుద్ధియే వాసనలకు ఆధారము. దానిని కూడ విజ్ఞానవాదులు క్షణికము అని అన్నారు. అలా అయితే బుద్ధికే నిలకడ లేనప్పుడు, బుద్ధి మీద ఆధారపడే వాసనలకు అస్తిత్వమే వుండదు. ఆ విధముగా బౌద్ధమతము నిరాకరణీయము.**

## (203) II.2.32

సూ. సర్వథానుపత్తేః శ్చ

క్ర. **సర్వథా, అనుపత్తేః, చ**

ప్ర.అ. సర్వథా = **అన్ని విధముల,** అనుపపత్తేః = **అసంగతముగాకుండుట వలన,** చ = **కూడ**

వి. **ఏ విధముగా చూచినా బౌద్ధమతము అసంగతముగానే వుండును. మొదలు క్షణికవాదము, విజ్ఞానవాదము యుక్తితో నిరాకరించి, ఇపుడు కూడా అదే యుక్తి ద్వారా సర్వశూన్యవాదియైన మాధ్యమికుల మార్గాన్ని కూడా నిరాకరించటమైనది. బ్రహ్మము జగత్కారణమని స్వీకరించని బౌద్ధుల మతము సరికాదు.**

# 6. నైకస్మిన్నసంభవాధికరణము (58)

## (204) II.2.33

సూ. నైకస్మిన్నసంభవాత్

క్ర. **న, ఏకస్మిన్, అసంభవాత్**

ప్ర.అ. న = **కాదు,** ఏకస్మిన్ = **ఒక పదార్థములో,** అసంభవాత్ = **సంభవము కాదు కనుక**

వి. జైనమతములో సప్తపదార్థములు కలవు. అవి జీవ, అజీవ, అస్రవ, సంవర, నిర్జర, బంధ, మోక్ష అనునవి. మరియు ఐదు అస్తికాయములు కలవు. అవి జీవాస్తి కాయ, పుద్గలాస్తికాయ,

ధర్మాస్తి కాయ, అధర్మాస్తికాయ, అకాస్తికాయ అనువి. అదేకాక సప్తభంగిన్యాయములు వారు మన్నిస్తారు అవి 1) స్యాదస్తి (పదార్థము యొక్క సత్తా వుండటము), 2) స్యాన్నాస్తి (పదార్థము లేకపోవటము), 3) స్యాదస్తి చ నాస్తి చ (పదార్థము యొక్క సత్తా వుండటము లేక లేకపోవటము), 4) స్యాదవక్తవ్యః (వస్తువు యొక్క సత్తావుండటము కాని చెప్పగలగకపోవటము), 5) స్యాదస్తిచావక్తవ్యశ్చ (ఉన్నదనటానికి వీలు లేకపోవటము), 6) స్యాన్నాస్తిచవక్తవ్య చ (లేదనటానికి వీలులేకపోవటము), 7) స్యాదస్తిచానాస్తిచావక్తవ్య చ (ఉన్నది, లేదు అనటానికి వీలులేకపోవటము) ఈ విధముగా అన్ని పదార్థములందు వాటి ద్వారా వికల్పములు ఉండటము సిద్ధము అవుతుంది. అయితే సత్‌పదార్థములో ప్రకారభేదములు ఉండవచ్చును. కాని విరోధ ధర్మము వుండుట సంభవము కాదు. ఏ వస్తువు వుంటుందో దాని అభావము వుండదు మరి ఏ వస్తువు వుండదో దాని అభావము కూడ వుండదు. (అంటే అది వుండటము వుండదు) అవిధముగా నిత్యపదార్థము నిత్యముగానే వుంటుంది. దానికి అనిత్యము వుండదు. అలాగే అనిత్యపదార్థము అనిత్యముగానే వుంటుంది మరియు దానికి నిత్యత వుండదు. **ప్రతి వస్తువుకు విరుద్ధధర్మము వుండటము యుక్తిసంగతము కాదు. అవిధముగా జైనమతము నిరాకరణీయము.**

## (205) II.2.34

**సూ. ఏవంచాత్మాఽకార్త్స్న్యమ్**

**క్ర. ఏవం, చ, ఆత్మాఽకార్త్స్న్యమ్**

ప్ర.అ. ఏవం = **ఈ ప్రకారము,** చ = **కూడ,** ఆత్మాఽకార్త్స్న్యమ్ = **ఆత్మను అపూర్ణమైన దేశీయ శరీరముతో సమానము పరిమాణముగా తలచుట కూడ యుక్తము కాదు మరియు అది మిథ్య**

వి. **పదార్థములలో విరుద్ధ ధర్మము యొక్క మాన్యతవలె ఆత్మను శరీరముతో సమాన పరిమాణమని తలచినచో అది యుక్తము కాదు.** ఎందుకనగా ఒక మనుష్య శరీరధారి ఆత్మకర్మానువశము దోమశరీరము వచ్చినపుడు ఎట్లు ప్రవేశించగలదు? ఒక శరీరము యొక్క అంగము కోసి వేయబడినపుడు ఆత్మపరిమాణము ఏమికాగలదు? కావున **ఆత్మపరిమాణము శరీరపరిమాణ సమము అనటము దోషపూర్ణము. ఈ విధముగా జైనమతము నిరాకరించదగినది.**

## (206) II.2.35

**సూ. న చ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః**

**క్ర. న, చ, పర్యాయాత్, అపి, అవిరోధః, వికారాదిభ్యః**

ప్ర.అ. న = **కాదు,** చ = **మరియు,** పర్యాయాత్ = **హెచ్చుతగ్గులు ఒప్పుకొన,** అపి = **కూడ,** అవిరోధో = **విరోధనివారణము,** వికారాదిభ్యః = **వికారాది దోషముల వలన**

వి. **ఒకవేళ ఆత్మ శరీర పరిమాణము ప్రకారము హెచ్చుతగ్గులు యగును అని ఒప్పుకొనిననుగూడ, అది నిర్దోషము అని సిద్ధింపబడదు.** ఎందుకనగా శరీరము వికార అవయవయుక్త మైనపుడు

ఆత్మకూడ అసంపూర్ణము అగును. శరీరము అనిత్యము ఐనపుడు ఆ దోషము కూడ ఆత్మకు వచ్చును. **హెచ్చుతగ్గులు కూడా వికారములే అవికారమైన ఆత్మకు వికారములెట్లు? దీని వలన ఆత్మకు అనేక దోషములు వచ్చును. కావున ఈ జైనసిద్ధాంతము నిరర్థకము.**

## (207) II.2.36

సూ. **అన్త్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషః**

క్ర. **అన్త్యావస్థితేః, చ, ఉభయనిత్యత్వాత్, అవిశేషః**

ప్ర.అ. అన్త్యావస్తితేః = **మరణావస్థయందు,** చ = **కూడ,** ఉభయనిత్యత్వాత్ = **ఆది మరియు మధ్య అవస్థల నిత్యత్వము వలన,** అవిశేషః = **ఏ విశేషము వుండదు.**

వి. మోక్షావస్థను అందిన జీవపరిమాణం నిత్యమైనందువల్ల, ఆది, మధ్య పరిమాణాలు కూడా నిత్యమే అవుతాయి. వాటిల్లో భేధం వుండదు. అందువల్ల ఆది, మధ్య, అంత పరిణామాల్లోను సామ్యం వుంటుంది. **కాబట్టి బౌద్ధంలాగా జైనము కూడా అసంగతమే.**

## 7. పత్యధికరణము (59)

## (208) II.2.37

సూ. **పత్యురసామంజస్యాత్**

క్ర. **పత్యుః, అసామంజస్యాత్**

ప్ర.అ. పత్యుః = **పశుపతి మతము కూడ,** అసామంజస్యాత్ = **పరస్పర విరోధమాన్యతల వలన**

వి. **పశుపతియైన మాహేశ్వరమతము కూడ, పరస్పర విరోధమైన మాన్యతల వలన యుక్తిసంగతము కాదు.** పాశుపతమతమందలి తత్త్వకల్పనగాని, యుక్తి సాధనగాని వేదవిరుద్ధముగానున్నది. వారు కంఠీ, రుచికా, కుండల, జటా, భస్మ, యజ్ఞోపవీతములనెడు ఆరు ముద్రలచే శరీరమును చిహ్నితము చేయవలయునని, అట్లు చేసిన పునర్జన్మముండదని చెప్పుదురు. జగత్తుకు మహేశ్వరుడు కేవలము నిమిత్తకారణముగా, ప్రకృతిని ఉపాదాన కారణముగా తలతురు. ఇది అంతయు యుక్తము కాదు. **కావున ఈ మహేశ్వరమతము మాననీయముకాదు.**

## (209) II.2.38

సూ. **సంబన్ధానుపపత్తేశ్చ**

క్ర. **సంబన్ధానుపపత్తేః, చ**

ప్ర.అ. సంబన్ధానుపపత్తేః = **సంబంధమునకు సిద్ధి కలుగకపోవటము వలన,** చ = **కూడ**

వి. **పాశుపతమత ప్రకారము బ్రహ్మను కేవలము నిమిత్తమాత్రునివలె ఒప్పుకొన్నారు. ఉపాదాన కారణముతో ఆ బ్రహ్మకు ఏమి సంబంధమున్నదో తెలుసుకొనుట ఆవశ్యకము. నిమిత్తమాత్రుడైన కుమ్మరికి ఉపాదానకారణమై మట్టితో వున్న సంబంధము వలన కుండలు చేయబడుతాయి. బ్రహ్మ ఉపాదాన కారణము కాక కేవలం నిమిత్త మాత్రుడైతే ఉపాదానకారణమైన ప్రకృతితో**

**సంబంధము వుండాలి. కాని బ్రహ్మ నిరాకారుడు. కావున జడమైన ప్రకృతితో ప్రధానముతో సంబంధం వుండదు. కనుక సృష్టి జరుగలేదు. పాశుపతులు వేదములను స్వీకరిస్తారు. కాని వేదోక్తము ఐన ఈశ్వరునికి మూల్యము ఇవ్వరు. వేదప్రకారము ఈశ్వరుడు సర్వశక్తిసంపన్నుడు మరియు ఈశ్వరుడే ఉపాదాన కారణము మరియు నిమిత్తకారణము. పాశుపతులకు మాన్యమైన వేదము, తర్కము రెండూ సమన్వయము కాలేదు. కనుక పాశుపతము అసమ్మతము.**

## (210) II.2.39

సూ. **అధిష్ఠానానుపపత్తేశ్చ**

క్ర. **అధిష్ఠానానుపపత్తేః, చ**

ప్ర.అ. అధిష్ఠానానుపపత్తేః = **అధిష్ఠానమునకు (ఆధిపత్యమునకు) ఉపపత్తి లేనందున,** చ = **కూడ**

వి. కుమ్మరికి మట్టి, చక్రము, కర్రలపై అధిష్ఠానము వున్నందున కుండలు, పాత్రలు అవుతున్నాయి. కాని **పాశుపతమతము ప్రకారము బ్రహ్మ, ఈశ్వరుడు కేవలము నిమిత్తమాత్రుడే కాని అధిపతి కాదు. అధిపతియైన పశుపతి సృష్టి చేయడు. ఈశ్వరుడు (బ్రహ్మ) నిమిత్తకారణము, కాని ప్రధానమునకు (ప్రకృతికి) అధిపతి మహేశ్వరుడు (పశుపతి) అనటం పరస్పర విరుద్ధము. పాశుపత మతం ఈ విధముగా నిలువలేదు.**

## (211) II.2.40

సూ. **కరణవచ్చేన్న భోగాదిభ్యః**

క్ర. **కరణవత్, చేత్, న, భోగాదిభ్యః**

ప్ర.అ. కరణవత్ = **ఈశ్వరునకు శరీరము, ఇంద్రియములు వున్నవని,** చేత్ = **అనిన,** న = **కాదు,** భోగాదిభ్యః = **దానివలన భోగములకు సంబంధము వచ్చును కనుక**

వి. **ఒకవేళ బ్రహ్మ తన సంకల్పము, మనము, బుద్ధి, ఇంద్రియములు మొదలైన కరణములతో కూడి జగత్తుకు నిమిత్తకారణం అవుతున్నాడని అనటము భ్రమ అవుతుంది.** ఎందుకంటే బ్రహ్మ శరీరధారి కావటము వలన సామాన్య జీవులవలె శుభాశుభముల, సుఖదుఃఖముల భోగమునందవలసి వస్తుంది. అపుడు ఆయనకు ఈశ్వరత్వము సిద్ధించదు. **కావున ఈశ్వరుడు కేవలము నిమిత్త కారణము అనే పాశుపతము సమ్మతము కాదు.**

## (212) II.2.41

సూ. **అంతవత్త్వమసర్వజ్ఞతా వా**

క్ర. **అంతవత్త్వమ్, అసర్వజ్ఞతా, వా**

ప్ర.అ. అంతవత్త్వమ్ = **అంతముకలవాడు,** అసర్వజ్ఞతా = **సర్వజ్ఞతలేనివాడు,** వా = **ఒకవేళ**

వి. **ఒకవేళ ఈశ్వరునకు అంతము వుండునని ఒప్పుకొనిన సర్వజ్ఞతలేని దోషము వస్తుంది. ఈశ్వరుడు శరీరధారి అయితే అంతవంతుడు అవుతాడు.** శరీరము యొక్క గ్రహణము, వినాశము

సంభవిస్తాయి. అంతము అంటే వినాశనమేకాదా. అంతవంతుడు అల్పజ్ఞుడు అవుతాడు కాని సర్వజ్ఞుడు కాలేడు. **పరబ్రహ్మ అనంతుడు, సర్వజ్ఞుడు, అవిచ్ఛిన్నుడు కనుక జగత్తుకు నిమిత్త కారణము, ఉపాదాన కారణము అవటము సత్యము. ఈ విధంగా కూడా పాశుపతమతము సరికాదు.**

## 8. ఉత్పత్త్యసంభవాధికరణము (60)

### (213) II.2.42

**సూ.** **ఉత్పత్త్యసంభవాత్**

**క్ర.** **ఉత్పత్తి అసంభవాత్**

**ప్ర.అ.** ఉత్పత్తి = **జీవుల ఉత్పత్తి,** అసంభవాత్= **సంభావము కాదు కనుక.**

**వి.** **పాంచరాత్రాగమ మతములో నిర్వికారుడు, నిరంజనుడు, జ్ఞానస్వరూపుడు, భగవంతుడు అయిన వాసుదేవుడొక్కడే పరమార్థతత్త్వము. జగత్తుకు ఉపాదాన, నిమిత్తకారణుడు కూడా వాసుదేవుడే.** ఆ పరమార్థతత్త్వమైన వాసుదేవుని నుండి సంకర్షణుడు (జీవుడు), ప్రద్యుమ్నుడు (మనస్సు), అనిరుద్ధుడు (అహంకారము) పుట్టుతున్నారు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు నాలుగు స్వరూపములు. ఇదే చతుర్వ్యూహము. అయితే ఆ నలుగురు స్వరూపాలు అయితే పరారూపము వాసుదేవుడొక్కడే. పరారూపమే పరాప్రకృతి స్వరూపము. ఈ **మతము ప్రకారము చెప్పిన వాసుదేవుడనే పరబ్రహ్మ జగత్తుకు అభిన్న నిమిత్త, ఉపాదాన కారణమనే దానిని నిరాకరించకుండా, శ్రుతి, స్మృతులకు సమ్మతమైన ఈశ్వరభక్తిని (వాసుదేవారాధనను) నిరాకరించకుండా, వాసుదేవునినుండి చతుర్వ్యూహము వస్తుందనే విషయమును గూర్చియే చెప్పుతున్నారు. ఈ సూత్రము ప్రకారము వాసుదేవుని నుండి జీవుని ఉత్పత్తి అసంభవమైనందున భాగవతమతము అసంగతమైనది. వాసుదేవ వ్యూహములో ఈ క్రింది దోషాలు ఉత్పన్నమౌతున్నాయి. 1) జీవుడు నిత్యుడు కావున ఉత్పత్తి వుండదు. 2) దీని వలన జీవునికి అనిత్యత్వ దోషం వస్తుంది. ఉత్పత్తితో బాటు అంతము వుంటుంది కనుక. 3) జీవుడు అనిత్యుడైతే భగవత్ప్రాప్తియైన మోక్షము ఎవరికి? ఈ దోషముల వలన పాంచరాత్రము అసమ్మతము.**

### (214) II.2.43

**సూ.** న చ కర్తుః కరణమ్

**క్ర.** న, చ, కర్తుః, కరణమ్

**ప్ర.అ.** న = **కాదు,** చ = **కూడ,** కర్తుః = **కర్తయైన జీవాత్మనుండి,** కరణమ్ = **మనస్సు, మనస్సు నుండి అహంకారము**

**వి.** **ఏ విధముగా వాసుదేవును నుండి జీవుని ఉత్పత్తి కాలేదో, అదే విధముగా జీవుని (సంకర్షణుని) నుండి మనస్సు ప్రద్యుమ్నుడు మరియు మనస్సు (ప్రద్యుమ్నుని) నుండి అహంకారము (అనిరుద్ధుని)**

**ఉత్పత్తి జరుగలేదు. ఎందుకంటే జీవుడు కర్త మరియు చేతనము మరియు మనస్సు కరణము. కర్త నుండి కరణము ఉత్పత్తి అవటము అసంభవము. ఈ రీతిగా కూడా పాంచరాత్రము అసంభవము, అసమ్మతము.**

## (215) II.2.44

**సూ. విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః**

**క్ర. విజ్ఞానాదిభావే, వా, తదప్రతిషేధః**

ప్ర.అ. విజ్ఞానాదిభావే = **భగవంతునికి విజ్ఞానాది షడ్గుణములుండును అని,** వా = **ఒకవేళ,** తదప్రతిషేధః = **వారి ఉత్పత్తికి నిషేధములేదు**

వి. జ్ఞానము, ఐశ్వర్యము, శక్తి, బలము, వీర్యము, తేజము అను షడ్విధ గుణములు చతుర్వ్యూహమైన వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధుల యందు వున్నవనుట వేదవిరుద్ధము కాదు. కాని వారు నలుగురు సమాన ధర్మంకల ఈశ్వరులే అనటములో దోషం వస్తుంది. **ఒక ఈశ్వరునితోనే ఈ జగద్రచన జరుగునప్పుడు నలుగురు అనవసరము.** అదేకాక వాసుదేవుడు ఒక్కడే పరతత్త్వము అనే వారి మాటలకు భంగం వస్తుంది. అలా కాకుండా సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు వాసుదేవుని నుండియే పుట్టినారు (ఒకరి నుండి ఒకరు కాకుండా) అని అంటే వారు చెప్పిన వరస తెగిపోతుంది. **ఏ విధముగా చూచినా ఈ పాంచరాత్రములో దోషం వున్నది.**

## (216) II.2.45

**సూ. విప్రతిషేధాచ్చ**

**క్ర. విప్రతిషేధాత్, చ**

ప్ర.అ. విప్రతిషేధాత్ = **ఈ శాస్త్రమందు జీవుని యొక్క ఉత్పత్తి నిషేదించబడినది,** చ = **అందువలన కూడ**

వి. పాంచరాత్రమందు జీవుడు అనాది, నిత్యుడు, చేతనుడు, అవినాశి అని మన్నింపబడినది మరియు జీవునికి జననమరణములు నిషేదించబడినవి. అందువలన కూడ ఈ పాంచరాత్రము వేదవిరుద్ధము కాదు. "శాండిల్యముని వేదవేదాంగములయందు నిష్ఠపాటించక భక్తిశాస్త్రమును అధ్యయనము చేసినాడు." అని అంటే అది వేదనింద కాదు. భక్తి ప్రశంస. నారదుడు సనత్కుమారునితో "భగవన్! నేను వేదవిదుడను, ఆత్మవిదుడను కాను" అని అంటే వేదనింద కాదు. అది బ్రహ్మాత్మ ప్రశంస. కావున పాంచరాత్రము భక్తి శాస్త్ర మహిమాన్వితమై వేదానుకూలమైన భక్తి ప్రశంసయే కాని, వేదవిరుద్ధము కాదు. **పరబ్రహ్మ (వాసుదేవుడు) ఒకడే పరారూపుడు అనుట సమ్మతమే కాని చతుర్వ్యూహములోని నలుగురు ఈశ్వరులు అనే పాంచరాత్రాగమముతము అసమ్మతము.**

**ఇట్లు**

**ద్వితీయాధ్యాయ ద్వితీయపాదము**

# ద్వితీయాధ్యాయ ద్వితీయ పాద సమాసము

## శ్రుత్యసమ్మత మార్గ నిరాకరణ

**1. రచనానుపపత్త్యధికరణము**

అచేతనమైన ప్రధానము జగత్కారణము కాజాలదు. పరస్పర విచార విరుద్ధములుగల సాంఖ్యమతము అసంపూర్ణము మరియు అసమంజసము.

**2. మహద్దీర్ఘాధికరణము**

పరమాణువులు జగత్కారణము కావు. నిత్యతలేని పరమాణువువాదమైన, యుక్తి సమ్మతము కాని, ప్రమాణసమ్మతము కాని, శిష్ఠ సమ్మతము కాని వైశేషికమతము అసమంజసము మరియు అసమ్మతము.

**3. పరమాణుజగదకారణత్వాధికరణము**

జడములు మరియు వాటంతట అవి కలియలేని, విడిపోలేని పరమాణువులు జగత్కారణము కావు. జగద్రచనను సమవాయసంబంధము వివరించలేదు. పరమాణువాదము నిరాకరణీయము.

**4. సముదాయాధికరణము**

సముదాయములు అచేతనములు, జడములు. కాని అవి జగత్కారణము కాదు. 'సర్వమూ క్షణికము' అనే మరియు నిరీశ్వరవాదమైన బౌద్ధమతము అయుక్తము, అసమ్మతము.

**5. అభావాధికరణము**

విజ్ఞానము తప్ప వేరు పదార్థములులేవు అనే యోగాచారబౌద్ధము సరికాదు. బాహ్యపదార్థముల సత్యమును స్వీకరించని విజ్ఞానవాద బౌద్ధము, శూన్యవాదమైన మాధ్యమికబౌద్ధము రెండూ నిరాకరణీయములు మరియు అసమ్మతములు.

**6. నైకస్మిన్నసంభవాధికరణము**

పరస్పర విరుద్ధవిచారములు కల సప్తభంగిన్యాయముపై ఆధారపడిన ఆత్మ,శరీరపరిమాణము కలదనినదైన జైనమతము నిరాకరణీయము.

**7. పత్యధికరణము**

వేదమును స్వీకరించి, వేదోక్తమైన ఈశ్వరుడు జగత్తుకు కేవలము నిమిత్తమాత్రమనే, ఆరు ముద్రలచే శరీరము చిహ్నితము చేస్తే ముక్తి కలుగుతుందనే, ఈశ్వరునికి ఆధిపత్యములేని పాశుపతము అసమంజసము.

సాంఖ్య, పాతంజల, తార్కికమతములు సర్వజ్ఞత, అవిచ్ఛిన్నత కలిగిన, జగత్తుకు నిమిత్త, ఉపాదానకారణమైన చైతన్యమును (పరబ్రహ్మమును) స్వీకరించని కారణమున నిరాకరణీయములు.

**8. ఉత్పత్త్యసంభవాధికరణము**

వాసుదేవుడనే పరబ్రహ్మ జగత్తుకు అభిన్న-నిమిత్త-ఉపాదాన కారణమనే, శ్రుతి-స్మృతులకు సమ్మతమైన ఈశ్వరభక్తిని (వాసుదేవారాధనను) బోధించే శాండిల్యుని పాంచరాత్రమతము (భాగవత మతము) సమ్మతము, యుక్తము. కాని, ఒక వాసుదేవుడే కాక సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే నలుగురు సమాన ఈశ్వరతత్త్వములు చెప్పే పాంచరాత్రము అసమ్మతము. పరబ్రహ్మము అద్వితీయము.

ఇట్లు

**ద్వితీయాధ్యాయ ద్వితీయపాద సమాసము**



# ద్వితీయాధ్యాయ ద్వితీయ పాద సారము

## శ్రుత్యసమ్మత మార్గ నిరాకరణ

సాంఖ్యము యొక్క ప్రధానము, వైశేషికన్యాయముల యొక్క పరమాణువులు, నిరీశ్వర బౌద్ధము యొక్క సముదాయములు, యోగాచార బౌద్ధము యొక్క విజ్ఞానము, మాధ్యమిక బౌద్ధము యొక్క శూన్యము, జైనము యొక్క సప్తభంగిన్యాయతత్త్వము, పాశుపతమతము యొక్క నిమిత్తకారణమైన కేవలము మహేశ్వరుడు మరియు ఉపాదాన కారణమైన కేవలము ప్రకృతి, పాంచరాత్ర భాగవతుల చతుర్వ్యూహము అన్నియు జగత్కారణాములు కాక ఏవి జగత్తుకు తానే నిమిత్త కారణము మరియు ఉపాదాన కారణమో అదియే బ్రహ్మము.

ఇట్లు
ద్వితీయాధ్యాయ ద్వితీయ పాద సారము.



# II.3
# ద్వితీయాధ్యాయము - తృతీయ పాదము
## స్వావిరోధ నిరూపణ

## 1. వియదధికరణము (61) (ఆకాశ విద్య)

### (217) II.3.1

**సూ. న వియదశ్రుతేః**

**క్ర. న, వియత్, అశ్రుతేః**

**ప్ర.అ.** న = **కాదు,** వియద్ = **ఆకాశము,** అశ్రుతేః= **శ్రుతిలో, ఉపనిషత్తులో**

**వి. ఛాందోగ్యోపనిషత్తులో (VI-2-3,4, VI-3-2,4) జగద్రచన వర్ణన చేసినపుడు మొట్టమొదట తేజము ఉత్పత్తి ఐనదని తరువాత తేజము, జలము, అన్నముల సమ్మేళనముచే జగత్తు అయినదని చెప్పబడినది. ఆకాశము యొక్క ఉత్పత్తి గూర్చి చెప్పలేదు. కావున ఆకాశమునకు ఉత్పత్తి లేదు అని పూర్వపక్షము వారు వాదిస్తున్నారు.** ఆకాశము నిత్యము. దానికి ఉత్పత్తి లేదు. ఆకాశము విభువు (భ.గీ. 13-32) "జాగాచేయి" (Create the space) అని అంటాము. "జాగా" మొదలే వుంది, వస్తువులు జరుగాలి. "తనస్థలములో తాను వుండాలి" "నాకు స్థలం ఇవ్వు" (Create own space) అన్నట్లు మాటలలో చెప్పటమే, అర్థం కావటానికి! అవకాశమే ఆకాశము.

(ఛాం.ఉ. VI-2-3,4, VI-3-2,4; భ.గీ. 13-32)

### (218) II.3.2

**సూ. అస్తి తు**

**క్ర. అస్తి, తు**

**ప్ర.అ.** అస్తి = **వున్నది,** తు = **అయితే**

**వి. అయితే ఆకాశానికి ఉత్పత్తి ఇంకొక ఉపనిషత్తులో వున్నది.**

"తస్మాద్వా ఏతస్మాదాత్మనః ఆకాశస్సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయోరగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీః" (తై.ఉ. II-1-2)

"బ్రహ్మము నుండి ఆకాశము పుట్టినది, ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథివి పుట్టినవి" **దీనివలన ఆకాశము యొక్క ఉత్పత్తి స్పష్టమైనది. వేదములలో ఆకాశము యొక్క ఉత్పత్తి లేదనుట యుక్తము కాదు.**
(తై.ఉ. II-1-2)

## (219) II.3.3

**సూ. గౌణ్యసంభవాత్**

**క్ర. గౌణీ, అసంభవాత్**

ప్ర.అ. గౌణీ = **ముఖ్యము కాదు (గుణము ప్రకారము),** అసంభవాత్ = **అసంభవమైనందున**

వి. **నిరవయవము మరియు వ్యాపకము కావున ఆకాశము యొక్క ఉత్పత్తి అయ్యే అవకాశము లేదు.** ఎందుకంటే ఉత్పన్నము అయ్యే వస్తువుకు అవయవాలు వుండాలి. ప్రళయకాలములో మూల ఉత్పాదన తత్వములతో (తేజము, వాయు, నీరు, పృథివి) కరిగిపోయబడి కలిసియుండెనో, సృష్టికాలములో అవి జగత్తు రూపములో పరిణితమవుట వలన ప్రకటమౌతాయి. అపుడు ఆకాశము అనిపిస్తుంది, కనిపిస్తుంది. ఇదే అవస్థను తైత్తరీయ ఉపనిషత్తులో, ముండక ఉపనిషత్తులో ఆకాశము యొక్క ఉత్పత్తిగా చెప్పబడినది.

"ఏతాస్మా జ్జాయతే ప్రాణో, మనః సర్వేంద్రియాణి చ
ఖం వాయు ర్జ్యోతి రాపః, ఫృథివీ విశ్వస్య ధారిణీ" (ముం.ఉ.II-1-3)

"మాయోపాధితోకూడిన ఈ పురుషుని నుండి ప్రాణములు, మనస్సు, అన్ని ఇంద్రియములు, ఆకాశము, వాయు, అగ్ని, జలము, ప్రథివి ఇవన్నియు జనించుచున్నవి" అని అనటములో **వాయువు, అగ్ని, జలము, పృథివి బయటకు రాగానే ఆకాశం ప్రకటము అవుతుంది. అప్రకటనము కావటాన్ని తైత్తరీయములో, ముండకములో ఉత్పత్తి అన్నారు. ఇదియే గౌణము.**

(ముం.ఉ. II-1-3; తై.ఉ. II-1-2)

## (220) II.3.4

**సూ. శబ్దాచ్చ**

**క్ర. శబ్దాత్, చ**

ప్ర.అ. శబ్దాత్ = **శబ్ద ప్రమాణము చేత,** చ = **కూడ**

వి. శ్రుతి కూడ అట్లు చెప్పటము వలన ఆకాశమునకు ఉత్పత్తిలేదు. బృహదారణ్యక ఉపనిషత్తులో "వాయుశ్చాంతరిక్షం చైత దమృతం" (బృ.ఉ. II-3-3)

"వాయువు, ఆకాశము రెండు అమృతములు" చావులేనివి. కావున పుట్టుక కూడ లేనివనే అర్థము.

బ్రహ్మమును ఆకాశములాగా వ్యాపకము, నిత్యము అని ఉపనిషత్తులు చెప్పినాయి. కావున ఎక్కడెక్కడ ఆకాశానికి ఉత్పత్తి చెప్పబడినదో అది గౌణము అని గ్రహించాలి. "ఆకాశః శరీరం బ్రహ్మ" (తై.ఉ. 1-6-2) **"బ్రహ్మము ఆకాశము శరీరముగా కలది"** అనీ, "ఆకాశ ఆత్మా" (తై.ఉ. 1-7) **ఆకాశమే ఆత్మ అనీ బ్రహ్మనికి, ఆత్మకు విశేషణంగా ఆకాశాన్ని చెప్పటమే ఆకాశానికి ఉత్పత్తి వుండదని ప్రమాణమౌతుంది.**

(బృ.ఉ.II-3-3; తై.ఉ. 1-6-2; తై.ఉ. 1-7-1)

## (221) II.3.5

**సూ.** **స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్**

**క్ర.** **స్యాత్, చ, ఏకస్య, బ్రహ్మశబ్దవత్**

**ప్ర.అ.** స్యాత్ = **అట్లు అగును,** చ = **కూడ,** ఏకస్య = **ఒకదాని యొక్క** బ్రహ్మశబ్దవత్ = **బ్రహ్మ శబ్దమువలె**

**వి.** "తపము ద్వారా బ్రహ్మము తెలిసికొనము. తపస్సే బ్రహ్మము" (తై.ఉ. 3-2) అని వరుణుడు భృగువుకు చెప్పినపుడు "తపము ద్వారా బ్రహ్మము తెలిసికొనము" అన్నది ముఖ్యార్థము. "తపస్సే బ్రహ్మము" అన్నది గౌణార్థము.

కావున ఎక్కడనో ఆచార్యులు, ఋషులు, విద్వాంసులు ఆకాశోత్పత్తిని గౌణార్థముగా చెప్పియుండినను ఆకాశమునకు ఉత్పత్తిలేదు. కాగితము మీద బొమ్మలు గీసినపుడు బొమ్మలు ఉత్పత్తి అవుతాయి. కాగితం ప్రకటం అవుతుంది. వస్తువుల ఉత్పత్తితో ఆకాశం ప్రకటం అవుతుంది. (తై.ఉ. 3-2)

---

## (222) II.3.6

**సూ.** **ప్రతిజ్ఞా౽హానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః**

**క్ర.** **ప్రతిజ్ఞా౽హానిః, అవ్యతిరేకాత్, శబ్దేభ్యః**

**ప్ర.అ.** ప్రతిజ్ఞా౽హానిః = **ప్రతిజ్ఞాహాని వుండదు,** అవ్యతిరేకాత్ = **వ్యతిరేకము లేనందున,** శబ్దేభ్యః = **శ్రుతులయందు వున్నది.**

**వి.** **ఛాందోగ్య ఉపనిషత్తులో (3.1.1-6) ఒక దానిని తెలిస్తే అన్నీ తెలుస్తాయనే ప్రతిజ్ఞ చేయబడిందో, ఆ ప్రసంగములో కార్యకారణముల యొక్క అవిరోధ సిద్ధి ఆకాశమును బ్రహ్మ యొక్క కార్యము నుండి వేరుకాదని స్వీకరిస్తేనే, అవగలుగుతుంది లేకుంటే కాదు.** ఎందుకంటే అక్కడ మట్టి, బంగారము ఉదాహరణలు ఇచ్చి వాని యొక్క ఏ ఒక్క కార్యమును తెలిసినా, కారణ జ్ఞానము తెలిసినా అన్నిటి జ్ఞానము తెలుస్తుందని చెప్పబడినది. ఒకవేళ ఆకాశమును బ్రహ్మము నుండి వేరంటే పైన చెప్పిన ప్రతిజ్ఞాభంగము వస్తుంది. అదేకాక "ఇదంతా నిస్సందేహముగా బ్రహ్మమే, ఎందుకనగా ఉత్పత్తి, స్థితి మరియు ప్రలయము దాని వలననే అవుతాయి" (ఛాం.ఉ. 3-14-1) "బ్రహ్మైవ ఇదమమృతమ్" "ఇది అంతయు అమృతమైన బ్రహ్మమే" (ముం.ఉ. 2-12) అనే శ్రుతి వాక్యముల వలన ఆకాశము బ్రహ్మకార్యమే.

(ఛాం.ఉ. 3-14-1); (ము.ఉ. 2-12)

---

## (223) II.3.7

**సూ. యావద్వికారం తు విభాగో లోకవత్**

**క్ర. యావద్వికారం, తు, విభాగః, లోకవత్**

ప్ర.అ. యావిద్వికారం = **వికారములున్నంత వరకు,** తు = **కాని,** విభాగః = **బ్రహ్మరచనయే,** లోకవత్ = **సాధారణ లోకవ్యవహారము వలె**

వి. **మట్టి నుండి పుట్టిన మట్టి పదార్థములకు బేధం వున్నా, మట్టిలో బేధం లేదు. అలాగే ఆకాశం, ప్రథివీ, దిక్కులు, కాలములలో విభాగం వున్నది కాని మూలమైన బ్రహ్మమందు విభాగము లేదు.** సంపూర్ణ వికారాత్మకజగత్తు, బ్రహ్మకార్యమని చెప్పినపుడు ఆకాశము వేరుకాదు. తేజము, నీరు, పృథివిల ఉత్పత్తులవలె చెప్పబడినవి, చెప్పకపోయినా ఆకాశము, వాయువుల ఉత్పత్తి బ్రహ్మ నుండి అయినవని స్వీకరించాలి. **బ్రహ్మము ఆకాశముగా ప్రకటం అవుతుంది.**

## 2. మాతరిశ్వాధికరణము (62)

## (224) II.3.8

**సూ. ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః**

**క్ర. ఏతేన, మాతరిశ్వా, వ్యాఖ్యాతః**

ప్ర.అ. ఏతేన = **ఈ రీతిగనే,** మాతరిశ్వా = **వాయువు ఉత్పత్తి గురించి కూడా,** వ్యాఖ్యాతః = **చెప్పబడినది.**

వి. తైత్తరీయోపనిషత్తులో “ఆకాశాద్వాయుః” (తై.ఉ.II-1-2) “ఆకాశము నుండి వాయువు” అని చెప్పబడినది. ఛాందోగ్యో పనిషత్తులో ఆకాశము, వాయువులను వదిలి తేజస్సు, జలము, పృథివిలకు ఉత్పత్తి చెప్పబడినది (ఛాం.ఉ.VI-2-3,4,VI-3-2, 4)

**ఏ విధముగా ఆకాశము యొక్క ఉత్పత్తి చెప్పకపోయినా అది ప్రకటము అయినట్లు వాయువుకు ఉత్పత్తి (ఛాందోగ్యములో) చెప్పకపోయినా అది ప్రకటనము అయినది. “ఆకాశము, వాయువు రెండు అమృతములు”** (బృ.ఉ. II-3-3)

(తై.ఉ. II-1-2) (ఛాం.ఉ. VI-2-3,4; VI-3-2,4) (బృ.ఉ. II-3-3)

## 3. అసంభవాధికరణము (63)

## (225) II.3.9

**సూ. అసంభవస్తు సతోఽనుపపత్తేః**

**క్ర. అసంభవః, తు, సతః, అనుపపత్తేః**

ప్ర.అ. అసంభవః = **సంభవము కాదు,** తు = **అయితే,** సతః = **సత్తుయైన బ్రహ్మముకుకాక,** అనుపపత్తేః =**యుక్తి ద్వారా, ప్రయాణముల ద్వారా**

వి. **సత్‌శబ్దవాచ్యమైన బ్రహ్మముకాక వేరే ఏతత్త్వమూ లేదు. ఏదైతే ఉత్పత్తి శీలము కాదో, అంటే బ్రహ్మము, దానిని విడచి మిగతా అన్ని ఉత్పత్తి శీలములు. ఒక పరబ్రహ్మముకే ఉత్పత్తి నాశనములు**

**లేవు.** ఉత్పత్తిలేని ఆకాశానికి, వాయువుకు ఉత్పత్తిని చెప్పినట్లు బ్రహ్మకు కూడా ఉత్పత్తికాదా? అని అంటే, 'లేదు' అని పై విధముగా చెప్పినారు. వేదములో (ఋ.వే. X-129-2) లో, ఉపనిషత్తులలో (ఛాం.ఉ. VIII-7-1; శ్వే.ఉ. 6-9) బ్రహ్మముకు ఉత్పత్తి కాని, ఉత్పత్తికర్త కాని లేనిదని చెప్పబడిన ప్రమాణములు వున్నవి. **బ్రహ్మము జగద్కారణమని ఎన్నో విధాల శ్రుతులలో, ఈ బ్రహ్మసూత్రములలో చెప్పబడినది కదా? బ్రహ్మము ఆనాది అనంత సత్తు.** (ఋ.వే. X-129-2; ఛాం.ఉ. VIII-7-1, శ్వే.ఉ. 6-9)

## 4. తేజోధికరణము (64)

### (226) II.3.10

**సూ. తేజో ఽ తస్తథాహ్యాహ**

**క్ర. తేజః, అతః, తథా, హి, ఆహ.**

**ప్ర.అ.** తేజః = **తేజము,** అతః = **దీని నుండి,** తథా హి = **ఆ విధముగనే,** ఆహ = **చెప్పబడినది.**

**వి. "వాయో రగ్నిః" (తై.ఉ. 2-2) అన్న శ్రుతి వాక్యముతో "తేజము వాయువు నుండి ఉత్పన్నమైనది" అని అనబడినది.**

ఛాందోగ్యములో "తత్తేజోఽసృజత" (ఛాం.ఉ. VI-2-3) (ఆ బ్రహ్మము తేజమును సృజించింది) అని చెప్పబడినది. తేజస్సు వాయువు నుండే పుట్టినది. అయితే వాయువు కూడా బ్రహ్మము నుండి పుట్టినది. **కావున వాయుభావాన్ని చెందిన బ్రహ్మము నుండి తేజము పుట్టింది అని అర్థము. కావున ఈ రెండు శ్రుతులలో విరోధము లేదు.**

(తై.ఉ. 2-2; ఛాం.ఉ. VI-2-3)

## 5. అబధికరణము (65)

### (227) II.3.11

**సూ. ఆపః**

**క్ర. ఆపః**

**ప్ర.అ.** ఆపః = **జలము**

**వి.** తైత్తరీయములో "అగ్నే రాపః" (తై.ఉ.2-2) "అగ్ని నుండి జలము ఉత్పత్తి అయినది" అని వున్నది. ఛాందోగ్యములో "తదాపోఽసృజతః" (ఛాం.ఉ. VI-2-3) (ఆ బ్రహ్మము జలమును సృజించినది) ఈ రెండూ విరోధమనిపించినా **అగ్ని నుండి జలము ఉద్భవించుటయే సమంజసము. "బ్రహ్మ స్వరూపమైన వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము ఉద్భవించినది" అని అర్థము.** ఇక్కడ కూడ విరోధము లేదు.

(తై.ఉ. 2-2; ఛాం.ఉ. VI-2-3)

## 6. పృథివ్యధికారాధికరణము (66)

### (228) II.3.12

**సూ. పృథివ్యధికారరూపశబ్దాంతరేభ్యః**

**క్ర. పృథివీ, అధికారరూప శబ్దాంతరేభ్యః.**

ప్ర.అ. పృథివీ = **పృథివీ యొక్క ఉత్పత్తి,** అధికారరూపశబ్దాంతరేభ్యః = **అధికారముతో,రూపముతో మరియు శబ్దము యొక్క అంతరముతో**

వి. **ముండక ఉపనిషత్తులో జలము ఉత్పత్తి తరువాత పృథివి యొక్క ఉత్పత్తి స్పష్టముగా చెప్పబడినది.** "ఏతాస్మాజ్జాయతే ప్రాణో, మనః సర్వేంద్రియాణి చ, ఖం వాయుర్జ్యో తిరాపః, పృథివీ విశ్వస్య ధారిణి" (ముం.ఉ. II-1-3)

"ఈ పురుషుని నుండి ప్రాణములు, మనస్సు, అన్ని ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అన్నియు జనించుచున్నవి" ఛాందోగ్యోపనిషత్తులో "ఆ జలము చేత అనేక రూపములు ధరించవలెనని తలచి, ఆ జలము నుండి అన్నమును సృజింపజేసెను" (ఛాం.ఉ. VI-2-4). ఇక్కడ **అన్నమును, పృథివి అనే అర్థముతోనే వాడబడెను.** శబ్దాంతరము, వేరొక శ్రుతి, యైన ముండకములో జలము తరువాత పృథివి అనే చెప్పబడినది కదా? భూమి ఏ విధముగా నలుపు, ఎరుపు, తెల్లగా వుంటుందో ధాన్యము గూడా ఆ రంగులలో వుంటుందికదా? ఛాందోగ్యములోని అధికారము, ప్రకరణములో, తత్త్వముల గూర్చి వున్నది కదా? ఐదవతత్వము, జలము తరువాత పృథివియే ఔను. **ఐదవతత్త్వముగా అన్నము అని అంటే పృథివి అనే అర్థమే సమంజసము. కనుక ఉపనిషత్తు శబ్దముల బేధము మాత్రమే కాని తత్త్వముల భేదము కాదు.** (ముం.ఉ. II-1-3), (ఛాం.ఉ. VI-2-4)

## 7. తదభిధ్యానాధికరణము (67)

### (229) II.3.13

**సూ. తదభిధ్యానాదేవ తు తల్లింగాత్సః**

**క్ర. తదభిధ్యానాత్, ఏవ, తు, తల్లింగాత్, సః.**

ప్ర.అ. తదభిధ్యానాత్ = **ఆ బ్రహ్మము యొక్క సంకల్ప పూర్వక చింతన వలన,** ఏవ = **నే,** తు = **ఇది సిద్ధమగుచున్నది,** సః = **ఆ బ్రహ్మమేనని,** తల్లింగాత్ = **ఆ లక్షణముల వలన**

వి. **ఆయాకార్యాలను సృష్టించాలనే పరమేశ్వరుని యొక్క అభిధ్యానము వలన, సంకల్ప పూర్వక చింతనవలన, సృష్టిచేయవలెను అని చూచుట వలన, ఈక్షించుట వలన సృష్టి జరుగుతున్నది.** అంటే పరబ్రహ్మమే ఆకాశము మొదలైన మహాభూతములను అధిష్ఠించి సృషించాలని బాగుగా ధ్యానముచేసి, ఈ భౌతికరూపాలన్నీ వరసగా సృష్టించాడని అర్థము. కాబట్టి పరమేశ్వరుడే కర్త. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివీ స్వతంత్రముగా కర్తలు కావు. "ఎవరు పృథివియందున్నవాడై, పృథివికి అంతరుడైవున్నాడో, ఎవరికి పృథివి శరీరమో, ఎవరిని పృథివి

తెలియదో, ఎవరు పృథివి లోపల వుండి పృథివిని నియమిస్తున్నాడో, అతడే అంతర్యామి" (బృ.ఉ. III-7-3) అని శ్రుతి చెప్పుతున్నది. కావున అన్నిటియందు వుంటూ, అన్నింటినీ ప్రవర్తింప చేసేది పరమేశ్వరుడే అని తెలుసుకోవాలి. **అన్నింటినీ నియమించటం అనేది పరమాత్మ కర్తయని గ్రహించటానికి గుర్తు, లింగము.**

(బృ.ఉ. III-7-3)

## 8. విపర్యయాధికరణము (68)

## (230) II.3.14

**సూ. విపర్యయేణ తు క్రమో ఽ త ఉపపద్యతే చ**

**క్ర. విపర్యయేణ, తు, క్రమః, అతః, ఉపపద్యతే, చ**

ప్ర.అ. విపర్యయేణ = **విపరీత,** తు = **కాని,** క్రమః = **క్రమములో,** అతః = **ఈ విధముగా,** ఉపపద్యతే = **జరగటమే యుక్తి సంగతము, ఉచితము.**

వి. **జగత్తు యొక్క ఉత్పత్తి క్రమము ఉపనిషత్తులలో చెప్పబడినది. దానికి విలోమ క్రమము ప్రలయకాలములో జరుగుతుంది.** పృథివి జలములో, జలము అగ్నిలో, అగ్ని వాయువులో, వాయువు ఆకాశములో విలీనమౌతాయి. (టెలిస్కోపువలె) ఏ విధముగా సృష్టి సమయములో కారణముల నుండి కార్యములు అనులోమ క్రమములో రావటము "సర్గ" (సృష్టి, ఉత్పత్తి) అని అంటారు. కార్యములు కారణములోనికి విలోమక్రమములో పోవటము "ప్రతిసర్గ" (లయము ప్రలయము) అంటారు. నీళ్ల నుండి మంచు అవటము, మంచు నీళ్ల యందు పోవటము ఈ రెండు ప్రక్రియలు స్మృతులయందు కూడా అదే చెప్పబడినవి ఇది సమంజసము.

## 9. అంతరావిజ్ఞానాధికరణము (69) (పరమపురుష విద్య)

## (231) II.3.15

**సూ. అంతరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లింగాదితి చేన్నావిశేషాత్**

**క్ర. అంతరా, విజ్ఞానమనసీ, క్రమేణ, తల్లింగాత్ ఇతి, చేత్, న, అవిశేషాత్**

ప్ర.అ. అంతరా = **అంతరమున మధ్యన,** విజ్ఞానమనసీ = **ఇంద్రియములు మనస్సు,** క్రమేణ = **ఉత్పత్తి క్రమము వలన,** తల్లింగాత్ = **శ్రుతిలో అట్టి ప్రమాణములుండుట వలన,** ఇతి = **అనిన,** చేత్ = **యెడల,** న = **కాదు,** అవిశేషాత్ = **శ్రుతిలో ఏ క్రమ విశేషము గూర్చి వర్ణన లభించదు.**

వి. **ఆత్మకు, భూమి సృష్టికి మధ్య వరుసగా విజ్ఞానము, ఇంద్రియములు, మనస్సు అనే వాటి సృష్టి గురించి చెప్పలేదెందులకు? అవి గూడా వున్నాయనే లింగాలు (గుర్తులు) వున్నాయి కదా? అని అంటే ఇంద్రియాలకు భూతాలకు, భేదం విశేషంగా ఏమీ లేనందువల్ల చెప్పలేదు.**

**"ఏతస్మాజ్జాయతే ప్రాణో, మనఃసర్వేంద్రియాణి చ ఖం వాయుర్జ్యోతి రాపః, పృథివీ విశ్వస్య ధారిణీ"**
(ముం.ఉ. II-1-3)

**"ఈ పురుషుని నుండి ప్రాణములు, మనస్సు, అన్ని ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అన్నియు జనించుచున్నవి"** అని ముండకోపనిషత్తులో వున్నది.

ఈ వర్ణనలో బ్రహ్మము నుండి ప్రాణములు, మనస్సు, ఇంద్రియముల తరువాత ఆకాశాది పంచభూతముల క్రమముగా ఉత్పత్తి చెప్పబడినది. అయితే పంచభూతముల ఉత్పత్తి మరియు లయములక్రమము చెప్పబడినది కాని ఇంద్రియముల ఉత్పత్తి మరియు లయముల క్రమము ఎందుకు చెప్పలేదు అని అంటే, భూతాల ఉత్పత్తి వల్లనే భూత సంబంధమైన ఇంద్రియాల ఉత్పత్తి కూడా తెలుస్తుంది. అందుకే వేరుగా చెప్పలేదు. (పృథివి = గంధము = ఘ్రాణము, జలము = రసము = జిహ్వ, తేజము = రూపము = చక్షు, వాయు = స్పర్శ = త్వక్కు, ఆకాశము = శబ్దము = శ్రోత్రము) **పంచభూతముల గురించి చెప్పితే పంచజ్ఞానేంద్రియముల గూర్చి చెప్పినట్లే.**

(ముం.ఉ. II-1-3)

## 10. చరాచరవ్యపాశ్రయాధికరణము (70)

### (232) II.3.16

సూ. **చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావభావిత్వాత్**

క్ర. **చరాచరవ్యపాశ్రయః, తు, స్యాత్, తద్వ్యపదేశః, భాక్తః, తద్భావభావిత్వాత్**

ప్ర.అ. చరాచరవ్యపాశ్రయః = **చరములు అచరములు అయిన దేహముల నాశ్రయించి,** తు = **అయితే,** స్యాత్ = **కావచ్చును,** తద్వ్యపదేశః = **జన్మమరణాదుల కథనము,** భాక్తః = **గౌణము,** తద్భావభావిత్వాత్ = **అతదాశరీరభాగముచేతనే భావించబడుచున్నాడు.**

వి. జీవాత్మ జన్మమరణరహితుడనియు మరియు నిత్యుడనియు పూర్వసూత్రములలో చెప్పబడినది. దానివలన జీవాత్మ చేతన స్వరూపుడనియు మరియు జ్ఞాత అనియు సిద్ధము ఐనది. 'అశోకుడు జన్మించినాడు', 'విజయునికి ఉపనయనం చేసినారు', 'అప్పయ్య మరణించినాడు' అని అనటము గౌణము కాని ముఖ్యము కాదు. జీవుడు పుట్టటం, పోవటము కనిపిస్తున్నది కదా అంటే అది యధార్థము కాదు. **జన్మమరణాలనే వ్యవహారం స్థావరజంగ మాత్మకమైన శరీరానికే కాని జీవునికి చెందినది కాదు. చావటము, పుట్టటము శరీరానికి ముఖ్యము మరియు జీవునికి గౌణము (అప్రధానము).** శరీరము యొక్క రాకపోకల వలన జీవుని నిత్యమునకు భంగము రాదు. "జీవాపేతం వావ కిలేదం మ్రియ ఏతేన జీవోమ్రియత ఇతి స ఏషోణిమైతదాత్మ్యమిదగ్ం, సర్వం తత్సత్యగ్ం, స ఆత్మా, తత్త్వమసి శ్వేతకేతో" (ఛాం.ఉ. VI-11-3)

ఉద్దాలకుడు అన్నాడు "జీవుడు విడచి వెళ్లినచో ఈ శరీరము మరణించును. కాని జీవుడు చనిపోవువాడు కాదు. ఇది అత్యంత సూక్ష్మము ఇదంతయు పరబ్రహ్మమయము. అదే సత్యము. అదే బ్రహ్మ! అదే ఆత్మ! శ్వేతకేతూ! నీవే అదియై వున్నావు. తత్త్వమసి!" జీవునికి చావులేదని శ్రుతి నొక్కిచెప్పుచున్నది. **దేహానికి ఆశ్రయించి వున్న స్థూలమైన ఉత్పత్తి ప్రళయములు జీవునికి లేవని సారాంశము** (ఛాం.ఉ. VI-11-3)

## 11. ఆత్మాధికరణము (71)

## (233) II.3.17

సూ. **నా త్మా౭ శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః**

క్ర. **న, ఆత్మా, అశ్రుతేః, నిత్యత్వాత్, చ, తాభ్యః**

ప్ర.అ. న = **లేదు,** ఆత్మా = **జీవాత్మ,** అశ్రుతేః = **శ్రుతిలో ఇది కనిపించదు,** నిత్యత్వాత్ = **నిత్యత్వము వలన,** చ = **కూడ,** తాభ్యః = **ఆశ్రుతులలోనే**

వి. **ఉపనిషత్తులలో ఎక్కడ కూడా జీవాత్మ యొక్క ఉత్పత్తి, లయము** (జననమరణములు) **ల గూర్చి కనిపించదు. అంతేకాక జీవాత్మ యొక్క నిత్యత్వము గూర్చి మరల మరల కనిపిస్తుంది.**

కఠోపనిషత్తు (I.2-18) లో :-

"న జాయతే మ్రియతే వా విపశ్చిత్ నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్, అజోనిత్యః శాశ్వతోయం పురాణః నహన్యతే హన్యమానే శరీరే"

"ఈ ఆత్మ జన్మించుట లేదు, మరణించుట లేదు. దేని నుండి ఈ ఆత్మ జనించలేదు. దీని నుండి ఏదియు జనించలేదు. జన్మలేనిది, నిత్యమైనది, శాశ్వతమైనది ఐన ఈ ఆత్మ పురాణమైనది. తన శరీరము హతముగావించబడినను హతము కాదు". (కఠో.ఉ.I.2-18)

ఛాందోగ్యోపనిషత్తులో :-

"జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే" (ఛాం.ఉ. VI-11-3)

"జీవుడు విడచివెళ్లినచో ఈ శరీరము మరణించును కాని జీవుడు చనిపోవువాడు కాదు" (ఛాం.ఉ. VI-11-3)

"అవినాశీ వా అరేఅయమాత్మా అనుచ్ఛిత్తిధర్మా" (బృ.ఉ. IV-5-14)

"ఈ ఆత్మ స్వరూపము వినాశభావము లేనిదియును, వికారరూపమైన నాశముగాని, అభారూపమైన నాశముగాని లేనిదని తెలసికొనవలయును".

**ఈ ప్రకారము జీవాత్మ యొక్క నిత్యత్వము గూర్చి శ్రుతి, స్మృతుల ప్రమాణము సిద్ధమైనది.** (కఠ.ఉ. I-2-18; ఛాం.ఉ. VI-11-3, (బృ.ఉ. VI-5-14))

## 12. జ్ఞాధికరణము (72)

## (234) II.3.18

సూ. **జ్ఞో౭ త ఏవ**

క్ర. **జ్ఞ, అత, ఏవ**

ప్ర.అ. జ్ఞ = **జ్ఞాత, తెలిసినవాడు,** అతః = **కావున,** ఏవ = **నే**

వి. **నిత్యుడు కావుననే జీవాత్మ జ్ఞాత, తెలిసినవాడు, చైతన్యస్వరూపుడు జీవుడు జన్మించడు, మరణించడు అని అనటం వలన అవ్యాకృతుడైన పరమాత్మయే జీవుడు.** కావున జీవుడు పరమాత్మయైన

బ్రహ్మమువలెనే నిత్యుడు, జ్ఞానస్వరూపుడు. ఉపాధియైన శరీర సంబంధమువలన జీవుడుగా కనిపిస్తుంది కాని అచేతనముకాదు. "విజ్ఞానమ్ ఆనందం బ్రహ్మ" (మహోపనిషత్తు II-3)

"విజ్ఞానము ఆనందమే బ్రహ్మ"

"అసుప్తః సుప్తానభిచాకశీతి" (బృ.ఉ. IV-3-11)

"అతడు నిద్రించడు, నిద్రించే ఇంద్రియాలను వెలిగింప చేస్తాడు"

"అనంతరో అబాహ్యః కృత్స్నః, ప్రజ్ఞానఘనః ఏవ" (బృ.ఉ. 4-5-13)

"బాహ్యంతరములులేని ఈ ఆత్మప్రజ్ఞానము యొక్క ఘనీభావమే అగుచున్నది" ఇటువంటి **అనేక శ్రుతి వాక్యముల వలన, ప్రమాణముల వలన 'ఆత్మ' నిత్యచైతన్య జ్ఞాన స్వరూపమని నిశ్చయము.** (మహో.ఉ. II-3; బృ.ఉ. 4-3-11, 4-5-13)

## 13. ఉత్క్రాంతిగత్యధికరణము (73)

### (235) II.3.19

**(గమనిక : 19వ సూత్రము నుండి 28వ సూత్రము వరకు పూర్వపక్ష సూత్రాలు)**

**సూ. ఉత్క్రాంతిగత్యాగతీనామ్**

**క్ర. ఉత్క్రాంతిగతి, ఆగతీనామ్**

**ప్ర.అ.** ఉత్క్రాంతిగతి ఆగతీనాం = **లేవటము, పోవటము, రావటము**

**వి. ఉపనిషత్తులలో జీవాత్మ శరీరమును విడచి పరలోకమునకు పోవటము మరియు మరలి రావటము గూర్చిన వర్ణనలు వున్నాయి. శరీరత్యాగము ప్రత్యక్షముగా చూడబడుతున్నది.**

"యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః, స్థాణు మన్యే అనుసంయంతి, యథా కర్మ యథాశ్రుతం" (కఠ.ఉ. II-5-7)

"తమ తమ జ్ఞానముననుసరించి, కర్మననుసరించి కొన్ని జీవాత్మలు గర్భములలో ప్రవేశించుచున్నవి. కొన్ని జీవాత్మలు వృక్షములలో ప్రవేశించుచున్నవి" జీవుల సత్కర్మల వలన ఊర్ధ్వలోకములకు పోవటం మోక్షము అవటము లేక ఆలోకముల నుండి తిరిగి రావటము గూర్చి కూడా చెప్పబడినవి. (కఠ.ఉ. II-5-7)

ప్రశ్నోపనిషత్తులో (ప్ర.ఉ. V-4)

"స సోమలోకే విభూతి మనభూయ, పునరావర్తతే"

"అతడు చంద్రలోకమున ఐశ్వర్యమనుభవించి" తిరిగి భూలోకమునకు వచ్చును అని వున్నది. (కఠ.ఉ. II-5-7; ప్ర.ఉ. V-4)

### (236) II.3.20

**సూ. స్వాత్మనా చోత్తరయోః**

**క్ర. స్వాత్మనా, చ, ఉత్తరయోః**

**ప్ర.అ.** స్వాత్మనా = **తన స్వరూపముచే,** చ = **కూడ,** ఉత్తరయోః = **పరలోకమునకుపోవుట, అచట నుండి తిరిగి వచ్చుట.**

వి. **ఉత్క్రాంతి అనగా దేహవియోగము. ఇది ఆత్మ నిత్యముకాక పోయినను ఏర్పడవచ్చును. కాని 'గతి ఆగతి' అనగా పరలోకమునకు పోవుట, పరలోకము నుండి వచ్చుట అను రెండు స్వస్వరూపముతోనే జరుగును.** "ఏది వెళ్లునో అదే వచ్చును". మరియొకటి కాదు. కావున శరీరనాశముతో ఆత్మనాశము లేదని, అది ఎప్పుడూ వుండునని సిద్ధము. పోవటము రావటము అనేది సర్వవ్యాపకుడు మహత్పరిమాణుడు అయిన దానికి కాదు. కావున జీవుడు అణుపరిమాణుడు. అయితే జీవుడు నిత్యుడు మరియు రావటం పోవటం వుంది కనుక చలన స్వభావుడు.

## (237) II.3.21

సూ. **నాణురతచ్ఛ్రుతేరితి చేన్నతరాధికారాత్**

క్ర. **న, అణుః, అతచ్ఛ్రుతేః, చేత్, న, ఇతరాధికారాత్**

ప్ర.అ. న = **కాదు,** అణుః = **అణుపరిమాణము,** అతచ్ఛ్రుతేః = **శ్రుతి అలా అనినందువలన,** ఇతిచేత్ = **అని అనిన,** న = **అట్లు కాదు,** ఇతరాధికారాత్ = **ఇతరుడు (పరమాత్మ) ప్రకరణము వలన**

వి. **"సర్వవ్యాపి అని ఉపనిషత్తులు చెప్పుచున్నందున జీవుడు అణుపరిమాణుడు కాదు" అని అనిన యెడల అది సరికాదు. ఎందుకంటే ఆ మహత్త్వం చెప్పే ప్రకరణము పరమాత్మకు సంబందించినదే కాని, జీవప్రకరణము కాదు.**

"స వా ఏష మహానజః ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" (బృ.ఉ. IV-4-22)

"ప్రాణములందుయున్న విజ్ఞానమయుడే మహాపరిమాణము కల అజుడైన ఆత్మ" అని వర్ణించినది పరమాత్మకు సంబంధించినది. ఎందుకంటే పైన చెప్పినదాని వెంటనే "య ఏషో అంతర్హృదయ ఆకాశఃతస్మిన్ శేతే, సర్వవశీ, సర్వస్యఈశానః సర్వస్యాధిపతిః"

"అట్టి పరమాత్మ అంతర హృదయ ఆకాశమునందు వుండి, అక్కడ నివసించుచున్నాడు. ఆ పరమాత్మ సర్వులను వశమునందుంచు కొన్నాడు. అతడు సర్వశాసకుడు, సర్వాధిపతి" అని చెప్పబడినది. **కావున అజుడు, మహానుడు అని చెప్పబడినది. పరమాత్మ గురించి, జీవుని గురించి కాదు. జీవాత్మ అణుపరిమాణము కలది.** (బృ.ఉ. IV-4-22)

## (238) II.3.22

సూ. **స్వశబ్దోన్మానాభ్యాం చ**

క్ర. **స్వశబ్దోన్మానాభ్యాం, చ**

ప్ర.అ. స్వశబ్దోన్మానాభ్యాం = **శ్రుతిలో స్వశబ్దము, ఉన్మానము మరియు పరిమాణబోధకమైన వాక్యములున్నందువలన,** చ = **కూడ**

వి. **శ్రుతిలో జీవునికి అణుత్వాన్ని చెప్పే మరియు అనుమానముతో పరిమాణం చెప్పే వాక్యాలు వున్నాయి. కావున జీవుడు అణుపరిమాణుడే.**

"ఏషో అణు రాత్మా చేతసా వేదితవ్యః" (ముం.ఉ. III-1-9)

"ఈ అణువువలె సూక్ష్మమైన జీవాత్మ విశుద్ధమైన మనస్సు వలననే తెలియదగినది" అని ముండకోపనిషత్తులో చెప్పబడినది.

"వాలాగ్రశతభాగస్య శతథా కల్పితస్య చ, భాగో జీవస్సవిజ్ఞేయః" (శ్వే.ఉ. V-9)

"వెంట్రుక యొక్క చివరి భాగాన్ని నూరు భాగాలు చేస్తే మరల నూరు భాగాలు చేస్తే అది ఎంత వుంటుందో అంత పరిమాణము జీవునికి వుంటుంది" (శ్వే.ఉ. V-9) మొదలు, 'పరిమాణము' అని చెప్పి, స్వజీవుడు అతిసూక్ష్మము అని చెప్పటము వలన, జీవుడు అణుపరిమాణుడే.

(ముం.ఉ. III-1-9; శ్వే.ఉ. V-9)

## (239) II.3.23

**సూ. అవిరోధశ్చందనవత్**

**క్ర. అవిరోధః, చందనవత్**

ప్ర.అ. అవిరోధః = **విరోధములేదు,** చందనవత్ = **చందనమువలె**

వి. జీవాత్మ అణుపరిమాణము అయితే శరీరములో ఏ ఒక చిన్నభాగములో సుఖము, బాధ కలగాలికదా? అంటే అట్లు కాదు. శరీరములో ఎక్కడ చందనము రాసినా శరీరమంతా చల్లదనము, సుగంధమైనట్లు ఆత్మయొక్క ప్రభావము అంతా వుంటుంది. జీవాత్మ సర్వాంగచైతన్యము, విద్యుత్తు ఎక్కడ తాకినా మొత్తం శరీరము జలదరిస్తుంది కదా. చైతన్యము పరిమాణాన్ని మించిన పరిణామము, ప్రమాణము, పరా-యానము కలిగినది.

## (240) II.3.24

**సూ. అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగమాద్ధృది హి**

**క్ర. అవస్థితివైశేష్యాత్, ఇతి, చేత్, న, అభ్యుపగమాత్, హృది, హి**

ప్ర.అ. అవస్థితివైశేష్యాత్ = **చందనము మరియు ఆత్మ స్థితులలో భేదము వుండటము వలన,** ఇతి చేత్ = **అని అననయెడల,** న = **కాదు,** అభ్యుపగమాత్ = **దాని స్థితి స్వీకరించబడినది కావున,** హృది = **హృదయదేశమందు,** హి = **అందులకు**

వి. **"చందనము యొక్క స్థితి ఒకచోట ప్రత్యక్షమగుచున్నది కాని ఆ రీతిగా ఆత్మయొక్క స్థితి శరీరమందొకచోట ప్రత్యక్షమగుట లేదు. కావున ఈ పోలిక, నిదర్శనము సరిలేదు" అట్లు అనిన సరికాదు. ఆత్మయొక్క స్థితి చెప్పబడినది. ఒప్పుకొనబడినది.**

"హృదిహ్యేష ఆత్మా" (ప్ర.ఉ. 3-6)

"ఆత్మహృదయమందు వున్నది"

"స వా ఏష ఆత్మా హృది" (ఛాం.ఉ.VIII-3-3)

"అటువంటి ఆత్మహృదయములో వుంది" ఇంకా

"కతమ ఆత్మేతి యో అయం విజ్ఞానమయః,

ప్రాణేషు హృద్యంతర్జ్యోతి పురుషః" (బృ.ఉ. IV-3-7)

"ఆత్మఏది? ప్రాణములో బుద్ధివృత్తులలో వుండే విజ్ఞానమయుడు, హృదయములో వుండే అంతర్జ్యోతి స్వరూపుడు" అని ఎన్నో విధాల చెప్పబడింది. **కావున ఆత్మహృదయంలో వుంది, నాడుల్లో రక్తలాగంలాగా, ఏ ఒకచోట వున్న చందనములాగా, సూర్యుని నుంచి మరియు దీపము నుండి వెలుగులాగా శరీరమంతా ప్రసరించి అన్నిచోట్ల చైతన్యరూపములో వుంటుంది.**

(ప్ర.ఉ. 3-6; VIII-3-3; బృ.ఉ. IV-3-7)

## (241) II.3.25

**సూ. గుణాద్వా లోకవత్**

**క్ర. గుణాత్, వా, లోకవత్**

ప్ర.అ. గుణాత్ = **గుణము వలన,** వా = **లేక,** లోకవత్ = **లోకము నందు కనిపించునట్లు**

వి. **ఏ విధముగాలోకములో ప్రత్యక్షముగా కనిపిస్తుందో,** ఇంట్లో ఏ మూలకు వున్న దీపమైనా తన ప్రకాశమనే గుణము వలన ఇల్లంతా వెలుగు చేస్తుందో, ఏ విధంగా పండిన జామపండు సుగంధము గదినంతా నింపివేస్తుందో, ఏ విధంగా ఒక చిన్న ఇంగువ పొట్లము పెట్టిన పెట్టి అంతా తన సువాసనతో నింపివేస్తుందో అదే విధముగా **ఆత్మ తన చైతన్యము అనే గుణముతో దేహమును, అన్ని ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని సంపూర్ణ అంతరంగమును నింపివేస్తుంది.**

భగవద్గీతలో

"స్వప్రకాశమైదాను వెలుగుచున్నందువలన

సర్వలోకముల వెలిగించు ప్రభాకరుడు

నా రీతి స్వయము ప్రకాశింపచేయుచుండు

సర్వక్షేత్రముల దన వెలుగుతోన విభుడు". (భ.గీ. XIII-34)

ఆ విధముగా సూర్యుడు ఎక్కడ వున్నా అన్ని లోకములను తన వెలుగు వెలిగింపచేస్తాడో అలాగే పరమాత్మ సర్వజీవులను తన చైతన్యముతో వెలిగింపచేస్తాడు. **ఆత్మ సర్వేంద్రియములను, అంతరంగములను తన చైతన్యముతో నింపుతుంది.**

(భ.గీ. XIII-34)

## (242) II.3.26

**సూ. వ్యతిరేకో గంధవత్**

**క్ర. వ్యతిరేకః, గంధవత్**

ప్ర.అ. వ్యతిరేకః = **గుణము నుండి గుణి నుండి వేరుకావటము సంభవము,** గంధవత్ = **గంధమువలె**

వి. "వస్త్రముల తెలుపు ఎరుపువలె, వంటకముల రుచివలె, గుణములు గుణిని వదలివుండనట్లు,

అణుస్వరూపుడైన జీవాత్మచైతన్యము ఆత్మను వదిలి వేరుచోట్లకు పోదుకదా!" అని అంటే అట్లాకాదు. పుష్పము యొక్క గంధము పుష్పము వున్నచోటుయే కాక దూరము పోతుంది కదా. శ్రీ మన్మహాభారత స్మృతిలో సౌగంధికపుష్పము యొక్క సుగంధము చాల దూరములో ద్రౌపదికి అనుభూతి అయిందికదా! వంట ఇంట్లో వండబడుతున్న పాయసములోని ఏలకకాయల సువాసన ఇంట్లో ఎక్కడైనా అనుభవం అవుతుంది కదా. అదే విధముగా **జీవాత్మ యొక్క చైతన్యగుణము ఆత్మనుండి ప్రసారమై దేహములోని సమస్త అవయవములను చైతన్యవంతము చేస్తుంది.**

## (243) II.3.27

**సూ. తథా చ దర్శయతి**

**క్ర. తథా, చ, దర్శయతి**

ప్ర.అ. తథా = **అట్లు,** చ = **కూడ,** దర్శయతి = **శ్రుతి కూడా చూపిస్తున్నది.**

వి. **ఒక యుక్తితోనే కాదు ఉపనిషత్తు కూడా ఆత్మ ఒకేచోట వుండి తన గుణము ద్వారా శరీరమునంతా వ్యాపించి వుంటుంది అని చెప్పింది.**

"సర్వమేవేదమావాం భగవః ఆత్మానం
పశ్యావః ఆలోమభ్యః ఆనభేధ్యః ప్రతిరూపమితి" (ఛాం.ఉ. VIII-8-1)

"ఈ సంపూర్ణ రోమ-నఖ పర్యంతము ఆత్మను మేముచూచున్నాము"

"ప్రజ్ఞయా శరీరం సమారూహ్య
శరీరేణ సుఖదుఃఖే ఆప్నోతి" (కౌషీ.ఉ. III-6)

"ఈ ఆత్మ ప్రజ్ఞతో శరీరమును ఆరూహ్యామై నింపి శరీరముతో సుఖదుఃఖమును ప్రాప్తి చేసుకొంటుంది. ఈ విధముగా ఆత్మ అణుపరిమాణములో వుండి కూడా శరీరమునంతా ప్రసరించి వుంటుంది." (ఛాం.ఉ. VIII-8-1, కౌషీ.ఉ. III-6)

## (244) II.3.28

**సూ. పృథగుపదేశాత్**

**క్ర. పృథక్, ఉపదేశాత్**

ప్ర.అ. పృథక్ = **వేరు,** ఉపదేశాత్ = **ఉపదేశము వలన**

వి. **ఇంతకుముందు సూత్రములో చెప్పిన వాక్యములతో ఏమి స్పష్టమైనది అంటే కర్త, భోక్త, చేతనఆత్మ మరియు అచేతనబుద్ధి మొదలైన జ్ఞానసాధనములు వేరు వేరు. కావున బుద్ధి మరియు ఆత్మ ఒకటి కాదు. కఠోపనిషత్తు (I-3-3,4)లో ఇదే ఉపదేశము వున్నది.**

"ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవ తు
బుద్ధింతు సారథింవిద్ధి, మనః ప్రగ్రహమేచ"
"ఆత్మను రథికునిగా తెలిసికొనుము. శరీరమును రథముగాను, బుద్ధిని సారథిగాను, మనస్సును కళ్లెముగాను తెలిసికొనుము. అట్లు ఏ విధముగా సారథి నుండి రథికుడు వేరుయో, అదే విధముగా సాధనమైన బుద్ధి, జ్ఞానముల నుండి చేతనుడైన ఆత్మవేరు". (కఠ.ఉ. I-3-3,4)

## (245) II.3.29

**సూ. తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్**

**క్ర. తద్గుణసారత్వాత్, తు, తద్వ్యపదేశః, ప్రాజ్ఞవత్**

ప్ర.అ. తద్గుణసారస్వాత్ = **ఆ గుణములను ప్రధానముగా స్వీకరించి,** తు = **అయితే,** తద్వ్యపదేశః = **ఆ అంగష్ఠమాత్రము, వెంట్రుక కొనవంటి వర్ణనము,** ప్రాజ్ఞవత్ = **బ్రహ్మను ప్రాజ్ఞుడు అనినట్లు**

వి. **ఆత్మ యొక్క నివాసస్థానము హృదయదేశమందు చెప్పబడినది, ఆ స్థానము అంగుష్టము వలెనున్నది. కావున ఉపనిషత్తులో దానికి అంగుష్ఠము యొక్క గుర్తునివ్వబడినది.**

"అంగుష్ఠమాత్రో రవితుల్యరూప స్సంకల్పాహంకార సమన్వితో యఃబుద్ధిర్గుణే నాత్మగుణేన చైవ ఆరాగ్రేమాత్రోహ్యా పరోఅపి దృష్టః" (శ్వే.ఉ. V-8).

"అంగుష్ఠమాత్ర పరిమాణము కలవాడు (జీవాత్మ) సూర్యసమాన రూపము కలవాడు, సంకల్పాహంకార సమన్వితుడునగువాడై, బుద్ధి యొక్క గుణములముంచేతను, దేహసంబంధ గుణములచేతను, ఇనుపచక్రపు చీల (ఆరా) రూపముతో పరమాత్మకు భిన్నమైన జీవాత్మ కూడ జ్ఞానుల ద్వారా చూడబడినాడు."

ఇదే విధముగా కఠోపనిషత్తులో

"అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మనితిష్ఠతి
ఈశానో భూత భవ్యస్య న తతో విజుగప్సతే, "ఏతద్వైతత్" (కఠ.ఉ. II-1-12)

"అంగుష్ఠమాత్ర పరమాత్మ మధ్య ఆత్మలో స్థితమై వున్నాడు. అతడు సమస్త అతీత, అనాగత, చరాచర జగత్తు యొక్క నియంత". ఇక్కడి పరమాత్మ అంగుష్ఠమాత్రుడన్నారు. ఇంతకుముందు జీవాత్మ అంగుష్ఠమాత్రుడన్నారు.

పరమాత్మ, జీవాత్మలకు ఆయాస్థానాలను బట్టి (హృదయము) పరిమాణాలు చెప్పారు. కాని ఆత్మకు గుణవర్ణనలు స్వాభావికము కావు. ప్రాజ్ఞుడంటే పరమేశ్వరుడు. సగుణోపాసనకోసం పరమేశ్వరునికి దహారాకశము. హృదయము వంటి ఉపాధులలో అణుత్వము. సూక్ష్మత్వము చెప్పబడినది. అంతేకాని, ఆత్మ అనంతుడు, అపరిచ్ఛిన్నడు. "తత్త్వమసి" వంటి వాక్యములతో జీవాత్మకు పరమాత్మకు బేధంలేదని చెప్పినారు. దానివల్ల పరబ్రహ్మ పరిమాణము ఎంతనో, జీవాత్మ పరిమాణం కూడా అంతే. సూత్రములోని "తు" (అయితే) అనే పదముతో రెండవ అధ్యాయములో మూడవ పాదములోని 19-28 సూత్రాలను, పూర్వపక్షములకు సమాధానాలైన వాటిని కొట్టివేసి ఆత్మ

సర్వవ్యాపకము అని చెప్పినారు. **ఆత్మ ఉపాధిలో వున్నంత వరకు అవిద్యలో వున్నంత వరకు పరమాత్మకన్న భిన్నము మరియు పరిమితము. అవిద్య లేనపుడు ఆత్మపరమాత్మలకు భేదం వుండదు.** (బ్ర.సూ. II-3-19 నుండి 28 వరకు)

## (246) II.3.30

**సూ. యావదాత్మభావిత్వాచ్చ న దోషస్తద్దర్శనాత్**

**క్ర. యావదాత్మభావిత్వాత్, చ, న, దోష, తద్దర్శనాత్**

ప్ర.అ. యావదాత్మభావిత్వాత్ = **ఎంతవరకు స్థూల, సూక్ష్మ కారణములలో ఏదైనను ఒక శరీరముతో జీవాత్మకు సంబంధముండునో, అంతవరకు శరీరమునకు అనురూపమైన ఏకదేశములో వుండును. కావున,** చ = **కూడ,** న = **కాలేదు,** దోషః = **దోషము,** తద్దర్శనాత్ = **శ్రుతిలో కనిపించటము వలన**

వి. **బుద్ధిసంయోగము అనేది, ఆత్మజ్ఞానము వలన సంసారనివృత్తి జరిగేవరకు వుంటుంది. శరీర వియోగము తరువాత కూడా బుద్ధి సంయోగము వుంటుందని శ్రుతులు చెపుతున్నాయి.** (బృ.ఉ. IV-3-7)

**బుద్ధిసంయోగము వున్నంత వరకు ఆత్మకు సంసారిత్వముపోదు. ఆ బుద్ధిసంయోగము అనేది శరీరము పోయినంత మాత్రము చేత వదలదు. సమ్యక్జ్ఞానము వలన అవిద్య పోనంతవరకు సంసారిత్వము వుంటుంది.** దీనికి శ్రుతి ప్రమాణము ఇలా వుంది "ఆత్మ బుద్ధితోడి తాదాత్మ్యము చెందినదై రెండు లోకాల్లోనూ సంచరిస్తుంది. బుద్ధి స్థిరముగా వున్నప్పుడు ధ్యానముతో వున్నట్లు, బుద్ధి చలించినపుడు చలిస్తున్నవాడి లాగా కనిపిస్తుంది."

రెండు లోకాలు అంటే ఈలోకము మరియు కర్మఫలము అనుభవము అయ్యే పరలోకము. **ఈ రెండు లోకాల్లోనూ బుద్ధి అనే ఉపాధితో సంబంధము వుంటుంది. సమ్యగ్దర్శనము వల్లనే ఆ ఉపాధి నశిస్తుంది. ఆ ఉపాధి సంబంధము వలననే జీవుడనే పేరు. అంతేకాని పరమేశ్వరుని కన్న జీవుడంటూ వేరే ఏమీ లేదు.** (బృ.ఉ. IV-3-7)

## (247) II.3.31

**సూ. పుంస్త్వాదివత్త్వస్య సతోఽభి వ్యక్తియోగాత్**

**క్ర. పుంస్త్వాదివత్, తు, అస్య, సతః, అభివ్యక్తియోగాత్**

ప్ర.అ. పుంస్త్వాదివత్ = **పురుషత్వము (మగతనము) మొదలైన వానివలె,** తు = **అయితే,** అస్య = **దాని (అతని),** సతః = **మొదటి నుండి వున్న,** అభివ్యక్తియోగాత్ = **సృష్టికాలమందు ప్రకటనమగు యోగము వలన దోషము లేదు.**

వి. **బాల్యములో వుండే మగతనము, ఆడతనము యవ్వనములో మాత్రమే ప్రకటించబడినట్లు, అభివ్యక్తమగునట్లు, సుషుప్తిలో సూక్ష్మరూపములో వుండు ఈ బుద్ధిసంయోగము జాగ్రదాది అవస్థలలో కనిపిస్తుంది** మరియు ప్రళయకాలములో బుద్ధి మొదలైన అన్ని తత్త్వములు తమ

కారణరూపమైన పరబ్రహ్మలో విలీనమైన గూడ అవియన్నియు అదే బ్రహ్మ యొక్క అచింత్యశక్తి రూపములో అవ్యక్తరూపములో విద్యమానమై వుంటాయి. పుంసత్వము అనేది బాల్యములో కూడా వుంటుంది. కాని, అది బీజరూపములో వుండి, యవ్వన సమయములో అభివ్యక్తము అవుతుంది. అట్లాగే, **ఆత్మకు బుద్ధితోడి సంబంధము కూడా సుషుప్తిలోనూ, ప్రళయములోనూ** (మరణములోను) **కూడా వుంటుంది. కాని, బీజరూపములో సూక్ష్మముగా వుంటుంది. మళ్లీ నిద్ర నుండి తెలివి రాగానే, మళ్లీ జన్మరాగానే వ్యక్తము అవుతుంది. కావున ఆత్మకు సంసారిత్వము వున్నంత వరకు ఈ బుద్ధితో సంయోగము వుంటుంది. సమ్యక్జ్ఞానము వచ్చి, సంసారిత్వము లేకపోయి, బుద్ధి సంయోగము వదలిపోయి, ఆత్మ, పరమాత్మగా వెలుగుతుంది.**

## (248) II.3.32

సూ. **నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోఽ_న్యతరనియమో వాఽ_న్యథా**

క్ర. **నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగః, అన్యతరనియమః, వా, అన్యథా**

ప్ర.అ. నితోపలిబ్ధ్యఅనుపలబ్ధిప్రసంగః = **దాని వలన విషయముల అనుభూతి కావటము మరియు కాకపోవటము ప్రసంగము తటస్థితము అవుతుంది,** వా = **లేక,** అన్యతరనియమః = **ఆత్మయొక్క గ్రాహకశక్తి లేక విషయముల గ్యాహ్యశక్తుల నియమములకు వేరే ఏదో కల్పన చేయవలసి వస్తుంది.**

వి. **అంతఃకరణమనేది జీవాత్మకు ఉపాధి. దానికి ఆస్తిత్వము ఉన్నదని అంగీకరించకపోతే, నిత్యోపలిబ్ధి ప్రసంగము లేక నిత్య అనుపలబ్ధి ప్రసంగము ఎదురౌతుంది.** అంటే, ఉపాధి భూతమైన బుద్ధి మొదలైన అంతఃకరణములు లేకపోతే, ఇంద్రియవిషయాలైన జ్ఞానసాధనాలు ఉన్నందున ఎల్లప్పుడూ జ్ఞానము కలుగుతుండాలి. ఇది నిత్యోపలబ్ధి ప్రసంగము. లేదా ఎల్లప్పుడూ జ్ఞానము కలుగకుండానైనా ఇది నిత్య అనుపలబ్ధి ప్రసంగము వుండాలి. ఉపలబ్ధి అంటే సాక్షాత్కారము. ఆత్మ, ఇంద్రియ విషయాల సాన్నిధ్యమే జ్ఞానసాక్షాత్కారానికి సాధనాలని అంటే, అవి ఉన్నప్పుడు కూడా అపుడపుడు జ్ఞానసాక్షాత్కారం (ఉపలబ్ధి) కలగటము, కలుగపోవటము చూస్తున్నాము.

ఆత్మవుంది, ఇంద్రియాలు పనిచేస్తున్నాయి. కాని మనసు ఇటు అటు పోయినపుడు చూచినది చూడలేదు, వినినది వినలేదు అని అంటున్నాము. అంటే మనస్సు లగ్నం కావటము కాకపోవటము చూస్తున్నాము. అంటే మనస్సు అనేది ఏది వున్నదో దాని సంబంధము వలననే ఆత్మకు సంసారిత్వము వస్తున్నది. అదే విధముగా **బుద్ధి, చిత్తము, మనస్సు, అహంకారము అనే నాల్గింటి కూడికయైన అంతఃకరణము యొక్క సంబంధము ఆత్మకు సంసారిత్వమును అతికిస్తుంది. అతుకులేనపుడు ఆత్మ అనంత పరమాత్మ.**

## 14. కర్త్రధికరణము (74)

## (249) II.3.33

సూ. కర్తా శాస్త్రార్థవత్త్వాత్

క్ర. కర్తా, శాస్త్రార్థవత్త్వాత్

ప్ర.అ. కర్తా = **జీవాత్మయేకర్త,** శాస్త్రార్థాత్వాత్ = **శాస్త్రములలో చెప్పబడిన అర్థము కలవాడు కనుక**

వి. **శాస్త్రములయందు జీవాత్మను ఉద్దేశించి కర్తవ్య కర్మల విధానము మరియు అకర్తవ్య కర్మముల నిషేధము గురించి చెప్పబడినది.** శాస్త్రములలో మరల మరల చెప్పినది ఏమనగా, కొన్ని కర్మములు చేయవలసినవి, కొన్ని చేయదగినవి, కొన్న శుభకర్మల వలన కర్తకు కొన్ని శ్రేష్ఠఫలితములు లభించును. మరియు కొన్ని అశుభకర్మల వలన కర్తకు కొన్ని కష్టములు భోగింపవలసివచ్చును. ఇలాంటి నిర్దేశముల సంకేతము జీవాత్మనే కర్తగా మన్నించినపుడే సరియని తెలియుచున్నది. ప్రశ్నోపనిషత్తులో, జీవాత్మ కర్తయని స్పష్టముగా చెప్పబడినది "ఈ విజ్ఞానాత్మ పురుషుడే, ద్రష్టా, స్రష్టా, శ్రోతా, ఘ్రాతా, రసయితా, మంతా, బోద్ధా మరియు కర్తా" (ప్ర.ఉ. IV-9) శ్వేతాశ్వతర ఉపనిషత్తులో "గుణములచే యుక్తము, ఫలప్రాప్తికి ఉద్దేశ్యములో కర్మచేయు మరియు చేసిన కర్మఫలముల ఉపభోగించునది జీవాత్మ" (శ్వే.ఉ. V-7) **ఈ వర్ణనల ప్రకారము జీవాత్మయేకర్త అని నిర్ధారణము అవుతున్నది.**

(ప్ర.ఉ. IV-9; శ్వే.ఉ. V-7)

---

## (250) II.3.34

సూ. **విహారోపదేశాత్**

క్ర. **విహార + ఉపదేశాత్**

ప్ర.అ. విహారః = **ఉపనిషత్తులలో స్వప్నములో స్వేచ్ఛావిహారము గూర్చి,** ఉపదేశాత్ = **ఉపదేశించబడినందున**

వి. "జీవాత్మ స్వప్నావస్థలో వున్నపుడు, తన కృతకర్మల (చేసిన కర్మల) ప్రతిఫలము సంభవించును. అపుడు జీవాత్మ వివిధ స్థితులను ప్రాప్తిచెందును. ఒకపుడు మహారాజుగా, ఒకపుడు సన్యాసిగా, ఒకపుడు గొప్పఅవస్థ, ఒకపుడు నీచావస్థ ప్రాప్తించుకొంటుంది. **స్వప్నావస్థలో ఆ జీవాత్మ ఇంద్రియములను వెంటనుంచుకొని యధేచ్ఛగా స్థలముల భ్రమణము చేస్తుంది"** (బృ.ఉ. II-1-18)

"అవినాశి మరియు హిరణ్మయ జీవాత్మ పురుషుడు తన శరీరరూప స్థితిని రక్షించుకొనుచు, తన శరీరమును త్యజించి, స్వప్నములో, బయట గమనము చేస్తుంది. ఆ అమృతమయ పురుషుడు ఎక్కడ తన కామనలు, వాసనలు వుంటాయో అక్కడికి వెళ్ళి ఆ స్థానములను అనుభవము చేసుకొంటుంది" (బృ.ఉ. IV-3-12) ఈ ప్రసంగముల వలన **జీవాత్మ కర్తయని సిద్ధము అవుతుంది. ఎందుకంటే జడప్రకృతికి స్వేచ్ఛాపూర్వక కర్మల ప్రవృత్తి వుండదు.** (బ్ర.ఉ. II-1-18; బృ.ఉ. IV-3-12)

---

## (251) II.3.35

సూ. **ఉపాదానాత్**

క్ర. **ఉపాదానాత్**

ప్ర.అ. ఉపాదానాత్ = **ఇంద్రియములను గ్రహించుటవలన కూడ**

వి. ఇంద్రియములను గ్రహించుటవలన కూడ ఆత్మ కర్తయని సిద్ధమౌతున్నది. "జీవాత్మ (విజ్ఞానమయపురుషుడు) ప్రసుప్తావస్థలో వుండెను. అపుడు తన విజ్ఞానశక్తి, తన సమస్త ఇంద్రియముల శక్తిని తనలో ఏకత్రము చేసుకొని యుండెను. సుప్తావస్థలో జీవాత్మ హృదయాకాశములో వుండి ఇంద్రియములను గ్రహణము చేసుకొనును. ఈ జీవాత్మ ఇంద్రియశక్తుల ఆదాత (ఇచ్చునది) అందురు". (బృ.ఉ. II-1-7) అదియేకాక "జీవాత్మ ప్రాణముల గ్రహీత" (బృ.ఉ. II-1-18) **ఆదాత, గ్రహీత ఐనందున జీవాత్మకర్తయే అగును. ఇచ్చిపుచ్చుకొనుట వలన కర్తృత్వము వచ్చును. పరమాత్మకు ఇచ్చిపుచ్చుకొనుట లేదు.**
(బృ.ఉ. II-1-7), (బృ.ఉ. II-1-18)

## (252) II.3.36

సూ. **వ్యపదేశాచ్చ క్రియాయాం న చేన్నిర్దేశవిపర్యయః**

క్ర. **వ్యపదేశాత్, చ, క్రియాయాం, న, చేత్, నిర్దేశవిపర్యయః**

ప్ర.అ. వ్యపదేశాత్ = **శ్రుతులలో చెప్పబడినందువలన,** చ = **కూడ,** క్రియాయాం = **క్రియలయందు,** న = **కాదు,** చేత్ = **అనినయెడల,** నిర్దేశవిపర్యయః = **శ్రుతులమాన్యతకు విరుద్ధమువైయుండును.**

వి. **లౌకిక, వైదికక్రియలకు కర్తగా చెప్పబడినందువలన జీవుడేకర్త. లేకపోతే నిర్దేశము ఇంకొక విధముగా, విరుద్ధముగా వుండాలి.** "విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తనుతేపిచ" (తై.ఉ. II-5-1)

**"విజ్ఞానవాచ్యుడైన జీవాత్మయే యజ్ఞవిస్తారమును చేయును కావున లౌకిక కర్మల కర్తయగును" అని చెప్పబడినది. కావున జీవుడేకర్త. విజ్ఞానము అనే పదము జీవుడు కాక బుద్ధి అని అంటే అది శ్రుతి ప్రకరణమునకు విరుద్ధము అవుతుంది.** ఎందుకనగా తైత్తరీయ ఉపనిషత్తులో ఆ ప్రకరణము జీవాత్మ యొక్క పంచకోశములైన అన్నమయము, ప్రాణమయము, మనోమయము విజ్ఞానమయము, ఆనందమయములను గూర్చి చెప్పుతున్నది. (తై.ఉ. 2వ ఆధ్యాయము-బ్రహ్మానందవల్లి) (తై.ఉ. II-5-1)

## (253) II.3.37

సూ. **ఉపలబ్ధివదనియమః**

క్ర. **ఉపలబ్ధివత్, అనియమః**

ప్ర.అ. ఉపలబ్ధివత్ = **సుఖము, దుఃఖము మొదలైన, భోగముల ఉపలబ్ధివలె,** అనియమః = **నియమములేదు**

వి. **ఏ విధముగా జీవాత్మకు సుఖదుఃఖములను భోగముల అనుభవము అవుతుందో, కేవలము ప్రియములు ప్రాప్తికావాలి, అప్రియములు** (ఇష్టము కానివి) **ప్రాప్తికాకూడదు అనే నియమము కర్మల విషయములో లేదు. జీవునకు శుభము లేక అశుభము, హితము లేక అహితము ఐన కర్మలు చేయుటలో స్వతంత్రత కలదు. కావున జీవాత్మయే కర్త.**

దీని అర్థము ఏమనగా జీవాత్మకు ప్రియ, అప్రియ భోగములు తనకర్మల వలన అవుతాయి.

అయితే కర్మలు ఎన్నుకొనుటలో జీవునకు స్వతంత్రత వున్నది.

కర్మఫలముల భోగము ప్రారబ్ధము (చేసిన కర్మసంచయము) ప్రకారము పరమాత్మ జీవునకు విధియింపచేయును. ఆ సంచిత కర్మల అనుసారము కలిగిన సంస్కారముల వశీభూతమై జీవుడు శుభము లేక అశుభము ఐన కర్మలుచేయుటకు ఉద్యుక్తుడు అవుతాడు. అయితే వివేకమునాశ్రయించి జీవుడు అశుభకర్మల ప్రమాదమునుంచి దూరము అగుచూ, తన స్వభావమును పరిష్కారము చేసుకొని అశుభకర్మల నివృత్తి, శుభకర్మల ప్రవృత్తి వైపు పురోగమించగలడు. ఈ విషయములో ఉపనిషత్తులు చక్కగా చెప్పినవి. "శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత స్తౌసంపరీత్య వివినక్తిధీరః, శ్రేయోహిధీరో అభిప్రేయసో వృణీతే, ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే" (కఠ.ఉ. I-2-2)

"శ్రేయస్సు, ప్రేయస్సు అను ఈ రెండు కూడ మనుజుని చేరుచుండును. వివేకుడైన ధీరుడు పరీక్షించి, విమర్శ చేయుచుండును. ఆ ధీరుడు ప్రేయస్సును వదిలి, శ్రేయస్సును ఎంచుకొనును. మందుడైనవాడు యోగక్షేమముల కొరకు ప్రేయస్సును యెంచుకొనను". **ఈ యెంచుకొనుటయే జీవుని స్వతంత్రత, మనుజుడు తన భవిష్యత్తు తానే నిర్ణయించుకొనే మార్గమే ఈ యెంచుకొనుటలోని స్వతంత్రత.**

నారాయణ వాక్యము :
ఇదే విషయము ముక్తికోపనిషత్తు నొక్కి వొక్కాణించినది.
"శుభాశుభాభ్యాం మార్గాభ్యాం
వహంతీ వాసనాసరిత్,
పౌరుషేణ ప్రయత్నేన
యోజనీయాశుభేపథిః" (ముక్తికోపనిషత్తు-II. 3)

"సంచితకర్మలు, ప్రారబ్దము వలన వాసనా సరిత అనే సంస్కార ప్రవాహము శుభము, అశుభము అనే రెండు మార్గములవైపు ప్రవహించుచుండును. స్వాభావికముగా శుభ కర్మల సంచిత ప్రారబ్ధము శుభము వైపు త్రోయును. అశుభకర్మలసంచిత ప్రారబ్ధము అశుభమువైపు త్రోయచుండును."

"మనుజుడు తన పౌరుషమైన ప్రయత్నముతో ప్రతి పరిస్థితిలో, ప్రతిక్షణము, అశుభకర్మలను వదలివేసి, శుభకర్మలవైపు ధృఢసంకల్పముతో యోచించి, మళ్లీ స్వభావమును పరిష్కరించి, ఉద్ధరించి, శుభమార్గమున నడువవచ్చును." ముక్తికోపనిషత్తు-II.3. **ప్రారబ్దము ఎలా వున్నా, ప్రయత్నము వలన మనుజుడు తనను తాను ఉద్ధరించుకొనగలడు. ఈ విషయములో ఏ సందేహము లేదు.**

"తన్నుతాను ఉద్ధరించవలయు
తన్నుతాను క్రిందకు త్రోయవలదు
తనకు తానుయే బాంధవుండు
తనకు తానుయె శాత్రవుండు" (భ.గీ. VI-5)

(భ.గీ. VI-5) (కఠ.ఉ. I-2-2; ముక్తి. ఉ. II-3)

## (254) II.3.38

**సూ. శక్తివిపర్యయాత్**

**క్ర. శక్తివిపర్యయాత్**

ప్ర.అ. శక్తివిపర్యయాత్ = **శక్తికి విపరీతము అయ్యే కారణము వలన**

వి. **జీవాత్మ యొక్క కర్తృత్వము, తన యొక్క అనాది కర్మ సంస్కారములు మరియు ఇంద్రియ దేహాదుల సంబంధమువలన అవుతుంది. కాని తన స్వరూపముతో కాదు. అయితే ఆ జీవాత్మ ఎప్పుడూ తనకు హితమైన కార్యములు చేయలేదు. ఎందుకంటే ఏ పనియైనా చేయటములో సహయ్యకారి కారణములు మరియు బాహ్యసాధనముల అవశ్యకము అవుతుంది.**

వీటన్నింటి వలన జీవాత్మ పూర్తిగ పరతంత్రము అయిపోతుంది మరియు అంతఃకరణము ఇంద్రియములు మరియు శరీరాదుల శక్తి కూడ అనుకూలము వుండాలనే పరిస్థితి వుండకపోవచ్చును. అపుడు ప్రతికూల సాధనముల ఉపలబ్ధి అయినపుడు అహితకారి కార్యముల సంపాదన కూడ సంభవము అవుతుంది. ఈ ప్రకారముగా శరీరాదుల శక్తియొక్క విపరీత ఆచరణములతో కూడ ఇచ్ఛిత ఫలముల ప్రాప్తి సంభవముకాకపోవచ్చును. **ఈ కారణముల వలన ప్రతిసారి జీవాత్మ అశుభకార్యముల వదిలి, శుభకర్మల చేయటము సంభవము కాకపోవచ్చును.**

## (255) II.3.39

**సూ. సమాధ్యభావాచ్చ**

**క్ర. సమాధ్యభావాత్, చ**

ప్ర.అ. సమాధ్యభావాత్ = **సమాధి అవస్థ యొక్క అభావము ప్రాప్తి అవటము వలన,** చ = **కూడ**

వి. **సమాధి అవస్థలో కర్మల నిరంతర అభావము అవుతుంది. కర్తృత్వమును జీవాత్మ యొక్క స్వభావిక ధర్మమని ఒప్పుకొనినపుడు జీవుడు ఎపుడును నిష్క్రియ అవస్థను ప్రాప్తి చేసికొనిలేదు.** ఎందుకంటే శాస్త్రములలో జీవాత్మ స్వరూపమును నిష్క్రియమని చెప్పబడినది. అద్వితీయ పరమాత్మ అన్నిటి అధీశ్వరుడు. కావున ఎన్నియో నిష్క్రియ జీవాత్మల ఒక బీజమును అనేక రూపముల లోనికి పరిణితి చేయించును. "హృదయగుహలో అవస్థితుడైన పరమేశ్వరుని ఏ ధీరపురుషుడు, అనుభూతిజన్యమైన దృష్టితో చూస్తాడో, అతనికే శాశ్వత సుఖము ప్రాప్తి అవుతుంది. వేరు వారికి కాదు."

**కావున జీవుని కర్తృత్వము స్వరూపగతము మరియు స్వాభావికము కాదు, కాని అనాది సిద్ధమైన అంతకరణము యొక్క సంబంధము వలన అవుతుంది.** (శ్వే.ఉ. VI-12)

## 15. తక్షాధికరణము (75)

## (256) II.3.40

**సూ. యథా చ తక్షోభయథా**

**క్ర. యథా, చ, తక్షా, ఉభయథా**

ప్ర.అ. యథా = **ఏ విధముగా,** చ = **ఇంకను,** తక్షా = **శిల్పి (వడ్రంగి),** ఉభయథా = **రెండు విధముల**

వి. **తన వివిధ పరికరములతో నానావిధముల శిల్పములను రచించు శిల్పి (వడ్రంగి) తన శిల్పకార్యములలో ఎప్పటివరకు వుంటాడో, అప్పటి వరకు ఆకార్యముల కర్త అయి వుంటాడు. ఎప్పుడు తన శిల్పకార్యము నుండి, పనిముట్లనుండి వేరు అవుతాడో, అపుడు శిల్ప కార్యముల కర్త కాకుండా వుంటాడు.** అదే విధముగా జీవాత్మ కూడా ఎపుడు తన అంతఃకరణాది సాధనముల స్వామిగా వుండి, వాటి ద్వారా కార్యములు చేస్తాడో, అపుడు ఆ కార్యములకర్త అవుతాడు మరియు ఇంద్రియముల, అంతకరణము యొక్క సంభంధముల నుండి వేరు అవుతాడో అపుడు కర్త కాకుండా వుంటాడు. కావున జీవాత్మ యొక్క కర్తృత్వము స్వభావసిద్ధము కాదు. **ఈ సూత్రములో చ = 'తు' ఉపయోగించారు. కర్తృత్వము ఔపాదికము అని చెప్పే అర్థములో ఉపయోగించబడినది. వడ్రంగి (తక్షా) ఉలి, బాడి(ష)త మొదలైన సాధనాలను గ్రహించి కర్తయై, పనిచేసినపుడు దుఃఖితుడౌతున్నాడు. ఆ పనిని మానివేసి, సాధనాలను వదిలివేసినప్పుడు అకర్త అవుతున్నాడు. సుఖిస్తున్నాడు.**

## 16. పరాయత్తాధికరణము (76)

## (257) II.3.41

సూ. **పరాత్తు తచ్ఛ్రుతేః**

క్ర. **పరాత్, తు, తత్శ్రుతేః**

ప్ర.అ. పరాత్ = **పరమాత్మ నుండి,** తు = **యే అవును,** తత్ = **ఆ జీవుని కర్తృత్వము,** శ్రుతేః = **శ్రుతులు అలా చెప్పుట వలన**

వి. **పరమాత్మ నుండియే, ఈశ్వరుని వల్లనే (పరాత్) జీవునికి కర్తృత్వము కలుగుతున్నదని శ్రుతులు (ఉపనిషత్తులు) చెప్పుతున్నాయి.** బృహదారణ్యక ఉపనిషత్తులో "ఎవరు అంతర్యామియై వుండి, విజ్ఞానమును నియమించునో, అతడే ఆత్మ, అంతర్యామి, అమృతము" (బృ.ఉ. V-7-22)

ఛాందోగ్యోపనిషత్తులో

"నేను ఈ జీవాత్మరూపములో ఈ ముగ్గురు దేవతల (తేజము, జలము, పృథివి)లో ప్రవేశించి వాటి నామములు మరియు రూపములతో ప్రకటము అవుతాను" (ఛాం.ఉ. VI-3-2)

కేనోపనిషత్తులో (III-1 నుండి 10 వరకు) వున్న యక్షుడు దేవతగా గల ఆఖ్యానములో అగ్ని, వాయువు మొదలైన దేవతలలో స్వయముగా కార్యము చేయు స్వతంత్రశక్తిలేదనీ, కాని ఆ సర్వశక్తిమానుడైన బ్రహ్మము నుండి శక్తిని ప్రాప్తించుకొని, తమ తమ కార్యములు చేయుటలో సమర్థులు అవుతారనీ తెలుపబడినది.

భగవద్గీతలో

"హృద్దేశమందు అర్జున తిష్ఠించి యుండి
భూతములన్నిటికి ఈశ్వరుండైనవాడు

యంత్రారూఢడగుచు తన మాయచేత
భూతములన్నిటిని భ్రమియింపచేయు" (భ.గీ. XVIII-61)

**ఈ విధముగా శాస్త్రములలో చెప్పబడిన సందేశముల ప్రకారము జీవాత్మ పరబ్రహ్మ యొక్క శక్తి మరియు సహయోగంతోనే, ఏదైనా కూడ చేయుటకు సమర్థము అవుతుంది. కాని స్వతంత్రతాపూర్వకముగా కాదు.**

(బృ.ఉ. V-7-22; ఛాం.ఉ. VI-3-2; కేనోపనిషత్తు III-1 నుండి 10 వరకు; భ.గీ. XVIII-61)

## (258) II.3.42

**సూ. కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః**

**క్ర. కృతప్రయత్నపేక్షః, తు, విహిత ప్రతిషిద్ధ అవైయర్థాదిభ్యః**

ప్ర.అ. కృతప్రయత్నాపేక్షః = **చేసిన కర్మలనపేక్షించి, అనుసరించి,** తు = **కాని,** విహిత ప్రతిషిద్ధ అవైయర్థాదిభ్యః = **విధి నిషేధ శాస్త్రముల సార్థకత మొదలైనవాటి నుండి బ్రహ్మము నిర్దోషము.**

వి. **పరమాత్మ ద్వారా జీవునికి జీవనకర్మలు చేయుటకై సాధనములు మరియు శక్తి ప్రసాదించబడును. అవి జీవుని, జీవి యొక్క జన్మజన్మాంతరముల సంచిత కర్మ మరియు సంస్కారముల ననుసరించి ఇవ్వబడును. దానితోపాటు ఆ సాధనములను సదుపయోగము చేయు కొరకు వివేకము, బుద్ధి కూడా పరమాత్మచే జీవులకు ప్రధానము చేయబడును.** వివేకము, వికాసము చేయుటకు శుభకర్మల విధానములు మరియు అశుభకర్మల నిషేధములు కూడా శాస్త్రములలో తెలుపబడినవి. దీనివలన పరమాత్మ మనుష్యునకు తన స్వభావమును సుధారణ చేయుటకు స్వతంత్రము కలుగచేసినాడు. **అట్లు పరమాత్మ తాను ఏ అంటులేని నిర్దోష స్వరూపము. మనిషి యొక్క కర్మలన్నీ ఈశ్వరుని శక్తి మరియు ప్రేరణ వల్లనే జరుగుతాయి. కాని శుభకర్మలు చేయటము, అశుభకర్మలు చేయకపోవటము అనే వాటిని ఎన్నుకొనే స్వతంత్రత మనుజునిదే. కావున శుభాశుభకర్మల దాయిత్వము, బాధ్యత మనిషిదే. ఆ భాద్యతను కూడ జీవి ఈశ్వరార్పణ చేస్తే, ఈశ్వరునిపైననే పూర్తిగా ఆధారపడితే, కర్మబంధములనుండి ముక్తి కావచ్చును.**

# 17. అంశాధికరణము (77)

## (259) II.3.43

**సూ. అంశో నానావ్యపదేశాదన్యథా చాపి దాశకితవాదిత్వమధీయత ఏకే**

**క్ర. అంశః, నానావ్యపదేశాత్, అన్యథా, చ, అపి, దాశకితవాదిత్వం, అధీయతే, ఏకే**

ప్ర.అ. అంశః = **అంశ,** నానావ్యపదేశాత్ = **వేరు వేరుగా అనేకులు, అని శ్రుతి యందు చెప్పుట వలన,** అన్యథా = **ఇంకొక తీరుగా,** చ = **అట్లు,** అపి = **కూడ,** దాశకితవాదిత్వం = **దాశ(పడవవాడు, బేస్తవాడు),** కితవ = **జూదగాదు,** అధీయతే = **అధ్యయనము చేతురు,** ఏకే = **అభేదాన్ని కొన్ని శ్రుతులు చెప్పినాయి.**

వి. **శ్రుతులలో జీవాత్మ పరమాత్మ వేరువేరు అని చెప్పబడినది. ఎందుకంటే జీవాత్మ అల్పజ్ఞుడు, పరమాత్మ సర్వజ్ఞుడు, జీవుడు** పరమాత్మ యొక్క నియమములో బద్ధుడు మరియు పరమాత్మ జీవాత్మ యొక్క నియామకుడు. కాని పరమాత్మ, జీవాత్మ ఒకటి అని ప్రతిపాదించబడినందున **జీవాత్మ పరమాత్మ యొక్క అంశ అవుతుంది.** "తత్త్వమసి" అను ఛాందోగ్యోపనిషత్తు (ఛాం.ఉ. VI-11-3) వాక్యము వలన జీవాత్మ పరమాత్మయే అని తెలుస్తుంది.

సుబాలోపనిషత్తులో

"జీవుని యొక్క తల్లి, తండ్రి, అన్న, ఆవాసము, శరణ్యము, సుహృదుడు, గతి అన్నియు నారాయణ" (సు.ఉ.VI-2)అని చెప్పబడినది. ఆ విధముగా పరమాత్మ జీవాత్మ వేరు అనీ, పరమాత్మ జీవాత్మ యొక్క విభువు అని తెలుస్తున్నది. **మరల అథర్వవేదము బ్రహ్మసూక్తములో "ఈ బేస్తవాడు బ్రహ్మ, ఈ దాసుడు బ్రహ్మ, ఈ జూదరి బ్రహ్మ" అని వుండుట వలన జీవులకు అనేకత్వము మరియు బ్రహ్మత్వము ఒకేసారిగా వున్నదని తెలుస్తున్నది. రెండు వస్తువులు ఒకటి మరియు వేరు అవ్వాలంటే ఒకటి ఇంకొక దాని అంశ కావాలి.** నిప్పు, నిప్పురవ్వలు అంశి మరియు అంశలు. నిప్పురవ్వ, నిప్పుయొక్క అంశ. అయితే నిప్పురవ్వ కూడా నిప్పేకదా. కావున జీవాత్మ, పరమాత్మ యొక్క అంశ అనేది సిద్ధము. **అంటే జీవాత్మ తాను పరమాత్మ అంశ మరియు పరమాత్మ కూడా. అవిద్య వున్నప్పుడు జీవాత్మ పరమాత్మ అంశ. అవిద్య తొలగినపుడు జీవాత్మ పరమాత్మయే.**

(ఛాం.ఉ. VI-11-3, అథర్వవేదము సుబాలోపనిషత్తు VI-2)

---

## (260) II.3.44

సూ. **మంత్రవర్ణాచ్చ**

క్ర. **మంత్రవర్ణాత్, చ**

ప్ర.అ. మంత్రవర్ణాత్ = **మంత్రముల వర్ణముల వలన,** చ = **కూడ**

వి. **వేదములోని మంత్రములు మరియు ఉపనిషత్తు వాక్యములు కూడా పరమాత్మ యొక్క పూర్ణత్వము, సమస్తసృష్టి మరియు సమస్త జీవుల యొక్క అంశత్వము గూర్చి చెప్పుచున్నవి.**

"తావానస్య మహిమా తతోజ్యాయాగ్ంశ్చ పూరుషః
పాదోస్య యస్య సర్వభూతాని, త్రిపాదస్య అమృతం దివి"

(ఋ.వే. X-90-3; ఛాం.ఉ. III-12-6; య.వే. 31-3)

"అట్టి మహిమ అతనిది తరచిచూడ
దీనికన్న మించినవాడు పురుషుడు దాను
అతని ఒకపాదము, ఈ విశ్వమంతయును
అతని మూడు పాదములు, అమృతత్వమ్ము దివిన"

పరమాత్మ అన్నిటికన్న మించినవాడు, జీవులందరు, సమస్త భూతములు అన్ని విశ్వములు, మొత్తము సృష్టి ఆ పరమాత్మ యొక్క ఒక పాదము మాత్రము. పరమాత్మ జీవాత్మ సంబంధము, కారణ

కార్యరూపములో వున్నది. అయితే ఒకటి ఇంకొకదాని భాగము కావాలంటే, అది దాని ముక్కయైనా కావాలి, అంశ అయినా కావాలి. పండుముక్క, పండువలె జీవాత్మ పరమాత్మ భాగముకాదు. ఒక 'విత్తు' ఎలా తన చెట్టుయొక్క అంశయో, జీవాత్మ ఆ పరమాత్మ యొక్క విత్తులో అంశ. చెట్టు కాగల సంభవము వున్నట్లు, జీవాత్మ ఆ పరమాత్మ స్థితినందగల సంభవము కలదు. అవిద్యమాసినపుడు అలాగే అవుతుంది.

(ఋ.వే. X-90-3; య.వే. 31-3; ఛాం.ఉ. III-12-6)

## (261) II.3.45

సూ. **అపి చ స్మర్యతే**

క్ర. **అపి, చ, స్మర్యతే**

ప్ర.అ. అపి = **కూడా,** చ = **అట్లే,** స్మర్యతే = **స్మృతి కూడా చెప్పినది.**

వి. **స్మృతియైన భగవద్గీత కూడా జీవాత్మ, ఆ పరమాత్మయొక్క అంశమని చెప్పినది.**

**"అరయ జీవలోకమందు జీవమ్మయగుచు**
**చేరి నాయంశ అది సనాతనంబు**
**ప్రకృతి స్థానమందుండి మనముగూడి**
**ఆరు ఇంద్రియముల కర్షించుచుండు"** (భ.గీ. XV-6)

**అదేకాక, విభూతియోగములో**

**"శూర! ఇదియేల, అదియేల ఇన్నియేల**
**ఇవి యన్నయును నీవు తెలియుటేల**
**సర్వములు భూతములన్నియునుగూడ**
**చేరి నా ఏకాంశమున ఇమిడియుండు" (భ.గీ. X-42)**

**మొత్తము జగత్తే పరమాత్మ యొక్క అంశము. ఈ విధముగా జీవాత్మ పరమాత్మ యొక్క అంశము.**

(భ.గీ. XV-6), (భ.గీ. X-42)

## (262) II.3.46

సూ. ప్రకాశాదివన్నైవం పరః

క్ర. **ప్రకాశాదివత్, న, ఏవం, పరః**

ప్ర.అ. ప్రకాశాదివత్ = **ప్రకాశము మొదలైన వాటివలె,** న = **కాదు,** ఏవం = **ఈ ప్రకారము,** పరః = **పరమాత్మ**

వి. ప్రకాశము తన అంశరూపమైన కిరణముల దోషమును అంటియుండదు, చెందదు. కిరణములు స్వచ్ఛము, అస్వచ్ఛము అయిన తావులయందు చేరినను సూర్యునకు అస్వచ్ఛము కాని, స్వచ్ఛముకాని అంటదు. వెలుగు చేతులపై పడి నీడలు వంకరగా వున్నను, ఆ వంకరలు సూర్యునకు అంటవు. అదే విధముగా పరమాత్మ తన అంశరూపమైన జీవాత్మ కర్మలను, కర్మదోషములను,

సుఖదుఃఖములను ఏ మాత్రము అంటునందదు మరియు వాటివలన ఏ ప్రభావము పరమాత్మపై వుండదు.

"సూర్యోయథా సర్వలోకస్య చక్షుః,
న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః॥" (కఠ.ఉ. II-2-11)

"ఏ విధముగా సర్వలోకముల నేత్రరూపమైన సూర్యభగవానుడు మనుజుల నేత్ర దోషముల అంటునందడో, అదే విధముగా సమస్త జీవుల ఏకమాత్ర పరమాత్మ కూడా లోకముల, లోకుల దుఃఖములను అంటునందకనే యుండును."

పరమాత్మ జీవుల సుఖదుఃఖములకు లిప్తము కాకయుండును. జీవుని సుఖదుఃఖములు కూడ, ఉపాధులైన శరీరాదుల అంటువలనయగును.

ఉపాధుల ప్రభావమును దాటిన యోగిని కూడా దోషములు అంటవు.

"బ్రహ్మణ్యాధాయ కర్మాణి,
సంగం త్యక్త్వాకరోతియః।
లిప్యతే నస పాపేన
పద్మపత్రమివాంభసా"॥ (భ.గీ. V-10)

**"కర్మముల నర్పించి బ్రహ్మమ్మునందు**
**మరి చేయునెవరు సంగమ్మువీడి**
**యరయ అంటబడదు పాపములచేత**
**నీటి పైన దేలు పద్మమ్మునటుల"** (భ.గీ. V-10)

**యోగులచే సమర్పించబడిన సంగరహితకర్మల వలన కూడ, పరమాత్మ ఏ దోషమును అందియుండడు. ఆ అర్పించబడిన కర్మలు దోషరహితములు మరియు పరమాత్మను పుణ్యపాపములు అంటవు.**

(కఠ.ఉ. II-2-11; భ.గీ. V-10)

---

## (263) II.3.47

**సూ. స్మరంతి చ**

**క్ర. స్మరంతి, చ**

**ప్ర.అ.** స్మరంతి = **స్మృతులు చెప్పుచున్నవి,** చ = **కూడ**

**వి.** "జీవాత్మ అంతరములో వుంది. పరమాత్మ జీవాత్మ యొక్క గుణదోషములు, సుఖదుఃఖములచేత ప్రభావితముకాదు" (భ.గీ. 13-32) అని స్మృతి కూడా స్పష్టము చేసినది.

"నిర్గుణత్వమ్ము మరి అనాదిత్వమ్ము
పరమాత్మ వినుము నవ్యయమ్ము
శరీరస్థమై యుండియు కౌంతేయచూడ

కర్తగాదు మరియు లిప్యంబుగాదు" (భ.గీ. XIII-32). పైన ముందు చెప్పినట్లు (సూ. 262) పద్మపత్రమువలె జీవునికర్మములు దోషములు తనకు అంటకుండా వుండును. (భ.గీ. XIII-32)

## (264) II.3.48

**సూ. అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధాజ్జ్యోతిరాదివత్**

**క్ర. అనుజ్ఞాపరిహారౌ, దేహసంబంధాత్, జ్యోతిరాదివత్**

ప్ర.అ. అనుజ్ఞాపరిహారౌ = **విధి, నిషేధము (చేయటము, చేయక పోవటము, చేయవలసినవి, చేయకుండవలసినది),** దేహసంబంధాత్ = **శరీర సంబంధము వలన,** జ్యోతిరాదివత్ = **జ్యోతిమొదలైనవాటి వలన**

వి. శరీరముల వైభిన్యము (వేరు వేరు వుండుట) వలన జీవాత్మ యొక్క సంబంధము, వేరు వేరు శరీరములననుసరించి చేయబడినది. అది యధోచితము. బలమైన శరీరముల వారిని రక్షకభటులుగా, పొడుగుగా వున్నవారిని బుట్ట బంతి ఆటగాళ్లుగా విధి, నిషేధములు చెప్పబడినవి. అగ్ని అనేది ఒకటే అయినా స్మశానములోని అగ్నిని వదలివేయటము, యజ్ఞములోని అగ్నిని పూజించటము యోగ్యముకదా. **యోగులచే సమర్పించిన సంగరహిత కర్మల వలన కూడ, పరమాత్మకు ఏ దోషమును అంటియుండదు. అ అర్పించబడిన కర్మలు దోషరహితము మరియు పరమాత్మను పుణ్యాపాపములు అంటవు.**
(కఠ.ఉ. II-2-11; భ.గీ. V-10)

## (265) II.3.49

**సూ. అసంతతేశ్చావ్యతికరః**

**క్ర. అసంతతేః, చ, అవ్యతికరః**

ప్ర.అ. అసంతతేః = **(శరీరావరణము చేత) వ్యాపకత నిరోధింపబడుట వలన,** చ = **కూడ,** అవ్యతికరః = **వారి వారి కర్మలు మిళితములు కావు.**

వి. జీవాత్మకు అన్ని శరీరాలతో సంబంధము వుండదు. కావున కర్మఫలసంకరము వుండదు. కర్త, భోక్త అయిన జీవాత్మకు అన్ని శరీరములతో సంబంధము వుండదు. **ఒక శరీరములోని జీవాత్మకు, ఇంకొక శరీరములోని జీవాత్మకు సంబంధము లేదు కనుక, కర్మఫలము అనుభవించటములో సౌకర్యము ఒకరి కర్మ ఫలమును ఇంకొకరు అనుభవించటము వుండదు.**

## (266) II.3.50

**సూ. ఆభాస ఏవ చ**

**క్ర. ఆభాసః, ఏవ, చ**

ప్ర.అ. ఆభాసః = **మోహము, అనిపించేది మాత్రమే కాని యధార్థముకానిది (ఎండమావివలె),** ఏవ = **అవును,** చ = **కూడ**

వి. **కొందరు జీవాత్మ ఆ పరమాత్మ యొక్క అంశము కాదు మరియు అది స్వతంత్రము అని చెప్పుతర్కము, చేయువాదము అభాసయే.** (ముత్యపు చిప్పపై వెండి, ఎండమావిలో నీరు, బొమ్మలో వున్న పక్షి) కాని యధార్థము కాదు. అందువలన కూడ ఆవాదము స్వీకార్యము కాదు. నీటిలో కనిపించే సూర్యుడు నిజమైన సూర్యుడు కాడు. **జీవుడు పరమాత్మ యొక్క ఆభాసమాత్రమే.** నిజముగా స్వయము పరమాత్మ కాదు (అవిద్య వున్నంతవరకు).

అవిద్య అనే నీరు ఇరిగిపోయి లేకుండా అయినపుడు ప్రతిబింబము వుండదు. ఒక సూర్యడే వుంటాడు. అయితే నీళ్లలోని సూర్యుడు నిజమైన సూర్యుడు కాకపోయినా సూర్యునికన్న భిన్నముకూడా కాదు. అభిన్నము. ఒక కుండను కదిలిస్తే దానిలోని సూర్యబింబము కదులుతుంది కాని వేరుకుండల ప్రతిబింబములు కదలవు. అదే విధముగా జీవులందరూ పరమాత్మ యొక్క అభాసలైనా, ఒక జీవుని కర్మఫలములు వేరే జీవులు పొందరు. **జీవుడు పరమాత్మ యొక్క అభాస. ఐనా పరమాత్మ కన్నా భిన్నము కాదు అభిన్నమే.**

## (267) II.3.51

సూ. **అదృష్టానియమాత్**

క్ర. **అదృష్ట అనియమాత్**

ప్ర.అ. అదృష్ట = **వేరు జన్మములందు చేసిన కర్మల ఫలముల భోగముల వ్యవస్థ గూర్చి,** అనియమాత్ = **ఏ నియమము లేనందున**

వి. **జీవుడు పరమాత్మ అంశయని మన్నించక వేరనీ స్వతంత్రుడనీ మన్నించిన యెడల కర్మఫలభోగవ్యవస్థ కుదరదు. చేసిన ఫలములు జీవుడు అనుభవించుట సరియైన వ్యవస్థ. ఆ వ్యవస్థ నియామకుడే పరమాత్మ.** అందువలన శ్రుతి చెప్పిన రీతిగా సర్వశక్తివంతుడైన బ్రహ్మ (పరమాత్మ) సర్వులకు (అందరికీ) కర్మఫలభోగమును యథాయోగ్యముగా జరిగే వ్యవస్థ చేయును అని మన్నించుటయే భావ్యము, యోగ్యము, సమంజసము. **అట్టి నియమములేని కర్మఫలభోగము అదృష్టమని (తెలియనిది, చూడబడనిది) అని భావించుట అసమంజసము. జీవాత్మల యథాయోగ్య, పరమాత్మ నియామక కర్మఫలభోగము సమంజసము.**

## (268) II.3.52

సూ. **అభిసంధ్యాదిష్వపి చైవం**

క్ర. **అభిసంధ్యాదిషు, అపి, చ, ఏవం**

ప్ర.అ. అభిసంధ్యాదిషు = **సంకల్పాదులయందు,** అపి = **కూడ,** చ = **మరియు,** ఏవం = **ఈ విధముగానే**

వి. జీవేశ్వరుల సంబంధము అంశ-అంశిభావము సరికాదని, ఘటాకాశమువలె కేవలము ఉపాధి నిమిత్తముగా ప్రతీతమగునని మన్నించినచో, కర్మఫలభోగవ్యవస్థ ఉండజాలని దోషమువలె (పరమశ్వేర నియామకవ్యవస్థ లేనపుడు) జీవుల సంకల్పము, ఇచ్ఛ, నిర్ణయముల వ్యవస్థ కూడ,

జీవాత్మ-పరమాత్మ అంశ కాదనిన ఏర్పడజాలదు. **అందువలన శ్రుతులయందు చెప్పబడిన సంకల్పపూర్వక, ఈక్షణపూర్వక జగదుత్పత్తి, సర్వభూతోత్పత్తి కలుగు వర్ణన, పరబ్రహ్మయొక్క సర్వజ్ఞత, సర్వేశ్వరత, సర్వాధిపత్యము, సమంజసము మరియు సమ్మతము.**

## (269) II.3.53

**సూ. ప్రదేశాదితి చేన్నాంతర్భావాత్**

**క్ర. ప్రదేశాత్, ఇతి, చేత్, న, అంతర్భావాత్**

**ప్ర.అ.** ప్రదేశాత్ = **ఉపాధుల పరస్పర దేశభేదములుండుట వలన,** ఇతి = **అనిన,** చేత్ = **యెడల,** న = **అట్లు కాదు,** అంతర్భావాత్ = **అన్ని దేశముల ఉపాదులలోను, ఆ ఉపాధుల దేశములలోను అంతర్భావము (పరమాత్మలోనయున్న భావము) కలదు.**

**వి.** ఉపాధులలో దేశభేదముండుట వలన వేరువేరైన విభాగముండి దాని నుండి కర్మఫలభోగ సంకల్పాదుల వ్యవస్థ చేయబడగలదు అని అంటే అది సరికాదు మరియు కుదరదు. ఎందుకంటే సర్వవ్యాప్తి, సర్వేశ్వరుడు అయిన పరమాత్మ సర్వోపాధులలో, అందరియందు వున్నాడు.

ఉపాధుల దేశభేదమువలన పరమేశ్వరుని దేశభేదము ఏర్పడదు. జలాశయముల దేశభేదము వలన సూర్యునకు దేశభేదము వుండదు. కుండల చోటులు మారిన ఆకాశము చోటు మారదు. సూర్యుడు, ఆకాశము ఏకము, సర్వత్రము వుండి జలాశయములు, కుండలు ఎక్కడవున్నా వాటియందు ప్రతీతమని అనిపించబడుచుండును. కుండలు, కదలును, ఆకాశము వుండును. **అదేవిధముగా పరమాత్మ సమస్త ఉపాధులలో సర్వదేశములలో అభేదముగా విరాజమానమై వుండును. ఆ విధముగా పరమాత్మ జీవాత్మల అంశి-అంశభావము ఉపాధి నిమిత్తము కాదు. ఆ భావము సర్వత్రము. సర్వదేశ, సర్వకాల, సర్వపరిస్థితి, సర్వజీవ సత్యము.**

ఇట్లు

**ద్వితీయాధ్యాయ తృతీయ పాదము**

# ద్వితీయాధ్యాయ తృతీయ పాద సమాసము

## స్వావిరోధ నిరూపణ

**1. వియదధికరణము**

ఆకాశము యొక్క ఉత్పత్తి చెప్పబడలేదనుట సరికాదు. ఆకాశము యొక్క ప్రకటనము చెప్పబడినది. ఆకాశము యొక్క ఉత్పత్తిని గూర్చి చెప్పినది గౌణము. వస్తువుల ఉత్పత్తితో ఆకాశము ప్రకటనము అవుతుంది. బ్రహ్మము ఆకాశముగా ప్రకటనము అయినది. ఆకాశము అమృతము.

**2. మాతరిశ్వాధికరణము**

ఏ విధముగా ఆకాశము యొక్క ఉత్పత్తి చెప్పకపోయినా అది ప్రకటము అయినట్లు, ఛాందోగ్యములో వాయుఉత్పత్తి చెప్పక పోయినా అది ప్రకటము అయినది. ఆకాశము, వాయువు అమృతములు.

**3. అసంభవాధికరణము**

బ్రహ్మమునకు ఉత్పత్తి లేదు. బ్రహ్మము అనాది మరియు అనంతము. ఎప్పుడూ వుండేది బ్రహ్మమే.

**4. తేజోధికరణము**

తేజము బ్రహ్మము నుండి ఉత్పత్తి అయినది. ఆ బ్రహ్మము తేజమును సృజించినది. వాయుభావాన్ని చెందిన బ్రహ్మమునుండి తేజము సృజనము అయినది.

**5. అబధికరణము**

బ్రహ్మస్వరూపమైన వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము ఉద్భవించినది. జలమునకు కూడా మూలము బ్రహ్మమే.

**6. పృథివ్యధికారాధికరణము**

జలము ఉత్పత్తి తరువాత పృథివి ఉత్పత్తి అయినది. జలము అన్నమును సృజించినది అని అనుటలో అన్నము అంటే ఐదవ తత్త్వమైన పృథివి అని అర్థము. జలము నుండి పృథివి, పృథివి నుండి అన్నము వచ్చినవి.

**7. తదభిధ్యానాధికరణము**

అన్నిటి యందు వుంటూ, అన్నిటినీ ప్రవర్తింపచేసేది బ్రహ్మమే. అన్నింటినీ నియమించుట అనేది, ఆత్మయే కర్త అవటానికి గుర్తు, లింగము.

**8. విపర్యయాధికరణము**

కారణబ్రహ్మము నుండి సృష్టిసమయములో కార్యములైన భూతములు జగత్తు సృష్టిక్రమములో అనులోమపద్ధతిలో ఉత్పన్నమౌతాయి. ఆ విధముగా ప్రళయసమయములో భూతములు, జగత్తు విలోమపద్ధతిలో కారణమైన బ్రహ్మమునందు విలీనమౌతాయి.

**9. అంతరావిజ్ఞానాధికరణము**

బ్రహ్మము నుండి ఆకాశాది పంచభూతముల ఉత్పత్తి లయములను వర్ణించుటలో భూతసంబంధమైన అంతరములైన ఇంద్రియాల ఉత్పత్తి చెప్పటము అయినదనుట సమంజసము. భౌతికమైన పంచ జ్ఞానేంద్రియములు, భౌతికమైన పంచభూతముల ప్రతిబింబములు మరియు రూపములే.

**10. చరాచరవ్యపాశ్రయాధికరణము**

జీవునికి మృత్యువులేదు. జీవుడు శాశ్వతము, అమృతము. జన్మమరణములనే వ్యవహారము స్థావరజంగమాత్మకమైన శరీరమునకేగాని జీవునికి చెందినదికాదు. జీవాత్మ నిత్యము.

**11. ఆత్మాధికరణము**

జీవాత్మకు ఉత్పత్తి లయములు లేవు. జీవాత్మ యొక్క నిత్యత్వము శృతిస్మృతుల ప్రమాణసిద్ధము, పరమ సత్యము.

**12. జ్ఞాధికరణము**

ఆత్మ నిత్యుడు, జ్ఞాత, చైతన్యస్వరూపుడు. జీవాత్మ నిత్య చైతన్యజ్ఞాన స్వరూపుడు.

**13. ఉత్క్రాంతిగత్యధికరణము**

శరీరనాశముతో ఆత్మనాశము లేదు. రావటము పోవటము అనునది మహత్పరిమాణుడు అయిన బ్రహ్మమునకు కాదు. జీవుడు (అవిద్యలో వున్నప్పుడు) అణుపరిమాణుడు. జీవుడు నిత్యుడు మరియు రావటము పోవటము వున్నది కనుక చలన స్వభావుడు. అజుడు, మహానుడు అని చెప్పినది పరమాత్మ గురించి, జీవుని గురించి కాదు. జీవాత్మ సర్వాంగచైతన్యము మరియు **అది** ప్రదేశపరిమితము కాదు. ఆత్మ హృదయములో వుంది. దీపము నుండి వెలుగువలె, శరీరమంతా చైతన్యరూపములో ప్రసరించి వుంటుంది. ఆత్మ సర్వేంద్రియములను, అంతరంగమును చైతన్యముతో నింపి వుంటుంది. అణుప్రమాణమైనా అంతా వుంటుంది. చేతనుడైన ఆత్మ సాధనములైన బుద్ధి, జ్ఞానములకన్న వేరు మరియు మిన్న. అవిద్యలేనపుడు ఆత్మ, పరమాత్మల భేదములేదు. సమ్యక్‌దర్శనము అయినపుడు ఉపాధులు నశించి జీవాత్మ పరమాత్మభేదము విలీనము అవుతుంది. బుద్ధి, చిత్తము, మనస్సు, అహంకారము అనే నాల్గింటి కూడికయైన అంతఃకరణము యొక్క సంబంధము ఆత్మకు సంసారిత్వమును అతికిస్తుంది. ఆ అతుకులేనపుడు ఆత్మ అనంత పరమాత్మ.

**14. కర్త్రధికరణము**

జీవాత్మయేకర్త. స్వప్న విహారము కల జీవాత్మ కర్త. జడ ప్రకృతికి స్వేచ్ఛాపూర్వక ప్రవృత్తి వుండదు. ఇచ్చిపుచ్చుకొనుట వలన జీవాత్మకు కర్తృత్వము కలదు. పరమాత్మకు కర్తృత్వము, ఇచ్చిపుచ్చుకొనుటలు లేవు. జీవునికి అశుభకర్మల ప్రమాదము నుంచి దూరము అగుచుండి, తన స్వభావమును పరిష్కరించి అశుభకర్మల నివృత్తి, శుభకర్మల ప్రవృత్తివైపు పురోగమించగల స్వతంత్రత కలదు. జీవుడు పరతంత్రుడు మరియు స్వతంత్రుడు. జీవుడు తన ప్రారబ్ధకర్మల ప్రకారము పరమేశ్వరుడు విధించిన శుభాశుభ పరిస్థితులు తటస్థించుటలో పరతంత్రుడు. కాని ఆ

శుభాశుభకర్మలు తటస్థించినపుడు, అదే పరమేశ్వరుడు ప్రసాదించిన బుద్ధి, వివేకములతో అశుభకర్మలను వదలివేసి, శుభకర్మలవైపు ప్రవృత్తి కావటము ఎన్నుకొనుటములో స్వతంత్రుడు. ప్రేయస్సు వదలి శ్రేయస్సును ఎన్నుకొని పురోగమించటములో జీవాత్మకు స్వతంత్రత కలదు. జీవుని కర్తృత్వము, స్వరూపగతము మరియు స్వాభావికము కావు. కాని, అనాది సిద్ధమైన అంతః కరణ సంబంధమువలన కర్తృత్వము అవుతుంది.

## 15. తక్షాధికరణము

జీవాత్మ వడ్రంగివలె అంతఃకరణముల, ఇంద్రియముల సంబంధము (పరికరముల సంబంధము) వున్నప్పుడు కర్త. ఆ సంబంధము లేనపుడు కర్తగా కాక (అకర్తగా) వుండును. జీవాత్మ కర్తృత్వము స్వభావసిద్ధముకాదు, తన బుద్ధి, చిత్తము, మనస్సు, అహంకారముల అంటువలన వచ్చును. అంటులేని జీవాత్మ పరమాత్మ.

## 16. పరాయత్తాధికరణము

జీవాత్మ ఎన్నో విధాల పరమాత్మాధీనము. జీవాత్మ యొక్క అనాది ప్రారబ్ధముననుసరించి, పరమాత్మ శుభాశుభకర్మఫలములను జీవునికి కల్గిస్తుంటాడు. అయితే అవి ఎదురైనపుడు అశుభముల నివృత్తి, శుభముల ప్రవృత్తి మార్గమును యోచించేవివేకము, బుద్ధి కూడా పరమాత్మ ఇస్తాడు. ఆ బుద్ధిని, వివేకమును ఉపయోగించుకొని శుభమార్గములో నడిచేందుకు శక్తి, యుక్తి, సహయోగము గూడా పరమాత్మ ప్రసాదిస్తాడు. ఆ విధముగా జీవుడు, తన స్వభావమును పరిష్కారము, సుధారణము చేసుకొనే అవకాశము కలదు. ఆ విధముగా పరమాత్మ జీవాత్మకు సమస్య, సమాధానము, సాధనములు మరియు శక్తి ఒకేసారి కల్గిస్తాడు. ఈ విధముగా జీవుడు జీవాత్మ పరాయత్తము మరియు పరమాత్మాయత్తము. పరమాత్మాయత్తుడైన జీవుడు, సమస్య ఎదుర్కొని, సమాధానమును అర్థము చేసుకొని, సాధనములను ఉపయోగించి, శక్తిని ప్రయోగించి, నిరంతర సాధనతో తన్ను తాను ఉద్ధరించగలడు. ఈ విధముగా జీవుడు స్వాయత్తము. **జీవాత్మ పరాయత్తము మరియు స్వాయత్తము. జీవాత్మ పరతంత్రుడు మరియు స్వతంత్రుడు. ప్రారబ్ధ సమస్యలలో పరతంత్రుడు. ప్రస్తుత సమాధానము, సాధనలో స్వతంత్రుడు.**

## 17. అంశాధికరణము

**జీవాత్మ, పరమాత్మయొక్క అంశము. అవిద్య వున్నపుడు జీవాత్మ, పరమాత్మయొక్క అంశము. అవిద్య తొలగినపుడు జీవాత్మ పరమాత్మయే.** జీవుని దోషములు పరమాత్మకు అంటవు. జీవుడు పరమాత్మయొక్క ఆభాస. జీవుడు పరమాత్మ యొక్క ఆభాస అయినా, పరమాత్మకన్న భిన్నముకాదు. పరమాత్మ సమస్తఉపాధులలో సర్వదేశములలో, సర్వదేహములలో అభేదముగా విరాజమానమై వుండును. పరమాత్మ జీవాత్మల 'అంశి-అంశ'భావము ఉపాధి నిమిత్తము కాదు. ఆ భావము సర్వత్రము, సర్వదేశ, సర్వకాల సర్వపరిస్థితి, సర్వజీవ సత్యము.

ఇట్లు

**ద్వితీయాధ్యాయ తృతీయ పాద సమాసము**

# ద్వితీయాధ్యాయ తృతీయ పాద సారము

## స్వావిరోధ నిరూపణ

దేని నుండి ప్రకటమైన, ఉత్పత్తి చెప్పబడని ఆకాశము అమృతమో, అట్లే దేని నుండి ప్రకటమైన మరియు ఉత్పత్తి చెప్పబడిన వాయువు కూడా అమృతమో, దేనికి ఉత్పత్తి లేదో మరియు ఏది అనంతమై ఎప్పుడూ వుండేదో, వాయుభావాన్ని చెందిన దేని నుండి తేజము సృజించబడినదో, దేని రూపమైన వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము ఉద్భవించినదో మరియు జలమునకు మూలము కూడా నేదియో, దేని రూపము అయిన వాయువు నుండి వచ్చిన అగ్ని. అగ్ని నుండి వచ్చిన జలము నుండి పృథివి, పృథివి నుండి అన్నము ఉత్పత్తి అయినదో, ఏది అన్నిటియందు వుంటూ అన్నిటిని ప్రవర్తింపచేసేదియో మరియు అన్నింటిని నియమింప చేయటము దేని లింగముయో, దేని నుండి సృష్టి సమయములో భూతములు అనులోమ పద్ధతిలో ఉత్పన్నమై ప్రళయ సమయములో దేనిలో విలోమ పద్ధతిలో విలీనము అవుతాయో, దేని నుండి వచ్చిన భౌతికమైన పంచభూతములతో పాటు ఉద్భవిల్లిన పంచేంద్రియములు ఆ పంచభూతముల అనురూప ప్రతిబింబము అయిన జీవాత్మ నిత్యము, అమృతము మరియు జననమరణ సంబంధములు లేనిదో, దేని అనురూపము ప్రతబింబము అయిన జీవాత్మకు ఉత్పత్తి లయములు లేవో, దేని అనురూపము, అంశఅయిన జీవాత్మ నిత్యుడు, జ్ఞాత, చైతన్య స్వరూపుడుయో, దేని గూర్చి తెలిస్తే విద్య అయితే దానికి, జీవాత్మకు బేధము వుండదో, ఏది ప్రసాదించిన బుద్ధితో జీవాత్మ కర్తగా తన ప్రారబ్ధ కర్మల ప్రకారము అదియె విధించిన శుభాశుభకర్మలను ఎన్నుకొనుటలో స్వతంత్రమో, తనకు బుద్ధి-చిత్తము- అహంకారము- కర్తృత్వము అనే అంటులు లేని జీవాత్మ ఏది అవుతుందో, జీవాత్మ అంటువున్నపుడు తన రూపము అంటులేనపుడు దేని రూపము అను రెండు రూపములు వద్రంగివలె అందుచున్నాడో, జీవాత్మ ప్రారబ్ధ సమస్యలలో పరతంత్రుడుగా దేని ఆధీనములో వుండి ప్రస్తుత సమాధానము సాదనలో స్వతంత్రుడో, జీవాత్మదేని అంశమో మరియు అవిద్య తొలగినపుడు ఏది అవుతాడో మరియు జీవాత్మదేని అభాసమో అదియే బ్రహ్మము.

ఇట్లు
ద్వితీయాధ్యాయ తృతీయ పాద సారము



# II.4

# ద్వితీయ అధ్యాయము - చతుర్థ పాదము

## ప్రాణాదివాక్య విరోధ పరిహారము

## 1. ప్రాణోత్పత్త్యధికరణము (78)

### (270) II.4.1

**సూ. తథాప్రాణాః**

**క్ర. తథా, ప్రాణాః**

ప్ర.అ. తథా = **అదే విధముగా,** ప్రాణాః = **ప్రాణ శబ్ద వాచ్యమైన ఇంద్రియములు కూడా**

వి. **ఏ విధముగా ఆకాశాది పంచభూతములు పరబ్రహ్మ నుండి ప్రాదుర్భవించినవో, అదే విధముగా సమస్త ఇంద్రియములు కూడా ఆ పరబ్రహ్మ నుండే ఉద్భవించినవి. ఎందుకంటే ఆకాశాది పంచభూతములు మరియు ఇంద్రియముల ఉత్పత్తిలో ఏమీ భేదము లేదు.**

ముండక ఉపనిషత్తులో

"ఏతాస్మాజ్జాయతే ప్రాణో, మనః సర్వేంద్రియాణి చ।
ఖం వాయుర్జ్యోతిరాపః, పృథివీ విశ్వస్యధారిణీ"॥ (ముం.ఉ.II-1-3)

"ఆ పురుషుని నుండి, పరబ్రహ్మము నుండియే ప్రాణములు, మనస్సు, సమస్త ఇంద్రియములు మరియు ఆకాశము, వాయువు, అగ్ని, విశ్వమును ధరించు పృథివి జనించినవి". దీని నుంచి ఏ బ్రహ్మము నుండి ఆకాశాది పంచభూతములు జనించినవో, ఆ బ్రహ్మము నుండియే ప్రాణాది సర్వఇంద్రియములు జనించినవని స్పష్టము. మరల ఇదే విషయము (ముం.ఉ. II-1-8) లో "సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్" "అందు నుండి ఏడు ప్రాణములు పుట్టుతున్నవి" అని చెప్పబడినది. "ఆ పురుషుడు ప్రాణాలను సృష్టించినాడు. ప్రాణముల నుండి శ్రద్ధను, ఆకాశమును, వాయువును, తేజమును, జలమును, పృథివిని, ఇంద్రియాలును, మనస్సును, అన్నాన్ని సృష్టించాడు" (ప్ర.ఉ. VI-4) **ఈ విధముగా బ్రహ్మము నుండి ప్రాణములు, ఇంద్రియములు ప్రాదుర్భవము అయినవి. అవి బ్రహ్మవికారములు.**

(ముం.ఉ. II-1-3, II-1-8; ప్ర.ఉ. VI-4)

### (271) II.4.2

**సూ. గౌణ్యసంభవాత్**

**క్ర. గౌణీ, అసంభవాత్**

ప్ర.అ. గౌణీ = **గౌణము, మఖ్యముకానిది,** అసంభవాత్ = **సంభవము కానందు వలన**

వి. **ప్రాణోత్పత్తి విషయము గౌణము (ముఖ్యము కాదు) అని అనటము అసంభవము.** ఎందుకంటే ముండకఉపనిషత్తులో గృహస్థుడగు శౌనకుడు అంగీరసుని విధిప్రకారము సమీపించి, పూజించి

అడిగెను "ఓ భగవంతా! దేనిని తెలిసికొనిన అన్నియును తెలిసినట్లు అవుతుంది" (ముం.ఉ. I–1–3). ఈ ప్రశ్న చాల ముఖ్యము, మౌలికము. ఈ ప్రశ్నకు సమాధానము చెబుతూ అంగీరస మహాముని ఎన్నియో విషయములు, సృష్టి రహస్యములు తెలిపి ఇలా అన్నాడు.

"ఆ పురుషుని నుండి యే ప్రాణములు, మనస్సు, సమస్త ఇంద్రియములు మరియు ఆకాశము, వాయువు, అగ్ని, విశ్వమును ధరించు పృథివి జనించినవి" (ముం.ఉ. II–1–3)

**ఈ విజ్ఞానము ముఖ్యము, ఏ మాత్రము గౌణముకాదు మరియు మొట్టమొదలె ప్రాణము గూర్చి చెప్పబడినది. ప్రాణోత్పత్తి బ్రహ్మము నుండియే జరిగినది.**

(ముం.ఉ. I–1–3, II–1–3)

## (272) II.4.3

**సూ. తత్ప్రాక్శ్రుతేశ్చ**

**క్ర. తత్, ప్రాక్, శ్రుతేః, చ**

ప్ర.అ. తత్ = **అది,** ప్రాక్ = **పూర్వ,** శ్రుతేః = **శ్రుతి వలన,** చ = **కూడ**

వి. **బ్రాహ్మణములలో, ఉపనిషత్తులలో ఇంద్రియములఉత్పత్తి, పంచతత్త్వముల పూర్వమే చెప్పబడినది. శతపథబ్రాహ్మణములో** (శతపథ. బ్రా.ఉ. VI–1–1) **ఇంద్రియముల ఉత్పత్తి పంచభూతములకన్న ముందే అయినది అని చెప్పబడినది.**

ముండకోపనిషత్తులో (ముం.ఉ.II–1–4; ప్ర.ఉ.VI–4; బ్రహ్మసూత్రము 271 చూడవలయును) "ఆ పురుషుడు ప్రాణాలను సృష్టించినాడు ప్రాణముల నుండి శ్రద్ధను, ఆకాశమును, వాయువును, తేజమును, జలమును, పృథివిని, ఇంద్రియములను, మనస్సును, అన్నాన్ని సృష్టించినాడు".

"జాయతే" (జనియింపచేసినాడు) అనే పదము ప్రాణాలకు మొదలు అన్వయించి తరువాతనే ఆకాశాదులకు అన్వయించబడినది. కనుక ప్రాణోత్పత్తి గౌణముకాదు. చాలా ముఖ్యము. ఉపనిషత్తుల్లో ప్రాణములు, శ్రద్ధ, ఆకాశము తరువాత చెప్పబడిన తేజము నుండి ఇంద్రియముల వరకు చెప్పినది నిజముగా గౌణము.

"జాయతే" అనే పదము ఒకటే ప్రాణము, మనస్సు, ఇంద్రియాలు, ఆకాశాదులు అన్నింటికి చెప్పినపుడు ఒక్క ప్రాణాల పుట్టుకకు మాత్రము గౌణము కానేరదు. ఒకవేళ అది గౌణము అయితే సృష్టి అంతా గౌణము అవుతుంది. అది అసమంజసము. **ప్రాణములు, ఇంద్రియములు, భూతములు అన్నీ బ్రహ్మము నుండియే వచ్చినవి.**

## (273) II.4.4

**సూ. తత్పూర్వకత్వాద్వాచః**

**క్ర. తత్పూర్వకత్వాత్, వాచః**

ప్ర.అ. తత్పూర్వకత్వాత్ = **తేజము, జలము, అన్నము పూర్వమునందు వున్నది అనటము వలన,** వాచః = **వాక్కు, ప్రాణము, మనస్సుల యొక్క ఉత్పత్తి**

వి. తేజము, జలము, అన్నము పూర్వమునందు వున్నవని అనటము వలన కూడ ప్రాణములకు

ఉత్పత్తి వున్నది.

"సత్తుగానున్న ఈ దేవతను నేనిక జీవాత్మ రూపములో ఈ ముగ్గురు దేవతల యందు ప్రవేశింపచేసి (అగ్ని, జలము, అన్నముల యందు) నామ రూపములను వ్యక్తపరచవలయునని సంకల్పించెను" (ఛాం.ఉ. VI-3-1,3)

ఈ విధముగా బ్రహ్మ జీవాత్మ రూపముతో ప్రవేశించి, తానే నామ రూపజగత్తును సృష్టించెను. మనస్సు అనేది అన్నము (పృథివి) యొక్క వికారము, ప్రాణాలు జలవికారము, వాక్కు తేజోమయము (ఛాం.ఉ. 6-5-4)

ఈ విధముగా వాక్కు, మనస్సు, ప్రాణం అనేవి బ్రహ్మము నుండి సృజించబడినవి. (బ్ర.సూ.II-4-3) 272వ సూత్రములో ముండకోపనిషత్తు ప్రకారము పురుషుడు ప్రాణాలను, శ్రద్ధను, ఆకాశమును, వాయువును, తేజమును, జలమును, ప్రథ్విని, ఇంద్రియములకు మనస్సును, అన్నాన్ని సృష్టించినాడు అని చెప్పటములో ప్రాణము తరువాత తేజము, జలము, పృథివీ (ఈ మూడు కలిసి "వాచా") వాక్కు మరియు ఇంద్రియములు జనించబడినవి అని స్పష్టము. **అంటే ప్రాణోత్పత్తి ముఖ్యము. తేజము నుండి వాక్కు మొదలైనవాని ఉత్పత్తి గౌణము, ప్రధానము కాదు.** (ఛాం.ఉ. VI-3-1,3, VI-5-4; బ్ర.సూ.II-1-3)

## 2. సప్తగత్యధికరణము (79)

## (274) II.4.5

**సూ. సప్త గతేర్విశేషితత్వాచ్చ**

**క్ర. సప్తగతేః, విశేషితత్వాత్, చ**

**ప్ర.అ.** సప్తగతేః = **ఇంద్రియములు ఏడు అని తెలియుచున్నది,** విశేషితత్వాత్ = **విశేషముగా సంకేతము చేయబడినందున**

**వి. ఉపనిషత్తులలో ఇంద్రియములు ముఖ్యముగా ఏడని వర్ణించబడినది. ఇవియే సప్తప్రాణములు. అవి కన్నులు, చెవులు, నాసిక, నాలుక, చర్మము, వాక్కు మరియు చర్మము.** కొన్ని చోట్ల రెండు నేత్రములు, రెండు నాసారంధ్రములు, రెండు చెవులు మరియు నాలుక కలిసి సప్తప్రాణములు అని చెప్పబడినది. ఈ సప్తప్రాణములు సప్తలోకములలో చరిస్తుంటాయి.

ముండకోపనిషత్తులో

"సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్, సప్తార్చిషః సప్త హోమాః,

సప్తః ఇమేలోకా యేషు చరంతి ప్రాణాః, గుహాశయా నిహితః సప్తసప్త (ముం.ఉ. II-1-8)

"ఆ పురుషుని నుండియే సప్తప్రాణములు ఉత్పన్నమైనవి. దాని నుంచియే అగ్ని యొక్క ఏడు జ్వాలలు, ఏడు సమిధలు, ఏడు యజ్ఞములు ఉత్పన్నమైనవి. వాటి నుంచే ఏడు లోకములు ప్రకటమైనవి మరియు వానియందు ఏడు ప్రాణములు విహరిస్తుంటాయి. **కనుక ఇంద్రియములు ఏడు అని అనిపిస్తుంది.**

(ముం.ఉ. II-1-8)

## (275) II.4.6

**సూ. హస్తాదయస్తు స్థితేఽతో నైవం**

**క్ర. హస్తాదయః, తు, స్థితే, అతః, న, ఏవమ్**

ప్ర.అ. హస్తాదయః = **హస్తములు మొదలైనవి,** తు = **అయితే,** అతః = **అందువలన,** స్థితే = **స్థితియందు,** న = **కాదు,** ఏవమ్ = **ఇట్లు**

వి. **అయితే హస్తములు, పాదములు, జననేంద్రియము, ఆధారమూలము, వాక్కు మరియు అంతరింద్రియము ఐన మనస్సు వున్నవి కదా? ఈ పరిస్థితిలో శ్రోత్రము (చెవులు), త్వక్కు (చర్మము), చక్షు(కన్నులు), జిహ్వ(నాలుక), నాసము(ముక్కులు) ఈ ఐదింటిలో ఆ ఐదు మరియు ఒకటి కలిసి (5+5+1=11) పదకొండు అవుతాయి. అందువలన ఇంద్రియములు ఏడు అనుట పూర్తిగా సరికాదు. బృహదారణ్యక ఉపనిషత్తులో (3-9-4) ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు మనస్సు కలిసి ఇంద్రియములు పదునొకటి అని చెప్పబడినది. ఇవియే ఏకాదశ ప్రాణములు. అట్లు ఇంద్రియములు ఏడుకాక పదునొకటి తెలియవలయును.** (ఈ పదకొండు అంత్యసమయములో మనుష్యశరీరమును వదలి వెళ్లునపుడు ఏడిపించును, రోదనము చేయించును. కనుక ఏకాదశ రుద్రులని పేరు)

## 3. ప్రాణాణుత్వాధికరణము (80)

## (276) II.4.7

**సూ. అణవశ్చ**

**క్ర. అణవః, చ**

ప్ర.అ. అణవః = **సూక్ష్మములైన తన్మాత్రలు,** చ = **కూడ**

వి. **ఏ రీతిగా ఇంద్రియముల ఉత్పత్తి పరమాత్మ నుండి అయినదో, అదేరీతిగా సూక్ష్మములైన తన్మాత్రల ఉత్పత్తిగూడ పరమాత్మ నుండి జరిగినది.** ప్రాణములన్నీ, అనగా ఇంద్రియములన్నీ అణురూపము అనగా సూక్ష్మములు. ప్రత్యక్షముగా చెవులు, చర్మము, చక్షు, నాలుక, నాసిక అనే ఇంద్రియములు ఏవి కనిపిస్తున్నాయో, అవి బయటకు కనిపించేవి మాత్రము. వాటిలోపల వున్న ప్రాణములే (చైతన్యమే) ఇంద్రియములు. ఎందుకంటే మృత్యువు తరువాత ఇంద్రియములని కనిపించే స్థూలరూపములు వుంటాయి. కాని అవి పనిచేయవు. కావున ఇంద్రియములు సూక్ష్మములని అణుపరిమాణమని తెలుస్తున్నది.సర్వవ్యాపకాలు కావు. అవి శరీరమంతటా పనిచేస్తున్నా అన్ని చోట్లా చేరే విభువులు కావు. ఒకవేళ సర్వవ్యాపకాలు అయితే ఎక్కడ ఏది జరిగినా మనకు తెలియాలి కదా! **అవి జ్ఞానసాధనాలు కాని, విభువులు కావు.**

## 4. ప్రాణశ్రేష్ఠాధికరణము (81)

### (277) II.4.8

సూ. శ్రేష్ఠశ్చ

క్ర. శ్రేష్ఠః, చ

ప్ర.అ. శ్రేష్ఠః = **ముఖ్యప్రాణము,** చ = **కూడ**

వి. శ్రేష్ఠః ప్రాణము కూడ బ్రహ్మము నుండే పుడుతున్నది.

"యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద, జ్యేష్ఠశ్చ హ వై శ్రేష్ఠశ్చ భవతి, ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" - (ఛాం.ఉ. V-1-1)

"ఎవరు జ్యేష్ఠమును శ్రేష్ఠమునునైనదాని తెలిసికొనునో, అతడు జ్యేష్ఠడు శ్రేష్ఠుడునగుచున్నాడు. ప్రాణము జ్యేష్ఠము శ్రేష్ఠముగా నున్నది". **ప్రాణములన్నింటికీ అంటే పదునొకండు ఇంద్రియాలకు, పంచప్రాణాలకు సామర్థ్యాన్ని ఇచ్చేది ఈ మొదటి ముఖ్యప్రాణమే. ప్రాణాలకు ప్రాణమైన ముఖ్య ప్రాణము కూడా బ్రహ్మము నుండి ఉత్పత్తి ఐనది.**

(ముం.ఉ. II-1-3; ఛాం.ఉ. V-1-1; ముం.ఉ. II-1-3)

## 5. వాయుక్రియాధికరణము (82)

### (278) II.4.9

సూ. **న వాయుక్రియే పృథగుపదేశాత్**

క్ర. **న, వాయుక్రియే, పృథగుపదేశాత్**

ప్ర.అ. న = **కాదు, వాయుక్రియే, ప్రథగుపదేశాత్**

వి. ఉపనిషత్తులలో ప్రాణోత్పత్తి గురించి చెప్పినపుడు వేరుగా ఆకాశము, వాయువు మొదలైన వాటిగురించి వున్నది. అంటే ప్రాణము అంటే వాయువు కన్న వేరైన, జీవసంబంధమైనది అని స్పష్టము. కావున **ప్రాణము అంటే వాయువు కాని, దాని స్పందన కాని కాదు. ఆ ప్రథమ ప్రాణము బ్రహ్మ వికారమే.**

### (279) II.4.10

సూ. **చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః**

క్ర. **చక్షురాదివత్, తు, తత్సహశిష్ట్యాదిభ్యః,**

ప్ర.అ. చక్షిరాదివత్ = **చక్షువు మొదలైనవాటి వలెనె,** తు = **కాని,** తత్సహశిష్ట్యాదిభ్యః = **ఆ ఇంద్రియములలోపాటు చెప్పినందు వలన**

వి. **ఏ విధముగా కన్నులు మొదలైన ఇంద్రియములు జీవాత్మకు ఉపకరణములో, అదే విధముగా ముఖ్యప్రాణము కూడా జీవాత్మకు ఉపకరణమే.** ఎందుకంటే (ముం.ఉ. II-1-3) లో ప్రాణోత్పత్తితో

పాటు సమస్త ఇంద్రియములు, పంచభూతములఉత్పత్తి చెప్పబడినది. **అదేకాక మిగతా ఇంద్రియములకు శక్తినిచ్చేది మరియు వానిలో శ్రేష్ఠమైనది అని వున్నది** (ఛాం.ఉ.V-1-1) **ప్రాణము వాటితో పాటు వుండి వాటిలో శ్రేష్ఠమైనదే కాని చైతన్యము కాదు, జడమే.** (ము.ఉ.II-1-3) (ఛాం.ఉ.V-1-1)

## (280) II.4.11

**సూ. అకరణత్వాచ్చ న దోషస్తథా హి దర్శయతి**

**క్ర. అకరణత్వాత్, చ, న, దోషః, తథా, హి, దర్శయతి**

ప్ర.అ. అకరణత్వాత్ = **కరణరూపము కానందున,** చ = **కూడ,** న = **లేదు,** దోషః = **దోషము,** తథా హి = **అటులనే,** దర్శయతి = **శ్రుతి చూపించుచున్నది.**

వి. శ్రోత్రము (చెవులు) మొదలైన ఇంద్రియములు శబ్దము మొదలైన విషయముల జ్ఞానమునందించుటకు ఉపకరణముల భూమికను నిర్వహిస్తున్న విధముగా, **ప్రాణము ప్రత్యక్షముగా జీవాత్మ యొక్క కరణము అని ఒప్పుకొనటములో దోషములేదు.** ఎందుకంటే అన్ని ఇంద్రియముల ధారణకర్త మరియు శరీరముయొక్క పోషణకర్త ప్రాణమే. ప్రాణముండుట వలననే ఈ శరీరరముకు ఆస్తిత్వము వుండును. ప్రాణము లేనపుడు శరీరము ఏమీ చేయలేదు. **ఉపనిషత్తులలో ప్రాణము యొక్క ముఖ్యత్వము గూర్చి పలుచోట్ల చెప్పబడినది.**

"ప్రాణేన రక్షన్నవరం కులాయమ్" (బృ.ఉ. VI-3-12)

"ప్రాణము ద్వారా అవరము (నీచము) ఐన ఈ గూడును (శరీరము)ను రక్షించకొనుచున్నాడు జీవుడు" అని బృహదారణ్యకములో చెప్పబడినది.

**కావున ప్రాణము జీవాత్మ యొక్క కరణము, (ఇంద్రియముల వలెనె) అని అనటములో ఏ మాత్రము దోషము లేదు.**

(ఛాం.ఉ. V-1-6 నుండి మొత్తము ప్రకరణము; ప్ర.ఉ.III-1-12); (బృ.ఉ.V-3-12)

## (281) II.4.12

**సూ. పంచవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే**

**క్ర. పంచవృత్తిః, మనోవత్, వ్యపదిశ్యతే**

ప్ర.అ. పంచవృత్తిః = **ఐదువృత్తులు,** మనోవత్ = **మనస్సువలెనె,** వ్యపదిశ్యతే = **శ్రుతిలో చెప్పబడినది.**

వి. మనస్సుకు శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియముల రూపములో వినటము, స్పర్శ, రుచి, చూడటము, ఆఘ్రాణించటము అనే ఐదు వృత్తులు వున్నాయో; ప్రాణమునకు కూడా ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అను అయిదు వృత్తులు వున్నాయి. యోగశాస్త్రములో కూడా చిత్తవృత్తులు - మనోవృత్తులు ఐదు అని వున్నాయి. (పతంజలి యోగసూత్రములు)

ప్రమాణము, విపర్యము, వికల్పము, నిద్ర, స్మృతి అనునవి మనస్సునకు పంచవృత్తులు, మనోవ్యాపారాలు. అదే విధముగా ప్రాణమునకు పంచవృత్తులు వున్నాయి. **ప్రాణము ముఖములో,**

**అపానము ఆధారమూలప్రదేశములో, వ్యానము హృదయ ప్రదేశములో, ఉదానము నాభిపైన, సమానము జఠరములో చరించి మొత్తము శరీరముకు ప్రాణాధారమై జీవాత్మకు ఉపకరణము అవుతాయి.**

## 6. శ్రేష్ఠాణుత్వాధికరణము (83)

### (282) II.4.13

సూ. **అణుశ్చ**

క్ర. **అణుః, చ**

ప్ర.అ. అణుః = **అణుస్వరూపము (సూక్ష్మము),** చ = **కూడ**

వి. **ముఖ్యప్రాణము అణుపరిమాణముకలది, అన్ని ఇంద్రియముల వలెనే. అది సూక్ష్మము, చిన్న పరిమాణమేకాక సర్వవ్యాపకము కూడా.** సర్వప్రాణధారుల అస్తిత్వము ప్రాణము వలననే అవుతుంది. ప్రాణము లేకుంటే దేహానికి మరణము అవుతుంది. మృత్యు కాలములో ప్రాణము ఉత్క్రమణము అయినపుడు దానిని ఎంత సూక్ష్మదర్శి యంత్రము కూడా చూడలేదు. ఆ విధముగా ప్రాణము యొక్క అణు స్వరూపము సిద్ధి అవుతుంది.

## 7. జ్యోతిరాద్యధికరణము (84)

### (283) II.4.14

సూ. **జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్**

క్ర. **జ్యోతిరాద్యధిష్ఠానం, తు, తత్ + ఆమననాత్**

ప్ర.అ. జ్యోతిరాద్యధిష్ఠానం = **అగ్ని మొదలైన వాని అధిష్ఠాతలైన దేవతలు,** తు = **బ్రహ్మమే,** తత్ + ఆమననాత్ = **అటులయే, ఉపనిషత్తులలో చెప్పబడినది కనుక**

వి. **అగ్ని మొదలైన వాటి అధిష్ఠాన దేవతలు బ్రహ్మమే. ఉపనిషత్తులలో అట్లే చెప్పబడినది.**

"అగ్నిఃవాక్ భూమఖం ప్రావిశత్" (ఐ.ఉ. I-2-4)

"అగ్నివాక్కుగా అయి నోటియందు ప్రవేశించినది"

"వాయుప్రాణోభూత్వా నాసికే ప్రావిశత్" (ఐ.ఉ. I-2-4)

"వాయు ప్రాణముగానయి నాసికను ప్రవేశించినది"

"అనేన జీవాత్మనా అనుప్రవిశ్య" (ఛాం.ఉ. VI-3-2)

"నేనిక జీవాత్మరూపములో వీనియందు ప్రవేశింపచేసి"

"ఏకో బహుస్యామః" (ఛాం.ఉ. VI-2-4)

"నేను అనేకము అవుతాను" (ఛాం.ఉ. VI-2-4)

**అట్లు బ్రహ్మమే ఆయా తత్త్వములలో ప్రవేశించినది.**

(ఐ.ఉ. I-2-4; ఛాం.ఉ. VI-3-2; ఛాం.ఉ. VI-2-4)

## (284) II.4.15

**సూ. ప్రాణవతా శబ్దాత్**

**క్ర. ప్రాణవతా, శబ్దాత్**

**ప్ర.అ.** ప్రాణవతా = **ప్రాణధారిజీవాత్మ,** శబ్దాత్ = **శ్రుతి చెప్పుట వలన**

**వి. ప్రాణధారియైన జీవాత్మతోబాటు బ్రహ్మ ప్రవేశించినాడు అని ఉపనిషత్తు చెప్పుట వలన, జీవాత్మ శరీరము యొక్క అధిష్ఠాత అని చెప్పటములో ఏ దోషము లేదు మరియు అది సమంజసమే.** (ఛాం.ఉ. VI-3-2, కఠ.ఉ. I-3-2)

కావున ప్రాణాలకు జీవాత్మతోనే సంబంధము వున్నది. ఇంద్రియముల అధిష్ఠానదేవతలు వేరు వేరుగా వున్నా, వారికి భోక్తృత్వము లేదు. **జీవాత్మయే భోక్త.** (ఛాం.ఉ. VI-3-2, కఠ.ఉ. I-3-2)

---

## (285) II.4.16

**సూ. తస్య చ నిత్యత్వాత్**

**క్ర. తస్య, చ, నిత్యత్వాత్**

**ప్ర.అ.** తస్య = **ఆ జీవాత్మయొక్క,** చ = **కూడ,** నిత్యత్వాత్ = **నిత్యత్వము వలన**

**వి. జీవాత్మ నిత్యము అవినాశము అని ప్రసిద్ధము. జీవాత్మకు ఉత్పత్తి లేదని (బ్ర.సూ.II-3-16,17) సూత్రములలో తెలియబడినది.** అయితే జీవాత్మ శరీరములో ఉండటము గౌణరూపము అని నిర్దిష్టము. కావున జీవాత్మ ఉత్పత్తి పంచతత్త్వముల ఉత్పత్తికి పూర్వము కాని తరువాత కాని చెప్పకుండా **బ్రహ్మముతో పాటు జీవాత్మ శరీరములో ప్రవేశించటము గురించి వర్ణన సముచితమే.** (బ్ర.సూ. II-3-16,17)

---

## 8. ఇంద్రియాధికరణము (85)

## (286) II.4.17

**సూ. త ఇంద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్**

**క్ర. తే, ఇంద్రియాణి, తద్వ్యపదేశాత్, అన్యత్ర, శ్రేష్ఠాత్**

**ప్ర.అ.** తే = **ఆ మనస్సు మొదలైన,** ఇంద్రియాణి = **ఇంద్రియములు,** తద్వ్యపదేశాత్ = **అట్లు చెప్పబడినందువలన,** అన్యత్ర=**శ్రుతిలో వేరొక చోట,** శ్రేష్ఠాత్ = **ముఖ్య ప్రాణముకన్న వేరు అని.**

**వి.** ఉపనిషత్తులందు వాక్కు మొదలైన ఇంద్రియములు, "ఇంద్రియములు" అనే శబ్దముతో ముఖ్య ప్రాణముకంటే భిన్నముగా చెప్పబడినవి.

"ఏతస్మాత్జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ" (ముం.ఉ. II-1-3)

"దాని నుండి ప్రాణాలు, మనస్సు, సర్వ ఇంద్రియములు జనించుచున్నాయి." అని చెప్పబడినది.

**అంటే ప్రాణాన్ని వేరుగా, ఇంద్రియాలను వేరుగా మరియు మనస్సును గూడా ప్రాణముకంటే,**

**ఇంద్రియాలకంటే వేరుగా చెప్పటము వలన ప్రాణాలు ఇంద్రియాలు కావు, మనస్సు కూడా ఇంద్రియము కాదు అని చెప్పవచ్చును.**

**భగవద్గీతలో "మనస్సు ఆరవ ఇంద్రియము" అని చెప్పినారు. ప్రాణములు మాత్రము ఇంద్రియము అని చెప్పలేదు.**

(ముం.ఉ. II-1-3)

## (287) II.4.18

సూ. **భేదశ్రుతేః**

క్ర. **భేదశ్రుతేః**

ప్ర.అ. భేదశ్రుతేః = **శ్రుతిలో భేదము వలన**

వి. **ఉపనిషత్తులో ఇంద్రియముల గూర్చి చెప్పినపుడు ముఖ్యప్రాణాన్ని వేరుగా చెప్పి ప్రాణాల, ఇంద్రియాల భేదము చూపించుట వలన ప్రాణములకంటే ఇంద్రియాదులు భిన్నమైనవి.**

(ముం.ఉ. II-1-3; బ్ర.సూ. III-3-3; ప్ర.ఉ. II-2-3)

## (288) II.4.19

సూ. **వైలక్షణ్యాచ్చ**

క్ర. **వైలక్షణాత్, చ**

ప్ర.అ. వైలక్షణాత్ = **పరస్పరము విలక్షణము కావున,** చ = **కూడ**

వి. **ముఖ్యప్రాణము కంటే ఇతర ప్రాణాలకు అంటే ఇంద్రియములకు భేదం వుండటం వలన కూడా అవి భిన్నమైనవి.** ముఖ్యప్రాణము, ఇంద్రియములు రూపములో వేరు. ఇంద్రియములు నిద్రించినా ప్రాణము తెలివితోనే వుంటుంది. దేహాన్ని ధరించటానికి ముఖ్య కారణము ప్రాణమే అవుతున్నది. ఇంద్రియములకు ఆ విధమైన సామర్థ్యము లేదు. అవి ఉపకరణములే, కరణములే. **కావున ఇంద్రియములు ముఖ్యప్రాణముకన్న భిన్నమైనవి.**

# 9. సంజ్ఞామూర్తిక్లప్త్యధికరణము (86)

## (289) II.4.20

సూ. **సంజ్ఞామూర్తిక్లప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్**

క్ర. **సంజ్ఞామూర్తిక్లప్తిః, తు, త్రివృత్కుర్వతః, ఉపదేశాత్**

ప్ర.అ. సంజ్ఞామూర్తిక్లప్తిః = **నామరూపముల రచన,** తు = **అయితే,** త్రివృత్కుర్వతః = **మూడు తత్త్వములను మిశ్రమము చేయుట**

వి. **సంపూర్ణ నామరూపములతో కూడిన జగత్తు యొక్క రచన చేసినది మూడుతత్త్వములైన తేజస్సు జలము, అన్నమును త్రివృత్కరణము అనగా మిశ్రమము చేసిన పరమేశ్వరుని కార్యమే కాని జీవాత్మకాదు.** ఎందుకనగా ఉపనిషత్తు అట్లు చెప్పినది ఛాందోగ్యోపనిషత్తులో తేజము, జలము,

అన్నం అనే మూడింటి సృష్టిని చెప్పి “నేను జీవరూపములో ప్రవేశించి, నామరూపాలను విస్తరింపచేస్తాను” అని ఈ దేవత ఆలోచించాడు. (ఛాం.ఉ. VI-3-2) **“ఆ దేవత పరమేశ్వరుడే. అతడే నామరూపవ్యాకర్త, జీవుడు కాదు”**
(ఛాం.ఉ. VI-3-2)

## (290) II.4.21

**సూ.** **మాంసాది భౌమం యథాశబ్దమితరయోశ్చ**

**క్ర.** **మాంసాది, భౌమం, యథాశబ్దమ్, ఇతరయోః, చ**

**ప్ర.అ.** మాంసాది = **మాంసము మొదలైన,** భౌమం = **పృథివి యొక్క కార్యము,** యథాశబ్దమ్ = **శ్రుతి ప్రకారము,** ఇతరయోః = **మిగిలిన రెండు తత్త్వములు యొక్క,** చ = **కూడ**

**వి.** పృథివి, అనగా భూమిరూపమైన అన్నము, యొక్క మూడు కార్యములు. అవి మాంసము, పురీషము (మలము) మరియు మనస్సు అని ఉపనిషత్తులో చెప్పబడినది. “అన్నమశితం త్రిధా విధీయతే తస్య యః స్థవిష్ఠో ధాతుస్తత్పురీషం భవతి యో మధ్యమస్తన్మాంసం యోఽణిష్ఠస్తన్మనః” “భుజించిన అన్నము (పృథివి) మూడు భాగములుగా నగుచున్నది. అందులో స్థూలభాగము పురీషముగా (మలముగా), మధ్యమమైనది మాంసముగా, సూక్ష్మముగా వుండేది మనస్సుగా అవుతుంది” (ఛాం.ఉ. VI-5-1) అదే ఛాందోగ్యోనిషత్తులోని ప్రకరణములో తేజము, జలము, అన్నముల గురించి వున్నది. (ఛాం.ఉ. VI-5-1;2,3) తేజము యొక్క స్థూలభాగము అస్థులుగా (ఎముకలుగా), మధ్యమభాగము మజ్జగా, సూక్ష్మభాగము వాక్కుగా రూపొందుతాయి. అదే విధముగా జలము యొక్క స్థూలభాగము మూత్రముగా, మధ్యభాగము రక్తముగా, సూక్ష్మభాగము ప్రాణముగా రూపొందుతాయి. ఇదియే త్రివృత్కరణము. ఇది బ్రహ్మము యొక్క కార్యము, జీవాత్మ కార్యము కాదు.

### త్రివృత్కరణము

| **త్రివృత్కరణము** | **స్థూలము** | **మధ్యమము** | **సూక్ష్మము** |
|---|---|---|---|
| **తేజము** | అస్థులు | మజ్జ | వాక్కు |
| **జలము** | మూత్రము | రక్తము | ప్రాణము |
| **అన్నము** | పురీషము | మాంసము | మనస్సు |

**గమనిక :** మనము భుజించే అన్నము ప్రకారము మన మనస్సు వుంటుంది. జలమే ప్రాణము. తేజమే వాక్కు రూపములో ప్రకటం అవుతుంది.

(ఛాం.ఉ. VI-5-1); (ఛాం.ఉ. VI-5-1)

## (291) II.4.22

**సూ. వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః**

**క్ర. వైశాష్యాత్, తు, తద్వాదః, తద్వాదః**

ప్ర.అ. వైశేష్యాత్ = **ఆధిక్యము వలన,** తు = **ఇంకను,** తద్వాదః = **ఆ చెప్పటము,** తద్వాదః = **చెప్పటముయే**

వి. **మూడు తత్త్వముల మిశ్రణములో ఒకదానికి ఆధిక్యము (ఎక్కువ) రెండింటికి న్యూనత (తక్కువ) కలుగును. దేనికి ఆధిక్యము వుండునో, ఆ ఆధిక్యతను స్వీకరించి వ్యవహారములో మిశ్రమ తత్త్వములను వేరువేరుగా చెప్పటముయగును. దీనిలో విరోధము లేదు.** ఈ చెప్పటము, చెప్పటము.

ఇట్లు

**ద్వితీయాధ్యాయ చతుర్థపాదము**



# ద్వితీయాధ్యాయ చతుర్థ పాద సమాసము

## ప్రాణాదివాక్య విరోధ పరిహారము

**1. ప్రాణోత్పత్త్యధికరణము**

బ్రహ్మము నుండియే బ్రహ్మవికారములైన ప్రాణములు, ఇంద్రియములు ప్రాదుర్భవము అయినవి. ప్రాణోత్పత్తి ముఖ్యము, గౌణము కాదు. ప్రాణోత్పత్తికి బ్రహ్మమే కారణము.

**2. సప్తగత్యధికరణము**

ఇంద్రియములు ఏడుకాక పంచకర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు మరియు మనస్సు కలిపి పదకొండు అనునది సరియైనది.

**3. ప్రాణాణుత్వాధికరణము**

ప్రాణములన్నీ (ఇంద్రియములన్నీ) సూక్ష్మరూపములు, అణు రూపములు. సర్వవ్యాపకములు కావు. అవి విజ్ఞానసాధనములే కాని, విభువులు కావు.

**4. ప్రాణశ్రేష్ఠ్యాధికరణము**

పదకొండు ప్రాణాలకు (ఇంద్రియాలకు) సామర్థ్యాన్ని ఇచ్చే మొదటి ముఖ్యప్రాణము కూడా బ్రహ్మమునుండి ఉత్పత్తి అయినది.

**5. వాయుక్రియాధికరణము**

ప్రాణము అంటే వాయువు కాని దానికి సంబంధమైన స్పందనకానికాదు. ప్రాణము మిగతా ఇంద్రియములకు శక్తినిచ్చేది మరియు శ్రేష్ఠమైనది. ప్రాణము చైతన్యము కాదు జడమే. ముఖ్యప్రాణము వాయువుకంటే భిన్నమైనది.

**6. శ్రేష్ఠాణుత్వాధికరణము**

ముఖ్యప్రాణము అణుపరిమాణము కలది మరియు సర్వవ్యాపకము.

**7. జ్యోతిరాద్యధికరణము**

అగ్ని మొదలైన వాటికి అధిష్ఠానము బ్రహ్మమే. జీవాత్మయే భోక్త.

**8. ఇంద్రియాధికరణము**

ప్రాణములు ఇంద్రియములకన్న వేరు. మనస్సు కూడా ఇంద్రియముల కన్న వేరు. ఇంద్రియములు ముఖ్య ప్రాణముకన్న భిన్నము. ఇంద్రియములు ముఖ్యప్రాణముయొక్క వృత్తిభేదాలు కావు.

**9. సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము**

నామరూపవ్యాకర్త పరమేశ్వరుడే, బ్రహ్మమే కాని జీవాత్మ కాదు. త్రివృత్కరణము బ్రహ్మము యొక్క కార్యము. జీవాత్మ కార్యము కాదు.

ఇట్లు

**ద్వితీయాధ్యాయ చతుర్థపాద సమాసము**

# ద్వితీయాధ్యాయ చతుర్థపాద సారము

## ప్రాణాదివాక్య విరోధ పరిహారము

దేని నుండి వికారములైన ప్రాణములు, ఇంద్రియములు ప్రాదుర్భవము ఐనవో మరియు దేనినుండి పుట్టిన ప్రాణములు ముఖ్యమో మరియు గౌణము కావో, ఏది ప్రాణోత్పత్తికికారణమూ, దేని నుండి పుట్టిన ప్రాణములు ఏడుకాక పదునొకండుయో (5+5+1), దేని నుండి వచ్చిన ప్రాణములన్నీ సూక్ష్మరూపములు, అణురూపములు మరియు విజ్ఞాన సాధనములే కాని దేనివలె అవి సర్వ వ్యాపకములు కావో, దేని నుండి వచ్చిన పదునొకండు ప్రాణములకు (ఇంద్రియములకు) సామర్థ్యాన్ని ఇచ్చే మొదటి ముఖ్యప్రాణము వాయువు కాని-దానికి సంబంధించిన స్పందన కాని కాక శక్తినిచ్చేది మరియు శ్రేష్ఠమైనది ఐనను చైతన్యముకాక జడమే అవునో, దేని నుండి వచ్చిన ఆ ముఖ్యప్రాణము అణుస్వరూపము మరియు సర్వవ్యాపకమో, ఏది అగ్ని మొదలైన తత్త్వములలో ప్రవేశించినదో, ప్రాణములకు దేనితోబాటు ప్రాణభారియైన జీవాత్మతోనే సంబంధము వున్నదో, దేని నుండి వచ్చిన ప్రాణములు మరియు మనస్సు ఇంద్రియముల కన్న వేరో, ఏది జీవరూపములో ప్రవేశించి నామరూపములను విస్తరింపచేసినదో అదియే బ్రహ్మము.

ఇట్లు
ద్వితీయాధ్యాయ చతుర్థపాద సారము



# శ్రీ బాదరాయణీయ
# బ్రహ్మసూత్ర బోధామృత లహరి

## III
## తృతీయ అధ్యాయము

### సాధన

జీవాత్మకు దేహాంతరమున శేషకర్మానుసారమ్ము తోడ
దేవయాన, పితృయాన, తృతీయ యానములు కల్గుచుండు
పరబ్రహ్మమ్ము నిరాకారమ్ము, సాకారమ్ము గూడ
ఉపాసకునకు అపరోక్షజ్ఞానమ్ముయంది
ఉపాధి నివృత్తియైనయంత జీవాత్మ బ్రహ్మమ్ము యగును.

క్రమము, తత్కాలము అని సన్యాసమ్ము రెండు తీర్లు
అన్ని ఆశ్రమముల వారికి బ్రహ్మవిద్యాధికారమ్ము కలదు.
సగుణోపాసన వలన జీవాత్మకు బ్రహ్మలోక ప్రాప్తియగును.
నిర్గుణోపాసన వలన జీవాత్మ బ్రహ్మజ్ఞానమంద బ్రహ్మమగును.

# III-1

# తృతీయ అధ్యాయము - ప్రథమ పాదము

## దేహాంతర గమనము

## (1) తదనంతరప్రతిపత్త్యధికరణము (87) (పంచాగ్ని విద్య)

### (292) III-1-1

సూ. తదనంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్

క్ర తదనంతరప్రతిపత్తౌ, రంహతి, సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్

ప్ర.అ. తదనంతరప్రతిపత్తౌ = **పూర్వ దేహమును పరిత్యజించి క్రొత్త దేహమును పొందు సమయమున,** రంహతి = **గమనము చేయుచుండును,** సంపరిష్వక్తః = **దేహము యొక్క బీజరూపమైన సూక్ష్మతత్త్వములతో సంయుక్తమై,** ప్రశ్ననిరూపణాభ్యాం = **ప్రశ్న మరియు దాని సమాధానము (నిరూపణ)లతో సిద్ధము యగును.**

వి. **ఒక దేహాన్ని వదిలిన తరువాత జీవుడు మరియొక దేహాన్ని పొందటానికి భూతసూక్ష్మాలతో కూడియే వెళుతున్నాడు.**

**ఈ విషయం ఛాందోగ్యోపనిషత్తులో ప్రవాహణ-శ్వేతకేతుల ప్రశ్న మరియు ఉత్తరాల ఉదంతములో చెప్పబడినది.** (ఛాం.ఉ. V-3-3 నుండి, V-9-2 వరకు)

ప్రవాహణుడనే రాజు అరుణముని పౌత్రుడు ఉద్దాలకుని కుమారుడు అయిన శ్వేతకేతువును ఐదు ప్రశ్నలు అడిగినాడు.

1. "ఇక్కడి జీవులు మరణించి ఎక్కడకు వెళ్లుతున్నారు ?
2. అక్కడ నుండి వారు ఎట్లు తిరిగివచ్చుచున్నారు ?
3. దేవయాన, పితృయాన మార్గముల అంతరమేమిటి ?
4. ఇక్కడినుండి వెళ్లినవారివలన అక్కడిలోకములు ఎందుకు నిండిపోవు ?
5. పంచమఆహుతి యందు జలము, పురుష రూపమునెలా అందుతుంది ? అలా అవటానికి కారణము ఏమిటి?"

ఈ ప్రశ్నలకు ఉత్తరము ఇవ్వజాలనందున శ్వేతకేతువు లజ్జించి తన తండ్రిదగ్గరకు వెళ్లి అడిగినాడు. తండ్రియైన ఉద్దాలకునకుకూడా తెలియనందున ఆయన పుత్రునితో సహా, రాజుదగ్గరకు వెళ్లి ఆ ఉత్తరములు గురించి అడిగినాడు.

రాజైన ప్రవాహణుడు సమాధానములు ఇలా చెప్పినాడు " ఈ జగత్తులో స్వర్గము, మేఘము, పృథ్వి, పురుషుడు, స్త్రీ అనే పంచాగ్నులు వున్నాయి. శ్రద్ధా, సోమము, వృష్టి, అన్నము, వీర్యము

# పంచాగ్ని విద్య

(బ్ర.సూ. (361) III-3-2 ఆరవ ఆహుతి చూడగలరు)

| ఛాం.ఉ. V-3 నుండి V-9 వరకు పంచాగ్ని విద్య - బ్ర.సూ. (292) III-1-1 నుండి (298) III-1-7 వరకు. | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | అగ్ని | సమిధ | ధూమము | జ్వాల | నిప్పులు | కిరణములు | ఆహుతి | ఉత్పత్తి |
| 1 | ద్యులోకము | ఆదిత్యుడు | కిరణములు | పగలు | చంద్రుడు | నక్షత్రములు | శ్రద్ధ (జలము) | సోమము |
| 2 | పర్జన్యము | వాయువు | మేఘములు | ప్రకాశము | పిడుగు | శబ్దములు | సోమము | వర్షము |
| 3 | పృథివి | సంవత్సరము | ఆకాశము | రాత్రి | దిక్కులు | మూలలు | వర్షము | అన్నము |
| 4 | పురుషుడు | వాక్కు | ప్రాణము | జిహ్వ | చక్షు | శ్రోత్రములు | అన్నము | రేతస్సు |
| 5 | యువతి | ఉపస్థ | సంకేతము | యోని | మైధునము | సుఖము | రేతస్సు | గర్భము (పురుషుడు) |

అని ఆ పంచాగ్నుల ఆహుతులు కలవు."

ఆ రాజు ఇంకా ఇలా చెప్పినాడు "1. స్వర్గరూపమైన అగ్నిలో శ్రద్ధ యొక్క ప్రథమ ఆహుతి వలన సోమము ఉద్భవిస్తుంది. 2. మరల మేఘరూప అగ్నిలో సోమము ఆహుతి ఇస్తే వృష్టి (వర్షము) ఉత్పత్తి అవుతుంది. 3. పృధివీరూప అగ్నిలో వృష్టిని ఆహుతి ఇస్తే అన్నము ఉద్భవిస్తుంది. 4. పురుషరూపఅగ్నిలో అన్నము ఆహుతి ఇస్తే వీర్యము ఉత్పత్తి అవుతుంది. 5. స్త్రీ రూప అగ్నిలో వీర్యము పంచమ ఆహుతి (ఐదవ ఆహుతి) ఇస్తే గర్భము ఉత్పత్తి అవుతుంది. ఆ విధముగా ఈ జలము పంచమ ఆహుతిలో పురుష రూపమును పొందుతుంది. అట్లు జన్మించిన వ్యక్తి ఆయువు వున్నంత వరకు ఇక్కడ జీవనమును ప్రాప్తి చెందుతాడు.

ఈ ప్రశ్నోత్తరములలో జలరూపమైన బీజము అన్నితత్వముల సమూహ సూక్ష్మశరీరసహితముగా వీర్యములో అవస్థితము అయిన జీవముగా అనబడినది. **ఇది పంచాగ్ని విద్య. దీనివలన జీవుడు ఒక దేహము నుండి ఇంకొక దేహమునకు గమనము చేసినపుడు బీజరూపములో వున్న అన్ని తత్త్వములతో సంయుక్తమై ఉత్క్రమణము చేస్తుంటాడు.**

(ఛాం.ఉ. V-3-3 నుండి V-9-2 వరకు)

## (293) III-1-2

**సూ. త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్**

**క్ర. త్ర్యాత్మకత్వాత్, తు, భూయస్త్వాత్**

ప్ర.అ. త్ర్యాత్మకత్వాత్ = **మూడు తత్వముల మిశ్రమము కనుక,** తు = **ఆ ప్రకారము,** భూయస్త్వాత్ = **వీర్యమునందు అన్నిటికన్న ఎక్కువ జలము వున్నందున**

వి. **జగత్తు యొక్క ఉత్పత్తి సందర్భములో ఛాందోగ్యోపనిషత్తులో (VI-3-3) మూడు తత్త్వముల (అగ్ని, జలము, అన్నముల) సమ్మిశ్రణము తరువాత పరబ్రహ్మ జగత్తుయొక్క నామ రూపములను ప్రకటము చేసినాడు అని వున్నది.**

ఇక్కడ తత్త్వముల వర్ణనము ఉపలక్షణము. ఇందు సమస్త తత్త్వముల మిశ్రమమును గ్రహించవలెను. వీర్యములో సమస్త భౌతికతత్త్వములు విద్యమానమై యుండినను, జలాంశము ఎక్కువగా నుండును. అయితే జలము నుండియే పురుషుని ఉద్భవం చేయబడినను, సమస్త తత్త్వముల గ్రహణ దాని ద్వారానే అవుతుంది.

**ఉపనిషత్తులో ప్రాణములు గూడా జలము అని చెప్పబడినది మరియు శరీరము మారినపుడు జీవుడు ప్రాణములో ఉపస్థితమై పోవునని చెప్పబడినది. అందువలన కూడ జలము పురుష రూపమునకు పరివర్తనము అవుతుందనటం సమంజసమే.**

కావున జీవుడు సూక్ష్మతత్త్వములతో కూడియే ఒక శరీరము నుండి మరియొక శరీరములోనికి పోవుననుట సిద్ధమగుచున్నది.

(ఛాం.ఉ. VI-3-3)

## (294) III-1-3

సూ. ప్రాణగతేశ్చ

క్ర. ప్రాణగతేః, చ.

ప్ర.అ. ప్రాణగతేః = **జీవాత్మతో పాటు ప్రాణముల యొక్క గమనము వుండుట వలన,** చ=**కూడ**

వి. **శ్రుతిననుసరించి, ఇంద్రియముల (ప్రాణముల) గతితోనే జీవాత్మగతి సంభవము అవుతుంది మరియు ప్రాణములు వెడలినపుడే మృత్యువు అవుతుంది.**

ప్రాణములు వెడలనంత వరకు మృత్యువుకాదు. జీవించి వున్నంత వరకు దేహరూపములో వుండే భూతాలను ఆశ్రయించుకొని వుండే ముఖ్య ప్రాణము, చక్షువాది ఇంద్రియాలు మరణము తరువాత జీవునితో పాటు వెళ్లుతున్నాయి.

"తముత్క్రా మంతం ప్రాణో అనుత్క్రామతి ప్రాణయనూత్క్రా
మనం సర్వే ప్రాణా అనూత్క్రామంతి" (బృ.ఉ. VI-4-2)

"జీవుడు ఈ శరీరము నుండి లేచి పోయేటపుడు ముఖ్య ప్రాణం అతనితో పాటు లేచిపోతుంది. ఆ ముఖ్య ప్రాణాన్ని అనుసరించి సమస్త ప్రాణాలు (అన్ని ఇంద్రియాలు) లేచిపోతాయి.

**"ఆశ్రయము లేకుండా ఇంద్రియాలు వుండలేవు, పోలేవు. కాబట్టి వానికి ఆధారముగా భూత సూక్ష్మాలు వుండాలి. అందువలన జీవునితో బాటు సూక్ష్మభూతాలు పోవటాన్ని అంగీకరించాలి.** (ఛాం.ఉ. VI-4-2)

## (295) III-1-4

సూ. **అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్**

క్ర. **అగ్న్యాదిగతిశ్రుతేః, ఇతి, చేత్, న, భాక్తత్వాత్.**

ప్ర.అ. అగ్న్యాదిగతి శ్రుతేః = **అగ్ని మొదలైన వానిపోవటము గూర్చి ఉపనిషత్తులలో వున్నది.** ఇతి చేత్ = **అనిన యెడల,** న = **కాదు,** భాక్తత్వాత్ = **అది వేరొక విషయము గూర్చి చెప్పినది కనుక**

వి. **"వాక్కు మొదలగు ఇంద్రియములు, వాటి వాటి అభిమాన దేవతలైన అగ్ని మొదలైన వాటియందు చేరుతాయని శ్రుతిలో చెప్పబడింది. కావున ప్రాణాలు (ఇంద్రియాలు) జీవుని అనుసరించవు" అని అనటము సరికాదు.**

బృహదారణ్యక ఉపనిషత్తులో "యత్రాస్య పురుషస్య మృతస్య అగ్నిం వాగేప్యేతి, వాతం ప్రాణం, చక్షురాదిత్యం, మనశ్చంద్రం" (బృ.ఉ. IV-2-13)
"పురుషుడు చనిపోయినపుడు వాక్కు తన అధిష్ఠాన దేవతయైన అగ్నిని, ప్రాణం వాయువును, చక్షుస్సు సూర్యుని, మనస్సు చంద్రుని పొందుతాయి" అని చెప్పబడిన ఉపనిషత్తు వలన వివిధ ప్రాణాలు ఆయా అధిష్ఠానములలో లయమౌతున్నట్లు తెలుస్తున్నది.

"మరి ప్రాణాలు వేరొక లోకానికి లేచిపోతున్నాయని అనటము విరుద్ధము కాదా ?" అని అంటే ఇందులో విరుద్ధము ఏమి లేదు.

ఎందుకంటే బృహదారణ్యక ఉపనిషత్తులోని ఆ సందర్భములో ఆర్తభాగమహర్షి అడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పుతూ యాజ్ఞవల్క్యమహర్షి చెప్పిన మాటలు అవి.

ఇది సభలో చెప్పిన సమాధానం తరువాత రహస్యంగా ఏకాంతములో పంచాగ్నుల విషయము (స్త్రీ మరియు రేతస్సు గురించి, గర్భాదానము గురించి) చెప్పినాడు. ఎందుకంటే సభలో గార్గి మొదలైన స్త్రీలు వున్నారు.

సభలో చెప్పినది గౌణము, ఏకాంతములో చెప్పినది ముఖ్యము. తరువాత అందరి సమక్షములో యాజ్ఞవల్క్యుడు ఆర్తభాగునితో "మనుష్యుడు సత్కార్యముల వలన శ్రేష్ఠస్థానములు మరియు అసత్కార్యముల వలన నీచస్థానములకు చేరుతాడు" అనినది కూడా పైనచెప్పిన దానికి సమన్వయము అవుతుంది. **కావున జీవునితో పాటు, భూతసూక్ష్మాలు లేచిపోవటం యుక్తము.**

(బృ.ఉ. IV-2-13)

## (296) III-1-5

**సూ. ప్రథమేఽ శ్రవణాదితిచేన్న తాఽ ఏవ హ్యుపపత్తేః**

**క్ర. ప్రథమే, అశ్రవణాత్, ఇతి, చేత్, న, తా, ఏవ, హి, ఉపపత్తేః**

**ప్ర.అ.** ప్రథమే = **ప్రథమఆహుతి వర్ణనయందు,** అశ్రవణాత్ = **జలము అను పేరు వినపడలేదు,** ఇతి = **అని అనిన,** చేత్ = **యెడల,** న = **కాదు,** తా ఏవ = **శ్రద్ధ పేరున జలములే చెప్పబడినవి.**

**వి.** ఒకవేళ ఛాందోగ్యోపనిషత్తు (V-3-1 నుండి V-9-2 వరకు) లోని ప్రశ్నోత్తర ప్రసంగము ప్రప్రథమముగా శ్రద్ధను ఆహుతి చేయాలని వున్నది, కాని పురుషసంజ్ఞారూపమైన జలమును ఆహుతి చేయాలని లేదు అని అంటే ("ఓ గౌతమా! ద్యులోకమే అగ్ని. ఈ అగ్నిలో దేవతలు శ్రద్ధను ఆహుతిగా ఇస్తున్నారు" (ఛాం.ఉ.V-4-1) మిగతా నాలుగు ఆహుతులైన సోమ, వృష్టి అన్న, రేతస్సులకు జలముతో సంబంధము వున్నది. మరియు శ్రద్ధకు జలమునకు ఏమి సంబంధము అన్న ప్రశ్న వస్తుంది! అలా కాదు. శ్రద్ధ అనేదానికి ఆధారము జలము. జలము అంటే తర్పణము. తర్పణము శ్రద్ధా రూపమే. తైత్తరీయ సంహితలో (I-6-8-1) **"నిశ్చయముగా యజమానుడు చేసే పుణ్యకర్మలకోసం జలాలు శ్రద్ధను కల్పిస్తున్నాయి" అన్నదాని ప్రకారం శ్రద్ధను జలముగా స్వీకరించాలి.**

(ఛాం.ఉ. V-4-1; తై.సం. I-6-8,1)

## (297) III-1-6

**సూ. అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః**

**క్ర. అశ్రుతత్వాత్, ఇతి, చేత్, న, ఇష్టాదికారిణాం, ప్రతీతేః**

**ప్ర.అ.** అశ్రుతత్వాత్ = **శ్రుతిలో లేదు,** ఇతి చేత్ = **అనినచో,** న = **కాదు,** ఇష్టాదికారిణాం = **శుభాశుభ కార్యములు చేయువారి గురించి,** ప్రతీతేః = **చెప్పబడినది.**

వి. **ఒకవేళ జీవాత్మ ఆ తత్త్వముల (సూక్ష్మభూతములు)తో పాటు వెళ్లుతుంది అని శ్రుతులలో చెప్పబడలేదు, జలముల నామముతో తత్త్వములు పురుష రూపమునకు పరిణితికావటమే చెప్పబడింది అని అంటే అది సరికాదు. ఎందుకంటే "శుభ, శ్రేష్ఠకర్మలు చేసేవారు శ్రేష్ఠయోనులను (ఈ దేహము వదలిన తరువాత) చేరుతారు మరియు అశుభ, క్రూరకర్మలను చేసేవారు నిమ్న యోనులను చేరుతారు" (ఛాం.ఉ. V-10-7) అని శ్రుతిలో చెప్పబడినది.**

దీనివలన శుభాశుభ కర్మలు చేసిన జీవులు, ఆయా తత్త్వములతో పాటు ఒక దేహము నుండి ఇంకొక దేహమునకు వెళ్లుతారు. దీనిలో ఏమీ విరోధము లేదు. **అన్ని తత్త్వములతో పాటు జీవాత్మలు తమ తమ కర్మల ప్రకారము దేహాంతరగమనం చేస్తుంటాయి.**

(ఛాం.ఉ.V-10-7)

## (298) III-1-7

సూ. **భాక్తం వానాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి**

క్ర. **భాక్తమ్, వా, అనాత్మవిత్త్వాత్, తథా, హి, దర్శయతి**

ప్ర.అ. భాక్తం = **అన్నము అవుతారు,** వా = **కూడ,** అనాత్మవిత్త్వాత్ = **ఆత్మజ్ఞానులు కానివారు,** తథా = **ఆ ప్రకారము,** హి = **ఎందుకంటె** దర్శయతి = **శ్రుతి అట్లు చెప్పుచున్నది.**

వి. **ఉపనిషత్తులో** (బృ.ఉ. VI-2-16) **"శుభాశుభాది కర్మలు చేసేవారు ధర్మమార్గములో స్వర్గలోకములో చేరిన తరువాత దేవతలకు అన్నముఅవుతారు అని వుంది. దేవతలచే భక్షించబడేవారికి కర్మఫల భోగములు ఎలా అవుతాయి ?" అనే ప్రశ్న వస్తుంది ?**

అని అంటే ఇది గౌణమేకాని, ప్రధానవిషయము కాదు, సకామ భావనతో ఎవరు శుభకర్మలు చేస్తారో వారు ఆత్మజ్ఞానులు కారు. కేవలము ఆత్మజ్ఞానుల స్తుతించు కొరకు గౌణముగా అలా చెప్పబడినది. నిజముగా శ్రుతిలో "దేవతలు తినరు, త్రాగరు - అమృతమును చూచినంతనే తృప్తి చెందుతారు." (ఛాం.ఉ. III-6-1) అని వున్నది.

బృహదారణ్యకములో "ఎవరు పరమాత్మను తెలియక అన్య దేవతలను ఉపాసిస్తారో వారు అ దేవతలకు వశులగుదురు" (బృ.ఉ. I-4-10) అని వున్నది. ఇది అజ్ఞానుల విషయములో చెప్పబడినది.

"వారు విశాల స్వర్గముననుభవించి.
తరిగి పుణ్యములు క్షీణించినంత
చేరుదురు మరల భువికి.
కోరికలనంటి త్రిధర్ములు తిరుగుచుంద్రు" (భ.గీ. IX-21).

జీవులు దేవలోకములనంది వారి వారి కర్మలకు తగిన ఫలములననుభవించి తిరిగివత్తురు. అంతేకాని వారు దేవతలకు అన్నమగుదురనుట గౌణము.

**కావున జీవాత్మ ఒక శరీరము నుండి ఇంకొక శరీరములోకి సూక్ష్మతత్త్వములతో కూడిపోవుట సరియైనది అందులో విరోధము లేదు.**

(బృ.ఉ.VI-2-16; ఛాం.ఉ.III-6-1; బృ.ఉ. I-4-10; భ.గీ. IX-21)

## (2) కృతాత్యయాధికరణము (88)

### (299) III-1-8

**సూ. కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవం చ**

**క్ర. కృతాత్యయే, అనుశయవాన్, దృష్టస్మృతిభ్యాం, యథేతమ్, అనేవం, చ**

ప్ర.అ. కృతాత్యయే = **చేసిన పుణ్యకర్మలు క్షీణించిన తరువాత,** అనుశయవాన్ = **శేషకర్మ సయుక్తుడైన జీవాత్మ,** దృష్టస్మృతిభ్యాం = **శ్రుతిస్మృతులలో చెప్పబడి దాని వలన,** యథేతమ్ = **పోయిన మార్గమున,** అనేవం చ = **దానికి భిన్నమైన మరియొక మార్గమున**

వి. **జీవాత్మ తాను చేసిన శ్రేష్ఠ కర్మలను పూర్ణరూపముగా అనుభవించిన తరువాత శేష కర్మల సంస్కారములతో పాటు ఏ మార్గములో వచ్చినదో అదే మార్గములో కాని ఇంకొక మార్గములో కాని తిరిగివచ్చును.**

"తద్యఇహరమణీయచరణా: అభ్యాశోహయత్తే రమణీయాం యోనిమాపద్యేరన్-అథయకపూయ చరణాః అభ్యాశో హయత్తే కపూయం యోనిమాపద్యేరన్" (ఛాం.ఉ. V-10-7)

"రమణీయ చరణములవారు రమణీయ యోనులనందుదురు. నిమ్న చరణములవారు నిమ్నయోనులను అందుదురు."

అశేష కర్మలు లేక అనుశయ కర్మల ప్రకారము ఆ జీవాత్మకు జగత్తులో విభిన్న యోనులు ప్రాప్తియగును. శ్రేష్ఠ పుణ్యకర్మల వలన శ్రేష్ఠ యోనులు, నిమ్నఅశుభ కర్మల వలన నిమ్న అశుభ యోనులు ప్రాప్తించును. ఈ విషయమే ఛాందోగ్యోపనిషత్తు (V-10-7) లో చెప్పబడినది.

ఆ విధముగ శుభశేష కర్మల సంస్కారముల వలన శుభ ఉచ్ఛ జన్మలను అశుభ శేషకర్మ సంస్కారముల వలన అశుభ జన్మలను అందుతారు.

గౌతమ ధర్మ సూత్రములలో ఇలా చెప్పబడింది.

"వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మ నిష్టాః ప్రేత్య కర్మఫలమను భూయ తత: శేషేణ విశిష్ట దేశజాతి కుల రూపాయుః శ్రుతి వృత్త సుఖ మేధసో జన్మ ప్రదిపద్యంతే" (గౌ.ధ.సూ. XI-29)

"ఆయా వర్ణాలకు, ఆశ్రమాలకు విహితములైన స్వకర్మలను నిష్ఠతో ఆచరించి దేహమును వదలిన తరువాత ఆయా కర్మలకనుగుణమైన లోకములలో అనుభూతినంది శేషకర్మలననుసరించి విశిష్ఠ, దేశ, జాతి, కుల, రూప, ఆయుర్దాయము, విద్య, ధనము, సుఖము, బుద్ధి కలిగిన జన్మను పొందుతారు".

**ఆ విధముగా శేషకర్మ సంస్కారానుసారము జన్మలను జీవాత్మ అందుతుంది.**
(ఛాం.ఉ. V-10-7); (గౌ.ధ.సూ. XI-29)

### (300) III-1-9

**సూ. చరణాదితిచేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః**

**క్ర. చరణాత్, ఇతి, చేత్, న, ఉపలక్షణార్థా, ఇతి, కార్ష్ణాజినిః**

ప్ర.అ. చరణాత్ = **"రమణీయచరణాః" అనినపుడు చరణ శబ్దము వలన,** ఇతి చేత్ న = **శేషకర్మలననుసరించి పోదురు అనుట సరికాదు అనినచో అది ఉచితము కాదు,** ఉపలక్షణార్థా = **అది అనుశయము అనగా శేషకర్మోపలక్షణార్థమే,** ఇతి = **అని,** కార్ష్ణాజినిః = **కార్ష్ణాజినిః ఆచార్యులు**

వి. "రమణీయచరణాః" అని ఉపనిషత్తు చెప్పిన దానిలో చరణ శబ్ద ప్రయోగము కర్మసంస్కారమును గురించి కాదు, జీవాత్మ, స్వర్గము నుండి తిరిగి వచ్చునపుడు కర్మ సంస్కారములతో తిరిగి వచ్చుననుట సరికాదు అని అనినచో, అచట చరణ శబ్దము అనుశయమునకు ఉపలక్షణము అనగా జీవాత్మభుక్త శేషకర్మ సంస్కారముల తోడ తిరిగివచ్చును అనెడు అర్థమును కర్ష్ణాజిని ఆచార్యుడు చెప్పినాడు. కనుక విరోధము లేదు.

## (301) III-1-10

సూ. **ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్**

క్ర. **ఆనర్థక్యమ్, ఇతి, చేత్, న, తదపేక్షత్వాత్**

ప్ర.అ. ఆనర్థక్యమ్ = **సార్థకము కాదు,** ఇతి చేత్ = **అని అనినచో,** న = కాదు, తదపేక్షిత్వాత్ = **కర్మాశయమందు ఆచారము ఆవశ్యకము.**

వి. **చరణ శబ్దమునకు కారణము లేకయే కర్మసంస్కారము ఉపలక్షణమని అనుట అర్థము లేనిదని చెప్పుట సరికాదు. పైన చెప్పిన సమాధానము అన్ని విధాల ఉచితము. కర్మ సంస్కార రూపమయిన అనుశయము పూర్వము చేసిన శుభాచరణముల చేతనే ఏర్పడుచున్నది. కర్మాశయమునకే ఆచారము అపేక్షితమైనది. అందువలన చరణ శబ్దము నిరర్థకము కాదు.**

## (302) III-1-11

సూ. **సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః**

క్ర. **సుకృతదుష్కృతే, ఏవ, ఇతి, తు, బాదరిః**

సుకృతదుష్కృతేః = **శుభ అశుభ కర్మము,** ఏవ = **లే,** ఇతి = **ఇట్లు అని,** తు = **కాని,** బాదరిః = **బాదరి అనే ఆచార్యుడు**

ప్ర.అ. కాని, చరణ శబ్దానికి సుకృత దుష్కృతాలే, శుభాశుభకర్మలే అర్థము అని బాదరి మహర్షి అభిప్రాయము.

వి. **అచార్య బాదరి అభిప్రాయము ఏమనగా చరణ శబ్దము సుకృత దుష్కృత కర్మలు రెండింటికి ప్రయుక్తము చేయబడినది.** అంటె ఇక్కడ ఉపలక్షణమును ఒప్పుకొనే అవసరము లేదు. ఇంతకు ముందరి సూత్రములో ప్రయుక్తమైన "రమణీయచరణాః" అంటే పుణ్యకర్మములు, "కపూయచరణా" అంటే అశుభకర్మముల వాచకములు.

అంటే రమణీయచరణములు శుభకర్మాశయములు అని, కపూయ చరణములు అంటే అశుభ కర్మాశయములు అని ఒప్పుకోవాలి. అపుడు జీవాత్మ అవశేషకర్మ సంస్కారముల తోడనే తిరిగి

వస్తుంది అని సిద్ధము అవుతుంది. లౌకిక మరియు వైదిక కర్మలన్ని జీవాత్మలో సంస్కారములు మరియు ధర్మాధర్మముల స్థితిని నిర్మిస్తాయి. ఆ సంస్కారములు, ధర్మాధర్మస్థితులుయే జీవాత్మకు ముందరి జన్మగ్రహణాన్ని కల్గిస్తాయి. **"చరణ" శబ్దముతో జీవాత్మ కర్మసంస్కారములతో తిరిగివస్తుందని నిశ్చయమౌతుంది.**

## (3) అనిష్టాదికార్యధికరణము (89)

## (303) III-1-12

సూ. **అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్**

క్ర. **అనిష్టాదికారిణామ్, అపి, చ, శ్రుతమ్**

ప్ర.అ. అనిష్టాదికారిణామ్ = **అనిష్ట అనగా అశుభకర్మలు చేయువారి యొక్క,** అపి = **కూడ,** చ = **మరియు,** శ్రుతమ్ = **శ్రుతిలో చెప్పబడినది.**

వి. **అనిష్టాది, అనగా అశుభకర్మలు చేయువారికి కూడా చంద్రలోక గమనము గూర్చి శ్రుతిలో చెప్పబడినది కనుక శుభకర్మలు చేయు వారికే చంద్రలోకము ప్రాప్తిస్తుంది అని చెప్పటము సరికాదనీ శంక ఇచ్చట వస్తుంది.**

కౌషీతకీబ్రాహ్మణ ఉపనిషత్తులో "యే వైకే చా స్మాల్లోకాత్ ప్రయాంతి, చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి" (కౌషీ.బ్రా.ఉ. I-2)

"ఏ ప్రాణియైనా ఈ లోకము నుంచి గమనము చేసి వెళ్లుతుందో, ఆ ప్రాణులన్నీ చంద్రలోకమునే ప్రాప్తిచెందుతాయి." (కౌషీ.బ్రా.ఉ.I-2)

అంటే ఈ లోకము నుండి వెళ్లిన ప్రాణులన్ని చంద్రలోకముకే వెళ్లుతాయి. **దీనివలన అశుభకర్మలు చేసిన ప్రాణులుకూడా చంద్రలోకమునకే వెళ్లాలి కదా!**

**అయితే శ్రుతిలో ఇష్టాపూర్త మొదలైన శ్రేష్ఠకర్మలు చేయువారు ధూమమార్గములో చంద్రలోకము వెళ్లుతారని** (ఛాం.ఉ.V-10-3) **చెప్పినది పైన చెప్పబడిన దానికి విరోధము అవుతుందని అనిపిస్తుంది.**

**ఈ సంశయమునకు సమాధానము ఈ తరువాతి సూత్రములో ఇవ్వబడుతున్నది.**

(కౌషీ.బ్రా.ఉ I-2; ఛాం.ఉ. V-10-3)

## (304) III-1-13

సూ. **సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతిదర్శనాత్**

క్ర. **సంయమనే, తు, అనుభూయ, ఇతరేషాం, ఆరోహ అవరోహౌ, తద్గతి దర్శనాత్**

ప్ర.అ. సంయమనే = **యమలోకములో,** తు = **కాని,** అనుభూయ = **అనుభవించిన తరువాత,** ఇతరేషాం = **అశుభకర్మలలో వుండువారు,** ఆరోహఅవరోహౌ = **పైకివెళ్లుట, క్రిందికి వచ్చుటలు యగును,**

తద్గతిదర్శనాత్ = **ఆ గతులు ఉపనిషత్తులలో వుండుట వలన**

వి. కౌశీతకీబ్రాహ్మణ ఉపనిషత్తులో (కౌషీ.బ్రా.ఉ. I-2) పాపకర్మలతో సన్నద్ధులైనవారు చంద్రలోకమునకు గమనము చేస్తారని చెప్పలేదు. **శ్రేష్ఠ శుభకర్మల ఫలములననుభవించటము కోసమే ప్రాణులు స్వర్గలోకమునకు వెళ్లుతారు. "చంద్ర లోకము స్వర్గలోకమునకు ద్వారముగా నున్నది."** (కౌషీ.బ్రా.ఉ. I-3)

చంద్రలోకములో అశుభకర్మఫలముల అనుభూతికి వ్యవస్థలేదు (ఆ వ్యవస్థ నరకములో నున్నది). కావున శ్రేష్ఠకర్మలయందు రతులైనవారు - సంలగ్నులైనవారు మాత్రమే చంద్రలోకమునకు పోవుదురు.

అందుకు భిన్నముగా అశుభకర్మరతులు - పాపకర్ములు తమ అశుభకర్మఫలముల అనుభూతికొరకు యమలోకమునకు వెళ్లుదురు. అచట ఆ అశుభకర్మల ఫలములననుభవించి మర్త్యలోకమునకు (మనుష్యలోకమునకు) వచ్చి మరల తమ నవీనకర్మల అనుసారము స్వర్గమునకుగాని, నరకమునకుగాని వెళ్లుదురు. అనగా ఊర్ధ్వగతి లేక అధోగతి చెందుదురు.

ఈ విషయము కఠోపనిషత్తు యందు చెప్పబడినది. నచికేతునితో యమధర్మరాజు ఇలా అన్నాడు. "ప్రమత్తుడగు అజ్ఞానికి విత్త (సంపత్తి) మోహమున ముగ్ధుడైనందున పరలోకమార్గము కనిపించదు. ఇదియే వాస్తవలోకము, పరలోకములేదు అని తలచువారు మరల మరల నాశనమగుచున్నారు" (కఠ.ఉ. I-2-6) దీని వలన శ్రేష్ఠకర్మములు చేయువారలే పితృయానమార్గములో లేక ఇంకొకమార్గములో స్వర్గలోకమునకు వెళ్ళుతారు మరియు అశుభకర్మలు చేయుప్రాణులు నరకమునకు వెళుతారు అని స్పష్టము అవుతుంది.

**కౌషీతకీ బ్రాహ్మణమున** (కౌషీ.బ్రా.ఉ. I-2) **చెప్పబడిన చంద్రలోకమునకు గమనము చేయువారందరు శ్రేష్ఠకర్మలవారే.**

**ఎందుకంటే చంద్రలోకము నుండి మరలిపోవు వారి గతి కర్మల ప్రకారమే వుంటుందని చెప్పబడినది.**

**ఈ రెండు శ్రుతులలో** (కౌషీ.బ్రా.ఉ. I-2 **మరియు** కఠ.ఉ. I-2-6) **ఏమీ విరోధము లేదు.**

(కౌషీ.బ్రా.ఉ. I-2; కఠ.ఉ. I-2-6, ఛాం.ఉ. V-10-3)

## (305) III-1-14

సూ. స్మరన్తి చ

క్ర. స్మరన్తి, చ

ప్ర.అ. స్మరంతి = **స్మృతులలో చెప్పబడినది,** చ = **కూడా**

వి. **స్మృతులు కూడా శుభకర్మలు చేయు వారి, అశుభకర్మచేయు వారి గతులు ఈ విధముగనే చెప్పినవి.**

"శుభాశుభ ఫలం కర్మ
మనోవాగ్దేహ సంభవమ్।

కర్మజాగత యోన్యూణాం
ఉత్తమాధమ మధ్యమాః॥" (మనుధర్మ శాస్త్రము XIII-3)

"మనస్సు, వాక్కు, దేహముల వలన కలిగిన కర్మములు శుభ మరియు అశుభ ఫలములు కలిగియుండును. ఈ కర్మముల నుండియే ఉత్తమ, మధ్యమ, అధమ జన్మములు గతులు) కలుగును. ఉత్తమ కర్మముచే దేవత్వమును, మధ్యమ కర్మముచే మనుష్యత్వమును, అధమ కర్మముచే పశుపక్ష్యాదుల జన్మములును కలుగును"

భగవద్గీతలో

"అనేక చిత్త విభ్రాంతులగుచు వారు
మోహజాల సమావృతులు యగుచు
కామ భోగములందు మునుగుచుండి.
అశుభ నరకమున పడుచునుండ్రు" (భ.గీ. XVI-16)

**ఈ విధముగా స్మృతుల ప్రకారము గూడ శుభకర్మముల వారు శుభలోకములకు అశుభ కర్మములవారు నరకమునకు పోవుదురు.**

**అశుభ కర్మముల వారు స్వర్గమునకు పోరు, నరకమునకు పోవుదురు.**

(మను.ధ.శా. XIII-3; భ.గీ. XVI-16)

## (306) III-1-15

**సూ. అపి చ సప్త**

**క్ర. అపి, చ, సప్త**

**ప్ర.అ.** అపి = **మరియు,** చ = **కూడ,** సప్త = **ఏడు నరకములు**

**వి. స్మృతులలో (పురాణములలో) సప్తనరకములు గూర్చి వున్నది.** ఏడిపించే ఆ ఏడు నరకములు రౌరవ, మహారౌరవ, వహ్ని, వైతరణీ, కుంభీపాకము, తమిస్ర, అంధతమిస్ర అనునవి. ఇవియే రౌరవాది నరకములు.

**ఈ విధముగా పాపములు చేయువారు నరకమునకే వెళ్ళుదురు. కాని చంద్రలోకమునకు కాని, స్వర్గమునకుకాని** వెళ్లరు.

## (307) III-1-16

**సూ. తత్రా పి చ తద్వ్యాపారాదవిరోధః**

**క్ర. తత్ర, అపి, చ, తద్వ్యాపారాత్, అవిరోధః**

**ప్ర.అ.** తత్ర = **ఆ ఏడు నరకములలో,** అపి = **కూడ,** చ = **మరియు,** తద్వ్యాపారాత్ = **ఆ యమరాజుకు అనుకూలమైన, ఆయన ఆజ్ఞానుసారము కార్యములు కావటముతో,** అవిరోధ = **విరోధము లేదు.**

**వి. వేరు వేరు సప్తనరకములలో వేరు వేరు చిత్రగుప్తులు మొదలైన అధికారులు వుంటే, యమరాజుకు అధికారానికి ఆటంకము జరుగును అంటే అట్లు కాదు. ఆ అధికారులందరూ ఆయనకు**

**అనుకూలంగా ఆయన అధికారములో వుంటారు. కావున యమపాలనలో, యమదండనములలో ఏమీ విరోధము లేదు.**

## (308) III-1-17

**సూ. విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్**

**క్ర. విద్యార్మణోః, ఇతి, తు, ప్రకృతత్వాత్**

ప్ర.అ. విద్యాకర్మణోః = **జ్ఞానము, మంచి కర్మలు ఈ రెండింటికి,** ఇతి = **అని చెప్పుట సమంజసము,** తు = **మాత్రమే,** ప్రకృతత్వాత్ = **ఇక్కడ ప్రకరణమగుట వలన.**

వి. ఈ సందర్భములో విద్యా అంటే ఉపాసనా, కర్మ అంటే ఇష్ట-యజ్ఞములు. విద్యామార్గము (ఉపాసనామార్గము) దేవయాన సాధనము. కర్మమార్గము పితృయాన సాధనము. ఈ రెండు మార్గాలలోనూ పోనివారు, క్షుద్రులైనవారు, జనన మరణ రూపమైన మూడవ మార్గమును పొందుతారు. కాబట్టి వారికి చంద్రలోకప్రాప్తి లేదు అని అభిమతము.

పంచాగ్నివిద్యలో ప్రవాహణుడు అడిగినాడు. "ఈ చంద్రలోకము ఎందుకు నిండటము లేదో ఎరుగుదువా?" (ఛాం.ఉ. V-3-3) అని, దీనికి సమాధానము "ఈ రెండు మార్గములలో పోని క్షుద్రులు, మాటిమాటికి పుడుతూ, చస్తూవుండే దేహులైనవారు పుట్టు-చావు అనే వేరే మార్గమున పోతారు. కావున ఈ లోకము ఎన్నడూ నిండదు".

విద్యామార్గము అనే ఉపాసనామార్గము మరియు కర్మమార్గము ద్వారా పోని వారికి చంద్రలోకప్రాప్తి వుండదు. కావున ఆ లోకము నిండదు. (అంటే పుట్టు-చావు అనే మార్గములో పోయేవారే ఎక్కువగా వుంటారు!) జనన మరణ మార్గములో పోయే మార్గములో మిగతావారు పోతారు.

(ఛాం.ఉ. V-3-3)

## (309) III-1-18

**సూ. న తృతీయే తథోపలబ్ధేః**

**క్ర. న, తృతీయే, తథా, ఉపలబ్ధేః**

ప్ర.అ. న = **కాదు,** తృతీయే = **ఆ మూడవ మార్గములో,** తథా ఉపలబ్ధేః = **అట్లు ఉపలబ్ధమగుట వలన అట్లు చెప్పబడినందు వలన.**

వి. **విద్యా మరియు శ్రేష్ఠకర్మల సత్పాత్రులైన వారు కాక మూడవ శ్రేణి ప్రాణులు అనగా అసత్కర్మలు చేయువారి కొరకు వేరే ఏగతి యొక్క నియమము లేదు.** ఛాందోగ్యోపనిషత్తులో (V-10-8) "దేవయాన పితృయానములు అను రెండు మార్గములపై లోకములకు పోనివారు క్షుద్రులు. అట్టివారు మాటిమాటికి పుట్టుచు చచ్చుచుందురు. వారికి మర్త్యలోకమే తృతీయస్థానము". దీనివలన వారికి పరలోకగమనము లేదు. **అందుచేత పైన చెప్పబడిన తృతీయమార్గమున యమయాతనా రూపమైన నరకలోక గమనము అంతర్భూతము కాదు.**

(ఛాం.ఉ. V-10-8)

## (310) III-1-19

**సూ. స్మర్యతేఽపిచలోకే**

**క్ర. స్మర్యతే, అపి, చ, లోకే**

**ప్ర.అ.** స్మర్యతే = **స్మృతులలో,** అపి = **కూడ,** చ = **మరియు,** లోకే = **లోకములో**

**వి.** స్మృతులలో కూడ మూడు మార్గముల గురించి చెప్పబడినది.

"పైకిపోవును సాత్త్వికి

పీఠి మధ్యనే రజసి

నీచ గుణము వలన

నేరు క్రిందకే తమసి" (భ.గీ. XIV-18)

అంటే, సాత్వికులు దేవయాన పితృయానముల పైకి వెళుతారు. రాజసులు మర్త్యలోకములోనే పుట్టుతు చస్తూ వుంటారు. తామసులు అధోలోకములకు జారిపోతారు.

**ఈ విధముగా స్మృతులలో చెప్పబడినది. ఇదియే విషయము పురాణములలో గూడ చెప్పబడినది. లోకములో గూడ ఊర్ధ్వలోకము, మర్త్యలోకము, అధోగతి(నరకము) ప్రసిద్ధము.**
(భ.గీ. XIV-18)

## (311) III-1-20

**సూ. దర్శనాచ్చ**

**క్ర. దర్శనాత్, చ**

**ప్ర.అ.** దర్శనాత్చ = **శ్రుతిలో చెప్పబడి వుండటము వలన కూడ**

**వి.** ఉపనిషత్తులలో కూడ ప్రాణికి అధోగతి ప్రాప్తి అవుతుందని వున్నది.

ఈశావ్యాస్యోపనిషత్తులో "అసుర్యానామ తేలోకా అంధేన తమసావృతాః; తాంస్తేప్రేత్యాభిగచ్ఛంతి, యేకేచాత్మహనోజనాః" (ఈ-3)

"ఆసురీ అని అనబడు లోకములు వున్నవి, అవి అన్నియు అజ్ఞానము, దుఃఖము, క్లేశము అని అనబడు మహా అంధకారముతో కప్పబడి వుండును. ఆత్మహనులైన జనులు, వారు మరణించిన తరువాత అటువంటి భయానకలోకములను మరల మరల ప్రాప్తి చెందెదరు".

**ఈ విధముగా మూడవ గతిలో యమయాతనా రూపమైన గతి యొక్క అంతర్భావము లేదు.**
(ఈశా.ఉ.-2)

## (312) III-1-21

**సూ. తృతీయశబ్దావరోధః స్సంశోకజస్య**

**క్ర. తృతీయశబ్దావరోధః, సంశోకజస్య**

ప్ర.అ. తృతీయశబ్దావరోధః = **మూడవ శబ్దముచే అర్థమైన వాటిని,** సంశోక జస్య = **స్వేదజమైనదిగా స్వీకరించాలి.**

వి. ఛాంధోగ్యోపనిషత్తులో

"తేషాం ఖల్వేషాం భూతానాం,

త్రీణ్యేవ బీజాని భవంతి,

అండజం, జీవజం, ఉద్భిజ్జమితి॥" (ఛాం.ఉ. VI-3-1)

"ఈ భూతములు అండజములు, జరాయుజములు, ఉద్భిజములు అని మూడు విధములుగా వున్నవి"

అని అనటములో స్వేదజములు అనే నాలుగు విధములైన ప్రాణులను గూర్చి చెప్పలేదు అనే ప్రశ్న వస్తే అట్లు కాదు.

**ఆ ఉద్భిజ్జములు (విత్తుల నుండి వచ్చినవి) అని అనిన వాటిలో స్వేదజములు (చెమట నించి వచ్చినవి) అంతర్భూతములు ఎందుకనగా ఆ రెండుకూడ పృథివి, జలముల సంయోగము చేత ఉత్పన్నమైనవి కనుక రెండు కూడ ఛేదించి వచ్చినవే.** (భూమిని ఉద్భిజ్జము, జలమును స్వేదజము ఛేదించివచ్చినవి)

**ప్రాణులన్నిటిని గూర్చి మూడు గతులన్నది సమంజసము**

(ఛాం,ఉ. VI-3-1)

## 4. సాభావ్యాపత్త్యధికరణము (90)

## (313) III-1-22

**సూ. (తత్)సాభావ్యాపత్తిరుఉపపత్తేః**

**క్ర. (తత్) సాభావ్యాపత్తిః, ఉపపత్తేః**

ప్ర.అ. తత్ = **ఆ,** సాభావ్యాపత్తిః = **సదృశభావమును,** ఉపపత్తేః = **ఎందుకంటే ఈ సందర్భములో అది యుక్తము.**

వి. ఛాంధోగ్యోపనిషత్తులో

"అథ ఏతమే వాధ్వానమ్, పునర్నివర్తంతే,

యథైతమాకాశమ్, ఆకాశాద్వాయుం,

వాయుర్భూత్వా, ధూమో భవతి,

ధూమోభూత్వా అభ్రం భవతి, అభ్రం భుత్వా మేఘోభవతి, మేఘో– భూత్వా ప్రవర్షతి"

(ఛాం.ఉ. V-10-5)

"జీవాత్మ మరలివచ్చును. ఆకాశమై, ఆకాశము నుండి వాయువై, వాయువు నుండి ధూమయై, ధూమము నుండి, వేడి వెలుగుయై, వేడి వేలుగు నుండి మేఘమై, మేఘము నుండి బాగుగా వర్షమై వర్షిస్తుంది."

అనగా జీవాత్మ ఆయాతత్త్వముల రూపములో పరిణితినంది మరలి రావటము యుక్తి సంగతము. **అయితే ఆ జీవాత్మ ఆయా తత్త్వముల సాదృశ్యాన్ని, పోలికను, పొందుతుందే కాని, స్వరూపాన్ని పొందదు. కావున తిరిగివచ్చే జీవి దుఃఖతప్తుడై కరిగిపోయి క్రమంగా వాటి వాటి సాదృశ్యాన్ని పొందుతూ వర్షరూపములో దిగి, భూమికి తిరిగి వస్తాడని భావము.**

(ఛాం.ఉ. V-10-5)

## 5. నాతిచిరాధికరణము (91)

## (314) III-1-23

**సూ. నాతిచిరేణ విశేషాత్**

**క్ర. న, అతిచిరేణ, విశేషాత్**

ప్ర.అ. న = **కాదు,** అతిచిరేణ = **దీర్ఘకాలము వరకు,** విశేషాత్ = **మీదకు వెళ్లే అపేక్షకు, క్రిందకు దిగే దశకు భేదము వున్నందున**

వి. పైకి పోవటముగల వర్ణనము కర్మఫలభోగ సంబంధమైనది. (కౌషీ.బ్రా.ఉ. I-2, కఠ.ఉ. I-2-6, ఛాం. ఉ. V-10-3). కావున మధ్య వచ్చు పితృలోకము మొదలైన చోటుల విలంబమగుట సంభవము. కాని తిరిగి వచ్చునపుడు కర్మఫలభోగము సమాప్తమైనందున విలంబము లేదు.

**ఈ ప్రకారము పైకిపోవుట కంటె తిరిగి వచ్చుట యందు విశేషము గలదు. పైకి వెళ్ళు తోవలో కర్మఫలభోగమునకు వ్యవధి కలదు. తిరుగువచ్చు తోవలో విలంబము లేదు.**

**తర గతికి సమయము పట్టును. తిరుగు గతి శీఘ్రముగా అగును.**

(పైకి పోవటముకు సమయము అవసరము)

(కౌషీ.బ్రా.ఉ. I-2; కఠ.ఉ. I-2-6; ఛాం.ఉ. V-10-3)

## 6. అన్యాధిష్ఠితాధికరణము (92)

## (315) III-1-24

**సూ. అన్యాధిష్ఠితేషు పూర్వవదభిలాపాత్**

**క్ర. అన్యాదిష్ఠితేషు, పూర్వవత్, అభిలాపాత్**

ప్ర.అ. అన్యాధిష్ఠితేషు = **కేవలము సన్నిధి మాత్రముననే నివాసముందును,** పూర్వవత్ = **పూర్వ, ఇంతకు ముందరి సూత్రములో వలె,** అభిలాపాత్ = **ఈ విషయము చెప్పబడుట వలన**

వి. ఏ విధముగా పూర్వ సూత్రములో (సూ. 313), మరల తిరిగివచ్చు ప్రాణి (జీవాత్మ) ఆకాశాది రూపములో పరిణితి కాకుండానే సాదృశ్యముగా, సాభావముగా, అను రూపములో సంసర్గముగా, సంయోగముగా వుంటుందని చెప్పబడినదో, అదే విధముగా ఈ సూత్రములో ధాన్యము మొదలైన

వాటి సందర్భములో వుంటుందని తెలిసికోవాలి.

**ఎందుకంటే చంద్రమండలము నుండి తిరిగి వచ్చేవారు వర్షరూపములో భూమిమీద పడిన తరువాత ఏమౌతుందో చెప్పబడింది. "తరువాత వడ్లు, గోధుమలు, ఓషధులు, వనస్పతులు, నువ్వులు, మినుముల మొదలగునవి ఉద్భవించును"** (ఛాం.ఉ. V–10–6)

అందుచేత ఈ ధాన్యము మొదలైన వాటియందు తన కర్మఫలమనుభవించుటకు ఏ జీవాత్మ మొదటి నుండి కలదో అది వుండగానే ఈ జీవాత్మ చంద్రలోకము నుండి వచ్చి, ఆ జీవాత్మ కూడి అనురూపమున పురుషుని ఉదరమందు చేరును.

**ఆ జీవాత్మ, అట్లు, ధాన్యము, నువ్వులు, మినుములు మొదలైన స్థావర జడయోనుల రూపములనందకుండును.**

(ధాన్యము కేవలము (లిఫాఫా) పాత్ర మాత్రమే. జీవాత్మ లిఫాఫా (కవరు, పాత్ర)లో వున్న పత్రము, సందేశము)

(ఛాం.ఉ. V–10–6)

---

## (316) III-1-25

**సూ. అశుద్ధమితి చేన్న శబ్దాత్**

**క్ర. అశుద్ధమ్, ఇతి, చేత్, న, శబ్దాత్**

ప్ర.అ. అశుద్ధమ్ = **అశుద్ధ పాపకర్మలు,** ఇతి చేత్ న = **వుండును అని అనినచో అట్లు కాదు,** శబ్దాత్ = **శ్రుతి వలన**

వి. "ఒకవేళ జీవాత్మ ధాన్యములో వుంటే ఆ ధాన్యమును దంచుట, **నూరుట, ఉడికించుట, వేయించుట, నములుట మొదలైన పాపకర్మలు అంటుతాయి కదా!, అందెన్ని జీవముల హింస అగుచున్నది ? ఎన్ని జీవములు హింసించి ఒక జీవుడు ఉదర పోషణము చేసుకొంటున్నాడు ?" అని అంటే, అది సరికాదు.**

ఎందుకనగా ఈ ప్రకరణములో పురుషుడు అగ్నిగా చెప్పబడినాడు (ఛాం.ఉ. VI–6–2) మరియు అన్నము యొక్క యజ్ఞము గూర్చి చెప్పబడినది. అది కాక ఉపనిషత్తులలో అన్నము గ్రహణము గూర్చి పలుమారులు ఉల్లేఖించబడినది కనుక దానివలన హింస జరుగదు. ధాన్యములో సంసర్గమై యున్నపుడు ప్రాణులు సుషుప్తా వస్థలో వుంటారు. **ఆ ధాన్యము, భూమి జలములతో సంబంధము అయినపుడు వాటికి చైతన్యము వస్తుంది మరియు అన్ని సుఖ దుఃఖముల జ్ఞానము వస్తుంది, అంతకు ముందు కాదు. ఇందువలన అన్నగ్రహణము వలన హింస కాదు.**

(ఛాం.ఉ. VI–6–2)

---

## (317) III-1-26

**సూ. రేతఃసిగ్యోగోఽథః**

**క్ర. రేతః, సిగ్యోగః, అథః**

ప్ర.అ. రేతః = **రేతస్సు, వీర్యము;** సిగ్యోగః అథ = **రేతస్సు సీచనము చేయు పురుషునితో కూడ ఆ జీవాత్మకు సంబంధమేర్పడును.**

**వి.** తరువాత ఆ జీవాత్మ అన్నము ఐన ఆ ధాన్యముతో కూడి, పురుషుని ఉదరములోనికి పోయి, అతని వీర్యమందు ప్రవేశించి, ఆ పురుషునితో సంయుక్తమగును. ఆకాశాదుల నుండి అన్నము వరకు ప్రతిచోట కేవలము సంయోగము చేత సాభావము, సదృశము, తదాకారమగుట చెప్పబడినది కాని, స్వరూపముతో కాదు అని తెలియుచున్నది.

## (318) III-1-27

**సూ. యోనేశ్శరీరమ్**

**క్ర. యోనేః, శరీరమ్**

ప్ర.అ. యోనేః = **యోనియందు ప్రవేశమైన తరువాత,** శరీరమ్ = **శరీర, దేహ, ప్రాప్తి చేసుకొంటుంది.**

**వి.** ఈ ప్రకారము స్వర్గము నుండి మరలివచ్చు ప్రాణి మొట్టమొదలు పురుషుని వీర్యముతో పాటు ప్రవేశింప చేయబడును. అపుడు గర్భక్షేత్రముతో సంబద్ధమై ఆ జీవాత్మ తన కర్మఫలముల అనుసారము నవీన దేహమును ప్రాప్తించుకొంటుంది మరియు అచటి నుండియే తన కర్మఫలములభోగము ప్రారంభము అవుతుంది. అంతకు పూర్వము స్వర్గమునుండి దిగివచ్చి వీర్యములో సమాహితము అగునంతవరకు ఆ ప్రాణికి ఏ విధమైన జన్మ మరియు దేహధారణ వుండదు. కేవలం ఆయా ఆకాశము, వాయువు మొదలైన అవలంబనములో వుండుట మాత్రమే చెప్పబడినది.

ఆ ధాన్యముల శరీరముల అధిష్ఠాతలు ఏవో వేరు జీవాత్మలుయే వుంటాయి.

ఈ విధముగా జీవాత్మ యొక్క మూడు విధముల గతులు, పైకి వెళ్ళి, మరల తిరిగివచ్చు ప్రయాణమును గూర్చి చెప్పబడినది.

[**నారాయణ వాక్యము :** ఆ ధాన్య శరీరములు నశించిన వెంటనే వాని అధిష్ఠాన జీవాత్మలు ఉత్క్రాంతి మార్గములో వెళ్లుతాయి. వాటికి గూడా మూడు గతులు మరల వుంటాయి.]

ఇట్లు

**తృతీయాధ్యాయ ప్రథమ పాదము**

# తృతీయాధ్యాయ ప్రథమ పాద సమాసము

## దేహాంతర గమనము

**1. తదనంతరప్రతిపత్త్యధికరణము**

జీవుడు ఒక దేహము నుండి దేహాంతర గమనము చేసినపుడు బీజ రూపములోనున్న సూక్ష్మభూతములైన అన్ని తత్త్వములతో సంయుక్తమై నిష్క్రమణ చేస్తుంటాడు. అన్ని తత్త్వములతో పాటు జీవాత్మలు తమ తమ కర్మల ప్రకారము దేహాంతర గమనము చేస్తుంటాయి. మరణసమయములో జీవుడు భూతసూక్ష్మపరివేష్టితుడై వుంటాడు.

**2. కృతాత్యయాధికరణము**

శేషకర్మానుసారము జన్మలను జీవాత్మ పొందుతుంది. పూర్వకర్మ ఫలములను ఆయాకర్మలకనుగుణమైన లోకములలో అనుభూతి నొంది, శేషకర్మలననుసరించి నవీన జన్మలను జీవాత్మ పొందుతుంది. "చరణ" శబ్దముతో జీవాత్మ కర్మసంస్కారములతో తిరిగివస్తుందని నిశ్చయమౌతున్నది. కర్మశేషం నూతన జన్మస్వరూపాన్ని నిర్ణయిస్తుంది.

**3. అనిష్టాదికార్యధికరణము**

శ్రేష్ఠకర్మలయందు సంలగ్నులైన జీవులు మాత్రమే చంద్రలోకమునకు వెళ్లుదురు. శుభకర్మలవారు శుభలోకములకును, అశుభకర్మలవారు అశుభలోకములకును వెళ్లుదురు. పాపములు చేయువారు నరకమునకేగాని, చంద్రలోకమునకుగాని, స్వర్గమునకుగాని వెళ్లకుందురు. దేవయాన, పితృయానములు అను రెండు మార్గములలో పైకి వెళ్లనివారు క్షుద్రులు. వారు మాటిమాటికి పుట్టుచు చచ్చుచుందురు. వారికి మర్త్యలోకమే తృతీయస్థానము. ఈ మూడవగతిలో యమయాతనారూపమైన అంతర్భావములేదు. ప్రాణులన్నింటికి మూడుగతులన్నది సమంజసము. ఇష్టాపూర్తములు చేయనివారికి కూడా చంద్రలోకప్రాప్తి ఉంది.

**4. సాభావ్యాపత్త్యధికరణము**

జీవాత్మ ఆకాశము, వాయువు, ధూమము, వేడి, వెలుగు, మేఘము, వర్షముయై వర్షిస్తుంది. జీవాత్మ ఆయా తత్త్వముల రూపములో పరిణితి నంది మరలి రావటము యుక్తి సంగతము. జీవాత్మ ఆయా తత్త్వముల సాదృశ్యాన్ని, పోలికను పొందుతుంది కాని, వాని స్వరూపాన్ని పొందదు. అవరోహణములో జీవుడు ఆకాశాదుల సాదృశ్యాన్ని మాత్రమే పొందుతాడు.

**5. నాతిచిరాధికరణము**

జీవుడు తిరిగివచ్చునపుడు కర్మఫలభోగము సమాప్తమైనందున విలంబము వుండదు. పైకి పోవుటకు సమయము అవసరము. పడిపోవుట శ్రీఘ్రముగా అగును. చంద్రలోకమునుండి దిగడం శీఘ్రంగానే జరుగుతుంది.

## 6. అన్యాదిష్టితాధికరణము

ధాన్యము మొదలైన వాటియందు తన కర్మఫలములను అనుభవించుటకు మొదలే వున్న జీవాత్మ వుండగానే చంద్రలోకము నుండి వచ్చిన జీవాత్మ మొదలే వున్న జీవాత్మతో పాటు అనురూపమున పురుషుని ఉదరమందు చేరి, ఆ పురుషుని వీర్యము నందు ప్రవేశింపచేయబడి, వీర్యముతోపాటు గర్భక్షేత్రము చేరి, అచట సంబద్ధమై, తన కర్మఫలముల అనుసారము నవీన దేహమును ప్రాప్తించుకొనును. ధాన్యములో వుండిన జీవాత్మలు ఆధారరూప పరికరణములే. జీవునికి ధాన్యాదులతో సంసర్గము మాత్రమే వుంటుంది.

ఇట్లు

**తృతీయాధ్యాయ ప్రథమపాద సమాసము**



# తృతీయాధ్యాయ ప్రథమపాద సారము

## దేహాంతర గమనము

ఒక దేహము నుండి ఇంకొక దేహమునకు దేహాంతర గమనము చేసేది, బీజరూపములో సూక్ష్మభూతములైన అన్ని తత్వములతో సంయుక్తమై నిష్క్రమణ చేసేది, శేషకర్మానుసారము జన్మలనందేది, పూర్వకర్మలను ఆయా కర్మలకనుగుణమైన లోకములలో అనుభూతి నొంది శేషకర్మలననుసరించి నవీన జన్మనందేది, తను చేసిన కర్మల ప్రకారము దేవయాన, పితృయాన, తృతీయ యానములనే మూడు మార్గములలో వెళ్లేది, కర్మఫలభాగము పూర్తియైన తరువాత శీఘ్రముగ క్రిందకు వచ్చేది, తత్వరూపములలో క్రమముగా సూక్ష్మభూతములతో పాటు క్రిందికి దిగేది, వర్షరూపముతోపాటు క్రిందికి దిగి, భూమిని చేరి, ధాన్యరూపములో అనురూపముతో వుండి, పురుషునిచే భుజింపబడి, వీర్యమై, స్త్రీలో గర్భరూపమై, తన సంస్కారములతో పాటు నవీన జన్మమందేది పరిమితరూపములో అవిద్యచే కప్పబడియుండేది అయిన జీవాత్మ దేని అంశమో అదియే బ్రహ్మము.

ఇట్లు

**తృతీయాధ్యాయ ప్రథమపాద సారము**

# III-2
# తృతీయ అధ్యాయము - ద్వితీయ పాదము
## జీవాత్మ పరమాత్మ తత్త్వ విచారణ

## 1. సంధ్యాధికరణము (93)

## (319) III-2-1

**సూ. సంధ్యే సృష్టిరాహ హి**

**క్ర. సంధ్యే, సృష్టిః, ఆహ, హి**

ప్ర.అ. సంధ్యే = **స్వప్నమందు,** సృష్టిః = **సంసారిక పదార్థములరచన,** ఆహ = **శ్రుతి చెప్పినది,** హి = **ఎందుకనగా,**

**వి. స్వప్నావస్థలో జీవాత్మ వలన లోకము మరియు పరలోకములు రెండింటిని చూపబడే ప్రకరణము శ్రుతిలో వచ్చినది.**

బృహదారణ్యక ఉపనిషత్తులో (IV-3-9) లో యాజ్ఞవల్క్యుడు జనకునితో ఇలా అన్నాడు.

"ఈ లోకము, పరలోకము అని రెండు స్థానములు వున్నవి. మూడవది స్వప్నస్థానము. ఇది ఆ రెండింటికి సంధి. ఈ పురుషుడు సంధియందు నిలిచి లోకము, పరలోకముల రెండింటి దర్శనము చేయును. అచట దుఃఖము, ఆనందము రెండింటిని ఉపభోగము చేయును. ఆ పురుషుడు, జీవుడు ఈ స్థూల దేహమును తానే అచేతనముచేసి, వాసనా యుక్తమైన నవీన దేహమును రచించి ఈ జగమును దర్శించును."(బృ.ఉ.IV-3-9)

మరల ఇదే ఉపనిషత్తులో

"ఆ అవస్థలో వాస్తవముగా లేకున్నను రథమును, రథమునకు గూర్చు గుఱ్ఱములను, మార్గమును, ఆనందము, మోద ప్రమోదములను, గుంటలను, సరోవరములను, నదులను సృజియించుకొనును." (బృ.ఉ. IV-3-10)

దీని వలన జాగ్రత్కాల సమానమువలె స్వప్నకాలములో కూడ జీవుడు సంరచన చేస్తుంటాడు. జాగ్రదవస్థలో ఏ సాధనములు, సామగ్రులు, సువిధలు అవసరమో అవి స్వప్నావస్థలో అవసరము లేక యుండును.

**ఈ విధముగా స్వప్నములో సంసారికవస్తువుల రచన జీవుడు తానే చేస్తుంటాడు. ఇది పూర్వపక్షపు వారి వాదము**

(ఛాం.ఉ. IV-3-9, IV-3-10)

## (320) III-2-2

**సూ. నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ**

**క్ర. నిర్మాతారమ్, చ, ఏకే, పుత్రాదయః, చ**

ప్ర.అ. నిర్మాతారం = **జీవాత్మ (పురుషుడు)ను ఇచ్ఛితకర్మల నిర్మాత అని,** చ = **కూడ,** ఏకే = **ఒక శాఖవారు,** పుత్రాదయః = **పుత్రాదుల విషయములో,** చ = **కూడ**

**వి.** పూర్వపక్షము వారు ఇంకా ఇలా అంటున్నారు.

ఒక శాఖవారు జీవాత్మను (పురుషుని) కామము - వాసన మొదలైన వాని నిర్మాణము చేసే వానిగా స్వీకరిస్తారు.

కఠోపనిషత్తులో (II-2-8)

"యః ఏషు సుప్తేషు జాగర్తి, కామం కామం పురుషో నిర్మిమాణః, తదేవ శుక్రం తద్బ్రహ్మ, తదేవామృతమ్ ఉచ్యతే, తస్మిన్ లోకాఃశ్రితాః సర్వే, తదునాత్యేతి కశ్చన, ఏతద్వైతత్"

"జనులు నిద్రించినపుడు, ఈ నానా ప్రకారములైన భోగములను రచించు పురుషుడు స్వయముగా మేల్కొనియుండును. అతడే పవిత్రమైన బ్రహ్మ. అదియే అమృతమని చెప్పబడుచున్నది. సర్వ లోకములు దానిమీదనే ఆధారపడి యున్నవి. దానిని ఎవరును అతిక్రమించలేరు. ఇదియే ఆ ఆత్మ."

ఇచ్చట పురుషుని కామముల నిర్మాతగా చెప్పటము అయినది.

ఇంకను

"ఓ! నచికేతా! పూర్ణాయువు కల పుత్ర పౌత్రులను కోరుకొనుము." అని చెప్పి

"కామానం త్వా కామభాజం కరోమి"

"నేను నిన్ను ఇష్టము వచ్చినట్లు కామనలను అనుభవించే వానిగా చేస్తాను" అని చెప్పబడినది (కఠ.ఉ. I-1-23,24)

ఈ విధముగా ఆయా స్థానములలో "కామ" శబ్దాన్ని పుత్రుడనే అర్థముతో ఉపయోగించినారు.

**కావున, స్వప్నమునందు పుత్రాదులను సృష్టించేది పరమాత్మయే. జాగ్రదవస్థ యందు వలెనే స్వప్నములో కూడా అతడే సృష్టికర్త.**

**అందువలన స్వప్నజగత్తు కూడా వ్యవహారిక జగత్తువలెనె సత్యము ఐనదని పూర్వపక్షమువారి వాదన. దీని సమాధానము తరువాతి సూత్రములో ఇవ్వబడినది.**

(కఠ.ఉ. II-2-8, I-24)

## (321) III-2-3

**సూ. మాయామాత్రం తు కార్త్స్న్యే నానభివ్యక్తస్వరూపత్వాత్**

**క్ర. మాయామాత్రం, తు, కార్త్స్న్యేన, అనభివ్యక్తస్వరూపత్వాత్**

ప్ర.అ. (మాయా=**స్వప్నము, ఎండమావి, దర్పణదృశ్యము, మిథ్య, కనిపించేది, అనిపించేది, ఆలోచించేది మరియు ఉన్నదికానిది, ప్రపంచము, సాంఖ్యము, యోగము, న్యాయము, బౌద్ధము, జైనము, ద్వైతము, దుఃఖము, కల్పన, మనస్సు, జగత్తు).**

వి. మాయామాత్రం = అవి మాయామాత్రమే, కేవలము కల్పనలే, తు = అయితే, కార్త్స్న్యేన న = పూర్ణ రూపముతో అ = జీవాత్మ స్వప్నావస్థలో ఏ ఏ పదార్థముల సంరచన చేస్తుందో లేక చూస్తుందో, వింటుందో, వానిలో స్థాయిత్వము లేనందున ఆయా పదార్థముల మరియు దృశ్యముల ప్రాప్తి కాబడలేదు. ఎందుకంటే, స్వప్నము అయితే సంకల్పముల అభివ్యక్తము మాత్రమే. కావున దానిని మాయ అనుటయే ఉచితము.

ప్రశ్నోపనిషత్తులో దాని గురించి స్పష్టవర్ణన వున్నది.

"జాగ్రదవస్థ యందు నేత్రాది ఇంద్రియములతో ఏది చూడబడి నదో, దానినే స్వప్నములో చూచుచుండును. వినినదానినే మరల వినును. అనుభూతమైన విషయములను స్వప్నమందు చూచుచున్నాడు. కాని విచిత్రమైన రూపములో చూచుచున్నాడు. వినినవి-విననివి, చూచినవి-చూడనివి కూడ చూచుచున్నాడు. (ప్ర.ఉ. IV-5)

దీనివలన స్వప్నసృష్టి మాయామాత్రమేనని తెలుస్తున్నది. అవి జాగ్రత్తలో వలె సత్యములు, నిజములు కావు.

**జీవుడు కర్మఫలములననుభవించుటకొరకు పరమాత్మ తన యోగ మాయచే అతని కర్మసంస్కారముల వాసనలననుసరించు అటువంటి దృశ్యములను చూచుటకు అతనినే నియోగించు చున్నాడు. స్వప్నావస్థయందు శుభాశుభ కర్మఫలములను జీవాత్మ అనుభవించుట లేదు.**

**జీవాత్మ కామ్యవిషయముల నిర్మాతకాదు. అది పరమాత్మను ఉద్దేశించి చెప్పబడినదే.**

---

## (322) III-2-4

**సూ. సూచకశ్చ హి శ్రుతేరాచక్షతే చ తద్విదః**

**క్ర. సూచకః, చ, హి, శ్రుతేః, ఆచక్షతే, చ, తద్విదః**

ప్ర.అ. సూచకః = **సూచకము,** చ = **కూడ,** హి = **ఎందుకంటే,** శ్రుతేః = **శ్రుతి,** ఆచక్షతే = **అట్లే చెప్పినది,** చ = **కూడ,** తద్విదః = **స్వప్న విషయములో శాస్త్రజ్ఞానులు.**

వి. భవిష్యత్తులో జరుగబోయే శుభాశుభ కర్మఫలముల జ్ఞానము స్వప్నావస్థలో ప్రాప్తిస్తుంది. స్వప్నము భవిష్య సూచకమని స్వప్నశాస్త్ర విదులు అంటున్నారు.

"యదా కర్మసు కామ్యేషు స్త్రియగ్ం స్వప్నేషు పశ్యతి, సమృద్ధిం తత్ర జానీయాత్, తస్మిన్స్వప్న

నిదర్శనే, తస్మిన్ స్వప్న నిదర్శనే" (ఛాం.ఉ. V-2-9)

"కామ్యకర్మ చేసేటప్పుడు స్వప్నములో స్త్రీని దర్శిస్తే ఆ కర్మలందు సమృద్ధి కలుగుతుంది".

ఐతరేయఆరణ్యకములో, కౌశీతకీబ్రహ్మణములో స్వప్నములో కనిపించే దృశ్యములనుగురించి, ఫలములనుగురించి వున్నది. శ్రుతి ప్రమాణము వలన స్వప్నము సర్వథా వ్యర్థము కాదని తెలుస్తుంది.

స్వప్నాల వల్ల సూచితమయ్యే శుభాశుభాలు, లాభనష్టాలు సత్యములు కావచ్చును. కాని స్వప్నములో కనిపించే దృశ్యాలు అసత్యాలే.

స్వప్న శాస్త్రజ్ఞులు కూడా అదే అంటున్నారు. రామరక్షాస్తోత్రములో బుధకౌశికఋషికి శివుడు స్వప్నములో కనిపించి, రామరక్షా స్తోత్రమును బోధించినాడనీ, బుధకౌశికఋషి మరునాడు ఉదయం ఆది వ్రాసినాడనీ రామరక్షాస్తోత్రములో వున్నది.

స్వప్నమునందలి ఘటనలు జీవాత్మయొక్క స్వతంత్ర రచనలు కావనియు, జీవాత్మ నిమిత్తమాత్రుడుఅనియు, సమస్తము జీవాత్మ కర్మానుసారము పరమాత్మశక్తిద్వారానే సంపన్నమౌతుందని తెలుస్తుంది. ఈ విధముగా స్వప్నకాలములో చూడబడిన దృశ్యములు శుభాశుభసూచకములు అని సిద్ధము అవుతుంది.

(ఛాం.ఉ. V-2-9 ; ఐ.ఆరణ్యకము III-2-4-24, రామరక్షా స్తోత్రము)

**[నారాయణ వాక్యము :-**

స్వప్నములో కనిపించినవి శుభాశుభ సూచకములు, సందేశదాయకములు. భవిష్యత్తును గూర్చి సూచనలనిస్తాయి. ఇది స్వానుభవము. భగవద్గీత రాస్తున్నపుడు, 1983లో, స్వప్నములో కనిపించి మౌనబోధ చేసిన వ్యాసమహర్షి మరియు అయిన సందేశము వాస్తవమును గూర్చి తెలుపుతున్నాయని తరువాత నిదర్శనము అయినది. బ్ర.సూ.(342) III-2-24

బుధకౌశికునివలె నారాయణ ఈ స్వప్నములో కనిపించిన వ్యాసమహర్షి గురించి, ఆయన సందేశమును గురించి, జాగృతి కాగానే సుజనాదేవిగారికి తెలిపి వ్యాసమహర్షి చిత్రం వేసినారు. తరువాత వ్యాసమహర్షి చిత్రమును పోలిన దివ్యమహాత్ముని దర్శనము ఇజ్రాయెలులో అయినది.

మంథనిలో బ్రహ్మసూత్రాలు వ్రాస్తున్నపుడు స్వప్నములో బ్రహ్మ కనిపించి పురుష సూక్తము బంగారు వీణతో వాయించి తెలిపిన సంగతి తెల్లవారగానే శ్రీ పాండుచారి గారికి వినిపించటమైనది.

స్వప్నము భవిష్యత్తు సూచకము సందేశదాయకము బ్ర.సూ.(342) III-2-24

లలితా సహస్రనామస్తోత్రము రాస్తున్నపుడు నిద్ర-కల-నిజము కాని నిద్ర-కల-నిజముల కలయికయందు (Trans-Vision అతీత దర్శనము నందు) శ్రీ అద్వయానంద స్వామి రాత్రి రెండు గంటలకు బరోడాలో కనిపించి పంచదశి మంత్రార్థము బోధించినారు.]

## (323) III-2-5

**సూ. పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బంధవిపర్యయౌ**

**క్ర. పరాభి ధ్యానాత్, తు, తిరోహితమ్, తతః, హి, అస్య, బంధవిపర్యయౌ**

ప్ర.అ. పరాభిధ్యానాత్ = **పరబ్రహ్మను గూర్చి నిరంతర ధ్యానమ్ము వలన,** తు = **కాని,** తిరోహితం = **ఆవృతమై, దాచబడి యన్న,** తతః = **ఆ బ్రహ్మ ద్వారానే,** అస్య = **ఆ జీవాత్మ యొక్క,** బంధ విపర్యయౌ = **బంధ మోక్షములు కలుగును.**

వి. **జీవాత్మ పరబ్రహ్మముయొక్క అంశ. కావుననే జీవాత్మకూడ పరమాత్మతో సదృశమైన గుణములు, శక్తులు కలవాడు. దీనిలో సందేహములేదు. అయితే ఆ గుణములు తిరోహితములై వెనుకకు తిప్పబడి, లోన దాచబడియున్నది. అందుచే అవి, వాని ఉపయోగము కనబడుటలేదు.**

**ఆ పరమాత్మని, పరబ్రహ్మను నిరంతరము ధ్యానము చేయుట వలన తిరోహితములైన జీవునిలోని దివ్యగుణములు పురోహితములై తిరిగి ప్రకటమగును.**

(Impressions will become expressions) (అంతర్వ్యక్తములు అభివ్యక్తమ్ములగును)

శ్వేతాశ్వతర ఉపనిషత్తులో

"జ్ఞాత్వాదేవం సర్వపాశాపహానిః

క్షీణై: క్లేశైర్జన్మ మృత్యు ప్రహాణి

తస్యాభిధ్యానాత్తృతీయం దేహభేదే

విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః" (శ్వే.ఉ. I-11)

"ఆ పరమాత్మను తెలిసికొనినపుడు పాశరూపమగు అజ్ఞానమంతయు నశించును. అజ్ఞానము నశించుటవలన జనన మరణరూపమైన క్లేశములు, దుఃఖములు నశించును. ఆ పరమాత్మను ధ్యానించుట వలన దేహము విడిచిన పిమ్మట విశ్వైశ్వర్యమును పొంది జీవుడు పరబ్రహ్మ స్వరూపుడై ఆప్తకాముడగుచున్నాడు"

పరమేశ్వరారాధనము లేక దివ్యగుణములు వాటంతట అవే ప్రకటముకాజాలవు. ఎందుకంటే జీవునికి అనాదిసిద్ధమైన బంధనము వున్నది. దానినుండి ముక్తికలుగుట జగద్కారకుడైన పరమేశ్వరుని అధీనములోని విషయము.

"సః విశ్వకృద్విశ్వవిదాత్మయోనిః జ్ఞ కాలకాలో గుణీ సర్వవిద్యః।

ప్రధాన క్షేత్రజ్ఞ సంసార మోక్ష స్థితిబంధ హేతుః ॥"(శ్వే.ఉ. I-16)

"ఆ పరమాత్మయే విశ్వ నిర్మాత. అతడే సర్వజ్ఞుడు, జ్ఞానస్వరూపుడు, కాలమునకు కాలుడు (మృత్యోర్మృత్యుః), సర్వగుణములు కలవాడు, సర్వవిదుడు, అతడే ప్రధానము, క్షేత్రజ్ఞుడు, పతి, గుణములకీశ్వరుడు, సంసార, మోక్ష, స్థితి, బంధములకు హేతువు" అన్నిటికి జాగ్రత్తకి, స్వప్నమునకు, సుషప్తికి, సమాధికి హేతువు, కారకుడు, నియంత మరియు మంత పరబ్రహ్మమే.

అందుచేత జీవుడు స్వయముగా స్వప్నాది సృష్టి చేయలేడు.

[**అభిధ్యానము –** Trans - Thought meditations, contemplating, thinking, concentrating about the ultimate - intimate is the way to bring out intimate to become ultimate once again.

ప్రతి వ్యక్తి యందు అవ్యక్తమైన దివ్యశక్తులు అంతర్వ్యక్తమై లోనికి తిరిగియుండును. నిరంతర పరమాత్మ ధ్యానము వలన ఆ అంతర్వక్త అవ్యక్త గుణములు అభివ్యక్తమై ప్రకటమగును.]

(శ్వే.ఉ. I-11, I-16)

## (324) III-2-6

సూ. **దేహయోగాద్వా సోఽపి**

క్ర. **దేహయోగాత్, వా, సః, అపి**

ప్ర.అ. దేహయోగాత్ = **శరీర సంబంధము వలన,** వా = **అగును,** సః = **ఆతిరోభావము,** అపి = **కూడ**

వి. **ఆ జీవాత్మయందు పరమాత్మయొక్క గుణములున్నను తిరోభావము వలన ఆ గుణములు ప్రకటము గావు. ఆ తిరోభావము, లోనికి తిప్పబడి దాచబడటము, జీవాత్మకు శరీరసంబంధము వలన అగును.** అందువలన జీవాత్మ ఆ సర్వ దివ్యగుణములను తెలియదు. ఇదియే జీవాత్మకు బంధనము. ఇది అనాది కాలసిద్ధము. మొదలు లేని ఈ బంధనములు వలననే కర్మ సంస్కారముచే పరవశమై, **జీవుడు అనేక యోనులందు జన్మించుచు మరణించుచు దుఃఖోపభోగము చేయుచున్నాడు. స్వప్నమనే మాయను అనుభవించుచున్నాడు. స్వప్నము మాయ.**

(ఛాం.ఉ. VI-3-2, VI-9-4)

## (2) తదభావాధికరణము (94)

## (325) III-2-7

సూ. **తదభావో నాడీషు తచ్ఛ్రుతే రాత్మనిచ**

క్ర. **తదభావః, నాడీషు, తచ్ఛృతేః, ఆత్మని, చ**

ప్ర.అ. తదభావః = **స్వప్నము యొక్క అభావము కలుగును,** నాడీషు = **నాడుల యందు,** తచ్ఛ్రుతే = **ఆది శ్రుతిలో చెప్పబడినది,** ఆత్మని = **ఆత్మ యందు,** చ = **కూడ.**

వి. **బృహదారణ్యక ఉపనిషత్తులో జీవాత్మయొక్క జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలను గూర్చి (IV-3-10 నుండి 18 వరకు) చెప్పబడినది. జీవికి స్వప్నములో మానసిక సుఖ దుఃఖములను ఉపభోగిస్తూ సుషుప్తావస్థ ప్రాప్తి అవుతుంది. అపుడు స్వప్న దృశ్యముల అభావము అవుతుంది. ఏ స్వప్నములు లేకుండా వుంటుంది. దీనివలన స్వప్నములు మాయామాత్రమేనని రూఢి అవుతుంది. బాహ్య జగత్తుకు అభావము లేకుండా యథావత్తు నడుస్తుంది.**

అపుడు జీవుడు శరీరములో సురక్షితముగా వుంటాడు మరియు ప్రపంచ ఉపభోగముల నుండి విశ్రాంతి ప్రాప్తి అవుతుంది. మరియు దేహేంద్రియాల అలసట తీరిపోతుంది.

"ఎపుడు సుషుప్తి అవుతుందో అపుడు అతనికేమియు తెలియదు. శరీరమందలి 72 వేల హితనాడులు, సమస్త శరీరమందు వ్యాపించి యుండువానియందు వ్యాపించి క్రమముగా, జీవాత్మ నాడుల మూలస్థానమైన పురీతత్ అను హృదయస్థానమున శయనించును" (బృ.ఉ. IV-1-19) మరియు "ఎపుడు జీవాత్మ నిద్రిస్తూ ఏ విధమైన స్వప్నములను చూడదో, అపుడు నాడులలో చేరి సంప్రసన్నముగా నుండును. అపుడు అతనిని ఏ పాపములు స్పృశించవు" (ఛాం.ఉ. VIII-6-3)

దీని అభిప్రాయమేమనగా ఆ అవస్థలో తన శరీరముద్వారా ఏ జీవికి హింస ఐననూ, జీవికి ఆ పాపము అంటదు. అయితే సుషుప్తి నిద్రాసమయములో అయ్యే సుఖము తామసికసుఖము. జ్ఞానమయసుఖము కాదు. తెలియకుండానే ఆత్మస్పర్శ, బ్రహ్మస్పర్శ కలిగించే సుషుప్తిసుఖము దేహముయొక్క అలసట తీర్చి వేస్తుంది. మోక్షమును కాని, బ్రహ్మజ్ఞానమును కాని కలిగించదు. **నిద్ర అవసరము. ఎప్పుడూ నిద్రిస్తే మోక్షము కలుగదు. సుషుప్తి సమయములో జీవి, పక్షి గూడు యందు వలె తన ఆత్మనందు విశ్రమించి సుఖముగా వుంటాడు.**

(బృ.ఉ. IV-1-19, ఛాం.ఉ. VIII-6-3)

## (326) III-2-8

**సూ. అతః ప్రబోధోఽస్మాత్**

**క్ర. అతః, ప్రబోధోః, అస్మాత్**

**ప్ర.అ.** అతః = **ఇందు నుండి,** ప్రబోధోః = **జాగ్రత్త,** అస్మాత్ = **కలుగును**

**వి. ఉపనిషత్తుల ప్రకారము సుషుప్తి సమయములో జీవుడు పరమాత్మతో గూడి హృదయస్థానమున నుండును. మేల్కొనుట గూడ అచటనుండియే అగును.**

**దేనినందు విలీనమగునో దాని నుండియే ప్రకటమగును.**

కావున జీవుడు మేల్కొనునపుడు, హృదయస్థానములో నున్న పరబ్రహ్మ నుండియే మేల్కొనుచున్నది.

ప్రారబ్దము ప్రకారము ఎంతవరకు సుఖభోగములు కావాలో అంతవరకు సుషుప్తిలో వుండి తరువాత పరబ్రహ్మ నియమ వ్యవస్థ వలననే జీవుడు జాగృతుడవుతాడు.

అదే విధముగా స్వప్నము అనేది మిథ్యాజ్ఞానము కావటము వలనను, సుషుప్తిలో ఆ మిధ్యాజ్ఞానము లేనందు వలనను, సుషుప్తి అనేది బ్రహ్మసంపత్తి కలిగినట్టి స్థితి అవుతుంది. సంపత్తి అంటే ఏకత్వము. కాబట్టి జీవుడు సుషుప్తిలో బ్రహ్మభావాన్ని పొందుతాడు. దీనివలన **జాగ్రత్త అవస్థలో కూడ సంపూర్ణముగా అజ్ఞాన నివృత్తి అయినప్పుడు జీవునికి బ్రహ్మత్వము సిద్ధించుటములో అనుమానము లేదు.**

## (3) కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము (95)

## (327) III-2-9

**సూ. స ఏవ తు కర్మానుస్మృతి శబ్దవిధిభ్యః**

**క్ర. స, ఏవ, తు, కర్మానుస్మృతి శబ్దవిధిభ్యః**

**ప్ర.అ.** స = **ఆ జీవాత్మ,** ఏవ = **యే,** తు = **నిస్సందేహముగా,** కర్మాను స్మృతిశబ్దవిధిభ్య: = **కర్మ, అనుస్మృతి, శబ్దము, విధి అనే కారణముల వలన.**

**వి.** నిద్రించిన జీవుడే మళ్లీ సుషుప్తినుండి మేల్కొంటున్నాడని చెప్పేటందుకు నాలుగు కారణాలను, నిదర్శనాలను చూపిస్తున్నారు.

1. **కర్మ –** నిన్న కొంత పనిచేసి, ఆపివేసి మరునాడు మేల్కొని మిగిల ఉన్నదానిని పూర్తి చేస్తున్నాము. కాబట్టి నిద్రకు ముందు వున్న జీవుడే తెలివి వచ్చిన తరవాత కూడా వున్నట్లు తెలుస్తున్నది. ఒకడు చేసిన పనిని వేరొకడు చేసినట్లుగా భావన కావటము లేదు. అదే కాక పరిచితుని వలె పనిని పూర్తి చేస్తున్నాడు.

2. **అనుస్మృతి –** అను అంటే ప్రత్యభిజ్ఞ అంటే, నిన్న ఆ పని చేసిన నేనే, ఈ రోజున ఈ విధంగా పనిచేస్తున్నాననే జ్ఞానము కలగటము. అనుస్మృతి అంటే అనుసరించిన పని – గొలుసులాగా సుషుప్తికి ముందు వున్న నేనే, తెలివి తరువాత వున్న నేను అని జ్ఞాపకం వుండటం, జ్ఞానము వుండటము. నిన్నటి లేక కొన్ని నెలల, సంవత్సరాల నాటి అనుభవము గుర్తుకు రావటము. ఇతరుడైతే ఒకని అనుభవము ఇంకొకనికి గుర్తు రావటము కుదరదు.

3. **శబ్దము –** అంటే వేదము, శ్రుతి. శ్రుతిలో కూడా అట్లే చెప్పబడినది.

   "ఆ స్వయంజ్యోతి స్వరూపమైన ఈ ఆత్మ స్వప్న స్థానమందు పుణ్య పాపములను చూచి మరల జాగ్రత్ స్థానమున న్యాయ ప్రకారము ప్రతి స్థానమును పొందుచున్నాడు. ఆ ఆత్మ ఆ స్వప్న స్థానము నందు, ఏ పుణ్య పాపములను చూచుచున్నాడో, ఆ పుణ్య పాపములతో బద్ధుడగుట లేదు" (బృ.ఉ. IV-3-16)

   దీనివలన స్వప్నము నందు చూచిన జీవుడే తరువాత వున్నాడని, వేరు జీవుడు కాదని తెలుస్తున్నది.

4. **విధి :-** అంటే యజ్ఞ యాగాది విధులు జ్ఞానాన్ని, విద్యను విధించే విధులు. ఒకప్పుడు చేసిన విధులు కర్మలు ఎప్పుడో కాలాంతరములో ఫలాన్ని ఇస్తాయని చెప్పే విధి వాక్యాలు వున్నాయి. ఆ వాక్యాల ప్రకారం వివిధ ఫలాల కోసము యజ్ఞములు, యాగములు మొదలైన కర్మలు చేస్తున్నాము. నిద్రించేవాడు మరునాడు నిద్ర లేచే వాడూ ఒకటి కాకపోతే ఈ విధి వాక్యాలు సఫలము కావు కదా!

   అదే విధముగా ముక్తి కోసం చేసే జ్ఞానోపదేశాలు కూడా నిరర్ధకము అవుతాయి.

   **కావున నిద్రించిన జీవుడే మేల్కొంటున్నాడు.**

ఇంకా "సముద్రములో ఒక నీటి బొట్టు వేసి మరల ఒక నీటి బొట్టు తీస్తే అదే నీటిబొట్టు రాదు కనుక నిద్ర, సుషుప్తి అనే సముద్రములోకి వెళ్లిన జీవుడే మళ్లీ రాకపోవచ్చు కదా ?" అని అంటే, ఆ దృష్టాంతము సరియైనది కాదు. ఒక నీటి బొట్టును గాజు పాత్రను సీసాలో వేసి బిరడా పెట్టి సముద్రములో వేసి మళ్లీ ఆ పాత్ర తీస్తే అదే నీటిబొట్టు వస్తుంది.

జీవునికి కూడా దేహము అనే పాత్ర వుంది కదా. కావున అదే జీవుడు లేస్తున్నాడు. దేహాభిమానము, దేహము అంటు అనే బిరడా లేనపుడు, నిద్రించే జీవుడూ పరబ్రహ్మమే, నిద్ర లేచే జీవుడు పరబ్రహ్మమే. అప్పుడు కూడా ఏ సమస్య లేదు.

**ఈ విధముగా సుషుప్తి లోకివెళ్లిన జీవుడే నిద్రలోనించి తెలివికి వస్తున్నాడు.**

(బృ.ఉ. IV-3-16)

## (4) ముగ్ధేర్ధసంపత్త్యధికరణము (96)

### (328) III-2-10

సూ. **ముగ్ధేఽర్ధ సంపత్తిః పరిశేషాత్**

క్ర. **ముగ్ధే, అర్ధసంపత్తిః, పరిశేషాత్**

ప్ర.అ. ముగ్ధేః = **మూర్ఛాకాలమందు,** అర్ధసంపత్తిః = **సగము సుషుప్తి అవస్థ,** పరిశేషాత్ = **ఆ అవస్థయే శేషించినది కనుక**

వి. **జీవునికి జన్మ మరణముల మధ్యన మూడవస్థలే కాక ఇంకొకటి ముగ్ధావస్థ కలదు.** అందరు జీవులకు రాదు కాని కొందరికి వచ్చును. దీని లక్షణములు కొంత కొంత సుషుప్తి అవస్థవలె యుండును. **కావున దీనిని అర్ధసుషుప్త్యవస్థ అని అనవచ్చును. ఎందుకనగా ఈ అవస్థయందు సుషుప్తి యందలి సుఖముండదు కాని సుషుప్తి వలె అజ్ఞానముండును. కావున పూర్తి సుషుప్తి కాని, సగము సుషుప్తి కాని, ఈ ఆవస్థ ముగ్ధావస్థ.**

## (5) ఉభయలింగాధికరణము (97)

### (329) III-2-11

సూ. న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి

క్ర. **న, స్థానతః, అపి, పరస్య, ఉభయలింగం, సర్వత్ర, హి.**

ప్ర.అ. న = **దోషము లేదు,** స్థానతః = **స్థాన సంబంధముల వలన,** అపి = **కూడ,** పరస్య = **పరమాత్మ యొక్క,** ఉభయలింగం = **రెండు లక్షణములు,** సర్వత్ర హి = **శ్రుతి వాక్యములన్నింటి యందు**

వి. **పరబ్రహ్మ, పరమాత్మకు శ్రుతులు రెండు లక్షణములున్నాయని చెప్పినవి.**

"అపాణిపాదో జననో గ్రహీతా,
పశ్యత్య చక్షుస్సశృణోత్యకర్ణః
స వేత్తి వేద్యం నచ తస్యాస్తి వేత్తా

తమాహురగ్ర్యం పురుషం మహాంతమ్" (శ్వే.ఉ. III-19)

"ఆ పరమాత్మ చేతులు, కాళ్లు లేకున్నను గ్రహించుచున్నాడు, నడుచుచున్నాడు. కళ్లు లేకున్నను చూచుచున్నాడు, చెవులు లేకున్నను వినుచున్నాడు. తెలిసికొన దగినవన్నీ తెలిసికొను చున్నాడు. ఆ పరమాత్మను తెలిసినవాడు లేడు. అట్టి పరమాత్మను అగ్రునిగను (మొదటివాడు, శ్రేష్ఠుడు) పురుషునిగను, మహాత్మునిగను వర్ణించుచున్నారు"

"అణో రణీయాన్ మహతో మహీయాన్,
ఆత్మా అస్య జంతోః నిహితో గుహాయాం ।
తమక్రతుః పశ్యతి వీతశోకో,
ధాతుః ప్రసాదాత్ మహిమాన (మీశమ్) మాత్మనః"
(కఠ.ఉ. I-2-20), (శ్వే.ఉ. III-20)

"ఆత్మతత్త్వము, అణువు కంటె అణువుగను మహత్తు కంటె మహత్తుగను ప్రతి జీవి యొక్క హృదయమను గుహయందు వున్నది.

ఎవరు సంకల్ప వికల్పముల నుండి, కర్మబంధముల నుండి విముక్తుడగుచున్నాడో, అట్టివాడు ఆ ఆత్మ యొక్క మహామహిమను తెలిసి సర్వశోకముల నుండి విముక్తుడగుచున్నాడు."

"ఆసీనో దూరం వ్రజతి
శయానో యాతి సర్వతః
కస్తం మదామదం దేవం
మదన్యో జ్ఞాతుమర్హసి (కఠ.ఉ. I-2-21)

"ఆ ఆత్మ (పరమాత్మ) కూర్చొనియుండియే దూరము పోవుచున్నది. శయనించియే సర్వత్ర చరించుచున్నది. కావున నాకంటె ఎవరు మదము, అమదము (హర్షము, శోకము) లేని ఆ పరమాత్మను తెలిసికొనగలరు ?"

"అశబ్దమస్పర్శమ రూపమ వ్యయం,
తథారసం, నిత్యమ గంధ వచ్చయత్ ।
అనాద్యనంతం మహతః పరం ధ్రువమ్,
నిచాయ్య తన్మృత్యు ముఖాత్ప్రముచ్యతే ॥" (కఠ.ఉ. I-3-15)

"ఆత్మ (పరమాత్మ) శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేనిది, అవ్యయమైనది, ఆద్యంతములు లేనిది, నిత్యము, మహత్తుకు పరమైనది ఐవున్నది. అట్టి ఆత్మను తెలిసికొనినవాడు మృత్యు ముఖము నుండి పూర్తిగ విడువబడును."

**ఈ ప్రకారము ఆ పరబ్రహ్మ సాకారము, నిరాకారము అను రెండు లక్షములు రెండు స్వరూపములతో సంపన్నమై యున్నది.**

సర్వ సమర్థమైన సత్తా కల పరమాత్మకు ఇది సంభవము. అది ప్రాణుల హృదయములలో

వుండి కూడా ఆ ప్రాణుల దోషముల నుండి నిర్లిప్తమై (అంటు లేక) వుండును.

పరస్పర విరోధమైన లక్షణములు (సాకార నిరాకారములు, దగ్గర-దూరము, లోపల-బయట మొదలైనవి) ఆ పరమాత్మ యందుండుట అతిశయోక్తి కాదు. (Quantum Reality) కావున **శ్రుతులు ఆ పరమాత్మను రెండు విధముల లక్షణముల (ఉభయ లింగములు) సంపన్నము ఐనదని తెలిపి పరమాత్మ యొక్క అనిర్వచనీయ మహిమను సాక్షాత్కారము చేసే పురుషార్థము, సహాయము చేసినవి.**

(శ్వే.ఉ. III-19,20; కఠ.ఉ-I-2-20, I-2-21, I-3-15)

## (330) III-2-12

**సూ. న భేదాదితి చేన్న ప్రత్యేకమతద్వచనాత్**

**క్ర. న, భేదాత్, ఇతి, చేత్, న, ప్రత్యేకమ్, అతద్వచనాత్**

**ప్ర.అ.** న = **కాదు,** భేదాదితిచేత్ = **పరమాత్మ సగుణ నిర్గుణ స్వరూపములు వేరు వేరుయని చెప్పిన యెడల,** న = **అట్లు కాదు,** ప్రత్యేకం = **ప్రత్యేకముగా శ్రుతులలో ఒకే పరబ్రహ్మ రెండు లక్షణములు కలవాడని చెప్పబడినందు వలన.**

**వి.** "అన్ని శ్రుతి వాక్యములలోనూ నిరాకార నిర్విశేష బ్రహ్మయే చెప్పబడినది" అని అనటం యుక్తము కాదు, "ఎందుకనగా చతుష్పాద బ్రహ్మ అని భేదము చెప్పినారు" అని అనటము కూడా యుక్తము కాదు. ఉపనిషత్తులు భిన్న భిన్న విద్యలు బోధించుచు బ్రహ్మమును అనేక రూపములుగా చెప్పినవి. ఒక చోట నాలుగు పాదములు కలవిగను, ఒక చోట శోడషకళలు కలిగినదిగను, వైశ్వానరునిగను, వర్ణించినవి.

"తదేతచ్చతుష్పాద్బ్రహ్మ, వాక్పాదః, ప్రాణః పాదః, చక్షుః పాదః,
శ్రోత్రం పాదః, ఇత్యధ్యాత్మం" (ఛాం.ఉ. III-18-2)

"ఈ బ్రహ్మమునకు నాలుగు పాదములు కలవు. వాక్కు ఒక పాదము, ప్రాణము ఒక పాదము, చక్షువు ఒక పాదము, శ్రోత్రము ఒక పాదము. ఇది అధ్యాత్మము" - (ఛాం.ఉ. III-18-2)

"తస్మై సహోవాచ। ఇహైవాంతః శరీరే సోమ్య, స పురుషో, యస్మిన్నేతాః షోడశకలాః ప్రభవంతీతి॥" (ప్రశ్న ఉ. VI-2)

పిప్పలాదుడు సుకేశు నకిట్లనియెను "ఓ! సుకేశా! ఎవని యందు షోడశ కళలు ప్రభవించుచున్నవో, ఆ పురుషుడు ఇక్కడ నీ దేహమందే వసించుచున్నాడు" (ప్రశ్న ఉ. VI-2)

(ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, తేజము, జలము, భూమి, ఇంద్రియదశకము, మనస్సు, అన్నము, బలము, తపస్సు, మంత్రములు, కర్మ, లోకములు, నామములు అనునవి పదునారు కళలు)

"ఏభి స్త్రిభి ర్లోకై స్సమో అనేన సర్వేణ, తస్మాద్వైవ సామా అశ్నుతే"

"ఈ మూడు లోకములకు, ఈ సర్వస్వమునందును సమానములుగా నున్నందువలన అతడు

సామ మనిపించుకొనును" (బృ.ఉ. I-3-22)

"వైశ్వానరము పాస్తే, స సర్వేషు లోకేషు, సర్వేషు భూతేషు, సర్వేష్వాత్మసు, అన్న మత్తి" (ఛాం.ఉ. V-18-1)

"సర్వ వ్యాప్తియగు వైశ్వానరాత్మను తెలిసినవాడు సర్వలోకముల యందు, సర్వభూతముల యందును అన్నమునుపభోగించును అని తెలియును."

ఇవి అన్నియు బ్రహ్మమును వేరు వేరు రూపములుగా సగుణ రూపముగా వర్ణించుచున్నవి.

అయితే ఉపాసన కోసము సగుణ రూపముగా ఆకార భేదములు చెప్పబడినను భేదము లేదు. పరమాత్మ ఒకటియే.

"యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయో అమృతమయః పురుషో, యశ్చాయమధ్యాత్మగ్ం శారీరః , తేజోమయో అమృతమయః పురుషో, అయమేవ సః, అయమాత్మా, ఇదమమృతం, ఇదం బ్రహ్మ, ఇదగ్ం సర్వమ్" (బృ.ఉ. II-5-1)

"ఈ తేజోమయుడు, అమృతమయ రూపుడునగు పురుషుడు ఈ పృధివి యందు నుండునతడు మరియు ఈ శరీరమందు నుండు తేజోమయుడు, అమృతమయుడు నగు పురుషుడే. ఇదియే ఆత్మ ఇదియే అమృతము, ఇదియే బ్రహ్మ, ఇదియే సర్వము".

**వేరు వేరు రూపములో చెప్పబడిన బ్రహ్మము ఒకటియే. బ్రహ్మమే సర్వత్రము, సర్వము, అమృతము, సర్వాత్మ.**

(ఛాం.ఉ. III-18-2; ప్రశ్న.ఉ. VI-2; బృ.ఉ. I-3-22; ఛాం.ఉ. V-18-1; బృ.ఉ. II-5-1)

## (331) III-2-13

**సూ. అపి చైవమేకే**

**క్ర. అపి చ, ఏవమ్, ఏకే**

అపి = **మరియు,** చ = **కూడ,** ఏవమ్ = **ఈ రీతిగనే,** ఏకే = **ఒక శాఖలో చెప్పబడెను.**

**ప్ర.అ. ఒక శాఖలో తైత్తరీయములో పరబ్రహ్మమును గూర్చి ఈ రీతిగనే చెప్పబడినది.**

**వి.** "బ్రహ్మ విదాప్నోతి పరమ్. తదేషాభ్యుక్తా, సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" (తై.ఉ. II-1-1) "పరబ్రహ్మమును తెలిసిన జ్ఞానులు పరబ్రహ్మము నందుచున్నారు. బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతము. అట్టి పరబ్రహ్మము హృదయ గుహలో వున్న పరమాకాశములో వున్నది."

"ఆత్మనః ఆకాశః సంభూతః" (తై.ఉ. II-1-2)

"ఈ ఆత్మ నుండియే పంచభూతములకు ఆదిమూలమైన ఆకాశము పుట్టినది." అనగా పరబ్రహ్మము నుండియే సమస్త జగత్తు ఉద్భవమైనది.

"అసద్వా ఇదమగ్ర ఆసీత్. తతో వై సద జాయతః, తదాత్మానం స్వయ మకురుత, తస్మా

త్తత్సుకృతముచ్యత ఇతి. యద్వై తత్సుకృతమ్. రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి" (తై.ఉ. II-7-1)

"మొట్టమొదలు పరబ్రహ్మస్వరూపముగా చెప్పబడిన ఈ జగత్తు అవ్యాకృతమైన పరబ్రహ్మముగానే యుండెను. దాని నుండియే ప్రవిక్తమగు నామరూప విశేషములు గల జగత్తు పుట్టెను. అట్లు పరబ్రహ్మము తన్ను తాను స్వయముగా చేసుకొనెను. అందువలన అది స్వయంకృతమని చెప్పబడెను. అట్టి పరబ్రహ్మము రస స్వరూపము. ఇట్టి రస స్వరూపమును అందిన జీవి ఆనందమయు డగుచున్నాడు." (తై.ఉ. II-7-1)

ఆనంద స్వరూపమైన బ్రహ్మమును అనుభూతినందిన జీవుడు ఆనందమయుడై స్వయముగా ఆనందరూపుడగుచున్నాడు.

మరల పరబ్రహ్మము గూర్చి ఇట్లు చెప్పబడుచున్నది.

"పరబ్రహ్మము భయము వలన వాయువు వీచుచున్నది, సూర్యుడు ఉదయించుచున్నాడు, అగ్ని, ఇంద్రుడు, ఐదవవాడైన యముడు ప్రవర్తించుచున్నారు." (తై.ఉ. II-8-1)

ఈ విధముగా పరబ్రహ్మము యొక్క నిరాకార (నిర్గుణ) మరియు సాకార (సగుణ) స్వరూపము గూర్చి ఒకేచోట చెప్పబడినది. రెండింటికి భేదము లేదు.

ఈ అభేదజ్ఞానమే ఇలా చెప్పబడింది.

"మనసై వేద మాప్తవ్యం, నేహ నానాఽస్తి కించన ।
మృత్యోః స మృత్యుం గచ్ఛతి, యః ఇహ నానేవ పశ్యతి" (కఠ.ఉ II-4-11)

"మనస్సుతో మాత్రమే దీనిని (పరబ్రహ్మను) పొందవలెను. ఇచట అనేకత్వము (భేదము) ఒకింతైనను లేదు. ఏకత్వమును కాక అనేకత్వమును ఎవరు చూతురో వారు ఒక మృత్యువు నుంచి ఇంకొక మృత్యువుకు వెళ్లుదురు." (కఠ.ఉ II-4-11)

సగుణమని నిర్గుణమని వేరు చూచేవారికి సంసారవలయమే! సగుణములో నిర్గుణము, నిర్గుణములో సగుణము చూచిన వారికి ముక్తియే. వారికి మృత్యువు లేదు, జన్మము లేదు.

బ్రహ్మము త్రిపుటి అనే భేదానికి కూడ మించినది.

"ఏతత్ జ్ఞేయం నిత్య మే వాత్మసంస్థం, నాతః పరం వేదితవ్యం హి కించిత్ । భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా, సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్ ॥" (శ్వేత.ఉ. I-12)

"లోనయున్న పరమాత్మను సర్వదా తెలుసుకొనవలెను. ఇంతకంటే తెలియదగినది వేరు ఏ కొంచెమును లేదు. భోక్తయగు జీవుడు, భోగ్యమగు ప్రపంచము, ప్రేరకుడగు అంతర్యామి అను మూడు విధములుగా వున్న సర్వస్వము పరబ్రహ్మమే" ఈ విధముగా సమస్తము అని శ్రుతి వాక్యాలు నేరుగా చెపుతున్నాయి. కావున భేదమునకు అవకాశము, చోటు లేదు.

[నారాయణ వాక్యము :-

త్రిపుటి అంటే తెలుసుకొనేవారు (జ్ఞాత), తెలిసికొనబడేది (జ్ఞేయం), తెలిసికొనటము (జ్ఞానము). ఆత్మయేజ్ఞాత, తెలుసుకొనబడదేది ఆత్మ, ఆత్మయే జ్ఞానస్వరూపము. ఆత్మ విషయములు మూడూ ఒకటే. త్రిపుటి లేదు. ఆత్మ తన్ను తాను తనద్వారానే తెలుసుకుంటుంది. యజ్ఞోపవీతములో మూడు దారములు బ్రహ్మముడిలో వున్నాయికదా! బ్రహ్మముడి ఒక్కటే, త్రిపుటి లేదు. బిందువులో అ,ఉ,మ లు కరిగిపోయి బిందువులో ఏకము అద్వైతము అవుతుంది. ప్రస్తుత క్షణములో గతక్షణము ఈక్షణము, మరుక్షణము ఒకటిగా వున్నాయి కదా! బ్రహ్మముడి ఈ క్షణము. ఆత్మ అన్నియూ త్రిపుటిలను దాటిన బ్రహ్మమే.]

(తై.ఉ. II-1-1, II-1-2, II-7-1, II-8-1, కఠ.ఉ. II-4-11, శ్వేత.ఉ. I-12)

## (332) III-2-14

**సూ. అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్**

**క్ర. అరూపవత్, ఏవ, హి, తత్ప్రధానత్వాత్**

**ప్ర.అ.** అరూపవత్ = **రూపరహిత నిర్గుణత్వము,** ఏవ = **వలెనె,** హి = **ఎందుకంటే,** తత్ప్రధానత్వాత్ = **పరబ్రహ్మము ప్రధానముగా నిర్గుణమైనందువలన.**

**వి.** పరబ్రహ్మ నిరాకారము. అయితే పరబ్రహ్మము సాకారము కూడా, నిరాకారము వలెనె.

**పరబ్రహ్మము నిరాకారము, సాకారము రెండూ అయినా నిరాకారమే, అరూపత్వమే ప్రధానము.** ఎందుకంటే శ్రుతులలో అట్లు చెప్పబడినది. యాజ్ఞవల్క్యుడు ఇలా అన్నాడు.

"ఓ గార్గీ! బ్రహ్మజ్ఞానులు దానిని అక్షరమనియందురు. అది స్థూలము గాదు, సూక్ష్మము గాదు, అణువు కాదు, హ్రస్వము గాదు, పొట్టిది గాదు, పొడుగుది గాదు, అది అరక్తము, అస్నేహము, నీడలేనిది, తమస్సు - అజ్ఞానము - చీకటి లేనిది. అది వాయువు గాదు, ఆకాశము కాదు, సంగము లేనిది, రసము లేనిది, గంధము లేనిది, కన్ను లేనిది, చెవులు లేనిది, వాక్కులేనిది, మనస్సు లేనిది, తేజము లేనిది, ప్రాణము లేనిది, ముఖము లేనిది, కొలత లేనిది, లోన అనునది లేనిది, అదే ఉన్నది. అది తినబడదు. భోక్త కాదు, భోజ్యము కాదు. అక్షరమగు వ్యాపకమైన తత్త్వము. అపూర్వమగు ఆ తత్త్వమును తెలియవలెను." (బృ.ఉ. III-8-8) ఈ విధముగా బ్రహ్మము మనస్సుకు బుద్ధికి పట్టుబడని అనూహ్యమైన నిరాకారము. (Formless Quantum Reality) యమధర్మరాజు నచికేతునికి ఆ పరబ్రహ్మము శబ్దము స్పర్శ, రూపములు లేనిది అవ్యయమైనది అని చెప్పినాడు (కఠ.ఉ. IV-1-1). ముండకోపనిషత్తులో అంగీరసుడు శౌనకునితో ఇలా అన్నాడు.

"దివ్యోహ్యమూర్తః పురుషః
సబాహ్యాభ్యంతరో హ్యజః ।
అ ప్రాణోహ్యమనాః శుభ్రో
హ్యక్షరాత్పరతః పరః" (ముం.ఉ. II-1)

"ఓ శౌనకా! ఆ అక్షర పరబ్రహ్మము జన్మలేనిదై, బాహ్యాభంతరములలో నిండినదై, సమస్త రూపరహితమై దివ్యమైనది.

ప్రాణములేనిదై, మనస్సు లేనిదై, శుభ్రమై, అక్షరమై, పరముకన్న పరమైనది." (ముం.ఉ. II-1-2)

"ఆకాశ రూపమైన ఆత్మయే (బ్రహ్మయే) నామ రూపాలను ప్రకాశింప చేస్తున్నది.

ఆ నామరూపాలన్నింటిలో వుండేది బ్రహ్మమే." (ఛాం.ఉ. VIII-14-1)

**ఈ విధముగా శ్రుతి వాక్యము లెన్నియో ప్రధానముగా నిర్గుణమైన పరబ్రహ్మమును గూర్చి చెప్పుతున్నాయి.**

(బృ.ఉ. III-8-8; కఠ.ఉ. IV-1-1; ముం.ఉ. II-1-2; ఛాం.ఉ. VIII-14-1)

## (333) III-2-15

**సూ. ప్రకాశవచ్చావైయర్థ్యాత్**

**క్ర. ప్రకాశవత్, చ, అవైయర్థ్యాత్**

ప్ర.అ. ప్రకాశవత్ = **ప్రకాశ సదృశము (ప్రకాశము వంటివి),** చ = **కూడ,** అవైయర్థ్యాత్ = **బ్రహ్మమునకు రూపమును బోధించు శ్రుతులు ఉపానా నిమిత్తము లగుటచే వ్యర్థములు కావు.**

వి. **దీపములు, సూర్యుడు మొదలైన జ్యోతుల ప్రకాశము నందు వస్తువులు వున్నపుడు, వెలుగు వంకరగా కనిపిస్తుంది. కాని తాను వంకర కాదు. అదే విధముగ పరబ్రహ్మ నిర్విశేషము, నిరాకారము అయినా పంచభూతాది ఉపాధుల వలన సవిశేషము, సాకారముగ కనిపిస్తుంది. అందువలన శ్రుతులు కొన్న చోట్ల బ్రహ్మను సాకారముగా చెప్పినవి వ్యర్థము కావు. నిరాకారమైన బ్రహ్మ ఉపాసన కోసము సాకారముగా చెప్పబడినది యుక్తమే, సార్థకమే.**

## (334) III-2-16

**సూ. ఆహ చ తన్మాత్రమ్**

**క్ర. ఆహ, చ, తన్మాత్రం**

ప్ర.అ. ఆహ = **చెప్పినవి,** చ = **కూడ,** తన్మాత్రం = **కేవలము ప్రజ్ఞాన ఘన మాత్రమని**

వి. **శ్రుతులు పరబ్రహ్మమును కేవలము సత్యము, జ్ఞానము, అనంతము మరియు ప్రజ్ఞానఘనము అని తన్మాత్రమని చెప్పినవి.**

"సత్యం జ్ఞానమ్ అనంతం బ్రహ్మ" (తై.ఉ. II-1) అను వాక్యము వలన పరమాత్ర ఏకమాత్ర చైతన్యస్వరూపముని తెలుస్తున్నది.

అట్లు జీవనజ్యోతి అయిన బ్రహ్మము చైతన్యమే. "స యథా సైంధవఘనో అంతరోబాహ్యః, కృత్స్నో, రసఘన ఏవం వా అరే అయమాత్మా, అంతరో అబాహ్యః, కృత్స్నః, ప్రజ్ఞానఘనః ఏవ" (బృ.ఉ. IV-5-13)

"ఓ మైత్రేయి! ఉప్పురాయి లోపల బయట అంతా కూడా లవణ మాత్రమే తప్ప ఇతర రస సంబంధము ఏ మాత్రమూ లేకుండా వుంటుందో, అలాగే ఆత్మ (బ్రహ్మ) అనేది ప్రజ్ఞానఘనము

మాత్రమే!" అంటే పరబ్రహ్మ లోపల బయట అంతటా వ్యాపించి వున్న చైతన్య స్వరూపము. "తత్త్వమసి" (తత్-త్వమ్-అసి) "అది -నీవు-యై వున్నావు" అని అనుటలో వున్న 'తత్' అనబడిన (అది) చైతన్యమే నీవు (త్వమ్).

కావున తత్-మాత్రము అనగా తన్మాత్రము. చిత్-మాత్రము అంటే చిన్మాత్రము. తన్మాత్రముయే చిన్మాత్రము.

**"ప్రజ్ఞానం బ్రహ్మ",**

**"అయమాత్మా బ్రహ్మ"**

**"అహం బ్రహ్మాస్మి",**

**"తత్త్వమసి"** అనువాక్యములలో వున్న ప్రజ్ఞానము, నేను (అహం), నీవు (త్వమ్), ఆత్మ, బ్రహ్మ అను **"తత్"** యే తన్మాత్రము.

**కావున బ్రహ్మము చైతన్యఘన, ప్రజ్ఞానఘన, చిన్మాత్రము, తన్మాత్రము** అనుటలో ఏ మాత్రము అవరోధము లేదు.

(తై.ఉ. II-1), (బృ.ఉ. IV-5-13)

## (335) III-2-17

**సూ. దర్శయతి చాథో అపి స్మర్యతే**

**క్ర. దర్శయతి, చ, అథో, అపి, స్మర్యతే**

ప్ర.అ. దర్శయతి = **చూపించుచున్నది,** అథో = **అయితే,** అపి = **కూడ,** స్మర్యతే = **స్మృతులు చెప్పుచున్నవి.**

వి. బ్రహ్మము - సత్యము, జ్ఞానము, అనంతము అని తైత్తురీయ ఉపనిషత్తులో చెప్పి, తరువాత బ్రహ్మము అందరి హృదయములలో అవస్థితము అని చెప్పి, బ్రహ్మము నుండియే సంపూర్ణ జగత్తు యొక్క ఉద్భవ వికాసము అవుతుందని ఉద్ఘోషించబడినది. శ్రుతులలో మరియు స్మృతులలో బ్రహ్మము యొక్క సాకార రూపవర్ణలు వున్న విషయము కాదనలేము. కావున బ్రహ్మము యొక్క సవిశేష - సాకార రూపమును అస్వీకారము చేయలేము.

"అథాత అదేశో, నేతినేతి, నహ్యేతస్మాదితి, నేత్యన్యత్ పరమస్తి, అథనామధేయగ్ం, సత్యస్య సత్యమితి" (బృ.ఉ. II-3-6) గుణవర్ణనము చేయక నిర్గుణుడని శ్రుతి చెప్పినది. **"నేతి నేతి" అను వాక్యము బ్రహ్మమును వర్ణించును. ఏ ఆకార వర్ణనము చేయక ఉపనిషత్తు "ఇదికాదు" అని అన్నిటిని నిషేదించుట వలన ఈ నిషేధరూపమైన వాక్యమే సత్యము కంటె సత్యమని శ్రుతి చెప్పుచున్నది.**

ఇంక స్మృతిలో

"జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి, యద్‌జ్ఞాత్వాఽ మృతమశ్నుతే।
అనాది మత్పరం బ్రహ్మ, న సత్తన్నాసదుచ్యతే"॥ (భ.గీ. XIII-13)
కను జ్ఞేయమును గూర్చి చెప్పబోదు

దేని దెలియగ గలుగు నమృతమ్ము
విను ఆదిలేని యాపరమబ్రహ్మ
యున్నదని లేనిదని చెప్పబడదు" (భ.గీ. XIII-13)
మరియు "అవ్యక్తోఽ-యమచిన్త్యోఽ-య మవికార్యోఽ-య ముచ్యతే।
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి"॥ (భ.గీ. II-25)
"వ్యక్తము గాదది, చింతించనలవి గాదు.
వికారములు నది నెంతయు నొందపోదు,
విశదీకరముగ వినుము! తెలియు నీవు
దుఃఖంబు తగదు నర్హంబు గాదు గాదు" (భ.గీ. II-25)

అది, ఆ బ్రహ్మము అవ్యక్తము, అచింత్యము, అవికార్యము అని గీత వర్ణించినది. ఉన్నట్లనిపించక ఉండి, ఎప్పుడూ ఉండేది బ్రహ్మము.
(బృ.ఉ. II-3-6; భ.గీ. XIII-13, II-25)

## (336) III-2-18

**సూ. అత ఏవచోపమా సూర్యకాదివత్**

**క్ర. అతః, ఏవ, చ, ఉపమా, సూర్యకాదివత్**

**ప్ర.అ.** అతఃఏవ = **కావుననే,** చ = **కూడ,** ఉపమా = **ఉపమానము,** సూర్యకాదివత్ = **సూర్యుడు మొదలైనవారివలె**

**వి.** "ఏక ఏవ హి భూతాత్మా, భూతే భూతే వ్యవస్థితః, ఏకధా బహుధా చైవ దృశ్యతే, జలచంద్ర వత్" (అ.బిం.ఉ.-12)

"ఒకడైన చంద్రుడు జలాశయములలో ప్రతిబింబిస్తూ అనేకములుగా కనిపిస్తున్నాడు."

పరమాత్మ సగుణుడుగా, నిర్గుణుగా వేరు వేరు లేదు. ఒక్కడే ఆయనను ప్రతి జీవి యందు వేరైనట్లు కనిపిస్తున్నాడు.

బ్రహ్మము విభావరహితము, అవిభక్తము, నిరాకారమై యుండియు, సమస్త భూతములలో ప్రాణులలో విభక్తము వలె అనిపించును.

"అవిభక్తం చ భూతేషు, విభక్తమివ చ స్థితమ్" (భ.గీ. XIII-17)
"బ్రహ్మము అవిభక్తమైన కూడ భూతములలో విభక్తమైనట్లు వుండును".

**ఆ విధముగా బ్రహ్మము ఒకటయే. అన్నింటిలో అగుపించినను. ఉపాధులలో గుణదోషములను అంటకుండా వాటికి పరమై వుంటుంది.** (అ.బిం.ఉ-12, భ.గీ. XIII-17)

## (337) III-2-19

**సూ. అమ్బువదగ్రహణాత్తు న తథాత్వమ్**

**క్ర. అంబువత్, అగ్రహణాత్, తు, న, తథాత్వమ్.**

**ప్ర.అ. నీరు ప్రతిబింబమును గ్రహించినట్లు,** అగ్రహణాత్ = **నిర్గుణ పరమాత్మ విషయమున ప్రతిబింబ గ్రహణము**

**సాధ్యము కానందు వలన,** తు = **ఇంకను,** న = **పొసగదు,** తథాత్వమ్ = **ఎల్లపుడు అట్లు అగుట.**

వి. పూర్వ పక్షము ఇలా అంటుంది. “ఉదకం లాంటి భిన్నపదార్థమేదీ లేనందున బ్రహ్మ విషయములో పైన చెప్పబడిన జలసూర్య దృష్టాంతము సరిపోదు.”

ప్రతిబింబము వుండాలంటే బింబము మూర్తమై వుండాలి. ఒక రూపము కలిగి వుండాలి. ఉపాధికి దూరముగా వుండాలి. సూర్యుడు కుండకు, చెరువుకు దూరముగా వున్నట్లు. సూర్యుడు, చంద్రుడు వంటి ప్రకాశించే రూపముల విషయములో దూరంగా వుండే జలమనే వేరు పదార్థం ఒకటి వుంది. కాబట్టి సూర్యుడు ప్రతిబింబిస్తున్నాడు. బ్రహ్మము అనేది మూర్త పదార్థముకాదు. అది అంతటా వున్నది. దానికన్న వేరు పదార్థము లేదు కదా!

**కావున దృష్టాంతములోని రెండు పదార్థాలకు సామ్యం లేదు. బ్రహ్మ విషయములో జల సూర్య దృష్టాంతము అన్వయించదు. ఇదీ పూర్వ పక్షము.**

## (338) III-2-20

సూ. **వృద్ధిహ్రాసభాక్త్వమన్తర్భావాదుభయసామంజస్యాదేవమ్**

క్ర. **వృద్ధిహ్రాసభాక్త్వమ్, అంతర్భావాత్, ఉభయసామంజస్యాత్, ఏవమ్.**

ప్ర.అ. వృద్ధిహ్రాసభాక్త్వం = **పెద్దగనగుట, చిన్నగనగుట,** అంతర్భావాత్ = **శరీరములో లోపల నుండుట వలన,** ఉభయసామంజస్యాద్ = **ఉపాదులలోని బ్రహ్మకు జల ప్రతిబింబమునకు సమన్వయము కుదుర్చుకొనినచో,** ఏవమ్ = **దృష్టాంతయు అమరిపోవును.**

వి. **నీటిలోని ప్రతిబింబము, కదలుతుంది, చెదరిపోతుంది. నీరు కదలినప్పుడే, చెదిరినప్పుడు అలా అవుతుంది. తెల్లని ప్రతిబింబము, ఎర్రని ప్రతిబింబము, కదిలే ప్రతిబింబము, నిలకడ ప్రతిబింబము నీటి స్థితిని బట్టి వుంటుంది.**

అలాగే ప్రాణిలోని అంతరంగము యొక్క గుణము బట్టి లోని జీవాత్మ వుండును.

సూర్యుడు కదలడు, పరమాత్మ చలించడు. నీరు కదులుతుంది, నీటిప్రకారము ప్రతిబింబము చలించుతుంది. గుణప్రకారము జీవుడు చలించుతాడు.

వికారములు సూర్యునకు లేవు, పరమాత్మకు లేవు. వికారములు నీటికి మరియు జీవుని అంతరంగమునకు వుండును.

(అంతరంగము నీరు, బ్రహ్మము సూర్యుడు, జీవుడు ప్రతి బింబము)

ఆ విధముగా రెండు విధాలా ఉపమానము సరిపోతుంది.

**ఉపమానము అంటేనే పోలిక, అచ్చు గుద్దినట్లు కాదు. కొన్ని కోణాల్లో ఒకే తీరువుండి, వేరు కోణాల్లో వేరుగా వున్నా ఉపమానము సరిపోతుంది.**

## (339) III-2-21

సూ. **దర్శనాచ్చ**

క్ర. **దర్శనాత్, చ,**

ప్ర.అ. దర్శనాత్ = **ఉపనిషత్తులలో ఇంకా వేరు దృష్టాంతములు వుండుట వలన,** చ = **కూడ**

వి. **ప్రతిబింబరూపములో పరమాత్మకు దేహాంతరాలలో అనుప్రవేశము వున్నట్లు ఉపనిషత్తులలో కనిపిస్తున్నది. "పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః। పురః స పక్షీభూత్వా, పురః పురుషః ఆవిశత్"** (బృ.ఉ. II-5-11)

బృహదారణ్య ఉపనిషత్తులో (IV-5-18) "బ్రహ్మ రెండు పాదములు గల శరీరములను సృజించెను. నాలుగు పాదములు గల శరీరములు చేసెను. ఆ పరమాత్మయందు లింగశరీరముగా మారి, అన్ని శరీరములలో జీవుడుగా ప్రవేశించెను. సర్వశరీరములలో వసించుటచే (పురములలో) పురుషుడనబడెను. అయినను ఆయన పరపూర్ణుడే కాని, పరిచ్ఛిన్నుడు కాదు."
కఠోపనిషత్తులో (II-2-9)

"అగ్నిర్య థైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బ భూవ।
ఏకస్తథా సర్వ భూతాంతరాత్మా
రూపం రూపం ప్రతి రూపోభభూవ॥"

"అగ్ని ఒక్కడే పలు విధములైన కట్టెలను ప్రవేశించి ఆయా బాహ్య పదార్థముల రూపములనందు ఎట్లగుచున్నాడో, అదే రీతిగా ఒక్కడే అయినా సర్వభూతంతరాత్మ అయిన పరమాత్మ సర్వభూతముల యందు, సర్వదేహములందు ప్రవేశించి దేహములందు తగిన రూపము గలవాడు అగుచున్నాడు."

అట్టి పరమాత్మ పరిపూర్ణుడు. వేరువేరుగా పరిచ్ఛిన్నుడు కాదు. కావున జల సూర్యకాది దృష్టాంతము సమంజసము మరియు సరియైనది.
(బృ.ఉ. II-5-11, IV-5-18, కఠ.ఉ. II-2-9)

## (6) ప్రకృతైతావత్త్వాధికరణము (98)

## (340) III-2-22

సూ. **ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః**

క్ర. **ప్రకృతైతావత్త్వం, హి, ప్రతిషేధతి, తతః, బ్రవీతి, చ, భూయః**

ప్ర.అ. ప్రకృతైతావత్త్వం = **ఇంతవరకు చెప్పబడిన బ్రహ్మ లక్షణములను,** హి = **ఎందుకనగా,** ప్రతిషేధతి = **"నేతి నేతి" అను వాక్యము నిషేధించుచున్నది,** తతః = **తరువాత,** బ్రవీతి = **శ్రుతి చెప్పుచున్నది,** చ = **కూడ,** భూయః = **ఇంకను**

వి. బృహదారణ్యక ఉపనిషత్తులో (II-3-1)
"ద్వేవావ బ్రహ్మణో రూపే, మూర్తం చైవా మూర్తం చ, మర్త్యం చ అమృతం చ, స్థితం చ, య చ్చ స చ్చ త్యచ్చ" (బృ.ఉ. VI-3-1)
"బ్రహ్మమునకు రెండు రూపములు కలవు. మూర్తము మరియు అమూర్తము, అవి: మర్త్యము మరియు అమృతము, స్థితము మరియు చలితము, సత్యము మరియు త్యత్త్యము."

మరియు ఇలా చెప్పబడినది

పృధివీ, జలము, అగ్ని అనునవి మూర్తము, మర్త్యము, స్థితము మరియు తత్యము.

ఆకాశము, వాయువు అనునవి అమూర్తము, అమృతము, సత్యము మరియు తత్యము (సత్-సత్యము, తత్-తత్యము - సత్ తత్ అంటే సత్యము - అది) ఈ రెండు విధముల యొక్క బ్రహ్మ స్వరూపమును చెప్పుటయు కొరకు "అధాత ఆదేశో నేతినేతి నహ్యేత స్మాదితి నేత్యన్యత్పర మస్త్యధ నామధేయం సత్యస్య సత్యమితి ప్రాణావై సత్వం తేషామేష సత్యమ్" "అపుడు ఈ విధముగా మూర్త అమూర్త రూపాలు రెండూ పరమాత్మ యందు ఆరోపించబడి వుండుటము వలన వానిని బుద్ధి చేత నేతి, నేతి (ఇది కాదు, ఇది కాదు) అని నిషేధించగా మిగిలినది బ్రహ్మము అని ఉపదేశించాలి."

"పరబ్రహ్మము సత్యమునకు సత్యము, ప్రాణములు సత్యము, వానిలోన వున్నది సత్యమునకు సత్యము"

**నేతి, నేతి అని రెండు సార్లు అనటములో మొదలు మూర్తాన్ని, రెండవసారి అమూర్తాన్ని నిషేధించి ఆ రెండింటి పైన వున్నది పరబ్రహ్మము అనునది చెప్పబడుచున్నది.**

**ఈ విధముగా నిషేధము మూర్తాఽముర్తములకే గాని పరబ్రహ్మమునకు గాదు. అన్నింటిని లేదనిన తరువాత ఉన్నదని ఉపదేశించబడిన బ్రహ్మమున కంటే అన్యము లేదు. బ్రహ్మము ఒక్కటే వున్న వస్తువు.**

(బృ.ఉ. VI-3-1)

---

## (341) III-2-23

**సూ. తదవ్యక్తమాహ హి**

**క్ర. తత్, అవ్యక్తమ్, ఆహ, హి**

ప్ర.అ. తత్ = **ఆ పరబ్రహ్మము,** అవ్యక్తమ్ = **అవ్యక్తము, ఇంద్రియ గోచరము కానిది,** ఆహ = **అని శ్రుతులు చెప్పినవి,** హి = **కావున.**

**వి. ఆ బ్రహ్మము అవ్యక్తమైనది, కండ్లకు కనిపించదు అని ఉపనిషత్తు చెప్పినది.**

"బ్రహ్మము సత్ అయినచో ఎందుకు ఉపలబ్ధము అగుటలేదు?" అనే ప్రశ్న వస్తుంది. అది ఉన్నదే అయినా ఇంద్రియములు మనము, బుద్ధులకు గోచరము కాదు. కావున గ్రహించబడుట లేదు.

"న చక్షుషా గృహ్యతే నాపి వాచా,
నాన్యై ర్దేవై స్తపసా కర్మణా వా।
జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వః తతస్తు
తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః" (ముం.ఉ. III-1-8)

"ఆ పరబ్రహ్మము కన్నులతోగాని, వాక్కుతోగాని, ఇంద్రియముల తోగాని, తపస్సుతోగాని,

సత్కర్మతోగాని గ్రహించుటకు సాధ్యము గాదు. ఆత్మజ్ఞానముతో పరిశుద్ధమగు అంతఃకరణము కలిగి, పరబ్రహ్మమును నిరాకారముగా ధ్యానించు వ్యక్తి మాత్రమే ఆత్మను తెలిసికొనకలుగును" (ముం.ఉ. III-1-8)

భగవద్గీతలో కూడా (II-25)

"వ్యక్తము గాదది చింతించనలవి గాదు
వికారములు నది నెంతయు బొందబోదు
విశదీకరముగ వినుము తెలియునీవు
దుఃఖంబు తగదు నర్హంబు గాదు గాదు"

**అట్లు బ్రహ్మము చక్షురాదులకు గ్రాహ్యము కాదను విషయము స్పష్టముగా ప్రతిపాదింపబడినది.** (ముం.ఉ. III-1-8; భ.గీ. II-25)

---

## (342) III-2-24

**సూ. అపి చ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్**

**క్ర. అపి, చ, సంరాధనే, ప్రత్యక్షానుమానాభ్యామ్**

ప్ర.అ. అపి చ = **అయన గూడ,** సంసాధనే = **సంపూర్ణఆరాధన వలన,** ప్రత్యక్షానుమానాభ్యాం = **గ్రహింపబడునని శ్రుతుల యందు, స్మృతుల యందు ప్రత్యక్ష, అనుమానముల ఆధారమున ప్రతిపాదించబడినది.**

వి. **ఆ పరబ్రహ్మము అవ్యక్తము ఇంద్రియములకు, మనస్సు, వాక్కులకు అతీతమైన గూడ యోగులైనవారు అట్టి ఆత్మను సంరాధన (సంపూర్ణ ఆరాధన) ద్వారా ధ్యానసమయములో చూస్తున్నట్లుగా ప్రత్యక్ష అనుమానాలచేత శ్రుతి మరియు స్మృతులలో చెప్పబడినది.**

"పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూః,
తస్మాత్ పరాంపశ్యతి నాంతరాత్మన్,
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైచ్ఛత్,
ఆ వృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్" (కఠ.ఉ. II-4-1)

"పరబ్రహ్మము ఛిద్రములలాగా వుండే ఇంద్రియాలను బహిర్ముఖము చేసి హింసించినాడు. అందువలన అవి బాహ్యవిషయములను గ్రహించుతున్నాయి. అంతరాత్మ దర్శనము అవిచేయలేవు. ఎవరో ఒక ధీర వ్యక్తి మోక్షాభిలాషియై కన్నులు మూసి, ఇంద్రియాలను మరలించి, అంతర్ముఖము చేసి సంయమముతో ఆ పరమాత్మను దర్శిస్తారు."

**[నారాయణ వాక్యము :-**

(డిసెంబర్ 2014, పూర్ణిమనాడు, పూర్తి సాధనతో, ఉపవాసముతో, ధ్యానముతో మంథెనలోని శ్రీ భిక్షేశ్వర ఆలయములో లక్ష బిల్వార్చన చేస్తున్నపుడు భిక్షేశ్వరుని సాలోక్యము, సామీప్యములో కుండలినీ శక్తి భగవంతుని, భక్తురాలిని కలిపివేసి సారూప్యము (భిక్షేశ్వరుని తేజోలింగము సుజన



మంత్రపురిలో డిసెంబర్ 2014 పూర్ణిమనాడు స్ఫూర్తి, పూర్ణసాధనతో, ఉపవాసంతో, జ్ఞానంతో శ్రీమతి సుజనాదేవి గారు
లక్షబిల్వార్చన చేయుచుండగా అయిన శ్రీ బిక్షేశ్వరుని కుండలినీ దర్శనము మరియు అనుభూతి బ్ర.సూ. (342) III-2-24

## 1983లో నారాయణ చైతన్యయాత్ర ప్రారంభము కావటానికి కారణమైన రెండు దివ్య సంఘటనలు

గోదావరిలో స్నానము చేస్తూండగా అన్నగారు పంగునూరి రామన్న గారు
నారాయణ చేతులలో పెట్టిన గోదావరిలో లభించిన కాళేశ్వరముక్తేశ్వర లింగములు







ఓమ్

గీతామకరందము

రచయిత:

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

ప్రకాశకులు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

కాళహస్తి




అదేరోజు మధ్యాహ్నము బావగారు గోపాల్‌కిషన్ గారు నారాయణ చేతులలో వుంచిన
శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారి గీతామకరందము

**దీనితో శివానుగ్రహము కలగటము, గీతాయోగము అనే తపస్సు చేయటము, గురుకృప లభించటము ఒకేసారి సంపన్నమైనవి.**
**దానితో మొదలైన చైతన్యయాత్ర ఈ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృతలహరి వరకు జరిగినది.**

బ్ర.సూ. (342) III-2-24

# Darshan-Vision – The Understanding

**November 1986**

**బ్ర.సూ. (322) III-2-4**

Let me share an experience. During 86 a great change occurred in this life's journey of me. While translating Bhagvad Gita into Telugu Poetry (the poetry is inspired, as it was never thought that there was a poet inside me) great understandings, sparks of experiences and moments of unified bliss occurred.

One night there was tremendous intensity to have Darshan of the Supreme and to know the meaning of life and Supreme and the relation. Then sleep came.

During the sleep there was a dream. When I woke-up, I could remember the whole occurrence. The picture of people and things was clear and is clear even now. Narrated the experience to my partner, friend, companion and peace giver Sujana and children.

Later drew the picture of the most important person in the sequence; now it is being shared with you and along with vision that interpreted Darshan.

So far the word "I" is not used by me, in this narration. While describing the dream "I" being used. The `I' is ego and `Me' is the self. In life man in his dreams feelness and projects himself as somebody. With knowledge the I-ness is destroyed and `Me' is seen. To show my state and to relate easily with reader 1 shall use I.

**"I" is ego and `Me' is self**
**Loose I-ness and gain the self.**

I am in a hall. The hall is an auditorium. There are around 100 to 150 chairs for audience. Seats are sliding ones with usual cushion. I am in third or fourth row. There are people in other seats though few seats are vacant. There is an aisle in between two flanks of seats. There is a carpet on the floor. Carpet is made of cotton or jute or rope thread.

There is a stage, quite large one. The stage is wide and deep. On the right hand side is a table and behind the table are two seats. One is a throne and another is a chair. On the chair is seated an elderly man with suit and tie with combed hair. He looked like Menchim Begin. On the throne is seated a king with pointed white beard. He is wearing ancient kingly dress. There is crown with jewels and some kind of feather. The king is wearing dark glasses.

There is a podium on left side with mike.

The king said, "Now Mr. Sanjaya will start the proceedings". Sanjaya (Man in suit) got up and moved to podium on left and spoke into mike. Now Vyasa will tell us what is all these about".

While Sanjaya was speaking these words a tall person with long hair, wearing a long cloth which was wrapped partly on chest and arms, came up to the stage from right hand side. His face was very bright. He

was well built and had a wide forehead. He was neither serious nor smiling. He was bright and pleasant and peaceful. He walked neither hurriedly nor slowly, towards the back of the stage. More and more he walked it looked as if the stage was more far from us....

He stood there at distant end, which looked very very far. Still I could see details of his personage. He was standing lifting his right arm keeping his palm in Abhaya Mudra. The palm was straight all the four fingers were together with the thumb.

Now I noticed that below the dhoti he was wearing gumboots on his feet. I wondered that there were gumboots in Vyasa's time also. Then there was great light from his personage and suddenly he was coming towards the forefront of stage. Now he is smiling. His whole face and eyes and body is bright and now he is coming fast. I waited for him to stop before the edge of the stage near about king and Sanjaya. He didn't stop but continued to come forward.

I thought, now he would trip over the edge. Nothing like that occurred. He was coming forward and becoming larger and larger. He passed the edge of stage leaving king and Sanjaya in mass of light.

He came into hall. Now his form expanded so much that no physical features could be identified. It was only light. The person i.e. light enveloped each and everyone in auditorium as if we were absorbed into it and finally it entered into each one of us.

I was sitting being absorbed and absorbing.

I woke up. There was peace.

It was around 4.30 a.m. Thought over. Understanding came layer after layer. This is my experience. But there is much more which cannot be said or written in words.

Then after a month a sketch (my skill in drawing is limited, so far !) of the sage was drawn by me. It is enclosed. It is now not clear whether he had beard. Perhaps he had. More likely he had. But picture is drawn without beard and looks great to me.



## VISION - THE UNDERSTANDING

1. One should join the company of seekers who are on the path of supreme and listen to the words of knowers.

2. Even an ignorant and blind man can see and know about the supreme truth with the help of the company of noble man.

3. When a noble man is with a seeker, the seeker will have opportunity to experience great understanding and vision.

4. The great sages and seers are ever ready to help noble men and true seekers.

5. The seeker should completely lose his ego and become a common man like everybody. When one becomes common with everybody he becomes nobody. He has no separate physical identity.

6. The great sage, realiser and teacher is that person who is knowledgeable, experienced, simple and who is not touched by the mud of material or base objects. He is ready to show light of his knowledge to seekers, even though they are ignorant or learned.

7. The jivi (living being) along with his intellect, mind and body should join the self the supreme ultimate. When one enjoins the supreme self, thus, then there is no fear or doubt and one is free from all apprehension (Abhayam).

8. To have the vision of the ultimate knowledge, knowable and knower one should be humble and devote himself with great dedication. He must be ready to do whatever is required to be done. He must completely offer himself.

9. When fears are lost the nearness of supreme self is experienced more and more near as if the supreme self is approaching and coming near filling whole space between here and there infinity.

10. The supreme self is expanded to every place in whole universe and beyond. It is omnipresent.

11. The supreme teacher is inside each other. Though he is undivided, single and only one, He (It) has entered into each one of the living beings and also non-living.

12. How wonder ! each one of us is inside and within the supreme knower and the supreme knower is inside each one of us ! The universe is in atom and all atoms are in universe.

*Oh ! Great ! Wonderful.*

# ULTIMATE VISION

Hyderabad.
10.1.2015 – 3.00 AM.

Self is in a high peak in Himalaya
Himavan was seated in front of
Brahmaji with his four shining
faces. Himavaan had a golden
musical instrument ~~with~~ which
was like square rectangular version
of veena with equal black in place
of the round base head of usual veena.
With joy.
Then Brahmaji smiled and a
wonderful Golden super veena
~~of~~ was on his lap he started
playing with two lower hands
and the music was ~~magi~~
super magnificiently delicate
and excellent. The
tune and the verse
was "Sahasra sheersha purusha"
the creation song.
Himavan felt ashamed that
his own veena was nothing
compared to the Brahmic veena.
Then Brahmaji smiled and

said "Dear Himavan! Do not worry. ~~All~~ the spirit ~~of~~ ~~it~~ this veena will be established and flow through your veena. ~~Thus~~ you veena will be called Vedavati.

Himavan prostrated and started playing his veena along with Brahma's veena.

Brahmic veena and Vedavati veena emenated divine vedic music together.

---

Came back to this world with divine musical chant of Vedas.

Aum tat sat.

---

THIS IS THAT

THIS (Darshan) IS THAT (DIVINE)

---

# స్వప్న సత్యము

**(భాగ్యనగరము 10.1.2015 ఉ॥ 3-00 గం॥లకు)**

హిమాలయములలోని ఒక శిఖరముపై వుంటిని. హిమవానుడు నాలుగు ముఖములతో వెలుగుతున్న బ్రహ్మ గారి ముందు కూర్చొని వున్నాడు. హిమవానుని చేతులలో ఒక బంగారు వాయిద్యము వుండెను. బుర్ర వుండవలసిన చోట ఒక చతురస్రాకార పెట్టెలాంటిది వుండెను.

బ్రహ్మ గారు ఆనందముతో చిరునవ్వు నవ్వినారు. వెంటనే ఒక అద్భుతమైన బంగారు శ్రేష్ఠ వీణ ఆయన ఊరువులపై వెలిగింది. ఆయన ఆ వీణను తన క్రింది రెండు చేతులతో ఉత్సాహంగా తలవూపుతూ వాయించటము ప్రారంభించినాడు. ఆ సంగీతము అద్భుతము, లలితము, శ్రేష్ఠముగా వుండెను.

ఆయన వాయించిన గీతము సృష్టిక్రియా గీతముయైన "సహస్రశీర్షాపురుషా"

ఆ సంగీతము విని హిమవానుడు ఆ మహత్తర వీణ ముందు తన పెట్టె వీణ తక్కువదని చిన్నపోయి సిగ్గుపడి తలవంచినాడు.

అప్పుడు బ్రహ్మగారు చిరునవ్వుతో ఇలా అన్నారు. "ప్రియమైన హిమవానుడా ! చింతించవలదు. ఈ బ్రహ్మవీణ యందలి చైతన్యమంతా నీ వీణలో స్థితమై ప్రవహించగలదు. నీ వీణ "వేదవతి" అని అనబడును."

హిమవానుని పెట్టె వీణ వెలిగింది. ఆయన ఆ వీణను వాయించటము, బ్రహ్మగారితో పాటు, ప్రారంభించినాడు.

బ్రహ్మ వీణ మరియు వేదవతి వీణ జోడుగా యుగళ దివ్య వైదిక సంగీతమును ప్రసరించినాయి.

ఈ ప్రపంచంలోకి దివ్య సంగీతముతో పాటు దిగి వచ్చినాను.

ఇదియే అది

ఈ దర్శనమే ఆ దివ్యత్వము

(వెంటనే శ్రీ పాండుచారి గారిని లేపి దివ్యదర్శనము గూర్చి తెలిపి బ్రహ్మగారి, హిమవానుని, బ్రహ్మవీణ, వేదవతి వీణ, హిమాలయముల చిత్రము వేసినాను. ప్రక్కపేజిలో చూడగలరు. ఇది అంతా అప్పుడు ఆంగ్లములో వ్రాసినాను. అదికూడా ముందర చూడగలరు. బ్ర.సూ. (342) III-2-4

# స్వప్నసత్య నిదర్శనము

**(వడోదర 16.2.2016 )**

ఆనాడు భాగ్యనగరములో అయిన బ్రహ్మదర్శన చైతన్యము నేటి వరకూ ప్రవహిస్తూనే ఉన్నది. అది కలయా? నిజమా? అనే సందేహము ఏ మాత్రమూ లేదు. ఎందుకంటే 1983లో గీతాయోగము చేసి ఆంగ్లములో భగవద్గీత (Song Supreme) అనుష్టుప్ ఛందస్సులో వ్రాస్తున్నప్పుడు ఉదయం 2 గం॥లకు అయిన వ్యాసదర్శనము స్వప్నాతీతమైన సత్యమని నిదర్శనము దొరకివుండెను. దాని గురించి Gurubobh-I లో చూడవచ్చును.

గీతాయోగ చైతన్యము, వ్యాస దర్శనము తరువాత శ్రీ మదాంధ్ర భగవద్గీత, Song supreme, Responsible leader, stable and able, sacred ways to spirituality, Krishna Management Guru అనే గ్రంథములు భగవద్గీతా సందేశములుగా, వ్యాఖ్యానములుగా వ్రాసి Spirit of Vedas, Secrets of Upanishads, Light ways of Upanishads అని ఉపనిషత్తుల గురించి వ్రాసి తెలుగులో 8 ఉపనిషత్తుల వ్రాయటము ఐనది.

ప్రస్థానత్రయములో వేదాంత దర్శనమని పేరుగాంచిన బ్రహ్మసూత్రములు లోతుగా అధ్యయనముచేసి, అనుభూతినంది శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి ప్రారంభించాలని సంకల్పము చేయటము డిసెంబర్ 2015లో అయినది. అంతకుముందు ఇంగ్లీష్‌లో తెలుగులో కొన్ని సూత్రములు అక్కడక్కడ వ్రాయటము అయినది. అయితే 10.1.2015 భాగ్యనగరములో బ్రహ్మదర్శనము కాగానే బ్రహ్మసూత్ర బోధామృత లహరి వెంటనే ఒక తపస్సుగా, యోగముగా ప్రారంభించి వ్రాయాలని ధృడనిశ్చయము అయినది. ఇది పరమాత్మ అనుగ్రహమే.

10.1.2015 మంథని చేరి శ్రీ పాండుచారి ద్వారా మంథనిలో వచ్చిన ఒక పెద్ద నోట్‌బుక్‌లో ఈ జ్ఞానయజ్ఞము మొదలైంది. ద్వాదశ మాసముల నిష్ఠ వలన ఇది ఇప్పుడు పూర్తి కానున్నది.

మరి హైదరాబాద్‌లో అయిన బ్రహ్మ దర్శనము గురించి ఏమిటి ?

శ్రీ సీతారామ సేవసదన్ చేసిన సేవలలో ఖానాపురములో ఉత్తరవాహినీ గోదావరి వద్ద వున్నరుద్ర పాదక్షేత్ర పునరుద్ధరణకు గత సంవత్సరము నుండి ఉద్యమము నడుస్తున్నది. ఆ సందర్భములో నది వలన భూమిలో దిగిపోయిన అనేక విగ్రహములను ఖానాపురము వారి

ముఖ్యముగా సర్పంచ్ శ్రీ ఓదెలు గారి మరియు శ్రీ సుధాకర్ గారి సహకారంతో సద్వ్యవస్థ చేయటము అయినది.

3 నెలల క్రితము నవంబరు 2015లో అక్కడికి వెళ్లినపుడు ఒక శిలాఫలకము భూమిలో వున్నది కనిపించినది. అపుడు కూడా శ్రీ పాండుచారి వుండెను. ఖానాపురముకు చెందిన కర్మయోగి సుధాకర్ సహాయముతో ఆ శిల బయటకు తీస్తే అది అద్భుత శిల్పము అని తెలిసినది.

అపుడే అయినది బ్రహ్మ సాక్షాత్కారము. ఆ బ్రహ్మ దివ్యరూపము, భాగ్యనగర బ్రహ్మదర్శనము ఒకటియేనని చిత్రములో చూడవచ్చును. భాగ్యనగరములో అయినది కల కాదని, సత్యమని నిదర్శనము అయినది.

ఈ బ్రహ్మసూత్ర బోధామృతలహరికి రెండు సార్లు బ్రహ్మస్పర్శ కావటము బ్ర.సూ. (342) III-2-24లో చెప్పినది. పరమసత్యమని నిదర్శనమైనది.

"అపిచసంరాధనేప్రత్యక్షానుమానాభ్యామ్"

"ఆ పరబ్రహ్మము అవ్యక్తము ఇంద్రియములకు, మనస్సు, వాక్కులకు అతీతమైన గూఢ యోగులైన వారు అట్టి ఆత్మను సంపూర్ణ ఆరాధన ద్వారా ధ్యాన సమయములో చూస్తున్నట్లుగా ప్రత్యక్ష అనుమానాలచేత శ్రుతి మరియు స్మృతులతో చెప్పబడినది." బ్ర.సూ. 342 ఇది ప్రత్యక్ష పరమసత్యమని శ్రీమతి సుజన గారి భిక్షేశ్వర దర్శనము నారాయణకు స్వానుభవమైన బ్రహ్మదర్శనము, వ్యాస దర్శనము స్పష్టముగా తెలుపుతున్నాయి. మీకు కూడా ఈ అనుభూతి భక్తి ద్వారా తపస్సు ద్వారా సంభవము. బ్ర.సూ.(322) III-2-4, (342) III-2-24



# బ్రహ్మ దర్శనము



**10.1.2015 నాడు ఉదయము 3 గం॥లకు**
**భాగ్యనగరములో నారాయణకు అయిన బ్రహ్మదర్శనము, స్వప్న సత్యము.**



నవంబరు 2015 నాడు ఖానాపురము, మంత్రకూటము, రుద్రపాదముల వద్ద అయిన బ్రహ్మ పునర్దర్శనము, స్వప్నసత్య నిదర్శనము, బ్రహ్మ సాక్షాత్కారము బ్ర.సూ.(322) III-2-4, (342) III-2-24

గారి హృదయము దగ్గర, ప్రశాంతము అతీతమైన సుజన గారి స్వరూపము అయి సాయుజ్యానుభూతి అయినది. ఇది శ్రీ దుద్దిళ్ల మారుతి శాస్త్రి గారి సమక్షములో అయినది. అదృష్టవశాత్తు శ్రీ పాండుచారి తీసిన ఫోటోలో కన్నులకు కనిపించని కుండలినీ విస్తారము, భక్త భగవంత సంధానము మనము చూడవచ్చును.)

(అటువంటి దర్శనము స్వానుభవము 1983లో జీవితములో చాల కష్టసమయము వచ్చినపుడు ఈ లోకము విడిచి పోవాలనుకొన్నపుడు గోదావరిలో కాళేశ్వర, ముక్తేశ్వరులు లభించి వెంటనే భగవద్గీత చేతులలో మా బావ గారు శ్రీ గోపాల్ కిషన్ గారిచే పెట్టబడినది.
తక్షణము గీత తెరువగానే ఈ శ్లోకం వచ్చినది

"యే తు సర్వాణి కర్మాణి, మయి సంన్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన, మాం ధ్యాయంత ఉపాసతే॥" (భ.గీ. XII-6)

"తేషామహం సముద్ధర్తా, మృత్యుసంసార సాగరాత్।
భవామి న చిరాత్పార్థ, మయ్యావేశిత చేతసామ్॥" (భ.గీ. XII-7)

"అన్ని కర్మములు నాయందు సన్న్యసించి
మనసునెపుడు నా యందు చేర్చి నిలిపి
అనన్యయోగ ధ్యానంబు చేయుచుండి
నన్ను కొలచి ఉపాసించుచుండునెవరు" (శ్రీ.ఆ.భ.గీ. XII-6)
"మృత్యుసమమై యుండు దాని నుండి
లోతు సంసారపు మొసలి పట్టు నుండి
యుద్ధరించి వాని గట్టునెక్కించగలను.
పార్థ నన్ను నమ్మినవాడు మునుగబోడు" (భ.గీ. XII-7)

అలాంటి అనన్య యోగధ్యానములలో ఉపవసించి 18 రోజుల గీతాయోగము, ఉపాసన చేసినపుడు వ్యాస దర్శనము, భగవద్దర్శనము మరియు తరువాత దేవీదర్శనము అయి, అసీమిత పరమాత్మ కృపతో ప్రజాసేవ, మానవ సేవగా మాధవ సేవ చేసి నిరంతర బ్రహ్మ స్పర్శ అవటము స్వానుభవము.

ఈ బ్రహ్మ సూత్రములు వ్రాస్తున్నపుడు, నిరంతర రచన, చింతన, సమాధిలో వున్నపుడు బ్రహ్మదర్శనము అయినది.)

"యం వినిద్రా జితశ్వాసాః, సంతుష్టాః సంయతేంద్రియాః।
జ్యోతిః పశ్యంతి యుంజానాః, తస్మై యోగాత్మనే నమః ॥" (మ.భా. శాంతిపర్వము XII-47-55)

"నిద్రను దాటినవాడు, శ్వాసను జయించినట్టివాడు,
సంతుష్టుడు, సంయతేంద్రియుడైనవాడు,

యోగియై నిలచి జ్యోతిని దర్శించు చుంద్రు.
అట్టి యోగాత్మకు నమంబులిడుదు" (మ.భా.శాం.ప. XII-47-55)

మరియు మహాభారతములోని ఉద్యోగపర్వములో సనత్సు జాతీయములో సనత్సుజాత మహర్షి ధృతరాష్ట్రునితో ఇలా అన్నారు.

"యోగినః తం ప్రపశ్యంతి, భగవంతం సనాతనమ్" (మ.భా.ఉ.ప. IV-6-1)

"యోగులు బాగుగ దర్శించుచుంద్రు
భగవంతుని సనాతనుడైన వాని" (మ.భా.ఉ.ప. IV-6-1)

నిద్రలేనివారు (ఎప్పుడూ తెలివితోవుండేవారు), శ్వాసను జయించిన వారు, ఇంద్రియములను సంయమించువారు, సంతుష్టులైనవారుజ్యోతిని చూసి ఆత్మలో కలిసిన యోగులైన సనాతనుడైన భగవంతుని దర్శించుచుందురు. మరియు ఆ జ్యోతిస్వరూపమైన భగవంతునిరూపము (వ్యాసరూపము) 1983లో కనిపించినది. "తమసో మా జ్యోతిర్గమయా" అనునది అక్షరాలా బ్రహ్మస్పర్షయే ఆ విధముగా యోగులకు ధ్యానములో దర్శనము అయ్యే బ్రహ్మము "సత్తు"యే, ఉన్నదే.

(కఠ.ఉ. II-4-1; భ.గీ. XII-6,7, 47, 55; మ.భా IV-6-1)

## (343) III-2-25

**సూ. ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్**

**క్ర. ప్రకాశాదివత్, చ, అవైశేష్యం, ప్రకాశః, చ, కర్మణి, అభ్యాసాత్**

ప్ర.అ. ప్రకాశాదివత్ = **సూర్యప్రకాశాదులవలె,** చ = **కూడ,** అవైశేష్యం = **పరమాత్మయందు భేదము లేదు,** ప్రకాశః = **ప్రకాశము,** చ = **కూడ,** కర్మాణి = **కర్మలయందు,** అభ్యాసాత్ = **అభ్యాసము చేయుట వలన**

వి. **"జీవుడు ఆరాధించేవాడు మరియు ధ్యానించేవాడు; పరమాత్మ ఆరాధ్యుడు ధ్యానింపబడేవాడు అయితే జీవునికి, పరమాత్మకు భేదం వుంది కదా ?" అని అంటే దానికి సమాధానము ఈవిధము.**

**ప్రకాశము వస్తువుల నీడలుగా చూచినప్పుడు వివిధాకారములు చెందినట్లు, సూర్యుడు జలములోవున్నట్లు, ఆకాశము కమండలములో వున్నట్లు, పక్షి కాగితముపై బొమ్మలో వున్నట్లు పరమాత్మ జీవునిగా వున్నాడు.**

వస్తువుల ఆకారము మారినా ప్రకాశము మారదు, జలము కదిలినా సూర్యుడు కదలడు, కమండలములు మారినా ఆకాశము మారదు, బొమ్మలు మారినా కాగితము మారదు.

**ప్రకాశము, సూర్యుడు, ఆకాశము, కాగితము, అన్నీ మారినట్లు కన్పించేవే కాని, వానిలో బేధము లేదు. ఒకే రూపము కలవు. అదే విధముగా జీవునిలో పరమాత్మలో బేధము లేదు. శరీరమనే ఉపాధి వలన బేధము కన్పిస్తుంది. అది కల్పనా మాత్రమే.**

**"తత్త్వమసి ("అదియే నీవు")** (ఛాం.ఉ. VI-8-7) **అనే వాక్యాలు అదే చెబుతున్నాయి** (ఛాం.ఉ. VI-8-7)

## (344) III-2-26

**సూ. అతోఽనంతేన తథాహి లింగమ్**

**క్ర. అతః, అనన్తేన, తథా, హి, లింగమ్**

ప్ర.అ. అతః = **పై కారణముల వలన,** అనంతేన = **అనంత గుణములు కలవాడని,** తథాహి = **ఆ ప్రకారముగా,** లింగమ్ = **శ్రుతి చెప్పుచున్నది.**

వి. **జీవాత్మ, పరమాత్మల బేధము ఉపాధి వలన వచ్చినది కావున విద్య, జ్ఞానము వచ్చినపుడు, ఉపాధి నివృత్తికాగానే జీవుడు అనంతునితో ఏకత్వము చెందుతాడని ఉపనిషత్తులో చెప్పబడినది.**

ముండకోపనిషత్తులో

"స యో హ వై తత్పరమం
బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి,
నాస్యాబ్రహ్మవిత్కులే భవతి।
తరతి శోకం తరతి పాప్మానం
గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి" (ముం.ఉ. III-2-9)

"ఎవరు సర్వోత్తమమగు పరమాత్మను తెలిసికొనకలుగుచున్నాడో, అట్టి జ్ఞాని సాక్షాత్తు పరబ్రహ్మమే అగుచున్నాడు. అతడు అన్ని శోకములను తరించుచున్నాడు, పాపములను దాటి వేయుచున్నాడు. హృదయములోని అజ్ఞానగ్రంథులు తెంచుకున్నవాడై అమృతత్వమునందుచున్నాడు'' అని చెప్పబడినది.

"బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" (బృ.ఉ. IV-4-3)

"బ్రహ్మము అయి వుండియే బ్రహ్మమును పొందుచున్నాడు".

**ఇటువంటి లింగములు, గుర్తులు శ్రుతులలో కనిపిస్తూ వున్నాయి.**

**జీవుడు స్వాభావికముగా పరమాత్మయే. ఆత్మ స్వాభావికముగా పరమాత్మయే. అజ్ఞానముతో ఐక్యము పొందునట్లు అనుకోవటమే కాని వేరు కాదు. ఒకటి ఒకటియే. ఒకటి ఒకటి కావటము కాదు, మొదటి నుండి ఒకటిగానే వున్నది జ్ఞానము వచ్చిన వెంటనే మొదలే ఒకటిగానే వుంటిననీ, తాను ఎప్పుడూ ఒకటియేననీ తెలుసుకుంటుంది. ఐక్యము కాదు ఏకత్వము కావున పరబ్రహ్మ నిర్గుణమే.**

(ముం.ఉ. III-2-9; బృ.ఉ. IV-4-3)

---

## (345) III-2-27

**సూ. ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్**

**క్ర. ఉభయవ్యపదేశాత్, తు, అహి, కుండలవత్**

ప్ర.అ. ఉభయవ్యపదేశాత్ = **రెండు విధములుగా, (భేదము, అభేదము),** తు = **మరియు,** అహి = **సర్పము,** కుండలవత్ = **చుట్టుకొని యుండిన స్థితివలె.**

వి. **శ్రుతులు పరమాత్మకు, జీవాత్మకు భేదము, అభేదము రెండు అని చెప్పినవి. పాముకు, చుట్టుకొనిన**

**పాముచుట్టకు గల భేదము మరియు అభేదమువలె! సరళముగా వున్న పాము, చుట్టుకొనిన పాము ఒకటే అయినా బారుకు, చుట్టకు భేదము వున్నది, కాని పాముకు భేదము లేదు.**

"అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మమునే) (బృ.ఉ. I-4-10) "తత్త్వమసి" (అదియే నీవు) (ఛాం.ఉ. 6-8-7) అనే దానిలో బ్రహ్మమునకు, జీవునకు అభేదము. భేదములేదు.

"తతస్తు తం పశ్యతే(తి) నిష్కలం ధ్యాయమానః" (ముం.ఉ. III-1-8)

"నిర్వికారుడైన పరమాత్మను ధ్యానము చేస్తూ జీవుడతనిని చూస్తున్నాడు." అనే దానిలో ధ్యానించే జీవునకు, ధ్యానింపబడే పరబ్రహ్మకు భేదము వున్నది.

**పాముకు, పాముచుట్టకు పరమార్థములో భేదము లేదు. వ్యవహారములో భేదము వున్నది. ఉన్నదానిలో భేదము లేదు. కనిపించి, అనిపించి, ఆలోచించే వానిలో భేదము వున్నది. రెండని అనిపించినా, కనిపించినా రెండూ ఒకటే.**

**పరమాత్మ, జీవాత్మలు ఒకటి ఐనా వ్యవహారములో రెండని అనిపిస్తాయి.**

(బృ.ఉ. I-4-10; ముం.ఉ. III-1-8; ఛాం.ఉ. VI-8-7)

## (346) III-2-28

**సూ. ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్**

**క్ర. ప్రకాశాశ్రయవత్, వా, తేజస్త్వాత్**

ప్ర.అ. ప్రకాశాశ్రయవత్ = **ప్రకాశము, దానికి ఆశ్రయమైన సూర్యునివలె,** వా = **లేక,** తేజస్త్వాత్ = **తేజముగా చూచినచో**

వి. సూర్యునికి, సూర్యునిప్రకాశానికీ (వెలుగుకూ), ఏమీ భేదము లేదు. ఈ రెండు వేరు వేరు కాదు. అయినా వేరుగా చెప్పబడుతున్నాయి. వ్యవహరించబడుతున్నాయి.

వెలుగు కోణములో రెండు ఒకటే. కనిపించే కోణములో, పుంజము మరియు కిరణముల రూపములో, అవి వేరు.

**సూర్యుడు, ప్రకాశము వేరుగా అనిపించే ఒకే తత్త్వము. బ్రహ్మము, జీవుడు వేరుగా అనిపించే ఒకే తత్త్వము.**

## (347) III-2-29

**సూ. పూర్వవద్వా**

**క్ర. పూర్వవత్, వా**

ప్ర.అ. పూర్వవత్ = **మొదలు చెప్పినట్లుగనే (బ్ర.సూ. III-2-25),** వా = **అట్లు కానిచో,**

వి. **ఇంతకు ముందు 343వ సూత్రములో చెప్పబడినట్లు భేదము లేకపోయినా, ఉపాధి వలన వున్నట్లు అనిపిస్తుంది. అవిద్యవలన భేదము, అవిద్య నశించుతే భేదము లేదు. అభేదము యథార్థము, భేదము కల్పనామాత్రము.**

(బ్ర.సూ. III-2-25)

## (348) III-2-30

సూ. ప్రతిషేధాచ్చ

క్ర. ప్రతిషేధాత్, చ

ప్ర.అ. ప్రతిషేధాత్ = **రెండవ దానిని (భేదము అని అనిపించే దానిని) నిషేధించుట వలన,** చ = **కూడ**

వి. ఉపనిషత్తులలో

"అత్మా వా ఇదమేక ఏవాత్రగ్ర ఆసీత్, నాన్యత్ కించిన మిషత్" (ఐ.ఉ. I-1-1) "సృష్టికి పూర్వము పరమాత్మ ఒక్కడే వుండెను. మరియొక్కటి లేదు."

**జగము యొక్క సృష్టికి ముందు అంతా ఒకటే. జగము కలుగగానే రెండు అనిపించాయి. అయితే జగత్తులో వున్నవన్నీ, అనిపించే వాటిని "నేతి, నేతి" (ఇది కాదు, ఇది కాదు) అనుచు అన్నిటీని తీసివస్తే మిగిలేది ఒకటియే.**

**ఈ ఒకటి ఆ మొదటిలోని "ఒకటి" యే**

"త దేత త్ర్బహ్మ, పూర్వ మనపర మనంతర మబాహ్యం" (బృ.ఉ. II-5-19)

"ఆ, ఈ బ్రహ్మ అపూర్వము, అనపరము, అనంతరము, అబాహ్యము" అని బ్రహ్మము కంటే ఏది వేరు లేదని చెప్పబడినది.

**కావున బ్రహ్మమునకు జీవునకు భేదము లేదు.**

**నిరాకారమైన బ్రహ్మము, సాకారమనే ప్రపంచములో కనిపించినా, నిరాకారమే.**

(ఐ.ఉ. I-1-1), (బృ.ఉ. II-5-19).

## (7) పరాధికరణము (99)

## (349) III-2-31

సూ. **పరమతః సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః**

క్ర. **పరమ్, అతః, సేతుఉన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః**

ప్ర.అ. పరమ్ = **వేరైనది,** అతః = **ఈ బ్రహ్మ కంటె,** సేతు = **సేతువు,** ఉన్మాన = **ఉన్మానము,** సంబంధ = **సంబంధము,** భేద = **భేదము,** వ్యపదేశభ్యః = **వర్ణనముల వలన**

వి. అయితే ఉపనిషత్తులలో

**సేతువు, ఉన్మానము, భేదము మొదలైన వర్ణనముల వలన బ్రహ్మము కన్న వేరైన వస్తువు ఏదో వున్నదని అనుమానము వస్తున్నది.**

**సేతువు అంటే రెండు ఒడ్లు కలిపే వంతెన**

"అథ యః ఆత్మా సః సేతుః విధృతిః" (ఛాం.ఉ. VIII-4-1)

"సేతుం తీర్త్వా" (ఛాం.ఉ. VIII-4-2)

"ఈ పరమాత్మ సేతువువలెనన్నింటిని ధరించుచున్నది"

"ఈ ఆత్మ సేతువును దాటి" అని చెప్పబడినది.

ఆత్మ, పరమాత్మ సేతువులయితే, ఆవలి ఒడ్డు వంటిది ఇంకొకటి వుండాలి కదా!

**ఉన్మానము అంటే ఇంత పొడవు, వెడల్పు, బరువు, పరిమితి అని చెప్పే కొలత.** "తదే తద్బ్రహ్మ చతుష్పాత్, అష్టాశఫం షోడషకళమ్" (ఛాం.ఉ. IV-5-6,7,8)

"బ్రహ్మము నాలుగు పాదములు కలది. ఎనిమిది రెక్కలు, పదునారు అవయవములు, కళలు, కలిగినది" నాలుగు పాదములు, నాలుగు దిక్కులు కలిసి ఒక పాదము. భూమి, అంతరిక్షము, ద్యులోకము, సముద్రము కలసి రెండవ పాదము. చంద్రుడు, సూర్యుడు, అగ్ని, మెరుపు కలసి మూడవ పాదము. నాసిక, శ్రోత్రము, నేత్రము, వాక్కు కలిసి నాలుగవ పాదము.

**డెక్కలు :-** 1. తూర్పు, దక్షిణము 2. పడమర, ఉత్తరము 3. భూమి, అంతరిక్షము 4. ద్యులోకము, సముద్రము 5. చంద్రుడు, సూర్యుడు 6. అగ్ని, మెరుపు 7. నాసిక, శ్రోత్రము 8. నేత్రము, వాక్కు.

**16 కళలు :-** తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము, భూమి, అంతరిక్షము, ద్యులోకము, సముద్రము, చంద్రుడు, సూర్యుడు, అగ్ని, మెరుపు, నాసిక, శ్రోత్రము, నేత్రము మరియు వాక్కు. ఇవి నాలుగు పాదములు, 8 డెక్కలు (రెండు రెండు కళలు) కలసి 16 కళలు. ఇది ఉన్మానము. ఇలాంటి కొలతలు వేరే ఒక వస్తువు నుండి గుర్తించటానికి చెబుతారు.

**సంబంధము అంటే ఒక దానికి ఇంకొక దానితో ఉన్న కలుపుగోలు తనము.**

"నాయనా! సుషుప్తిలో జీవుడు ఆసద్రూపుడైన బ్రహ్మతో కలుస్తున్నాడు" (ఛాం.ఉ. VI-8-1)

"జీవుడు సుషుప్తిలో ప్రాజ్ఞుడైన ఆత్మతో కలిసినవాడై" (బృ.ఉ. IV-3-21)

ఈ విధముగా జీవునికి, బ్రహ్మమునకు సంబంధము చెప్పబడినది. దీనివలన బ్రహ్మము కన్న ఇతరులైన జీవుడు వున్నాడని తెలుస్తున్నది.

భేదం అంటే ఒక దానికి ఇంకొకటి భిన్నము, వేరు "ఆత్మా వా అరే దృష్టవ్యః" - (బృ.ఉ. II-4-5) "పరమాత్మ చూడదగినవాడు" అని అనటము వలన చూడబడే బ్రహ్మము కన్న చూచే జీవుడు వేరు అని అనిపిస్తుంది.

"సూర్యునిలో ఏ హిరణ్మయపురుషుడు కనిపిస్తున్నాడో"

(ఛాం.ఉ. I-6) అని చెప్పి మరల, "ఈ కంటి యందు ఏ పురుషుడు కనిపిస్తున్నాడో"

(ఛాం.ఉ. I-7-5) ఈ నాలుగింటి వలన బ్రహ్మము కంటే వేరు అయిన పురుషుడు వున్నాడనే ప్రశ్న వస్తుంది.

**ఈ సేతు, ఉన్మానము, సంబంధము, భేదము అని చెప్పబడిన వానిలో బ్రహ్మమునకు, జీవునకు భేదము వున్నదనే ప్రశ్నకు సమాధానము చెప్పబడబోతున్నది.**

(ఛాం.ఉ. VII-4-1, VIII-4-2, IV-5-6-7-8, ఛాం.ఉ. VI-8-1, I-7-5, I-6), బృ.ఉ. IV-3-21, II-4-5).

## (350) III-2-32

**సూ. సామాన్యాత్తు**

**క్ర. సామాన్యాత్, తు**

ప్ర.అ. సామాన్యాత్ = **సామ్యము చెప్పుట వలన,** తు = **అయితే**

వి. **బ్రహ్మము సేతువు వంటివాడని అనటము వలన బ్రహ్మము కంటే వేరు ఎవరో వున్నాడనటము సరికాదు. లౌకికముగా అర్థము చేయించటము కొరకు చెప్పిన పోలిక మాత్రమే.**

**బ్రహ్మమనే సేతువును దాటి బ్రహ్మమనే జీవుడు బ్రహ్మమనే ఒడ్డును చేరుతాడు. బ్రహ్మమే దాటేది, దాటించేది, దాటి చేరేది. అదే విధముగా ఉన్మానము, సంబంధము, బేధము. ఇవన్నీ వేరుగా వున్నాయని అనిపించే వాటిని ఒకటే అని చెప్పటానికే ఈ పోలిక.**

## (351) III-2-33

సూ. **బుద్ధ్యర్థః పాదవత్**

క్ర. **బుద్ధ్యర్థః, పాదవత్**

ప్ర.అ. బుద్ధ్యర్థః = **బుద్ధికి అవగాహన అగుట కొరకు, ఉపాసన కొరకు,** పాదవత్ = **పాదములున్నట్లు వలె.**

వి. బ్రహ్మమునకు నాలుగు పాదములు, ఎనిమిది డెక్కలు, పదునారు కళలు వున్నవని చెప్పుట ఉపాసన కొరకు మాత్రమే.

నిరాకారమైన బ్రహ్మము బుద్ధికి పట్టుపడదు. కావున అవగాహన కావటానికి సాకార రూపములు, సావయవ రూపాములు చెప్పబడినవి.

మాండూక్యోపనిషత్తులో - "సర్వగ్ం హ్యేతత్ బ్రహ్మ, ఆయమాత్మా బ్రహ్మ, సోఽయమాత్మా చతుష్పాత్" (మాం.ఉ.-2)

"ఈ సంపూర్ణ జగత్తు నిశ్చయముగా బ్రహ్మమే. ఈ ఆత్మయే ఆ బ్రహ్మము. ఇట్టి ఆత్మకు నాలుగు పాదములు కలవు.

"తదేతత్ చతుష్పా ద్బ్రహ్మ" (ఛాం.ఉ. III-18-2)

"ఈ బ్రహ్మమునకు నాలుగు పాదములు కలవు" (ఛాం.ఉ. III-18-2)

**బుద్ధికి అర్థము అయ్యే విధముగా బ్రహ్మకు పాదములు మొదలైనవి చెప్పబడినవి. నిజముగా బ్రహ్మము నిరవయవము మరియు నిరాకారము**

(మాం.ఉ.-2 ; ఛాం.ఉ. III-18-2)

## (352) III-2-34

సూ. **స్థానవిశేషాత్ప్రకాశాదివత్**

క్ర. **స్థానవిశేషాత్, ప్రకాశాదివత్**

ప్ర.అ. స్థానవిశేషాత్ = **శరీర రూప స్థానముల గురించి చెప్పుటలోగల విశేషము వలన,** ప్రకాశాదివత్ = **ప్రకాశము మొదలైన వాటివలె**

వి. **ప్రకాశము మొదలైన వాటివలె, ఉపాధి యోగము వలన, బ్రహ్మమందు సంబంధము చెప్పటము సరిపోతుంది.** అక్షి పురుషుడు, కన్నులలో వున్న పురుషుడు మరియు ఆదిత్య పురుషుడు, సూర్యునిలో

వున్న పురుషుడు అనబడిన ఇద్దరు ఒక బ్రహ్మమే అయిన వారికి ఉపాధులైన వాటి పేర్లతో వ్యవహరించ పడుతున్నారు.

**లోపలి వెలుగు, బయట వెలుగు మరియు లోపలి గాలి, బయట గాలిలాగా బుద్ధి అను ఉపాధి వలన "బ్రహ్మము" జీవుడు, ఈశ్వరుడు అని అనబడుతున్నాడు. గుర్తు కోసమే కాని నిజముగా, బేధము లేదు. అందువలన పరబ్రహ్మము కన్న వేరు పదార్థము లేదు.**

## (353) III-2-35

**సూ. ఉపపత్తేశ్చ**

**క్ర. ఉపపత్తేః చ**

**ప్ర.అ.** ఉపపత్తేః = **శ్రుతి యందు చెప్పుట వలన,** చ = **కూడ**

**వి.** "సుషుప్తిలో జీవుడు తన స్వరూపాన్ని పొందుతాడు" అని ఉపనిషత్తులో చెప్పబడినది (ఛాం.ఉ. VI-8-1)

ఇది స్వరూప సంబంధము.

**స్వరూపము అనేది శాశ్వతము, వినాశముకానిది. కావున ఉపాధి వల్ల వచ్చిన రూపము తిరోభావము చెందగా - లేకుండా పోవగా స్వరూపాన్ని పొందటము జరుగుతుంది. ఈ విధముగా జీవుడు, ఈశ్వరుని సంబంధము, భేదము ఉపాధి వల్ల వచ్చినవి. గోడలు కూలగానే లోన, బయట అనే భావము మాసిపోతుంది.**

(ఛాం.ఉ. VI-8-1)

## (354) III-2-36

**సూ. తథాఽన్య ప్రతిషేధాత్**

**క్ర. తథాఽ, అన్య, ప్రతిషేధాత్**

**ప్ర.అ.** తథాఽ = **ఆ విధముగా,** అన్య = **వేరు దానిని, మరియొక దానిని,** ప్రతిషేధాత్ = **నిషేధించుట వలన కూడ**

**వి. ఇతర వస్తువులన్నింటిని నిరాకరించటము వలన కూడ పరబ్రహ్మ కంటె వేరే ఏమి లేదని నిర్ధారణము అవుతుంది.**

"ఆ ఆత్మ (బ్రహ్మ) క్రింద, పైన, వెనుక, ముందు, అన్ని ప్రక్కల నిండియున్నది. ఈ కనిపించు జగత్తు అంతయూ బ్రహ్మమే. అదియే నేను. నేనే క్రింద, మీద అంతట వున్నాను. అంతయు నేనుగా వున్నాను. క్రింద, పైన, అన్ని చోట్లను ఆత్మయే వున్నది. ఈ సర్వము ఆత్మయే" అని సనత్కుమారుడు నారదునికి బోధించినాడు. (ఛాం.ఉ.VI-25-1,2)

"దేనినైననూ ఆత్మ కంటే భిన్నముగా చూచే వానిని అందరూ పరాస్తము చేస్తారు."

(బృ.ఉ. II-4-6)

"ఈ సమస్తమూ బ్రహ్మమే. ఆత్మయే" (ఛాం.ఉ. VII-25-2)

"ఈ సమస్తము పురుషుడే" (శ్వే.ఉ. I-5.)
"ఈ బ్రహ్మములో నానాత్వము ఏమీ లేదు" (బృ.ఉ. IV-4-19)
ఈ విధముగా ఎన్నో శ్రుతి వాక్యములు, బ్రహ్మము తప్ప వేరు ఏదీ లేదని చెప్పతున్నాయి. కావున "బ్రహ్మము అద్వితీయము. బ్రహ్మము రెండవది వేరు ఏదీ లేని ఒకటియే". (ఛాం.ఉ. VII-25-1,2; VI-25-2, బృ.ఉ. II-4-6, IV-4-19; శ్వే.ఉ. I-5)

## (355) III-2-37

**సూ. అనేన సర్వగతత్వమాయామశబ్దాదిభ్యః**

**క్ర. అనేన, సర్వగతత్వమ్, ఆయామయశబ్దాదిభ్యః**

ప్ర.అ. అనేన = **ఈ బేధా భేద విచారణ చేత,** సర్వ గతత్వమ్ = **సర్వత్ర వ్యాపించి ఉండటము,** ఆయామశబ్దాదిభ్యః = **శ్రుతి యందు చెప్పబడిన వ్యాపకత్వము తెలుపు కారణముల వలన**

వి. **ఈ ఉన్మానములు, సేతువులను చెప్పటాన్ని నిరాకరించుట వలన బ్రహ్మము కంటె అతిరిక్తము ఏదీ లేదని, అది సర్వగతమని, పరిపూర్ణమైనదని స్థిరపడినది, తేలినది. లేకపోతే బ్రహ్మమునకు పరిచ్ఛిన్నత్వము సంభవించేది. ఏకత్వమే యధార్థము. ఆయామము అంటే వ్యాపకము అని అర్థము. పరమాత్మకు వ్యాపకత్వము, సర్వగతత్వము వున్నదని చెప్పబడినది కూడ.**

"ఈ భౌతికాకాశము ఎంత వుందో హృదయాకాశము కూడా అంత వుంది" (ఛాం.ఉ. 8-1-3)
"ఆత్మ అనేది ఆకాశము వలె సర్వగతము, నిత్యము, ఆత్మ ద్యులోకము కంటె పెద్దది." (ఛాం.ఉ. 3-14-3)

**ఈ విధముగా బ్రహ్మము అన్నింటిని వ్యాపించి వున్నది. అంతట వున్నది. ఎప్పుడూ ఉన్నది.** (ఛాం.ఉ. 8-1-3, 3-14-3)

## (8) ఫలాధికరణము (100)

## (356) III-2-38

**సూ. ఫలమత ఉపపత్తేః**

**క్ర. ఫలమ్, అతః, ఉపపత్తేః**

ప్ర.అ. ఫలమ్ = **జీవుల కర్మఫలము,** అతః = **పరమాత్మ నుండియే కలుగును,** ఉపపత్తేః = **అదియుక్తము, సమ్మతము.**

వి. **బ్రహ్మము కంటే భిన్నమైన వస్తువు ఏదీ లేదని చెప్పటము వలన, బ్రహ్మము నిర్విశేషము అని అనుట వలన, పరమాత్మ కర్మఫలము ఇవ్వటమనేది జరుగదు. పరమాత్మ ఇచ్చిపుచ్చుకొనుటలో, పుచ్చుకొని ఇచ్చుటలో ఏ మాత్రము పాల్గొనదు. వ్యవహారములను మించినది ఆ పరమాత్మ.**

అయితే ఇష్టము, అనిష్టము, మిశ్రమము అనే పనులను జీవుడు ఈశ్వరునిచే ప్రేరేపింపబడి చేస్తున్నాడని తెలుపబడినది. ఈ మూడు విధాల కర్మఫలములను జీవుడు అనుభవిస్తున్నాడు. నియతకర్మలు, నిషిద్ధకర్మలు, నిమిత్తకర్మలు, ప్రాయశ్చిత్త కర్మలు అనినవి కర్మ విధములు.

కర్మము, అకర్మము, వికర్మము అని కర్మల యొక్క తీరులు.

తామసికకర్మ, రాజసికకర్మ, సాత్వికకర్మ, నిష్కామకర్మ అని కర్మ యొక్క గుణ విధములు.

"మరి ఈ విధములైన కర్మఫలములను ఇచ్చేది ఎవరు ? కర్మయా? ఈశ్వరుడా ? అని ప్రశ్న వస్తుంది.

ఉపపత్తి వల్ల-యుక్తి యుక్తమైనందు వలన కర్మఫలము పరమాత్మ వలన కలుగుతుంది.

**సర్వాంతర్యామి, సర్వాధ్యక్షుడు, సృష్టి-స్థితి-లయాదులకు కారకుడు అయిన పరమాత్మ సర్వజ్ఞుడు కావున కర్మలు ఆచరించిన వారికి వారి వారి కర్మలకు అనుగుణముగా ఫలాన్ని కలిగిస్తున్నాడు అనటము యుక్తము.**

అటువంటి కర్మఫలము ఎప్పుడో కాలాంతరములో ఫలము ఇవ్వలేదు అని అనటము సమ్మతము కాదు. లేని దాని నుండి ఉన్నది పుట్టదు కదా!

## (357) III-2-39

**సూ. శ్రుతత్వాచ్చ**

**క్ర. శ్రుతత్వాత్, చ**

ప్ర.అ. శ్రుతత్వాత్ = **శ్రుతిలో కూడ చెప్పబడుట వలన**

వి. "స వా ఏష మహానజః ఆత్మాஉన్నాదో వసుదానః" (బృ.ఉ. IV-4-24)

**"ఆ మహాత్ముడు, అజుడు అయిన బ్రహ్మమే, అన్నము భక్షించేవాడు, కర్మఫలాన్ని ఇచ్చేవాడు, ధనాన్ని ఇచ్చేవాడు" దీనివలన కర్మఫల ప్రదాత పరమాత్మయేనని తెలుస్తున్నది.**

(బృ.ఉ. IV-4-24)

## (358) III-2-40

**సూ. ధర్మం జైమినిరత ఏవ**

**క్ర. ధర్మం, జైమినిః, అతః, ఏవ**

ప్ర.అ. ధర్మం = **యాగాదిరూపమైన ధర్మము,** జైమినిః = **జైమిని మహర్షి,** అతః = **అందువలన,** ఏవ = **నే,**

వి. **శ్రుతి యందు ఈ విధమైన ఉపపత్తి కన్పించినందు వలననే జైమిని మహర్షి "యాగాది రూపమైన ధర్మమే ఫలమునిస్తుంది" అని చెప్పినారు.**

కర్మము స్వల్ప కాలములో నశిస్తుంది కనుక అది భవిష్యత్తులో ఏ ఫలాన్ని ఇవ్వలేదు. అందువలన జైమిని ధర్మమే ఫలాన్ని ఇస్తుంది అని అన్నారు. పూర్వమీమాంస ప్రకారము కర్మము తాను నశించటానికి పూర్వము "అపూర్వము" అనే సూక్ష్మ శక్తిని సృష్టిస్తుంది, తరువాత కర్మము నశిస్తుంది.

**ఈ అపూర్వము ద్వారా యజ్ఞమే ఫలాన్ని ఇస్తుంది అని జైమిని వారి మతము.**

(అపూర్వము అంటే Debit and Credit లాగా) కర్మము అయిన తరువాత ఈ Debit and Credit లే వుంటాయి. వీటి ప్రకారము ఫలములు వస్తాయి. **ఈ విధముగా అపూర్వము అనే సూక్ష్మ శక్తి ద్వారా ధర్మము ఫలమును ఇస్తుంది అని జైమిని మహర్షి నిర్ణయము.)**

## (359) III-2-41

**సూ. పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్**

**క్ర. పూర్వం, తు, బాదరాయణో, హేతువ్యపదేశాత్**

**ప్ర.అ.** పూర్వం = **పూర్వము చెప్పబడినట్లు,** తు = **ఇంకను,** బాదరాయణః= **బాదరాయణ మహర్షి అభిప్రాయము,** హేతువ్యపదేశాత్ = **తగిన కారణములున్నందు వలన**

**వి. బాదరాయణ మహర్షి పూర్వము చెప్పబడిన పరమాత్మనే ఫలదాతగా స్వీకరిస్తున్నాడు. ఎందుకని అంటే ఉపనిషద్వాక్యములు అట్లు చెప్పుచున్నవి కనుక.**

బ్రహ్మయే, ఈశ్వరుడే, పరమాత్మయే అన్ని కర్మములకు యథా యోగ్యముగా ఫలము నిచ్చువాడు. అట్లు హేతువులతో సహా శ్రుతిలో స్పష్టముగా చెప్పబడినది.

**"పరమేశ్వరుడు ఎవరిని ఈ లోకము నుండి ఉద్ధరించాలని అనుకుంటాడో వానిచేత మంచి పనులు చేయిస్తాడు. ఎవరికి అథోలోకాలను పొందించాలని అనుకొంటాడో వాని చేత అశుభ కార్యాలను చేయిస్తాడు."** (కౌషీ.ఉ. III-8)

భగవద్గీతలో

"వారు యట్టి శ్రద్ధలందు యుక్తులగుచు
యే రూపముల నైనవారారాధించి యుండ
వారు యా రూపములను పొందుచుంద్రు
వారి శ్రద్ధ ఫలములనే విధియించినట్లు" (భ.గీ. VII-22)
"తేషామహం సముద్ధర్తా
మృత్యు సంసార సాగరాత్" (భ.గీ. XII-7)
"మృత్యు సంసారమైన దాని నుండి
లోతు సంసారమొసలి పట్టునుండి
యుద్ధరించి వాని గట్టునెక్కించగలను.
పార్థ! నన్ను నమ్మినవాడు మునుగబోడు" (భ.గీ. XII-7)

**అట్లు కర్మలు చేయటానికి ప్రేరణ ఇచ్చేవాడూ, ఆ కర్మలకు ఫలిములు కల్గించేవాడూ అయిన పరమాత్మయే కారణమని శ్రుతులు, స్మృతులు తెలుపుతున్నాయి. ఆ కారణముగా పరబ్రహ్మయే ఫలనిర్ణేత అని బాదరాయణ మహర్షి ధృధ విశ్వాసము.**

(కౌషీ.ఉ. III-8), (భ.గీ. VII-22, XII-7)

ఇట్లు
**తృతీయాధ్యాయ ద్వితీయ పాదము**

# తృతీయాధ్యాయ ద్వితీయపాద సమాసము

## జీవాత్మ పరమాత్మ తత్త్వ విచారణ

### 1. సంధ్యాధికరణము

స్వప్నఅవస్థలో జీవునిస్థితి మరియు స్వప్నములో సంసారిక వస్తువుల యొక్క రచన జీవుడు తానేచేస్తుంటాడు. అయితే పరబ్రహ్మము నియమించినట్లే జీవుడు అట్లు చేస్తుంటాడు. స్వప్నమునందలి ఘటనలు జీవాత్మ స్వతంత్రరచనలు కావు. జీవుడు నిమిత్తమాత్రుడు. సమస్తము జీవాత్మ కర్మానుసారము. పరమాత్మ శక్తి ద్వారానే సంపన్నము అవుతుంది. స్వప్నకాలములో చూడబడిన దృశ్యములు పరమాత్మచే ప్రేరణ చేయబడిన శుభాశుభ సూచకములు. స్వప్నమనే మాయను జీవాత్మ చేత, జీవాత్మకర్మానుసారము, పరమాత్మ అనుభవింపచేయుచున్నాడు.

### 2. తదభావాధికరణము

సుషుప్తిఅవస్థలో జీవునిస్థితి, సుషిప్తియందు జీవి పక్షిగూడు యందువలె, తన ఆత్మయందు విశ్రమించి సుఖముగా వుండటము. జీవుడు షుషప్తిలో బ్రహ్మభావాన్ని పొందుతాడు.

### 3. కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము

సుషుప్తిలోకి వెళ్లి బ్రహ్మానుభూతి చెందిన జీవుడే మరల తిరిగి జాగ్రదవస్థలోనికి వస్తున్నాడు. సుషిప్తిలో బ్రహ్మముతో ఏకీభవించి, మళ్ళీ అందుండే మేల్కొంటున్నాడు.

### 4. ముగ్ధేర్ధసంపత్యధికరణము

మూర్ఛయొక్క స్వరూపము, ముగ్ధావస్థ, అర్ధసుషుప్తిఅవస్థ. సుషుప్తిలోవలె సుఖముండదు. కాని అజ్ఞానముండును. ముగ్ధావస్థలో బ్రహ్మానుభూతి వుండదు.

### 5. ఉభయలింగాధికరణము

పరబ్రహ్మము సాకారము, నిరాకారము అను రెండు లక్షణములు కలిగి రెండు స్వరూపములలో సంపన్నమైనది అని చెప్పబడినను, పరమాత్మలో బేధము లేదు. ఉపాసన కోసము సగుణ రూపము చెప్పబడినను పరబ్రహ్మము నిరాకారము, ఏకము. పరమాత్మ -జీవాత్మ, సూర్యుడు-ప్రతిబింబము వలె ఒకటి అయినా రెండనిపిస్తారు. పరబ్రహ్మము విభాగరహితము, అవిభక్తము, నిరాకారము అయినను సమస్తభూతములలో ప్రాణులతో, ఉపాధులతో వేరు వేరు అనిపిస్తుంది, కనిపిస్తుంది. ఉపాధుల గుణదోషములు బ్రహ్మమునకు అంటవు. బ్రహ్మము దోషరహితము, అపరిచ్ఛిన్నము, ఏకము.

### 6. ప్రకృతైతావత్త్వాధికరణము

“ఇది కాదు”, “ఇది కాదు” అని అన్నీ నిషేధించబడిన తరువాత ఉన్నదని ఉపదేశించబడిన బ్రహ్మము కంటే అన్యమైనది లేదు. బ్రహ్మము ఒక్కటే వున్నవస్తువు. బ్రహ్మము ఇంద్రియాతీతము. చక్షురాదులకు అతీతమైనను యోగులు అనన్యధ్యానములో బ్రహ్మమును దర్శించగలరు. ఉపాధులలో

భేదమున్నను పరమాత్ముడికి భేదములేదు. భేదముగా అనిపించినా, కనిపించినా అభేదము పరబ్రహ్మతత్త్వము. ఉపాధి నివృత్తికాగానే, అజ్ఞానమునశించగానే జీవాత్మ పరమాత్మకు అభిన్నము అనే బ్రహ్మత్వమునందుతుంది. లేని ఉపాధుల భ్రమ పోగానే, ఉన్న బ్రహ్మముయే అనుభవమౌ వుతుంది. రెండుగా అనిపించినా, కనిపించినా రెండూ ఒకటే. అభేదము యథార్థము. భేదము కల్పనామాత్రమే. నిరాకారమైన బ్రహ్మము సాకారముగా కనిపించినా, ప్రపంచముగా అనిపించినా నిరాకారమే. "నేతి నేతి" వాక్యము బ్రహ్మమును నిషేధించడం లేదు.

**7. పరాధికరణము**

బ్రహ్మము ఒక్కటే ! అది అద్వితీయము. బుద్ధికి అర్థమయ్యే విధముగా బ్రహ్మమునకు పాదములు మొదలైన అవయవములు చెప్పబడినా బ్రహ్మము నిరవయవము. పరబ్రహ్మము అద్వితీయము, సర్వగతము. బ్రహ్మము అన్నింటా వున్నది, ఎప్పుడూ వున్నది.

**8. ఫలాధికరణము**

కర్మఫలాన్ని ఇచ్చేవాడు పరమాత్మయే. సర్వాంతర్యామి, సర్వాధ్యక్షుడు, సృష్టి-స్థితి-లయములకు కారకుడైన పరమాత్మ కర్మలు ఆచరించిన వారికి వారి కర్మలకు అనుగుణముగా ఫలములను కలిగిస్తున్నాడు. కర్మలు చేయించటానికి ప్రేరణ కల్గించేవాడూ, ఆ కర్మఫలములు ఇచ్చేవాడూ పరమాత్మయే, పరబ్రహ్మమే.

ఇట్లు

**తృతీయాధ్యాయ ద్వితీయ పాద సమాసము**



# తృతీయాధ్యాయ ద్వితీయపాద సారము

## జీవాత్మ పరమాత్మ తత్త్వ విచారణ

జీవుల కర్మానుసారము శుభాశుభ సూచకములైన స్వప్నములు కలుగటానికి ప్రేరణ చేసేది. సుషుప్తియందు అనుభవమయ్యేది, సుషుప్తిలోకి వెళ్లి జీవుడు అనుభూతి చెంది మరియు ఆ జీవుడు జాగృదావస్థలోకి వచ్చి అనుభూతి కానిది, ముగ్ధావస్థలో (మూర్ఛవస్థలో) అనుభూతి కాబడలేనిది - నిరాకార, సాకారలక్షణములు రెండూ కలిగినది అని అనిపించునది, ఉపాధుల వలన సాకారముగ కనిపించి అనిపించినను గుణరహితము, నిర్విశేషము, విభాగరహితము, అవిభక్తము, అపరిచ్ఛిన్నము, ఏకము అయినది, బేధములు అనిపించినను బేధములు లేనిది, జీవాత్మ, పరమాత్మ అని రెండనిపించినను రెండు కానిది మరియు ఒకటే అయినది, నిరవయవము, అద్వితీయము, సర్వగతము, అంతటా వున్నది, ఎప్పుడూ వున్నది, సర్వాంతర్యామియై, సర్వాధ్యక్షతకలిగి కర్మానుగుణముగా జీవులకు కర్మఫలములను కలిగింపచేసేది పరబ్రహ్మము.

[నారాయణ వాక్యము :

బ్రహ్మసూత్ర బోధామృత లహరి వ్రాసేటందుకు ప్రేరణ ఇచ్చేది, రాయటానికి శక్తి, భక్తి, యుక్తి, స్ఫూర్తినిచ్చేది, వ్రాస్తున్నపుడు ప్రవహించే చైతన్యము, వ్రాసిన తరువాత వచ్చే సంతృప్తి, శాంతి, ఆధారము, సేవ స్ఫూర్తి బ్రహ్మమే! వ్రాయుటకాధారమైన కాగితము, వ్రాతకు సాధనమైన కలము, వ్రాసే చేతిని నడిపించే శక్తి, వ్రాత వ్రాయటానికి కలిగే స్ఫూర్తి పరబ్రహ్మము.]

ఇట్లు

తృతీయాధ్యాయ ద్వితీయ పాద సారము

# III - 3

# తృతీయ అధ్యాయము - తృతీయ పాదము

# అంతరంగ సాధన

## 1. సర్వవేదాంతప్రత్యయాధికరణము (101) (సర్వ విద్య)

### (360) III-3-1

**సూ. సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్**

**క్ర. సర్వవేదాంత ప్రత్యయం, చోదనాద్యవిశేషాత్**

**ప్ర.అ.** సర్వవేదాంత ప్రత్యయం = **అన్ని ఉపనిషత్తులలో ఒకటే అధ్యాత్మ విద్య యొక్క వివేచనము జరుగుతుంది. అవిభిన్నము,** చోదనాద్యవిశేషాత్ = **విధి, సంయోగము, ఫలము మొదలైన వానిలో భేదములేదు.**

**వి. అన్ని ఉపనిషత్తులలోనూ చెప్పబడిన ఉపాసనలు, సాధనలు భిన్నమైనవికావు. ఎందుకంటే విధి, సంయోగము, ఫలము, ఉపాస్యఆకారము, నామధేయము అన్నియు అన్ని శాఖలలో ఒకటిగానే వున్నాయి.**

**ప్రాణోపాసన ఛాందోగ్యమున ఒకతీరుగా,** బృహదారణ్యకమున ఒకతీరుగా చెప్పబడినా అవి ఒకటియేనని తెలియవలెను. నిత్యాగ్నిహోత్రం అనే కర్మ, విధాయక వాక్యం ఒకటే అయినందున, అన్ని శాఖల వారికి సమానమే.

ఛాందోగ్యోపనిషత్తులో

"ఓం ఓమి త్యేత దక్షర ముద్గీథ ముపాసీత" (ఛాం.ఉ. I-1-1)

"ఓం అనే అక్షరమే ఉద్గీథము. ఓంకారమును పాసించవలెను" అని మొదలైనది.

తైత్తరీయోపనిషత్తులో "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

(తై.ఉ. II-1-1) "బ్రహ్మ సత్యము, జ్ఞానము, అనంతమును అయివున్నది" అని ఆనందవల్లి మొదలైనది. మాండూక్యోపనిషత్తులో "ఏష సర్వేశ్వరః, ఏషసర్వజ్ఞః, ఏషఅంతర్యామి, ఏషయోనిః , సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానాం" (మాం.ఉ.-6) "అతడే సర్వేశ్వరుడు, అతడే అంతర్యామి. అతనే అంతటికి కారణము, మూలము. అతడే సమస్త భూతాలకు ఉత్పత్తి, స్థితి మరియు లయస్థానము".

కఠోపనిషత్తులో "అశబ్దమస్పర్శమరూప మవ్యయం, తథారసం నిత్యమ గంధవచ్చయత్" (కఠ.ఉ.I-3-15)-"బ్రహ్మము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేనిది, అవ్యయము, నిత్యము" అని చెప్పబడినది.

ఈ విధముగా అన్ని ఉపనిషత్తులు బ్రహ్మమును లక్ష్యముగా బోధించినవి. ఇంకా "అట్టి బ్రహ్మమును తెలిసికొనినవాడు మృత్యుభయము నుండి పూర్తిగా విడువబడును" అని (కఠ.ఉ.I-3-15)నందు చెప్పబడినది. అన్ని శ్రుతులు బ్రహ్మమును ఉద్దేశ్యము చేసినవే. విధాయకవాక్యం ఒకేతీరుగా

వున్నందున నిత్యాగ్ని హోత్రము అనే కర్మ అన్ని శాఖలవారికి ఒకటియే.

“అగ్నిహోత్రం జుహుయాత్” - (మై.ఉ.VI-36) “అగ్నిహోత్రమున అర్పించవలెను” అని ఒకే క్రియ చెప్పబడినది. ఇక బృహదారణ్యక ఉపనిషత్తులో చెప్పబడిన ప్రాణవిద్య “యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద, జ్యేష్ఠ శ్చ శ్రేష్ఠ శ్చ స్వానాం భవతి” (బృ.ఉ.VI-1-1)

“ఎవరు ప్రాణము యొక్క జ్యేష్ఠత్వము, శ్రేష్ఠత్వము తెలిసికొను చున్నాడో, అతను జ్ఞానులలో జ్యేష్ఠుదును అగుచున్నాడు” అవి ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడినది (ఛాం.ఉ.V-1-1) ప్రాణవిద్య ఒకటియే. ఈ విధముగా ప్రాణవిద్య అన్ని శాఖలవారికి ఒకటియే. అదేరీతిగా వైశ్వానరవిద్య, శాండిల్య విద్య, పంచాగ్ని విద్య మొదలైన ఉపాసనలు అందరికీ ఒకటే అని తెలుసుకోవలెను. అన్ని ఉపనిషత్తులలో చెప్పబడిన ఉపాసనలు భిన్నము కావు. అన్నింటి ఉద్దేశ్యము, విధానము, ఫలము అభిన్నములు.

(ఛాం.ఉ.I-1-1; తై.ఉ.II-1-1; కఠ.ఉ.I-3-15; మై.ఉ.VI-36; బృ.ఉ.VI-1-1; ఛాం.ఉ.V-1-1)

## (361) III-3-2 (పంచాగ్ని విద్య)

**సూ. భేదాన్నేతి చేన్నై కస్యామపి**

**క్ర. భేదాత్, న, ఇతి, చేత్, న, ఏకస్యామ్, అపి**

ప్ర.అ. భేదాత్ = **భేదము వలన,** న = **సిద్ధికాదు,** చేత్ = **అనినయెడల,** న = **కాదు,** ఏకస్యామ్ = **ఒక విద్యయే ఒకచోట, ఇంకొకచోట వేరుగా వున్నవి,** అపి = **కూడ**

వి. **ద్రవ్యభేదము, దేవతాభేదాలని బట్టి యాగములలో భేదము వున్నట్టు వేద్యుడు - ఉపాస్యదేవత మరియు విద్యవల్ల కూడా భేదమువన్నదనుట సరికాదు. ఎందువలననంటే ఒక ఉపాసనలో కూడా అల్పమైన గుణభేదము, రూపభేదము వుండవచ్చును.** పంచాగ్ని విద్యయందు బృహదారణ్యకములో ఆరు అగ్నిల గురించి చెప్పారు, ఛాందోగ్యములో ఐదు అగ్నిల గురించి చెప్పినారు. (లోకములు, పర్జన్యము, పృథివి, పురుషుడు, స్త్రీ) చితాగ్ని (ఐదు అగ్నులతో గూడి చితాగ్ని, ఆరవ అగ్ని) (బృ.ఉ.VI-2-14) పంచాగ్ని జ్ఞానము కలవాడు పాపములచేనంటబడడు. (ఛాం.ఉ. V-10-10) ప్రాణోపాసనలో ఛాందోగ్యులు ముఖ్యప్రాణము కాక నాలుగు ప్రాణాలను చెప్పగా వాజసనేయులు, బృహదారణ్యకులు ఐదని చెప్పినారు. (బృ.ఉ. VI-1-6 ఉపస్థేంద్రియము) దీనివలన ఉపాస్యాసానికి భేదం వస్తుందని అంటే సరికాదు. **స్వల్పమైన రూపభేదము, గుణభేదము ఉంటే ఉండవచ్చును. కాని అవి ముఖ్యమైనవికావు. భేదము అల్పముగా వుండి, సామ్యము అధికముగా వుంటే నానాత్వము వుందనుట సమంజసము కాదు.**

(బృ.ఉ. VI-2-14, VI-1-6; ఛాం.ఉ. V-16-10)

# పంచాగ్ని విద్య - ఆరవ ఆహుతి

(బ్ర.సూ. (292) III-1-1 చూడగలరు.)

| బృ.అ. VI-2-1 నుండి VI-2-9 వరకు పంచాగ్ని విద్య - ఆరవ ఆహుతి బ్ర.సూ. (361) III-3-2 | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | అగ్ని | సమిధ | ధూమము | జ్వాల | నిప్పులు | కిరణములు | ఆహుతి | ఉత్పత్తి |
| 1 | ద్యులోకము | ఆదిత్యుడు | కిరణములు | పగలు | చంద్రుడు | నక్షత్రములు | శ్రద్ధ (జలము) | సోమము |
| 2 | పర్జన్యము | వాయువు | మేఘములు | ప్రకాశము | పిడుగు | శబ్దములు | సోమము | వర్షము |
| 3 | పృథివి | సంవత్సరము | ఆకాశము | రాత్రి | దిక్కులు | మూలలు | వర్షము | అన్నము |
| 4 | పురుషుడు | వాక్కు | ప్రాణము | జిహ్వ | చక్షు | శ్రోత్రములు | అన్నము | రేతస్సు |
| 5 | యువతి | ఉపస్థ | సంకేతము | యోని | మైధునము | సుఖము | రేతస్సు | గర్భము (పురుషుడు) |
| 6 | అగ్ని | ఇంధనము | ధూమము | జ్వాల | నిప్పులు | నిగురులు | పురుషుడు | దీప్తి |

## (362) III-3-3

**సూ. స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారే ఽధికారాచ్చ సవవచ్చ తన్నియమః**

**క్ర. స్వాధ్యాయస్య, తథాత్వేన, హి, సమాచారే, అధికారాత్, చ, సవవత్, చ తన్నియమః**

ప్ర.అ. స్వాధ్యాయస్య = **వేదాధ్యయనము యొక్క,** తథాత్వేన = **అధ్యయనమునకు అంగముగా శిరోవ్రత విధానము చేత,** హి = **చూడగా,** సమాచారే = **అథర్వశాఖ వారి శిష్టాచారమందు,** అధికారాత్ = **వారికే అధికారము వుండుట వలన,** చ = **కూడ** సవవత్ = **సవ అనెడి సప్తహోమ విధానము,** చ= **కూడ,** తన్నియమః= **అథర్వశాఖ వారికి "శిరోవ్రతము విధిగా ఆచరించువారి చేతనే ఈ బ్రహ్మ విద్య అభ్యసింప చేయవలసినది" అనెడి నియమము.**

వి. ముండక ఉపనిషత్తు (III-2-10, III-2-11)లో "శిరోవ్రతము విధిగా ఆచరించువారి చేతనే ఈ బ్రహ్మ విద్య అభ్యసింప చేయవలసినది". ముండకోపనిషత్తుకు చెందిన అథర్వశాఖ వారికి మాత్రమే ఈ నియమము పరంపరగా వచ్చుచున్నది. విద్యలో భేదము లేదు. "సవ" అనెడు హోమము విషయము కూడా అంతే. అది ఆ శాఖవారికే చెప్పబడినది. **ఆచార భేదము వున్నా బ్రహ్మవిద్యలో భేదము లేదు.**

(ముం.ఉ. III-2-10, III-2-11)

---

## (363) III-3-4

**సూ. దర్శయతి చ**

**క్ర. దర్శయతి, చ**

ప్ర.అ. దర్శయతి = **శ్రుతి,** చ = **కూడ అట్లే చెప్పుచున్నది.**

వి. **ఉపనిషత్తు కూడ బ్రహ్మవిద్యలో భేదము లేదని చెప్పుచున్నది.**
"సర్వే వేదా యత్పద మామనంతి" (కఠ.ఉ.I-2-15)

"సమస్త వేదములు ఏ పదముకు లక్ష్యముగా చెప్పుచున్నవో" మరియు భగవద్గీతలో "వేదై శ్చ సర్వే అహ మేవ వేద్యః"

"సర్వవేదముల వలన వేద్యుండ నేను
వేదాంతకృతుడ వేద విదుండ నేను" (భ.గీ.XV-15)

బ్రహ్మము తెలిసికొనదగినదని, సర్వజ్ఞానలక్ష్యమని అన్ని శ్రుతులు స్మృతులు తెలుపుచున్నవి.

**ఈ రీతిగా అన్ని ఉపాసనలు ఒకటేనని తెలియుచున్నది. వివిధ ఉపనిషత్తులు, స్మృతులు బ్రహ్మమును గూర్చి ఈ తీరుగా ఏకగ్రీవముగా చెప్పుచున్నవి.**
(కఠ.ఉ.I-2-15; భ.గీ. XV-15).

## 2. ఉపసంహారాధికరణము (102)

### (364) III-3-5

**సూ. ఉపసంహారోఽ ర్థాభేదాద్విధిశేషవత్సమానే చ**

**క్ర. ఉపసంహారః, అర్థాభేదాత్, విధిశేషవత్, సమానే, చ**

ప్ర.అ. ఉపసంహారః = **ఒకచోట చెప్పబడిన గుణములు మరియొకచోట లేనియెడల అధ్యాహారము చేసి చెప్పుకొనవలెను.** అర్థాభేదాత్ = **ప్రయోజనములో భేదము లేనందున, విధిశేషవత్ = విధిశేషమువలె,** సమానే = **ఒకే ప్రకారమైన విద్యయందు,** చ = **గూడ**

వి. **ఉపాసనలో, విజ్ఞానములో, భేదము లేదు కావున ఒక శాఖలో చెప్పబడని ధర్మములను మరొకచోట సమన్వయము చేయవచ్చును.** అంటే ఉపాసకుడు అన్ని శాఖలలో చెప్పబడిన గుణాలను నేర్చుకొని ఉపాసన చేయవచ్చును. అన్ని శాఖలలో చెప్పబడిన గుణాలను, ఆయా గుణాలలోవున్న వస్తువుకు సంబంధించిన విజ్ఞానము కలిగించుటయే ప్రయోజనము కాబట్టి అన్ని శాఖలలో చెప్పబడిన గుణములను చేర్చుకోవటము యుక్తము. అగ్నిహోత్రమనే కర్మ విషయములో ఆయాశాఖలలో చెప్పబడిన అంగాలు ఇతర శాఖలలోనికి ఉపసంగ్రహము చేయబడినట్లు, ఉపాసన విషయములో గూడా, ఆయా ప్రత్యేక లక్షణాలన్నింటిని ఉపసంహారము చేయవచ్చును. **తమ శాఖలో చెప్పబడిన గుణములు ఉపకారములు చేసినట్లు, ఇతర శాఖల గుణములు గూడ ఉపకారము చేస్తాయి. యోగ్యమైన ఉపాసనలు ఒక శాఖకు మాత్రమే పరిమితముకాక అన్నిశాఖలకు ఉపయోగమే.**

## 3. అన్యథాత్వాధికరణము (103)

### (365) III-3-6

**సూ. అన్యథాత్వం శబ్దాదితి చేన్నావిశేషాత్**

**క్ర. అన్యథాత్వం, శబ్దాత్, ఇతి, చేత్, న, అవిశేషాత్**

ప్ర.అ. అన్యథాత్వం = **రెండింటికి భేదము కనపడుచున్నది,** శబ్దాత్ = **శబ్దము వలన,** ఇతి చేత్ = **అనినచో,** న = **అట్లుకాదు,** అవిశేషాత్ = **విధి, ఫలము మొదలైన వాటియందు భేదములేనందున**

వి. "ఉపాసనయందు భేదము లేదని అనుకున్నా, విద్యయందు భేదము మాట ఏమిటి? ఛాందోగ్యములోనూ, బృహదారణ్యకములోనూ ప్రాణాన్ని ప్రశంసిస్తూ ప్రాణవిద్య చెప్పబడినది. ఈ రెండు ప్రాణవిద్యలు ఒకటియా? భిన్నమైనవా?" అనే ప్రశ్న వస్తుంది. ఈ ప్రశ్నను ఈ సూత్రాల్లో పరిశీలిస్తున్నారు. ప్రాణవిద్యకు చెప్పిన శబ్దము వలన ఈ రెండూ వేరు అనటము సరిగాదు. ఎందుకంటే ఇతరమైన విశేషములేదు. కనుక అవి రెండూ వేరు అని ప్రతివాదము. ఉద్గీతవిద్యా ప్రస్తావనలో, బృహదారణ్యకములో ముఖ్య ప్రాణాన్ని "త్వం న ఉద్గాయ" (బృ.ఉ.I-3-2), ఉద్గీతకర్తగా చెప్పినారు. ఛాందోగ్యములో "తమ్ ఉద్గీథమ్" (ఛాం.ఉ.I-2-7) అని ఉపాసనాకర్మగానూ చెప్పబడినది. **కర్మపదాన్ని కర్తృపదంగా చెప్పుకుంటే రెంటికి భేదం**

**లేదు అని వాదిస్తే అట్లుకాదని క్రింది సూత్రములో చెప్పుతున్నారు.**
(బృ.ఉ.I-3-2; ఛాం.ఉ.I-2-7)

**(366) III-3-7** **(ఉద్గీథ విద్య)**

**సూ. న వా ప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్**

**క్ర. న, వా, ప్రకరణభేదాత్, పరోవరీయస్త్వాదివత్**

**ప్ర.అ.** న వా = **అట్లుకాక,** ప్రకరణభేదాత్ = **ప్రకరణములు వేరుగావున చెప్పిన రెండు విద్యలు వేరు,** పరోవరీయస్త్వాదివత్ = **ఉత్కృష్టము, అపకృష్టము అనుగుణములతో కూడిన విద్యలవలె.**

**వి.** ఛాందోగ్య, బృహదారణ్యక ఉపనిషత్తులలో ఉద్గీథవిద్యా ప్రకరణములున్నవి. ఛాందోగ్యమునందలి ఉద్గీథవిద్య చాలా శ్రేష్ఠమైనవి.

"ఓమి త్యేత దక్షర ముద్గీథ ముపాసీత" (ఛాం.ఉ.I-1-1)

"ఓం అను అక్షరమే ఉద్గీథము. ఓంకారమును ఉపాసించవలెను." ఉద్గీథమును ఓంకారముతో కలుపుటవలన దానికి శ్రేష్ఠత వచ్చినది.

బృహదారణ్యకములో

"ఏష ఉ వా ఉద్గీథః, ప్రాణో వా ఉత్ ప్రాణేన హీదగ్ం సర్వము త్తబ్ధం, వాగేవ గీథోచ్చ, గీథా చేతి స ఉద్గీథః" (బృ.ఉ.I-3-23)

"వాక్కు, ప్రాణసముదాయమే ఉద్గీథము. 'ఉత్' ప్రాణమువలననే ఈ సర్వము ధరింపబడుతున్నది. వాక్కే గీథము. ఉత్ (ప్రాణము) మరియు గీథము (వాక్కు) కూడి "ఉద్గీథము" అగుచున్నది."

**బృహదారణ్యకములో చెప్పబడిన ఉద్గీథవిద్య ప్రాణోపాసన, ఛాందోగ్యములో చెప్పబడిన ఉద్గీథ విద్య ఓంకారోపాసనతో కూడిన ప్రాణోపాసన.** రెండింటిలోను చెప్పబడినది దేవాసురులకథయే (బృ.ఉ. III-3-1 నుండి III-3-7, ఛాం.ఉ. I-1-1 నుండి I-2-7) దేవతలు, అసురులు యుద్ధము చేయుచుండగా దేవతలు గెలిచిరి. ఎందుకనగవారు ఉద్గానము చేయుచుండిరి. దేవతలు యజ్ఞములో వాగింద్రయమును గానము చేయమనిరి. ఆ ఉద్గీథములో వారు జయించిరి. అసురులు వాక్కును దొంగిలించి పోయిరి. అపుడు దేవతలు ఘ్రాణేంద్రియమును కోరిరి. దేవతలు దానిని కూడ దొంగిలించిరి. అట్లు క్రమముగా చక్షువును, శ్రోత్రియమును, మనస్సును దొంగిలించిరి. తుదకు అసురులు ముఖ్యప్రాణమును కోరిరి. ముఖ్యప్రాణము ఉద్గానము చేయగానే రాక్షసులు పూర్తిగా నశించిరి. విషయము ఒకటైననూ, కథ ఒకటియైనను, ఉద్గీథ విద్యలో భేదము వున్నది. **ఛాందోగ్యేములో వున్న ఓంకారము (ముఖములోనున్న ఆకాశములో ఉద్గానము చేయుట)తో గూడిన ప్రాణముతో కూడిన ఉపాసన, బృహదారణ్యకములో వున్న ప్రాణోపాసనకన్నా శ్రేష్ఠము, పరోవరము.**

"స ఏష పరోవరీయా నుద్గీథః, స ఏషోఽనన్తః పరోవరీయో హాస్య భవతీ, పరోవరీయసో హ లోకాన్ జయతి, య ఏతదేవం విద్వాన్ పరోవరీయాగ్ం సముద్గీథ ముపాస్తే" (ఛాం.ఉ. I-9-2)

"ఉద్గీథగానము అన్నింటికంటే పరోవరీయము (శ్రేష్ఠము), ఉత్తమము మరియునిది అనంతమై యున్నది. ఈ ఉద్గీథగానము తెలిసిన వారు పరోవరీయమైన ఉద్గీథమునే ధ్యానించుచున్నారు. అట్టి విద్వాంసులు పరోవరీయమైన (ఉత్తమమైన) దివ్య లోకములను పొందెదరు" (ఛాం.ఉ. I-9-2) **కావున ఈ రెండు విద్యలు ఉపాసనా భేదము వలన, ప్రకరణభేదము వలన భేదము కలిగినవి. అవి వేరువేరు.**

(బృ.ఉ. I-3-23; ఛాం.ఉ. I-1-1; బృ.ఉ. III-3-1 నుండి III-3-7 వరకు; ఛాం.ఉ. I-1-1 నుండి I-2-7 వరకు; ఛాం.ఉ. I-9-2)

## (367) III-3-8

**సూ. సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తి తు త దపి**

**క్ర. సంజ్ఞాతః చేత్, తత్, ఉక్తమ్, అస్తి, తద్, అపి**

ప్ర.అ. సంజ్ఞాతః = **పేరు ఒకటిగానే వున్నది కదా,** చేత్ = **అంటే,** తదుక్తమ్ = **దాని గురించి చెప్పబడినది,** అస్తి = **వున్నది,** తదపి = **అయినా**

వి. **నామ సామ్యము ఏకతకు కారణము కాదు, విషయసామ్యము వుండాలి. నామసామ్యమున్నను, విషయములలో భేదము వున్నచో విద్యలు భిన్నమని ఉద్గీథవిషయమున చూచినాము కదా? ఇక నామసామ్యము లేకున్నా విషయసామ్యము వున్నచో ఏకత్వము దర్శించవచ్చును. అన్ని ఉపనిషత్తులలో వేరు వేరు నామములతో భిన్నములైన బ్రహ్మ విద్యలు చూపబడినవి. వానిలో విధి, ఫలము, ఉద్దేశ్యము ఒకటి కావున ఏకతను చూడవచ్చును.**

### 4. వ్యాప్త్యధికరణము (104) (ఉద్గీథ విద్య) (మాండూక్య విద్య)

## (368) III-3-9

**సూ. వ్యాప్తేశ్చ సమంజసమ్**

**క్ర. వ్యాప్తేః, చ, సమంజసమ్**

ప్ర.అ. వ్యాప్తేః = **ఓంకారము వేదమందంతట వ్యాప్తినొందుట వలన,** చ=**కూడ,** సమంజసమ్ = **దాని ఉపాసన సమంజసము**

వి. **ఓంకారము మూడు వేదములందంతట వ్యాపించి వున్నది. ఓంకారము ప్రతి ఋక్కుకు, ప్రతి అనువాకానికి ముందు చివర కూడా వ్యాపించి ఉన్నందువలన ఈ ఓంకారములలో దేనిని ఉపాసించాలి ? అనే ప్రశ్న వస్తుంది.** "ఓమి త్యేత దక్షర ముద్గీథ ముపాసీత" (ఛాం.ఉ. I-1-1) "ఓం అనే అక్షరమే ఉద్గీథము. అట్టి ఉద్గీథముతో పాటు వున్న ఓం ను ఉపాసించవలెను." అని ఛాందోగ్యేఉపనిషత్తులో చెప్పబడినది. (ఛాం.ఉ. I-1-1) ఉద్గీథమును ఓంకారముతో కలుపుట వలన దానికి శ్రేష్ఠత వచ్చినది.

**ఉద్గీథముతో పాటు వున్న ఓంకారము అని అనుటవలన, అట్లు సామవేద భాగమైన ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడుట వలన సామవేద అవయవమైన ఓంకారాన్ని ఉపాసించుటము**

**సమంజసము. ఉద్గీథము అనునది ఓంకారమునకు విశేషణము అని గ్రహించాలి. ఓంకారమును ఉద్గీథగా ఉపాసించవలెను అని అర్థము.** అదే విధముగా పరబ్రహ్మవ్యాప్తి, వ్యాపకత్వము సర్వత్ర ప్రసిద్ధము. శ్రుతులు, స్మృతులు ఏకమాత్ర పరబ్రహ్మ యొక్క సర్వవ్యాపకత్వమును ప్రతిపాదించినవి. పరమాత్మ సర్వవ్యాపి, సర్వశక్తి మానుడు మరియు సర్వజ్ఞుడు.

ఓంకారము అ,ఉ.మ మరియు బిందువుల కూడలి. ఓంకారము సర్వశబ్దముల కలయిక అయిన పరమ శబ్దము. అకారము సృష్టి, జాగ్రదవస్థ. ఉకారము స్థితి, స్వప్నావస్థ. మకారము లయము సుషుప్తి అవస్థ. బిందువు మాత్రాహీనము తురీయము ఓంకారము సర్వజ్ఞమైన బ్రహ్మము.

బ్రహ్మ సంబంధమైన విద్య వేరు వేరు పేర్లతో చెప్పబడినా వాటి సమానతయుక్తమే. ఎందుకంటే ఈ బ్రహ్మ సంబంధమైన విద్యల ఏకమాత్ర ఉద్దేశ్యము పరబ్రహ్మమే. **పరబ్రహ్మవ్యాప్తియే సర్వవిద్యల లక్ష్యము, ఉద్దేశ్యము అనటము సమంజసము.**

(ఛాం.ఉ. I-1-1) (ఉద్గీథ విద్య: పేజీ.(520), మాండూక్య విద్య: పేజీ.(550) చూడగలరు.

## 5. సర్వాభేదాధికరణము (105)

## (369) III-3-10

**సూ. సర్వాభేదాదన్యత్రేమే**

**క్ర. సర్వాభేదాత్, అన్యత్ర, ఇమే**

ప్ర.అ. సర్వాభేదాత్ = **అంతట అభేదమే కనబడుట వలన,** అన్యత్ర = **వేరు చోటులలో కూడ,** ఇమే = **ఈ లక్షణము చెప్పవలెను.**

వి. **ప్రాణ విద్య ఛాందోగ్యములో (ఛాం.ఉ. I-1-1 నుండి ఛాం.ఉ. I-2-7 వరకు) బృహదారణ్యకములో (బృ.ఉ. III-3-1 నుండి III-3-7 వరకు) మరి కౌషీతకీ ఉపనిషత్తులో (II-1 నుండి II-14) చెప్పబడినది.** మూడింటిలోను గుణములు వేరుగా చెప్పబడినవి. ఛాందోగ్యములో, బృహదారణ్యకములో వాక్కుకు వశిష్ఠత్వము, చక్షుస్సుకు ప్రతిష్ఠాత్వము, శ్రోత్రానికి సంపత్త్వము, మనస్సుకు ఆయతనత్వము, రేతస్సుకు జనిత్వము మొదలైన గుణములు చెప్పబడినది. కౌషీతకీ ఉపనిషత్తులో "ప్రాణే నిశ్రేయసం" (కౌషీ.ఉ. II-14) అని శ్రేష్ఠత్వము మాత్రమే చెప్పబడినది.

**ప్రాణోపాసనమనేది అన్ని శాఖలలోనూ ఒకటే. కావున, కౌశీతకీ శాఖలోని ప్రాణవిద్యలో విశిష్ఠాది గుణములు వర్ణించబడకపోయినా ఛాందోగ్య, బృహదారణ్యకాల్లో చెప్పబడిన గుణాలన్నింటినీ అన్వయించుకోవచ్చును. ఉపాస్యరూపములో ఏకత్వము, ప్రాణ సంవాదములో సాదృశ్యము వున్నది కావున ప్రాణ విద్య అనేది అన్ని శాఖలలోనూ సమానమే అని అర్థము.**

(బృ.ఉ. **III**-3-1 నుండి **III**-3-7; ఛాం.ఉ. **II**-1-1, నుండి **II**-2-7 వరకు; కౌషీ.ఉ. **II**-1 నుండి **II**-17 వరకు)

## అన్నమయ ఆత్మలోని ప్రాణమయ ఆత్మలోని మనోమయ ఆత్మలోని విజ్ఞానమయ ఆత్మలోని ఆనందమయము

రూపకల్పన-ఆనందవల్లి (తై.ఉ. II-1 నుండి II-6 వరకు)

బ్ర.సూ. (370) III-3-11, బ్ర.సూ. (371) III-3-12




బ్ర.సూ. (370) III-3-11
బ్ర.సూ. (371) III-3-12

# ఆనందమయ ఆత్మ-బ్రహ్మము

"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" (తై.ఉ. II-1-1)

రూపకల్పన-ఆనందవల్లి (తై.ఉ. II-1నుండి II-6 వరకు)
బ్ర.సూ. (370) III-3-11, బ్ర.సూ. (371) III-3-12




ఆనందము, సత్యము, జ్ఞానము,
నిత్యము, సర్వజ్ఞత్వము, సర్వగతత్వము
మొదలైన అని ధర్మములు
పరబ్రహ్మ ధర్మములు
కాని బ్రహ్మమునకు అంగములు వుండవు.
అవి రూపకల్పనలు.

ఇందులో బ్రహ్మతత్త్వమును "పక్షి" రూపములో కల్పన చేయబడినది. ఇది బ్రహ్మమునకు స్వరూప గత ధర్మము కాదు. స్వాభావిక లక్షణము కాదు. బ్రహ్మమునకు అంశములు లేవు. ఇటువంటి రూపకల్పన గౌణము, ముఖ్యము కాదు. బుద్ధికి అర్థము కావటానికి చెప్పబడినది."

# ఆనందమయ ఆత్మ-బ్రహ్మము

రూపకల్పన

| | బ్రహ్మ తత్త్వము | శిరస్సు | దక్షిణ పక్షము | ఉత్తర పక్షము | ఆత్మ | పుచ్ఛము |
|---|---|---|---|---|---|---|
| 5 | ఆనందమయ పురుషుడు | ప్రియము | మోదము | ప్రమోదము | ఆనందము | బ్రహ్మము |
| 4 | విజ్ఞానమయ పురుషుడు | శ్రద్ధ | ఋతము | సత్యము | యోగము | మహత్తు |
| 3 | మనోమయ పురుషుడు | యజుర్వేదము | ఋగ్వేదము | సామ వేదము | బ్రాహ్మణములు | అధర్వ వేదము |
| 2 | ప్రాణమయ పురుషుడు | ప్రాణము | వ్యానము | అపానము | సమానము (ఆకాశము) | ఉదానము (భూమి) |
| 1 | అన్నమయ పురుషుడు | శిరస్సు | దక్షిణ పక్షము | ఉత్తర పక్షము | ఆత్మ | పృథివి |

బ్ర.సూ. **(371)** III-3-12 ఇందులో ఆత్మ-బ్రహ్మతత్త్వమును పక్షిరూపములో రూపకల్పన చేయబడినది.
**(372)** III-3-13 ఇది మనకు అర్థము కావటము కొరకుయే. ఆనందాది లక్షణములు బ్రహ్మమునకు స్వాభావికములు

## 6. ఆనందాద్యధికరణము (106) (ఆనందమయ విద్య)

## (370) III-3-11

**సూ. ఆనందాదయః ప్రధానస్య**

**క్ర. ఆనందాదయః, ప్రధానస్య.**

ప్ర.అ. ఆనందాదయః= **ఆనందము మొదలైనవి,** ప్రధానస్య=**ప్రధానమైన సర్వోత్తమమైన బ్రహ్మము యొక్క ధర్మములు**

వి. వశిష్ఠత్వము అంటే సుస్థిరత్వము. ప్రతిష్ఠాత్వము అంటే చక్కగా నిలవటము, సంపత్త్వము అంటే ఇతరుల అభిప్రాయముల గమనించి ఇష్ట సిద్ధిని పొందటము ఆయతనత్వము అంటే ఆధారము కావటము. జనిత్వము అంటే ఉత్పత్తి కారణము కావటము. **ఆనందము, సర్వగతత్వము, సర్వజ్ఞత్వము, అనంతత్వము, నిత్యత్వము మొదలైనవి అన్ని పరమాత్మ ధర్మములు.** "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మం" (తై.ఉ.2-1), "తద్బ్రాహ్మానందం అద్వందమ్ నిర్గుణం సత్య చిద్ఘణం" (కఠరుద్ర I-8). "తన్నిత్యముక్తమ్ అవిక్రియం సత్యజ్ఞానంతానంద పరిపూర్ణం సనాతనమ్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ" (పై.ఉ.-2) అవిశ్రుతులలో కొన్ని చోట్ల చెప్పబడకున్నను వానిని కలిపి పూర్తి చేసుకొనవలెను. ఎందుకంటే అన్నియు బ్రహ్మము యొక్క ధర్మములే కనుక. అన్ని శాఖల వారికి బ్రహ్మము ఉపాసించదగునగుట వలన సర్వగుణములు భావింపవలెను. బ్రహ్మము "ఏక మేవా ద్వితీయమ్" - "ఒకటియే, రెండవది ఏదీ లేనిది కనుక"; "ఏకోదేవఃసర్వభూతేషు గూఢః" - "ఒకే దేవుడు అన్నిటియందు దాగివున్నవాడు". **సర్వగుణ సంపన్నమైన సర్వోత్తమ బ్రహ్మము సర్వదా సర్వత్రము వున్నది.**

(తై.ఉ. 2-1, కఠరుద్ర I-8, పై.ఉ.-2)

## (371) III-3-12

**సూ. ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌ హి భేదే**

**క్ర. ప్రియశిరస్త్వాద్యప్రాప్తిః ఉపచయాపచయౌ హి భేదే**

ప్ర.అ. ప్రియశిరస్త్వాద్యప్రాప్తిః=**శిరస్త్వము, అనగా ప్రియరూపమైన శిరస్సును కలిగియుండుట మొదలైన ధర్మములు అన్యత్ర బ్రహ్మవిద్యా ప్రకరణములందు లేవు,** ఉపచయాపచయౌ = **బ్రహ్మమునందు హెచ్చుతగ్గులవని దోషము,** హి = **ఎందుకనగా,** భేదే = **శిరస్సు మొదలైన అంగముల భేదము మన్నించుట వలన.**

వి. **"ప్రియము దానికి శిరము, మోదప్రమోదములు రెక్కలు, ఆనందము ఆత్మ, బ్రహ్మము పుచ్ఛము-ప్రతిష్ఠ" (తై.ఉ.II-5-1) అనీ చెప్పబడినది. ఇందులో పక్షిరూపములో అంగకల్పన చేయబడినది. ఇది బ్రహ్మమునకు స్వరూపగత ధర్మము కాదు.** కావున బ్రహ్మ విద్యా ప్రసంగమున చెప్పటము ఉచితము కాదు. ఎందుకంటే అంగ ప్రత్యంగ భేదము వలన హెచ్చుతగ్గులు వున్నవనే దోషము రాగలదు.

కావున బ్రహ్మమునకు ఏది స్వాభావిక లక్షణము కాదో, ఏది రూపకకల్పకమో అది బ్రహ్మవిద్యా

ప్రకరణమున స్వీకార్యము కాదు. ఇటువంటి రూపకల్పన గౌణమే కాని ముఖ్యము కాదు. బుద్ధికి **అర్థము అగుటకే చెప్పినది. అది బ్రహ్మము యొక్క స్వభావ రూపము కాదు. ఆనందాది లక్షణములు బ్రహ్మమునకు స్వాభావికములు.**

(తై.ఉ.II-5-1)

## (372) III-3-13

సూ. **ఇతరే త్వర్థసామాన్యాత్**

క్ర. **ఇతరే తు అర్థసామాన్యాత్.**

ప్ర.అ. ఇతరే = **ఇతరములైన ఆనందాది ధర్మములను,** తు=**అయితే,** అర్థసామాన్యాత్=**అట్టి ధర్మములు అన్ని బ్రహ్మ విద్యలందు సమానము కావున, స్వీకరింపవచ్చును.**

వి. **రూపకాలంకారము కొరకు కల్పనచేసి చెప్పిన, శిరస్సు మొదలైన ధర్మములను వదలి ఇతరములైన ఆనందము, సత్యము, జ్ఞానము, అనంతము, నిత్యము మొదలైన ధర్మములు బ్రహ్మమునకు, బ్రహ్మవిద్యా ప్రసంగమున స్వీకరింపవచ్చును. ఎందుకంటే అవి అన్ని బ్రహ్మవిద్యలలో, ఈ లక్షణములు ముఖ్యము మరియు బ్రహ్మమునకు సమానముగా చెప్పబడినవి.**

## 7. ఆధ్యానాధికరణము (107) (పరమపురుష విద్య)

## (373) III-3-14

సూ. **ఆధ్యానాయ ప్రయోజనాభావాత్**

క్ర. **ఆధ్యానాయ, ప్రయోజనాభావాత్.**

ప్ర.అ. ఆధ్యానాయ = **పరబ్రహ్మను చక్కగా చింతన చేయుటకు, బుద్ధి తత్వము చెప్పబడినది.** ప్రయోజనాభావాత్=**వేరొకప్రయోజనమేదీ లేకపోవటము వలన**

వి. **"ఇంద్రియములకంటే మనస్సు, మనస్సుకంటే బుద్ధి, బుద్ధి కంటే మహత్ అనబడే హిరణ్యగర్భుడు, ఆ హిరణ్య గర్భునికంటె అవ్యక్తము, అవ్యక్తము కంటే పురుషుడు శ్రేష్ఠుడు, ఆ పురుషునికంటే శ్రేష్ఠమైనది ఏదీ లేదు. ఆ పురుషుడే అన్నింటిలోపల వున్నవాడు, చివరివాడు, శ్రేష్ఠుడు, పరమగతియైనవాడు" అని చెప్పబడినది (కఠ.ఉ.III-10,11) సమ్యక్ జ్ఞానము కోసము, సమ్యగ్-దర్శనము కొరకు పురుష పరత్వము చెప్పబడినది.** అంతే కాని మిగిలినవి ఒకటికంటె ఒకటి పరమైనదని కాదు. దాని వల్ల ప్రయోజనము కూడా లేదు. పురుషుడే పరాగతి అని, అన్నిటికంటే పరుడనీ చెప్పటమే శ్రుతి యొక్క ఆశయము. మోక్షసిద్ధియే, ఈ విధముగా చెప్పటానికి ప్రయోజనము.

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం,
తథాఅరసం నిత్యమగన్ధ వచ్చయత్ ।
అనాద్యవంతంమహతః పరం,
నిచాయ్యతన్మృత్యు ముఖాత్ప్రముచ్యతే ॥" (కఠ.ఉ.I-3-15)

ఆత్మ (బ్రహ్మము), శబ్ద స్పర్శ రూపరసగంధములు లేనిదియు, అవ్యయమైనదియు, ఆద్యంతములు లేనిదియును, నిత్యమైనదియును, మహత్తునకు పరమైన దియును అయి వున్నది. అట్టి ఆత్మను తెలిసికొననివాడు మృత్యు ముఖము నుండి పూర్తిగా విడువబడును". ఇదియే ప్రయోజనము **పరబ్రహ్మమైన పురుషుని తెలిసికొనినచో మోక్ష సిద్ధి కలుగును.**
**బ్రహ్మము పరాత్పరము** (కఠ.ఉ. III-10,11; కఠ.ఉ. I-3-15)

## (374) III-3-15

సూ. **ఆత్మశబ్దాచ్చ**
క్ర. **ఆత్మ, శబ్దాత్, చ్చ**
ప్ర.అ. ఆత్మ = **ఆత్మ అనే,** శబ్దాత్=**శబ్దము వలన,** చ్చ=**కూడ**
వి. **ఆత్మ శబ్దము వలన కూడ పురుషుని ప్రతిపాదించటవే జరిగినది. ఇంతకుముందు "అశబ్దమస్పర్శమరూపమవ్యయం"** (కఠ.ఉ. I-3-15,) **అను చెప్పబడినది ఆత్మయే.** దీనికన్న ముందే (కఠ.ఉ. I-3-12)లో
"ఏషసర్వేషుభూతేషు
గూఢో ఆత్మాన ప్రకాశతే,
దృశ్యతేత్వగ్రయా బుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః"
"ఆయాత్మసమస్త ప్రాణులందు
నిగూఢమైయున్నది. సులభముగా
అందరికీ కనబడునదికాదు.
సూక్ష్మ దృష్టికలవారు, కుశాగ్ర బుద్ధితో
దానిని గ్రహించకలుగుతున్నారు" (కఠ.ఉ. I-3-12)
అన్ని చెప్పబడినది.
మరల **"వివేకియైనవాడు వాక్కును మనస్సుతో నియమించాలి"** (కఠ I-3-13) **అని ఆ ధ్యానాన్ని, యోగాన్ని చెప్పినారు. ఇలా చెప్పటము పురుషుడు అనే బ్రహ్మ యొక్క జ్ఞానము కొరకే గాని ఇంద్రియము ఒకటికొకటి పరమైనవని చెప్పటము కోసము కాదు. చిత్తమును పరాత్పరుడైన పురుషుని యందు సంలగ్నము చేయటము కొరకు చెప్పబడినది.**
(కఠ.ఉ. I-3-15, I-3-12, I-3-13)

## 8. ఆత్మగృహీత్యధికరణము (108)

## (375) III-3-16

సూ. **ఆత్మగృహీతిరితరవదుత్తరాత్**
క్ర. **ఆత్మగృహీతిః ఇతరవత్ ఉత్తరాత్**
ప్ర.అ. ఆత్మగృహీతిః=**ఆత్మ శబ్దమును బ్రహ్మపరముగా గృహించుట,** ఇతరవత్=**ఇతర శ్రుతులయందు వలె,** ఉత్తరాత్=**తరువాత చెప్పబడిన వర్ణనము వలన జరిగినది.**

వి. "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" (ఐ.ఉ. I-1)
"సృష్టికి పూర్వము ఈ జగత్తుఅంతా ఒక్క ఆత్మగా మాత్రమే వుండేది."
"నాన్యత్ కించన మిషత్, స ఈక్షత లోకా న్ను సృజా ఇతి"
(ఐ.ఉ. I-1)

**"అంతకుమించి మరొకటి ఏమీ లేదు" ఇక్కడ ఆత్మ శబ్దమును జగత్సృష్టికి పూర్వము వున్న బ్రహ్మ రూపముగా ఉపయోగించబడినదని తెలియుచున్నది. సృష్టి రచన పరమాత్మ ధర్మము అని చెప్పబడినది. "సోఅకామయత బహుస్యామ్" (తై.ఉ. II-6-1), "నేను అనేకమగదునని అతను అనుకొనెను".**

**ఇట్టి వాక్యముల వలన ఆనందమయమైన ఆత్మ, అనగా బ్రహ్మమును నుండియే ఈ జగత్తు కలిగినదని వర్ణించబడినది.**

**తరువాత "స ఇమాన్ లోకాన్" -** (ఐ.ఉ. I-1-2).

**ఈ వాక్యమును బట్టి ఆత్మ అనగా బ్రహ్మమేనని తెలియుచున్నది. ఇంకను, బృహదారణ్యకములో జనకుదు యాజ్ఞవల్క్యుని అడిగినాడు.**

"కతమ ఆత్మేతి యో అయం విజ్ఞానమయః" (బృ.ఉ. IV-3-7)

"ఈ విజ్ఞానమయమైన ఆత్మ అంటే ఏమిటి" అపుడు యాజ్ఞవల్క్యుడు ఆత్మను గూర్చి విపులముగా చెప్పినాడు.

తరువాత (ఉత్తరాత్) అదే బృహదారణ్యకములో

"సవా ఏష మహానజ ఆత్మా, అజరోః
అమృతో, అభయో, బ్రహ్మ" (బృ.ఉ. IV-4-25)

**దీని వలన ఆత్మయే బ్రహ్మమని, ఆ బ్రహ్మము అజరము, అమరము, అమృతము, అభయము అని నిశ్చయముగా చెప్పబడినది. ఇతరవత్, బృహదారుణ్యకములో వలెనె** ఛాందోగ్యముతో ఉద్దాలకుడు, శ్వేతకేతుసంవాదములో

"సదేవ సోమ్య, ఇదమగ్ర ఆసీత్" - (ఛాం.ఉ. VI-2-1)

"నాయనా ! ఈ జగత్తు అంతా మొదలు సత్తుగా వుండెను". అని ఉద్దాలకుడు శ్వేతకేతువుతో అనెను. సత్ అనే శబ్దానికి "ఆత్మ" అనే అర్థమే యుక్తము. ఎందుకంటే, తరువాత (ఉత్తరాత్) ఉద్దాలకుడు "స ఆత్మా, తత్త్వమసి శ్వేతకేతో!" (ఛాం.ఉ. VI-8-7) "శ్వేతకేతూ! ఆ ఆత్మవు నీవే" అని చెప్పినాడు. అంటే ఆ "సత్" అనే శబ్దానికి ఆత్మ అని నిర్ణయమైనది. **ఆత్మ అనేదే సత్. ఆ సత్‌యే బ్రహ్మము.** "సృష్టికి పూర్వము ఈ జగత్తుఅంతా ఒక్క ఆత్మగా వుండేది" (ఐ.ఉ. I-1-1)

"ఈ జగుత్తు, సృష్టి, మొదలు సత్తుగా వుండెను
(బృ.ఉ. VI-2-1) ఆ విధముగా సత్తుయే ఆత్మ

"ఆత్మయే బ్రహ్మము" (బృ.ఉ. VI-4-25)

**ఈ విధముగా బ్రహ్మమే ఆత్మ, ఆత్మయే సత్తు మరియు సత్తే ఆత్మ, ఆత్మయే బ్రహ్మము.**

(ఐ.ఉ. I-1-1; తై.ఉ. II-6-1; ఐ.ఉ. I-1-2, బృ.ఉ. IV-4-7, VI-4-25; బృ.ఉ. VI-2-1, VI-8-7, ఐ.ఉ. I-1-1)

## (376) III-3-17

సూ. **అన్వయాదితి చేత్స్యాదవధారణాత్**

క్ర. **అన్వయాత్ ఇతి చేత్ స్యాత్, అవధారణాత్**

ప్ర.అ. అన్వయాత్= **ప్రతి వాక్యమున ఆత్మ శబ్దము అన్వయించబడుట** వలన, ఇతి = ఈ ప్రకారము, చేత్ = **ఆనందమయమొక్కటే ఆత్మ శబ్దముతో బ్రహ్మఅను అర్థముతోనున్నదని అంటే,** స్యాత్= **ఆనందమయము అంటే బ్రహ్మము అను అర్థమే సిద్ధియగుచున్నది,** అవధారణాత్ = **నిర్ధారణ చేయబడినందువలన.**

వి. తైత్తరీయోషనిషత్తునందు ఆత్మ శబ్దము అన్ని వాక్యములందు ప్రయోగించబడినది. అపుడు ఆనందమయ శబ్దమునకు మాత్రమే ఆత్మ శబ్దము ప్రయోగింపబడెను అని అనుట ఎట్లు? అనగా **అన్ని శబ్దములందు ఆత్మ శబ్దమునకు వ్యాప్తి కలదు. అచట బ్రహ్మవాచకము కాదు. కాని చివరి వాక్యమున నిర్ధారణ చేయబడిన చోట ఆనందమయ శబ్దము బ్రహ్మపరము.**

"ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్" (తై.ఉ. III-6).

"ఆనందమే బ్రహ్మము అని తెలిసికొనెను"

**అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము బ్రహ్మమునకు శరీరములు. ఆ అర్థముతో ఆత్మ శబ్దము ఉపయోగించబడినది.**

అన్ని కోశములు బ్రహ్మము అని చెప్పినపుడు బ్రహ్మము ఆత్మ ఐనపుడు బ్రహ్మము ఆత్మ ఆనందమయమునకే ఉపయోగించబడినదనుట ఎట్లన్న **అన్నమయమునకు ప్రాణమయము ఆత్మ, ప్రాణమయమునకు మనోమయము ఆత్మ, మనోమయమునకు విజ్ఞానమయము ఆత్మ, విజ్ఞానమయమునకు ఆనందమయము ఆత్మ.** (తై.ఉ.II-1 నుండి II-6 వరకు). **ఆనందమయమునకు వేరే ఆత్మ అనునది ఇంకచెప్పబడలేదు. చివర చేయబడిన ఈ నిర్ధారణ ఆనందమయము బ్రహ్మపరమైనది, ఆత్మపరమైన అని అన్వయము అయినది.** దీని నుండి జగత్తు యొక్క సృష్టి జరిగినది. అట్లు ఆనందమయము అనగా బ్రహ్మము మరియు ఐతరేయోపనిషత్తు (ఐ.ఉ.I-1-1) నందు సృష్టికి పూర్వము వున్న ఆత్మయే, ఛాందోగ్యోపనిషత్తులో సృష్టికి పూర్వము వున్న సత్తు (ఛాం.ఉ.V-2-1) అని అన్వయమైనది. అట్లు ఆత్మయే బ్రహ్మము. **అట్టి ఆత్మయైన బ్రహ్మము ఆనందమయము. ఆ ఆత్మయే సత్తు మరియు జగత్కారణము. బ్రహ్మము, ఆత్మ, ఆనందమయము మరియు జగత్కారణము ఒకటియే.**

(తై.ఉ. III-6, II-1 నుండి II-6 వరకు; ఐ.ఉ. I-1-1; ఛాం.ఉ. V-2-1)

21

# పంచకోశములు-భృగువల్లి

## ఆనందమయము - అంతరాత్మ

రూపకల్పన–ఆనందవల్లి (తై.ఉ. III–1 నుండి III–6 వరకు, ఐ.ఉ. I–1–1, ఛాం.ఉ. V–2–1, బృ.ఉ. V–6–1, ఛాం.ఉ. V–7–5)

ఈ అన్నమయ పురుషునికి అంతరాత్మ ప్రాణమయము, ప్రాణమయమునకు మనోమయము అని చెప్పబడినది. చివరకు ఆనందమయమునకు, బ్రహ్మమునకు ఏకత చూపబడినది. అందువలన ఎవరికి సత్యము, జ్ఞానము, అనంతము అను లక్షణములు చెప్పబడినవో, ఏ ఆత్మ ఆనందమయముగా చెప్పబడినదో, ఏది పూర్వోక్తమో, ఆ బ్రహ్మకు ఈ జగత్తు మరియు అన్నకోశము నుండి అన్ని కోశములు కార్యములు అదే అన్నింటికిని అంతరాత్మ (తై.ఉ. III–1 నుండి III–6) బ్ర.సూ. (377) III–3–6.

**(గమనిక : ఈ రూపక చిత్రములో జ్యోతి, హృదయము, నెమిలి పింఛము, ఇంద్రధనస్సు, కుండలినీశక్తి, నేత్రము చూడండి)**




(12) I–1–2, బ్ర.సూ. (376) III–3–17, (377) III–3–18, (375) III–3–16, (371) III–3–12, (372) III–3–13, (374) III–3–15, (370) III–3–11, (378) III–3–19.

**(పంచకోశముల ఆత్మ-బ్రహ్మజ్యోతి వర్ణచిత్రము (2001-బరోడా) ముందు కవరు చిత్రము చూడండి).**

## 9. కార్యాఖ్యానాధికరణము (109)

## (377) III-3-18

**సూ. కార్యాఖ్యానాదపూర్వమ్**

**క్ర. కార్యాఖ్యానాత్, అపూర్వమ్**

ప్ర.అ. కార్యాఖ్యానాత్ = **బ్రహ్మకు కార్యము చెప్పుటకు కారణమేదని అంటే,** అపూర్వమ్=**ఈ పురుషుడు పూర్వము చెప్పబడిన పురుషుడు కాదు.**

**వి.** బృహదారణ్యకములో ప్రాణ సంవాదములో ముఖ్య ప్రాణము వాగాది ఇంద్రియములతో "మే కిమన్నం, కిం మే వాసః" (బృ.ఉ. VI-1-14)

"నాకు ఏది అన్నము? ఏది వస్త్రము? "అని ప్రశ్నించినది. దానికి ఇంద్రియములు "ఓ ముఖ్య ప్రాణమా ! ఈ భూలోకమందలి సమస్త ప్రాణుల యొక్క అన్నమే నీకు అన్నము. జలమే నీకు వస్త్రము" అని చెప్పినవి.

అందుకే భోజనము చేసేవారు ముందు, తరువాత కూడా అన్నాన్ని నీటితో కప్పుతారు. ఈ విషయము తెలిసినవారు భోజనానికి పూర్వము, తరువాత కూడా ఆచమనం చేస్తారు. దీనినే ప్రాణాల్ని నగ్నముగా ఉంచకుండా వుండటము అంటారు. ఇక్కడ ఆచమనము, జలమును వస్త్రముగా భావించుటము అనే వాటిలో ఏది విధేయము అనే ప్రశ్న వస్తుంది. అన్ని అనుష్ఠాలకు శుద్ధికోసము ఆచమనాన్ని నిత్య కార్యముగా శ్రుతిస్మృతులలో చెప్పబడియున్నందున, ఇచట శాసించదలచబడినది, అపూర్వమైన ఉదకాన్ని వస్త్రముగా భావించుటయే విధేయము కాని, ఆచమనము కాదు. అన్నాన్ని ఉదకంతో కప్పటము అపూర్వము. కావున అపూర్వమైన ధ్యానమే విధేయము. మరియు ఇంకో రీతిగా ఈ ప్రకరణమునందు అన్నమయ పురుషుడెవరు చెప్పబడెనో ఆ పురుషుడు పూర్వోక్తమైన బ్రహ్మము కాదు, ఆ అన్నమయ పురుషుడు అపూర్వము. అతడు అన్నపరిణామ భూతుడైన సజీవ శరీర ముక్త పురుషుడు. ఇతడు అన్నమయనామముతో చెప్పబడినాడు. ఎందుకనగా ఆ పురుషుని పూర్వము చెప్పబడిన బ్రహ్మము యొక్క ఆకాశాది క్రమానుసారము, కార్యమని చెప్పబడినాడు.

**ఈ అన్నమయ పురుషునికి అంతరాత్మ ప్రాణమయము, ప్రాణమయమునకు మనోమయము, మనోమయమునకు విజ్ఞానమయము, విజ్ఞానమయునకు ఆనందమయము అని చెప్పడినది. చివరకు ఆనందమయునకు, బ్రహ్మమునకు ఏకత చూపబడినది. అందువలన ఎవరికి సత్యము, జ్ఞానము, అనంతము అను లక్షణములు చెప్పబడినవో, ఏ ఆత్మ ఆనందమయముగా చెప్పబడినదో, ఏది పూర్వోక్తమో, ఆ బ్రహ్మకు ఈ జగత్తు మరియు అన్నమయకోశము నుండి అన్ని కోశములు కార్యములు. అదే అన్నింటికిని అంతరాత్మ.**

(బృ.ఉ. VI-1-14, తై.ఉ. II-1 నుండి II-6 వరకు)

## 10. సమానాధికరణము (110) (శాండిల్య విద్య, సత్య విద్య)

### (378) III-3-19

**సూ. సమాన ఏవం చాభేదాత్**

**క్ర. సమానః, ఏవం, చ, అభేదాత్**

ప్ర.అ. సమానః=**సమానము,** ఏవం=**ఈ ప్రకారము,** చ=**కూడ,** అభేదాత్ = **భేదముండదు కావున**

వి. వాజసనీయ శాఖకు చెందిన శతపథ బ్రాహ్మణములో శాండిల్యవిద్య అని పేరుగాంచిన అగ్నిరహస్యవిద్యలో (శత. ప.బ్రా.X-6-3-2)

సత్యమే బ్రహ్మ అని ఉపాసించవలయును. ఈ పురుషుడు సంకల్పమయుడు. ఎన్ని సంకల్పములతో అతడీ లోకము నుండి ప్రయాణమై పరలోకమునకు పోవునో ఆ సంకల్పములు కలవాడై పుట్టును. అతడు మనోమయుడు ప్రాణశరీరుడు ఆకాశరూపుడు అయిన ఆత్మను ఉపాసించును అని చెప్పబడినది.

అదే వాజసనీయ శాఖకు చెందిన బృహదారణ్యకములో (బృ.ఉ.V-6-1) "ప్రకాశము ఎవరి సత్యస్వరూపమో ఆ పురుషుడు మనోమయుడు. అతడు వ్రీహి, యవగింజలు మొదలైన వానితో సమానమైన సూక్ష్మ పరిమాణము కలవాడై హృదయాకాశ స్థితుడగును. అతడందరకు స్వామి, అధిపతి. అతడన్నిటిని శాసించును." ఇదికూడ శాండిల్య విద్యయే ఒకే శాఖలకు చెందిన ఈ రెండు గ్రంథములందు చెప్పబడిన విద్యలకు భేదము వున్నదా? లేదా? రెండు శాఖల వారి విద్యలలో ఏకత వున్నట్లే ఒకే శాఖవారి రెండు విద్యలలో ఏకతను సాధించవచ్చును. ఎందుకనగా ఉపాస్యమునకు భేదము లేదు. రెండు చోట్లను మనోమయుడు అని చెప్పబడటము వలన, ఉపాస్యదైవము ఒకరే కాబట్టి విద్యాభేదము లేదు.

శతపథ బ్రాహ్మణములోని, అగ్ని రహస్యములోని శాండిల్య విద్య విధి సహితము. బృహదారణ్యక ఉపనిషత్తులోనిది పునరుక్తము, అనువాదము. కాబట్టి రెండు విద్యలూ ఒక్కటే.

రెండు విద్యలూ, ఒకటే అయిన మనోమయుడు, ప్రాణశరీరుడు, ఆకాశరూపుడు అయిన బ్రహ్మమునే ఉపాసించుచున్నవి.

(శ.ప. X-6-3-2, బృ.ఉ. V-6-1)

## 11. సంబంధాధికరణము (111) (శాండిల్య విద్య, సత్య విద్య)

### (379) III-3-20

**సూ. సంబంధాదేవమన్యత్రాపి**

**క్ర. సంబంధాత్, ఏవమ్, అన్యత్ర, అపి**

ప్ర.అ. సంబంధాత్=**ఉపాస్య సంబంధము చేత,** ఏవం=**ఈ ప్రకారము,** అన్యత్ర=**మరియొకచోట,** అపి=**కూడ (ఈ విద్యలు ఒకటిగానే తలువవచ్చునా?)**

వి. బృహదారణ్యకోపనిషత్తులో సత్యవిద్య ప్రారంభములో "సత్యం బ్రహ్మ" (IV-4-1) "సత్యము

బ్రహ్మము" అని చెప్పి, వెంటనే "తద్యత్తత్సత్యం అసౌ, స ఆదిత్యో, యేష తస్మిణ్మండలే పురుషో యశ్చాయం దక్షిణేక్షన్ పురుషః" (బృ.ఉ. V-5-2) "ఆ సత్యమే ఈ ఆదిత్యుడు, ఆదిత్య మండలములోనున్న పురుషుడే ఈ దక్షిణ నేత్రములో నున్న పురుషుడు" అని అంటూ **సత్యబ్రహ్మకు అధిదైవతముగా ఆదిత్యుని, అధ్యాత్మముగా దక్షిణ నేత్రాన్ని, ఇట్లా రెండు స్థానాలు కల్పించి చెప్పి భూ, భువః, సువః అనే వ్యాహృతులే ఆదిత్య, అక్షిపురుషులకు శరీరము అని చెప్పి "తస్యోపనిష దహ రితి" అని అధిదైవతానికి 'తస్యోపనిష దహమితి" అని అధ్యాత్మానికి, రెండు రహస్యమైన పేర్లు చెప్పబడినాయి.** (బృ.ఉ. V-5-2, V-5-3)

**ఈ విధముగా "అహః" అని ఆదిత్యపురుషునికి,"అహం" అనునది అక్షిపురుషునికి నామములు ఇవ్వబడినవి.**

ఈ విధముగా నామబేధములు ఏర్పడినాయి. అప్పుడు ఈ సత్యవిద్యలో నామ వ్యవస్థను బట్టి ధ్యానము చేయవలెనా? ఈ రెండు పేర్లను ఆదిత్య, అక్షిపురుషులిద్దరికీ అన్వయించవచ్చునా? అనే సంశయము వస్తుంది.

"ఒకే శాఖయందలి అగ్నిరహస్య, శాండిల్యవిద్యలందు (బ్ర.సూ. 378) ఏక విద్యా సంబంధము వలన గణోపసంహారము (ఒకటినుంచి ఒకటి స్వీకారము) చెప్పబడినట్లే ఈ సత్యవిద్యయందు కూడా ఇరువురు పురుషులలోనూ ఈ రెండు పేర్లను ఉపసంహారము చేయవచ్చునా?" అనే ప్రశ్న వచ్చును. అగ్ని రహస్యవిద్య (శతపథ బ్రాహ్మణము) శాండిల్య విద్య (బృహదారణ్యకము) రెండు ఒకే శాఖయైన వాజసనీయ శాఖకు చెందినవి కావున పరస్పర ఉపసంహారము చెప్పబడినది.

**అదే విధముగా ఈ సత్యవిద్యయందు చెప్పిబడిన ఇద్దరు పురుషులలోనూ రెండు పేర్లు "అహః", "అహం" అనునది రెంటికి వాడవచ్చునా? అని అంటే దానికి సమాధానము తరువాతి సూత్రములో చెప్పబడుచున్నది.**

(బృ.ఉ. IV-4-1, V-5-2, V-5-3; బ్ర.సూ. III-3-21(380))

## (380) III-3-21

సూ. **న వా విశేషాత్**

క్ర. **న, వా, విశేషాత్**

ప్ర.అ. న=**కాదు,** వా=**రెండింటి ఏకత,** విశేషాత్=**రెండింటి యందు పురుషుల నామములు, స్థానములు వేరుగానున్నాయి.**

వి. **పై రెండు సత్యబ్రహ్మ ఉపాసనల వర్ణనములో స్థానములు, నామములు వేరుగానున్నాయి. సూర్యమండలమునున్న ఆదిత్యపురుషుని పేరు "అహః" మరియు అక్షిగోళమునందున్న అక్షిపురుషునిపేరు "అహం" ఈ ప్రకారము నామస్థానములు వేరుగానున్నాయి. ఒక పురుషుని నామగుణములు ఇంకొక పురుషునియందు చేర్చుటకు వీలులేదు.**

## (381) III-3-22

**సూ. దర్శయతి చ**

**క్ర. దర్శయతి, చ**

ప్ర.అ. దర్శయతి=**శ్రుతి చెప్పుచున్నది,** చ=**కూడ.**

వి. **ఎక్కడ ఈ ప్రకారము నామస్థానములు భేదముయుండునో అక్కడ ఒకదాని గుణములు ఇంకొకదానికి అన్వయించరాదు.**

ఛాందోగ్య ఉపనిషత్తులో కూడా అక్షిపురుషుడు మరియు ఆదిత్య పురుషుని గురించి కలదు. (ఛాం.ఉ. I-7-5) "అక్షిపురుషునికి కూడా ఆదిత్య పురుషుని రూపమే రూపము, ఆయన అవయవములే అవయవములు, ఆయన పేరే పేరు". ఇట్లు ఆదిత్య పురుషుని రూపము, అవయవములు అక్షిపురుషునికి కూడా చెప్పబడినవి. ఇది అన్వయము కాదు, ఇది అతిదేశము అనగా ఆరోపణము.

**అక్షిపురుషునకు ప్రత్యేక స్వరూపాలు చెప్పలేదు కనుక ఇద్దరూ ఒకటి అనవచ్చును అంటే అట్లుకాదు. ఇద్దరు ఒకటైతే ఒకరి ధర్మములు ఇంకొకచోట ఆరోపించుట అవసరము లేదు.**

**కావున వారిద్దరువేరు. నిజముగా వారి పేర్లు, స్థానములు వేరు వేరు కనుక ఆ రెండు ఉపాసనలు భిన్నములు.**

(ఛాం.ఉ. I-7-5)

---

## 12. సంభృత్యధికరణము (112)

## (382) III-3-23

**సూ. సంభృతిద్యువ్యాప్త్యపి చాతః**

**క్ర. సంభృతిద్యువ్యాప్తి, అపి, చ, అతః**

ప్ర.అ. సంభృతిద్యువ్యాప్తి=**సర్వలోకములను భరించుట, ద్యులోకము బ్రహ్మాండమున వ్యాపించుట అను రెండు బ్రహ్మ సంబంధమైన గుణములు,** అపి=**వీనిని కూడ నేత్రాంతవర్తియైన పురుషునియందు అన్వయించుటకు వీలుపడదు,** చ=**కూడ,** అతః=**విద్యలు ఒకటికానందున.**

వి. **రాణాయనేయశాఖకు, ఛందోగశాఖకు, చెందిన ఖిలకాండలో ఒకచోట బ్రహ్మము యొక్క వీర్యసమృద్ధి, స్వర్గవ్యాప్తి చెప్పబడినవి.** "బ్రహ్మ జ్యేష్ఠా వీర్యా సంభృతాని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివమాతతాన బ్రహ్మ భూతానాం ప్రథమం తు జిజ్ఞేతే నార్హతి బ్రహ్మణాస్పర్ధితుంకః (ఖిల, రాణాయనేయ శాఖ) "పంచభూతాలు బ్రహ్మము యొక్క శక్తిరూపాలు. వీటికి బ్రహ్మమే కారణము. ఆ బ్రహ్మమే వీటిని స్థిరపరిచింది. ఆ బ్రహ్మము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఇంద్రాదులు పుట్టకముందే బ్రహ్మము స్వర్గాన్ని ఆక్రమించింది."

అన్ని భూతములకంటే బ్రహ్మమే ముందు జన్మించింది. ఆ బ్రహ్మమును ఎవరు అతిక్రమించగలరు?

ఇట్లు బ్రహ్మము యొక్క వీర్యసమృద్ధి, స్వర్గవ్యాప్తి చెప్పబడింది.

అయితే ఇచట చెప్పిన బ్రహ్మవిద్య మరియు అదే ఛందోగశాఖకు చెందిన ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడిన శాండిల్య విద్య (బ్ర.సూ.379) ఒకటేనా? భిన్నములా? అనే ప్రశ్నవస్తుంది.

ఇటువంటి ప్రసంగములోనే బృహదారణ్యకములో (బృ.ఉ. III-8-9) "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి, సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః, ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి, ద్యావా పృథివ్యౌ విధృతౌ తిష్ఠతః".

"ఓ గార్గీ! ఈ అక్షరుని యొక్క ఆజ్ఞతో సూర్యచంద్రులు వ్యాపించుచున్నారు, ధరించబడుచున్నారు. ఓ గార్గీ! ఈ అక్షరుని యొక్క ప్రశాసనముతో ద్వావా పృథివిలు (అంతరిక్షము-భూమి) వ్యాపించుచున్నవి, ధరించబడుచున్నవి" (బృ.ఉ. III-8-9) **ఇచట కూడ వ్యాప్తి, సంభృతి బ్రహ్మలక్షణములుగా చెప్పబడినవి.** ఇది మరియు పైన చెప్పిన రాణనీయశాఖలో చెప్పబడిన బ్రహ్మవిద్య మరియు శాండిల్య విద్య ఒకటియేనా? భిన్నములా? అక్షర **బ్రహ్మయొక్క సంభృతి, వ్యాప్తి అనే రెండు గుణములు నేత్రాంతవర్తియైన అక్షి పురుషునియందుగాని, సూర్యమండల వర్తియైన ఆదిత్యపురుషుని యందుగాని అన్వయించుటకు వీలుగానివి.**

ఈ సంభృతి, వ్యాప్తి అనునవి (బ్రహ్మవిద్య), సత్యవిద్య (ఆదిత్య పురుషుడు, అక్షిపురుషుడు), శాండిల్య విద్య (అంతర్హృద స్థాన పురుషుడు), దహరవిద్య (హృదయములోనున్న సూక్ష్మాకాశ పురుషుడు), ఉపకోసల విద్య (అక్షిణీపురుషుడు) లకు అన్వయముకాదు, స్థానభేదములు, ఆయా పురుషుల విభూతులు చెప్పారేకాని సంభృతి, వ్యాప్తి అనునవి చెప్పబడలేదు. కావున **బ్రహ్మవిద్యా లక్షణములు, శాండిల్య విద్యకు ఉపసంహరించ, అన్వయించ వీలుకాదు.**

(బ్ర.సూ. 379; బృ.ఉ. III-8-9)

## 13. పురుషవిద్యాధికరణము (113) (పురుష విద్య)

## (383) III-3-24

**సూ. పురుషవిద్యాయామివ చేతరేషామనామ్నానాత్**

**క్ర. పురుషవిద్యాయాం, ఇవ, చ, ఇతరేషామ్, అనామ్నాత్**

**ప్ర.అ.** పురుషవిద్యాయాం= **పురుష విద్యయందు చెప్పబడిన గుణముల,** ఇవ=**వలె**, చ=**కూడ,** ఇతరేషామ్=**అన్య పురుషుల యందు వుండజాలవు,** అనామ్నాత్=**ఎందుకనగా శ్రుతులయందు అటువంటి గుణములు ఎచటను చెప్పబడలేదు.**

**వి.** ఛాందోగ్యోపనిషత్తులో తాండి, మరియు పైంగి రహస్య బ్రహ్మణములో పురుష యజ్ఞము చెప్పబడినది (ఛాం.ఉ. III-16-1, 3,5) **"పురుషుడే యజ్ఞము, ఆ పురుషుని ఆయువులో మొదటి 24 సంవత్సరములు ప్రాతస్సవనము, తరువాత 44 సంవత్సరములు మధ్యాహ్న సవనము, చివరి 48 సంవత్సరములు సాయంసవనము"** సవనము అంటే యజ్ఞము, యజ్ఞములో ఇచ్చేబలి. అతని ఆకలిదప్పులు, ఇష్టమైన వస్తువులు లభించకపోవటము దీక్ష. అతని నవ్వు, భోజనము,

స్తుతి అన్నీ శాస్త్ర సామ్యమునందుతాయి. ఈ విధముగా పురుషయజ్ఞము చెప్పబడినది.

తైత్తరీయక అరణ్యములో కూడా (తై.అ. X-64) యజమానుడే యజ్ఞము, భార్యయే శ్రద్ధ, శరీరము ఇధ్మము, రొమ్ము యజ్ఞవేది, లోమాలు బహిర్వేది అని వర్ణించబడినది. అయితే తాండి, పైంగి బ్రహ్మణాల్లో చెప్పబడిన పురుషవిద్య యొక్క గుణాలను తైత్తరీయకములో చెప్పబడిన విద్యలో ఉపసంహరించవచ్చునా? అనే ప్రశ్న వస్తుంది. తాండి మొదలైన వాటిలోని పురుషవిద్య ఏ విధమైన పురుషయజ్ఞము కల్పించబడినదో అటువంటిదే తైత్తరీయకములో లేదు. కావున వాటిని ఉపసంహారము లేదు.

సామ్యముల కన్నా భేదములే ఎక్కువగానున్నాయి. తాండి శాఖలో పురుషుడే యజ్ఞము - ఉపాస్యుడు. తైత్తరీయకములో పురుషుడు చేసే యజ్ఞములో ఆత్మాదులయందు యజమానుడు మొదలైనవాటి కల్పనము చేయబడ్డది. అక్కడ బ్రహ్మవిద్యా ప్రశంస వున్నది కాని తాండిలో వలే ఉపాసన లేదు.

**కావున తాండి, పైంగి పురుషవిద్య మరియు తైత్తరీయక పురుషవిద్య భిన్నములు, వాటికి ఉపసంహారము, అన్వయము లేదు.**

(ఛాం.ఉ. III-16-1,3,5; తై.అ. X-64)

## 14. వేధాద్యధికరణము (114)

## (384) III-3-25

**సూ. వేధాద్యర్థభేదాత్**

**క్ర. వేధాది, అర్థభేదాత్**

ప్ర.అ. వేధాది=**వేధ మొదలైన (హృదయాన్ని వేధించి, ధమనుల్ని ఛేదించి) వాని వర్ణన బ్రహ్మమును స్పర్శించే లక్ష్యముతో చేయబడినది.** అర్థభేదాత్=**అక్కడ ప్రయోజనములో భేదమున్నది.**

వి. అథర్వణ శాఖవారు, ఉపనిషత్తు ప్రారంభములో "సర్వం ప్రవిధ్య హృదయం ప్రవిధ్య" - "ఓ దేవతా! నా శత్రువు యొక్క సర్వ అవయవాలని ఛేదించు. హృదయాన్ని ఛేదించు" అంటూ అభిచారిక మంత్రాలను పఠిస్తారు.

తాండినాయన శాఖవారు (ఛందోగులు) "దేవ సవితః ప్రసువ యజ్ఞం" - "సమస్తమును సృజించే స్వప్రకాస్వరూపుడవైన ఓ సూర్యదేవా! యజ్ఞమును నాకు ఇమ్ము" అనే మంత్రమును శాక్యాయన శాఖవారు "శ్వేతాశ్వో హరిత నీలోసి" - "తెల్లని గుఱ్ఱములుకల ఇంద్రుడా! నీవు హరిత మట్టిలాగా నీలమైనవాడవు" అనే మంత్రమును, తైత్తరీయశాఖవారు "శం నో మిత్ర శ్శం వరుణః" - "మనకు వరుణుడు, మిత్రుడు శుభములను ఇచ్చుగాక" అనీ, వాజసనీయ శాఖవారు "దేవా హ వై సత్రం నిషేదుః" - పూర్వము ఇంద్రాది దేవతలు సత్రయాగానికి కూర్చున్నారు అనీ, కౌషీతకులు "బ్రహ్మ వా అగ్నిష్టోమః" - "అగ్నిష్టోమమే బ్రహ్మము" అంటూ అగ్నిష్టోమ బ్రాహ్మణాన్నీ పఠిస్తారు.

ఈ విధముగా పఠించే ప్రవిధ్యాది మంత్రములు, ప్రవర్గ్యాది కర్మలు ఆయా విద్యలందు ఉపసంహరించబడతాయా? అన్న ప్రశ్నవస్తుంది. దానికి సమాధానము ఈ విధము. వేధ మొదలైన – హృదయాన్ని వేధించి, ధమనులను చేధించి – వానిలో అర్థభేదము నందు వలన వీటిని విద్యలలో, ఉపాసనలలోద ఉపసంహారము లేదు. హృదయాన్ని ఛేదించుటము మొదలైన మంత్రములకు లింగములను బట్టి అభిచారిక కర్మలందు వినియోగము, ప్రవర్గ్యాదులకు అగ్నిష్టోమాది యాగములందు వినియోగము ఉన్నది. **లింగవాక్యాలు – హేతువులను చెప్పే వాక్యాలు, సన్నిధి (సమీపము కంటే) బలవత్తరమైనవి. కాబట్టి వీటికి విద్యలయందు ఉపసంహారము లేదు.**

## 15. హాన్యధికరణము (115)

## (385) III-3-26

**సూ. హానౌ తూపాయనశబ్దశేషత్వాత్కుశాఛందస్తుత్యుపగానవత్తదుక్తమ్**

**క్ర. హానౌ, తు, ఉపాయనశబ్ధశేషత్వాత్, కుశాచ్ఛందస్తుత్యుప గానవత్తదుక్తమ్.**

ప్ర.అ. హానౌ=**వదలివేయుటలో,** తు=**అయితే,** ఉపాయన=**గ్రహించుట,** శబ్ద=**శబ్దము,** శేషత్వాత్=**మిగిలిన దానివలన,** కుశా=**కుశలు,** ఛందః=**ఛందములు,** స్తుతి=**స్తోత్రము,** ఉపగాన=**గానము,** వత్=**వలె,** తద్ తదుక్తమ్=**అట్లు చెప్పబడినది.**

వి. **హాని అంటే పుణ్యాపాపములను వదలివేయటము ఉపాయనము పుణ్యాపాపములను గ్రహించటము. ఉపనిషత్తులలో అక్కడక్కడ బ్రహ్మవిద్యయొక్క ఫలము పుణ్యము, పాపము మరియు వివిధ ప్రకార వికారముల వినాశమేనని తెలుపబడినది. ఆ మంత్రములలో బ్రహ్మపదము లేక అవినాశపదము లేక పరమ ధామము యొక్క ఉపలబ్ధి (పొందటము) గూర్చి చెప్పబడలేదు.**

ఎక్కడ దుఃఖము, బంధనము మరియు కర్మ (నాశము) గూర్చి చెప్పబడినవో, అక్కడ ఆ వాక్యముల శేష రూపములో అన్యత్ర (వేరుచోటుల) చెప్పబడిన ఉపలబ్ధి రూప ఫలముల అధ్యాహారము (స్వీకరించుట) కూడా వుండాలి. ఎక్కడెక్కడ కేవలము హానిలు పాపము, శోకము, దుఃఖము యొక్క వినాశము మొదలైనవి చెప్పబడినదో అక్కడక్కడ బ్రహ్మానందము, బ్రహ్మలోకము మొదలైన శబ్దముల ఉపలబ్ధి వాక్యములు మిగిలిపోవును (చెప్పబడలేదు). అదే రీతిగా ఎక్కడ కేవలము ఉపాయనము (గ్రహించుట) అంటే బ్రహ్మపదము యొక్క ఉపలబ్ధి గూర్చి చెప్పబడునో అక్కడ పైన చెప్పబడిన హనులను వినాశము గూర్చి (పాపము, శోకము, దుఃఖము మొదలైనవి వాని నాశము) గూర్చిన వాక్యములు శేషముగా నుండును.

తాండిశ్రుతిలో (ఛాం.ఉ.VIII-13-1) "అశ్వః ఇవ రోమాణి విధూయ, పాపం చంద్రః ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి" (ఛాం.ఉ.VIII-13-1)

"గుఱ్ఱము రోమాలను విదిలించి అలసటను దుమ్మును పోగొట్టుకొని స్వచ్ఛమైనట్లు, నేను

బ్రహ్మజ్ఞానముతో ధర్మాధర్మమైన పుణ్యపాపములను వదలివేసి, రాహు ముఖము నుండి విముక్తుడైన చంద్రుని లాగా విముక్తుడనై, ఈ శరీరాన్ని వదిలి కృతక్రుత్యుడనై బ్రహ్మలోకాన్ని చేరుతాను" అని వున్నది.

అథర్వణ శ్రుతిలో "యథా నద్య స్స్యందమానా స్సముద్రేంతం గచ్ఛంతి । నామరూపే విహాయ, తథా విద్వాన్ పుణ్యపాపే విముక్తః, పరాత్పరం పురుషము పైతి దివ్యమ్॥" (ముం.ఉ. VIII-2-8) "నదులు ప్రవహించి పోయి సముద్రాన్ని పొంది తమతమ నామరూపాలను వదలి సముద్రములో ఏకమైనట్లు విద్వాంసుడు (బ్రహ్మజ్ఞాని) పుణ్యపాపములను వదలి పరాత్పరుడైన దివ్యపురుషుని, పరమాత్మను పొందుచున్నాడు" అని చెప్పబడినది. మరియు అదే అథర్వణ శ్రుతిలో "యదా పశ్యః పశ్యతే రుక్మవరమ్, కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్ । తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ, నిరంజనం సామ్య ముపైతి పరమమ్॥" (ముం.ఉ. III-1-3) "బ్రహ్మజ్ఞానియైన విద్వాంసుడు ఎప్పుడు తేజ స్వరూపుడై సృష్టికర్తకు కారణభూతుడైన ఆ పరబ్రహ్మ, పరమాత్మను దర్శిస్తాడో, అప్పుడు ఆ బ్రహ్మజ్ఞాని పుణ్యపాపములను దులుపుకొని (వదలివేసి) నిరంజనుడైన సర్వోత్తమైన ఆ సౌమ్యస్థితి, బ్రహ్మస్థితిని పొందు చున్నాడు" అని చెప్పబడినది. (ముం.ఉ. III-1-3)

శాట్యాయన శాఖవారు "తస్య పుత్రాదాయ ముపయాంతి సుహృద స్సాధుకృత్యాం, ద్విషంతః పాపకృత్యామ్" "ఆచనిపోయిన జ్ఞాని యొక్క పుత్రులు, శిష్యులు ధనాన్ని పొందుతారు. స్నేహితులు అతని పుణ్యకర్మలను, శత్రువులు పాపకర్మలను పొందుతారు" అని చెప్పుతారు. కౌషీతకములో "తత్సుకృత దుష్కృతే ధూనుతే తస్యప్రియా జ్ఞాతయ స్సుకృత ముపయంతి అప్రియాదుష్కృతం" - (కౌషీ.ఉ.I-4.) "శరీరాన్ని త్యజించే సమయములో ఆజ్ఞాని తన విద్యాబలము వలన సుకృత దుష్కృతాలను వదలుతాడు. అతని పుణ్యాన్ని బాంధవులు, పాపాలను ద్వేషించే శత్రువులు పొందుతారు" (కౌషీ.ఉ.I-4.) అని వున్నది.

ఇవి అన్నీ సమాన విద్యలో హాని, ఉపాయనము (అంటే వదలటయు, గ్రహించటము)ల యొక్క దృష్టాంతములు. వాటిని యథాయోగ్యముగా అధ్యాహారము (స్వీకారములు) చేయవలయును.
**కావున ప్రతి సమాన విద్యలో వాటిని అధ్యాహారము (స్వీకారము) చేయవలయును. దానివలన ఏ విధమైన ఫలభేదము వుండదు.** ఈ అధ్యాహారముల దృష్టాంతము ఈ విధముగా చెప్పబడినది.

**కుశలు :-** ఏ విధముగా కౌషీతకీశాఖ వారు కేవలము కుశలనే తీసుకోవాలి అని అంటే శాత్యాయనీ శాఖవారు ఔదుంబర కుశలు (మేడి పుల్లలు) తీసుకోవాలని చెబుతారు. దీనిని కౌషీతకీవచన శేషముగా మన్నించబడాలి. దీనిని రెండు శాఖలవారూ స్వీకరిస్తున్నారు. మేడిపుల్లలనే తీసుకొంటున్నారు.

**ఛందము :-** "దేవాసుర ఛందస్సులలో ఏవిముందు" అనే విషయము గూర్చి ప్రత్యేకముగా చెప్పకపోయినా పైంగి శాఖలో "ముందు దేవతా ఛ్ఛందస్సు" అనే దానిని బట్టి అందరూ

దేవచ్ఛందస్సును ముందు ఉపయోగిస్తున్నారు.

**స్తుతి :-** షోడశి అనే పాత్రను గ్రహించినపుడు దానికి అంగభూతముగా వుండే స్తోత్రము ఎప్పుడు చేయాలి? అనే విషయములో ఛందోగులు కాలవిశేషాన్ని, తైత్తరీయములో చెప్పబడిన "సూర్యుడు సగము అస్తమించిన సమయములో షోడశీ స్తోత్రము చేయాలి" అనే దానిని బట్టి నిర్ణయిస్తున్నారు.

**ఉపగానము:** "ఋత్విజః ఉపగాయంతి" అని ఋత్విజులందరికి వర్తిస్తుంది. ఇంకొకశాఖ వారు 'నాధ్వర్యు రుపగాయంతి" అని చెప్పినారు. అంటే అధ్వర్యుడు కాని ఋత్విజులు ఉపగానము చేయవలను. దీనివలన అందరూ అధ్వర్యు తప్పమిగతా ఋత్విజులు గానము చేయాలని స్వీకరిస్తారు.

జైమిని మహర్షి ప్రకారము "వేరొకశ్రుతిలోని విశేషాన్ని మరొక శ్రుతిలోకి గ్రహించకపోతే వికల్పము వస్తుంది." (జై.ధ.సూ. 10-8-1). **ఈ అన్ని దృష్టాంతముల వలన కర్మనాశము యొక్క ఉపలబ్ధి రూపఫలమును కూడ వాక్యశేషరూపముగా గ్రహణము చేయటమే సర్వథా ఉచితము. ఉపాయనములు వున్నచోట హానులను, హానులు వున్నచోట ఉపాయనములను అధ్యాహారము చేయుట సమంజసము.**

(ఛాం.ఉ. VIII-13-1; ముం.ఉ. VIII-2-8; ముం.ఉ. II; కౌషీ.ఉ. I-4)

## 16. సాంపరాయాధికరణము (116)

## (386) III-3-27

**సూ. సాంపరాయే తర్తవ్యాభావాత్తథా హ్యన్యే**

**క్ర. సాంపరాయే, తర్తవ్యాభావాత్, తథా, హి, అన్యే**

ప్ర.అ. సాంపరాయే=**దేహమును వదలిపోవునపుడు,** తర్తవ్యాభావాత్ = **పొందదగినవి ఏవీ ఉండక పోవటము వలన (పుణ్యపాప కర్మ అచటనే సమాప్తమగుటవలన),** తథా=**అట్లు,** హి=**కూడ,** అన్యే=**వేరుశాఖలవారు చెప్పుచున్నారు.**

వి. వెనుకటి (15) హాన్యధికరణములో పాపపుణ్యాలను దులుపు కొనటము అనేది దేవయాన మార్గము ద్వారా బ్రహ్మలోకమునకు వెళ్ళేవారికి త్రోవలో సంభవిస్తుందా? లేక మరణ సమయములో, ఇంకా బ్రతికివుండగానే వస్తుందా? అనే ప్రశ్న వస్తుంది.

కౌషీతకీ పర్యంకవిద్యలో

"సః ఏతం దేవయానం పంథానమాసాద్యాగ్ని లోకమాగచ్ఛతి" - (కౌషీ.ఉ. I-3).

"అతడు దేవయానమార్గాన్ని పొంది అగ్నిలోకాన్ని పొందుతాడు" అని మొదలుపెట్టి "సగచ్ఛతి విరజానదీంతాం మనసైవాప్యేతి తత్సుకృత దుష్కృతే విధూమతే" (కౌషీ.ఉ. I-4).

"అతడు విరజానదిని చేరి మనస్సుతోనే దానిని దాటుతాడు. సుకృత దుష్కృతాలను వదలివేస్తాడు."

అనివున్నది. దానివలన పుణ్యపాపాలను వదలటము మార్గమధ్యములో జరిగే ప్రసక్తి వస్తుంది. దానికి సమాధానము ఈ సూత్రములో చెప్పబడుతున్నది. దేహాన్ని వదిలిపెట్టే సమయములోనే విద్యా సామర్థ్యము వలన సుకృత దుష్కృతాలను వదలిపెట్టటము జరుగుతుంది. ఎందుకంటే అతనికి పొందదగినది ఏదీ లేనందున అది మరణ సమయములోనే బ్రతికివుండగానే జ్ఞానికి జరుగుతుంది.- మార్గమధ్యములో జరిగేది కాదు. కొంతవరకు పుణ్యపాపాలు అతనిని వెంబడించినందువల్ల ప్రయోజనమేదీలేదు. ఎందుకంటే ఈ దిగువ విషయములు గమనించాలి. ఛాందోగులు "అశ్వ ఇవ రోమాణి విధూయ, పాపం" (ఛాం.ఉ.. VIII-13-1) - "అశ్వము రోమాలను విదిలించివేసినట్టుగా జ్ఞాని పాపాలను వదులుతాడు" అనీ శాఠ్యాయన శాఖవారు "ఆ చనిపోయిన జ్ఞానియొక్క పుత్రులు, శిష్యులు ధనాన్ని పొందుతారు. స్నేహితులు అతని పుణ్యకర్మలను, ద్వేషించేవారు అతని పాపకర్మలను పొందుతారు." అని అన్నారు.

అందువలన, కౌషీతకీ ఉపనిషత్తులో బ్రహ్మలోకమునకు పోవు దేవయాన మార్గములో, విరజా నదిని దాటిన తరువాత, పుణ్యపాపములను వదులుతాడని అన్నాగూడ అది మరణ సమయములోనే జరుగుతుంది.

సంచిత కర్మలు బ్రహ్మజ్ఞానము కలుగగానే నశించిపోతాయి. ప్రారబ్ద కర్మలు మరణ సమయములో నశించిపోతాయి. కావున మరణ సమయములో పుణ్యపాపముల నుండి విముక్తి కలుగుతుంది. అదేకాక పుణ్యపాపములు బ్రహ్మలోకమార్గములో వదలిపోవుట సమంజసము కాదు. ఎందుకంటే అపుడు జీవికి స్థూలదేహము వుండదు. కనుక అపుడు దుష్కృతాలను నశింపచేసే సాధనలు వుండవు మరియు సుకృత దుష్కృతాలు నాశనము కాకపోతే విరజా నదిని దాటలేడు. అంటే అవి నదిని దాటిన తరువాత నాశనము అవుతాయి అనేది సాధ్యముకాదు.

**కావున అన్నీ సుకృత దుష్కృతములు జ్ఞానికి మరణ సమయములోనే వీడిపోతాయి.**

(కౌషీ.ఉ. I-3; కౌషీ.ఉ. I-4; ఛాం.ఉ. VIII-13-1)

## (387) III-3-28

**సూ. ఛందత ఉభయావిరోధాత్**

**క్ర. ఛందతః, ఉభయ, అవిరోధాత్**

ప్ర.అ. ఛందతః= **జ్ఞాని యొక్క సంకల్పానుసారము,** ఉభయ=**రెండు విధములైన స్థితి కలుగుటకు,** అవిరోధాత్=**విరోధమేమి లేకపోవుట వలన.**

వి. **జీవించియుండగానే పురుషుడు తన యిష్టప్రకారము, సంకల్పము ప్రకారము (ఛందతః) యమనియమాది అనుష్ఠానము చేస్తున్నాడు. కావున అతని కర్మక్షయము జీవించి యుండగానే జరుగవచ్చును. కావున తాండి, శాట్యాయన శాఖలలో విరోధము వుండదు.**

యమనియమాది పూర్వకమైన విద్యానుష్ఠానము చేస్తున్నాడు. కనుక, జ్ఞానికి ఆ అనుష్ఠానాని ఫలమైన సుకృత దుష్కృతాలు క్షయమవటముకూడా జీవించియుండగానే అవుతుంది.

**బ్రహ్మజ్ఞానులు కాని సన్మార్గములో వున్న ఉపాసకులకు బ్రహ్మప్రాప్తి అనేది దేహాన్ని వదలిన తరువాత కాని కలుగదు కాబట్టి జీవితకాలములో చేయబడిన అనుష్ఠానముల వలన దేవయానములో పయనించే వారికి బ్రహ్మప్రాప్తి మార్గమధ్యమములో కలుగుతుంది. అంటే ఉభయశాఖలకు విరోధము వుండదు.**

## 17. గతేరర్థవత్త్వాధికరణము (117)

### (388) III-3-29

**సూ. గతేరర్థవత్త్వముభయథాఽన్యథా హి విరోధః**

**క్ర. గతేః, అర్థవత్త్వమ్, ఉభయథా, అన్యథా హి, విరోధః**

ప్ర.అ. గతేః=**గతిబోధకమైన శ్రుతియొక్క,** అర్థవత్త్వమ్=**సార్థకత,** ఉభయథా=**రెండు విధములైన బ్రహ్మప్రాప్తిని ఒప్పుకొనటములో కలదు,** అన్యథా హి విరోధః=**అట్లుకాక మరియొక విధముగా మన్నించినచో విరోధము రాగలదు.**

వి. **పుణ్యపాపాలను వదలిపెట్టే సందర్భములో ఒకచోట దేవయాన మార్గాన్ని ఉదహరించినారు. ఇంకొకచోట చెప్పలేదు.** కౌషీతకీ ఉపనిషత్తులో "దేవయాన మార్గాన్ని పొంది అగ్నిలోకాన్ని పొందుతాడు" (కౌషీ.ఉ. I-3.) అని వున్నది.

ఛాందోగ్యములో "అశ్వమురోమాలను వదలించినట్లుగా జ్ఞాని పాపాలను వదులుతాడు"- (ఛాం.ఉ. VIII-3-1) మరియు "బ్రహ్మజ్ఞాని పుణ్యపాపములను దులుపుకొని (విదిల్చికొని) నిరంజసము, సర్వోత్తమయము అయిన ఆ సామ్యస్థితి, బ్రహ్మస్థితిని పొందుచున్నాడు" - (ముం.ఉ. III-13). **పుణ్యపాపాలను వదలిన పిమ్మట జ్ఞానులందరికీ దేవయాన ప్రాప్తివుంటుందా? లేక కొందరికే వుంటుందా? అనే ప్రశ్న వస్తుంది. అయితే రెండుగా విభజించటము వలననే దేవయాన మార్గానికి సార్థకత వస్తుంది. లేకపోతే శ్రుతివిరోధము వస్తుంది.**

**సగుణోపాసనాపద్ధతి, నిర్గుణ విద్యాపద్ధతి అనే రెండు పద్ధతులలో సగుణోపాసనాపద్ధతిలో మాత్రమే దేవయానము వున్నది. నిర్గుణ విద్యాసందర్భములో దేవయానానికి తావులేదు. అవసరములేదు.** "పుణ్యపాపాలను వదలి నిర్మలుడై పరమసామ్యాన్ని బ్రహ్మమును పొందుతాడు" అని చెప్పబడినది. నిర్గుణ విద్యాపద్ధతిలోగూడ దేవయానము వుంటే పైన చెప్పిన దానికి విరోధము వస్తుంది. "యదా సర్వే ప్రముచ్యంతే, కామా యేస్యహృదిశ్రితాః, అథమర్త్యో అమృతో భవతి, అత్ర బ్రహ్మ సమశ్నుతే" (కఠ.ఉ. II-3-14)

"హృదయముననున్న కోరికలన్నియు ఎప్పుడు పూర్తిగా తొలగిపోవునో, అప్పుడు మనుజుడు అమృతుడై ఇచటనే బ్రహ్మమును లెస్సగా పొందుచున్నాడు". మరియు

"యదా సర్వే ప్రభిద్యంతే, హృదయస్యేహ గ్రంథయః, అథ మర్త్యో అమృతో భవత్యేతాదనుశాసనమ్" (కఠ.ఉ. II-3-15)

"ఈ జీవితములోనే హృదయగ్రంథులను ఛేదించిన మానవుడు అమరత్వమును పొందునని శ్రుతులు అనుశాసించి బోధించుచున్నవి." **అంటే బ్రహ్మజ్ఞానికి తత్కాలబ్రహ్మప్రాప్తి అప్పుడే కలుగుతున్నది.**

**అతనికి ఎక్కడికీ వెళ్ళే అవసరములేదు. "యథా-తథా" ఎక్కడ వుంటే అక్కడ, ఇచటనే, ఎపుడో అపుడే ఇపుడే బ్రహ్మప్రాప్తి కలుగుతుంది. నిర్గుణ బ్రహ్మవిదునకు వేరే చోటికి ప్రయాణము లేదు, యానము దేవయానము అవసరములేదు.**

రెండవరీతిలో,

"వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః,
సన్యాసయోగద్యాతయః శుద్ధసత్త్వాః।
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే,
పరామృతాః పరిముచ్యంతి సర్వే॥" (ముం.ఉ. III-2-6)

"వేదాంత విజ్ఞానమందు నిశ్చయమైన సునిశ్చిత బుద్ధికలవారై, సన్యాసయోగముచేత పరిశుద్ధ మనస్సుగలవారైన సంయమివరులు మరణాంతరము బ్రహ్మలోకమునకు చేరి, యచటకల్పాంతము వరకు వుండి మోక్షముననుభవించుచున్నారు".

**ఇది సాధన, సగుణోపాసనపద్ధతి. దీనిలో బ్రహ్మలోకమునకు పోవుట, ప్రయాణము, యానము, దేవయానము వున్నాయి. ఈ విధముగా బ్రహ్మవిదునకు తత్కాల బ్రహ్మప్రాప్తి మరియు సగుణోపాసకులకు దేవయానములో బ్రహ్మలోకమునకు చేరుట అను రెండు విధముల వుండుట సమంజసమే. ఉభయపద్ధతులు వున్నవని ఒప్పుకొనటమే యుక్తము.**

**[నారాయణ వాక్యము :**

నిర్గుణ బ్రహ్మజ్ఞాన దృష్టకు బ్రహ్మలోకము ఇచ్చటనే వున్నది. ఎక్కడనో లేదు ఇహము పరము వేరుకాదు. జ్ఞానము కలుగగానే తెరలు వీడిపోయి, గోడలు కూలి, ఇదియే అదిగా ఇచటనే ఇపుడే, తనలో తత్కాల బ్రహ్మనుభూతి అవుతుంది. సగుణ బ్రహ్మోపాసకునకు ఉపాసనామార్గము దేవయాన మార్గము అవుతుంది. సగుణోపాసకుని, సదాచారము వలన, సద్భావము వలన, సద్బుద్ధివల్లన, ఆత్మశుద్ధియై సన్మార్గము లభించి పూర్వ సద్కర్మల వలన, మరణము తరువాత ఇహ పర మార్గమైన దేవయానమార్గములో ముక్తి లభిస్తుంది.

బ్రహ్మజ్ఞానికి సుకృతదుష్కృత శేషములు ఏ మాత్రము వుండవు. మరణించకముందే జీవన్ముక్తి కలిగి దేహము వదలగానే అపుడే విదేహముక్తి అంటే బ్రహ్మప్రాప్తి అవుతుంది. సగుణోపాసకునకు సుకృతదుష్కృతములు వుండి మరణము తరువాత ఇహపర మార్గములో వదలిపోతాయి.

**నిర్గుణోపాసన కష్టమైన మార్గము. సగుణోపాసన సులభమైన మార్గము. ఇహములో కష్టము ఐనది. పరములో సులభము. ఇహములో సులభమైనది పరములో కష్టముగా లభించును. సాధకుని సంకల్పానుసారము ఉభయ విధముల ముక్తి లభించుకొనవచ్చును. రెండు సౌకర్యములూ వున్నవి. సాధకుడు ఎంచుకొనవచ్చును.]**

(కౌషీ.ఉ. I-3; ఛాం.ఉ. VIII-3-1; ముం.ఉ. III-13; కఠ.ఉ. II-3-14,15; ముం.ఉ. II-2-6)

## (389) III-3-30

**సూ. ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్**

**క్ర. ఉపపన్నః, తల్లక్షణార్థోపలబ్ధేః, లోకవత్**

ప్ర.అ. ఉపపన్నః = **బ్రహ్మలోకమునకు పోవుటను గూర్చి చెప్పుట యుక్తి సంగతమే యగుచున్నది,** తల్లక్షణార్థోపలబ్ధేః = **దేవయాన మార్గము ద్వారా బ్రహ్మలోకమునకు ఉపయోగించు సూక్ష్మ శరీరాది ఉపకరణములు ప్రాప్తి చెప్పబడుట వలన,** లోకవత్ = **లోకములోవలె**

వి. **సగుణోపాసనతోనే దేవయాన మార్గానికి సంబంధము వున్నది. నిర్గుణోపాసనలో ఆ మార్గానికి సంబంధము లేదు.** ఈ విభాగము యుక్తియుక్తమే అవుతుంది. సగుణోపాసనకు సగుణ బ్రహ్మప్రాప్తి, నిర్గుణ బ్రహ్మజ్ఞానికి తత్ప్రాప్తి, స్వరూప ప్రాప్తి ఫలము అవుతుంది. ఒక గ్రామానికి వెళ్ళాలంటే దానికి మార్గము వుండాలికదా. సగుణ బ్రహ్మను చేరాలంటే దానికి తోవ వుండవలెను. అదే దేవయాన మార్గము. ఆ మార్గములో వెళితే ఉత్తమభోగప్రాప్తి కలుగుతుంది. ఈ విషయములే కౌషీతకీ బ్రహ్మణోపనిషత్తులో చెప్పబడినాయి. (కౌషీ.ఉ. I-4) నిర్గుణ బ్రహ్మవేత్తకు స్వరూపాన్ని పొందటానికి (బ్రహ్మైత్యైకత్వము) మార్గము అవసరములేదు కావున నిర్గుణవిద్యలో దేవయానమార్గము యొక్క ప్రసక్తి వుండదు. **సగుణ బ్రహ్మప్రాప్తికి దేవయాన మార్గము. నిర్గుణబ్రహ్మానుభవము ఒకస్థితి, బ్రాహ్మీస్థితి.**

**[నారాయణ వాక్యము :**
చీకటిగదిలో వున్నాము. చీకటి గది చివర ద్వారము వున్నది. ద్వారము మూసి వున్నది. మనచేతిలో పెట్టి వున్నది. పెట్టెలో దీపము వున్నది. పెట్టె మూసి వుంది. వెలుగుకావాలి. పెట్టెమూత తెరువ లేకపోతే ద్వారము వైపు నడవాలి. ద్వారము తాళము చెవి మన దగ్గరవున్నది. ద్వారము ఆవల సూర్యుడు, వెలుగువున్నది. ఇపుడు మనకు రెండు మార్గములు వున్నవి. ఒకటి పెట్టె మూత తెరువాలి. అప్పుడు దీపము వెలుగు గది అంతా నిండుతుంది. దీపము నిర్గుణబ్రహ్మము. పెట్టె మూత తెరవటము బ్రహ్మజ్ఞానము. పెట్టె చేతిలోనే వుంది కనుక ఎక్కడికీ వెళ్ళే అవసరము లేదు. మార్గము అవసరములేదు. పెట్టెలో దీపము వున్నది మరియు మూత తెరవాలి అనే జ్ఞానమే బ్రహ్మజ్ఞానము. సూర్యుడు సగుణబ్రహ్మము. సూర్యుని దగ్గరకు వెళ్లటము, గది తలుపువైపు వెళ్లటము, గది తలుపు తెరవటము సగుణోపాసన. పూర్వసుకృత కర్మఫలము అనే తాళంచెవితో గది తలుపు తెరుచుకొంటుంది. గది తలుపు తెరిస్తే అయ్యే సూర్యరశ్మి దర్శనమే బ్రహ్మదర్శనము వెలుగులోకి వెళ్లటము ముక్తి. పెట్టె మూత తెరువటము బ్రహ్మజ్ఞానము. దీపము వెలుగు నిర్గుణ బ్రహ్మానుభూతి, పెట్టె మూత, దీపము మనమే. అంతర్ముఖ ఆరాధన, బహిర్ముఖ ఆరాధన అనేటివి నిర్గుణ, సగుణ పద్ధతులు." "అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా"అని లలితా సహస్రనామవాక్యము)

(కౌషీ.ఉ. I-4, లలితా స.నా. 162-870, 871)

## 18. అనియమాధికరణము (118)

### (390) III-3-31

**సూ. అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్**

**క్ర. అనియమః, సర్వాసామ్, అవిరోధః, శబ్దానుమానాభ్యామ్**

ప్ర.అ. అనియమః = **ప్రత్యేక విద్యలననుసరించి బ్రహ్మనుపాసించువారు మాత్రమే దేవయాన మార్గమున బ్రహ్మలోకమునకు పోదురు అను నియమములేదు,** సర్వాసామ్ = **ఏ విద్యకలవారైనను బ్రహ్మలోకమునకు పోవువారు ఈ దేవయాన మార్గముననే పోవుదురు, ఈ విషయము,** శబ్దానుమాన్యభ్యాం = **శ్రుతి స్మృతుల వలన సిద్ధించుచున్నది,** అవిరోధః = **ఇందు విరోధము లేదు. దేవయాన మార్గము గూర్చి (ఛాందోగ్యపనిషత్తు V-10-2)లో చెప్పబడినది.**

వి. ఈ రీతిగా పంచాగ్ని విద్యను తెలిసినవారు మరియు అరణ్యమున శ్రద్ధచే తపము చేయువారు అర్చిరాది (కాంతివంతమగు) లోకములను పొందెదరు. అచ్చటి నుండి అహర్లోక, శుక్లపక్ష, ఉత్తరాయణ, సంవత్సర, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు ఈ మార్గమున వెళ్లుదురు. అచ్చట అమానుషుడగు పురుషుడుండును. అతడు వానిని బ్రహ్మలోకమునకు చేర్చును. ఇది దేవయానమార్గము (ఛాం.ఉ. V-10-12)

ఈ దేవయాన మార్గానికి సగుణోపాసనలోనే తప్పనిర్గుణబ్రహ్మ విద్యలో దానికి ప్రసక్తిలేదని చెప్పబడినది. కాని దేవయాన మార్గము కూడా సగుణోపాసన యందు కొన్నిచోట్ల చెప్పబడినది, కొన్నిచోట్ల చెప్పబడలేదు. పర్యంక విద్య, పంచాగ్ని విద్య, ఉపకోశల విద్య, దహర విద్యలలో దేవయానము చెప్పబడినది. మధువిద్య, శాండిల్య విద్య, వైశ్వానర విద్యలలో దేవయానము చెప్పబడలేదు. "చెప్పని మధు విద్య మొదలైన వాటిలో దేవయాన మార్గమును అన్వయింపవచ్చునా" అని ప్రశ్న వస్తుంది. సగుణోపాసన లన్నింటినిలోను, నియమము లేకున్నా (ప్రత్యేకముగా చెప్పకపోయినా) దేవయానాన్ని సంధింపచేయటములో విరోధము లేదు. ఎందుకు అని అంటే శ్రుతి, స్మృతుల వలన అట్లు నిశ్చయించబడినది.

"ఈ రీతిగా పంచాగ్ని విద్యను తెలిసినవారు మరియు అరణ్యమున శ్రద్ధ తపము చేయువారు అర్చిరాది (దేవయాన) మార్గమును పొందుతారు" అనిపైన (ఛాం.ఉ.V-10-1) చెప్పబడినది.

భగవద్గీతలో

"శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తిమన్యయా ఆవర్తతే పునః" (భ.గీ.VIII-26)

"వెలుగు చీకట్ల పక్షములు రెండు ।
కల్గి ఈ జగమున శాశ్వతము యుండు ।
వెలుగు మార్గములు నివృత్తి జేయ ।
కల్గచేయు నావృత్తి చీకట్లతోవ" ॥ (శ్రీ.మ.భ.గీ.VIII-26)

**ఉపాసనా మార్గాధికారులకు దేవయానమార్గము, కర్మాధికారులకు పితృయానమార్గము శాశ్వతములైనవి. దేవయానము వారు తిరిగిరారు. పితృయానులవారు జన్మమరణాలని పొందుతారు. కావున అన్ని రకముల ఉపాసకులకు దేవయానము వున్నది అనేది సమ్మతము, యుక్తి యుక్తము. అయితే బ్రహ్మవిదులకు రావటము, పోవటములేదు. బ్రహ్మవిదులు, బ్రహ్మస్థితులు మరియు బ్రహ్మ స్వరూపులు.**

(ఛాం.ఉ. V-10-1,2; భ.గీ. VIII-26)

## 19. యావదధికారాధికరణము (119)

## (391) III-3-32

సూ. **యావదధికారమవస్థితిరాధికారికాణామ్**

క్ర. **యావదధికారమ్, అవస్థితిః, ఆధికారికాణామ్**

ప్ర.అ. యావదధికారమ్ = **అధికారము సమాప్తము కానంతవరకు,** అవస్థితిః = **ఇచ్ఛానుసారమైన స్థితి వుండును.** ఆధికారికాణామ్ = **అధికారముకల పురుషులకు**

వి. లోకవ్యవస్థ అధికారములో నియమింపబడినట్టి యథార్థజ్ఞానము వలన కర్మలన్నీ క్షయమైన అపాంతర తమస్సు అనే వేదాచార్యుడు మొదలైన తత్త్వజ్ఞానులకు ఆ అధికారసంపాదకమైన కర్మము క్షయమయ్యే వరకు అవస్థితి, అధికారములో వుండటము, వుంటుంది. విద్వాంసునికి, బ్రహ్మజ్ఞానికి, ఈ దేహము పడిపోయిన తరువాత మరియొక శరీరము వుంటుందా? ఉండదా? అంటే, నిర్గుణ విద్యలో జ్ఞానికి దేహపాతము అయిన తరువాత ముక్తి సంభవించటము నియతమా? అనివార్యమా? కొందరికే అవుతుందా?

**బ్రహ్మవేత్తలైనవారికి కూడ మళ్ళీ శరీరము లభించినట్లు ఇతిహసములలో పురాణములలో కనిపిస్తున్నది. అపాంతర తమస్సు అనే వేదాచార్యుడు, పురాణఋషి విష్ణువు ఆదేశాన్ననుసరించి ద్వాపరయుగము - కలియుగము సంధిలో కృష్ణద్వైపాయనుడుగా పుట్టినట్లు, ఈశ్వరాజ్ఞచే సనత్కుమారుడు కుమారస్వామియై పుట్టినట్లు, జ్ఞానులైన నారదుడు, వసిష్ఠుడు మొదలైన మహర్షులు మరల పుట్టినారని తెలుస్తున్నది. కావున జ్ఞానులకు ఈ శరీరము విడచిన తరువాత ముక్తి లభిస్తుందనే నియమము లేదు.** అది ఎలా అవుతుంది అంటే అపాంతర తమస్సు అనే వేదాచార్యుడు మొదలైన జ్ఞానులు ఈశ్వరాజ్ఞచే ఆయా అధికారములలో, బాధ్యతలలో, నియమించబడి వుంటారు. కాబట్టి మళ్ళీ శరీరము ధరిస్తారు. **అటువంటి అధికారము, బాధ్యత లభించటానికి ఏ ఏ కర్మలు చేశారో ఆ కర్మలు క్షయమయ్యే వరకు అటువంటి జ్ఞానులు ఆయా అధికారాల్లో కొనసాగుతూ వుంటారు. శరీరధారణ చేస్తూ వుంటారు. వారు పరమేశ్వరాజ్ఞ ప్రకారము వచ్చుచు పోవుచుందురు. వారికి రాక పోకడలే కాని చావు పుట్టుకలు లేవు.** వారి రాక పోకలు దివ్యములు. వారు తమ ఇచ్ఛానుసారము శరీరమును స్వీకరించుటకు విసర్జించుటకు సమర్థులు. ఈప్రక్రియకు వారికి అర్చిరాది దేవతల సహాయము అవసరము లేదు. వారు అధికారము వున్నంత వరకు వారు

అవశ్యకతననుసరించి భాద్యతతో సర్వలోకములకు స్వతంత్రముగా రాగలరు పోగలరు. అదియే వారి **అవతరణ అధిరోహణ, అంతమందు వారు పరమాత్మలో విలీనమగుదురు. వారు పరమహంసలు. అన్యసాధకులు, ముక్తులు వారితో సమానముకారు.** "తస్య తావ దేవ చిరం, యావన్న విమోక్ష్యే, అథ సంపత్స్య ఇతి" (ఛాం.ఉ.VI-14-2) **అటువంటి బ్రహ్మవేత్తలకు దేహసంబంధమైన లింగశరీరముల నుండి విముక్తి కలిగినంతటనే మోక్షము, అంటే బ్రహ్మను పొందుతారు. బ్రహ్మము సర్వత్ర వున్నది అనునది పరమహంసలకు స్వానుభవము.** (ఛాం.ఉ.VI-14-2)

## 20. అక్షరధ్యధికరణము (120) (అక్షరపరా విద్య)

## (392) III-3-33

**సూ. అక్షరధియాం త్వవరోధః సామాన్యతద్భావాభ్యామౌపసదవత్తదుక్తమ్**

**క్ర. అక్షరధియాం, తు, అవరోధః, సామాన్యతద్భావాభ్యామ్, ఔపసదవత్, తత్, ఉక్తమ్**

ప్ర.అ. అక్షరధియాం = **పరబ్రహ్మ యొక్క నిర్గుణ నిరాకార అక్షర విషయ లక్షణముల యొక్క,** తు = **కూడ,** అవరోధః = **అధ్యాహారము చేయుట, సామాన్యతద్భావాభ్యాం,** ఔపసదవత్ = **ఉపసద్ సంబంధమైన మంత్రములవలె,** తదుక్తమ్ = **అది యుక్తము**

**వి.** పరబ్రహ్మ యొక్క నిర్గుణ నిరాకార అక్షర లక్షణములు శ్రుతులలో చెప్పబడినాయి. బృహదారణ్యకములో "ఆకాశము దేనిలో ఓతప్రోతమై వున్నది" అని గార్గి అడిగిన ప్రశ్నకు యాజ్ఞ్యవల్క్యుడు ఇలా సమాధానం చెప్పినాడు.

"గార్గీ! బ్రహ్మవేత్తలు ఆ తత్త్వాన్ని అక్షరమంటారు, అది నిర్గుణము, అది స్థూలమైనది కాదు, సూక్ష్మముకాదు, హ్రస్వమూ కాదు-దీర్ఘమూ కాదు" (బృ.ఉ. III-8-8) అలాగే ముండకోపనిషత్తులో "దేనివలన ఈ అక్షరబ్రహ్మ జ్ఞానము కలుగుతుందో అది పరావిద్య. ఆ అక్షర బ్రహ్మము బుద్ధి ఇంద్రియములకు గ్రాహ్యము కాదు. అన్వయము, గోత్రము, పుట్టుక, వర్ణములేనిది" అని శౌనకుడు చెప్పినాడు. (ముం.ఉ. I-2-6).

అదే ముండకోపనిషత్తులో అక్షరపరబ్రహ్మగూర్చి చెప్తుతూ ఇలా ఉంది.

"ఓం తదేచ్చత్యం, యదా-సువిత్తార్ధ్ పావకాద్
విస్పులింగః సహస్రశః ప్రభవంతే స్వరూపః
తదాఽ_క్షరత్ వివిధాః సోమ్యభావాః
ప్రజాయంతే తత్రచైవాపియంతిః" ము.ఉ. II-1-1)

"ఓ శౌనకా! ఈ పరావిద్యకు సంబంధించినదే ఈ పరమ సత్యము. ప్రకాశించి ప్రజ్వలించుచున్న అగ్ని నుండి ఆ అగ్నికి సమాన రూపములు గల మినుగురులు వేలకొలది యెట్లు పుట్టుచున్నవో అదే రీతిగా అక్షరము నుండి అనేక విధములైన జీవులు జనించుచున్నారు, ఆ అక్షర పరబ్రహ్మము

నందే లీనమగుచున్నారు."

మరల కఠోపనిషత్తులో రస, శబ్ద, స్పర్శ, రూప, గంధములులేని అవ్యయుడు, నిత్యుడు అని బ్రహ్మరూపాన్ని యమధర్మరాజు నచికేతునికి చెప్పినాడు. (కఠ.ఉ. I-3-15) ఈ విధముగా బ్రహ్మములేనిది, కానిది, లేనివాడు, కానివాడు అని నిషేద వాక్యములలో చెప్పినాడు. ఇవి కొన్ని శ్రుతులలో వున్నాయి. కాని అన్నింటిలో లేవు. లేనిచోట వీటిని ఉన్నవాటి నుండి అధ్యాహరము చేయవచ్చునా, అన్వయించుకోవచ్చునా? అనే ప్రశ్న వస్తుంది. **దానికి సమాధానము ఏమంటే సామాన్యమైనందునను, వస్తుభేదము లేనందునను, ఔఉపసదములవలెనె అక్షరానికి సంబంధించిన నిషేద భావాలను ఉపసంహరించుకోవచ్చును. అక్షర, నిర్గుణ బ్రహ్మను గురించి చెప్పే ఈ ద్వైతనిషేధ వాక్యాలు అన్నింటికి ద్వైతనిషేధము ద్వారా బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించే సామాన్య భావము వున్నది. ఈ వాక్యాలన్నింటిలో చెప్పదలచబడే బ్రహ్మము ఒక్కటే. ఉపదేశ్యవస్తువు, భేదము లేదు, తద్భావము వున్నది. కాబట్టి ఈ విశేషనిషేధ వాక్యాలన్నింటిని ఉపసంహరించుకొనవచ్చును. ఉపసత్తులు అంటే హోమములతో ఉపయోగించబడే మంత్రములు. పురోదాశమును (హతశేషమైన యాగ ద్రవ్యము) హోమద్రవ్యముగా ఉపయోగించే మంత్రములను ఔపసదములంటారు. ఈ ఔపసదములు సామవేదములో మాత్రమే వున్నాయి. అయినా యజుర్వేద యాజకులైన అధ్వర్యులు కూడ దీనిని వాడుతారు. భిన్నశ్రుతులలో చెప్పబడిన వాక్యాలు, అవి లేనిచోట, నిర్గుణ బ్రహ్మవిద్యయందు ఉపసంహారము చేయవచ్చును.**

**"అంగములకు ప్రధానానుసరణము యుక్తి సంగతమే" అని పూర్వ మీమాంసలో జైమిని మహర్షి చెప్పినారు** (పూర్వ మీ.సూ. III-3-9) **సత్యము, జ్ఞానము, ఆనందముల వలెనే నిర్గుణము, నిరాకారము, అనంతము, అగ్రాహ్యము, అశబ్దము, అస్పర్శము, నిర్వికారము వంటి నిషేధ వాక్యములను కూడా అన్నిచోట్ల అధ్యాహారము, అన్వయము చేసుకొనవచ్చును.**

(బృ.ఉ.III-8-8; ముం.ఉ.I-2-6; కఠ.ఉ.I-3-15; పూ.మీ.సూ.III-3-9)

## 21. ఇయదధికరణము (121) (పరమపురుష విద్య, నాచికేతాగ్ని విద్య)

### (393) III-3-34

సూ. **ఇయదామననాత్**

క్ర. **ఇయత్, ఆమననాత్**

ప్ర.అ. ఇయత్ = **పరిమితి (ఇంతఅని),** ఆమననాత్ = **చెప్పుట వలన**

వి. అధ్యాత్మాధికారములో, ఆధర్వణికులు
"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే



**చిత్రము-కృప శర్మ, 10వ తరగతి ఉపనిషత్తులు తెలియకున్నా తానంతట తానే వేసిన వర్ణచిత్రం**

**"ద్వా సుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరిషస్వజాతే"**

(అన్యోన్యమైత్రిచే కలుపబడి ఒకే చెట్టు మీద రెండు పక్షులు నివసించుచున్నవి.) (ముం.ఉ.III-1-1) బ్ర.సూ.(393) III-1-1

తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి" (ముం.ఉ. III-1-1)

అన్యోన్యమైత్రిచే కలుపబడి ఒకే చెట్టు మీద రెండు పక్షులు నివసించుచున్నవి. అందులో వొకటి పిప్పలఫలముననుభవించుచుండగా రెండవది తినకుండా దానిని చూచుచున్నది" అని వున్నది. కఠోపనిషత్తులో కృష్ణయజుర్వేదములవారు.

"ఋతంపిబంతౌ సుకృతస్యలోకే
గుహాంప్రవిష్టౌ పరమే పరార్ధే
ఛాయా తపౌ బ్రహ్మవిదోవదంతి
పంచాగ్నయోత్రిణాచికేతా" (కఠ.ఉ. III-3-1)

"ఆ పరమాత్మకు స్థానమైన హృదయ కుహరములో కూర్చుని తమ పుణ్యఫలాన్ని అనుభవించేవారు ఇద్దరున్నారు. బ్రహ్మవిదులు వారిద్దరినీ వెలుగు నీడలని చెప్పుచున్నారు. ఈ విధముగనే మూడుసార్లు నాచికేతాగ్ని చయనము చేసినవారు, పంచాగ్ని ఉపాసన చేసేవారూ చెపుతున్నారు" అని చెప్పబడినది.

ఈ రెండు ఉపనిషత్తులలో వున్న విద్యలు భిన్నమా లేక ఒకటియా అనే ప్రశ్న వస్తుంది. ముండకములో ఒకదానికి భోక్తృత్వము (తినటము), ఇంకొకదానికి అభోక్తృత్వము (తినకుండా వుండటము) చెప్పబడ్డది. కాఠకములో ఇద్దరికీ సుకృత దుష్కృత భోక్తృత్వము చెప్పబడినది. కాబట్టి ఈ రెండు విద్యలు ఒకటికావు అనే పరిస్థితి వస్తుంది. అయితే "ఇయత్" (ఇంత) అని చెప్పటము వలన రెండు విద్యలు ఒకటే అనేది సమంజనము. ఈ రెండు చోట్ల కూడ తెలుసుకోవలసిన రూపాన్ని అభిన్నముగానే చెప్పినారు. రెండింటిలోనూ భోక్తమైన జీవుణ్ణి చెప్పి, అతనికి పరమాత్మలో అభేదము చెప్పినారు. అయితే ముండకములో ఒక పక్షి తినుచున్నది రెండవ పక్షి చూచుచున్నది అని వున్నది. కాఠకములో రెండూ (సకృత, దుష్కృత) ఫలము తింటున్నది అని వున్నది. ఆకలి దప్పులు, తినటము, భోక్తృత్వములేని పరమాత్మ (పక్షికి) కూడా సహచర్యము వలన ఛత్రి న్యాయముతో త్రాగుచున్నది అని భోక్తృత్వము ఉన్నట్లు ద్వివచనములో చెప్పినారు.

ఇద్దరు వానలో వస్తుంటే ఒకరే గొడుగు పట్టుకున్ననుగూడ, గొడుగువాళ్లు వస్తున్నారు అనటము ఛత్రిన్యాయము. అంతేకాని పరమాత్మ భోక్తకాదు. అంతేకాక కాఠకములో రెంటిని ఎండ నీడలని ఏకత్వము చెప్పినారు. ఇద్దరూ ఒకే గుహలో వున్నారు. ముండకములో వారు కలసి మైత్రితో వున్నారు. రెండూ పక్షులూ ఒకే వృక్షము పైన వున్నారు. దీనిలోను ఏకత్వము వున్నది.

రెండు విద్యలూ ఒకటే. అంతేకాదు, రెండు పక్షుల విషయము ఇంకా రెండు చోట్ల వున్నది. ముండకములో పక్షుల విషయము కొనసాగిస్తూ

"సమానే వృక్షే పురుషోనిమగ్నో, అనీశయా శోచతి ముహ్యమాన్యః జుష్ఠం యదా పశ్యత్యన్యమీశం అస్యమహిమానమితి వీతశోకః" (ముం.ఉ. III-1-2) ఇదే శ్లోకము శ్వేతాశ్వతర ఉపనిషత్తులో



ఒకే చెట్టుమీద కూర్చున్నను జీవుడైన ఒక పక్షి అజ్ఞాన మోహములో మునిగినదై దుఃఖించుచున్నది. పూజ్యుడైన రెండవ పక్షియగు ఈశ్వరుని, అతని మహిమను ఎప్పుడైతే చూచుచున్నాడో మొదటి పక్షియైన జీవుడు గూడ దుఃఖము నుండి విముక్తుడగుచున్నాడు. బ్ర.సూ.(393) శ్వే.ఉ.III-1-2

వున్నది. (శ్వే.ఉ. IV-7)

**ఒకే చెట్టుమీద కూర్చున్నను జీవుడైన ఒక పక్షి అజ్ఞాన మోహములో మునిగినదై దుఃఖించుచున్నది. పూజ్యుడైన రెండవ పక్షియగు ఈశ్వరుని, అతని మహిమను ఎప్పుడైతే చూచుచున్నదో మొదటి పక్షియైన జీవుడు గూడ దుఃఖము నుండి విముక్తుడు అగుచున్నాడు.**

**[నారాయణ వాక్యము :**

జీవాత్మ, పరమాత్మలు మూలతత్త్వములో ఒకటియైనను మోహము వలన జీవుడనే పక్షి ప్రపంచవిషయముల భోక్తయై దుఃఖమునందుచున్నది. ఈ జీవాత్మ పక్షి పరమాత్మను చూచినపుడు మోహమునుండి, అందువలన దుఃఖము నుండి విముక్తినందుచున్నది. పూజ్యుడైన రెండవ పక్షిని చూడటమే బ్రహ్మదర్శనము. బ్రహ్మదర్శనము కాగానే జీవాత్మకు ముక్తియందును. **ఈ నాలుగు ఉపనిషత్తులలో వున్న రెండు విద్యలూ ఈ విధముగా జీవాత్మ పరమాత్మల గూర్చి చెపుతున్నాయి. అవిద్యమాసి పోగానే జీవాత్మ పరమాత్మ ఒకటేనని తెలుస్తుంది. ఈ రీతిగా కఠోపనిషత్తులో, ముండకోపనిషత్తులో చెప్పిన "సుపర్ణ విద్య" విద్యలు ఒకటియే.**]

(ముం.ఉ. III-1-1,2; కఠ.ఉ. III-3-1; శ్వే.ఉ. IV-7)

---

## 22. అంతరత్వాధికరణము (122) (ఉషస్త-కహోల విద్య)

## (394) III-3-35

**సూ. అంతరాభూతగ్రామవత్స్వాత్మనః**

**క్ర. అంతరా, భూతగ్రామవత్, స్వాత్మనః**

ప్ర.అ. అంతరా = **లోపల అంతర్యామి కలదు,** భూతగ్రామవత్ = **ఆకాశాది భూతములవలె,** స్వాత్మనః = **సాధకుని ఆత్మయొక్క**

**వి.** బృహదారణ్యకములో ఉషస్త బ్రహ్మణములో మరియు కహోల బ్రహ్మణములో ఉషస్తుడు, కహోలుడు తమకు సర్వాంతరాత్మను గూర్చి వివరించి చెప్పుమని అడిగినపుడు **యాజ్ఞ్యవల్క్యుడు ఉషస్తునితో ఇలా అన్నాడు.**

**"ఎవరు ప్రాణములచే ప్రాణక్రియ చేయుచున్నాడో అతడే ఆత్మ సర్వాంతరుడు" అని "నీ దృష్టికి కనబడదు, శ్రోత్రములకు వినబడదు అట్టి నీ ఆత్మ సర్వాంతరాత్మ"** (బృ.ఉ. III-4-1,2)"

తరువాత అదే ప్రశ్నకు కహోలునితో ఇలా అన్నాడు.

**"నీ అంతరాత్మయే సర్వాంతరాత్మ. ఎవరు ఆకలి దప్పి, శోకము-మోహము, జరా-మృత్యువులకు అతీతుడో అతడు సర్వాంతర్యామి"** (బృ.ఉ. III-5-1) **అయితే యాజ్ఞ్యవల్కుడు ఉషస్తునికి అంతరాత్మ "ప్రాణములచే ప్రాణ క్రియచేయును" మరియు "కనబడదు, వినబడదు" అని చెప్పి కహోలునికి "ఆకలి-దప్పిక, శోకము-మోహము, జరా-మృత్యువులకు అతీతుడు, అతడే సర్వాంతరుడు"** అని చెప్పినాడు. అపుడు ఇట్లా వేరువేరుగా చెప్పబడిన ఇద్దరూ ఒకటేనా? భిన్నములా? అనే ప్రశ్న వస్తుంది. ఒకటే ప్రశ్నకు రెండురీతుల సమాధానం వచ్చింది కనుక

ప్రతిపాదించిన అంశము (అంతరాత్మ) ఒకటి అయినా విద్యలు వేరు అనే సందేహము కూడా వస్తుంది. దీనికి సమాధానమే ఈ సూత్రము. రెండు శ్రుతులలో కూడా సర్వాంతరత్వాన్ని గూర్చి చెప్పబడింది, కావున రెండు విద్యలు ఒకటే. అదేకాక వేరొక శ్రుతిలో సర్వాంతరాత్మ గూర్చి చెప్పబడినది. "ఏకోదేవస్సర్వభూతేషు గూఢః, స్సర్వవ్యాపి సర్వభూతాంతరాత్మా" (శ్వే.ఉ. VI-11) "అన్ని భూతములందు సర్వాంతరుడైన సర్వవ్యాపియైన, అందరియందు దాగియున్న దివ్యాత్మ ఒకడే. కావున యాజ్ఞ్యవల్కుడు చెప్పిన ప్రాణములచే ప్రాణక్రియచేయించు, దృష్టికి కనబడని, శోత్రములకు వినబడని అంతర్యామి మరియు ఆకలి-దప్పులు, శోకము-మోహము, జరా-మృత్యువులకు అతీతుడైన అంతరాత్మ మరియు అన్ని భూతములందును సర్వాంతరుడైన, సర్వవ్యాపియైన, అందరియందు దాగివున్న దివ్యాత్మ ఒక్కరే **ఉషస్తికి చెప్పిన సర్వాంతర విద్య కహోలునికి చెప్పిన సర్వాంతర విద్య ఒకటియే.**

(బృ.ఉ. III-4-1,2, III-5-1; శ్వే.ఉ. VI-11)

## (395) III-3-36

**సూ. అన్యథా భేదానుపపత్తిరితి చేన్నోపదేశాంతరవత్**

**క్ర. అన్యథా, భేదానుపపత్తిః, ఇతి, చేత్, న, ఉపదేశాంతరవత్**

ప్ర.అ. అన్యథా = **వేరొకతీరున,** భేదానుపపత్తిః = **భేదము కలుగును,** ఇతిచేత్ = **అని అనినయెడల,** న = **కాదు,** దేశాంతరవత్ = మరియొక ఉపదేశమువలె

వి. పై సూత్రములో (సూ. 394లో) విద్యా భేదము అంగీకరించకపోతే రెండు శ్రుతులలో (ఉషస్తి, కహోల) భేదము వుండదు కదా? అని అంటే అట్లుకాదు. ఒకే విషయాన్ని వేరువేరు రీతులుగా చెప్పవచ్చును. ఛాందోగ్యములో ఉద్దాలక మహర్షి శ్వేతకేతువుకు "తత్త్వమసి" అనే దానిని తొమ్మిది మాట్లు వేరువేరు దృష్టాంతములతో వేరువేరుగా ఉపదేశించినాడు. (ఛాం.ఉ. VI-7 నుండి VI-16-3 వరకు) అట్లు వేరువేరు రీతులతో అభ్యాసముగా బోధించుటలో విద్యాభేదము రాలేదు. పునరుక్తి దోషములేదు. ప్రశ్నల ఉపక్రమము, ఉపసంహారము ఒకే విధముగా వున్నందున విద్యాభేదము లేదు. **యాజ్ఞ్యవల్కుడు చెప్పిన రెండు సర్వాంతర విద్యలలో వుండు సర్వాంతర్యామి ఒకడే.**

(బృ.ఉ. III-4-1,2, III-5-1; ఛాం.ఉ. VI-8-7 నుండి VI-16-7)

## 23. వ్యతిహారాధికరణము (123)

## (396) III-3-37

**సూ. వ్యతిహారో విశింషంతి హీతరవత్**

**క్ర. వ్యతిహారో, విశింషంతి, హి, ఇతరవత్**

ప్ర.అ. వ్యతిహారః = **వ్యతిహారము పరస్పర వినిమయము మరల మరల చెప్పటము,** విశంషంతి = **విశేషమునిచ్చి వర్ణించుచున్న (కావున విద్యా భేదము వుండదు)**

వి. యాజ్ఞవల్క్యుడు ఉషస్తికి, కహోలునికి "సర్వాంతరుడే నీ ఆత్మ" అని మరల "నీ ఆత్మయే సర్వాంతరుడు" అని అనటము వ్యతిహారము, పరస్పర వినిమయ క్రమము, ఒకటికొకటి తారుమారు చేయటము. దీనిలో ఏమి సమస్య వుండదు. ఎందుకంటే ఎన్నో చోట్ల శ్రుతులలో ఇట్లు విశేషమును వర్ణించు వ్యతిహారములున్నవి.

"ఏ నేనున్నానో అది అతడు. ఏ అతడున్నాడో అది నేను" (ఐ.అరణ్యకము II-2-4-6)

"త్వం వాఽహమస్మి భగవో, దేవతేహం వై త్వమసి" (వరాహోపనిషత్తు II-3)

**"ఓ భగవానుడా! నీవు నేనై వున్నాను. ఓ దేవా నేనే నీవైయున్నావు. మరల "ప్రణవమే ఉద్గీథము, ఉద్గీథమే ప్రణవము"** (ఛాం.ఉ. I-5-1) **ఈ విధముగా వ్యతిరేకముగా వ్యతిహారము చెప్పటములో ఉపాసకునికి స్పష్టముగా ఏకత్వము అవగాహనము అవుతుంది. వ్యతిహారము సమంజసము.**
(ఐ.ఉ. II-2-4-6; వ.ఉ. II-3; ఛాం.ఉ. I-5-1)

## 24. సత్యాద్యధికరణము (124) (సత్య విద్య)

## (397) III-3-38

**సూ. సైవ హి సత్యాదయః**

**క్ర. సైవ, హి, సత్యాదయః**

ప్ర.అ. సాఏవ = **అదియే (సత్య విద్య),** హి = **కావున,** సత్యాదయః = **సత్యము మొదలైన ధర్మములు (చెప్పబడినవి)**

వి. బృహదారణ్యకములో

"స యో తం మహద్యక్షం ప్రథమజం వేద, సత్యం బహ్మేతి జయతీమాన్ లోకాన్" (బృ.ఉ. V-4-1)

"ఎవరైతే ఈ గొప్పది మరియు పూజ్యమైన మొదట పుట్టిన సత్య బ్రహ్మను తెలిసికొంటాడో అతడు ఈ మూడు లోకాలను జయిస్తాడు" అని ఫలమును గూడచెప్పి,

"తద్యత్సత్యమసౌ స ఆదిత్య ఏష, ఏతస్మిన్మండలే పురుషోయశ్చాయం దక్షిణే అక్షిన్పురుషః" (బృ.ఉ. V-5-1)

"ఆసత్యమే ఈ ఆదిత్యుడు మరియు అదికంటియందలి పురుషుడు" అని తరువాత "తస్యోపనిషదహరితి హంతి పాప్మానం జహాతిచ" (బృ.ఉ. V-5-2)

"ఈ ప్రకారముగా తెలిసికొనినవాడు పాపములను నాశనము చేయుచున్నాడు మరియు విడిచివేయుచున్నాడు" అని కూడ చెప్పబడినది. అయితే, అ రెండు సత్యవిద్యలు ఒకటేనా? లేక

వేరు వేరా? అనే ప్రశ్న వస్తుంది. ఇట్టి ప్రశ్నకు ఈ సూత్రము సమాధానము "అదియే - ఆసత్యవిద్యయే ఈ సత్యవిద్య. సత్యము మొదలైన ధర్మములు చెప్పబడినవి కనుక". గొప్పది పూజ్యమైనది మరియు మొదలు పుట్టినది సత్యబ్రహ్మ" అనుటలో "ఆ సత్యమే ఈ ఆదిత్యుడు, ఆ ఆదిత్యుడే ఈ కుడికంటియందలి పురుషుడు" అని అనటములో **బ్రహ్మమే సత్యము, ఆదిత్యుడు, కుడికంటి యందలి (ప్రకాశరూప) పురుషుడు అని తెలుస్తుంది. ఈ రెంటిలోనూ ఉపాస్యుడు పరబ్రహ్మమే. కావున రెండు విద్యలు ఒకటియే. ఫలము భిన్నము కనుక విద్యలు భిన్నము అనుట సరికాదు. లోక జయము, పాప నాశము రెండు కలిసి సత్యవిద్యకు ఫలము అని అంటే సమంజసము.**

[నారాయణ వాక్యము :
**పాపనాశము అయితేనే లోకజయము అవుతుంది. పాపనాశము అంటే ఆత్మజయము. ఆత్మజయమే లోకజయము. "జితాత్మ సర్వాత్మా భవతి" అనునది కూడ చాణక్యసూత్ర వాక్యము.**]
(బృ.ఉ. V-4-1, V-5-1, V-5-2)

## 25. కామాద్యధికరణము (125) (దహర విద్య)

## (398) III-3-39

**సూ. కామాదీతరత్ర తత్ర చాయతనాదిభ్యః**

**క్ర. కామాది, ఇతరత్ర, తత్ర, చ, ఆయతనాదిభ్యః**

ప్ర.అ. కామాది = **సత్యకామాది ధర్మవర్ణనము,** ఇతరత్ర = **మరియొక చోట,** తత్ర = **అక్కడ,** చ=**కూడ,** ఆయతనాదిభ్యః = **సర్వధారణాత్వాది వర్ణనము కూడ చెప్పబడినది.**

వి. 'ఇతరత్ర' అంటే బృహదారణ్యకములో, 'తత్ర' అంటే ఛాందోగ్యములో సత్యకామాది మరియు సర్వవశిత్వాది బ్రహ్మ గుణములు చెప్పబడినవి.

ఛాందోగ్యోపనిషత్తులో

"ఈ బ్రహ్మపురములో సూక్ష్మమై, పద్మాకారము కలిగిన స్థానములో వున్న దహరాకాశములో ఉన్నట్టి" అని ఆరంభించి, (ఛాం.ఉ. VIII-1-1)
"ఈ ఆత్మ (పరబ్రహ్మము) పాపరహితమైనది మరియు ముసలితనము, మరణము, దుఃఖము, ఆకలి, దప్పిక ఏమియులేనిది. ఆత్మ సత్యకామము, తాను కోరిన ప్రకారం జరుగును. (సత్యసంకల్పము కలది. సంకల్పసిద్ధి కలిగి యుండును)" అని చెప్పబడినది. (ఛాం.ఉ. VIII-1-8) మరియు బృహదారణ్యకములో "ఈ ఆత్మగొప్పది, పుట్టుకలేనిది, పూజ్యమైనది అది ప్రాణములందు (ఇంద్రియములందు) విజ్ఞానజ్యోతి, స్వయంజ్యోతి స్వరూపమైనది. హృదయములో వున్న ఆకాశములో ఈ పురుషుడు శయనిస్తాడు. అందరిని వశపరచుకొనగలవాడు." (బృ.ఉ. IV-4-22) అనీ చెప్పబడినది అయితే, **ఛాందోగ్యములో చెప్పబడినది సగుణోపాసన విద్య, బృహదారణ్యకములో చెప్పబడినది నిర్గుణోపాసన విద్య అని తెలుస్తున్నది. ఈ రెంటిలో భేదము**

**కనిపిస్తున్నది. అయితే "ఈ రెంటిని ఉపసంహారము (పరస్పర అన్వయము) చేయవచ్చునా?" అనే ప్రశ్న వస్తుంది. దానికి సమాధానమే ఈ సూత్రములు రెండింటిలోనూ బ్రహ్మమును హృదయమును ఆయతనముగానూ, ఉపాస్యముగాను ఒకే రీతిగా చెప్పబడినది. కావున సగుణ, నిర్గుణ విద్యలలో భేదమువున్నా, అధ్యాహారము చేయవచ్చును.**

(ఛాం.ఉ. VIII-1-1, VIII-1-8; బృ.ఉ. IV-4-22)

## 26. ఆదరాధికరణము (126)

### (399) III-3-40

**సూ. ఆదరాదలోపః**

**క్ర. ఆదరాత్, అలోపః**

**ప్ర.అ.** ఆదరాత్ = **ఆదరము వలన,** అలోపః = **లోపము లేదు.**

**వి.** ఛాందోగ్యములో వైశ్వానరవిద్య యందు

"తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్

తద్ధోమీయం స యాం ప్రథమామాహుతిం జుహుయాత్తాం, జుహుయాత్ప్రాణాయస్వహా"

(ఛాం.ఉ. V-19-1)

"భోజన సమయములో ముందుగా వచ్చిన అన్నాన్ని హవనం చేయాలి. భోక్త, దానిని ప్రథమాహతిని హోమం చేసేటప్పుడు "ప్రాణాయస్వహా" అని చెప్పి హోమం చేయాలి అని వుంది. **మరి భోజనము లేనపుడు ప్రాణాగ్ని హోత్రానికి లోపము కలుగుతుందా అనే ప్రశ్న వస్తుంది. భోజనలోపము కలిగినప్పటికీ అగ్నిహోత్ర లోపము వుండదు. ఎందుకంటే "అతడు అతిథులకంటే ముందు భోజనము చేయాలి" అని జాబాలశ్రుతి ప్రాణాగ్నిహోత్రాన్ని ఆదరించింది. అతిథులకంటే ముందుగా భోజనము చేయాలి అని ఆదరము చూపటము వలన భోజన లోపము కలిగినా, ప్రాణాగ్ని హోత్రానికి లోపము వుండవలదు. ఉపాసకుడు ఉదకముతో ప్రాణాగ్నికి హోమము చేయవచ్చును అనే వాదానికి సమాధానముగా దిగువ సూత్రము చెపుతున్నారు.**

(ఛాం.ఉ. V-19-1)

### (400) III-3-41

**సూ. ఉపస్థితేఽతస్తద్వచనాత్**

**క్ర. ఉపస్థితే, అతః, తద్వచనాత్**

**ప్ర.అ.** ఉపస్థితే = **భోజన ద్రవ్యము వున్నపుడు,** అతః = **దీని నుండి,** తద్వచనాత్ = **అట్లు చెప్పబడినందున**

**వి. భోజన ద్రవ్యము దగ్గరగా వున్నపుడు "ముందుగా వచ్చిన అన్నాన్ని" అని చెప్పటము వలన ఆ ద్రవ్యముతోనే ఆహుతి చేయాలి. ఆదర వచనము భోజనము లభించే దశను గూర్చి చెప్పినది. అంటే ముందు అనేది భోజనానికి కాని ప్రాణాగ్ని హోత్రానికి కాదు.భోజనము లేనపుడు ప్రాణాహుతులు వుండవు. భోజనలోపము వున్నప్పుడు ప్రాణాగ్ని హోత్రానికి కూడా లోపమే.**

## 27. తన్నిర్ధారణాధికరణము (127)

## (401) III-3-42

**సూ. తన్నిర్ధారణానియమఃతద్దృష్టేఃపృథగ్ఘ్యప్రతిబంధఃఫలమ్**

**క్ర. తన్నిర్ధారణానియమః, తద్దృష్టేః, పృథక్, హి, అప్రతిబంధః, ఫలమ్**

ప్ర.అ. తన్నిర్ధారణానియమః = **ఉపాసనలు చేయవలయును అనే నియమము లేనందున,** తద్దృష్టేః = **అది శ్రుతిలో చూడబడినందున,** పృథక్ = **వేరు,** హి = **ఎందుకనగా,** అప్రతిబంధః = **అడ్డంకి కానందున,** ఫలమ్ = **ఫలము, ఫలితము**

వి. కర్మలను అనుసరించికాక, కర్మాంగాలను ఆశ్రయించి చేసిన ఉపాసనలకు కర్మాంగత్వ నియమత్వము లేదు.

కొన్ని ఉపాసనలు కర్మాంగాలని ఆశ్రయించి వున్నట్లు పేర్కొనబడినాయి. ఈ ఉపాసనలు కర్మాంగాలు కావు. ఉపాసనలకు, కర్మలకు నిత్యసంబంధములేదు.

"ఈ ఓంకార రహస్యము తెలిసినవాడును, తెలియనివాడును ఇద్దరును కర్మలు చేయుదురు. జ్ఞానరహితకర్మలు, జ్ఞానయుక్త కర్మలు వేరువేరుగానుండును. జ్ఞానముతో శ్రద్ధతో చేయుకర్మయే వీర్యవంతమైనది" (ఛాం.ఉ. I-1-10)

అంతేకాక కర్మలకు ఫలమువేరు, ఉపాసనలకు ఫలమువేరు. కర్మఫలము లభించటానికి ఉపాసనలు అడ్డంకులు కావు. క్రతువు తన ఫలసిద్ధి కొరకు ఉపాసనను అపేక్షించదు. ఉపాసన అనేది క్రతువుకు కర్మాంగము కాదు. అది ఐచ్ఛికమే.

"ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" (ఛాం.ఉ. I-1-1)

"ఉద్గీథావయవమైన ఓం అనే అక్షరాన్ని ఉపాసించవలెను" అనే మొదలైనవి జ్యోతిష్టోమాదులకు అంగాలుగా వుండే ఉద్గీథాదులను ఆశ్రయించిన ఉపాసనలు వున్నాయి. జ్యోతిష్టోమము కర్మ, ఉద్గీథ కర్మాంగము, ఓం అనుగానము ఉపాసన. ఓంకార ఉపాసన జ్యోతిష్టోమ కర్మఫలమునకు ప్రతిబంధకము కాదు. ఓంకారోపాసన లేకపోతే జ్యోతిష్టోమకర్మ ఫలమునకు ఆటంకము లేదు. **ఓంకారోపాసన, బ్రహ్మోపాసన. బ్రహ్మోపాసన ఆత్మశుద్ధికి మార్గము కాని కర్మఫలము కర్మముపైననే ఆధారపడి వుంటుంది. ఓంకారోపాసన చేయాలని నిర్బంధము కూడా లేదు. కాని ఓంకారోపాసన చేయటము ఉత్కృష్టము, ఉత్తమము.**

(ఛాం.ఉ I-1-10; I-1-1)

[**నారాయణ వాక్యము :** కర్మానుష్ఠానము ఫలమునిచ్చును. ఓంకారోపాస ముక్తి మార్గమునిచ్చును.]

## 28. ప్రదానాధికరణము (128) (సంవర్గ విద్య)

## (402) III-3-43

**సూ. ప్రదానవదేవ తదుక్తమ్**

**క్ర. ప్రదానవత్, ఏవ, తత్, ఉక్తమ్**

ప్ర.అ. ప్రదానవత్ = **ప్రదానమువలె,** ఏవ = **వలెను,** తదుక్తమ్ = **అది చెప్పబడినది.**

వి. పురోడాశ ప్రదానమునందువలెనె, వాయువును, ప్రాణమును వేరువేరుగా భావించాలి. బృహదారణ్యకములోనూ, ఛాందోగ్యములోనూ, సంవర్గ విద్య చెప్పబడినది. సంవర్గము అంటే దేవతలను లీనము చేసుకోవటము అని అర్థము. బృహదారణ్యకము (I-5-21 నుండి I-5-23 వరకు)లో ప్రాణము ఇంద్రియములలో శ్రేష్ఠమని, మరియు వాయువు దేవతలలో శ్రేష్ఠమని నిర్ణయించబడినది. ఛాందోగ్యములో (IV-3-1) దేవతలందరికి వాయువే చివరి ఆశ్రయమని (సంవర్గమని) అన్ని కలుపుకొనేది అని అధిదైవతముగా చెప్పబడినది. అచటనే (IV-3-3)లో ప్రాణమే చివరి ఆశ్రయము (సంవర్గము, అన్ని కలుపుకొనేది అని) అధ్యాత్మముగా చెప్పబడినది. అధ్యాత్మ సంబంధమైన ప్రాణము, అధి దైవతసంబంధమైన వాయువు రెండు ఒకటేనా, భిన్నములా అనే ప్రశ్న వస్తుంది. "ఇందులో రెండింటిలో వాయుప్రాప్తియే ఫలము. పేరులో భేదము తప్ప రెండింటి స్వరూపము ఒకటే. కాబట్టి వేద్యములో భేదము లేదు. కావున ఈ రెండు ఒకటియే, విద్యలు కూడ ఒకటియే అనివాదము. వాయువు వేరు, ప్రాణము వేరు" అని శ్రుతులు చెప్పుతున్నాయి.

"తౌ వా ఏతౌ ద్వౌ సంవర్గౌ వాయురేవ దేవేషు ప్రాణః ప్రాణేషు" (ఛాం.ఉ. IV-3-4)

"వాయువు, ప్రాణము రెండూ రెండు సంవర్గములు. వాయువు దేవతల యందు, ప్రాణము ప్రాణములందు "(ఇంద్రియములందు) తైత్తరీయ సంహితలో "ఇంద్రుడు ఒక్కడే అయినప్పటికీ రాజ, అధిరాజ, స్వరాజ" అని గుణాల భేదము వలన వేరువేరుగా పురోడాశాన్ని ప్రదానము చేస్తున్నారు. జైమిని మహర్షి పూర్వమీమాంసానుబంధమైన సంకర్షణకాండములో ఒకే దేవత గుణభేదముల వలన (గుణముల ప్రకారము) వేరువేరుగా తెలియబడుతాడు. **అట్లు ప్రాణము, వాయువు రెండూ వేరు వేరు కావున మరియు గుణభేదము వలన వాయువు, ప్రాణము మరియు వాటి విద్యలు వేరు అని అనటము సమంజసము.**

(బృ.ఉ. I-5-21 నుండి I-5-23 వరకు; ఛాం.ఉ. IV-3-1, IV-3-3, IV-3-4)

## 29. లింగభూయస్త్వాధికరణము (129)

## (403) III-3-44

సూ. **లింగభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి**

క్ర. **లింగభూయస్త్వాత్, తత్, హి, బలీయః, తత్, అపి**

ప్ర.అ. లింగభూయస్త్వాత్ = **అనేక సంకేతములు, లక్షణములు న్నందువలన,** తత్ = **అది,** హి = **ఎందుకంటే,** బలీయః = **బలమైనది,** తత్ = **అది,** అపి = **కూడ**

వి. **అనేక సంకేతములు, గుర్తులు వున్నందువలన వాజసనీయుల అగ్ని రహస్యములో చెప్పబడిన మనసు, వాక్కు, చక్షువు మొదలైన వాటికి సంబంధించిన అగ్నులు స్వతంత్రములు వాటికి యజ్ఞాగ్నులకు**

**సంబంధములేదు.** ఎందుకంటే దానికి అనేక గుర్తులు (లింగములు, సంకేతములు) వున్నాయి మరియు ప్రకరణము (విషయము) కంటే గుర్తులు బలమైనవి. వాజసనీయశాఖలోని అగ్ని రహస్యములో "ఆ మనస్సు తనకు అర్చనీయమైన-మనోవృత్తి భావితములైనట్టి, మనస్సు చేత చింతించబడినట్టి, వాక్కుచేత సంపాదించబడినట్టి, ప్రాణము చక్షువులు శ్రోత్రము ఆదిగాగలవాని చేత సంపాదింపబడిన వాటి వాటి వృత్తరూపమైన 36 వేల అగ్నులను చూచింది" అని చెప్పబడ్డది (శ.ప.బ్రా. X-5-3) (మానవుని ఆయుస్సు 100 సంవత్సరాలు. సంవత్సరానికి 360 రోజులుగా మొత్తము 36,000రోజులు. ఒకరోజులో పుట్టే ఆలోచనా భావాలను ఒక మనోవృత్తి అని అంటే మొత్తము 36,000మనోవృత్తులుంటవి. మనోవృత్తులను అగ్నిగా, సూర్యునిగా ఆత్మస్వరూపాలుగా భావించవచ్చు. ఇవన్ని మనశ్చితాలు - మనస్సులో ధ్యానించబడిన అగ్నులు అవుతాయి. ఇవి మానవ జీవితము 36,000 సంభవిస్తాయి). ఈ అగ్నులు కర్మలకు సంబంధించినవా, ఉపాసన కోసము చెప్పబడిన స్వతంత్రములా అనే ప్రశ్న వస్తుంది. "ఈ ప్రాణులు మనస్సులో ఏమేమి సంకల్పించినా అవియన్నీ ఈ అగ్నులు చేసే పనులే" అనీ, "ఇది తెలిసిన ఉపాసకుడు నిద్రపోతున్నా, మెల్కొన్నా అతని కోసం సమస్త భూతములు ఎప్పుడూ ఈ అగ్నుల్ని సంపాదిస్తాయి" అని ఎన్నో గుర్తులు, సంకేతములు (లింగములు) వున్నాయి. **లింగము ప్రకరణము కంటే బలమైనదని ధర్మసూత్రములలో జైమిని మహర్షి అన్నారు. "శ్రుతి, లింగము, వాక్యము, ప్రకరణము, స్థానము, సమాఖ్య అనేవి ఒకచోట సంభవిస్తే తరువాత వాటికంటే మొదటివి బలీయము"** (పూ.మీ. III-3-13) **ప్రకరణము, కర్మసంబంధ అగ్నులు, లింగములు, స్వతంత్ర సూచకములు కావున మనోవృత్తి రూపములైన అగ్ని రహస్యములో చెప్పబడిన అగ్నులు కర్మలకు, కర్మాంగాలకు సంబంధించినవి కావున, ఉపాసనా పూర్వక స్వతంత్రములు అనటము సమంజసము.**

(శ.ప.బ్రా. X-5-3; పూ.మీ. III-3-13)

## (404) III-3-45

సూ. **పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్ క్రియామానసవత్**

క్ర. **పూర్వవికల్పః, ప్రకరణాత్, స్యాత్, క్రియా, మానసవత్**

ప్ర.అ. పూర్వః = **పూర్వము చెప్పబడిన అగ్ని విద్య,** వికల్పః = **వికల్పముచే ముక్తికి హేతువు,** ప్రకరాణాత్ = **ప్రకరణము, సందర్భము, విషయము వలన,** స్యాత్ = **అగును,** క్రియా = **క్రియలు,** శరీర = **శారీరక,** మానసవత్ = **మానసము వలె**

వి. "బ్రహ్మజ్ఞానముయే ఈ జన్మ-మరణ రూప సంసారిక బంధనముల నుండి ముక్తి కలిగించే నిశ్చిత ఉపాయము" అని అనేదానికి ప్రతివాదము ఇలా వుంది. ఉపాసనకు సంబందించిన శారీరక క్రియలవలె మానసిక క్రియల ద్వారా కూడా ఫలము ప్రాప్తించుతుంది. ఏ ఫలము యజ్ఞయాగాది సద్కర్మల వలన లభిస్తుందో ఆ ఫలము జపము, భజన, చింతనలలాంటి మానసిక క్రియల ద్వారా లభించటము సంభవము అవుతుంది.

కఠోపనిషత్తులో యమధర్మరాజు-నచికేతుల సంవాదములో నచికేతుడు యమధర్మరాజును

"ఆ స్వర్లోకమున లేదు భయమది కొంచెమున్
నీవున్లేవు లేవు జరవృద్ధాప్య బాధలున్
అవునాకలి దప్పులున్ దాటి మాసి చింతయున్
దివ్యముగ ముదయుండగవచ్చునచ్చట సుఖముగన్"

"అట్లున్న నీకు తెలియునయ్య
అట్టి దివ్యలోకములకు గొంపోవు అగ్ని
ఇట్టి శ్రద్ధాళువునైన నాకు చెప్పు
అట్లుండే రెండవ వరము నాది" (కఠ.ఉ.I-12-13)

అప్పుడు కాలుడు బాలునకు నచికేతాగ్ని విధి, విధానము, విద్య, విజ్ఞానము నేర్పి ఇలా చెప్పినాడు.

"మూడు నచికేతంబులు చేసి కర్మల మూడింటి చేసి
మూడు విధముల సంధి కలిగియుండునెవడు
వాడు జన్మమృత్యువులను తాను తరియించువాడు
కడు దివ్యబ్రహ్మజజ్ఞమ్ము తెలిసి యత్యంత శాంతిచెందు" (కఠ.ఉ. I-18). నచికేతాగ్ని కర్మవిద్య, యమధర్మరాజు ఇచ్చిన రెండవవరము. తరువాత మూడవ వరముగా ఆయన నచికేతునికి బ్రహ్మవిద్య జ్ఞానమునిచ్చినాడు. (కఠ.ఉ.I-18) దీనివలన ఏ ప్రకారము బ్రహ్మవిద్య ముక్తికి హేతువని చెప్పబడినదో దానికి ముందు (పూర్వము) చెప్పబడిన అగ్ని హోత్రకర్మ కూడ ముక్తికి హేతువనుటలో అసంగతములేదు. అయితే లింగముకన్న ప్రకరణము బలవత్తరము కనుక కర్మాంగములైన మానస ఉపాసనలు కర్మాంగములు అవుతాయి. ద్వాదశాహయజ్ఞములో "అవివాక్య"మనే పదవరోజున కర్మలన్నీ మానసికంగా జరుగుతాయి. మంత్రాలను పైకి ఉచ్చరించరు. అవి మానసికకర్మలైనా కర్మాంగముగానే క్రతుకర్మాంగమని ఒప్పు కుంటున్నారు. ప్రజాపతి యజ్ఞములో భూవిని పాత్రగా, సముద్రాన్ని సోమముగా భావిస్తున్నారు. ఇది మానసికమైన కర్మాంగమే. **కావున అగ్ని రహస్యములో చెప్పబడిన 36,000 అగ్నులు** (బ్ర.సూ. III-3-44) **కూడ మానసికమైనా (లింగము) ప్రకరణమును బట్టి క్రియాంగములే ఇవి స్వతంత్రమైన ఉపాసనలు కావు. అని ప్రతివాదము.**

(కఠ.ఉ. I-12-13, I-18; బ్ర.సూ. III-3-44, 304)

## (405) III-3-46

**సూ. అతిదేశాచ్చ**

**క్ర. అతిదేశాత్, చ**

ప్ర.అ. అతిదేశాత్ = **అతిదేశము (ఒకదాని ధర్మమును ఇంకొక దానికి ఆరోపించటము)** వలన, చ = **కూడ.**

వి. **ప్రతివాదము కొనసాగుతున్నది "అతిదేశము వలన కూడ ఈ 36,000 అగ్నులు కర్మాంగములే".** శతపథ బ్రాహ్మణములో "ఈ ముప్పది ఆరువేల అగ్నులు పూజింపదగినది. వాటిలో ఒక్కొక్కటే

ముందు చెప్పబడిన ఇష్టకాచితాగ్ని (ఇటుకల చేయబడిన అగ్ని) అంతటిది". (శ.ప.బ్రా. X-3-11) అని ఈ **మనశ్చితాగ్నులకు, ఇష్టకచితాగ్నులకు పోలిక, సామ్యము చెప్పినారు. ఇది అతిదేశము. దీనివల్ల ఈ అగ్నులకు కర్మాంగత్వము సిద్ధిస్తుంది" ఈ ప్రతివాదమునకు ముందరి సూత్రము సమాధానము.**

(శ.ప.బ్రా. X-3-11)

## (406) III-3-47

సూ. **విద్యైవ తు నిర్ధారణాత్**

క్ర. **విద్యా, ఏవ, తు, నిర్ధారణాత్**

ప్ర.అ. విద్యా = బ్రహ్మ విద్య, ఏవ = **యే,** తు = **ఇంకను,** నిర్ధారణాత్ = **శ్రుతిలో నిశ్చయముగా నిర్ధారణ చేయుట వలన.**

వి. **ఈ మనశ్చితాది అగ్నులు స్వతంత్రమైన విద్యాత్మకములే. శ్రుతియందు ఇది నిర్ధరించి చెప్పబడినది.**

"తేహైతే విద్యాచిత ఏవ, విద్యయా

హైవేతే ఏవం విదశ్చితా భవంతి" (శ.ప.బ్రా. X-5-3-12)

**అవి విద్యాభావనతోనే సంపాదితాలు. ఇది తెలుసుకున్న ఉపాసకునికి ఆ అగ్నులు విద్యచేతనే (ఉపాసన చేతనే) సంపాదితము అవుతున్నాయి. కాబట్టి మనశ్చితాది అగ్నులు కర్మాంగములు కావు, స్వతంత్రమైన ఉపాసనలు.**

(శ.ప.బ్రా. X-5-3-12)

## (407) III-3-48

సూ. **దర్శనాచ్చ**

క్ర. **దర్శనాత్, చ**

ప్ర.అ. దర్శనాత్ = **శ్రుతియందు చెప్పబడుట వలన,** చ = **కూడ.**

వి. **వెనుక చెప్పబడిన లింగముల వలన కూడ ఇవి స్వతంత్రములు అని తెలుస్తుంది.** "లింగభూయస్త్వాత్" అనే సూత్రములో చెప్పబడిన (బ్ర.సూ.III-3-44(304) లింగముల వలన కూడ ఇవి స్వతంత్రములు. అన్వార్థసిద్ధి లేనప్పుడు లింగము కూడ ఏ అర్థాన్ని ఇవ్వలేదు కనుక వాటిని వదలివేసి ప్రకరణ సామర్థ్యాన్ని బట్టి నిర్ణయించాలని అట్లా **ప్రకరణాన్ని బట్టి చూస్తే ఇవి కర్మాంగములు అవుతాయని అంటే దానికి సమాధానముగా దిగువ సూత్రము చెపుతున్నారు.**

(బ్ర.సూ.III-3-44 (304)

## (408) III-3-49

సూ. **శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః**

క్ర. **శ్రుత్యాది బలీయస్త్వాత్, చ, న, బాధః**

ప్ర.అ. శ్రుతి ఆది బలీయస్త్వాత్=**శ్రుతి లింగ వాక్యములు బలవత్తరములగుటచే,** న బాధః=**దుర్బలమగు కర్మ ప్రకరణముచే మానసికాగ్నులు స్వతంత్రములనుటకు బాధ కలుగదు.**

వి. **ప్రకరణముకంటే లింగము, లింగము కన్న శ్రుతి బలవత్తరము శ్రుతి స్వయము ఇవి స్వతంత్రములు అని చెపుతున్నది.**

"తేహైతే విద్యాచిత ఏవ" - "ఈ అగ్నులు విద్యాసంపాదితాలు" అని (శ.ప.బ్రా. X-5-3-12) మరల "విద్యయా హ్యేవైత ఏవం విదశ్చితా భవతి" అని అనబడిన దానిలో "ఏవం విద" అని విద్యాసంబంధమే చెప్పబడినది. **అందువలన మనశ్చితాగ్నులు కర్మాంగాలు కావు. ఉపాసనా విద్యలే.** (శ.ప.బ్రా. X-5-3-12)

## (409) III-3-50

సూ. **అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతరపృథక్త్వవదృష్టశ్చ తదుక్తం**

క్ర. **అనుబంధాదిభ్యః, ప్రజ్ఞాంతరపృథక్త్వవత్, దృష్ట, శ్చ, తత్, ఉక్తమ్**

ప్ర.అ. అనుబంధాదిభ్యః = **భావవిషయమైన అనుబంధాది భేదముచేత,** ప్రజ్ఞాంతరపృథక్వం = **ఉద్దేశ్యభేదము చేత వేరు వేరు ఉపాసనలలో భేదము,** చ = **కూడ,** తదుక్తమ్ = **అది ఇంతకుముందే చెప్పబడినది.**

వి. అనుబంధము మొదలైన వాని వలన కూడ, మనశ్చితాదులకు కర్మాంగత్వములేదు. శాండిల్య విద్య మొదలైన ప్రజ్ఞాంతరాలకు కర్మల నుండి భిన్నత్వము ఉన్నట్లుగా కూడా ఇవి స్వతంత్రములు. "అవేష్టి" అనే క్రతువు రాజసూయ ప్రకరణములో చెప్పబడినా జైమిని మహర్షి ధర్మసూత్రములలో స్వతంత్ర క్రతువుగా స్వీకరింపబడినది, (జై.ధ.సూ. III-5-21), **అవేష్టి క్రతువును రాజసూయ ప్రకరణము నుండి పైకి లాగినట్లు మనశ్చితాదులను కర్మ ప్రకరణము నుండి ఉత్కర్షించటము యుక్తము.**

(జై.ధ.సూ. III-5-21)

## (410) III-3-51

సూ. **న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్న హి లోకాపత్తిః**

క్ర. **న, సామాన్యాత్, అపి, ఉపలబ్ధేః, మృత్యువత్, న, హి, లోకాపత్తిః**

ప్ర.అ. న = **లేదు,** సామాన్యాదపి = **మనశ్చితాది అగ్నులకు సాదృశ్యము వున్నప్పటికి కూడ,** ఉపలబ్ధేః = **కనిపిస్తున్నది,** మృత్యువత్ = **మృత్యువువలె,** న హి లోకాపత్తిః = **ద్యులోకానికి అగ్ని భావము ప్రాప్తించదు.**

వి. వెనుకటి సూత్రము (బ్ర.సూ.III-3-45)లో మానసికము-భువిని పాత్ర మరియు సముద్రములను సోవములాగా భావించటమువలెనె ఇది కూడా (భూమి పాత్ర కాదు కదా!).

"ఈ ఆదిత్యమండలములోని పురుషుడే డెవడో అతడే ఈ మృత్యువు" (శ.ప.బ్రా.X-5-2-3) అని "అగ్నియే మృత్యువు" (బృ.ఉ.III-2-10) అనీ ఆదిత్యునికి, అగ్నికీ మృత్యుశబ్దము

సమానముగా ప్రయోగింపబడినా ఈ రెండింటికి సంబంధము కనిపించదు. "ఓ గౌతమా! ఈ లోకమే అగ్ని, ఆదిత్యుడే దీనికి సమిధ" (ఛాం.ఉ.V-4-1) అని అన్నపుడు ఈ లోకానికి అగ్ని స్వరూపము ప్రాప్తించనట్లు **మానస కల్పనామాత్రము వలన మనశ్చితాలకు కర్మాంగత్వము ప్రాప్తించదు.**

(బ్ర.సూ.III-3-45; శ.ప.బ్రా.X-5-2-3; బృ.ఉ.III-2-10; ఛాం.ఉ.V-4-1)

## (411) III-3-52

**సూ. పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబంధః**

**క్ర. పరేణ, చ, శబ్దస్య, తాద్విధ్యం, భూయస్త్వాత్, తు, అనుబంధః**

**ప్ర.అ.** పరేణ = **వేరు బ్రాహ్మణములవలె,** చ = **కూడ,** శబ్దస్య = **శ్రుతి యొక్క,** తాద్విధ్యం = **భావము కూడ అట్లే కలదు,** భూయస్త్వాత్ = **అనేకము వున్నందున,** తు = **ఇంకను,** అనుబంధః = **ఈ అనుబంధము**

**వి.** ఉత్తర బ్రాహ్మణమును బట్టి, పూర్వ బ్రాహ్మణమును బట్టి (పరేణ) మనశ్చితాదులను గూర్చి చెప్పే ఈ బ్రాహ్మణము (శతపథ) కూడా బ్రాహ్మణము అటువంటిదే. కేవలము విద్యా విధిత్వము కలదే. మానసికాగ్ని విద్యయందు సంపాదించదగిన కర్మాంగాలు అనేకము వున్నందున ఈ అనుబంధాన్ని చెప్పినారు. (శ.ప.బ్రా. V-5-2-3) ఈ మానసికాగ్ని బ్రహ్మణము తరువాత (పరేణ) వున్నది. "ఈ లోకమే ఈ అగ్నిశ్చిత్తు" (శ.ప.బ్రా. VI-10-5-4-1) అని, ఈ బ్రాహ్మణముకన్న ముందు (పూర్వము) వున్నది. "ఈ తపిస్తున్న మండలము" (శ.ప.బ్రా. VI-10-5-2-1) అని చెప్పటము వలన విద్యాప్రాధాన్యతయే కనిపిస్తున్నది. కావున మనశ్చితాదులకు కర్మాంగత్వము అసమంజసము, అవిస్పతంతము.

## 30. ఐకాత్మ్యాధికరణము (130)

## (412) III-3-53

**సూ. ఏక ఆత్మనః శరీరే భావాత్**

**క్ర. ఏకే, ఆత్మనః, శరీరే, భావాత్**

**ప్ర.అ.** ఏకే = **కొందరు,** ఆత్మనః = **ఆత్మకు,** శరీరే = **శరీరమున్నంత వరకే,** భావాత్ = **అస్తిత్వముండుట**

**వి.** కొందరు, చార్వాకులు మొదలైనవారు, శరీరమున్నంతవరకే ఆత్మ ధర్మములు వుండుట వలన, దేహముకన్న వేరైన ఆత్మ అనేది లేదు అని అంటారు. కావున శరీరమే ఆత్మ అని వారి వాదము. దానికి సమాధానము ఈ క్రింది సూత్రము.

వెనుకటి అధికరణములో మనశ్చితాది అగ్నులు స్వతంత్ర విద్యలై పురుషార్థహేతువలని నిరూపించబడినవి. దేహము కంటే వేరైన ఆత్మ అంటూ లేకపోతే బ్రహ్మప్రాప్తి ఎవరికి కలుగుతుంది? కావున, ఆత్మ అనేది వుండాలి. అయితే ఆత్మ శరీరము కంటే భిన్నమైనదా, కాదా? ఆ పురుషుడు ఎవరు? అనే దాని విచారణ ఈ సూత్రములో మొదలు అవుతుంది.

## (413) III-3-54

**సూ. వ్యతిరేకస్తద్భావాభావిత్వాన్న తూపలబ్ధివత్**

**క్ర. వ్యతిరేకః, తద్భావాభావిత్వాత్, న, తు, ఉపలబ్ధివత్**

ప్ర.అ. వ్యతిరేకః = **భిన్నమైనది,** తద్భావభావిత్వాత్ = **శరీరమున్నను దానియందు ఆత్మవుండపోవటము చూస్తున్నాము కనుక (దేహము మరణించినపుడు), అందుచేత,** న = **ఆత్మ శరీరము కాదు,** తు = **అయితే,** ఉపలబ్ధివత్ = **ఆత్మయే జ్ఞాతరూపమున శరీరంలో ఉపలబ్ధి అవుతున్నట్లు?**

వి. ఆత్మశరీరము నుండి భిన్నము, వేరు. ఎందుకంటే దేహమున్నను ఆత్మ చైతన్యము వుండకపోవటము చూస్తున్నాము. మరణము తరువాత శరీరము వుంటుంది. కాని చైతన్యము వుండదు. ఆత్మవున్నప్పుడు చైతన్యము వుంటుంది. ఆత్మలేనపుడు చైతన్యము వుండదు. శరీరములో ఆత్మవున్నపుడు చైతన్యము వుంటుంది. కావున శరీరము ఆత్మకాదు. ఆత్మశరీరము కాదు. ఆత్మ వున్నప్పుడు జ్ఞానము వుంటుంది. ఆత్మయే జ్ఞాతరూపమున శరీరములో ఉపలబ్ది అవుతున్నది. ఆత్మయే తెలిసికొనవలసినది, జ్ఞేయము. శరీరములో ఆత్మయే జ్ఞాత. జ్ఞాత, జ్ఞేయము అయినా ఆత్మ శరీరము కన్న భిన్నము.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ చ" (కఠ.ఉ. I-3-3) "తెలియు ఆత్మనురథికుండు అనుచు, తెలియు శరీరమును రథము అనుచు" రథము, రథికుడులాగ శరీరము ఆత్మవేరు. రథములో రథికుడు ఉపలబ్ధి అయినపుడు రథము నడుస్తుంది.(కఠ.ఉ. I-3-3)

## 31. అంగావబద్ధాధికరణము (131)

## (414) III-3-55

**సూ. అంగావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్**

**క్ర. అంగావబద్ధాః, తు, న, శాఖాసు, హి, ప్రతివేదమ్**

ప్ర.అ. అంగావబద్ధాః = **యజ్ఞమందలి ఉద్గీథాది లింగముల చేత సంబద్ధములైన ఉపాసనలు,** న = **అనరాదు,** శాఖాసు హి = **ఏ శాఖలలో చెప్పబడినవో ఆ శాఖలయందే ఆచరించుటకు యోగ్యములు,** తు = **అయితే,** ప్రతివేదమ్ = **ఇతర శాఖలవారు కూడ వానిననుష్ఠానము చేయవచ్చును.**

వి. "ఓ మిత్యే కాక్షర ముద్గీథ ముపాసీత" - (ఛాం.ఉ. I-1-1) "ఓం అను ఏకాక్షరమును ఉద్గీథరూపమున ఉపాసన చేయవలయును."

"లోకేషు పంచవిధం సామోపాసీత" (ఛాం.ఉ.I-2-1) "పంచవిధములైన సామమును లోకముల సంబంధమును కలిపి ఉపాసించవలెను." **ఈ ప్రకారముల యజ్ఞాది అంగముల ఉద్గీథాదులతో సంబంధము కలవారు ఏ ప్రతీకోపాసన చెప్పినారో, దానికి ఏ ఏశాఖయందు వర్ణనకలదో ఆ**

**శాఖవారు అనుష్ఠానము చేయవలెను. అన్యశాఖలవారు చేయరాదు, చేయవలసిన అవసరము లేదు అని లేదు. ప్రతిశాఖవారు దీనిని అనుష్ఠానము చేయవచ్చును.**

**[నారాయణ వాక్యము :**

శాఖలకు అనుష్ఠానములు వున్నవి. అనుష్ఠానములకు శాఖలు లేవు. మతములకు ప్రార్థనలు వున్నాయి. ప్రార్థనలకు మతములు లేవు. అనుష్ఠానములు సర్వజన ఉపాసనా యోగ్యము. తమశాఖ అనుష్ఠానములు నేర్చుకొని, తెలిసికొని చేసి తమకు అనుకూలమైన ఇతర శాఖల వానిని, ప్రేరణనిచ్చు వానిని అనుస్ఠానము చేయటము ఉత్తమము. ఓంకారము, గాయత్రి మంత్రము ఉపాసన సర్వజన సమ్మతము. సర్వజనహితము. మతములకు ప్రార్థనలు వున్నాయి. ప్రార్థనలకు మతము లేదు.]

(ఛాం.ఉ. I-1-1, I-2-1)

## (415) III-3-56

సూ. **మంత్రాదివ ద్వాఽ విరోధః**

క్ర. **మంత్రాదివత్, వా, అవిరోధః**

ప్ర.అ. మంత్రాదివత్ =**ఒక శాఖయందు చెప్పబడిన మంత్రము మఱియొక చోట గ్రహింపబడుచున్నది. ఆ విధముగనే,** అవిరోధః=**ఒక శాఖయందలి యుద్గీథము, మఱియొక శాఖయందలి యుద్గీథములయందు ప్రాప్తించుట విరోధము కాదు.**

వి. ఒక శాఖయందు చూపబడిన మంత్రము, యజ్ఞోపయోగమైన అన్యపదార్థమును ఇంకొక శాఖవారు కూడ వ్యవహారము గ్రహించినట్లు కలదు. కావున ఇందు ఏ విరోధమును లేదు.

## 32. భూమజ్యాయస్త్వాధికరణము (132)

## (416) III-3-57

సూ. **భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథా హి దర్శయతి**

క్ర. **భూమ్నః, క్రతువత్, జ్యాయస్త్వం తథా హి దర్శయతి**

ప్ర.అ. భూమ్నః = **పూర్ణోపాసన,** క్రతువత్ = **క్రతువువలె,** జ్యాయస్త్వమ్ = **శ్రేష్ఠము,** తథా = **అట్లు,** హి = **ఎందుకనగా,** దర్శయతి = **శ్రుతి చెప్పుచున్నది**

వి. ప్రాచీనశాలుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, శర్కరాక్ష్యుడు, బుడిలుడు అను ఋషులు, ఉద్దాలక ఆరుణి మునితో కలిసి కేకయరాజగు అశ్వపతి మహారాజు వద్దకు వెళ్ళి వైశ్వానర విద్యను తెలుపుమని కోరిరి. (ఛాం.ఉ.V-11-17) అశ్వపతి మహారాజు వారిని ఒకరి తరువాత ఒకరిని వారు వైశ్వనరాత్మను ఏవిధముగా ఉపాసించుతున్నారో చెప్పమంటే వారు ఆరుగురు వరసగా తాము **వైశ్వనరాత్మను ద్యులోకమును, సూర్యుని, వాయుదేవుని, ఆకాశమును, జలమును, భూమిని వైశ్వానరాత్మగా ఉపాసించుచున్నాము అని చెప్పినారు. అపుడు కేకయరాజు ఇలా అన్నాడు. 'మీరు**

**వ్యష్టిగా, భాగములుగా వైశ్వనరాత్మను ఉపాసించుచున్నారు. వైశ్వానరాత్మను సమష్ఠిగా, సమగ్రముగా పూర్ణముగా ఉపాసించాలి. ఆ వైశ్వనరాత్మకు ద్యులోకము శిరస్సు, సూర్యుడు-నేత్రము, వాయువు-ప్రాణము, ఆకాశము-శరీరము, జలము బస్తి (కడుపు) మరియు భూమి అతని పాదములు.** వ్యష్టి ఉపాసన కన్న సమిష్టి ఉపాసన సంపూర్ణము, శ్రేయము మరియు శ్రేయస్కరము. కావున పూర్ణోపాసనశ్రేష్ఠము.

(ఛాం.ఉ. V-11 నుండి V-24 వరకు) (బ్ర.సూ. (55) I-2-24 చూడగలరు.)

## 33. శబ్దాదిభేదాధికరణము (133)

## (417) III-3-58

సూ. నానా శబ్దాదిభేదాత్

క్ర. నానా శబ్దాది భేదాత్

ప్ర.అ. నానా = **అన్ని విద్యలు వేరువేరుగా కనిపిస్తున్నాయి,** శబ్దాది భేదాత్ = **శబ్దాదులు భేదించుట వలన**

వి. విద్యలు ఎన్నియో వున్నవి. సర్వవిద్య, భూమవిద్య, ఉపకోసల విద్య, శాండిల్య విద్య, వైశ్వానరవిద్య, ఆనందమయవిద్య, అక్షర విద్య మొదలైనవి భిన్నభిన్ననామములు, భిన్నభిన్న విధానములు కలవి. **అధికారమును బట్టి ఒకొక్క విద్య ఉపయుక్తమగుచున్నది. (బ్రహ్మవిద్యలు-ఉపాసనలు, పుట 514 చూడగలరు.) కాని అన్ని విద్యలకు ఫలము బ్రహ్మప్రాప్తియే. అయితే విద్యలు ఒక్కటి కాక నానా ప్రకారముగా వున్నవి. పూర్వ సూత్రములో అంగములన్నింటిని కలిపి ఒక విద్యనుపాసించుట శ్రేష్ఠము అని తెలిసికొన్నాము. విద్యలన్నియు బ్రహ్మప్రాప్తికై ఉపాస్యములైననూ అన్నింటిని కలుపుట, అన్నింటితో ఉపాసించుట అసాధ్యము. ఏ విద్యకా విద్యను పూర్ణముగా ఉపాసించుట పరమ శ్రేష్ఠము. ఒక విద్య అయినాగాని పూర్ణముగా పూర్ణసాధనలో ఉపాసించుట, అనుభూతినందుట సాధ్యము, యోగ్యము, ఉత్తమము మరియు బ్రహ్మానుభూతి మార్గము.**

**[నారాయణ వాక్యము :**
**ఎన్ని ఉపాసనలు చేశామనేది ముఖ్యము. ఎలా ఉపాసన చేశామనేది చాలా ముఖ్యము. ఏ ఉపాసన అయినా సంపూర్ణముగా, శుద్ధముగా, పూర్ణదేహమనోబుద్ధి ఆత్మానుసంధానముతో చేస్తే పరమాత్మానుభూతి అవుతుంది. వడోదరపురము నుండి భాగ్యనగరము కనీసము ఆరు తోవలతో పోవచ్చును. ఏ త్రోవ అయినా సురక్షితము. చక్కగా ప్రమాదములు లేకుండా మెల్లగా కాకుండా, దురుసుగా కాకుండా ఆనందముగా అనుకూలమైన మార్గములో వెళ్ళటమే ఉత్తమము.]**

## 34. వికల్పాధికరణము (134)

## (418) III-3-59

సూ. వికల్పోఽ విశిష్టఫలత్వాత్

క్ర. వికల్పః , విశిష్టఫలత్వాత్

ప్ర.అ. వికల్పః = **దేనికి దానిని వేరుగా అనుష్ఠించుటయే ఉచితము,** అవశిష్టఫలత్వాత్ = **సమస్త విద్యలకు ఫలమోకటే అయినపుడు.**

వి. **సగుణ విద్యలకు వికల్పమే, వేరువేరుగా చేయటమే యుక్తము. ఎందుకంటే వేద్య వస్తువు యొక్క సాక్షాత్కార రూపమైన ఫలము ఒకే ఫలమువున్నది కనుక.**

**శాండిల్యాది విద్యలకు ఉపాసనా దేవతా సాక్షాత్కారమే ఫలము. ఒకే విద్య వలన సాక్షాత్కరము కలుగుతున్నపడు అదే ఫలము కొరకు ఇంకొక ఉపాసన అనవసరము కదా. విరుద్ధమైన ఉపాస్యసాక్షాత్కారము ఒకే సమయములో జరుగదు.**

**[నారాయణ వాక్యము :**
**తెలిసిన తోవ, కౌశల్యమున్న తోవ మంచి తోవ.]**

## 35. కామ్యాధికరణము (135)

## (419) III-3-60

**సూ. కామ్యాస్తు యథాకామం సముచ్చీయేరన్న వా పూర్వహేత్వభావాత్**

**క్ర. కామ్యాః తు యథాకామం సముచ్చీయేరన్ న వా పూర్వహేత్వభావాత్.**

ప్ర.అ. కామ్యా=**సకామోపాసనలు, అనుష్ఠానములు,** తు=**అయితే,** యథాకామం=**తమ తమ కామముల,** సముచ్చీయేరన్= **సముచ్చయము చేసి ఆచరించవలయును,** వా=**కాకున్న వేరువేరుగా కూడ ఆచరించవచ్చును,** పూర్వహేతుత్వ భావాత్=**పూర్వము చెప్పబడిన సమానఫలమనే హేతువు ఇచ్చట లేదు కనుక.**

వి. **సకామోపాసనల యందు** అన్నింటికి ఒకే ఫలము చెప్పబడలేదు. భిన్నమైన ఉపాసనలకు భిన్నమైన ఫలములు చెప్పబడినవి. ఆ ప్రకారము, ఇంతకు ముందువలె ఫలము ఒకటి కానపుడు సకామోపాసనల అనుష్ఠానమునకు అధికారియైన వ్యక్తి తన కామములననుసరించి ఏది అవశ్యకమని తలచునో దానిని చేయవచ్చును. **ఏ ఫలమునకు కామనవుండునో దానికి చెప్పబడిన సమస్త ఉపాసనలను సముచ్చయము చేసి అనుష్ఠానము చేయవచ్చును లేక వేరువేరుగా చేయవచ్చును. యథాయోగ్యము, యధానుకూలము తథా ఉపాసనము సమంజసము.**

## 36. యథాశ్రయభావాధికరణము (136)

## (420) III-3-61

**సూ. అంగేషు యథాశ్రయభావః**

**క్ర. అంగేషు యథాశ్రయభావః.**

ప్ర.అ. అంగేషు=**ఉపాసనలోని భిన్న భావమును తెలిసినవాడు,** యథాశ్రయభావః=**ఏ ఉపాసన ఏ అంశము నాశ్రయించినదో, ఆ అంగముననుసరించి ఆ ఉపాసనా భావము నెరిగి అనుష్ఠింప వలయును.**

వి. వెనుక చెప్పబడిన ప్రతీకోపాసన లౌకికము, వైదికము అని రెండు రకములు. లౌకికోపాసనలు ఇష్టమైన రీతి, అనుకూలమైన రీతి ఆచరించవచ్చునని ఇంతకుముందు తెలిసికొనినాము. వైదికము లైనట్టి ఉద్గీధాదులందలి ఆశ్రిత విద్యలు సముచ్చయముగా కలిపి అనుష్ఠించాలా? లేక ఇష్టముగా వచ్చినట్లు అనుష్ఠించాలా? అనే ప్రశ్న వస్తుంది. కలిపి అనుష్ఠిస్తే ఫలబాహుళ్యము వుంటుంది. వేరువేరుగా చేస్తే సౌకర్యము వుంటుంది.

ఈ సూత్రములలో (బ్ర.సూ.III-3-61 నుండి III-3-64 వరకు) ప్రతివాదము. 65 మరియు 66 సిద్ధాంతము

**కర్మాంగాలైన ఉద్గీథము మొదలైన ఆశ్రిత ఉపాసనలలో సముచ్చయము (కలిపి చేయటము) వలన అనుష్ఠాన నియమము వుంటుంది, క్రతువులలో వాటిని ఆశ్రయించి వున్న కర్మాంగాలను చేయవలసిన నియమము వున్నట్లు.**

**కర్మాంగాలకు దాని ఆశ్రిత ఉపాసనలకు ఒకే నియమము వర్తిస్తుంది. అంటే ఉపాసకులకు, వాటి ఆశ్రయాలైన ఉద్గీథాలవలె సముచ్చయము గానే అనుష్ఠించాలి అని నియమము (ఇది ప్రతివాదము)**

(బ్ర.సూ.III-3-61 నుండి III-3-64 వరకు)

## (421) III-3-62

**సూ. శిష్టేశ్చ**

**క్ర. శిష్టేః, చ**

ప్ర.అ. శిష్టేః = **శ్రుతిశాసనము వలన, చ=అది సిద్ధియును**

వి. ఆశ్రయాన్ని అనుసరించి చెప్పబడినందువలన వాటిని సముచ్చయముగా గ్రహించవలెను. కర్మాంగాలకు వాటిని ఆశ్రయించిన ఉపాసనలకు వేదములు విధాన భేదము ఉపదేశించవు కావున **కర్మాంగాలకువలెనె ఉపాసనలకు కూడా సముచ్చయానుష్ఠానమే అని భావము.**
**(ప్రతివాదము కొనసాగుతుంది.)**

## (422) III-3-63

**సూ. సమాహారాత్**

**క్ర. సమాహారాత్**

ప్ర.అ. సమాహారాత్ = **సమాహారము (పొరపాట్లు, లోకువలు సరిచేయుట, నింపుట వలన)**

వి. "స్వరముల వ్యంజనముల మొదలైన వాని దోషముల వల దుష్టమైన ఉద్గీధాన్ని ఉద్గాత హోతృకర్మముతో, ఐక్యధ్యానముతో సంస్కరిస్తున్నాడు. దాని వలన ఋగ్వేదములో చెప్పబడిన ఓంకారానికి, సామవేదములో చెప్పబడిన ఉద్గీథమునకు ధ్యానైక్యము చెప్పబడినది.

"అథఖలు య ఉద్గీథస్సప్రణవోః, యః ప్రణవస్య ఉద్గీథః", ఇతి హోతృష దనాద్ధైవాపి దురుద్గీథ మనుసమాహరతీతి" (ఛాం.ఉ.I-5-5)

"ఇపుడు ఉద్గీథగానమే ప్రణవము. ప్రణవమే ఉద్గీథగానము. ఈ రీతిగాభావించి గానము చేసిన, తప్పులు దొర్లిన కూడ హోతవచ్చి సరిచేయును". **ఈ విధముగా కర్మాంగాలైన ఉపాసనలన్నింటికి ఏ వేదములో వున్నా, ఉపసంహారనియమము వున్నది. (ఇదీ ప్రతివాదమే)**
(ఛాం.ఉ.I-5-5)

## (423) III-3-64

సూ. **గుణసాధారణ్యశ్రుతేశ్చ**

క్ర. **గుణసాధారణ్యశ్రుతే చ.**

ప్ర.అ. గుణసాధారణ్య= **గుణముల సాధారణ చెప్పు శ్రుతి వలన,** చ= **కూడ**

వి. **ఉపాసనలకు ఆశ్రయమైన ప్రణవము అన్ని వేదాలకు సాధారణమే అనే శ్రుతి ఉన్నది కావున, దానిని ఆశ్రయించిన ఉపాసనలకు కూడా సముచ్చయానుష్ఠానము సిద్ధిస్తుంది. (కలిపి అనుష్ఠానము చేయుటము).**

**"తే నేయం త్రయీ** విద్యా వర్తతే,

"ఓం ఇతి ఆశ్రావయతి, ఓం ఇతి శగ్ంసతి,

ఓం ఇతి ఉద్గాయతి" - (ఛాం.ఉ. I-1-9).

"ఓం అని అధ్వర్యు శ్రవణము చేస్తున్నాడు.

ఓం అని హోత శంసనము చేస్తున్నాడు.

ఓం అని ఉద్గాత గానము చేస్తున్నాడు."

(అధ్వర్యు ఓం అని ఆజ్ఞ ఇస్తున్నాడు - ఋగ్వేదము

హోత ఓం అని మంత్రము వల్లిస్తున్నాడు - యజుర్వేదము

ఉద్గాత ఓం అని పాడుతున్నాడు - సామవేదము)

"ఏతస్య ఏతాక్షరస్య అపచిత్యై మహిమ్నా రసేన"

"ఈ అక్షరము మహిమ వలననే సర్వ కర్మలు ప్రవర్తిల్లుచున్నవి". **దీని వలన ప్రణవము ఒకటే అన్నిటికి ఆశ్రయము అని తెలుస్తున్నది. కావున ఆశ్రితమైన ఉపాసనలకు సముచ్చయానుష్ఠానమే అని ప్రతివాదము (దీనికి సమాధానము ఈ దిగువ రెండు సూత్రాలలో చెప్పుచున్నారు).**
(ఛాం.ఉ. I-1-9)

## (424) III-3-65

సూ. **న వా తత్సహభావాశ్రుతేః**

క్ర. **న వా తత్సహభావాశ్రుతేః**

ప్ర.అ. న= **కాదు,** వా=**అయితే,** భావాశ్రుతేః = **ఉపాసనల సముచ్చయము చెప్పు శ్రుతి లేదు కనుక ఉపాసనల సముచ్చయము సిద్ధింపజాలదు.**

వి. **ఆశ్రయానికి, ఆశ్రితానికి సహభావాన్ని చెప్పే శ్రుతి లేదు కనుక సముచ్చయానుష్ఠానము కుదరదు. అన్నీ కలపటము యుక్తము గాదు. మూడు వేదముల విహితమైన అంగములకు సహభావము వున్నది. ఆశ్రయాలకు సహభావాన్ని చెప్పే శ్రుతి లేదు. క్రతువునందలి అంగాలతో, ఉపాసనలు నిత్య సంబంధాలు కలవికావు. ఉపాసనలను అనుష్ఠించవచ్చు లేదా మానవచ్చు.**

**[నారాయణ వాక్యము :**
**"కర్మ నిర్దుష్టము, ఉపాసన స్వానుసంకల్పానుకూలము. కర్మానుష్ఠానము చెప్పినది చేయటము. ఉపాసనానుష్ఠానము భావించినది చేయటము. కర్మానుష్ఠానము సాధన. ఉపాసనానుష్ఠానము భావన"]**

**[నారాయణ భావము :**
**కర్మానుష్ఠానము సాధన, ఉపాసనానుష్ఠానము భావన, సత్యానుష్టానము చింతన, ధర్మానుష్ఠానము చేతన.]**

---

## (425) III-3-66

**సూ. దర్శనాచ్చ**

**క్ర. దర్శనాత్ చ**

**ప్ర.అ.** దర్శనాత్=శ్రుతి **యందు చూడబడినది,** చ= **కావున ఉపాసనలకు సహభావము లేదు.**

**వి.** "ఏవం విద్ధ వై బ్రహ్మ యజ్ఞం
యజమానగ్ం సర్వాగ్ంశ్చ
ఋత్విజో అభిరక్షతి" (ఛాం.ఉ.IV-17-10)
"ఈ విధముగ తెలుసుకొన్న
బ్రహ్మ ఋత్విక్కు యజ్ఞమును,
యజమానిని, ఇతర ఋత్విక్కులను
అన్ని విధములగ కాపాడుచున్నాడు"

ఈ శ్రుతి వలన ఉపాసనలలో సహభావము లేదు అని తెలుస్తున్నది. అందరూ అన్నీ తెలిసినవారు అయితే బ్రహ్మ వారిని రక్షించే అవసరము వుండదు. **కావున ఉపాసనలు స్వతంత్రము, సముచ్చయానుష్ఠానము కాక వేరుగా చేసుకొనవచ్చును**
(ఛాం.ఉ.IV-17-10)

బ్రహ్మఋత్విక్కు ముఖ్య ఋత్వికుడు. ఆయన అందరికీ, యజమానికి, ఋత్వికులకు నేత. అందరినీ కాపాడటమే నేతృత్వము.
ఎక్కడ ఏ పొరపాటు జరిగినా, లోకువ కలిగినా, ఎక్కువ తక్కువలు ఐనా అన్నిటినీ సరి చేసి కార్యమును, యజమానిని, సహా యోగులను, తనను తాను రక్షంచుకొనే బాధ్యత నాయకునిదే. అందుకే, "యతోతతో ఆవర్తతే తత్తద్గచ్ఛతి ఏవం విత్హవై, బ్రహ్మ, యజ్ఞం, యజమానం, సర్వాంశ్చ, ఋత్విజోஉభిరక్షతి" (ఛాం.ఉ.IV-17-10

"యజ్ఞములో ఎక్కడ కష్టము కలిగినను బ్రహ్మ ఋత్విక్కు అక్కడికి వెళ్లును (పరిగెత్తును)"! రౌతును అశ్వము రక్షించు విధముగా బ్రహ్మ ఋత్విక్కు మాత్రమే యజ్ఞములో ఋత్విక్కులందరినీ కాపాడు చుండును"

[**నారాయణ వాక్యము :** అంటే అశ్వము సారథిని, రథమును, రథికుని, సహ రధికులను కాపాడిన విధము నాయకుడు యజమానిని, సంస్థను, సహయోగులను, సహచురులను, యోగదానము చేయు వారలను, యోగదాన ప్రక్రియను కాపాడవలెను. అందరిని, అన్నిటిని, అన్ని వేళల, అన్ని విధముల కాపాడుటయే నేతృత్వము. ప్రతి బ్రహ్మ ఋత్విక్కు, ప్రతి గురువు, ప్రతి నాయకుడు, ప్రతి మహాజనుడు చేయవలసినది సర్వరక్షణ, సర్వపాలన, సర్వసంతోషము, సర్వశాంతి.]

ఇట్లు

**తృతీయాధ్యాయ తృతీయ పాదము**



# తృతీయాధ్యాయ తృతీయపాద సమాసము

## అంతరంగ సాధన

**1. సర్వవేదాంత ప్రత్యాయాధికరణము :**

అన్ని ఉపనిషత్తులు బ్రహ్మమును లక్ష్యముగా బోధించినవి. అన్ని శ్రుతులు బ్రహ్మమును ఉద్దేశ్యము చేసినవే. వానిలో చెప్పబడిన ఉపాసనలు, విద్యలు భిన్నము కావు. అన్నింటి ఉద్దేశ్యములు, విధానములు, ఫలములు అభిన్నములు. వివిధ ఉపనిషత్తులు బ్రహ్మమును గూర్చి చెప్పుచున్నవి. బ్రహ్మము తెలుసుకొనదగినదని, సర్వజ్ఞానలక్షణమని ఏకగ్రీవముగా చెప్పుచున్నవి.

**2. ఉపసంహారాధికరణము :**

ఒక శాఖలో చెప్పబడిన ఉపాసనలను, విద్యలను ఇతర శాఖలలోనికి ఉపసంహారము, గ్రహించటము చేయవచ్చును. తమ శాఖలలో చెప్పబడిన గుణములు ఉపకారము చేసినట్లు వేరుశాఖల గుణములు కూడ ఉపకారము చేయును. యోగ్యమైన ఉపాసనలు ఒకే శాఖకు పరిమితముకాక అన్నిశాఖలకు ఉపయోగము అగును.

**3. అన్యథాత్వాధికరణము :**

అన్ని ఉపనిషత్తులలో వేరు వేరు నామములతో భిన్నములైన బ్రహ్మవిద్యలు చూపబడినవి. దానిలో విధి, ఫలము, ఉద్దేశ్యము ఒకటి కావున అన్యథాత్వము లేదు.దానిలో ఏకతను చూడవచ్చును.

**4. వ్యాప్త్యధికరణము :**

ఓంకారము మూడు వేదములందంతట వ్యాప్తిచెంది యున్నది. అదే విధముగ పరబ్రహ్మ, సర్వవ్యాపకత్వము కలిగిన పరమసత్యము. అన్ని ఉపనిషత్తులు పరమాత్మ యొక్క సర్వవ్యాపకత్వము, సర్వశక్తిమత్త్వము, సర్వజ్ఞత ప్రతిపాదించినవి. పరబ్రహ్మ ప్రాప్తియే సర్వవిద్యల లక్ష్యము, ఉద్దేశ్యము, గమ్యము అనటయే సమంజసము.

**5. సర్వాభేదాధికరణము :**

మూడు వేదములలో చెప్పబడిన ప్రాణవిద్యలు భిన్నము కావు. ఉపాస్యరూపములో ఏకత్వము, ప్రాణసంవాదములో సాదృశ్యము వున్నాయి. కావున ప్రాణవిద్య అన్ని శాఖలలోనూ సమానము.

**6. ఆనందాద్యధికరణము :**

ఆనందాది సర్వగుణ సంపన్నమైన బ్రహ్మము సర్వదా, సర్వత్ర వున్నది. ఆనందాది లక్షణములు బ్రహ్మమునకు స్వాభావికములు. రూపకల్పనలు అర్థమగుటకే కాని బ్రహ్మమునకు స్వాభావికములు కావు. పరబ్రహ్మతత్త్వము అన్ని రూపములకు మించినది. పరబ్రహ్మము పరాత్పరము.

**7. ఆధ్యానాధికరణము :**

పరబ్రహ్మము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లేనిదియును, అవ్యయము ఐనదియును, మహత్తునకు పరమైనదియును, ఆద్యంతములు లేనిదియును, నిత్యమైనదియును అయి వున్నది. అట్టి పరబ్రహ్మమును చక్కగ చింతనచేసి, చిత్తమును సంలగ్నము చేసి తెలిసికొనినవాడు మృత్యుముఖము నుండి పూర్తిగా విడువబడును.

**8. ఆత్మగృహీత్యధికరణము :**

బ్రహ్మమే ఆత్మ. ఆత్మయే సత్తు. సత్తే ఆత్మ. ఆత్మయే బ్రహ్మము. బ్రహ్మము, ఆత్మ, ఆనందము, సత్తు మరియు జగత్కారణము ఒకటియే.

**9. కార్యాఖ్యానాధికరణము :**

ఆచమనము చేయటము, అన్నముపై ఉదకమును చల్లటము అనేవి అన్నమునకు వస్త్రము సమర్పించటము. అన్నమయకోశము నుండి ఆనందమయకోశము వరకు పరబ్రహ్మచైతన్య స్థానములు. ఎవరికి సత్యము, జ్ఞానము, అనంతము అను లక్షణములు చెప్పబడినవో, ఏ ఆత్మ ఆనందమయముగా చెప్పబడినదో, ఆ బ్రహ్మమునకు ఈ జగత్తు మరియు అన్నమయ కోశము నుండి విజ్ఞానమయకోశము వరకు గల కార్యములు. ఆ బ్రహ్మమే అందరికీ అంతరాత్మ.

**10. సమానాధికరణము :**

శతపథబ్రాహ్మణములోని శాండిల్యవిద్య మరియు బృహదారణ్యకములోని శాండిల్యవిద్య రెండు, ఒకటే అయిన మనోమయుడు, ప్రాణశరీరుడు, ఆకాశరూపుడు అయిన బ్రహ్మమునే ఉపాసించుచున్నవి. శతపథ బ్రాహ్మణములోని శాండిల్యవిద్య విధి సహితము. బృహదారణ్యక ఉపనిషత్తులోని శాండిల్యవిద్య పునరుక్తము, అనువాదము. రెండింటి లక్ష్యము పరబ్రహ్మమే.

**11. సంబంధాధికరణము :**

సూర్య మండలములో నున్న పురుషుని పేరు "అహః" మరియు అక్షిగోళములో నున్న పురుషుని పేరు "అహం", "అహః" అనుననది అధిదైవతము. "అహం" అనునది అధ్యాత్మికము. వారి స్థానములు పేర్లు, తత్త్వాలు వేరు కనుక వారిద్దరు వేరు వేరు మరియు వారి ఉపాసనలు కూడా వేరు వేరు.

**12. సంభృత్యధికరణము :**

అక్షరబ్రహ్మ యొక్క సర్వలోకములను భరించుట అనే "సంభృతి" లక్షణము మరియు ద్యులోకాది సర్వ బ్రహ్మాండములలో వ్యాపించుట అనే "వ్యాప్తి" లక్షణము అను రెండు గుణములు నేత్రాంతరవర్తియైన పురుషుని యందు గాని, సూర్యమండలవర్తియైన పురుషుని యందు గాని అన్వయించుటకు వీలుగాదు. అక్షరబ్రహ్మవిద్యా లక్షణములు శాండిల్య విద్యకు ఉపసంహరించ వీలుకాదు.

**13. పురుష విద్యాధికరణము :**

ఛాందోగ్యములోని తాండి-పైంగి పురుషవిద్య మరియు తైత్తరీయ ఆరణ్యకములోని పురుషవిద్య భిన్నములు. వాటికి పరస్పర ఉపసంహారము, అన్వయము లేదు. తాండిలో బ్రహ్మోపాసన, తైత్తరీయకములో బ్రహ్మవిద్యా ప్రశంసా వున్నాయి.

**14. వేధాద్యధికరణము :**

వేధ మొదలైన (హృదయాన్ని వేధించి, ధమనులను ఛేదించి) వానిలో అర్ధ భేదము వున్నందున వీటికి విద్యలలో, ఉపాసనలతో ఉపసంహారము లేదు. హృదయాన్ని వేదించటము మొదలైన మంత్రములకు లింగములను బట్టి అభిచారికకర్మలందు వినియోగము, ప్రవర్గ్యాదులకు అగ్నిష్టోమాది యాగములందు వినియోగము వున్నది. లింగ వాక్యములు-హేతువును చెప్పే వాక్యములు-సన్నిధి (సామిప్యం) కంటే బలవత్తరమైనవి. కాబట్టి వీటికి విద్యలయందు ఉపసంహారము లేదు.

**15. హాన్యధికరణము :**

"హాని" అంటే పుణ్య పాపములను వదలివేయటము, ఉపాయనము అంటే పుణ్యపాపములను గ్రహించుటము. ఉపనిషత్తులలో కొన్ని చోట్ల "హాని" గురించి చెప్పి, ఉపాయనము గురించి వదలి వేసినారు. మరికొన్ని చోట్ల "ఉపాయనము" గురించి చెప్పి, హాని గురించి చెప్పలేదు. ఉపాయనములు వున్నచోట హానులను, హానులు వున్నచోట ఉపాయనములను అధ్యాహారము (అన్వయము- స్వీకారము) చేయవచ్చును. సమాన విద్యలలో హాని, ఉపాయనముల దృష్టాంతములను యథాయోగ్యముగా అధ్యాహారము చేయవచ్చును.

**16. సాంపరాయాధికరణము :**

అన్నీ సుకృతదుష్కృతములు, జ్ఞానికి మరణ సమయములోనే వీడిపోతాయి. బ్రహ్మజ్ఞానులుకాని ఉపాసకులకు బ్రహ్మప్రాప్తి, దేహము వదలినతరువాత దేవయానమార్గములో జరుగుతుంది. వారికి జీవితకాలములో చేయబడిన అనుష్ఠానముల శక్తి వలన దేవయానములో పయనించేవానికి మార్గమధ్యములో బ్రహ్మప్రాప్తి కలుగుతుంది అని చెబితే ఉభయశాఖలకు విరోధం ఉండదు.

**17. గతేరర్థవత్త్వాధికరణము :**

సగుణోపాసన, నిర్గుణవిద్యాపద్ధతి అనే రెండు పద్ధతులలో సగుణోపాసనా పద్ధతిలో మాత్రమే దేవయానము వుంటుంది. నిర్గుణవిద్యాపద్ధతిలో దేవయానానికి తావు లేదు, అవసరము లేదు. అవిద్య నశించడంతోనే సాధకుడు పుణ్యపాపాలను వదలి తత్కాలమే, అపుడే బ్రహ్మమును పొందుతాడు. ఈ విధముగా 'బ్రహ్మవిదునకు తత్కాల బ్రహ్మప్రాప్తి' మరియు 'సగుణోపాసకులకు దేవయానములో బ్రహ్మ లోకమునకు చేరుట' అని రెండువిధములు కలవు. నిర్గుణ బ్రహ్మజ్ఞాన ద్రష్టకు బ్రహ్మలోకము ఇచ్చటనే యున్నది. సగుణ బ్రహ్మోపాసకులకు ఉపాసనా మార్గము-దేవయానమార్గము అవుతుంది. సాధకుని సంకల్పానుసారము ఉభయవిధముల ముక్తి లభించుకోవచ్చును.

నిర్గుణ బ్రహ్మవేత్తకు స్వరూపాన్ని పొందటానికి (జీవ-బ్రహ్మ ఐక్యము) మార్గము అవసరము లేదు. కావున దేవయానమార్గముయొక్క ప్రసక్తి వుండదు. సగుణ బ్రహ్మప్రాప్తికి దేవయానమార్గము. నిర్గుణ బ్రహ్మానుభవము ఒక స్థితి, బ్రాహ్మీస్థితి. అంతర్ముఖ సమారాధన, బహిర్ముఖసమారాధన అనేవి నిర్గుణ, సగుణ పద్ధతులు.

**18. అనియమాధికరణము :**

ప్రత్యేక విద్యలననుసరించి బ్రహ్మమునుపాసించువారు మాత్రమే దేవయాన మార్గమున బ్రహ్మలోకమునకు పోవుదురు అను నియమము లేదు. సగుణోపాసనయందు దేవయానము కొన్ని చోట్ల చెప్పబడినది, కొన్ని చోట్ల చెప్పబడలేదు. దేవయాన మార్గము కూడా కొన్ని చోట్ల చెప్పబడినది, కొన్ని చోట్ల చెప్పబడలేదు. అయితే అధ్యాహరము, అన్వయముల వలన దేవయాన మార్గము అన్ని రకముల ఉపాసనలకు వున్నది అనేది సమ్మతము, యుక్తియుక్తము. బ్రహ్మ విదులకు రావటము, పోవటము లేదు. బ్రహ్మవిదులు బ్రహ్మ స్థితులు మరియు బ్రహ్మ స్వరూపులు.

**19. యావదధికారాధికరణము :**

జ్ఞానులందరికి ఈ శరీరము విడిచిన తరువాత ముక్తి లభిస్తుందనే నియమము లేదు. కొందరు మహానులైన పురుషులు ఈశ్వరాజ్ఞచే లోకకళ్యాణము కోసము అధికారులై, బాధ్యతనీయబడి భువికి అవరోహణ చేస్తారు. ఆ అధికారము, భాధ్యత వున్నంతవరకు వారికి రాకపోకలు వుంటాయి. వారు ఇచ్ఛానుసారము శరీరములను స్వీకరించుటకు విస్తరించుటకు సమర్థులు. అటువంటి బ్రహ్మవేత్తలకు దేహసంబంధమైన లింగ శరీరములను వదలినంతటనే మోక్షము కలిగి బ్రహ్మత్వమునొందుతారు.

**20. అక్షరధ్యధికరణము :**

అక్షరబ్రహ్మమునకు సత్యము, జ్ఞానము, ఆనందములవలెనె అనంతము, అగ్రాహ్యము, అశబ్దము, అస్పర్శము, నిర్వికారమువంటి నిషేధవాక్యములు గూడా అన్ని చోట్ల అధ్యాహారము, అన్వయము చేసుకోవచ్చును.

**21. ఇయదధికరణము :**

ముండకము, కఠోపనిషత్తుల్లో చెప్పబడిన రెండుపక్షులు జీవాత్మ, పరమాత్మలు. ఈ రెండింటిలో చెప్పబడిన విద్యలు రెండూ ఒకటియే. జీవాత్మ పక్షి, పరమాత్మ పక్షిని చూడగానే ముక్తి చెందుతున్నది. అంటే బ్రహ్మదర్శనమే ముక్తి. అజ్ఞానము పోగానే జీవాత్మ, పరమాత్మ వెలుగు నీడలవలె ఒకటేనని తెలుస్తున్నది. నీడ పోగానే వెలుగే వుంటుంది. జీవాత్మ భోక్త. పరమాత్మ సాక్షి. జ్ఞానము కలుగగానే భోక్తా భావము మానిపోయి పరమాత్మ రూపము అవుతుంది.

**22. అంతరత్వాధికరణము :**

బృహదారణ్యకములో యాజ్ఞ్యవల్క్యుడు ఉషస్తికి చెప్పిన, మరల కహోలునికి చెప్పిన సర్వాంతర విద్యలు ఒకటియే. ప్రాణముల ప్రాణక్రియ చేయించు, కన్నులకు కనబడని, చెవులకువినబడని

సర్వాంతరుడు మరియు ఆకలి-దప్పులు, శోకము, మోహము, జరామృత్యువులకు అతీతుడైన అంతరాత్మ రెండూ, అన్ని భూతములందు సర్వాంతరుడైన, సర్వవ్యాపియైన, అందరియందు దాగివున్న దివ్యాత్మ ఒక్కరే.

**23. వ్యతిహారాధికరణము :**

"సర్వాంతరుడే నీయాత్మ, నీయాత్మయే సర్వాంతరుడు" అని అనటము వ్యతిహారము, పరస్పర వినిమయ క్రమము. యాజ్ఞవల్క్యుడు, బృహదారణ్యకములో ఉషస్తి, కహోలునికి ఈ విధముగా చెప్పటము, ఉపాసకునకు స్పష్టముగా ఏకత్వము చెప్పుటకొరకే. వ్యతిరేకముగా వ్యతిహారము చెప్పటము సత్యమును నొక్కి చెప్పటము.

**24. సత్యాద్యధికరణము :**

బృహదారణ్యకములో చెప్పబడిన లోకజయమును కలిగించే సత్యవిద్య మరియు పాపనాశనము కలిగించే సత్యవిద్య రెండూ ఒకటియే. బ్రహ్మమే సత్యము. ఆదిత్యుడు మరియు కుడికంటి యందలి పురుషుడు ఒకటియే.

**25. కామాద్యాధికరణము :**

ఛాందోగ్యపనిషత్తులో దహరాకాశము (హృదయాకాశము) లో వున్నట్లు చెప్పబడిన బ్రహ్మము. సత్యకామము సత్యసంకల్పము కలిగినది. బృహదారణ్యకములో హృదయాకాశములో శయనించే పురుషుడు (బ్రహ్మము) గొప్పది, పూజనీయము అని చెప్పబడినది. రెండింటిలోనూ హృదయమున ఆయతనముగా ఉపాస్యముగాను చెప్పబడిన బ్రహ్మము ఒకటే. ఛాందోగ్యోమున చెప్పబడినది, సగుణ విద్య, బృహదారణ్యకమున చెప్పబడినది. నిర్గుణవిద్య అయిననూ ఆయతనము, ఉపాస్యము ఒకటియే కావున ఈ రెండు విద్యలను అధ్యాహారము చేయవచ్చును.

**26. ఆదరాధికరణము :**

భోజనమును ఆదరించటము యుక్తము. భోజనము లేనపుడు ప్రాణాగ్నిహోత్రము కూడా వుండవలదు.

**27. తన్నిర్ధారణాధికరణము :**

కర్మఫలము లభించటానికి ఉపాసనలు అడ్డంకులు కావు. క్రతువు తన ఫలసిద్ధి కొరకు ఉపాసనను అపేక్షించదు. ఉపాసన అనేది క్రతువుకు కర్మాంగము కాదు. అది ఐచ్ఛికమే. ఓంకారోపాసన బ్రహ్మోపాసన. అది ఆత్మశుద్ధికి మార్గము కాని కర్మఫలము కర్మముపైనే ఆధారపడి వుంటుంది. కర్మాంగముగా ఓంకారోపాసన చేయాలని నిర్బంధము లేదు. కాని ఓంకారోపాసన చేయటము ఉత్కృష్టము, ఉత్తమము.

**28. ప్రదానాధికరణము :**

ప్రాణము, వాయువు రెండూ వేరువేరు. వాయువు దేవతల సంవర్గము. సంవర్గము అంటే మిగితా వాటిని లీనము చేసుకోవటము. వాయువు దేవతల సంవర్గము. ప్రాణము ఇంద్రియముల (ప్రాణముల) సంవర్గము.

వాయువు దేవతలలో శ్రేష్ఠము. ప్రాణము ఇంద్రియములలో శ్రేష్ఠము. వాయువు, ప్రాణములు వేరు వేరు. కావున వాటి విద్యలు వేరు వేరు. వాయువులో దేవతలసంవర్గము అధిదైవతము. ప్రాణములో ఇంద్రియములసంవర్గము అధ్యాత్మికము. గుణభేదము వలన వాయువు, ప్రాణము మరియు వాటి విద్యలు వేరు వేరు.

**29. లింగభూయస్త్వాధికరణము :**

అనేక లింగములు (గుర్తులు, సంకేతములు) వున్నందున వాజసనీయములో, అగ్నిరహస్యవిద్యలో చెప్పబడిన 36,000 (100X360-మనుజుని జీవితములో వున్న రోజులు) అగ్నులు మనశ్చితాలు, కర్మలకు, కర్మాంగములకు సంబంధించినవి కావు. ఉపాసనాపూర్వక స్వతంత్రములు. ప్రకరణము కంటే లింగము, లింగము కంటే శ్రుతి బలవత్తరము. "ఈ అగ్నులు విద్యా సంపాదితాలు" అని శ్రుతి అన్నందున అది విద్యాసంబంధము కలవి, కర్మ సంబంధము కలవికావు. కావున మనశ్చితాలకు (మానసికాగ్నులకు) కర్మాంగత్వము లేదు. అవి స్వతంత్ర ఉపాసనలు.

**30. ఐకాత్మ్యాధికరణము :**

ఆత్మ శరీరము కన్న భిన్నము, వేరు. మరణము తరువాత చైతన్యము (ఆత్మ) లేకున్నా శరీరము వుండటము చూస్తున్నాము. ఆత్మ శరీరము కాదు. శరీరము ఆత్మ కాదు. ఆత్మ శరీరములో ఉన్నపుడు జ్ఞానము వుంటుంది. ఆత్మయే జ్ఞాత రూపమున శరీరములో ఉపలబ్ధి అవుతున్నది. జ్ఞాత, జ్ఞేయము ఐన ఆత్మ శరీరము కన్న భిన్నము. రథములో రథికుడు ఉపలబ్ధి అయినపుడు రథము నడుస్తుంది. శరీరములో ఆత్మ ఉపలబ్ధి అయినపుడు శరీరమునడుస్తుంది.

**31. లింగావబద్ధాధికరణము :**

ఒక శాఖలో చెప్పబడిన ఉపాసనలను ఆశాఖవారే చేయవలయును, వేరు శాఖలవారు చేయరాదు అనేది సమంజసము కాదు. ప్రతి శాఖవారు, వేరు శాఖలవారి ఉపాసలను స్వీకరించవచ్చును. అనుష్ఠానములు సర్వజన ఉపాసనాయోగ్యములు (శాఖలకు అనుష్ఠానములు వున్నవి. అనుష్ఠానములకు శాఖలు లేవు. మతములకు ప్రార్థనలువున్నవి, ప్రార్థనలకు మతములు లేవు)

**32. భూమజ్యాయస్త్వాధికరణము :**

వైశ్వానరాత్మను సమష్ఠిగా, సమగ్రముగా, పూర్ణముగా ఉపాసించవలెను. ఆవైశ్వానరాత్మకు ద్యులోకము శిరస్సు, సూర్యుడు నేత్రము, వాయువు ప్రాణము, ఆకాశము శరీరము, జలము కడుపు మరియు భూమి పాదములు. వ్యష్టి ఉపాసనకన్న సమష్టి ఉపాసన (భూమ్నః క్రతువత్-క్రతువువలె) శ్రేష్ఠము.

**33. శబ్దాదిభేదాధికరణము :**

విద్యలు ఎన్నియో వున్నవి. అధికారమును బట్టి ఒక్కొక్క విద్య ఉపయుక్తమగుచున్నది. కాని

అన్ని విద్యలకు ఫలము బ్రహ్మ ప్రాప్తియే. అన్నింటిని కలుపుట, అన్నింటితో ఉపాసించుట అసాధ్యము. యోగ్యముకాదు. ఏ విద్యకావిద్యను పూర్ణముగా ఉపాసించుట మేలు. ఒక విద్య అయినాగాని పూర్ణముగా పూర్ణ సాధనతో ఉపాసించుట, అనుభూతినందుట సాధ్యము, యోగ్యము, ఉత్తమము మరియు బ్రహ్మానుభూతికి మంచిమార్గము.

**34. వికల్పాధికరణము :**

సగుణ విద్యలకు వికల్పమే, వేరువేరుగా సాధన, ఉపాసన చేయటమే యుక్తము. ఒకే విద్య వలన సాక్షాత్కారము కలుగుతున్నపుడు అదే ఫలము కొరకు ఇంకొక ఉపాసన అనవసరము. విరుద్ధమైన ఉపాస్య సాక్షాత్కారము ఒకే సమయములో జరుగదు.

**35. కామ్యాధికరణము :**

సకామోపాసనల అనుష్ఠానమునందు, అధికారియైన వ్యక్తి తన కామములననుసరించి ఏది అవశ్యకమని తలచునో దానిని చేయవచ్చును. ఏ ఫలమును కావాలని అనుకొనునో, దానికి చెప్పబడిన సమస్త ఉపాసనలను సముచ్చయము చేసి అనుష్ఠానము చేయవచ్చును.

**36. యథాశ్రయభావాధికరణము :**

లౌకికములైన ఉపాసనలు ఇష్టమైన రీతి, అనుకూలమైన రీతి ఆచరించవచ్చును. మూడు వేదములందు విహితములైన అంగములకు సహభావము ఉన్నది, ఓంకారమువలె. కాని కర్మలకు కర్మాంగాలకు (ఆశ్రయాలకు), ఉపాసనలకు (ఆశ్రితములకు) సహభావము చెప్పే శ్రుతి లేదు. క్రతువునందలి అంగాలతో, ఉపాసనలకు నిత్య సంబంధాలు కలవికావు. ఉపాసనలను అనుష్ఠించవచ్చు లేక మానవచ్చును. (కర్మనిర్దుష్టము, ఉపాసన స్వానుసంకల్పానుకూలము. కర్మానుష్ఠానము చెప్పినది చేయునది. ఉపాసనానుష్ఠానము భావించునదే చేయుటము. కర్మానుష్ఠానము నియమసాధన. ఉపాసనానుష్ఠానము స్వానుభావన.)

ఇట్లు

**తృతీయాధ్యాయ తృతీయ పాద సమాసము**

# తృతీయాధ్యాయ తృతీయపాద సారము

## అంతరంగ సాధన

దేనిని గూర్చి సర్వవేదాంతము, అన్ని ఉపనిషత్తులు లక్ష్యము చేసి ఉద్ధేశ్యము చేసి చెప్పినవో; మరియు దేనిని గూర్చి చెప్పిన విద్యలు భిన్నములు కావో; దేనిని గూర్చి ఒక శాఖలోని విద్యలు ఇంకొక శాఖలోనికి ఉపసంహారము చేయవచ్చునో; దేని గూర్చి వేరువేరు విద్యలలో అన్యధాత్త్వము లేదో; ఏది సర్వవ్యాపకత్వము, సర్వశక్తిమత్త్వత, సర్వజ్ఞత కలిగి సర్వవిద్యల లక్ష్యము- ఉద్దేశ్యము- గమ్యముయో, మూడు వేదములలో దేని గూర్చి చెప్పిన ప్రాణవిద్యలు భిన్నముకాక సమానమో; ఏది ఆనందాది సర్వగుణసంపన్నమై సర్వదా-సర్వత్ర వుండునదియో, దేనికి ఆనందాది లక్షణములు స్వాభావికమో; మరియు రూపకల్పనలు స్వాభావికముకాదో, శబ్ద-స్పర్శ-రూప-రసగంధాది గుణములు లేనిదై, ఆద్యంతములు లేనిదైన ఏ దానిని గూర్చి చింతనచేసి తెలిసికొనినవాడు మృత్యు ముఖమునుండి విడువబడునో; ఏది ఆత్మ-సత్తు మరియు జగత్కారణమో, అన్నమయకోశము నుండి ప్రాణమయకోశము వరకు అన్నికోశములు దేని చైతన్య స్థానములో మరియు ఉదకమనే వస్త్రము కప్పబడిన అన్నము దేని రూపమో, ఏది శతపథబ్రాహ్మణములోని శాండిల్యవిద్య మరియు బృహదారణ్యకములోని శాండిల్యవిద్య అనే రెండు విద్యలకు లక్ష్యమో; ఏది అధిదైవతముగా సూర్యమండలములో "అహః" అనే పురుషునిగా మరియు అధ్యాత్మికముగా అక్షి గోళములో "అహం" అనబడే పురుషునిగా వేరువేరు పేర్లతో వేరు స్థానములలో వేరువేరుగా ఉపాసన చేయబడుతున్నదో; దేని యొక్క సంభృతి అనే సర్వలోకములను భరించుట మరియు వ్యాప్తి అనే ద్యులోకాది సర్వబ్రహ్మాండములు వ్యాపించుట అనే గుణములు నేత్రాంతవర్తియైన పురుషునికి గాని సూర్యమండలవర్తియైన పురుషునికి గాని వర్తించవో; దేనిని గురించి చెప్పిన తాండి, పైంగి పురుషవిద్య మరియు తైత్తరీయ ఆరణ్యకములోని పురుషవిద్య భిన్నములో; దేని విద్యయందు హృదయాన్ని వేధించటము, ధమనులను ఛేదించటము అనే అభిచారిక కర్మలయందు వినియోగము వున్న మంత్రములకు ఉపసంహారము లేదో; దేనిని గూర్చిన సమాన విద్యలలో పుణ్య పాపముల హాని, ఉపాయనముల దృష్టాంతములను యధాయోగ్యముగా అధ్యాహారము చేయవచ్చునో; దేని జ్ఞానమందిన వారికి సుకృతదుష్కృతములు మరణ సమయములోనే వదిలిపోతాయో, దేని జ్ఞానమంది తెలిసినవారికి దాని తత్త్వాల ప్రాప్తి మరియు దేని సగుణోపాసన చేసిన వారికి దేవయానమార్గములో దాని లోకమునకు పోవుట అనునవి అగునో; దేనిని తెలిసినప్పుడు రాకపోకలు ఉండవో; అక్షరమైన దేనికి సత్యము, జ్ఞానము, ఆనందములవలెనె ఆనంతము, అగ్రాహ్యము అస్పర్శము, అశబ్దము, నిర్వికారము అనే నిషేధవాక్యములు అన్ని చోట్ల అధ్యాహారము చేసుకొనవచ్చునో; దేనిని గూర్చి ముండకములో, కాఠకములో రెండుపక్షులని-వెలుగునీడలని-పరమాత్మజీవాత్మలని గూర్చి చెప్పిన రెండువిద్యలూ ఒకటియో; ఏది సర్వ భూతములందు సర్వాంతరుడైన సర్వవ్యాపియో; ఏది ఆత్మయో మరియు ఆత్మ ఏదియో అనుచు వ్యతిరేకముగా వ్యతిహారముగా చెప్పబడుచుండునో, దేనిని గూర్చిన

లోకజయము కలిగించే సత్యవిద్య మరియు పాపనాశము చేసే సత్యవిద్య ఒకటియో మరియు ఏది సత్యమో-ఆదిత్యుడో-కుడికంటి యందలి పురుషుడో, ఏది ఛాందోగ్యములో దహరాకాశములోవున్న సత్యకామము మరియు సత్యసంకల్పము అని చెప్పబడిన పురుషుడుగా మరియు బృహదారణ్యకములో దహరాకాశములో వున్న గొప్పది మరియు పూజనీయము అని చెప్పబడిన పురుషుడుగా ఒకటియేనో; దేనిని గూర్చిన ప్రాణాగ్ని హోత్రము భోజనము లేనపుడు వుండదో; దేనిని గూర్చిన ఉపాసనములు క్రతువులకు కర్మాంగము కాదో మరియు ఏవి ఐచ్ఛికములో; దేనిని గూర్చిన ప్రాణవిద్యలలో వాయువు దేవతల సంవర్గమై అధిదైవతమో మరియు ప్రాణము ఇంద్రియముల సంవర్గమై ఆధ్యాత్మికమో మరియు ఆ రెండు విద్యలు వేరువేరో; దేని ఉపాసనాపూర్వకములైన 36,000 మనశ్చితాలు కర్మాంగత్వము లేని స్వతంత్ర ఉపాసనకు సంబంధించినవో; ఏది ఆత్మగా శరీరము నుండి భిన్నమో; దేని గురించి ఒక శాఖవారు చేసే ఉపాసన అన్ని శాఖల వారూ స్వీకరించవచ్చునో; దేనిని వైశ్వానరాత్మగా పూర్ణముగా ఉపాసించుట శ్రేష్ఠమో; దేని గురించి సగుణ విద్యలలో వికల్పముగా-వేరువేరుగా-ఉపాసించుటయే యుక్తమూ, దేనిని కామోపాసనలకు అధికారియైన వ్యక్తి ఏ ఫలమునకు కామన వుండునో దానికి సమస్త ఉపాసనలను సముచ్చయముగా చేసుకొనవచ్చునో; మరియు దేని గూర్చిన అనుష్ఠానము స్వానుభవభావనానుష్ఠానముయో; మరియు నియమసాధనమైన కర్మానుష్ఠానము కాదో; మరియు దేని అనుష్ఠానము స్వాను సంకల్పానుకూలమో అదియే బ్రహ్మము.

ఇట్లు

**తృతీయాధ్యాయ తృతీయపాద సారము**



## III-4

# తృతీయ అధ్యాయము - చతుర్థ పాదము

## బహిరంగ సాదన

### (1) పురుషార్థాధికరణము (137) (ఈశ విద్య) (శ్రీమన్-న్యాస విద్య)

### (426) III-4-1

**సూ. పురుషార్థో౽ త శ్శబ్దాదితి బాదరాయణః**

**పురుషార్థః, అతః, శబ్దాత్, ఇతి, బాదరాయణః**

క్ర. పురుషార్థః = **మోక్షపురుషార్థము యొక్క సిద్ధి,** అతః = **ఈ బ్రహ్మ జ్ఞానము వలన కలుగును,** శబ్దాత్ = **శ్రుతివచనముల వలన,** ఇతి = **అని,** బాదరాయణః = **బాదరాయణుడు చెప్పుచున్నాడు.**

**ప్ర.అ. ఉపనిషత్తులలో చెప్పబడిన స్వతంత్రమైన ఆత్మజ్ఞానము వలననే పురుషార్థము, మోక్షము లభిస్తుందని బాదరాయణ మహర్షి అభిమతము. ఎందుకంటే శ్రుతిలో ఛాందోగ్యోపనిషత్తులో "తరతి శోకమాత్మవిత్" -** (ఛాం.ఉ.VII-1-3)

వి. **"ఆత్మజ్ఞాని శోకము నుండి తరిస్తున్నాడు" అని నారదుడు సనత్కుమారునితో అన్నాడు.**

"స యో హ వై త త్పరమం బ్రహ్మవేద, బ్రహ్మైవ భవతి" - (ముం.ఉ.III-2-9)

"ఎవరు పరమమైన ఆ బ్రహ్మమును తెలిసికొనుచున్నాడో, అతడు బ్రహ్మమే అగుచున్నాడు." అని ముండకోపనిషత్తులో చెప్పబడినది.

అదే ముండకోపనషత్తులో

"తథా విద్వాన్ నామ రూపాద్విముక్తః,

పరాత్పరం పురుషముపైతి దివ్యం" (ముం.ఉ. III-2-8)

"అట్లు ఆత్మజ్ఞానియైన విద్వాంసుడు నామరూపముల నుండి విముక్తుడై పరాత్పరుడైన దివ్య పురుషుని పొందుచున్నాడు" అని చెప్పబడినది.

మరల "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై.ఉ.II-1)

"బ్రహ్మవిదుడు పరమాత్మను పొందును" అని అనబడినది.

మరల "జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః" (శ్వే.త.ఉ.V-13)

"ఆ బ్రహ్మమును తెలిసికొని సర్వ బంధముల నుండి ముక్తుడు అగును" అని కూడ చెప్పబడినది.

**ఈ విధముగా శ్రుతులు మరల మరల చెప్పుతున్నాయి. కావున ఆత్మ జ్ఞానము వల్లనే, బ్రహ్మ జ్ఞానము వల్లనే మోక్షము, పరమ పురుషార్థము లభిస్తుంది అని బాదరాయణుల వారి అభిమతము.**

(ఛాం.ఉ.VII-1-3; ముం.ఉ.III-2-9, III-2-8, తై.ఉ.II-1; శ్వే.తV-13)

## (427) III-4-2

**సూ. శేషత్వాత్పురుషార్థవాదః యథాఽన్యేష్వితి జైమినిః**

**క్ర. శేషత్వాత్, పురుషార్థవాదః, యథా, అన్యేషు, ఇతి, జైమినిః**

ప్ర.అ. శేషత్వాత్ = **కర్మకు అంగమైన కారణము చేత,** పురుషార్థ వాదః = **బ్రహ్మ విద్యను పురుషార్థానికి కారణమనుట, అర్థసిద్ధి మాత్రమే అవుతుంది.** యథా = **ఏ విధముగానైతే,** అన్యేషు = **యజ్ఞము యొక్క ఇతర ఉపాంగములందు ఫలశ్రుతి అర్ధ సిద్ధి అని మన్నించబడునో అట్లు,** ఇతి = **అని,** జైమినిః = **జైమిని మహర్షి చెప్పుచున్నారు.**

వి. **కర్తృరూపములో ఆత్మ అనేది కర్మాంగమే. కాబట్టి ఆత్మను గురించిన జ్ఞానము కూడా కర్మకు అంగభూతమైన ఆత్మ ద్వారా క్రతువుకు అంగమే అవుతుంది. అంటే ఆత్మ, ఆ ఆత్మను గూర్చిన జ్ఞానము కూడా కర్మాంగములే అని జైమిని వారి మాట.**

**అయితే దానిని పురుషార్థ సాధనగా చెప్పుటకు ప్రశంస చేయుట కొరకే మరియు పురుషార్థ సాధనము కర్మయే. ఇది జైమిని మహర్షి ప్రతిపాదము.**

---

## (428) III-4-3

**సూ. ఆచారదర్శనాత్**

**క్ర. ఆచారదర్శనాత్**

ప్ర.అ. ఆచారదర్శనాత్ = **శ్రేష్ఠ పురుషుల ఆచారములను చూడటము వలన శ్రేష్ఠ పురుషులు ఆచరించిన దానిని చూచినచో విద్య కర్మాంగమని తెలుస్తున్నది. ఇది ప్రతివాదము.**

వి. "రాజైన జనకుడు బహు దక్షిణలతో కూడిన యజ్ఞములు చేసినాడు. అక్కడికి కురుపాంచాల దేశముల నుండి వచ్చిన బహుబ్రాహ్మణులుండిరి." (బృ.ఉ.III-1-1)

అశ్వపతి రాజు తన చెంతకు బ్రహ్మ విద్య నేర్చుకొనుటకు వచ్చిన ఉద్దాలకుడు మొదలైన ఋషులతో ఇలా అన్నాడు.

"పూజ్యులారా ! నేను ఒక యజ్ఞమును చేయుటకు సంకల్పించినాను. ఒక్కక్క ఋత్విజునకెంత ధనమిత్తునో మీకు గూడ అంతంత ఇస్తాను. మీరు పోవలదు. ఇక్కడనే వుండండి" (ఛాం.ఉ.V-1-4)

మహర్షి పరమజ్ఞానియైన ఉద్దాలకుడు కూడ యజ్ఞకర్మలు చేసినాడు. ఆయనే తన కుమారునికి బ్రహ్మ విద్యను ఉపదేశించినాడు. "తత్త్వమసి" (అదియే నీవు) అనే మహా వాక్యము ఆయనదే. (ఛాం.ఉ.VI-9-3)

యాజ్ఞ్యవల్క్యుడు బ్రహ్మ విద్య యందు సర్వశ్రేష్ఠుడుగా మన్నింపబడెను. అతడు గృహస్థు మరియు కర్మిష్ఠి. ఎన్నియో దానములు స్వీకరించినాడు. తన ఇద్దరు భార్యలకు ఆస్తిపంచుటకు ఉద్యుక్తుడైనాడు.

**కేవలము జ్ఞానము వల్లనే మోక్షము వస్తే కర్మలు ఎందుకు చేసినారు. ఈ విధముగ శ్రుతిలో చెప్పబడిన శ్రేష్ఠ పురుషుల ఆచరణమును చూసినపుడు బ్రహ్మ విద్య కర్మకు అంగమనియే అనియు, కర్మతో కూడి అది పురుషార్థమగునని తెలుస్తున్నది.**

**ఇది జైమిని మహర్షి విచారధార, ప్రతివాదము.**

(బృ.ఉ.III-1-1; ఛాం.ఉ.V-11-4; ఛాం.ఉ.VI-9)

## (429) III-4-4

సూ. **తచ్ఛ్రుతేః**

క్ర. **తత్, శ్రుతేః**

ప్ర.అ. తత్ = **అది,** శ్రుతేః = **శ్రుతి వలన ప్రతివాదము కొనసాగుతున్నది.**

వి. ఉపనిషత్తులో "యదేవ విద్యయా కరోతి, శ్రద్ధయోపనిషదా, తదేవ వీర్యవత్తరం భవతి" (ఛాం.ఉ.I-1-10)

**"విద్య, శ్రద్ద, యోగము అనే మూడింటితో చేయబడిన కర్మము మిక్కిలి శక్తివంతము అవుతుంది" అని చెప్పబడినది. కావున విద్య కర్మాంగమే అవుతుంది.** (ఛాం.ఉ.I-1-10) ఇది కూడా ప్రతివాదమే

## (430) III-4-5

సూ. **సమన్వారంభణాత్**

క్ర. **సమన్వారంభణాత్**

ప్ర.అ. సమన్వారంభణాత్ = **విద్య,కర్మ రెండు కూడ జీవాత్మ వెంట కూడిపోవుట వలన కూడ**

వి. "తం విద్యాకర్మణి సమన్వారభేతే" (బృ.ఉ.VI-4-2)

**"చనిపోయిన పిమ్మట పరలోకమునకు పోయే జీవాత్మ వెనుకనే విద్య, కర్మ ఇవి రెండూ వెళ్లుతున్నాయి" అని చెప్పబడటము వలన విద్య, కర్మకు అంగమని తెలుస్తున్నది.**

**ఇది కూడ ప్రతివాదములో భాగమే.**

(బృ.ఉ. VI-4-2)

## (431) III-4-6

సూ. **తద్వతో విధానాత్**

క్ర. **తద్వతః, విధానాత్**

ప్ర.అ. తద్వతః = **ఆత్మ జ్ఞాన అధికారి కొరకు,** విధానాత్ = **విధాన ముండుట వలన**

వి. ఛాందోగ్యోపనిషత్తులో, బ్రహ్మ ప్రజాపతికి ఇలా చెప్పినాడు (తరువాత పరంపర వస్తుంది) "యధావిధి వేదాధ్యయనము చేసి, పూర్ణప్రజ్ఞ కలవాడై, సద్గురువుల ఆజ్ఞతో గృహస్థాశ్రమమున నుభవించి, అధ్యయన సంపన్నులగు సంతానము, శిష్యులను బడసి, శాస్త్ర విహితమగు సత్కర్మలు చేసి, దేశ కాల పరిస్థితులననుసరించి, అహింసా వృత్తులై యావజ్జీవితమును జీవన యాత్ర సాగించు

మానవుడు బ్రహ్మలోకమును పొందును. అతనికి మరలిరాక లేదు. మరలి రాకలేదు.”
(ఛాం.ఉ. VIII-15-1)

ఇది ఛాందోగ్యోపనిషత్తులోని చివరి మాట. **ఇట్లు విద్యాపూర్వక కర్మనాచరించు విధానము వలన విద్య కర్మాంగమని సిద్ధము అవుతున్నది. ఈ విధముగా ప్రతివాదము కొనసాగుతున్నది.**
(ఛాం.ఉ. VIII-15-1)

## (432) III-4-7

**సూ. నియమాచ్చ**

**క్ర. నియమాత్, చ**

**ప్ర.అ.** నియమాత్ = **నియమము వలన,** చ = **కూడ.**

**వి.** జీవనము వున్నంత వరకు కర్మ చేయాలనే నియమము ఉపనిషత్తు చెప్పుచున్నది.

“కుర్వన్నేవేహ కర్మాణి, జిజీవిషేచ్ఛతగ్ం సమా।
ఏవం త్వయినాన్యథేతోఽస్తిన కర్మ లిప్యతే నరే॥ (ఈ.ఉ.-2)

“కర్మముల చేయుచుండియే ఇహ
వర్షములు నూరు జీవించ కోరవలెను.
నరుడ! వేరేది విధమది నీకు కన్న
కర్మలు లిప్యంబు యెందు కాకమాను” (ఈ.ఉ.-2)

ఈ ప్రకారము జీవన యాత్రను చేయు నరునకు కర్మ లిప్తము కాదు. దీనికన్న వేరు విధము, ఉపాయము లేదు.

**ఇట్లు జీవించినంత వరకు కర్మానుష్ఠాన నియమము వున్నందు వలన కేవలము జ్ఞానము పరమ పురుషార్థ హేతువు కాదు అని తెలియుచున్నది.**
**ఈ విధముగా ప్రతివాదము ముగిసినది.**
(ఈ.ఉ.-2)

## (433) III-4-8

**సూ. అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్**

**క్ర. అధికోపదేశాత్, తు, బాదరాయణస్య, ఏవం, తద్దర్శనాత్**

**ప్ర.అ.** అధికోపదేశాత్ = **శ్రుతియందు బ్రహ్మవిద్యకు అధికమైన మహాత్మ్యమును వర్ణించిన కారణము వలన,** బాదరాయణస్య = **బాదరాయణుని మతమందు,** ఏవం = **మొదటి సూత్రమున చెప్పినదే యుక్తము,** తద్దర్శనాత్ = **శ్రుతియందు అట్లే చెప్పబడినది.**

**వి. జైమిని మహర్షి తన మతమును స్థాపించుటకు చెప్పిన యుక్తులు ఆభాస మాత్రములే (2-7 సూత్రములు)**

**అయితే విద్య అనేది కర్మ శేషము కాదు. జ్ఞానము స్వతంత్రముగానే మోక్ష సాధనమని బాదరాయణుల మతము. ఇదియే సరియైనది.**

ఎందుకంటే శ్రుతులయందు కర్మిష్ఠిని గూర్చి కర్మ శేషుడైన వాని గూర్చి మరియు సంసారి అయిన శారీరకుని గూర్చి కంటె అసంసారి, చిన్మాత్రుడు అయిన ఈశ్వరుని గూర్చిన ఉపదేశము ఎక్కువగా వున్నది కనుక. వేదాంతములో చెప్పబడిన ఆత్మజ్ఞానము చైతన్యాశ్రయము కావున అవి అర్థవాదములు కావు. ఆత్మజ్ఞానము వలన పురుషార్థసిద్ధి కలుగుతుందనటమే సమంజసము.

"యస్సర్వజ్ఞః సర్వవిత్" (ముం.ఉ. I-1-9)

"ఎవరు సర్వజ్ఞుడు, సర్వవేత్త" అని **ఈశ్వరుని గూర్చి అధికునిగా చెప్పబడటము వలన, ఆత్మజ్ఞానము కర్మాంగము కాదు.**

(ఇది రెండవ సూత్రములో చెప్పిన వాదముకు సమాధానము)

## (434) III-4-9

సూ. **తుల్యం తు దర్శనమ్**

క్ర. **తుల్యం, తు, దర్శనమ్**

ప్ర.అ. తుల్యం = **సమాన రూపము,** తు = **అయితే,** దర్శనమ్ = **ఆచారమును చూపించుట.**

వి. **ఉపనిషత్తులలో రెండు తీర్ల ఆచారము గూర్చి చెప్పబడినది. జ్ఞానులైన జనకుడు, అశ్వపతి, ప్రవహణుడు, అజాతశత్రు మొదలైన రాజులు గృహస్థులై యజ్ఞములు చేసినట్లున్నది. ఇంకొక వైపు యాజ్ఞవల్క్యుడు మొదలైనవారి వలె కేవలము భిక్షాచరణము చేయుచు విరక్తులై సన్న్యసించిన వారు కర్మలు త్యజించి బ్రహ్మచింతన యందు నిరతులైనవారు వున్నారు.**

**నిజముగా జ్ఞానము ప్రాప్తియైన వానికి కర్మల వలన ప్రయోజనము లేనట్లు తెలుస్తున్నది.**

"ఏతద్ధత్మవై తత్పూర్వే విద్వాంసోఽగ్ని హోత్రం న జుహువాం చక్రుః"- (కౌషీ.ఉ.II-4)

"అందుకే పూర్వులైన విద్వాంసులు అగ్నిహోత్రాది అనుష్ఠానములను ఆచరింపలేదు."

యాజ్ఞవల్క్యుడు కహోళునికి ఇలా చెప్పాడు,

"ఏతం వై తమాత్మానం విదిత్వా, బ్రాహ్మణాః పుత్రైషణాయశ్చ, విత్తేషణాయశ్చ, లోకైషణాయశ్చ వ్యుత్థాయ, అథ బిక్షాచర్యం చరంతి" (బృ.ఉ.III-5-1)

"ఇట్టి ఆత్మను (పరబ్రహ్మను) తెలిసి బ్రహ్మజ్ఞానులు ఈ షణత్రయ విరక్తులై (పుత్రాదలందు ఆశ, ధనమునందు ఆశ, లోకమునందు ఆశలను వదలిన వారై) దేహపోషణ కొరకు భిక్షాచరణమును మాత్రము చేస్తున్నారు".

మరియు యాజ్ఞవల్క్యుడు స్వయము అట్లు ఆచరించినాడు. "ఏతావదరే ఖల్వమృతత్వ మితిహోక్త్వా యాజ్ఞ్యవల్క్యో విజహార." (బృ.ఉ.IV-5-15)

"అమృతతత్వము ఇట్టిది అని చెప్పి, యాజ్ఞ్యవల్క్యుడు విరక్తుడై సన్న్యసించెను"

ఈ రీతిగా శ్రుతులయందు కర్మ త్యాగము కూడ ఆచారముగా చెప్పబడినది. **అందువలన బ్రహ్మజ్ఞానము కర్మాంగము కాదు మరియు అది పరమ పురుషార్థ హేతువు**
(కౌషీ.ఉ.II-4) బృ.ఉ.III-5-1, IV-5-15)
(ఇది మూడవ సూత్రములోని వాదముకు సమాధానము)

## (435) III-4-10

**సూ. అసార్వత్రికీ**

క్ర. **అసార్వత్రికీ**

ప్ర.అ. అ సార్వత్రికీ = **ఆ శ్రుతి (ఛాం.ఉ.III-15-1) (సూ.431)సర్వత్ర సంబంధించినది కాదు, ఏక దేశీయము**

వి. నాలుగువ సూత్రములో "విద్య, శ్రద్ధ, యోగము అనే మూడింటితో చేయబడిన కర్మము మిక్కిలి శక్తివంతము అవుతుంది. (ఛాం.ఉ.I-1-10) కావున విద్య కర్మాంగము అవుతుంది" అని చెప్పబడిన వాదమునకు సమాధానము ఇలా వుంది (ఛాం.ఉ.I-1-10) **విద్య, శ్రద్ధ, కర్మల గురించి చెప్పిన శ్రుతి అన్ని విద్యలలోనూ చెప్పినది కాదు. కేవలము ఉద్గీథ విద్య విషయములో చెప్పబడినది. అది అన్ని విద్యలకు వర్తించేది కాదు. కావున విద్య కర్మాంగము, అనటము యుక్తము కాదు.**

ఇది ప్రతివాదము
(ఛాం.ఉ.I-1-10)

## (436) III-4-11

**సూ. విభాగః శతవత్**

క్ర. **విభాగః, శతవత్**

ప్ర.అ. విభాగః = **శ్రుతి యందు చెప్పబడిన విద్య కర్మల విభాగము,** శతవత్ = **నూరింటి వలె**

వి. **"నూరు రూపాయలు ఇక్కడ వున్న వారలకు ఇవ్వండి" అంటే ఇది విని రూపాయలు తీసుకున్న వారు అక్కడ ఉన్నవారికి అధికారమును బట్టి పంచుతారు కదా! అదే విధముగ విద్య, కర్మలను అధికారమును బట్టి విభాగము చేయాలి కాని కలిపి అన్వయించరాదు.**

**బ్రహ్మజ్ఞానులకు కర్మలిచటనే నశించిపోవును. అతడు కేవలము విద్యాబలము చేతనే బ్రహ్మమునను భవించును. అతనికి రాకపోకలు వుండవు.**

శాంతులు, విద్వాంసులు, యతులు, తపస్వులు పాపరహితులై ఉత్తరాయణ మార్గమున (అర్చిరాది మార్గమున) అమృతుడు, అవ్యయుడు ఐన పురుషుడుండు తావునకు, బ్రహ్మలోకమునకు, పోవుదురు. ఇంకను సంసారికులు, సాధన భ్రష్టులైన వారలు విద్యా కర్మల సంస్కారములను వెంటగొని పోవుదురు. **ఇక్కడ విద్య అనగా అపరోక్షజ్ఞానము కాదు. శ్రవణము, మననము, నిది ధ్యాసనము అభ్యాసము మాత్రమే. దీనివలన కూడ విద్య కర్మాంగమని సిద్ధించదు.**

## (437) III-4-12

**సూ. అధ్యయనమాత్రవతః**

**క్ర. అధ్యయనమాత్రవతః**

ప్ర.అ. అధ్యయనమాత్రవతః = **ఎవరికి కేవలం అధ్యయన మాత్రమైన విద్య కలదో వారికి, అనగా అనుష్ఠానము లేనివారికి**

వి. బ్రహ్మ – ప్రజాపతి ఉపదేశమున (సూ.431) విద్యా సంపన్నుడైన పురుషుడు గృహస్థుడై వుండును. అతడు గురుకులమున అధ్యయనము చేసి వెళ్ళిపోయినాడు. **అతడు కేవలము అధ్యయనము చేసినాడు. కాని బ్రహ్మ విద్య అనుష్ఠానము చేయలేదు. అట్టి అధికారి అంత: కరుణ శుద్ధి కొరకు సత్కర్మలు చేయుట విధించబడినది. ఇది సమంజసము. దీనిని బట్టి విద్య కర్మాంగమని సిద్ధించదు.**

## (438) III-4-13

**సూ. నావిశేషాత్**

**క్ర. న, అవిశేషాత్**

ప్ర.అ. న = **లేదు,** అవిశేషాత్ = **ఈశావాస్యోపనిషత్తులో విశేషముగ విద్వాంసుని కొరకు చెప్పలేదు.**

వి. **"కుర్వన్నేవేహ కర్మాణి"** (ఈశ.ఉ.–2) **అని ఈశావాస్యోపనిషత్తులో, "ఈ లోకములో కర్మలు చేస్తూ (అగ్నిహోత్రాది కర్మలు) వంద సంవత్సరాలు బ్రతకాలని కోరాలి" అని చెప్పినవి. విద్వాంసుని గూర్చి, జ్ఞానిని గూర్చి చెప్పినది కాదు. కర్మాధికారి గురించి చెప్పినదే. జ్ఞానులు వేదనిహిత కర్మలు చేయాలి అని విశేషముగా, ప్రత్యేకముగా చెప్పబడలేదు.**

**అదేగాక జ్ఞానులు త్యాగము చేత, సన్న్యాసము చేత, జ్ఞానము చేత బ్రహ్మమును అందగలవని విశేషముగా, నిశ్చయముగా, సందేహరహితముగా శ్రుతులలో చెప్పబడినది.**

"నకర్మణానప్రజయాధనేన, త్యాగైనేకే అమృతత్వమానషుః
పరేణ నాకం విహితం గుహాయాం, విభ్రాజదేతద్యతయో విశంతి"
"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః
సన్యాస యోగాత్ యతయః శుద్ధసత్త్వాః
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే
పరామృతాత్పరిముచ్యంతి సర్వే"
"శ్రద్ధాభక్తిధ్యానయోగాదుల వలన బ్రహ్మము తెలిసికొనుము. (కై.ఉ. 3/4)
కాదు కర్మముల వలన, ప్రజనంబు వలన కాదు,
కాదు ధనము వల్ల, యమృతత్వంబు త్యాగంబు వలన యగును.
ఏది నాకము కన్న పరమై, నిహితమై గుహన వెలుగుచుండు,
యతులు దేనియందున తాము సంవేశించుచుంద్రు,
వారు వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులైన వారు,
పరిశుద్ధతత్త్వులు సన్న్యాసయోగమున శుద్ధ సత్త్వులైనవారు,

పరాంత కాలమున బ్రహ్మలోకముల యందు
పరామృతము వలన పరిముక్తి చెందుచుంద్రు. (కై.ఉ. 3/4)

**కావున కర్మ ద్వారా ముక్తి వస్తుందనేది నిశ్చయముగా చెప్పబడలేదు. వేదాంత జ్ఞానము వలన, సన్న్యాసము వలన త్యాగము వలన అమృతత్వము, బ్రహ్మానుభవము అవుతుందని నిశ్చయముగా చెప్పబడినది.**

(కై.ఉ-2, కైవల్య ఉ-3/4)

## (439) III-4-14

**సూ. స్తుతయేఽనుమతిర్వా**

**క్ర. స్తుతయే, అనుమతిర్వా**

ప్ర.అ. స్తుతయే = **విద్యను స్తుతి చేయుట కొరకు,** అనుమతి = **సమ్మతి అని గూడ గ్రహించవచ్చును,** వా = **కాని యెడల, తత్త్వజ్ఞానికి కర్మానుమతి అనేది కేవలము విద్యా స్తుతి చేయు కొరకు మాత్రమే. "కుర్వన్నే వేహ కర్మాణి" అని అన్నది ప్రకరణ సామర్థ్యమును బట్టి" జ్ఞాని కూడ కర్మలు చేస్తూనే" అని సంబంధించ చేసిన గూడ, జ్ఞానాన్ని స్తుతించుటము కొరకు అను అనుకోవాలి.**

వి. "జీవన పర్యంతము కర్మలు చేస్తున్నను తత్త్వవేత్త అయిన పురుషుని యందు విద్యా సామర్థ్యము వలన కర్మలోపము వుండదు" అని విద్యాస్తుతి అవుతుంది. జ్ఞానిలోక సంగ్రహము కొరకు కర్మ చేసిన కూడ బ్రహ్మ విద్య ప్రభావము వలన కర్మలచే లిప్తుడు కాదు.

**ఈ ప్రకారము బ్రహ్మ విద్యా ప్రశంస కొరకు కర్మనాచరించుటకు అనుమతి చూపినది. అది సమంజనమే కాని దీని వలన విద్య కర్మాంగము అని సిద్ధింపదు.**

## (440) III-4-15

**సూ. కామకారేణ చైకే**

**క్ర. కామకారేణ, చ, ఏకే**

ప్ర.అ. కామకారేణ = **స్వేచ్ఛాపూర్వకముగా కర్మ త్యాగము చేయుచున్నారు,** చ = **ఇంకను,** ఏకే = **కొందరు విద్వాంసులు**

వి. "ఎవరికి బ్రహ్మమే లోకమో అనగా నివసించు స్థానమో, అట్టి మాకు సంతానముతో ప్రయోజనమేమి" (బృ.ఉ.IV-4-22) అనుశ్రుతుల వలన కొందరు విద్వాంసులకు స్వేచ్ఛా పూర్వక కర్మ త్యాగము చూపబడినది.

"కుర్వన్నేవేహ" అను ఈశావాస్య వాక్యము విద్వాంసులందరికి కర్మ విధించుచున్నదను యెడల ఈ శ్రుతితో విరోధము యగును.

**కావున కొందరు విద్వానులు తమ పూర్వ ప్రకృతిననుసరించి జీవితాంతము కర్మలు చేయుచుందురు. మరికొందరు కర్మ త్యాగము చేయుచుందురు.**

**ఇందు జ్ఞానులకు స్వాతంత్ర్యమున్నది. దీనివలన విద్య కర్మాంగమని సిద్ధి కాదు.** (బృ.ఉ.IV-4-22, ఈ.వా.-2)

## (441) III-4-16

**సూ. ఉపమర్దం చ**

**క్ర. ఉపమర్దం, చ**

ప్ర.అ. ఉపమర్దం చ = **బ్రహ్మ విద్యచే కర్మలు నశించును అని చెప్పబడినది.**

వి. **బ్రహ్మజ్ఞానము వలన కర్మలన్ని నశించును అని శ్రుతులు చెపుతున్నాయి.**

"ఖిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః క్షీయంతే చస్య కర్మాణి, తస్మిన్ దృష్ట్వేపరావరే (ముం.ఉ.II-2-8)

"హృదయ గ్రంథుల ముడులు తీయబడును, సర్వసంశయములు ఛేదించబడును, సర్వ కర్మములు క్షీణమ్ముయగును, పరము అపరమైన దాని దృష్టి ఐన యపుడు (ముం.ఉ.II-2-8)

**బ్రహ్మ జ్ఞానము వలన కర్మలు నశించినపుడు, హృదయ గ్రంథులు వీడినపుడు, అన్ని సంశయములు కోసి వేయబడినపుడు, అంటే సర్వబంధముల నుండి ముక్తి ఐనయపుడు జ్ఞానము సర్వశ్రేష్ఠము. అపుడు బ్రహ్మ జ్ఞానము, విద్య కర్మాంగము కాదు.**

ఇది భగవద్గీతలో స్పష్టముగా చెప్పబడినది.

"జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః" -(భ.గీ.IV-19)

"ఎవని సమారంభములు అన్ని
సర్వకామ సంకల్ప వర్జితమ్ము
ఎవని కర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధమగును
ఆవాని పండితుండంద్రు బుధులు"

జ్ఞాని తన జ్ఞానముచే కర్మలను కాల్చివేస్తాడు.

అదే భగవద్గీతలో ఇంకో తీరుగా చెప్పబడినది.

"యథైధాంసి సమిద్ధోఽగ్నిః, భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి, భస్మసాత్కురుతే తథా।" (భ.గీ.IV-37)

"యెర్రగ మండెడు యగ్గియెపుడు
కర్రలను బూడిదగ గాల్చివేయు
నిర్మలమైన జ్ఞానాగ్ని చిరము
కర్మల సర్వంబు భస్మంబు జేయు" (భ.గీ.IV-34)

**జ్ఞానము కర్మబంధానికి విరుగుడు, మందు, సమాధానము మరియు కత్తి. కావున జ్ఞానము, విద్య కర్మాంగము కాదు.**

[**నారాయణ వాక్యము :** కర్మ, జ్ఞానముల గూర్చి చర్చ వాదము ఎప్పటి నుంచో మనిషికి జ్ఞానము వచ్చినప్పటి నుంచి వస్తుంది.

కర్మలు చేస్తే కర్మఫలముల బంధము వస్తుంది. కర్మలు చేయనిది మనిషి వుండలేదు. చేయి

కదిపినా కర్మయే. మరి కర్మము వలననే జీవనము నడుస్తుంది.

"నియతమైన కర్మంబు నీవు చేయు
శ్రేయంబునకర్మంబు కన్న చేయ కర్మ
పయనము శరీరముది సిద్ధించలేదు
నయమైన కర్మము నీవు చేయకున్న" (భ.గీ.III-8)

మరి కర్మలు ఎలా చేయాలి, జ్ఞాని - విద్వాంసుడు కర్మలు ఎలా చేస్తాడు. దాని సమాధానము కూడా శ్రుతులు, స్మృతులు చక్కగా చెపుతున్నాయి.

ఈశావాస్యోపనిషత్తులో మొదలు

"ఈశావాస్యమై అది యుండుచుండు
లేశమే దేని జగమున జరుగుచుండు
చేసి యట్టి త్యక్తత్వము మన్నవలెను.
యాసిక్తిని యితరుల ధనమందు వీడు" (ఈ.వా.-1)
దాని తరువాత

"కర్మములు చేయుచుండియే
ఇహన వర్షములు నూరు జీవించ కోరవలెను.
నరుడ! వేరేది విధమది నీకు కన్న
కర్మలు లిప్యంబు యెందుగాక మాను" (ఈ.వా.ఉ.-2)
ఈ రెండింటిని వేరు వేరుగా కాక కలిపి చూడాలి. అపుడు

"ఈ జగమంతా ఈశ్వరమయము - బ్రహ్మమయము. వృత్తాన్ని వ్యాసము పూర్తిగా నిండినట్లు బ్రహ్మము జగమంతా నిండి వున్నది." "జగములో ఏది జరిగినా అది బ్రహ్మ పరిమితమే. ఇతరుల ధనము - ఈశ్వర ధనము - ఐన ఈ జగత్తులో ఏది నీది కాని మనది కాని లేదు. అలా విడిచి వేసి, త్యాగము చేసి, అంటే నాది అనే దాన్ని అహంకారాన్ని, స్వార్థాన్ని త్యాగము చేసి నూరేండ్లు అనాసక్తిగా కర్మలు అంటకుండా కర్మలు చేస్తూ జీవించాలి, వేరే మార్గము లేదు."

ఇదీ ఈశావాస్యోపనిషత్తు చెప్పేది. జ్ఞానముతో కర్మములు చేయాలి. జ్ఞానము ముఖ్యము కర్మము గౌణము. జ్ఞానము ప్రధానము కర్మములు తరువాతవి. 'మైత్రేయి! ఎప్పుడు బ్రహ్మవేత్తకు బ్రహ్మ జ్ఞానము చేత సర్వము ఆత్మ మాత్రమే అగుచున్నదో, అప్పుడు దేనిచేత చూచును దేనిని చూచును? దేనిచేత దేనిని ఆఘ్రాణించును, దేనిచేత దేనిని తెలిసికొనును? దేనిచేత దేనిని పలుకును? దేనిచేత దేనిని వినును? దేనిచేత దేనిని తలచును? దేనిచేత దేనిని తెలిసికొనును? ఓ మైత్రేయీ! సర్వము విజ్ఞాన మయ ఆత్మయే" (బృ.ఉ.IV-4-14)

ఇది యాజ్ఞవల్క్య మైత్రేయి సంవాదములో చివరి మాట. బ్రహ్మజ్ఞానము పరమోత్తమము. దేనికీ

అంగము కాదు. కర్మాంగము కాదు.

కర్మ ఎలా చేయాలి?

"కర్మణ్యేవాధి కారస్తే
మాఫలేషు కదాచన
మా కర్మఫల హేతుర్భూః
మాతే సంగోஉస్త్వ కర్మణి" - (భ.గీ. II-47)

"కర్మకే అధికారంబు కలదు నీకు
కర్మఫలములందు ఎప్పుడును లేదు
కర్మఫలహేతువై నీవుండవలదు
ధీర ! వలదాసక్తి నీకు అకర్మ యందు"

ఇదియే జ్ఞానము. కర్మలు చేయకుండా వుండరాదు. మనిషికి, జ్ఞానికి కూడా, కర్మకు అధికారము వుంది. (అవసరము, ఆవశ్యకత కూడా వున్నది) అయితే కర్మఫలము పైన ఆసక్తి వదలాలి. బంధము కర్మముతో కాదు, ఆసక్తితో వస్తుంది.

కర్మను చేయకపోవుటములో ఆసక్తి మరియు కర్మఫలములపై ఆసక్తి వదలి సత్కర్మములు చేయాలి. ఇదే జ్ఞానము, జ్ఞాన మార్గము, జ్ఞాని మార్గము.

ఇంకా

"యోగస్థః కురు కర్మాణి, సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా, సమత్వం యోగ ఉచ్యతే" (భ.గీ. II-48)
"కర్మము జేయుము యోగస్థుడవై
మమకారము వదలుము వేరై
సమముగ జూడుము సిద్ధ్యసిద్ధ్యుల
సమత్వము యోగము ధనంజయా"

కర్మము మీద, కర్మఫలముల మీద మమకారము (నేను చేస్తున్నాను!) ఆసక్తి (నాకు ఇది కావాలి!) అనేది వదలి కర్మములు చేస్తే ధనంజయుడు, జ్ఞాన ధనంజయుడు అవుతాము.

మరల

"కర్మజం బుద్ధియుక్తా హి, ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః, పదం గచ్ఛంత్యనామయమ్" (భ.గీ.II-51)

"బుద్ధి యోగులు వారు మనీషులైన వారు
కర్మఫలములను దగ విడుచు వారు
జన్మబంధములు విడువ బడిన వారు
దుఃఖ రహితంబగు పదము పొందు వారు" (భ.గీ.II-51)

కర్మఫలములు విడిచిన జ్ఞానికి మోక్షము తథ్యము. కర్మములు, కర్మఫలములు జ్ఞాని చేతులో (సంయమములో) వుంటాయి. కాని జ్ఞానము కర్మవశములో వుండదు. ఆ విధముగా జ్ఞానము కర్మాంగము కాదు. ఇంకా,

"సక్తాః కర్మణ్యవిద్వాంసో, యథా కుర్వంతి భారత ।
కుర్యాద్విద్వాంస్తథాసక్తః, చికీర్షుర్లోకసంగ్రహమ్ ।                    (భ.గీ.III-25)

"అవిద్వాంసులు నాసక్తులై చేతురు కర్మలెట్లు
అవివేకులై లోక సంగ్రహంబు లోటు పడగ
సువిద్వాంసులు నసక్తులై చేతురు కర్మలట్లు
సువివేకులై లోక సంగ్రహంబు నెరవేర్చుకొరకు"
ఇదీ విద్యకు, అవిద్యకు భేదము.

అవిద్వాంసులు, అజ్ఞానులు, స్వార్థముతో, లోక సంగ్రహము కొరకు గాక, ఫలాసక్తితో, కర్మాసక్తితో కర్మలు చేస్తారు. ఇది అవిద్య. విద్వాంసులు, జ్ఞానులు లోక సంగ్రహము కొరకు పరార్థముతో – పరమార్థముతో–పరస్పరార్థముతో ఐనా, కర్మలపై ఫలములపై ఆసక్తి త్యజించి కర్మములు చేస్తారు. ఇది విద్య. కర్మములు విద్య ప్రకారము కాని విద్య కర్మ ప్రకారము కాదు.

ఆసక్తి వదలి పరార్థము, పరమార్థము కొరకు చేసే కర్మ, నైష్కర్మముగా పరిణతినందుతుంది.

అందుకే చివరకు భగవద్గీత ఇలా బోధిస్తుంది.

"అసక్తబుద్ధి స్సర్వత్ర, జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం, సన్న్యాసేనాధిగచ్ఛతి ।                    (భ.గీ.XVIII-49)

"సర్వత్రము బుద్ధినసక్తముంచి
సరి జితాత్ముడు విగతస్పృహుడు
చేరుచుండు దాను సన్న్యాసించి
పరమ నైష్కర్మ్య సిద్ధినెపుడు."
ఆ విధముగా నైష్కర్మ్య సిద్ధి వలన జ్ఞాని బ్రహ్మాభూతుడు అని తెలుస్తున్నది.
"న హి జ్ఞానేన సదృశం, పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ।                    (భ.గీ.IV-38)
"జ్ఞానంబునకు సదృశంబిల యందు లేదు
జ్ఞానంబు పవిత్రంబు దాని సరి యేది లేదు
మనుజుండు దా యోగ సంసిద్ధుడైన యంత
దన యందె జ్ఞానంబు జరుగు కాలమున బొందు"                    (భ.గీ.IV-38)
సర్వోత్కృష్టము, పరమ పవిత్రమైన జ్ఞానము కర్మాంగము కాదు. జ్ఞానములో చేసే కర్మములు పవిత్రము అవుతాయి.]

(ముం.ఉ. II-2-8, భ.గీ. IV-19, భ.గీ. IV-37, భ.గీ. III-8, ఈ.వా.-1/2, బృ.అ.ఉ. IV-4-14, భ.గీ. II-48, భ.గీ. II-51, భ.గీ. III-25, ఛ, గీ, XVIII-49)

## (442) III-4-17

**సూ. ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి**

**క్ర. ఊర్ధ్వరేతస్సు, చ, శబ్దే, హి**

**ప్ర.అ.** ఊర్ధ్వరేతస్సు = **దేనియందు వీర్యము రక్షించుకొను విధానము కలదో అట్టి బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు మూడింటి యందు,** చ = **కూడ, బ్రహ్మ విద్యకు అధికారము,** శబ్దే = **శ్రుతి యందు చెప్పబడినది,** హి = **కావున**

**వి. జ్ఞానము కర్మాంగము కాదు అనే దానిని సాగిస్తు చెప్పునది ఏమంటే శ్రుతి సన్న్యాసుల గూర్చి జ్ఞానమును గూర్చి ఇలా చెప్పినది. సన్న్యాసులు తామే జ్ఞానము కలిగియున్నారు. వారు ఏమీ కర్మలు చేసే అవసరము లేదు. అట్టి సన్న్యాసము గృహస్థాశ్రమము వుండకుండానే గ్రహించవచ్చును. శ్రుతి ప్రకారము ఊర్ధ్వరేతస్సులైన, బ్రహ్మచర్యము పాటించు మూడు ఆశ్రమముల వారికి కూడా బ్రహ్మవిద్యాధికారము కలదు.**

**బ్రహ్మచర్యము, వానప్రస్థము, సన్న్యాసము అను ఈ మూడు (ఊర్ధ్వరేతస్కులు) ఆశ్రమములలో కర్మలు విధించబడలేదు కాని వారికి బ్రహ్మ విద్యాధికారము వున్నది.**

అయితే వారి విషయములో జ్ఞానము కర్మాంగము కానేరదు, ఎందుకంటే వారికి అగ్నిహోత్రము వుండదు మరియు వేదవిహిత కర్మలు వారికి విధించబడలేదు.

సన్న్యాసాశ్రమములో వున్నవారికి కర్మానుష్ఠానము లేదు. వారికి బ్రహ్మచింతన, ధ్యానము మాత్రము వర్తించును.

అప్పుడు జ్ఞానము కర్మాంగము కాని కర్మాంశము కాని కానేరాదు.

**"బ్రహ్మతత్త్వము నపేక్షించియే సన్న్యాసులు సన్న్యాస దీక్ష పొందుదురు."** (బృ.ఉ.IV-4-22)

"అరణ్యమునందు శ్రద్ధచే తపమాచరించువారు అర్చిరాది లోకములను పొందుదురు" (ఛాం.ఉ.V-10-1)

"ఏ విద్వాంసులు భిక్షాటనము చేయుచున్నవారై తపస్సంపున్నులై అరణ్యమునందు నివసింతురో అట్టి వానప్రస్థులు, సన్న్యాసులు, శాంతచిత్తులు పుణ్యపాప విముక్తులై సూర్యుని మార్గము ద్వారా అమృతుడును, అవ్యయుడునగు పురుషుని లోకములకు వెళ్లుదురు." (ముం.ఉ. I-2-11)

"మూడు ధర్మస్కంధములు మూడు రూపములుగా వున్నవి. మొదటి స్కంధము యజ్ఞము, వేదాధ్యయనము, దానము అనునది (గృహస్థాశ్రమము) రెండవ స్కంధము తపస్సు అనునది (వాన ప్రస్థాశ్రమము) బ్రహ్మచర్యము, గురుకులవాసము అనునది మూడవది (బ్రహ్మచర్యాశ్రమము), వీటిని ఆచరించుట వలన పుణ్యలోక ప్రాప్తి కలుగును మరియు బ్రహ్మ సన్నిధానములో వారికి అమృతత్వము లభించును" (ఛాం.ఉ.II-23-1).

**దీనివలన ఊర్ధరేతస్కులగు వాసప్రస్థులకు, బ్రహ్మచారులకు, సన్న్యాసులకు కూడా అంటే కర్మతో సంబంధము లేనివారికి గూడ బ్రహ్మప్రాప్తి అందగలదు.**

ఆ విధంగా విద్య, జ్ఞానము కర్మాంగము కాదు.

(బృ.ఉ. IV-4-22, ఛాం.ఉ. V-10-5, ముం.ఉ. V-2-11, ఛాం.ఉ. II-23-1)

## (2) పరామర్శాధికరణము (138)

### (443) III-4-18

**సూ. పరామర్శం జైమినిరచోదనా చాపవదతి హి ॥**

**క్ర. పరామర్శం, జైమినిః, అచోదనా, చ, అపవదతి, హి**

ప్ర.అ. పరామర్శం = **శ్రుతిలో చెప్పబడిన సన్యాసాశ్రయమును,** జైమినిః = **జైమిని మహర్షి,** అచోదనా = **దానియందు సూచన క్రియా పదము లేనందున,** చ = **ఇంకను,** అపవదతి = **శ్రుతి సన్యాసమును నిషేధించుచున్నది.**

వి. వెనుకటి సూత్రములో చెప్పబడిన శ్రుతివాక్యము ఇలా వున్నది.

"త్రయోధర్మ స్కంధా:
యజ్ఞోఽధ్యయనం దానమితి, ప్రథమస్తప ఏవ
ద్వితీయో బ్రహ్మచారీ ఆచార్యకులవాసీ
తృతీయోఽత్యన్త మాత్మానం
ఆచార్యకులేఽ వసాదయన్,
సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి,
బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" (ఛాం.ఉ.II-23-1)

"ధర్మములు మూడు రూపములుగానున్నవి - యజ్ఞము, అధ్యయనము, దానము అనునవి ప్రథమ స్కంధము, తపము రెండవ స్కంధము. మూడవది గురుకులవాసము, ఆచార్య సేవనము, వీటిని ఆచరించిన వారికి పుణ్యలోక ప్రాప్తి కలుగుతుంది. బ్రహ్మ సంస్థులైన వారికి అమృతత్వము లభించును."

ఇక్కడ ఆశ్రమము అని అనలేదు స్కంధము (బోదె, కొమ్మ, భాగము) అని అనబడినది. దీనిలో సన్న్యాసము గురించి చెప్పలేదు.

అయితే ఈ శ్రుతిలో ఆశ్రమవిధి గురించి వున్నదా? లేదా అని సంశయము వస్తుంది. **జైమిని మహర్షి ప్రకారము ఆశ్రమముల గూర్చి, విధి గురించి చెప్పబడలేదు. మూడు ఆశ్రమాలు వున్నట్లు సూచన, అనుమానమే కాని నిర్ధారణ లేదు మరియు ఈ శ్రుతి సన్యాసాశ్రమును విధిస్తుంది అనుట యుక్తము కాదు.**

మరి విధిని కల్పించరాదా? అని అంటే అది కుదరదు.

ఎందుకంటే శ్రుతి, ఉపనిషత్తు సన్యాసాశ్రమాన్ని నిందిస్తున్నది.

"వీరహావా ఏష దేవానాం యో
అగ్నిః ఉద్వాసతే" (తై.ఉ. I-5-2-1)

అగ్నిహోత్రానికి ఉద్వాసన చేసినవాడు, మానివేసినవాడు - వీరఘ్నుడు అంటే పుత్ర ఘాతకుడు అనబడుతాడు అని

# బ్రహ్మావిద్యాధికారము

## ధర్మస్కంధములు-బ్రహ్మసంస్థులు-ఉపాసన-ఫలము-మోక్షము




బ్ర.సూ. (438) III-4-13, బ్ర.సూ. (442) III-4-17, (443) III-4-18, (444) III-4-19, (445) III-4-20

కావున సన్న్యాసాశ్రమానికి విధిని కల్పించటానికి వీలుపడదు.

**ఈ కారణముల వలన సన్యాసాశ్రమము (యతి ఆశ్రమము) ప్రమాణ సమ్మతము కాదు అని జైమిని మహర్షి చెబుతున్నారు.**

---

[**నారాయణ వాక్యము :** ఇద్దరు మహామహర్షులు కర్మ, జ్ఞానము విషయములో ఈ విధముగా ఒకరినొకరు ఎదుర్కొన్నారు.

జైమిని మహర్షి ధర్మసూత్రాలు, బాదరాయణ మహర్షి బ్రహ్మ సూత్రాలు ఢీకొట్టుకొంటున్నాయి. ఇదే ప్రశ్న అర్జునుడు కృష్ణ భగవానుని అడిగినాడు "కర్మ, జ్ఞానము ఈ రెండింటిలో ఏది శ్రేయము? అటు ఇటు అనకుండా ఒక మాట చెప్పు" అన్నాడు. నరునికి నారాయణుడు ఇలా చెప్పాడు.

"నిష్ఠలు రెండని జెప్పితిని నేను
మనుజుల కొరకు చాల ముందు
సాంఖ్యులకు సరి జ్ఞాన యోగంబు
యోగులకు మరి కర్మ యోగంబు" (భ.గీ. II-3)

వారి సంవాదము వలన ప్రపంచానికి గీతాజ్ఞానము అందింది.

కర్మ-జ్ఞానము స్పర్ధ అనాది ఐనది.

రథికుడు అర్జునునికి శ్రీకృష్ణుడు సరియైన సారధి. ధర్మసూత్రాల శిశ్యుడు జైమినికి బ్రహ్మ సూత్రాల బాదరాయణుడు సరియైన గురువు.]

**జైమిని మహర్షి వాదానికి బాదరాయణుల సమాధానము తరువాతి సూత్రము.**

---

## (444) III-4-19

**సూ. అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః ॥**

**క్ర. అనుష్ఠేయం, బాదరాయణః, సామ్యశ్రుతేః**

ప్ర.అ. అనుష్ఠేయం = **గృహస్థునివలె వేరు ఆశ్రమములలో వున్నవారు కూడ తమ ధర్మముల అనుష్ఠించుట ఉచితమే,** బాదరాయణ = **బాదరాయణుడు అనుచున్నాడు,** సామ్యశ్రుతే = **ఎందుకనగా, శ్రుతియందు సమస్తాశ్రమములకు వాని ధర్మములకు కర్తవ్యము సమముగానే చూపబడినది.**

వి. **బాదరాయణుని అభిమతము ప్రకారము ఇతర ఆశ్రమములు అనుష్ఠేయములు (బ్రహ్మ విద్యను అనుష్ఠించుటకు తగినవి), శ్రుతి అట్లు చెప్పుట వలన.**

బాదరాయణుడు జైమిని అభిప్రాయాన్ని నిరాకరిస్తున్నారు.

**ఛాందోగ్యోపనిషత్తులో "త్రయోధర్మస్కంధాః" (ఛాం.ఉ.II-23-1) "మూడు ధర్మ స్కంధములు" అని చెప్పబడిన దానిలో గృహస్థులకు, బ్రహ్మచారులకు మరియు వానప్రస్థులకు బ్రహ్మలోక అధికారము వుంది. బ్రహ్మవిద్యాధికారము వున్నది. మరియు బ్రహ్మతత్త్వము నపేక్షించి సన్యాస దీక్ష పొందువారు, వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థీలైన సన్యాసులకు కూడ బ్రహ్మవిద్యాధికారము**

**కలదు.** (బృ.ఉ.IV-4-22, కై.ఉ.-3/4)

**అంటే మూడు స్కంధములవారైన గృహస్థులకు, బ్రహ్మచారులకు, వానప్రస్థులకు మరియు సన్యాసులకు నలుగురికీ బ్రహ్మ విద్యాధికారము, బ్రహ్మలోక ప్రాప్తి అధికారము వున్నాయి.**

అందులో సగుణోపాసన చేసిన వారికి దేవయాన మార్గ బ్రహ్మ లోకప్రాప్తి, నిర్గుణోపాసన వారికి తత్కాల బ్రహ్మ ప్రాప్తి వుంటుందని ముందే చూసినాము. అయితే జైమిని మహర్షి ఉదహరించిన "అగ్ని హోత్రానికి ఉద్వాసన చేసినవాడు వీరఘ్నుడు అవుతాడు" అన్నది గృహస్థులై అగ్నిహోత్రము చేయవలసిన వారు తమ నియత కర్మలను వదలిన వారికే కాని బ్రహ్మ చింతన చేయుటకై సన్యసించే, వేదాంత విజ్ఞానులైన వారికి వర్తించదు.(గృహస్థులు, వానప్రస్థులు, అగ్ని హోత్రము చేయవలయునని చెప్పటమే శ్రుతి లక్ష్యము.) కావున బ్రహ్మచారులకు, గృహస్థులకు, వానప్రస్థులకు, సన్యాసులకు అందరికీ సమయముగా బ్రహ్మవిద్యాధికారము వున్నది.

అయితే ఈ నాలుగు రీతులవారు (మూడు స్కంధములు మరియు సన్యాసులు) కలసి నాలుగు ఆశ్రమములు అని సూచించబడినది. కనుక జైమిని మహర్షి అన్నట్లు సన్యాసులకు బ్రహ్మవిద్య విధి లేదు అనటము సమంజసము కాదు. మరియు బ్రహ్మ విద్యాధికారులైన నాలుగు రీతులలో ఒక గృహస్థులకే కర్మానుష్ఠాన విధానము వున్నది.

అదియే కాక **"బ్రహ్మచర్యము నుండి, గార్హస్థ్యము నుండి, వానప్రస్థము నుండి సరాసరి సన్యసింపవచ్చును. ఏ దినము పూర్ణవైరాగ్యము కలుగునో ఆ దినమే సన్యసించవలెను" (జాబాల-4) ఇట్లు శ్రుతియందు కూడా ఆశ్రమములకు విధి యున్నది.**

మిగతా "ఊర్ధ్వరేతస్కులైన" బ్రహ్మచారులకు, వానప్రస్థులకు, సన్యాసులకు కర్మానుష్ఠానము లేదు. కర్మానుష్ఠానము లేకుండానే వారు బ్రహ్మవిద్యనొంది, బ్రహ్మప్రాప్తినొందుతారు.

**కావున విద్య కర్మాంగము కాదు అవి నిశ్చయము మరియు అది స్వతంత్రము అని బాదరాయణుల వారి నిరూపణ.**

---

## (445) III-4-20

**(శ్రీమన్-న్యాస విద్య)**

**సూ. విధిర్వా ధారణవత్**

**క్ర. విధిః, వా, ధారణవత్**

ప్ర.అ. విధిః = **పూర్వోక్తమంత్రముల వలన అన్యాశ్రమముల విధి మాన్యమే కాని అపవాదము కాదు,** వా = **లేకపోయినచో,** ధారణవత్ = **సమిధా ధారణ సంబంధమైన ఉపరిధారణ క్రియలందు అనువాదమును గాక విధిని మన్నించునట్లు**

**వి.** "త్రయోధర్మస్కంధాః" (ఛాం.ఉ.II-23-1)

"మూడు ధర్మ స్కంధములు" అను శ్రుతి అనువాదము కాదు. వేరొక ఆశ్రమాన్ని విధిస్తుంది. ఎందుకంటే మహాపితృ యజ్ఞము అనే అగ్నిహోత్ర కర్మలో ఇలా చెప్పబడింది.

"అధస్తాత్స మిధం ధారమన్న అనుద్రవేద్ ఉపరిహి దేవేభ్యో ధారయతి" ('అగ్నిహోత్ర కర్మ)

"స్రువమందు ఉంచబడిన హవిస్సుకు క్రింద సమిధను ధారణ చేసి, అను ద్రవణం చేయాలి. ఎందుకంటే పైన దేవతల కోసము తీసుకో వెళ్లుతున్నాడు" అని చెప్పబడినది.

ఆ పితృయజ్ఞ కర్మలో హోమ ద్రవ్యముతో కూడిన సృక్కు అనే పాత్రకు అడుగున సమిధను

ఉంచాలని విధిస్తూ, దేవతలకు హవిస్సు చేసేటపుడు సమిధను స్రుక్కుపై భాగమున ధరించాలి అని అనువాద రూపములో (అనుకరణ రూపములో) చెప్పబడినది.

స్రుక్కుకు పై భాగములో సమిధను ధరించాలి అని ఎక్కడా చెప్పబడలేదు. అయినా అనువాద రూపములో మొదటిసారి చెప్పబడినందుకు (అపూర్వముగా) స్రుక్కుకు పై భాగములో ధరించాలి అని విధిస్తున్నది అని పూర్వ మీమాంసకులు (జైమిని మతము వారు) నిర్ణయించి విధించినారు. "విధిస్తుధారణే అపూర్వత్వాత్" (జై.సూ.III-4-15) "ధారణ చేయటము విధియే, అపూర్వము కావున (ముందు చెప్పబడలేదు కనుక) మొదటిసారి చెప్పేది అనువాదమే అయినా విధి అవుతుంది." జైమిని మహర్షియే చెప్పినారు.

అందువలన ధర్మస్కంధి శ్రుతి విధియే. అ విధముగా సన్యాసము అనే ప్రత్యేక ఆశ్రమాన్ని విధిస్తున్నది ఆ శ్రుతి.

"బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" (ఛాం.ఉ.II-23-1)

బ్రహ్మసంస్థులైనవారికి అమృతత్త్వము లభించును."

"బ్రహ్మసంస్థుడు, బ్రహ్మయందు సమాప్తి కలవాడు" అని అంటే వేరే ఏ వ్యాపారములూ లేనివాడు. అది సన్యాసికి సంభవము. కావున సన్యాసాశ్రమము విధించినట్లుగానే ఆ శ్రుతి వాక్యానికి అర్థము అని తెలుసుకోవాలి.

అదే కాకుండా ఇంకొక ఉపనిషత్తులో ఆశ్రమ విధానము మరియు సన్యాసాశ్రమము గురించి స్పష్టముగానే చెప్పబడినది.

జాబాలోపనిషత్తులో ఇలా చెప్పబడినది. యాజ్ఞావల్క్యుడు జనక మహారాజుతో ఇలా అన్నాడు.

"బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్,
గృహీభూత్వా వనీ భవేత్, వనీభూత్వా
ప్రవ్రజేత్ యదివ ఇతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్
యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్"
(జాబాలోపనిషత్-4)

"బ్రహ్మచర్యము సమాప్తము చేసి గృహస్థుడు కావలెను. గృహస్థుడైన తరువాత వానప్రస్థుడు కావలెను. అదికాక ఇంకొక రీతిగా బ్రహ్మచర్యము నుండియే సన్యాసము స్వీకరించవచ్చును. వానప్రస్థుడైన తరువాత సన్న్యాసి కావలెను."

"ఎవరైనను ఎప్పుడు బలీయమైన వైరాగ్యము కలుగునో, అప్పుడే సన్న్యాసము స్వీకరించవచ్చును." (బ్రహ్మచర్యమునుండి గాని, గృహస్థుడుగ నుండినప్పుడు గాని, వానప్రస్థము నుండి గాని సరాసరి సన్యసించవచ్చును)"

**ఈ విధముగా ఆశ్రమముల గూర్చి విధి శ్రుతులలో చెప్పబడలేదు అనిన జైమిని మహర్షి అభిమతము సమంజసము కాదు మరియు విద్య, జ్ఞానము కర్మాంగము కాదు,**

(జాబాలోపనిషద్ -4), (జై.సూ. III-14-15).

## (3) స్తుతి మాత్రాధికరణము (139)

## (446) III-4-21

**సూ. స్తుతిమాత్రముపాదానాదితి చేన్నాపూర్వత్వాత్ ॥**

**క్ర. స్తుతిమాత్రమ్, ఉపాదానాత్, ఇతి, చేత్, న, అపూర్వత్వాత్**

ప్ర.అ. స్తుతిమాత్రమ్ = **అదిస్తుతిమాత్రమని చెప్పినచో,** ఉపాదానాత్ = **ఉద్గీథాది ఉపాసనములందు మహిమను సూచించు వాక్యములివి అనియు మరియు కర్మకు అంగభూతములగుట వలన,** ఇతి చేత్ న = **ఇది సరికాదు,** అపూర్వత్వాత్ = **పూర్వము లేకుండట వలన**

వి. "సేషరసానాం రసతమః పరమః
పరార్థ్యో అష్టమూ అయముద్గీథః"

"ఈ ఎనిమిదవ ఉద్గీథము అన్ని రసములలో రసతమము (శ్రేష్ఠము) పరమము పరమాత్మ రూపమైనందులకు సర్వోత్తమ స్థానానికి తగినది." (ఛాం.ఉ. I-13)

ఈ ప్రశంస ఉద్గీథాదులను స్తుతి చేయుటము కొరకా లేక ఉపాసన కోసమా ? అనే ప్రశ్న వస్తుంది. ఈ సూత్రము దానికి సమాధానం "ఈ ఉద్గీథాది శ్రుతులు కర్మాంగము కనుక కేవలము స్తుతి కోసమే" అని అనటము సమంజసము కాదు.

**ఉద్గీథాదులు రజతమత్వాది గుణముల కూడుకొని వుంటాయనే విషయము గాని వాటి ఉపాసనలను గాని ముందు ప్రతిపాదించ బడలేదు. అవి అపూర్వములు. రజతమత్వాది గుణములతో కూడిన ఉద్గీథాదుల ఉపాసనమే విధింపబడినది అనటము సమంజసము. అందువలన విద్య కర్మకు అంగము కాదు.**
(ఛాం.ఉ. I-1-3)

## (447) III-4-22

**సూ. భావశబ్దాచ్చ**

**క్ర. భావశబ్దాత్, చ**

ప్ర.అ. భావశబ్దాత్ = **ఉపాసన చేయవలెను. అనేవిధివాచక శబ్ద ప్రయోగము వలన,** చ = **కూడ**

వి. **కేవలము అపూర్వమైనంత మాత్రముననే ఉద్గీథము గురించి విధి వాక్యము అవుతుందని కాదు. ఆ ప్రకరణములలో స్పష్టముగా "ఓ మిత్యేదక్షరముద్గీథము పాసీత" (ఛాం.ఉ.I-1-1) - "ఓం అను అక్షరమే ఉద్గీథము. ఓంకారమును ఉపాసించవలెను." అని స్పష్టముగా" ఉపాసించవలెను" అనే విధి వాక్యము చెప్పబడినది.**

ఎట్లు ఉద్గీథము యొక్క రసతమత్వాది గుణములు అపూర్వములో అట్లే వారికి అపూర్వములైన ఫలములు కూడ చెప్పబడినవి.

"ఎవరు ఉద్గీథమును ఉపాసించునో అతనికి సంపూర్ణకామనా ప్రాప్తియగును" (ఛాం.ఉ.I-1-7)

"నేను నీ కొరకు ఇష్టకామనలగానము చేతును ఎందుకనగా ఉద్గాథ కామనల ఆగానమందు సమర్థుడు. ఎవరు తెలిసి సామగానమును చేయునో అతడు ఆ కామనల సంపాదించుటకు సమర్థుడు" (ఛాం.ఉ.I-7-9)

"ఎవరు ఈ ప్రకారము తెలిసిన యతడు లోకములందు పంచ విధముల సామోపాసన, చేయునో అతనికి ఊర్ధ్వలోకములు అధో లోకములు భోగ్యరూపములుగ ఉపస్థితమగును.(ఛాం.ఉ.II-2-3.)

**వీనివలన కర్మకు అంగభూతము ఉద్గీథ అని స్తుతించబడలేదు. దానికి ప్రత్యేక ఉపాసనా విధానము, ఫలములు కలవు కావున విద్య కర్మకు అంగము కాదు.**

(ఛాం.ఉ.I-1-1, I-1-7, II-2-3)

## (4) పారిప్లవాధికరణము (140)

## (448) III-4-23

**సూ. పారిప్లవార్థా ఇతి చే న్న విశేషితత్వాత్ ॥**

**క్ర. పారిప్లవార్థాః, ఇతి చేత్, న, విశేషితాత్వత్**

ప్ర.అ. పారిప్లవార్థా = **పారిప్లవము చేయుట కొరకు, సంధిగ్ద పరిస్థితిని దాట వేయు కొరకు, పారిప్లవము అనే కర్మాంగము వలె ఉపయోగము అగుట కొరకు,** ఇతిచేత్ = **అని అనినచో,** న = **కాదు,** విశేషతత్వాత్ = **విశేష రూపమున గ్రహించిబడినవి కావున**

**వి.** అశ్వమేధ యజ్ఞము చేయబడుచుండునపుడు రాత్రివేళల కుటుంబ సహితముగా కూర్చున్న యజమాని అయిన రాజుకు, అధ్వర్యుడు వైదికోపాఖ్యానములను, కథలను వినిపించును.

అశ్వమేధ యజ్ఞము ఒక పెద్దయజ్ఞము. కర్మలు, సమయము, సక్రమముగా జరుగుట, అగ్నులు, హవిస్సులు, వేద గానములు మరియు ఎన్నియో ప్రక్రియల వలన ఒత్తిడి, సందిగ్ధములు, సంశయములు వచ్చుచుండును. యజ్ఞకర్మల మధ్యలో మూడూ రాత్రులకు మనో, బుద్ధుల శాంతి కొరకు సంశయములు తీరు కొరకు, సమన్వయము అగుట కొరకు ఈ అభ్యాసములు తోడ్పడును. **ఒక నదిని దాటుటకు పడవవలె ఉపయోగపడే ఈ ప్రక్రియలను పారిప్లవములు అని అంటారు. పారి అంటే అవతల, ప్లవమూ అంటే పడవ (ప్లవంగము అంటే కోతి – దాటేది, గంతువేసేది) ముఖ్యమైన యజ్ఞకర్మలగు అంగముగా మూడు రాత్రుల సమయములో అధ్వర్యుడు వైదిక గాథలైన మను, మయ, వరుణుల గూర్చి అఖ్యానములు చెప్పును. ఇవి ముఖ్య కర్మలకు అంగములుగా అనుబంధములుగా ఉపయోగము అగును. అవియే పారిప్లవములు.**

"పారిప్లవముచక్షీత" "పారిప్లవము ఆచరించవలెను" ఇక్కడ పారిప్లవ నామకము వైదికోపాఖ్యానము (అంటే సచ్చింతనా కాలక్షేపము మరియు సద్బోధ)

ఈ విధి వాక్యము వలన శ్రుతి యందు దాని స్పష్టమైన విధానము వున్నది. అదే ఇంతకు ముందు తెలుసుకున్న అశ్వమేధ యాగ విషయము.

అయితే "ఉపనిషత్తులలో చెప్పబడిన కథలు, యాజ్ఞవల్క్యుడు, మైత్రేయీ, కాత్యాయిని అఖ్యానములు ప్రతర్దనుని ఉదంతము, జానశ్రుతి మొదలైనవి కూడా పారిప్లవములే కనుక కర్మాంగములేనా?" అనే ప్రశ్న వస్తుంది.

**ఇదే జైమిని మహర్షి మతము, వారి అభిప్రాయము. వారి మతము ప్రకారము అవి పారిప్లవములే కాని విద్య కాదు. కాని పారిప్లవములో చెప్పవలసిన కథలు మను, మయ, వరుణుల గూర్చి అని విశేషముగా చెప్పబడినవి. కనుక ఉపనిషత్తులోని యాజ్ఞవల్క్యుడు ఇతర ఋషుల సంవాదము, భృగు వరుణుల కథ, యమ-నచికేతుల కథ, ఉద్దాలక శ్వేతకేతు ఉదంతము, సనత్కుమార నారద సంవాదము, ప్రశ్నోపనిషత్తులోని ప్రశ్నలు - సమాధానాలు మరియు ఇంకెన్నో విద్యా విషయాలే కాని కర్మాంగాలు కావు. ఉపనిషత్తుల్లో చెప్పబడినవి విద్యా శేషాలే కాని కర్మశేషాలు కాదు.**

[**నారాయణ వాక్యము :** వేదములు కర్మలగూర్చి చెబుతున్నాయి. వేదములో ఎన్నెన్నో విషయాలు వున్నా అన్నిటికి కేంద్రము యజ్ఞము మరియు కర్మ. కర్మయే వేద ధర్మము. అందుకే వేదార్థము కర్మ ధర్మము అని చెప్పుట కొరకు జైమిని మహర్షి ధర్మసూత్రములు రచించినాడు. మహమేధావి యైన జైమిని మహర్షి 2644 సూత్రములు గల ఆ ధర్మసూత్ర మహత్తర గ్రంథన్ని రచించినారు. **ఆయన దృష్టిలో వేదాంతము, ఉపనిషత్తులు అన్నీ అనుబంధము. ఉపనిషత్తులు మొత్తము వేదాంతమే కాక వేదాంగము కూడ అని వారి అభిమతము.**

**విద్య కర్మకు భాగమేనని ఆయన గట్టిగా నొక్కి చెప్పినారు. ఈ బ్రహ్మసూత్రములలోని** సూ.IV-4-2 (428) **నుండి** సూ IV-4-7 **(432) వరకు జైమిని మహర్షి కర్మ మార్గాన్ని గూర్చి చెప్పినారు. విద్య కర్మాంగమని అనిన ఆయన వాదాన్ని జైమిని మహర్షి గురువులైన బాదరాయణుల వారు పరిశీలించి, పరీక్షించి, పరామర్శించి ప్రతి ప్రశ్నకు సమాధానము చెప్పి జ్ఞానము, విద్య స్వతంత్రమని మరియు కర్మాంగము కావని నిరూపించినారు.**

అయితే జైమిని మహర్షి ప్రతిభ, వర్చస్సు బాదరాయణుల వారు గమనించి వారికి యోగ్యమైన గౌరవము ఇచ్చినారు. బ్రహ్మ సూత్రములలో ఔడులోమి, బాదరి మొదలైన ఎందరో ఆచార్యులు వున్నా జైమిని మహర్షికి బాదరాయణులు ప్రతివాదులలో ప్రథమస్థానమే ఇచ్చినారు. ఎన్నో చోట్ల బాదరాయణులు జైమిని వారు చెప్పినది నిదర్శనముగా సిద్ధాంతముగా ఉపయోగించినారు.
అయితే వారిద్దరూ వాదప్రతివాదాలు పరస్పర గౌరవంగా, అర్థవంతముగా వుండాలని చూపినారు. వారు ప్రవదము, వివదము చేసినారే గాని వితర్కము, వితండము చేయలేదు. వ్యాసుల వారు భగవద్గీతలో కర్మయోగము, జ్ఞానయోగము రెండూ సమత్వముతో బోధించినారు. తుదకు జ్ఞానము + కర్మల కలయికయే నైష్కర్మసిద్ధి అని చెప్పినారు. వ్యాసుల వారు జైమిని వారి కర్మను భగవద్గీతలో కర్మయోగము స్థితికి లేవనెత్తినారు. కర్మము + జ్ఞానము = కర్మ యోగము అనే దానిలో బాదరాయణ, జైమినుల ప్రతిభ వెలుగుతుంది.

**"యోగస్థః కురు కర్మాణి"** అనేది మరియు కర్మలు వదిలే దానికన్న కర్మ ఫలములు వదలటము

యుక్తము అనేది సమంజసము. వేదము వేదాంతములో సమాప్తము అయినట్లు కర్మము జ్ఞానములో (విద్యలో) పరిసమాప్తి అవుతుంది.

"సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" "చేయుకర్మమంత పార్థ యఖిలంబుయగుచు, శ్రేయజ్ఞానమున పరిసమాప్తి చెందు"
(భ.గీ. IV-33)

**జ్ఞానము పారిప్లవము కాదు, పరిసమాప్య స్థాన పరమాత్మకము మరియు పరాప్లవము.]**

## (449) III-4-24

**సూ. తథా చైకవాక్యతోపబన్ధాత్ ॥**

**క్ర. తథా, చ, ఏకవాక్యతోపబంధాత్**

ప్ర.అ. తథాచ = **ఆ ప్రకారముగా,** ఏకవాక్యమతోప బంధాత్ = **ఈ ఆభ్యానములు, ఉపాభ్యానములు అక్కడ చెప్పబడిన విద్యలతో ఏకవాక్యము కలిగియుండుట వలన**

వి. ఆ ఆఖ్యాయికలు విద్య కోసమే. వీటికి సన్నిహితమైన, దగ్గరనే వున్న ఆయా స్థలములలో నున్న విద్యతో వీటికి సంబంధము వున్నది. ఆయా కథలు ఆయా విద్యలతో ఏకవాక్యతను కలిగి వున్నాయి. రెండూ చెప్పేది ఒకే మాట. పారిప్లవ కర్మకు ఈ పారమార్థక విద్యా కథలకు సంబంధము లేదని ముందే తెలుసుకొన్నాము కదా!

**ఈ కథల ఉపయోగము ఏమిటి? శిష్యులకు విద్యయందు అభిలాష కల్గించటానికి, ఆ విద్యను తేలికగా బోధించటానికి ఇటువంటి కథలు ఉపాసన కోసము చెప్పబడతాయి అనటము సమంజసము, యుక్తము. ఉపనిషత్తులు, అఖ్యాయకలు విద్యయే, కర్మాంగములు కావు**

**[నారాయణ వాక్యము: కథలు అంటే కుతూహలము పెరుగుతుంది. చిన్నప్పటి నుంచి కథల ద్వారానే ఎన్నో నేర్చుకున్నాము కనుక కథల ద్వారా జ్ఞానమునందుకోవటము సులభము.**
అందుకే రామాయణ, భారత, భాగవతాలు నిత్యనూతనంగా చదువబడుతున్నవి, వినబడుతున్నవి అన్నీ టి.వి. సీరియల్సులో మరల మరల చూడబడుతున్నాయి. పురాణాలు కథల సముచ్ఛయములే.
**రామాయణ మహాభారతములు కథలలో విద్య. ఉపనిషత్తులు విద్యలో కథలు.]**

## (5) అగ్నీంధనాద్యధికరణము (141)

## (450) III-4-25

**సూ. అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా ॥**

**క్ర. అతః ఏవ, చ, అగ్నీంథనాద్యనపేక్షా**

ప్ర.అ. అత ఏవ = **అందువలననే,** చ = **కూడ,** అగ్నీంధ నాద్యనపేక్షా = **ఈ బ్రహ్మవిద్యరూప యజ్ఞమందు అగ్ని, సమిధ, ఘృతము మొదలైన పదార్థముల అవసరము లేదు.**

వి. బ్రహ్మవిద్య కర్మాంగము కాదు. ఈ నాలుగవ పాదము మొదటి సూత్రములో స్వతంత్రమైన **ఆత్మాజ్ఞానము బ్రహ్మ విద్య వలననే పురుషార్థము, మోక్షము కలుగుతుందని తెలుసుకొన్నాము.**

**ఈ బ్రహ్మవిద్య, జ్ఞాన యజ్ఞములో అగ్ని, సమిధ, ఘృతము మొదలైన పదార్థముల అవసరము, ఆవశ్యకత లేదు. పరబ్రహ్మ సాక్షాత్కారము, స్వానుభవమే ఈ యజ్ఞఫలము. ఈ బ్రహ్మ విద్యా యజ్ఞములో అన్ని పదార్థములు బ్రహ్మమే.**

**స్మృతి ఈ విషయము స్పష్టముగా చెప్పుచున్నది.**

"బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః, బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం, బ్రహ్మకర్మసమాధినా" (భ.గీ. IV-24)

ఈ విద్యయందు, బ్రహ్మచింతనా రూపమైన యజ్ఞమునందు వేరు ఉపకారణములు, సామాగ్రి అవసరము లేదు. ఈ బ్రహ్మ విద్యా యజ్ఞములో బ్రహ్మమే **స్రువము, హవిస్సు, అగ్ని, హోత మరియు హవనము క్రియ. ఈ బ్రహ్మ చింతన యజ్ఞమున సమాహితుడైన జ్ఞానయోగి ద్వారా ప్రాప్తముగు ఫలితము కూడా బ్రహ్మమే.**

ఆ విధముగా

"పురుషార్థో అతశ్శబ్దాత్" (బ్ర.సూ. III-4-1)

"శ్రుతివచనముల ద్వారా పురుషార్థము మోక్షము లభించును." అన్నమాట సార్థకము అవుతుంది.

**ఏ వస్తువులు, పదార్థములు లేకుండా అయ్యే బ్రహ్మయజ్ఞము (జ్ఞాన యజ్ఞము, విద్యాయజ్ఞము) కర్మలను అపేక్షించదు.**

**ఈ బ్రహ్మ విద్య పరమ పురుషార్థ సిద్ధియందు సర్వథా స్వతంత్ర మగుట వలన ఇది కర్మకు అంగము కాదు.**

(భ.గీ. IV-24, బ్ర.సూ. III-4-1)

**[నారాయణ వాక్యము :**

"ఈ బ్రహ్మ యజ్ఞమును, జ్ఞానయజ్ఞమును, విద్యా యజ్ఞమును ప్రతి సాధకుడు స్వానుభవము చెందవచ్చును. 'స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతా:" (-భ.గీ. IV-28)

"సాధ్యాయ జ్ఞాన యజ్ఞంబు చేయువారు, ప్రయత్నించు యతులై సంశితవ్రతులు ఐనవారు"

స్వాధ్యాయ జ్ఞానయజ్ఞము రెండు తీర్లు, స్వాధ్యాయ అంటే తానే అధ్యయనము చేయుట మరియు స్వాధ్యాయ - అంటే తననే అధ్యయనము చేయుట. తనను తానే అధ్యయనము, పరీక్ష, పరిశీలన చేసి పరిణితి చెందటమే ఈ విద్యా యజ్ఞము మరియు ఫలము.

దీనిలో

తానే అర్పణము, తానే హవి, తానే అగ్ని, తానే హుతము, తానే గంతవ్యము, తాను చేసేదంతా - తన కర్మలన్నీ - స్వయజ్ఞ కర్మముగా - సమాధి.

**జ్ఞానికి జీవనమే యజ్ఞము. తన జీవనాన్ని, తాను చేసేటివన్ని, పరమాత్మకు-పరులందరిలో వున్న ఆత్మ బ్రహ్మకు-సేవగా అర్పిస్తే ఆ యజ్ఞము స్వానుభవమై బ్రహ్మ సాక్షాత్కారము, ఆత్మ సాక్షాత్కారముగా అవుతుంది. ఈ బ్రహ్మ యజ్ఞము, ఆత్మ యజ్ఞము, పరమ పురుషార్థ యజ్ఞము,**

**పరమ పురుషుని యొక్క మూల స్వరూపము, జీవన ధర్మము వేదములోనే "పురుష సూక్తము"గా దర్శనమిస్తున్నది.**

"ఆ పురుషుని హవిస్సుగా చేసి యుంచి
దేవతలు యజ్ఞమునాచరించినారు.
వసంతము దానికి ఆజ్యమాయె,
గ్రీష్మము కట్టెలు శరద్ హవియునయ్యె" (ఋ.వే. X-90, పురుష సూక్తము-6)
ఇదియే ప్రప్రథమ యజ్ఞము.

"బ్రహ్మార్పణము" అనేది దీనితోనే మొదలైనది. దీనితో వస్తువులు పదార్థములు లేవు. పరమాత్మయే ప్రపంచము కొరకు ప్రజల కొరకు ఆహుతి అయినాడు. కనుక అదే ప్రతి మానవులకు, మనకందరికీ ఆదర్శము, ధర్మము అవుతుంది.

అందుకే ఆ పురుష సూక్తములోనే ఇలా చెప్పబడినది.

"యజ్ఞము వలన యజ్ఞము దేవతలు చేయ
అదియే ప్రథమ శ్రేష్ఠ ధర్మమాయే
ఆ విధముగ మహిమానులు స్వర్గమందు చుంద్రు
ఎచట పూర్వ సాధ్యులు దేవతలు యుండుచుంద్రు" అట్లు
బ్రహ్మజ్ఞాన యజ్ఞమే శ్రేష్ఠదర్శనము అయినది.

**ఈ పరమ యజ్ఞములో కర్మము, జ్ఞానము, ధర్మము కలిసిపోయి ఒకటి ఐనాయి.**

**ఆ విధముగా జ్ఞానము, ధర్మము ఒకటి అవుతాయి.**

**ఈ రీతిగా చూస్తే బాదరాయణుడు, జైమిని ఒకటి అవుతారు.**

**జైమిని బాదరాయణ మహర్షి అంటే పేరు, తండ్రి పేరు, ఇంటిపేరు అద్వైతము అవుతాయి.**

బ్రహ్మసూత్రాలు, ధర్మ సూత్రాలు సమన్వయము అయి బ్రహ్మధర్మ తత్త్వము ప్రకాశించగలదు.

**ఆ యజ్ఞములో మనమందరము మన సాధనతో, మన జ్ఞానముతో, మన ధర్మముతో, మన జ్ఞాన, ధర్మ, కర్మ యజ్ఞములతో ధర్మాన్ని నిలిపి జ్ఞానము బ్రహ్మత్వమునందవచ్చును]**

## (6) సర్వాపేక్షాధికరణము (142)

## (451) III-4-26

**సూ. సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్ ।**

**క్ర. సర్వాపేక్షా, చ, యజ్ఞాదిశ్రుతేః, అశ్వవత్**

ప్ర.అ. సర్వాపేక్షా = **విద్య యొక్క ఉత్పత్తికి సర్వవర్ణాశ్రమ ఉచిత కర్మల అవశ్యకత కలదు,** చ = **ఇంకను,** యజ్ఞాది శ్రుతే = **యజ్ఞాది కర్మలను బ్రహ్మ విద్య యందు హేతువులని శ్రుతి చూపిస్తున్నది,** అశ్వవత్ = **గుఱ్ఱము వలె**

**వి. విద్య కర్మాంగము కాదు. విద్యకు ఫలమైన మోక్షమునకు కర్మలు అవసరము లేదు. విద్య స్వతంత్రముగా మోక్షమునంద వచ్చును. ఇలా మనము తెలుసుకున్నాము కదా ?**

అయితే, ఫలాన్ని ఇచ్చే విషయములలో విద్యలకు కర్మాపేక్ష లేకున్నా "విద్యకు గాని, విద్యోత్పత్తికి గాని కర్మాపేక్ష వున్నదా? లేదా?" అనే ప్రశ్న వస్తుంది.

దానికి "తమేతం వేదానువచనేన బ్రహ్మణా వివిదిశంతి యజ్ఞేన, దానేన, తపసా." "బ్రాహ్మణులు వేదాధ్యయనము చేత, యజ్ఞము చేత, దానము చేత, తపస్సు చేత ఆ పరమాత్మను తెలుసు కొందురు" (బృ.ఉ. IV-4-22)

దీని వలన విద్య అనేది అన్ని ఆశ్రమములలోని కర్మలను - అనగా యజ్ఞము (గృహస్థము) దానేన (బ్రహ్మచర్యము), తపస్సు (వానప్రస్థము), వేదానువచనేన (సన్యాసము) - అపేక్షిస్తుంది **ఎందుకంటే యజ్ఞము, దానము, తపస్సు, వేదానువచనము అను కర్మలు జ్ఞానోత్పత్తికి హేతువులు అని చెప్పబడినాయి.**

**అశ్వము దున్నటానికి పనికి రాకపోయినా రథమును లాగటానికి పనికి వస్తుందన్నట్లుగా కర్మలనేవి మోక్షాన్ని ఇప్పించలేకపోయినా, యోగ్యతను బట్టి జ్ఞానోత్పత్తి విషయములో ఉపయోగపడతాయి.** (బృ.ఉ. IV-4-22)

[**నారాయణ వాక్యము :**

యజ్ఞము, దానము, తపము మరియు వేదానువచనము అనే కర్మలు మనుజుని శుద్ధి చేస్తాయి. దానివలన జ్ఞానశక్తి మరియు సాధనాశక్తి వృద్ధినందుతాయి ఇలాంటపుడు స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము చేయు యతులు, సంశిత వ్రతులు జ్ఞానమునంది, బ్రహ్మానుబూతితో మోక్షము నందుతారు. అంటే కర్మలు అనేవి జ్ఞానార్జనలో మోక్షసాధనలో సహాయకారకము అవుతాయి.]

"యజ్ఞదానతపఃకర్మ, న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ, పావనాని మనీషిణామ్"(భ.గీ. XVIII-5)

"సద్దాన తప యజ్ఞ కర్మముల నెపుడు
వదల వలదు నవి చేయ దగును
సద్దాన తప యజ్ఞ కర్మంబు లెపుడు
పార్థ మనిషిని పావనంబు జేయు" (భ.గీ. XVIII-5)

**ఆ విధముగ సత్కర్మలు సాధకుని పవిత్రము, శుద్ధి చేయుటకు సహాయ్యపడి బ్రహ్మ విద్యానుభూతికి తోడుపడుతాయి.**

---

## (452) III-4-27

సూ. **శమదమాద్యుపేతః స్యాత్తథాఽపి తు తద్విధేస్తదంగతయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్ ॥**

క్ర. **శమదమాద్యుపేతః, స్యాత్, తథాపి, తు, తద్విధేః, తదంగతయా, తేషాం, అవశ్యానుష్ఠేయత్వాత్**

ప్ర.అ. శమదమాద్యుపేతః = **శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానములతో సంపన్నుడు,** స్యాత్ = **కావలెను,** తథాపి = **సాధకునకు వేరు కర్మల ఆవశ్యకత లేకపోయినప్పటికీ,** తు =

# శమదమాదుల మిత్రుత్వము




షడ్గుణ సంపత్తి - ఆరుగురు మిత్రులు
బ్ర.సూ. (452) III-4-27.

---

# లోభమోహాదుల శత్రుత్వము




అరిషడ్వర్గము - ఆరుగురు శత్రువులు
బ్ర.సూ. (452) III-4-27.

**అయితే,** తదంగతయా = **ఆ బ్రహ్మ విద్య అంగరూపమగుట చేతను,** తద్విధేః = **వాని విధానములు చెప్పబడుట చేతను,** తేషాం = **ఆ శమదమాదుల యొక్క,** అవశ్యానుష్ఠేయత్వాత్ = **అనుష్ఠానము అవశ్య కర్తవ్యయగుచున్నది.**

వి. విద్య అనేది స్వతస్థితమే అనుకున్నా, బ్రహ్మవిద్యను కోరే అతడు శమ-దమాదులను కూడి యుండాలి ఎందుకంటే అవి విద్యకు అంగాలుగా విధించబడినాయి.

శమ-దమాదులు అంతరంగ సాధనాలు, అవి నివృత్తి రూపాన్ని తెలుపుతాయి. యజ్ఞయాగాది కర్మములు బహిరంగ సాధనలు. వానిని అనుష్ఠించినా, అంతరంగ శుద్ధికి శమదమాది గుణములు అత్యంతావశ్యకములు.

"తస్మాదేవంవిశ్చాంతోదాంత ఉపరత
స్తితిక్షు: సమాహితో: శ్రద్ధావిత్తో
భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" (బృ.ఉ. IV-4-23)

"కావున దీనిని (బ్రహ్మవేత్త మహిమ) తెలిసిన యతడు శాంతుడు, దాంతుడు, ఉపరాతుడు, తితీక్షువు, శ్రద్ధాసమాధానములు కలిగినవాడు ఆత్మను ఆత్మలోనే దర్శించును." **ఈ విధముగా శ్రుతి యందు పరమాత్మ నెరుగు నిచ్చ గల సాధకునకు శమదమాది సాధనములు బ్రహ్మవిద్యకు అంగరూపమగు విధానమున్నది.**

**కావున దానిననుష్ఠించుట బ్రహ్మమార్గ సాధకునకు పరమావశ్యకము.**

**వర్ణాశ్రమ యజ్ఞాయాగాది కర్మములు చేయకున్నను శమదమాది సాధన, అనుష్ఠానము తప్పనిసరి.** (బృ.ఉ.IV-4-23)

**[నారాయణ వాక్యము :**

శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అనునవి షడ్గుణ సంపత్తి.
శమము, దమము భౌతిక శుద్ధినిస్తాయి. శ్రద్ధ, సమాధానములు మానసిక శుద్ధినిస్తాయి. తితీక్ష, ఉపరతి శమము, దమము అనునవి బౌద్ధిక శుద్ధినిస్తాయి.

**శమము భౌతిక అంతరంగ సంయమము. దమము భౌతిక బాహ్య సంయమము. శ్రద్ధ మానసిక అంతరంగ సంయమము. సమాధానము మానసిక బాహ్య సంయమము తితీక్ష బౌద్ధిక అంతరంగ సంయమము. ఉపరతి బౌద్ధిక బాహ్య సంయమము.**

ఆ విధముగా భౌతికముగా, మానసికముగా, బౌద్ధికముగా లోన వుండేవి మరియు బయటకు వచ్చేవి సంయమములో వుంటే సంపూర్ణ శుద్ధియై బ్రహ్మ విద్యకు పూర్ణ అర్హత వస్తుంది.
బ్రహ్మ సూత్రములలో "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అని అన్నదానిలో అథ అనుదాని అర్థములో మొదటి అడుగు (మెట్టు) ఇదే.

అయితే, ఈ ఆరు గుణాలకు ఎదురుగా ఆరుగురు శత్రువులున్నారు. వారే అరిషడ్వర్గము. ఈ ఆరు వెళ్లిపోతేనే ఆ ఆరుగురు రాగలరు.

(నకారత్మకము వెళ్లిపోయి సకారత్మకము వస్తుంది.)

అరిషడ్వర్గము అంటే కామ, క్రోధ, మద, మాత్సర్య, లోభ మోహములు. మద, మాత్సర్యములు భౌతిక దోషములు. కామము, క్రోధము మానసిక దోషములు లోభము, మోహము బౌద్ధిక దోషములు. మదము అంతరంగిక భౌతిక దోషము మాత్సర్యము బాహ్య భౌతిక దోషము. కామము అంతరంగిక మానసిక దోషము. లోభము అంతరంగిక బౌద్ధక దోషము. మోహము బాహ్య బౌధక దోషము. ఈ ఆరు దోషములను ఆ ఆరు గుణములలో లేకుండా చేయటయే సాధన. శమముతో మదము మసియై పోవును, దమముతోమాత్సర్యము మాసిపోవును. శ్రద్ధతో కామము నశించి పోవును. సమాధానములో క్రోధము లేకుండ పోవును తితీక్షతో లోభము వదలిపోవును. ఉపరతితో మోహము వీడిపోవును. **మద మాత్సర్యములు, కామక్రోధములు, లోభమోహములు లేని శాంతుడు, దాంతుడు, తితీక్షువు, ఉపరాతుడు, శ్రద్ధాళువు, సమాధానము కలవాడు భౌతిక, మానసిక, బౌద్ధికముగా శుద్ధియై వెలిగి ఆత్మను ఆత్మలో దర్శించును.**

అపుడు

**దేహము వెలిగి**
**మనసు లీనమై**
**బుద్ధి ప్రకాశించి**
**చైతన్యము ప్రసరించి**
**"ప్రజ్ఞానమే బ్రహ్మము" అని తెలిసి**
**"ఈ ఆత్మయే బ్రహ్మము" అని అనుభూతమై**
**"అదియే నీవు" అనే గురుబోధతో**
**"నేనే ఆ బ్రహ్మను" అని**
**అపరోక్షానుభూతి నంది**
**తనను తనలోనే జ్ఞాననేత్రముతో దర్శించటము అవుతుంది"]**

---

## (7) సర్వాన్నానుమిత్యధికరణము (143)

## (453) III-4-28

**సూ. సర్వాన్నాను మితిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్**

**క్ర. సర్వాన్నాను మితిః, చ, ప్రాణత్యయే, తద్దర్శనాత్**

ప్ర.అ. సర్వాన్నానుమితిః = **సర్వ విధములైన అన్న భక్షణకు అనుమతి,** చ = **కూడ,** ప్రాణత్యయే = **అన్నము లేకున్న ప్రాణాపాయము వున్నపుడు,** తద్దర్శనాత్ = **శ్రుతియందు చెప్పబడినది.**

వి. అన్నము గురించి ఉపనిషత్తులలో చెప్పబడినది "ముఖ్య ప్రాణము నాకు అన్నమెక్కడ వున్నదని అడిగెను. అశ్వము మొదలుకొని పక్షుల వరకు సర్వప్రాణులు ఏ అన్నమును భుజించుచున్నవో ఆ అన్నమంతయు నీదే" అని ఇతర ప్రాణములు (ఇంద్రియములు) చెప్పినవి" (ఛాం.ఉ.V-2-4)

"నాకు అన్నమేది? అని ముఖ్య ప్రాణము వాగాది ఇంద్రియములను అడిగినది. అశ్వములకు,

క్రిమికీటకాదులు మొదలైన ప్రాణులన్నిటికీ ఏది అన్నమో అది నీ అన్నము అని వాగాది ఇంద్రియములు అన్నవి." (బృ.ఉ.VI-1-14)

అయితే అశ్వములు, పక్షులు, క్రిమికీటకాలు ఆహారము మానవునికి ఎలా పనికి వస్తుంది? సర్వాన్న భక్షణము అనేది విధి కాదు. ఇది ప్రాణమును ప్రశంస చేసేదే కాని విధి కాదు. "సమస్త జంతువులు, ప్రాణుల ఆహారమంతా ప్రాణమే భక్షిస్తుంది" అని అర్థము. అలాగే భావించాలి, ధ్యానించాలి. అయితే "తినరానిది తినవచ్చునా, అభక్ష భక్షణము చేయవచ్చునా?" అనే ప్రశ్న వస్తుంది.

ఛాందోగ్యోపనిషత్తులో ఇలా చెప్పబడినది. "పూర్వము కురుదేశములో కరువు వచ్చి తిండిలేక ఆకలి భరించలేని సమయము వచ్చినపుడు ఉషస్తి చాక్రాయణుడనే ఋషి దేశాంతరము వెళ్లి అక్కడ మావాటివాడు ఒకడు అలచందలు (గుగ్గిళ్లు) తింటుండగా అతనిని ఆహారము అడిగినాడు. ఆ మావాటి వాడు తన దగ్గర ఇంకేమీ లేదని తనవద్ద మిగిలిన ఎంగిలి గుగ్గిళ్లను ఆ ఋషికి ఇచ్చినాడు. ఉషస్తి ఋషి అవి ఎంగిలివని తెలిసి కూడా వాటిని తిన్నాడు. తరువాత మావటి వాడు తను త్రాగగా మిగిలిన నీటిని కూడా ఇచ్చినాడు. ఋషి తాను ఇంగిలి నీటిని త్రాగనని చెప్పినాడు.

ఎంగిలి గుగ్గిళ్లు పనికి వచ్చినాయి కాని ఎంగిలి నీళ్లు ఎందుకు పనికిరావని మావాటి, ఉషస్తి చాక్రాయణుని అడిగినాడు.

"నేను అప్పుడు ఎంగిలి గుగ్గిళ్లు తినకపోతే ప్రాణము పోయేదనీ అవి తిన్నాననీ, కావున ప్రాణము నిలిచిందనీ, ఇప్పుడు ప్రాణ భయం లేదు కనుక ఎంగిలి నీళ్ల త్రాగనని, అది పాపమని చెప్పినాడు" (ఛాం.ఉ.I-10-1) నుండి (ఛాం.ఉ.I-10-17) వరకు. దీనిని బట్టి **"ప్రాణపాయ సమయములో నిషిద్ధమైన ఆహారాన్ని దేనిని అయినా తిని ప్రాణము నిలుపుకోవాలి" అని తెలుస్తున్నది.** (ఛాం.ఉ.V-2-4, బృ.ఉ.VI-1-14, ఛాం.ఉ. I-10-1 నుండి I-10-7 వరకు)

**[నారాయణ వాక్యము :**
ప్రాణములు అన్నము పైన ఆధారపడి వుంటాయి. బ్రహ్మము ఆనందమయము. ఆ ఆనందమయము విజ్ఞానమయ కోశములో, విజ్ఞానమయము మనోమయకోశములో, మనోమయము ప్రాణమయకోశములో, ప్రాణమయము అన్నమయకోశములో వుంటుంది. అంటె అన్నము ప్రాణమునకు, మనస్సునకు, విజ్ఞానమునకు, ఆనందమయమైన ఆత్మకు ఆధారము అందుకే అన్నము బ్రహ్మము అని చెప్పబడినది. **కావున ప్రాణాపాయము వచ్చినపుడు ఏ అన్నమునైన సేవించ వచ్చును. కాని ప్రాణములు నిలిచిన తరువాత నియమములు అవశ్యము.]**

## (454) III-4-29

**సూ. అబాధాచ్చ ॥**

**క్ర. అబాధాత్ చ**

ప్ర.అ. అబాధాత్ = **మరియొక శ్రుతి బాధ లేనందున,** చ= **కూడ**

వి. "ఆహర శుద్ధౌ సత్వశుద్ధిః" (ఛాం.ఉ. VII-26-2)

**"ఆహారము శుద్ధమైనపుడు సత్త్వము, అంతఃకరణము శుద్ధముగా నుండును." అట్లు శ్రుతి చెప్పుతున్నది కావున ఏది తినవచ్చునో, ఏది తినరాదో నిర్ణయించే శాస్త్రములు వున్నాయి. శాస్త్రములకు విరోధము కావలదు కనుక అన్నిరకాల అన్నానికి, శాస్త్రప్రకారము, ప్రాణభయము వున్నప్పుడు తప్ప అనుమతి గలదు అనేది ప్రాణ విద్యాంగము కాదు అని అనటము సమంజసము.**

**[నారాయణ వాక్యము :**

"ఎక్కువ దక్కువగాక దినుచుండువాడు
ఎక్కువ దక్కువ గాని పని జేయు వాడు
ఎక్కువ దక్కువ గాక నిదురించువాడు
చక్కగ యోగంబు పొందు దుఃఖంబు వీడ" (భ.గీ. VI-17)

"విను ఆహారమది మూడు తీర్లు
జనులకు ప్రియము కల్గించుచుండు
దానము యజ్ఞము మరియు దపము
కననవి కూడయవి మూడు తీర్లు. (భ.గీ.XVI-7)

"సత్వమ్ము ఆయుస్సు మరియు బలము
ప్రీతి ఆరోగ్యము మరియు సుఖము
వృద్ధి చేయు రస్యము స్నిగ్ధంబు స్థిరము
ఏది ఆహారము అది సాత్త్విక ప్రియము" (భ.గీ.XVII-8)

"కట్వంబు పులుపు మరియు రూక్షంబు
లవణంబు యుష్ణంబు మరియు తీక్షణంబు
నవి దుఃఖశోకముల నెంతము కలుగుజేయు
ఈ విధమాహారము అది రాజసప్రియము. (భ.గీ.XVIII-9)

అరస్యము పాతబడినది వాసనది జూడ
పాచిపోయినది యెంగిలది గూడ
కారమది దేహమును మండించు చాల
ఈ రీతి భోజనము దామస ప్రయము" (భ.గీ.XVIII-9)

ఆహారము దేహముపైన, మనస్సు పైన, బద్ధిపైన చాల ప్రభావము కలిగి ఉంటుంది. ఎలా తింటే అలా అవుతాము, అలా వుంటాము

ఆహారశుద్ధి + సాధన → మనశ్శుద్ధి

మనశ్శుద్ధి + భావన → విచారశుద్ధి

విచారశుద్ధి + చింతన → చేతన

పూర్ణశుద్ధి + చేతన → ఆత్మసిద్ధి

**భోజనము విషయములో చాల సంయమముగా వుంటే బ్రహ్మ మార్గము సులువు అవుతుంది.]**

## (455) III-4-30

**సూ. అపి చ స్మర్యతే ॥**

**క్ర. అపి, చ, స్మర్యతే**

ప్ర.అ. అపి = **ఇంకను,** స్మర్యతే = **స్మృతి కూడ అట్టులనే చెప్పుచున్నది.**

వి. **స్మృతులు కూడా ఇలా చెప్పినాయి. "ప్రాణాపాయము వచ్చినపుడు విద్వాంసునికైనా మాన్యునికైనా, సామాన్యునికైనా అభక్ష్యభక్షణము, తినరాని దాన్ని తినటము దోషము కాదు మరియు తప్పదు."**

"జీవితాత్యయ మాపన్నోయోఽన్నమత్తి యతస్తత:, లిప్యతే న స పాపేన, పద్మపత్రమివాంభసా" (మనుస్మృతిలో X-108)

"ఎవరైనా సరే, ప్రాణము పోయే సమయములో ఇది తినవచ్చును, ఇది తినరాదు అని విచారణ చేయకుండా అన్నింటిని తినవచ్చును. తామరాకును జలము అంటనట్లుగా అతనిని పాపము అంటదు." అత్యంత క్లిష్ట పరిస్థితిలో విశ్వామిత్ర మహర్షి కుక్క మాంసాన్ని తిన్న ఉదంతము మహాభారతములో, మనుస్మృతిలో (మనుస్మృతి X-108) వున్నది.

**అయితే అభక్ష్యభక్షణము ప్రాణ సంకటములోనే, కేవలము ఆపద్ధర్మము రీతిలోనే (మనుస్మృతి X-108) (మహాభారతము)**

## (456) III-4-31

**సూ. శబ్దశ్చాతోఽకామకారే ॥**

**క్ర. శబ్దః, చ, అతః, అకామకారే**

ప్ర.అ. శబ్దః = **శ్రుతి ప్రమాణము,** చ = **కూడ వున్నది,** అతః = **ఇందు వలన,** అకామకారే = **ఇష్టము వచ్చినట్లు భుజించుట నిషేధించుట యందు**

వి. ఛాందోగ్యోపనిషత్తులో ఇలా వుంది.

"సువర్ణము దొంగిలించుట, సురాపానము చేయుట, గురుపత్నీ సంగమము చేయుట, బ్రహ్మహత్య, ఈ దుష్కర్మలు ఆచరించువారు, వారికి సహాయపడువారు కూడ మహాపాపులై పతితులై పోవుదురు. ఇవి పంచమహా పాపములు". (ఛాం.ఉ. V-10-9) అనగా సురాపానము నిషిద్ధము మరియు మహాపాపము. అయితే

"తస్మాద్బ్రాహ్మణో న సురాం పిబేత్"

అని కాఠక సంహితలో చెప్పబడినది.

కావున ఛాందోగ్యోపనిషత్తులో ప్రాణ విద్యలో "అశ్వము మొదలుకొని పక్షుల వరకు సర్వప్రాణులు ఏ అన్నమును భుజించుచున్నావో, ఆ అన్నమంతయు నీదే" అని ఇతర ప్రాణములు ముఖ్య ప్రాణమునకు చెప్పినవి (ఛాం.ఉ. X-2-1)

దీనిని అర్థవాదముగా, ఒక సాధారణ మార్గ సూచికగా మాత్రమే గ్రహించవలెను. **శాస్త్ర ప్రకారము నిర్దేశించిన భక్ష్యము, అభక్ష్యములను గూర్చి పాటించవలెను. అన్ని తినగలిగినా అయోగ్యములు వదలవలెను. యోగ్యములు స్వీకరించవలెను.**

(ఛాం.ఉ.X-2-1, ఛాం.ఉ.V-10-9)

## (8) ఆశ్రమకర్మాధికరణము (144)

## (457) III-4-32

సూ. **విహితత్వాచ్చాశ్రమకర్మాపి ॥**

క్ర. **విహితత్వాత్, చ, ఆశ్రమకర్మ, అపి**

ప్ర.అ. విహితత్వాత్ = **శాస్త్ర విహితమగుట వలన,** చ = **ఇంకను,** ఆశ్రమ కర్మ = **బ్రహ్మచర్యాది ఆశ్రమకర్మలు,** అపి = **కూడ అనుష్ఠింపదగినవి.**

వి. **శ్రుతి, స్మృతులలో అనేక స్థలములలో, బ్రహ్మ జ్ఞానము యొక్క ప్రాప్తి అయిన గూడ శమదమాది వైదిక కర్మలు యుక్తమని చెప్పబడినవి. కావున బ్రహ్మ చర్యము మొదలైన తమ తమ ఆశ్రమ కర్మలు అవశ్యము చేయుచుండవలెను.ఆ శ్రేష్ఠ కర్మల అనుష్ఠానము వలన బ్రహ్మ విద్య అభివర్ధనము అగుచుండును.**

"ఆ బ్రహ్మమును వేదవిదులగు బ్రాహ్మణులు వేదవచనముల చేతను, యజ్ఞము చేతను, దానము చేతను, తపస్సు చేతను, ఉపవాస వ్రతము చేతను తెలియవలయును. ఈ బ్రహ్మతత్త్వము నెరిగినవాడు ఋషియని చెప్పబడును." (బృ.ఉ. VI-4-22)

ఏ విధముగా జ్ఞానికి కూడ శరీరస్థితి కోసము అవసరమైన అన్న పానాది కర్మలు, బ్రహ్మ విద్య ప్రాప్తికి శమదమాది కర్మలు లోక సంగ్రహము కొరకు అనివార్యమో, అదే విధముగా బ్రహ్మచర్యాది ఆశ్రమములలో వున్నవారికి వారి వారి కర్మలు వారికి విహితమై వున్నవి. కావున ఆ శ్రేష్ఠ కర్మమములు చేయుచుండవలయును.

భగవద్గీతలో

"సువిద్వాంసులు అసక్తులై కర్మలు చేతురట్లు, సువివేకులై లోక సంగ్రహము నెరవేర్చు కొరకు" (భ.గీ. III-25)

**కావున ఆశ్రమములలో వున్నవారు తమ తమ విహితమైన శ్రేష్ఠకర్మలు, బ్రహ్మజ్ఞానమందిన కూడ చేయుచుండవలెను.**

(బృ.ఉ. VI-4-22, భ.గీ. III-25)

## (458) III-4-33

**సూ. సహకారిత్వేన చ ॥**

**క్ర. సహకారిత్వేన, చ**

ప్ర.అ. సహకారిత్వేన = **సాధన యందు సహోకారియగుట వలన,** చ = **కూడ**

వి. **బ్రహ్మవిద్య సాధనయందు సహకారమగుట వలన కూడ కర్మానుష్ఠానము లోక సంగ్రహము కొరకు చేయవలయును.** శ్రేష్ఠ కర్మలు బ్రహ్మ జ్ఞానమునందుటలో సహాయపడుటలో రెండు విధములుగా ఉపయోగపడును. చంద్రకర్ర వ్యవహారికముగా కర్రలాగ మరియు యజ్ఞ భాగముగా మూలస్థంభముగా ఉపయోగపడునట్లు ఆశ్రమ కర్మలు రెండు విధములుగా ఉపయోగపడును.

---

## (459) III-4-34

**సూ. సర్వథాపి త ఏవోభయలింగాత్**

**క్ర. సర్వథా, ఆపి, తే, ఏవ, ఉభయలింగాత్**

ప్ర.అ. సర్వదా=**అన్ని విధముల,** అపి= **ఏకారణముననైన కఠినత ప్రాప్తించినను,** తే= **ఆ ఆశ్రమ కర్మలు,** ఏవ=**చేయవలసినవి,** ఉభయలింగాత్=**శ్రుతిస్మృతులు నిశ్చయముగా చెప్పినందు వలన**

వి. యజ్ఞ, దాన, తప, యాగాది కర్మములు ఆశ్రమత్వ పక్షములోనూ విద్యా సహోకారిత్వ పక్షములోనూ కూడా అనుష్ఠింపతగినవి.

"బ్రహ్మ జిజ్ఞాసువైన యతడు బ్రాహ్మణుడు స్వాధ్యాయము వలన, యజ్ఞము, దానము, తపము, నిష్కామ కర్మల ద్వారా బ్రహ్మతత్త్వమును తెలిసికొనకోరును." (బృ.ఉ.IV-4-22) ఇది శ్రుతిలింగము.

"అనాశ్రిత కర్మఫలం, కార్యం కర్మ కరోతియః స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః (భ.గీ.VI-1)

"అడుగడతడు పండు నిండుకుండ
అడుగులిడు పనులనాడు కూడ
చూడు చూడు వాడు కుడు యోగిచూడ
కాడుకాదెవడు యోగి అగ్గివీడ" (శ్రీ.మ.భ.గీ.VI-1)

నిజమైన యోగి ఫలము నాశించకుండా తన కర్మములు చేసేయతడే. ఇది స్మృతిలింగము.

**కర్మ స్వరూపములో భేదము లేకపోయినా ఆశ్రమ కర్మలకు, బ్రహ్మ విద్యా సహకారి కర్మలకు ఫలాపేక్ష గురించియే బేధము. ఆశ్రమ కర్మలు సకృత కర్మఫలములనిస్తాయి. బ్రహ్మవిద్యా సహకారి కర్మలు ఫలాపేక్ష లేక కేవలము లోక సంగ్రహన్ని ఆత్మశుద్ధిని కలిగిస్తాయి.**

**ఏ విధముగా చూచినా నిత్య కర్మలు జ్ఞాన సహాకారులు కూడా అవుతాయి. కాని జ్ఞానము, విద్య, కర్మాంగము కాదు.**

(బృ.ఉ. -4-22, భ.గీ.VI-1)

## (460) III-4-35

సూ. **అనభిభవం చ దర్శయతి ॥**

క్ర. **అనభిభవం, చ, దర్శయతి**

ప్ర.అ. అనభిభవం = **పాపములచే అభిభూతుడు కాకుండుట,** చ = **కూడ** దర్శయతి = **శ్రుతి చెప్పుచున్నది.**

వి. **బ్రహ్మచర్యాది సాధన సంపన్నుడైనవాడు పొందిన ఆత్మజ్ఞానము క్లేష్షముల వలన నాశనము పొందదు అని ఉపనిషత్తులు చూపిస్తున్నాయి.**

"ఏషహ్యాత్మాన నశ్యతి యం

బ్రహ్మ చర్యేణాను విందతే" (ఛాం.ఉ.VIII-5-3)

"బ్రహ్మ చర్యముచే పొందబడిన ఆత్మ తత్త్వమునకు నాశనము లేదు."

దీనివలన అన్ని ఆశ్రమాలకు సంబంధించిన కర్మలు కూడా సాధకునిలోని అవిద్య, రాగము, ద్వేషము, అస్మిత మొదలైన క్లేషములను పోగొట్టి విద్యోత్పదకాలు అవుతాయి. **అందుచేత అధ్యయనము, దానము మొదలైన నిత్యకర్మలు విద్యకు, జ్ఞానానికి సహాయ్యకములు అవుతాయి.**

## (9) విధూరాధికరణము (145)

## (461) III-4-36

సూ. **అన్తరా చాపి తు తద్దృష్టేః ॥**

క్ర. **అన్తరా, చ, అపి, తు, తత్ + దృష్టేః**

ప్ర.అ. అంతరా = **రెండు ఆశ్రమముల మధ్యన - ఆశ్రమ ధర్మములు లేకున్నా,** చ అపి = **కూడ,** తు = **మరియు,** తద్దృష్టేః = **శ్రుతిలో అట్లు కనిపించుట వలన.**

వి. **ఆశ్రమ ధర్మములు నిర్వర్తించుటకు తగిన సామాగ్రి లేని వారుగాని లేక రెండు ఆశ్రమముల మధ్యనున్న వారు గాని, జ్ఞానమునకు అర్హులే అని ఇచట చెప్పబడుచున్నది.**

ఛాందోగ్యోపనిషత్తు IV-2-3లో మహాజ్ఞానియైన, ఏ ఆశ్రమములూ లేని, బండి రైక్వుని గూర్చి వున్నది. బృహదారణ్యక ఉపనిషత్తులో III-6-8 అందరినీ ఓడించనున్న యాజ్ఞ్యవల్క్యుని తీక్షణమైన ప్రశ్నలు వేసి తుదకు ఆయనను మెచ్చుకున్న గార్గి వాచక్నవి ఆశ్రమము లేని మహాజ్ఞాని.

**కావున బ్రహ్మవిద్యాధికారము కేవలము ఆశ్రమ స్థితుల మీద కాదు కాని సాధకుని ఉపాసన, నిష్ఠ, అభ్యాసము, నిరంతర సాధన మీద ఆధారపడి వుంటుంది.**

(ఛాం.ఉ. IV-1-3, బ్ర.ఉ.III-6-8).

[**నారాయణ వాక్యము :**
పూర్వ కాలములో మంథెనలోని గొల్ల గంగులు, ఈ కాలములో సేవాతపస్వి పార్వతమ్మ, బ్రహ్మవిద్యాయోగిని అవధానుల సరోజన బ్రహ్మవిద్యాధికారము కలిగినవారే. బ్రహ్మ విద్యాధికారము బ్రహ్మవిద్యాసాధన వలన వుంటుంది. ఆశ్రమ కర్మల వలన కాదు. అయితే ఆశ్రమ సత్కర్మలు ఆ బ్రహ్మవిద్య సాధనకు చేయూతనిస్తాయి.]

## (462) III-4-37

**సూ. అపి చ స్మర్యతే ॥**

**క్ర. అపి, చ, స్మర్యతే**

**ప్ర.అ.** అపి చ = **ఇంకను,** స్మర్యతే = **స్మృతులలో కూడ చెప్పబడినది.**

**వి. ఏ ఆశ్రమమూ లేని దిగంబరుడైన సంవర్తుడు మొదలైన వారు మహాజ్ఞానులైనట్లు స్మృతులలో, మహాభారతములో చెప్పబడినది.**

[**నారాయణ వాక్యము :** రామాయణములో శబరి మహాజ్ఞాని. హస్తామలక ఆచార్యుడు బాల్యములోనే బ్రహ్మజ్ఞానమునందినాడు. జడభరతుడు ఏ ఆశ్రమములేకున్నా పూర్వాభ్యాసము వలన మహాజ్ఞాని అయినాడు. శ్రీ సూర్యభాస్కరేంద్ర సరస్వతీ స్వాములవారు తమ తపస్సువలన, తపనవలన, సాధనవలన, నిష్ఠవలన, శ్రద్ధవలన, సత్యము, తపస్సువలన బ్రహ్మవిద్యాధికారము అందినారు.]

## (463) III-4-38

**సూ. విశేషానుగ్రహశ్చ ॥**

**క్ర. విశేషానుగ్రహః, చ**

**ప్ర.అ.** విశేషానుగ్రహః = **విశిష్ఠ, కర్మాచరణము వలన,** చ = **కూడ**

**వి.** భార్యా విముక్తుడు నిజమునకు గృహస్థుడు కాదు. కావున గృహస్థాశ్రమ ధర్మములు చేయలేడు. అలాగే ఒక బీదవాడు ఆశ్రమ ధర్మములకు నిర్వర్తించుటకు కావలసిన సాధన సామాగ్రి లేనందున ఆ విధులు నిర్వర్తించలేడు. **అలాంటి వారు ధ్యానము, ఉపవాసము, జపము మొదలైన వానిని ఆచరించి దానివలన జ్ఞానమును సంపాదించవచ్చును.**

ఆ సాధనలు ఏ ఆశ్రమమునకు విరుద్ధములు కావు.

"జప్యే నైవతు సంసిద్ధ్యే
బ్రహ్మణో నాత్ర సంశయః
కుర్యాదన్యన్న వాకుర్యాన్
మైత్రో బ్రాహ్మణ స ఉచ్యతే" మనుస్మృతి II-3-7

"జపము ద్వారా బ్రాహ్మణుడు మోక్షాన్ని పొందవచ్చును. దేనిని ఆచరించినా, ఆచరించక పోయినా, దయాశాలియైనవాడు బ్రాహ్మణుడే" (భ.గీ.IV-45)

భగవద్గీతలో యోగభ్రష్టుడు మరల సంసిద్ధుడు ఎలా అవుతాడో చక్కగా చెప్పబడింది.

"పూర్వాభ్యాసము వలన నతడు
కోరి దలచుకున్న లాగ బడుచు
నరయ యోగ జిజ్ఞాసుడైన యంత
త్వర శబ్ద బ్రహ్మమును దాటి వేయు" (భ.గీ.VI-44)
"ప్రయత్నమున యత మానుడైన యోగి
దా యగుచు సంశుద్ధ కిల్బిష నిర్మలంబు
వేయి జన్మల సంసిద్ధ పరమ స్థితిని
నయముగా బొందు యీ జన్మగొప్పదాని" (భ.గీ.VI-45)

**ప్రస్తుత సాధన, పూర్వాభ్యాసములు రెండూ ఆశ్రమ కర్మలలో సంబంధము లేకున్నా బ్రహ్మజ్ఞానము వైపు తీసుకువెళుతాయి.**

(మనుస్మృతి.ఉ.II-3-7, భ.గీ.VI-44,45)

## (464) III-4-39

సూ. **అతస్త్వితరజ్జ్యాయో లిఙ్గాచ్చ ॥**

క్ర. **అతః, తు, ఇతరత్, జ్యాయః, లింగాత్, చ**

ప్ర.అ. అతః = **ఇంతకంటే,** తు = **అయితే,** ఇతరత్ = **అన్యమూ,** జ్యాయః= **శ్రేష్ఠము,** లింగాచ్చ = **శ్రుతి, స్మృతులందలి లింగముల, గుర్తుల వలన గూడ.**

వి. **ఆశ్రమ కర్మలతో సంబంధము లేకున్నా ప్రస్తుత సాధన మరియు పూర్వాభ్యాసము రెండూ బ్రహ్మ జ్ఞానము వైపు తీసుకువెళ్లుతాయి అని చెప్పబడినప్పటికీ దానికంటే ఏదో ఆశ్రమములో వుండి ఆ ఆశ్రమ ధర్మములు నిర్వర్తించుటయే శ్రేష్ఠము అని శ్రుతి చెప్పుచున్నది. ఎందుకంటే, సాధన బాహుళ్యము వలన ఆ ఆశ్రమ స్థితి త్వరగా బ్రహ్మవిద్య సాధనము అవుతుంది.**

"ఈ మార్గము సాక్షాత్తుగా బ్రహ్మ ద్వారా అనుభూతము. ఆ మార్గమున పుణ్యకర్మములు చేయువాడు పరమాత్మ, తేజస్వరూపుడు మరియు బ్రహ్మ." (బృ.ఉ.IV-4-9)

'బ్రాహ్మణుడు యజ్ఞము, దానము, తపము ద్వారా బ్రహ్మమునంద వలయును" (IV-4-22)

"ఏ ఆశ్రమమూ లేకుండా ద్విజుడు ఒక్కరోజు కూడా వుండరాదు. ఒక సంవత్సరము పాటు ఏ ఆశ్రమము లేకుండా వుంటే అతడు కృచ్ఛము చేయాలి" అని స్మృతి చెబుతున్నది.

(కృచ్ఛము అంటే 12 ఏండ్ల తీవ్రమైన ఆహార నియమాలు చేయటము)

"నహి కశ్చిత్ క్షణమపి, జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ, సర్వః ప్రకృతిజైర్గుణైః" (భ.గీ.III-5)
"లేరు ఒక్క క్షణమందు గూడ

కర్మచేయనివారు ఎవరు కూడ
ప్రకృతీజంబగు గుణము వలన
సర్వులు చేతురస్వతంత్రులగుచు"
కనుక,
"నియతం కురు కర్మ త్వం, కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాఽపి చ తే, న ప్రసిద్ధ్యేదకర్మణః" (భ.గీ.III-8)
"నియతమైన కర్మంబు నీవుచేయు
శ్రేయంబు నకర్మముకన్న చేయకర్మ
పయనంబు శరీరముది సిద్ధించలేదు
నయమైన కర్మంబు నీవు చేయకున్న" (భ.గీ.III-8)

**కావున ఏదో ఆశ్రమములో వుంటూ, ఆ ఆశ్రమ నియతమైన సత్కర్మములు చేస్తు బ్రహ్మవిద్యా ప్రాప్తికి సాధన చేయుటయు యుక్తము, శ్రేష్ఠము.**

[**నారాయణ వాక్యము :** గృహస్థాశ్రమములోనే వుంటూ సహజ పాండిత్యదక్షులు, నిరాడంబర తపస్వి, పరమపవిత్రులు అయిన శ్రీ సుద్దాల సీతారామ సరస్వతి గారి శిశ్యులైన వరకవి ముద్దు బాలంభట్టు గారు రెండు వందల సంవత్సరముల క్రింద "మంథెన రామాయణము", "శివ పురాణము" అనే ఉత్తమ యక్షగాన గ్రంథములు రచించినారు. ఆయన రామభక్తి, శివభక్తితో సంగీత భక్తి జ్ఞాన ధ్యాన యోగియై వాక్సిద్ధినంది జీవన్ముక్తులైనారు.

మంథెనలో, అచ్చలాపురములో వాటి పరిసరములలో నేటికీ ఆ రచనలలోని పాటలను, గీతములను అనేకు భక్తులు గానము చేస్తుంటారు. "విశేషానుగ్రహశ్చ" (బ్ర.సూ. (463)) అనే సూత్రము ఆయనకు అక్షరాలా వర్తిస్తుంది.

- గృహస్థాశ్రమము తరువాత వానప్రస్థము లాంటి ధ్యాన, ఉపాసన, సాధనలలో వుండిన పూర్వతరమునకు చెందిన శ్రీ వడువత సూర్యనారాయణ (సూరన్న) గారు నిరంతర ఓంకారేశ్వర ధ్యానము, ఉపాసనలో వుండి బ్రహ్మజ్ఞానమునందినారు.

  వారి సంతతికే చెందిన మారుపాక అన్నమ్మ గారు మరియు వడువత మధుసూదన్ గారు గురుకృపతో బ్రహ్మవిద్యాధికారము కలిగినవారు.
- గృహస్థాశ్రమములో వుండిన శ్రీ వజ్జల రాధాకృష్ణ సిద్ధాంతి గారు నిరంతర జప, తప, ధ్యానముల ద్వారా సిద్ధినందించినారు. ఆయనకు వాక్శుద్ధి, వాక్సిద్ధి, బ్రహ్మానుభూతి ద్వారా వచ్చినవి.
- మంత్రపురి యోగినియైన దోమల రాధమ్మ గారు దత్తాత్రేయ ఉపాసకురాలై సిద్ధినందినారు. ఆమె నైజాము కాలములో మంథెనలో దత్తమందిరము ప్రజల సహాకారముతో, స్వంతశక్తితో నిర్మించి నైజాము ప్రభుత్వ ప్రధానియైన సర్‌కిషన్ ప్రసాద్ గారు మంథెనికి రావటానికి కారణమైనారు, దాని వలన మంథని అభివృద్ధి ప్రఖ్యాతి ముందడగు వేసింది.
- సంగీత భక్తి జ్ఞాన యోగినియైన గట్టు (వడువత) అన్నమ్మ గారు నిరంతర భక్తిగాన, దేవీ ఉపాసనల ద్వారా బ్రహ్మవిద్యార్హతనందినారు.]

(బృ.ఉ.IV-4-9, IV-4-22, భ.గీ. III-5-8)

## (10) తద్భూతాధికరణము (146)

## (465) III-4-40

**సూ. తద్భూతస్య తు నాతద్భావో జైమినే రపి నియమాతద్రూపా భావేభ్యః**

**క్ర. తద్భూతస్య, తు, న, అతద్భావః, జైమినేః, అపి, నియమాతద్రూపా భావేభ్యః**

**ప్ర.అ.** తద్భూతస్య = **ఉన్నతాశ్రమమున నున్న వానికి,** తు = **అయితే,** న = **వలదు,** అతద్భా వఃస్య = **దానిని విడచి పూర్వాశ్రమమునకు పోవుట,** జైమిని రపి = **జైమిని మహర్షికి కూడ ఇదియే సమ్మతము,** నియమాతద్రూపా భావేభ్యః = **ఎందుంటే శాస్త్రములందు వెనుకకు పోవు నియమము లేదు, మరియు అతద్రూపము, అభావము అనే కారణాల వలన.**

**వి. యతి ఆశ్రమమును స్వీకరించిన వారు, మరల పూర్వాశ్రమ ధర్మములను అనుష్ఠించాలని తలపుతో గాని, రాగాదులకు వశులై గాని తిరిగి గృహస్థాశ్రమములు స్వీకరించుటము యుక్తము అగునా అనే ప్రశ్నకు సమాధానము ఈ సూత్రార్థము.**

**యతి ఆశ్రమములో వున్నవారు చ్యుతిని పొందకూడదు అంటే క్రిందకు పడవలదు. ఎందుకంటే నియమము, అతద్రూపము మరియు అభావము అనే కారణముల వలన.**

**నియమము :**

"అత్యంత మాత్మనమాచార్యకులే
అవసాదయస్సర్వ ఏతే పుణ్యలోకా
భవంతి బ్రహ్మ సంస్థో అమృతత్వమేతి" (ఛాం.ఉ. 3-8)

"ఆచార్య కులవాసము పూర్తి అయిన తరువాత గురువు అనుజ్ఞ పొంది నాలుగు ఆశ్రమములలో దేనినైను ఒక దానిని గ్రహించి బ్రహ్మ సంస్థుడై అమృతత్వము అందాలి" అని అనటము వలన ఆశ్రమ భ్రంశము పనికిరాదని తెలుస్తున్నది. ఇది నియమము

**అతద్రూపము :** అటువంటి అవకాశము లేదు.

"బ్రహ్మచర్యం సమాప్య గృహీభవేత్, గృహీభూత్వా వనీభవేత్, వనీభూత్వా ప్రవ్రజేత్, యదివేతరధా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్, గృహద్వా వనాద్వా" జాబాల-4

"గృహస్థుడు కావలెను, గృహస్థుడు అయిన తరువాత వానప్రస్థుడు కావలెను, లేకుంటే మరల బ్రహ్మచర్యమునసుండవలెను. గృహమందు కాని వనమందు కాని." దీనియందు ఆరోహణలే కనిపిస్తుంది కాని అవరోహణ లేదు. కావున యతియైన వాడు మరలి రాగూడదు.

**అభావము :** అటువంటి శిష్టాచారము లేదు. శిష్టులైవారెవరూ ప్రచ్యుతి చెందినట్లు లేదు. అసలు యతి ఆశ్రమమునే ఒప్పుకొనని జైమిని మహర్షి కూడ సన్యాసశ్రమము నుండి ప్రచ్యుతిని అంగీకరించలేదు. కావున సన్యాసాశ్రయమునందిన వారికి తిరుగులేదు. **సన్యాసాశ్రమునందిన వారు నిరంతర బ్రహ్మచింతనచే, బ్రహ్మ విద్యా పారంగతులై బ్రహ్మానుభూతికై సాధన చేయవలయును. (ఛాం.ఉ.II-23-1, జాబాల-4)**

[నారాయణ వాక్యము :
**యతులు నిరంతరము ఏకాంతము, ఉపవాసము, మౌనము, నిరాడంబరము మరియు ధ్యానములను అనుష్ఠించుచు అహంకారమును లేకుండ చేసి ఆత్మానుభూతి, బ్రహ్మానుభూతి నందవలెను. మంథనిలో శ్రీరామకృష్ణానంద స్వామి గారు (హరేరామ స్వామి గారు) ఈ ఐదింటిని అక్షరాల పాటించిన బ్రహ్మానుభూతులు.**]

## (11) అధికారికాధికరణము (147)

## (466) III-4-41

**సూ. న చాధికారికమపి పతనానుమానాత్తదయోగాత్**

**క్ర. న, చ, అధికారికమ్, అపి, పతనానుమానాత్, తదయోగాత్**

ప్ర.అ. న = **కాదు,** చ = **ఇంకను,** అధికారికమ్=**ఇతర ఆశ్రమస్థులకు ప్రాయశ్చిత్తమునకు అధికారులైన వారికి ఏ ప్రాయశ్చిత్తము చెప్పబడినదో అది,** అపి = **కూడ,** పతనానుమానాత్ = **ఎందుకనగా, స్మృతియందు వారికి మహాపతనముగా మన్నించబడినది.** తద యోగాత్ = **అందుచే వారికి ప్రాయశ్చిత్తము ఉపయోగపడదు.**

వి. బ్రహ్మచర్యాశ్రమమునందున్న బ్రహ్మచారికి వ్రతభంగమైనపుడు వారికి శ్రుతి స్మృతులందు ప్రాయశ్చిత్తము చెప్పబడినది. వారు అట్లే గృహస్థులకు నియమ భంగములకు ప్రాయశ్చిత్తము వున్నది. వారు ప్రాయశ్చిత్తమునకు అధికారులు వానప్రస్థులుగాని, సన్న్యాసికాని ఆయా ఆశ్రమములు స్వీకరించి, తిరిగి గృహస్థాశ్రమము ప్రవేశించి కాయ భోగాదులలో ప్రవృత్తులై పతితులైనచో వారికి శాస్త్రములో ఎట్టి ప్రాయశ్చిత్తము చెప్పబడలేదు. స్మృతులందు వారికి అతిశయపతనము అని చెప్పబడినది. ప్రాయశ్చిత్తమునకు వారు అధికారులు కారు.
జైమిని ఆచార్యులు కూడ అట్లే అంగీకరించినారు.
**సన్న్యాస, వానప్రాస్థాశ్రయము వారికి పతనమైనపుడు ప్రాయశ్చిత్తము చెప్పబడలేదు.**

## (467) III-4-42

**సూ. ఉపపూర్వమపి త్వేకే భావమశనవత్తదుక్తమ్॥**

**క్ర. ఉపపూర్వమ్అపి, తు, ఏకే, భావమ్, అశనవత్, తదుక్తమ్**

ప్ర.అ. ఉపపూర్వమ్ = **దీనిని ఉపపాతకమని,** అపితు = **కూడ మన్నించినారు,** ఏకే = **కొందరు,** అశనవత్ = **భోజన సమయమునకు భంగము కలిగినచో జనులు చేయు ప్రాయశ్చిత్తము వంటి ప్రాయశ్చిత్తము కల,** భావమ్ = **భావము ఇచట ఒప్పుకొనుచున్నారు,** తదుక్తమ్ = **అది యుక్తము**

వి. **కొందరు ఆచార్యుల ప్రకారము, బ్రహ్మచారి తన వ్రత భంగము నంది ప్రాయశ్చిత్తమునకు అధికారి అగునట్లు, వానప్రస్థుడు, సన్న్యాసి ప్రాయశ్చిత్తమునకు అధికారి అగుచున్నాడు.**
**ఎందుకనగా ఇది ఉపపాతకము, మహాపాతకము కాదు.**

ఉపపాతకమునకు శాస్త్రమున ప్రాయశ్చిత్తము వున్నది. అందువలన అభక్ష్య భక్ష్యాదులకు ప్రాయశ్చిత్తమున్నట్లు దీనికి కూడ ప్రాయశ్చిత్తము వుండవలెను.

**దీక్షలో లోపం వస్తే వానప్రస్థులు, పరివ్రాజకులు కూడా కృచ్ఛ్రవ్రతము మొదలైన ఉపావాస వ్రతములు, శాస్త్ర విహితమైన ప్రాణాయామాములు చేయాలి అని తెలుస్తున్నది.**

**[నారాయణ వాక్యము :**

సన్యాసాశ్రమము నుండి గృహస్థాశ్రమమునకు తిరిగి వచ్చిన అద్భుతమైన దృష్టాంతము భారతదేశ ఆధ్యాత్మిక చరిత్రలో కలదు.

13వ శతాబ్దములో గోదావరీ తీరములో అపేగాంవ్ అనే గ్రామములో గోవిందపంతుకు విఠలపంతు జన్మించినాడు. వేదాభ్యాసము తరువాత విఠల్‌పంత్ పునా దగ్గర చంద్రభాగానదీ తీరములో వున్న ఆళందీ తీర్థానికి వెళ్లినాడు. అక్కడ సిద్ధోపంతు అనే పండితుడు తన కుమార్తె రుక్మిణిని, విఠల్ పంతకు ఇచ్చి పెండ్లి చేసినాడు. తరువాత విఠలపంతు తన భార్యతో సహా అపేగాంవ్‌లో వున్న తన తండ్రి గోవింద పంతు దగ్గరికి వెళ్లినాడు. కొద్ది కాలములో విఠలవంతు తల్లిదండ్రులు గతించినారు. విఠలపంతు, రుక్మిణి మరల ఆళందీకి వెళ్లినారు.

విఠలపంతు విరాగియై కాశీకి వెళ్లి శ్రీ రామానంద స్వామి దగ్గ సన్యాసము స్వీకరించినాడు తరువాత స్వామి గారు విఠలపంతుతో కలిసి రామేశ్వరము వెళ్లినారు. ఆళందీలో ఆగినారు.

అక్కడ తనకు నమస్కారము చేసిన రుక్మిణిని పుత్రవతివి కమ్మని స్వామి రామానంద ఆశీర్వదించినారు. అపుడు ఆయనకు విఠలపంతు, రుక్మిణి సంగతి తెలిసి స్వామి అతనిని గృహస్థాశ్రయము మరల స్వీకరించాలని ఆదేశించినారు మరియు విఠలపంతుకు ప్రాయశ్చితము చేయించినారు.

స్వామి గారు రామేశ్వరము వెళ్లినారు. విఠలపంతు, రుక్మిణీదేవికి నివృత్తి, జ్ఞానదేవ్, సోపాన్‌దేవ్ అనే కుమారులు ముక్తాబాయి అనే కుమార్తె కలిగినారు.

సన్యాసము నుండి తిరిగివచ్చిన విఠలపంతును, రుక్మిణిని వారి పిల్లలను అప్పటి సమాజము స్వీకరించిలేదు. (సన్న్యాసులకు ప్రాయశ్చితము చెప్పబడలేదు కనుక!) పిల్లలకు ఉపనయనము చేయుటయే కష్ఠమైనది. అప్పుడు మొత్తము కుటుంబము త్ర్యంబకేశ్వరము వెళ్లినారు. పర్వతము ప్రదక్షిణము చేస్తుంటే అరణ్యములో పులి ఎదురైనది. అందరూ అటునిటు పరిగెత్తినారు. నివృత్తి పరిగెత్తి అంజనీ పర్వతములో వున్న గుహలోకి వెళ్లినాడు అక్కడ నాథ సంప్రదాయములోని 9వ నాథ యోగి (నవనాథులలో) గహనీ నాథుడు తపస్సు చేస్తున్నాడు. ఆయన నివృత్తిని గ్రహించి నివృత్తికి "రామకృష్ణ హరి" అనే మంత్రము ఉపదేశించి నాథ సాంప్రదాయములో ప్రవేశింపచేసినాడు. నివృత్తి నివృత్తినాథుడు, మహాజ్ఞాని అయినాడు. ఆ బాల యోగియే తన సోదరులకు, చెల్లెలికి గురువు అయినాడు. జ్ఞానదేవుడు జ్ఞానేశ్వరుడై ప్రఖ్యాతి గాంచినాడు. నివృత్తినాథుని ఆదేశము ప్రకారము జ్ఞానేశ్వరుడు తన 12వ ఏటనే గీతా జ్ఞానము అంది నేవాసాలో ప్రవరా నదీ తీరములో మరాఠీ భాషలో గీతాగానం ప్రవచించినాడు.

మహారాష్ట్రలోని అహమ్మద్‌నగర్ జిల్లాలో గోదావరీ తీరము దగ్గర గోదావరీ ప్రవహ సంగమము దగ్గర నెవాసా వున్నది.

అక్కడ ప్రవరానదీ తీరమున కరవీరేశ్వర మందిరము వున్నది. ఆ మందిరములోనే పరమ జ్ఞానియైన జ్ఞానేశ్వర మహారాజ్ ఒక నల్లని స్థంభమున కామకోది క్రీ.శ. 1287 నుండి క్రీ.శ. 1290 వరకు జ్ఞానేశ్వరీ ప్రవచనము చేసినారు.

ఆ పుణ్య సమయములో జ్ఞానేశ్వరుని గురువు శ్రీ నివృత్తినాథ్, సంత్ సోపాన్‌దేవ్, ఆదిశక్తి ముక్తాబాయి ఆసీనులై వుండగా శ్రీ జ్ఞానేశ్వరుడు భగవద్గీతను మరాఠీలో గానం చేస్తుంటే శ్రీ సచ్చిదానంద బాబా వ్రాసినారు. అపుడు ఎందరో మహాసంతులు అది చూసి, విని సంతసించినారు.

ఆ నల్లటి పవిత్ర స్థంభము నేటివరకు గోదావరికి దక్షిణ తీరం దగ్గర ప్రవరాతటమున శ్రీ కరిదీరేశ్వర మందిరములో విలసిల్లుచున్నది. (దీనిని చిత్రములో చూడవచ్చును)

ఆ విధముగా సన్న్యాసాశ్రమములోని వారికి కూడ ప్రాయశ్చిత్తము ఇతర ఆశ్రమములలో వలె వుండాలని, వున్నదని ఆ మహాజ్ఞాని శ్రీరామనంద స్వామి ఇచ్చిన ప్రాయశ్చిత్తము ఆదేశము వలన భారతదేశానికి శ్రీనివృత్తినాథ్, శ్రీ జ్ఞానేశ్వర్, శ్రీ సోపాన్‌దేవ్, శ్రీ ముక్తాబాయి వంటి మహా యోగులు లభించినారు మరియు మహారాష్ట్రకు శ్రీ జ్ఞానేశ్వరీ భగవద్గీత అనే అత్యద్భుతము, అమోఘము అయిన గ్రంథము దొరికినది. ప్రతి మహారాష్ట్రునికి శ్రీ జ్ఞానేశ్వరీ ఒక అమృత వరము. ప్రతి మరాఠీ ఇంట్లో శ్రీ జ్ఞానేశ్వరీ గ్రంథము వుంటుంది.

**ప్రతి పొరపాటుకు ప్రాయశ్చిత్తము వుంటుంది. లేకపోతే ఏదో ఒక మహానుభావుడు ప్రాయశ్చిత్తము కలిగిస్తాడు!**

"యేన మహాజన గతః సః పంథా!"
"మహాజనులు వెళ్లినదే అందరికీ మార్గము"]

**కావున ఊర్ధ్వరేతస్కాశ్రముల వారికి నైష్ఠిక బ్రహ్మచారులకు, వానప్రస్థులకు, సన్యాసులకు కూడా ప్రాయశ్చిత్తాలు వున్నట్లు తెలుస్తున్నది.**

## (12) బహిరధికరణము (148)

## (468) III-4-43

**సూ. బహిస్తూభయథాఽపి స్మృతేరాచారాచ్చ ॥**

**క్ర. బహిః, తు, ఉభయథా, అపి, స్మృతేః, ఆచారాత్, చ**

ప్ర.అ. బహిః = **బహిష్కరించబడినది,** తు = **అయితే,** ఉభయథాఽపి = **రెండు విధముల కూడ,** స్మృతేః = **స్మృతి ప్రమాణము వలన,** ఆచారాత్ = **శిష్టాచారము వలన,** చ = **కూడా**

వి. **ఉన్నతమైన ఆశ్రమము నుండి పతితుడైన సన్న్యాసి కాని, వానప్రస్థుడు కాని మహాపాతకుడనియో, ఉపపాతికి అనియో రెండు విధముల కూడా (ఉభయధా) శిష్ట సాంప్రదాయము, వైదికాచార వ్యవహరమును సిద్ధించుచున్నది. వారి పతనము భోగాసక్తి వలననే కలుగుచున్నది. అందుచే**

**వారు బ్రహ్మవిద్యకు అర్హులు కారు. శ్రేష్ఠ పురుషులు వారితో కలిసి యజ్ఞము, స్వాధ్యాయము, వివాహము మొదలైన సంబంధములు పెట్టుకొనరు.**

**[నారాయణ వాక్యము :**

ఉన్నతాశ్రమముల నుండి పతితులగు వారు రెండు తీర్ల దిగిపోతారు. భోగ వాంఛలతో, ధనాసక్తితో, కామ కారణములతో, మరియు సుఖాసక్తిలో కావాలని పతితులైన వారు బ్రహ్మవిద్యకు అర్హులు కారు మరియు శ్రేష్ఠ పురుషులు వారితో సంబంధము పెట్టుకొనకపోవటము యుక్తము. ఇహ పరముల రెండింటిలో వారు స్థాయి కోల్పోతారు. అయితే బాధ్యత వలన, గురువు ఆజ్ఞ వలన, ఇతరుల కష్టములు తొలగించుట కొరకు ఉన్నతాశ్రమము నుండి క్రిందికి రావటము పాతకము కాదు. వితలపంతు వలె వారికి ప్రాయశ్చిత్త మార్గము, బ్రహ్మవిద్యార్హత రెండు వుండటము సరియైనదియే.

**ఆశ్రమము నుండి అవరోహణ భోగాసక్తితో, స్వార్థముతో అయినపుడు ప్రాయశ్చిత్తము వుండదు. విద్యార్హత వుండదు. ఆశ్రమము నుండి అవరోహణ నిస్స్వార్థముతో, సేవాభావముతో, బాధ్యతతో, గురువు ఆజ్ఞతో అయితే ప్రాయశ్చితము మరియు బ్రహ్మవిద్యార్హత రెండు వుండాలి!]**

## (13) స్వామ్యధికరణము (149)

## (469) III-4-44

**సూ. స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః**

**క్ర. స్వామినః, ఫలశ్రుతేః, ఇతి, ఆత్రేయః**

ప్ర.అ. స్వామినః = **ఉపాసన యందు యజమానికే కర్తృత్వము,** ఫలశ్రుతేః= **ఎందుకనగా శ్రుతియందు యజమాని కొరకే ఫలవర్ణనము చేయబడినది.** ఇతి = **అని,** ఆత్రేయః = **ఆత్రేయుడు చెప్పెను.**

వి. **శ్రుతిలో ఫలవర్ణనము వలన అంగాశ్రితోపాసనల కర్త యాజమానుడే అని ఆత్రేయ మహర్షి అభిమతము. ఉద్గీథాది కర్మాంగోపాసనలలో కర్త యజమానుడే అవుతాడు, ఋత్విక్కు కాదు.**

ఎందుచేతనంటే "ఎవడీ ఉపాసనలను ఎరుగునో ఆ పురుషుడు వృష్టియందు పంచవిధములైన సామోపాసనలను చేయును. అతని కొరకు వర్షము కురియును. అతడు వర్షము కురిపించుటకు సమర్థుడగును" (ఛాం.ఉ.II-3-2)

"ఉద్గాథ తన కొరకు కాని యజమానుని కొరకు కాని ఏ కోరికను కోరునో దాని సంబంధమైన ఆ గానము చేయును." (బృ.ఉ.I-3-28)

**ఈ విధమైన ఫలవర్ణనము చేయు శ్రుతుల వలన యజ్ఞము చేయు యజమానికే దాని ఫలము సమకూడును.**

**అందువలన ఫలకామనా యుక్తములైన ఉపాసనలకు కర్తృత్వము కూడ యజమానిదే అగుట యుక్తము. ఫలము, కర్తృత్వము రెండు యజమానిదే అని ఆత్రేయ మహర్షి మతము.**

(ఛాం.ఉ. II-3-2; బృ.ఉ. I-3-28)

## (470) III-4-45

సూ. ఆర్త్విజ్యమిత్యౌడులోమిస్తస్మై హి పరిక్రీయతే ॥

క్ర. ఆర్త్విజ్యమ్, ఇతి, ఔడులోమిః తస్మై, హి, పరిక్రీయతే

ప్ర.అ. ఆర్త్విజ్యమ్ = కర్తృత్వము ఋత్విక్కునిదే, ఇతి = అని, ఔడులోమిః = ఔడులోమి ఆచార్యుని మతము, తస్మై = ఆ కర్మ కొరకు, పరిక్రీయతే = ఆ ఋత్విజుడు ధన దానాదుల ద్వారా వరించ బడుచున్నాడు.

వి. ఔడులోమి ఆచార్యుని ప్రకారము కర్తృత్వము యజమానిది కాదు, ఋత్విజునిది. అయితే ఫలము యజమానునికే లభించును. ఎందుకనగా ఋత్విజుడు, ఆ కర్మ కొరకు యజమాని చేత ధనదానాదుల వలన వరింపబడినాడు. అందుచేత ఋత్విజుడు దాతచేత ఈయబడు దక్షిణలకు, దానములకు మాత్రమే అధికారి. ఫలమునకు అతడు అధికారి కాడు.

## (471) III-4-46

సూ. శ్రుతేశ్చ ॥

క్ర. శ్రుతేః, చ

ప్ర.అ. శ్రుతేః = శ్రుతి ప్రమాణము చేత, చ = కూడ, ఔడులోమి మతము సరియైనది అని సిద్ధించుచున్నది.

వి. యజ్ఞమందు ఋత్విజుడు ఏ కామనను "కోరునో అది నిస్సందేహముగా యజమాని కొరకే కోరుచున్నాడు" అని శతపథ బ్రాహ్మణము చెప్పుచున్నది.

ఈ విషయమును గూర్చి అడిగిన యజమానితో ఉద్గాథ ఇలా అనుచున్నాడు.

'ఈ సామగానమును చేసి ఏ యే వాంఛితములు (కోరికలను) సంపాదించవలెను?"

(ఛాం.ఉ.I-7-8)

ఈ ప్రకారము శ్రుతుల నుండి గూడ కర్మ యొక్క కర్తృత్వము ఋత్విజునిది అనియు, ఫలాధికారము యజమానిది అనియు తెలియుచున్నది.

(ఛాం.ఉ. I-7-8)

## (14) సహకార్యంతరవిధ్యధికరణము (150)

## (472) III-4-47

సూ. సహకార్యన్తరవిధిః పక్షేణ తృతీయం  తద్వతో విధ్యాదివత్ ॥

క్ర. సహకార్యన్తరవిధిః, పక్షేణ, తృతీయమ్, తద్వతః, విధ్యాదివత్

ప్ర.అ. సహకార్యన్తరవిధిః = ఇంకొక సహకారియైన సాధన విధానము, పక్షేణ = ఒక పక్షముననుసరించి, తృతీయమ్ = బాల్యము, పాండిత్యముతో కలిసి చెప్పబడిన మూడవదైన మౌనము సాధనము

**అది విధేయము,** తద్వతః= **బ్రహ్మ విద్యా సాధకునికి,** విధ్యాదివత్ = **మరియొక చోట చెప్పబడిన విధి వాక్యము వలె.**

వి. "ఈషణత్రయమును త్యజించి, బ్రాహ్మణుడు పాండిత్యము నెరిగి, బాల్య భావముతో నుండి, మౌనము వహించి దానినుండి కూడ ఉపరతుడై బ్రహ్మభావమునంది బ్రహ్మమును పొందును." (బృ.ఉ.III-5-1)

**ఇచట బ్రహ్మమును గూర్చిన శాస్త్రీయ జ్ఞానము పాండిత్యము. వికారములు లేకుండుట బాల్యభావము. నిరంతర మననము నిది ధ్యాసము మౌనము. ఈ మూడింటి యొక్క పరిపక్వావస్థ కలిగినంతటనే బ్రహ్మసాక్షాత్కారము కలుగునని అర్థము.**

(బృ.ఉ.IV-4-23)

## (473) III-4-48

సూ. **కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః**

క్ర. **కృత్స్నభావాత్, తు, గృహిణా, ఉపసంహారః**

ప్ర.అ. కృత్స్నభావాత్ = **గృహస్థాశ్రమమునందు అన్ని ఆశ్రమముల భావముండుట వలన,** తు = **కూడ,** గృహిణా = **గృహస్థాశ్రమములో,** ఉపసంహారః = **బ్రహ్మ విద్యా ప్రకరణము ఉపసంహరించబడినది.**

వి. **గృహస్థాశ్రమము నందు నాలుగు ఆశ్రమముల భావమున్నది. ఎందుకనగా బ్రహ్మచారి గృహస్థాశ్రమమునందున్న గురువు చెంతనే బ్రహ్మచర్య వ్రత పాలనము చేయుచున్నాడు. వానప్రస్థునకు, సన్యాసికి కూడా ఆశ్రయము గృహస్థుడు. అందుచేత ఆ ప్రకరణము గృహస్థుని వర్ణనముతో ముగియుచున్నది. పూర్వ ప్రకరణము సన్యాసాశ్రమమునకు సంకేతము.**

అది సాధనలు సుగమమగుటకు లక్ష్యముగా పెట్టుకొనినది. ఏ ఆశ్రమములో నున్నవాడు ఐనను సాధకుడు బ్రహ్మజ్ఞాన సంపాదనకు పుత్రేషణాది సర్వకామములను, రాగద్వేషాది వికారములను సర్వదా నశింపచేసి మననశీలుడు కావలసినది. సన్యాసాశ్రమమందు స్వభావ సిద్ధముగా వాని అభావము కలదు. ఈ సుగమతను దృష్టిలో పెట్టుకొని అట్లు చెప్పబడినది.

**కాని ఇతర ఆశ్రమముల వారికి బ్రహ్మవిద్యాధికారము నిషేధింపబడలేదు.**

## (474) III-4-49

సూ. **మౌనవదితరేషామప్యుపదేశాత్ ॥**

క్ర. **మౌనవత్, ఇతరేషామ్, అపి, ఉపదేశాత్**

ప్ర.అ. మౌనవత్ = **మననశీలతకు వలె,** ఇతరేషామ్ = **ఇతర ఆశ్రమములందున్న వారికి,** అపి = **కూడ,** ఉపదేశాత్ = **ఉపదేశము చేయబడుట చేత సమస్తాశ్రమములందు బ్రహ్మ విద్యాధికారము సిద్ధించుచున్నది.**

వి. **ఏ రీతిగా పూర్వ ప్రకరణములో మౌన రూపసాధన అందరికి విధానమని చెప్పబడినదో, అదే**

**రీతిగా శ్రుతియందు ఇతర ఆశ్రమముల వారికి కూడ విద్యోపయోగములైన సమస్త సాధనలు ఉపదేశింపబడినవి.**

“ఏవంవిత్ శాంతో దాంతః ఉపరతః తితిక్షుః సమాహితో భూత్వా, ఆత్మన్యేవాత్మానం పశ్యతి సర్వమాత్మనం పశ్యతి”

“అది తెలిసిన శాంతుడు, దాంతుడు, ఉపరాతుడు, తితిక్షువు, సమాహితుడు అయి తనలో ఈ సమస్తమును ఆత్మస్థరూప పరమాత్మగా సాక్షాత్కారము చేసికొనును.” ఇట్టి వచనములే అన్యప్రకరణములలో చెప్పబడినవి. దీని వలన బ్రహ్మవిద్యాధికారము అన్ని ఆశ్రమములవారికి కలదని తెలియుచున్నది.

(బృ.ఉ.IV-4-23)

## (15) అనావిష్కారాధికరణము (151)

## (475) III-4-50

**సూ. అనావిష్కుర్వన్నన్వయాత్ ॥**

**క్ర. అనావిష్కుర్వన్, అన్వయాత్**

ప్ర.అ. అనావిష్కుర్వన్ = **తన గుణములను ప్రకటింపక బాలకుని వలె దంబాభిమానరహితుడై,** అన్వయాత్ = **బ్రహ్మ విద్యా సమన్వితుడగుట వలన పై వాక్యము సిద్ధించుచున్నది.**

**వి.** “తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్” (బృ.ఉ.III-5-1)” ఆ బ్రహ్మము (మహిమ) తెలిసినవాడు శాంతుడు దాంతడు ఉపరతుడు, తితిక్షువు, సమాహితుడు అయి తనలో ఈ సమస్తమును ఆత్మస్థ రూపపరమాత్మగా సాక్షాత్కారము చేసికొనును.” ఇట్టి వచనములే అన్య ప్రకరణములలో చెప్పబడినవి. దీని వలన బ్రహ్మవిద్యాధికారము అన్ని ఆశ్రమముల వారికి కలదని తెలియుచచున్నది. (బృ.ఉ.III-5-1)

“కాబట్టి బ్రాహ్మణుడు పూర్తిగా బాల్యాన్ని-పాండిత్యాన్ని పొంది ముని అవుతాడు” అని చెప్పబడినది. ఇక్కడ బాల్యము అంటే ఏమిటి అర్థము? అల్లరితనమా? తెలియని తనమా? చిన్నతనమా? ఇక్కడ బాల్యము అంటే బాలకునిలాగా తన జ్ఞానాన్ని ప్రజలకు వ్యక్తం చేయకుండా కేవలము శుద్ధభావము కలిగియుండటము.

పాండిత్యము అంటే బ్రహ్మవిద్యాజ్ఞానము. అంటే బాలకుడు ఇంద్రియాల ప్రాబల్యము లేని వాడైనందున తన దర్పాన్ని, దంబాన్ని బయటపెట్టకుండా నిర్మలమైన, శుద్ధభావము కలవాడై ఉన్నట్లుగానే, సన్యాసి కూడా శుద్ధభావంతో వుండాలి అని భావము. ఇటువంటి అర్థము వున్నప్పుడే సమన్వయము అవుతుంది.

**బ్రహ్మజ్ఞాని అయివుండి కూడా బాలునివలె శుద్ధముగా మౌనముగా తెలియని వానివలె ఉండటము శ్రేష్ఠము.**

(బృ.ఉ.III-5-1)

## (16) ఐహికాధికరణము (152)

## (476) III-4-51

సూ. **ఐహికమప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనాత్ ॥**

క్ర. **ఐహికమ్, అపి, అప్రస్తుతప్రతిబంధే, తద్దర్శనాత్**

ప్ర.అ. ఐహికమ్ = **ఈ జన్మ యందే ఫలప్రాప్తి కలుగవచ్చును,** అపి = **ప్రతి బాధయున్నను,** అప్రస్తుతప్రతిబంధే = **ఏ విధమైన ప్రతిబంధము ఉపస్థితము కాకున్న యెడల,** తద్దర్శనాత్ = **ఈ విషయము శ్రుతి, స్మృతులలో కనిపించుచున్నది.**

వి. ఇక్కడ జ్ఞానోత్పత్తిని గూర్చి చెప్పబడుచున్నది. "జ్ఞానము అనేది ఈ జన్మలో కలుగుతుందా ? మరొక జన్మలో కలుగుతుందా?" అనే ప్రశ్న వస్తుంది.

**కర్మఫలశేషం అడ్డం లేకపోతే ఈ జన్మలోనే జ్ఞానోత్పత్తి కలుగుతుంది. ఒకవేళ కర్మ ప్రతిబంధకము ఏదైనా వుంటే మరు జన్మలో జ్ఞానము కలుగవచ్చు.**

అందుకే "కర్మమనేది విచిత్ర పరివాకము కలది" అని అన్నారు.

గర్భములో వుండగానే వామదేవునికి జన్మాంతర శ్రవణము వలన జ్ఞానము వచ్చినది.

"మాతృ గర్భములో నివసించుచు నేను సకల దేవతల యొక్క జన్మ వృత్తాంతమును తెలుసుకొంటిని. మొదట అనగా తత్త్వ జ్ఞానము ఏర్పడుటకు పూర్వము లోహ మయములైన ఎన్నియూ మేకులు నన్ను రక్షించుచుండెడివి. తత్త్వ జ్ఞాన ప్రాప్తి పిమ్మట గరుడ పక్షివలె వేగముగా వానిని ఛేదించుకొని తిరుగుచు బయటకు వచ్చితిని." అని గర్భమందే శయనించి యుండిన వామదేవ మహర్షి, వివరములను వర్ణించి చెప్పెను.

బ్రహ్మజ్ఞానియైన వామదేవ మహర్షి ఈ రీతిగా దేహనాశము కారణముగా పైకెగసి మీ స్వర్గలోకమందు సకల భోగములననుభవించి అమృతత్త్వమును శాశ్వతముగా పొందెను."

(ఐ.ఉ.II-4-5,6)

**ఈ విధముగా ఈ జన్మములోనే బ్రహ్మప్రాప్తి కలుగవచ్చును.**

"తత్ర తం బుద్ధిసంయోగం, లభతే పౌర్వదేహికమ్ ।

యతతే చ తతో భూయః, సంసిద్ధౌ కురునందన" (భ.గీ.VI-43)

"మహాజ్ఞాని భరతముని, జింకపైన మమకారం వలన జింకగా జన్మించి, పూర్వ జ్ఞానము వలన కర్మములన్ని వదిలి జడభరుతునిగా జన్మించి పూర్వ జన్మ బ్రహ్మ జ్ఞానము వలన ముక్తి బడసెనని" స్మృతులలో వున్నది.

**కావున బ్రహ్మజ్ఞానము ఈ జన్మలో గాని మారు జన్మలో గాని కలుగువచ్చును.** అయితే "ఎవరిని గురించి వినటానికి కూడా అనేక మందికి సంభవము కాదో, ఎవరిని గురించి విని కూడా

అనేక మంది తెలుసుకొనలేరో" (కఠ.ఉ.II-7) అనే శ్రుతి వాక్యముల వలన ప్రతిబంధకాలు కూడా వుంటాయని తెలుస్తున్నది.

**ఉపాసన ద్వారా, మౌనము ద్వారా, తపస్సు ద్వారా, అనుగ్రహము ద్వారా ప్రతిబంధకములు వీడిపోగానే బ్రహ్మజ్ఞానము ముక్తి కలుగుతుంది.**

(ఐ.ఉ.II-4-5,6; భ.గీ.VI-43; కఠ.ఉ.II-7)

## (17) ముక్తిఫలానియమాధికరణము (153)

## (477) III-4-52

**సూ.** **ఏవం ముక్తిఫలానియమస్తదవస్థావధృతేస్తదవస్థావధృతేః ॥**

**క్ర.** **ఏవం, ముక్తిఫలానియమః, తదవస్థావధృతేః, తదవస్థావధృతేః**

**ప్ర.అ.** ఏవం = **ఈ ప్రకారము,** ముక్తిఫలా నియమః = **ఏదో ఒక లోకముననే ముక్తి రూపఫలము ప్రాప్తించునని నియమము లేదు.** తదవస్థావధృతేః = **ఎందుకనగా ఆ అవస్థ నిశ్చితముగానై యున్నది.**

**వి.** బ్రహ్మవిద్యతో కూడిన వానికి రూపఫల విషయమందు ఈ జన్మలోనా, జన్మాంతరమందా అను నియమము లేదు. అట్లే ఈ లోకముననా, బ్రహ్మలోకమున అను నియమము లేదు.

**"ఎప్పుడు హృదయమందు సమస్తకామములు సర్వదా అభావస్థితిని పొందునో, అప్పుడు ఆ సాధకుడు అమృతుడగును. అతనికిక్కడనే బ్రహ్మప్రాప్తి కలుగును." ఇట్టి శ్రుతివాక్యముల వలన ముక్తావస్థ యొక్క స్వరూపము సుశ్చితము ఐనది. అందుచే ఎవరికి అట్టి స్థితి శరీరముండగానే యగునో అతనికి అప్పుడే బ్రహ్మ ప్రాప్తి కలుగును. ఎవరికి ఇక్కడ అట్టి స్థితి కలుగదో అతనికి బ్రహ్మలోకము చేరినపుడు బ్రహ్మసమానస్థితి ప్రాప్తి కలుగును.**

ఇట్లు

**తృతీయాధ్యాయ చతుర్థ పాదము**



# తృతీయాధ్యాయ చతుర్థ పాద సమాసము

## బహిరంగ సాధన పాదము

**1. పురుషార్థాధికరణము**

బ్రహ్మజ్ఞానము వల్లనే మోక్షము, పరమ పురుషార్థము లభిస్తుంది. బ్రహ్మ జ్ఞానము కర్మాంగము కాదు. వేదాంత జ్ఞానము వలన, సన్యాసము వలన, త్యాగము వలన అమృతత్వము, బ్రహ్మానుభవము అవుతుందని నిశ్చయముగా చెప్పబడినది. జ్ఞానము, కర్మ బంధమునకు విరుగుడుమందు, సమాధానము మరియు కత్తి. జ్ఞానముతో చేయబడే కర్మములు కూడా పవిత్రము అవుతాయి. బ్రహ్మజ్ఞానము కర్మాంగము కాదు. మోక్షసాధనము.

**2. పరామర్శాధికరణము**

బ్రహ్మచారులకు, గృహస్థులకు, వానప్రస్థులకు సన్యాసులందరికీ బ్రహ్మవిద్యాధికారము సమముగానున్నది. విద్య కర్మాంగము కాదు, స్వతంత్రము. నాలుగు ఆశ్రమములను గూర్చి విధి శ్రుతులలో చెప్పబడలేదనే జైమినిమహర్షి అభిమతము సమంజసము కాదు. ఎవరికైనను ఎపుడు బలీయమైన వైరాగ్యము కలుగునో అపుడే సన్యాసము స్వీకరించవచ్చును. సన్యాసము క్రమముగా, బ్రహ్మ చర్యము నుండి గార్హస్థము, గార్హస్థము నుండి వానప్రస్థము, వానప్రస్థము నుండి సన్యాసము కాని, నేరుగా (బ్రహ్మచర్యము నుండి, గార్హస్థము నుండి లేక వానప్రస్థము నుండి) కాని పొందవచ్చును. యతి ఆశ్రమము శ్రుతులలో చెప్పబడ్డది.

**3. స్తుతిమాత్రాధికరణము**

"ఉద్గీథాది శ్రుతులు కర్మాంగములు కనుక కేవలము స్తుతి కోసమే" అని అనటము సమంజసము కాదు. అపూర్వమైన రసతమత్వాది గుణములతో కూడిన ఉద్గీథాదుల ఉపాసనయే విధించబడినదనుట సమంజసము. విద్య కర్మాంగము కాదు. కర్మకు అంగభూతమని ఉద్గీథము స్తుతించబడలేదు. దానికి ప్రత్యేక ఉపాసనావిధానము, ఫలములు కలవు. కొన్ని శ్రుతులు స్తుతి పరాలు కావు. ఉపాసనలను విధిస్తున్నాయి.

**4. పారిప్లవాధికరణము**

ఉపనిషత్తులలో చెప్పబడిన అభ్యాసము, కథలు విద్యాశేషములే కాని కర్మశేషములు కావు. పారిప్లవ కర్మలకు పారమార్థక విద్యా కథలకు సంబంధము లేదు. పారిప్లవకథలు యజ్ఞముల మధ్యలో సమయము సమన్వయముగా జరగటానికి చెప్పబడు కథలు. పారమార్థకకథలు జ్ఞానబోధకు సహకరించటానికి చెప్పబడిన తత్త్వగుళికలు. ఉపనిషత్తులోని కథలు శిష్యులకు విద్యయందు అభిలాష కల్గించటానికి ఆ విద్యను తేలికగా బోధించటానికి ఉపయోగ కారకములు. ఆ కథలు ఉపాసనకోసము చెప్పబడినాయి అనటము సమంజసము. ఉపనిషత్తుల్లోని కథలు క్రతుకర్మాంగాలు కావు.

**5. అగ్నీంధనాద్యధికరణము**

ఏ వస్తువులు, పదార్థములు లేకుండా అయ్యే బ్రహ్మయజ్ఞము కర్మలను అపేక్షించదు. బ్రహ్మవిద్య పరమపురుషార్థసిద్ధి యందు సర్వదా స్వతంత్రమగుట వలన కర్మకు అంగము కాదు. సన్యాసులకు కర్మానుష్ఠానము అక్కరలేదు.

**6. సర్వాపేక్షాధికరణము**

జ్ఞానోత్పత్తికి విహిత కర్మలు ఉపయోగిస్తాయి. యజ్ఞము, దానము, తపము, ఆధ్యయనము అనునవి మోక్షాన్ని ఇప్పించలేకపోయినా యోగ్యతను బట్టి జ్ఞానోత్పత్తి విషయములో సహాయపడుతాయి. శమ, దమాది సాధనములు బ్రహ్మవిద్యకు అవసరము. మదము, మాత్సర్యము, కామము, క్రోధము, లోభము, మోహము అను ఆరుగురు శత్రువులను తరిమివేయటము మరియు శమము, దమము, ఉపరతి, తితీక్షా, శ్రద్ధా, సమాధానము అను ఆరుగురు మిత్రులను దరిచేయటము, బ్రహ్మవిద్యకు, బ్రహ్మప్రాప్తికి తోడ్పడుతాయి.

**7. సర్వాన్నానుమిత్యధికరణము**

ప్రాణాపాయ సమయములో నిషిద్ధమైన ఆహారాన్ని దేనినైనా తిని ప్రాణము నిలుపుకోవటము యుక్తము. ఆహారనియమాలకు సడలింపు వుంది. ఏది తినవచ్చునో, ఏది తినరాదో నిర్ణయించే శాస్త్రములు వున్నాయి. శాస్త్రములకు విరోధము రావలదు కనుక అన్నిరకాల అన్నానికి, ప్రాణ భయము వున్నప్పుడుతప్ప, అనుమతి గలదు అనేది ప్రాణవిద్యాంగము కాదు అనటము సమంజసము. అభక్ష్యభక్షణము కేవలము ప్రాణసంకటములోనే మరియు కేవలము ఆపద్ధర్మము రీతిలోనే అనుమతము. శాస్త్రప్రకారము నిర్దేశించిన భక్ష్యము, అభక్ష్యముల నియమము పాటించవలెను. అన్నీ తినగలిగినా అయోగ్యములను వదలవలెను, యోగ్యములను స్వీకరించవలెను.

**8. ఆశ్రమకర్మాధికరణము**

ఆశ్రమములలో వున్నవారు బ్రహ్మజ్ఞానమందిన పిదప కూడ తమ తమ ఆశ్రమవిహితమైన కర్మములు చేయుచుండవలయును. శ్రేష్ఠకర్మలు వ్యవహారికముగా కామ్యకర్మలు ఫలములనిచ్చుటలో మరియు అధ్యాత్మికముగా జ్ఞానమందుటకు సహాయకారిగా రెండు విధములుగా ఉపయోగమగును. నిత్యకర్మములు జ్ఞానసహకారులు కూడా అవుతాయి. అన్ని ఆశ్రమములకు సంబంధించిన శ్రేష్ఠ కర్మలు కూడా సాధకునిలోని అవిద్య, రాగము, ద్వేషము, అస్మిత మొదలైన క్లేషములను పోగొట్టి విద్యాఉత్పదకాలు అవుతాయి. అందుచేత అధ్యయనము, దానము మొదలైన నిత్యకర్మలు విద్యకు, జ్ఞానానికి సహాయకములు అవుతాయి. బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధన చేయుటయు యుక్తము, శ్రేష్ఠము. మోక్షాపేక్ష లేనివారు కూడా ఆశ్రమ విహితకర్మలు చేయవలెను.

**9. విధురాధికరణము**

ఆశ్రమరహితులకు కూడా బ్రహ్మవిద్యాధికారము వున్నది. కేవలము అశ్రమస్థితులమీదనే కాకుండా

సాధకుని ఉపాసన, నిష్ఠ, అభ్యాసము, నిరంతరసాధన మీద ఆధారపడి వుంటుంది. ఏ ఆశ్రమము లేని దిగంబరుడైన సంవర్తకుడు మొదలైనవారు మహాజ్ఞానులైనట్లు స్మృతులలో వున్నది. ప్రస్తుత సాధన, పూర్వాభ్యాసములు రెండూ ఆశ్రమకర్మలతో సంబంధము లేకున్నా, బ్రహ్మజ్ఞానము వైపుకు తీసుకువెళ్లుతాయి.

ఏదో ఆశ్రమములో వుంటూ, ఆ ఆశ్రమనియతమైన సత్కర్మలు చేస్తూ బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనచేయుటము యుక్తము. శ్రేష్ఠము.

## 10. తద్భూతాధికరణము

ఉన్నతాశ్రమముననున్న వారు అనగా యతిఆశ్రమ స్వీకారము చేసినవారు చ్యుతిని పొందకూడదు. ఎందుకంటే నియమము, అతద్రూపము, అభావము అనే కారణాలవలన. ఆశ్రమభ్రంశము పనికి రాదనేది నియమము. ఆశ్రమములలో ఆరోహణ వున్నది కాని అవరోహణ (క్రిందికి వచ్చుట) ఎక్కడా చెప్పబడలేదు, ఇది అతద్రూపము. అటువంటి శిష్టాచారము లేదుకనుక, ప్రచ్యుతి అనేది లేకపోవటము అభావము. సన్యాసాశ్రమమునందిన వారికి తిరుగులేదు. సన్యాసాశ్రమము నందినవారు నిరంతర బ్రహ్మచింతనచే బ్రహ్మవిద్యానిష్ఠులై బ్రహ్మానుభూతికి సాధన చేయవలయును.

## 11. ఆధికారికాధికరణము

సన్యాస, వానప్రస్థాశ్రమముల వారికి ప్రాయశ్చిత్తము చెప్పబడలేదు. జైమినిమహర్షి కూడ అట్లే చెప్పినారు.

## 12. బహిరధికరణము

ఉన్నతమైన సన్యాసి కాని, వానప్రస్థుడు కాని పతనము చెందిన యెడల స్మృతి ప్రమాణము చేత మరియు శిష్టాచారము చేత, రెండు విధముల బహిష్కరింపబడుదురు. ప్రచ్యుతి పొందిన నైష్ఠికునికి సంఘ బహిష్కారం వుంది.

## 13. స్వామ్యధికరణము

ఉద్గీథాది ఉపాసనలకు కర్త ఋత్విక్కే. ఫలకామనా యుక్తములైన ఉపాసనలకు ఫలము మరియు కర్తృత్వము రెండు యజమానికే చెందును అని ఆత్రేయ మహర్షి అభిమతము. ఔడులోమి ఆచార్యుని అభిమతములో ఫలము యజమానిది కాని, కర్తృత్వము ఋత్విజునిది. ఎందుకంటే ఋత్విజుడు యజమానిచే ధన-దానాదులచే వరింపబడును కావున శ్రుతులప్రకారము కూడ కర్తృత్వము ఋత్విజునిది మరియు ఫలము యజమానిది.

## 14. సహకార్యంతరవిధ్యధికరణము

జ్ఞానము (పాండిత్యము), వికారములు లేకుండుట (బాల్యభావము), నిరంతర మననము (నిది ధ్యాసము-మౌనము) అను మూడింటి యొక్క పరిపక్వావస్థ కలిగినంతనే బ్రహ్మసాక్షాత్కారము యగును. గృహస్థాశ్రమములో నాలుగు ఆశ్రమముల భావమున్నది. సన్యాసాశ్రమములో బ్రహ్మవిద్య స్వభావసిద్ధము. అయితే ఇతర ఆశ్రమముల వారికి బ్రహ్మవిద్యా నిషేధము లేదు.

బ్రహ్మవిద్యాధికారము అన్ని ఆశ్రమముల వారికి కలదు. పాండిత్య, బాల్యాలతో పాటు మౌనం కూడా విధియే. !

**15. అనావిష్కారాధికరణము**

బాల్యమంటే రాగక్రోధాదులు లేని నిర్మల భావం. బ్రహ్మజ్ఞాని అయివుండి కూడా బాలునివలె శుద్ధముగా మౌనముగా తెలియని వానివలె ఉండటము శ్రేష్ఠము.

**16. ఐహికాధికరణము**

బ్రహ్మజ్ఞానము ఈ జన్మలోనే కాని మారు జన్మలో కాని కలుగవచ్చును. బ్రహ్మజ్ఞానప్రాప్తికి ప్రతిబంధకములు కూడా వుంటాయి. ఉపాసనద్వారా, మౌనము ద్వారా, తపస్సుద్వారా, అనుగ్రహముద్వారా ప్రతిబంధకములు వీడిపోగానే బ్రహ్మజ్ఞానము, ముక్తి కలుగుతుంది.

**17. ముక్తిఫలఅనియమాధికరణము**

మోక్షమనేది అందరికి ఒక్కటే. బ్రహ్మవిద్యా విదునకు ముక్తి ఫలము ఈ జన్మలో లేక మరుజన్మలో అని నియమము లేదు. అట్లే ఈ లోకములోనా, బ్రహ్మలోకములోనా అనే నియమము కూడా లేదు. ఎప్పుడు హృదయము నందు సమస్తకామములు సర్వథా అభావ స్థితిని పొందునో, అపుడు ఆ సాధకుడు అమృతుడగును. అతనికి ఇప్పుడు ఇచ్చటనే బ్రహ్మప్రాప్తి కలుగును. ఎవరికి ఇక్కడ అట్టి స్థితి కలుగదో అతనికి బ్రహ్మలోకము చేరగానే బ్రహ్మప్రాప్తి కలుగును.

ఇట్లు

**తృతీయాధ్యాయ చతుర్థపాద సమాసము.**

# తృతీయాధ్యాయ చతుర్థపాద సారము

## బహిరంగ సాధన

దేని జ్ఞానమువలన మోక్షము, పరమపురుషార్థము లభిస్తుందో, దేని జ్ఞానము కర్మాంగముకాదో, వేదాంత జ్ఞానము వలన, సన్న్యాసము వలన, త్యాగము వలన అమృతత్వము మరియు దేని అనుభవము అవుతుందో, దేని జ్ఞానము కర్మబంధమునకు విరుగుడు మందు, సమాధానము మరియు కత్తియో, దేని జ్ఞానముతో చేయబడుకర్మలు పవిత్రమో, దేని జ్ఞానము కర్మాంగము లేక కర్మాంశము కాదో, దేని జ్ఞానము స్వతంత్రముగా మోక్షసాధనమో,

దేని విద్యాధికారము బ్రహ్మచారులకు, గృహస్థులకు, వానప్రస్థులకు మరియు సన్యాసులకు సమముగా నున్నదో, దేని విద్య కర్మాంశము కాక స్వతంత్రమో, దేనిని గూర్చి సాధన చేయగల నాలుగు ఆశ్రమములను గూర్చి విధి శ్రుతులలో చెప్పబడలేదు అనిన జైమిని మహర్షి అభిమతము సరికాదో, దేని కొరకు ఎవరైనను ఎపుడైనను వైరాగ్యము కలిగినపుడు సన్యాసము స్వీకరించవచ్చునో, దేని జ్ఞానము పొందుట కొరకు సన్యాసము క్రమముగా కాని, నేరుగా కాని పొందవచ్చునో,

దేని కొరకు ఉద్దేశించబడిన ఉద్గీథాది శ్రుతులు కర్మాంగములు కావో మరియు అవి కేవలము స్తుతి కోసము కావో, దేని ఉద్దేశించబడిన ఉద్గీథవిద్య కర్మాంగము కాదో మరియు అట్టి విద్యకు ఉపాసనా విధానము, ఫలము కలవో,

ఉపనిషత్తులలో చెప్పబడిన అభ్యాసములు, కథలు దేని విద్యా శేషములేకాని, కర్మశేషములు కావో, పారిప్లవ కథలు దేనిని ఉద్దేశించి కావో మరియు పారమార్థక కథలు దేనిని ఉద్దేశించునవో మరియు అవి దేని జ్ఞానబోధకు సహకరించటానికి చెప్పబడిన తత్త్వ గుళికలో, ఉపనిషత్తులలోని కథలు దేని ఉపాసనకోసమో,

దేనిని గూర్చిన యజ్ఞము ఏ వస్తువులు మరియు పదార్థములు లేకుండా అవుతుందో మరియు కర్మలను అపేక్షించదో, దేనిని గూర్చిన విద్య పరమ పురుషార్థసిద్ధి కలిగిస్తుందో మరియు సర్వదా స్వతంత్ర మగుట వలన కర్మల అంశము కాదో,

యజ్ఞము, దానము, తపము, అధ్యయనము అనునవి మోక్షాన్ని ఇప్పించలేక పోయినా, యోగ్యతను బట్టి దేని జ్ఞానోత్పత్తి విషయములో సహాయపడుతాయో, శమ-దమాది సాధనములు దేని విద్యకు అవసరమో; మదము, మాత్సర్యము, కామము, క్రోధము, లోభము మరియు మోహము అను అరుగురు శత్రువులు లేకుండపోయి; శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ మరియు సమాధానము అను ఆరుగురు మిత్రులు వచ్చి వుండటము వలన దేని విద్యకు, దేని ప్రాప్తికి తోడ్పడుతాయో;

దేనిని ప్రాప్తి చెందే సాధన చేయుట కొరకు ప్రాణపాయ సమయములో నిషిద్ధమైన ఆహారాన్ని ఆపద్ధర్మముగా తినవచ్చునో, దేని ప్రాప్తి సాధనలో అన్ని తినగలగినా అయోగ్యములను వదలి, యోగ్యములు స్వీకరించవలెనో,

దేని జ్ఞానమందిన తరువాత కూడ ఆశ్రమములలోనున్నవారు తమ ఆశ్రమవిహితమైన కర్మములు చేయుచుండవలయునో, శ్రేష్ఠకర్మలు వ్యవహారికముగా కామ్యకర్మల ఫలమునిచ్చుచు అధ్యాత్మికముగా దేని జ్ఞానమందుటకు సహాయకారిగానుండునో; అధ్యయనము, దానము. తపము, యాగము మొదలైన నిత్యకర్మలు దేని విద్యకు, దేని జ్ఞానానికి సహాయ్యము అవుతాయో;

దేని విద్యాధికారము కేవలము ఆశ్రమస్థితుల మీద కాక, సాధకుని నిష్ఠ, ఉపాసన, అభ్యాసము, నిరంతరసాధన మీద ఆధారపడి వుంటుందో, ప్రస్తుత సాధన, పూర్వాభ్యాసము రెండూ ఆశ్రమ కర్మలతో సంబంధము లేకున్నా దేని జ్ఞానమువైపు తీసుకువెళ్లుతాయో, ఏదో ఆశ్రమములో వుంటూ, ఆ ఆశ్రమనియతమైన సత్కర్మలు చేస్తూ, దేని విద్యాప్రాప్తికి సాధన చేయుట యుక్తమో మరియు శ్రేష్ఠమో,

దేని ప్రాప్తికై ఉన్నాతాశ్రమములలో నున్నవారు ప్రచ్యుతి పొందకూడదో, ఆశ్రమములోనే వుంటూ దేని ప్రాప్తికి, దేని అనుభూతికై సాధన చేస్తుండవలయునో,

దేని మార్గములో నున్న సన్న్యాస, వానప్రస్థ ఆశ్రమముల వారికి ప్రాయశ్చిత్తము చెప్పబడలేదో,

దేని మార్గము నుండి పతనము చెందిన సన్న్యాసి కాని, వానప్రస్థుడు కాని స్మృతి ప్రమాణముచేత, శిష్టాచారముచేత బహిష్కరింబడుదురో,

దేని విద్యాసాధనలో సహాయపడు సత్కర్మలు చేయుటములో కర్తృత్వము ఋత్విజునిదో, మరియు ఫలము యజమానిదో,

పాండిత్యము, బాల్యభావము, నిరంతర మననము అను మూడింటి పరిపక్వావస్థ కలిగినంతనే దేని సాక్షాత్కారము యగునో,

సన్న్యాసాశ్రమములో దేని విద్య స్వభావసిద్ధమో మరియు ఇతర ఆశ్రమముల వారికి కూడ దేని విద్యానిషేధము లేదో, దేని విద్యాధికారము అన్ని ఆశ్రమముల వారికి కలదో,

దేని జ్ఞానము ఈ జన్మలోనే కలుగగలదో, దేని జ్ఞానప్రాప్తికి ప్రతిబంధకములు వుంటాయో, ఉపాసనద్వారా, మౌనముద్వారా ప్రతిబంధకములు వీడిపోగానే దేని జ్ఞానము కలిగి, ముక్తి వస్తుందో,

దేని విద్యావిదునకు ఈ జన్మలోనే ముక్తిఫలము అని నియమము లేదో, అట్లే ఈ లోకములోనా, లేక దేని లోకములోనా అనే నియమము కూడా లేదో; ఎప్పుడు హృదయమునందు సమస్త కామములు సర్వదా అభావస్థితిని పొందునో, అపుడు ఆ సాధకుడు అమృతుడై ఇప్పుడు, ఇచ్చటనే దేని ప్రాప్తి పొందునో, ఎవరికి అట్టి స్థితి ఇక్కడ కలుగదో అతనికి బ్రహ్మలోకము చేరగానే దేని ప్రాప్తి కలుగుతుందో, అదియే బ్రహ్మము.

ఇట్లు

**తృతీయాధ్యాయ చతుర్థపాద సారము**

# శ్రీ బాదరాయణీయ
# బ్రహ్మసూత్ర బోధామృత లహరి

## IV
## చతుర్థ అధ్యాయము

### ఫలము

ముక్తినందుటకు ఉపాసన సరిమార్గమ్ము చూడ
సగుణోపాసన వలన బ్రహ్మలోకమందుచుండ
నిర్గుణోపాసన వలన బ్రహ్మానుభూతి యగును
బ్రహ్మజ్ఞానమందిన ఉపాసకుడు బ్రహ్మమగును.

# IV-1
# చతుర్థ అధ్యాయము - ప్రథమ పాదము
## జీవన్ముక్తి

## (1) ఆవృత్త్యధికరణము (154)

## (478) IV-1-1

**సూ. ఆవృత్తిరసకృదుపదేశాత్**

**క్ర. ఆవృత్తిః, అసకృత్, ఉపదేశాత్**

ప్ర.అ. ఆవృత్తిః = **అధ్యయనము చేయుచున్న ఉపాసనమును మరల మరల అభ్యాసము చేయవలెను,** అసకృదుపదేశాత్ = **శ్రుతియందు అనేక పర్యాయములు ఈ విషయము ఉపదేశించబడినందువలన.**

వి. ఉపాసనమును మరల వరల అభ్యాసము చేయవలెనని ఉపనిషత్తులు పలుమార్లు చెప్పుచున్నవి.

"ఆత్మా వా అరే దృష్టవ్య, శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యో" (బృ.ఉ.VI-5-6)

"ఓ మైత్రేయీ! ఆత్మను సాక్షాత్కరించుకోవాలి, వినాలి, మననం చేసుకోవాలి, ధ్యానం చేయాలి" అని యాజ్ఞవల్క్యుడు చెప్పినాడు.

"తమేవ ధీరో విజ్ఞాయ, ప్రజ్ఞాం కుర్వీత" (బృ.ఉ.IV-4-31)

"బుద్ధిమంతుడు ఉపదేశం ద్వారా, శాస్త్రము ద్వారా అపరోక్షజ్ఞానాన్ని పొంది ప్రజ్ఞాసాక్షాత్కారం చేసుకోవాలి"

"సోఽన్వేష్టవ్యః, స విజ్ఞాసితవ్యః" (ఛాం.ఉ.VIII-7-1)

"ఆ పరమాత్మను అన్వేషించాలి, ఆ పరమాత్మను గురించి జిజ్ఞాస చేయాలి."

"జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః" (ముం.ఉ. III-1-8)

"జ్ఞాన ప్రసాదము వలన విశుద్ధాంతఃకరణము కలసాధకుడు, అవయవ రహిత పరమేశ్వరుని నిరంతరం ధ్యానము చేస్తూ నిర్మల సత్త్వముచే దర్శించును"

"ఉపాసతే పురుషం యే హ్యకామాః,<br>
తే శుక్రమేత దతివర్తంతి ధీరాః" (ముం.ఉ. III-2-1)

"కామనారహితులైన సాధకులు పరమపురుషుని ఉపాసించి రజోవీర్యమయ శరీరమును దాటివేయుచున్నారు." ఈ విధముగా ఉపనిషత్తులు ఉపాసనద్వారా, బ్రహ్మదర్శనమును గూర్చి చాటి చెప్పుచున్నాయి.

ఈ ప్రకారము ప్రతిచోట బ్రహ్మవిద్యారూపమైన ఉపాసనము యొక్క అభ్యాసము చేత బ్రహ్మవిద్యాభ్యాసనము చేసి దానిని మాటి మాటికి విచారణచేసి ఆ పరమాత్మయందే సంలగ్నులు కావలెను అని చెప్పబడినది.

(ఛాం.ఉ.VIII-7-1; బృ.ఉ.IV-5-6, IV-4-31; ముం.ఉ. III-1-8; ముం.ఉ.III-2-1)

[నారాయణ వాక్యము : ఇది స్వానుభవము
1983లో అతి క్లిష్ట సమయములో జీవితమే సమాప్తం చేయాలనుకున్నపుడు సుజన గారితో కలిసి మంథెని వెడలినపుడు, గోదావరిలో కాళేశ్వర-ముక్తేశ్వర లింగ ద్వయము శ్రీ పంగునూరి రామన్న అన్న గారి జాడ లభించినది. తరువాత కొత్తపల్లిలో శ్రీ గోపాల్ కిషన్ గారి ద్వారా శ్రీ గీతామకరందము చేతులలోనికి వచ్చినపుడు, కండ్లు మూసి ధ్యానం చేసి, గ్రంథము తెరిస్తే ఇలా వచ్చినది.( భ. గీ. XII-6,7,8)

1. "యే తు సర్వాణి కర్మాణి, మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన, మాం ధ్యాయంత ఉపాసతే" ॥ (భ.గీ. XII-6)

2. "తేషామహం సముద్ధర్తా, మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నాచిరాత్ పార్థ, మయ్యావేశితచేతసామ్" ॥ (భ.గీ.XII-7)

3. "మయ్యేవ మనః ఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ, అతః ఊర్ధ్వం న సంశయః"॥ (భ.గీ. XII-8)

1- "అన్ని కర్మములు నాయందు సన్యసించి,
మనసునెపుడు నా యందు చేర్చి నిలిపి ।
అనన్య యోగ ధ్యానంబు చేయుచుండి,
నన్ను కొలచి యపాసించుచుండునెవడు"॥ (శ్రీ.మ.ఆం.భ.గీ. XII-6)

2- "మృత్యు సమమై యుండు దాని నుండి
లోతు సంసారపు మొసలి పట్టు నుండి ।
యుద్ధరించి వాని గట్టు నెక్కించ గలను
పార్థ నన్ను నమ్మినవాడు మునగ బోడు"॥ (శ్రీ.మ.ఆం.భ.గీ. XII-7)

3- "నా యందు మనసు స్థిరముగా నిలుపు
నా యందు బుద్ధి నివేశంబు చేయు
నా యందు యాపైన నేమగును వదులు
నా యందు తప్పక నివసించ గలవు" (శ్రీ.మ.ఆం.భ.గీ. XII-8)

తరువాత నిరంతర ధ్యానములో, ఏకాగ్రతతో, నిష్ఠతో, తపస్సుగా 18 రోజుల గీతాయోగము చేసినపుడు దర్శనము అయి కొంత బ్రహ్మజ్ఞానము అంది ఆధ్యాత్మికంగా, సామాజికముగా ప్రజాసేవ చేసి "గురూజీ"గా మన్నింపబడటము, ఆ గీతాప్రసాదము మరియు బ్రహ్మస్పర్శ వలననే ఆ సమయములో వ్యాసదర్శనం లభించి సర్వవేద వేదాంతాభ్యాసము అయి, తరువాత విశ్వ సర్వమత చైతన్య రహస్యములు దర్శనమైనవి.

నిరంతర ఉపాసనచే ధ్యానముచే శ్రవణము, మననము నిదిధ్యాసనలచే సత్కర్మ సద్సేవతో, పరమాత్మ దర్శనము, పరమాత్మ కృప, పరమాత్మ సహయోగము తప్పక లభిస్తాయని అనుభవము, అత్యంత విశ్వాసము.]

## (479) IV-1-2

**సూ. లింగాచ్చ**

**క్ర. లింగాత్, చ**

**ప్ర.అ.** లింగాత్ = **శ్రుతి, స్మృతి వర్ణన ప్రమాణము చేత,** చ = **కూడ**

**వి.** ఆవృత్తి చేయటము శ్రుతి, స్మృతి ప్రమాణములలో కూడ వున్నది. ఛాందోగ్యోపనిషత్తులోని ఉద్గీథవిద్యలో, ఆదిత్యోపాసన గురించి వున్నది. సూర్యుని ఉపాసనలో ఏకపుత్ర దోషము వున్నది. అయితే సూర్యుని పుత్రుడగు కౌషీతకీ మహర్షి, తనకు అనేక పుత్రులు కావాలని తన తండ్రి అయిన సూర్యుణ్ణి కోరుకున్నాడు. దాని గురించి ఇలా వున్నది.

"ప్రణవమే ఉద్గీథము, ఉద్గీథమే ప్రణవము. ప్రకాశించు ఆదిత్యుడే ఉద్గీథము మరియు ప్రణవము. సూర్యుడు ఓంకార జపముతో సంచరించుచున్నాడు"

సూర్యుడు తన పుత్రుడు కౌషీతకీ మహర్షితో ఇలా అన్నాడు. "నేను ప్రణవగానము చేయు ఈ విధముగా నీవు కూడా చేయుము. నా కిరణములను ఉద్గీథములుగా భావించుము. దేవతలు చేయు ప్రణవగానము అదియే" (ఛాం.ఉ.I-5-1.)

అప్పుడు కౌషీతకీ మహర్షి ఒక్కక్క కిరణమును ఉద్గీథముగావించి మరల మరల ప్రణవ గానము చేసెను మరియు అనేక మంది పుత్రులను పొందెను. ఇది సూర్యోపాసన ఆవృత్తి.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహర్షి తన పుత్రుడైన శ్వేతకేతుకు "తత్త్వమసి" అని మరల మరల తొమ్మిదిసార్లు బోధించినాడు. ఇది ఉపాసనా ఆవృత్తి

(ఛాం.ఉ.VI-8 నుండి 16 వరకు)

తైత్తరీయోపనిషత్తులో వరుణుడు తన కుమారుడైన భృగు మహర్షిని 5 సార్లు "తపమే బ్రహ్మము. తపస్సు వలన బ్రహ్మమును తెలియుము" అని తపస్సు కోసము మరల మరల పంపినాడు. ఇది ఆవృత్తి.

భగవద్గీతలో

"తస్మాత్ సర్వేషు కాలేషు, మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధిః, మామేవైష్యస్యసంశయః ॥ (భ.గీ.VIII-7)

"కాన సర్వకాలములందును నీవు నరయ
నన్ను స్మృతియించుచు చేయు యుద్ధంబు గూడ
మనము బుద్ధి నాకు యర్పితంబుయైనందువల్ల
నన్ను పొందగలవు నీవు సంశయము లేదు" (భ.గీ.VIII-7)

ఇది మరల మరల నిరంతరము స్మరించే ఆవృత్తి ఉపాసన.

"సతత మనన్య జేతసుడచు నన్ను
నిత్యంబు యెవడు స్మరియించు చుండు
నిత్యయుక్తుడైన యోగి యగును నెవడు
పార్థ నేను వానికి జాల సులభ మగుదు" (భ.గీ. VIII-14)

విభూతి యోగములో భగవానుడు అర్జునునికి తన విభూతిని గూర్చి చెబుతూ

"అహమాత్మా గుడాకేశ"
"నేను ఆత్మను" అని చెప్పి "నేను ఆది నేను మధ్య, అంతమ్ము నేను" అనుచు "నేను ఇది నేను అది" అన్ని ఏన్నో సార్లు చెప్పి

"శూర ఇదియేల అది యేల ఇన్ని యేల
మరి ఇవి యన్నియును నీవు తెలియుటేల
సర్వములు జగములన్నియును గూడ
చేరి నా యేకాంశమున యిమిడి యుండు" (భ.గీ. X-42)

మొత్తము విభూతి యోగము ఆవృత్తియే చివరకు సంజయుడు విశ్వరూప దర్శనము గూర్చి ఇలా చెప్పాడు.

"మరి యద్భుత యద్భుత సంవాద మెపుడు
మరపు లేక దలచి దలచి యందు నేను
వారి వారి కృష్ణార్జునుల మాట రాజ
సారె సారెకు దలుప యానందమాయె" (భ.గీ. XVIII-76)

"హరి హరి యను నరు కోరిక
హరి జేరిన యా పరమ పరమ రూపు
పరి పరి యరయన్నర వర
మరి మరి హర్షమేరై పారెన్" (భ.గీ. XVIII-77)

మరల మరల చేసే ఆవృత్తి ఉపాసన రమ్యముగా నుంటుంది. మనసులో నిలచి ఉంటుంది. జపములన్నీ ఆవృత్తి ఉపాసనలే.
దీనివలన బ్రహ్మ విద్య నిరంతరము అభ్యాసము చేయవలెనని సిద్ధించుచున్నది.

(ఛాం.ఉ. I-5-1, ఛాం.ఉ. VI-8 నుండి VI-16 వరకు; భ.గీ. VIII-7, 14; భ.గీ. X-42, XVIII-76, 77)

## (2) ఆత్మత్వోపసనాధికరణము (155)

## (480) IV-1-3

**సూ. ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ**

**క్ర. ఆత్మా, ఇతి, తు, ఉపగచ్ఛన్తి, గ్రాహయన్తి, చ**

ప్ర.అ. ఆత్మా = **నేను పరమాత్మను (ఆత్మను),** ఇతి = **అనుచు,** తు ఉపగచ్ఛన్తి = **తెలిసికొనుదురు, అనుకొనుదురు, అనుభూతి చెందుదురు,** గ్రాహ్యన్తి = **బోధించెదరు, అర్థము చేయించెదరు, తెలిపెదరు,** చ = **కూడ**

వి. "నేను ఆత్మను" అని తెలిసికొనుట బ్రహ్మానుభూతి, "నీవు ఆత్మవు" అని తెలుపుట బోధన, శిక్ష, ఉపదేశము. ఉపనిషత్తులు ఎన్నో రీతుల ఈ సత్యమును తెలుపుచున్నవి.

"సర్వగ్ం హ్యేతద్బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ,
సోஉయమాత్మా చతుష్పాత్" (మాం.ఉ. 2)

"ఈ సమస్తము బ్రహ్మము. ఈ ఆత్మ కూడా బ్రహ్మమే.
ఆ ఈ ఆత్మ నాలుగు అంశములు (పాదములు) కలది".

"ఏష త ఆత్మా అంతర్యా మ్యమృతః" (బృ.ఉ.III-7-3)

"ఈ నీ ఆత్మ సర్వాంతర్యామి అమృతము"
యాజ్ఞవల్క్యుడు ఉద్దాలకమునికి చెప్పెను.

"ఏష త ఆత్మా సర్వాంతరః" (ఛాం.ఉ.III-4-1)

"ఇదియే సర్వాంతరమగు నీ యొక్క ఆత్మ"
అని యాజ్ఞవల్క్యుడు, చాక్రాయణ ఉషస్తునికి చెప్పెను.

"తత్సత్యం, స ఆత్మా, తత్త్వమసి" (ఛాం.ఉ.VI-8-7)

"అది సత్యము. అది ఆత్మ. అది నీవు" అని ఉద్దాలక మహాముని తన పుత్రుడగు శ్వేతకేతువుకు బోధించెను.

"యః పృథ్వివ్యాం తిష్ఠన్, పృథివ్యాஉంతరో, యం పృథివీ న వేద,
యస్య పృథివీ శరీరం, యః పృథివీయనంతరో యమయతి,
ఏష తే ఆత్మాஉన్తర్యా మ్యమృతః" (బృ.ఉ.III-7-3)

"ఎవరు పృథివియందుండి పృథివికి అంతర్యామియై ఉన్నాడో ఎవరిని పృథివి ఎరుగదో ఎవనికి పృథివి శరీరమో ఆ నీ ఆత్మ అంతర్యామి మరియు అమృతము".

"అహమాత్మా గుడాకేశ, సర్వభూతా శయస్థితః (భ.గీ.X-20)
"నేను ఆత్మను గుడాకేశుండ వినుము

సర్వభూతాశయ స్థితమునే నుండు" (భ.గీ.X-20)
"హృద్దేశమందు అర్జున తిష్ఠించి యుండి
భూతములన్నింటి కీశ్వరుండైన వాడు
యంత్రారూఢుడగుచు తన మాయ చేత
భూతములన్నింటి భ్రమియింపచేయు" (భ.గీ.XVIII-61)

"నేనే పరమాత్మను" - "అహంబ్రహ్మాస్మి" అనే అహం ప్రత్యయముతోనే ఉపాసన చేయాలి. అప్పుడే పరమాత్మను పొందుతారు.

"తత్త్వమసి" - "అది నీవుయై వున్నావు" అనే వాక్యాలు అలాగే బోధిస్తున్నాయి.

"తత్త్వమసి" అని గురువు బోధించినపుడు సాధకుడు అర్థం చేసుకొని, అనుభూతినొంది, తానే ఆ పరమాత్మ అని తెలిసి, "అహం బ్రహ్మాస్మి" అని అంటాడు. అనుకొంటాడు, అనుభూతి చెందుతాడు, అనుమానము చెందదు.

"నేను వేరు, ఆ పరమాత్మ వేరు" అనే భేద భావముతో ఉపాసన చేయరాదు.

(మాం.ఉ. 2); (బృ.ఉ.III-7-3); (ఛాం.ఉ.III-4-1); (ఛాం.ఉ.VI-8-7); (బృ.ఉ.III-7-3); (భ.గీ.X-20); (భ.గీ.XVIII-61)

[**నారాయణ వాక్యము :**
"తత్త్వమసి" మరియు "అహంబ్రహ్మాస్మి" అనే వాక్యాల తత్త్వము, అర్థము, సందేశము, చైతన్యము శ్రీ ఆదిశంకరాచార్యులవారు "ఏకశ్లోకీ"లో ఉత్తమ బోధగా చెప్పినారు. పేజీ 30 చూడండి.]

## (3) ప్రతీకాధికరణము (156)

## (481) IV-1-4

**సూ. న ప్రతీకేన హి సః**

**క్ర. న, ప్రతీకే, న, హి, సః**

**ప్ర.అ.** న = **ఆత్మభావముండదు,** ప్రతీకే = **ప్రతీకయందు,** న = **అది ఉపాసకుని ఆత్మ కాదు,** హి = **ఎందుకనగా,** సః = **అది**

**వి.** "మనో బ్రహ్మేత్యు పాసీత" (ఛాం.ఉ. III-18)
"మనసు బ్రహ్మ" అని ఉపాసన చేయవలెను
"ఆకాశోఽబ్రహ్మేతి" (ఛాం.ఉ. III-18-1)
"ఆకాశము బ్రహ్మ" అని ఉపాసన చేయవలెను
"ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" (ఛాం.ఉ.III-19-1)
"సూర్యుడే బ్రహ్మము ఇది ఆదేశము"

ఈ ప్రకారము వివిధ పదార్థముల యందు బ్రహ్మ రూపముతో ఉపాసన చేయుట చెప్పబడినది.

ఇది ప్రతీకోపాసన. ప్రతీక యందు ఆత్మభావన కలుగదు. ఎందుకంటే అది ఉపాసకుని ఆత్మ కాదు. మూర్తి మొదలైన వాని యందు భగవంతుని ధ్యానము చేసి ఉపాసన చేయబడుచున్నది. అదే విధముగ మనస్సు, ఆకాశము, ఆదిత్యుడు మొదలైన ప్రతీకల యందు కూడ ఉపాసన చేయు విధానమున్నది. భావము ఏమిటంటే మనస్సు మొదలైన వాటిని ప్రతీకగా చేసుకొని వాని యందు భగవానుడను ఉద్దేశ్యముతో చేయు ఉపాసన వలన పరమ దయాళువైన పరమాత్మ తనను ఉపాసించుచున్నట్లు భావించి గ్రహించి ఆ ఉపాసనకు ఆ భావనానుసారము ఫలమునిచ్చును. అందువలన అట్టి ఉపాసనకు కూడ విధానమున్నది.కాని ప్రతీకను ఉపాసకుడు తన అంతర్యామిగ ఆత్మగా మన్నింపలేదు.

(ఛాం.ఉ.III-18-1; ఛాం.ఉ.III-19-1)

## (4) బ్రహ్మదృష్ట్యధికరణము (157)

## (482) IV-1-5

**సూ. బ్రహ్మదృష్టిరుత్కర్షాత్**

**క్ర. బ్రహ్మదృష్టిః, ఉత్కర్షాత్**

**ప్ర.అ.** బ్రహ్మదృష్టిః = **ప్రతీక యందు బ్రహ్మ దృష్టి యుంచవలెను,** ఉత్కర్షాత్ = **బ్రహ్మ సర్వశ్రేష్ఠమగుట వలన**

**వి. ఎపుడు ఒక దేవత యొక్క ప్రత్యక్షోపాసన చేయుటకు సాధన సులభము కాదో అప్పుడు లభ్యమైన వస్తువునందు ఆ దేవత భావన చేసి ఉపాసన చేయవలయును.**

దేవతల యందు ఆ వస్తువు భావన చేసి ఉపాసన చేయరాదు.

ఎపుడు సాధకుడు పరమాత్మ యొక్క తత్త్వమును తెలియకున్నాడో అతని కొరకు ప్రతీకోపాసనా విధానము చెప్పబడినది. అందుచేత ఇంద్రియాదులకు ప్రత్యక్షానుభవమునకు వచ్చు ప్రాణము, మనస్సు, సూర్యుడు, చంద్రుడు మొదలైన వాటిలో ఏదో ఒక దానిలో ఆ పరబ్రహ్మ భావన చేసి ఉపాసించవలెను. పరబ్రహ్మ సర్వ శ్రేష్ఠము మిగిలినవన్నియు నికృష్ఠభావములే. నికృష్ఠమునందు ఉత్కృష్ఠ భావన చేయవచ్చును. ఉత్కృష్ఠమునందు నికృష్ఠ భావన చేయరాదు.

**ఈ ప్రకారము ప్రతీక యందు పరబ్రహ్మ భావము చేసి ఉపాసించుట వలన ఆ పరబ్రహ్మ ఉపాసకుని తనను ఉపాసించినట్లు మన్నించును.**

మనస్సును బ్రహ్మగా తలచి గొప్ప చేయాలి గాని బ్రహ్మను మనస్సుగా తలచి చిన్న చేయరాదు.

నికృష్ఠమైన దానిని (చిన్నదానిని), ఉత్కృష్టమైన దానిగా (పెద్ద దానిగా) చూడవచ్చును గాని, ఉత్కృష్టమైన దానిని (పెద్దదానిని) నికృష్ఠమైన దానిగా (చిన్నదానిగా) చూడరాదు.

"మనో బ్రహ్మేతి ఉపాసీత"లో "మనస్సును బ్రహ్మ అని ఉపాసించవలెను" అని అనటములోనే మనస్సును బ్రహ్మగా తలచాలి అని వున్నది. ప్రతీకను బ్రహ్మగా ఉపాసించాలి. బ్రహ్మమును ప్రతీకగా తలుపరాదు.

[**నారాయణ వాక్యము :**

దేనినైనను బ్రహ్మముగా తలచి ఉపాసిస్తే బ్రహ్మము స్పందన ఇస్తుంది. దేవి ప్రతిమను దేవిగా ఉపాసిస్తే దేవి ప్రసన్నమౌతుంది. కాని దేవిని జడ పదార్థమైన ప్రతిమగా ఉపాసించరాదు.

**స్వానుభవము**

చెన్నై నుండి తెచ్చిన ఒక అత్యంత సుందరమైన లలితాంబికా మూర్తి బరోడాలో సుజన గారికి సమర్పించబడినది.

ఆ దేవి ప్రతిమ మంథెనలోని లలితాంబిక మందిరములో ఉత్సవ మూర్తిగా వుంచాలని అనుకున్నాము. కేవలము సుజన గారికి చూపించటానికే ఆ ప్రతిమను బరోడా తీసుకువెళ్లటము అయినది.

శ్రీమతి సుజన గారు ఆ లలితాదేవి ప్రతిమను సాక్షాత్తు లలితాదేవిగా ఉపాసించటము ప్రారంభించారు.

అప్పుడు ఆ ప్రతిమకు కన్నులు చెక్కబడలేదు. సామాన్యముగా ప్రాణ ప్రతిష్ఠ అయిన తరువాత శిల్పి కన్నులు తన పనిముట్టుతో చెక్కుతాడు. అయితే రెండు నెలల ఉపాసన తరువాత ఆ లలితా దేవికి కన్నులు వచ్చాయి. ఆ కన్నులు చెక్కిన కన్నులు కావు. అవి స్వాభావికముగా వికసించిన దివ్య నేత్రములు. ఒక అపూర్వమైన దివ్య ముద్రలాంటి ముద్రలో వున్న కన్నులు. దేవి కరుణతో చూస్తున్నట్లు వున్నవి. ఆ కన్నులు ప్రతిమ కన్నులు కావు. అవి దేవి కన్నులు. కనుక ఆ దేవి మంథని వెళ్లలేదు. బరోడాలోనే వుండి సుజన గారి సేవలనందుకుంటున్నది. ఆ ఉపాసనలో సుజన గారు లలితా దేవిలో ఐక్యమైనట్లు అనిపిస్తుంది.

ఆ లలితా అమ్మవారి ఫోటో మరియు కన్నులు ఈ సూత్రము ప్రక్కపేజిలోని చిత్రములో చూడవచ్చును.]

## (5) ఆదిత్యాదిమత్యధికరణము (158)

## (483) IV-1-6

**సూ. ఆదిత్యాదిమతయశ్చాంగ ఉపపత్తేః**

**క్ర. ఆదిత్యాదిమతయః, చ, అంగే, ఉపపత్తేః**

ప్ర.అ. ఆదిత్యాదిమతయః = **ఆదిత్యాదుల సంబంధమైన బుద్ధి కలిగి యుండవలెను,** చ = **ఆ విధముగా,** అంగే = **కర్మాంగభూతమైన ఉద్గీథాదుల యందు,** ఉపపత్తేః = **ఎందుకనగా అది యుక్తము సమంజసము.**

వి. "ఈ తపింపచేయు ఆదిత్యుని ఉద్గీథముగా ఉపాసన చేయవలెను. ఇతడు ఉదయించు ప్రజల కొరకు ఉద్గానము చేయుచున్నాడు. ఉదయించుచు అంధకారమును, భయమును నశింపచేస్తున్నాడు. ఎవరు ఇది తెలిసికొని ఉపాసించుచున్నారో అతడు నిశ్చయముగా అంధకారమును, భయమును పోగొట్టువాడగుచున్నాడు." (ఛాం.ఉ.I-3-1)
(ఛాం.ఉ.I-3-1)

# ఆదిత్య ప్రకాశాభిషేకము

**వడోదరా**

**రవి వారము, 6-3-2016**

**"బ్రహ్మదృష్టిరుత్కర్షాత్"**

"ప్రతీకయందు బ్రహ్మదృష్టియుంచవలెను." బ్ర.సూ.(482) IV-1-5

"ప్రతీకగా చేసుకొని దానియందు భగవానుడను ఉద్దేశ్యముతో చేయ ఉపాసన వలన పరమదయాళువైన పరమాత్మ తనను ఉపాసించినట్లు భావించి గ్రహించి ఆ ఉపాసకునకు భావనానుసారము ఫలమునిచ్చును. బ్ర.సూ. (481) IV-1-4

ఇవి సత్యములని ఈరోజు సాయంత్రము 4 గం॥లకు ప్రత్యక్షానుభూతి అయినది.

---

ఇది చదువకపూర్వము బ్ర.సూ. (482) IV-1-5 మొత్తము మరొకసారి చదివి, తిరిగి ఇక్కడకు రాగలరు.)

---

ధన్యవాదములు

వడోదరాలో వెలసియున్న శ్రీ లలితాంబికాదేవి గురించి తెలిసికొన్నారు కదా. ఆ దేవి మహత్యము అద్భుతము. కరీంనగరంలో, హైదరాబాద్‌లో, మంథనిలో ఆమె కృపనందినవారు చాలా వున్నారు. ఆదేవి వలననే, ఆ రూపముతోనే మంథని మందిరములో మహాబలిపురము నుండి వచ్చిన లలితాంబిక వెలుగుచున్నది.

అంతకుముందే "శ్రీ లలితా సహస్రనామ బోధామృతలహరి" గ్రంథము వ్రాయటము అయినది. ఆగ్రంథము చాలా ఆదరణ అందుకున్నది. దాదాపు మంథనిలో అందరి ఇంటా ఆ పుస్తకము వున్నది. అయితే, నారాయణ ప్రతిదినము లలితా సహస్రనామ పారాయణము చేస్తూ వుండలేదు.

మా చెల్లెలు చి॥ల॥సౌ॥ రాధ, శ్రీమతి సుజన గారు, కుమార్తె చి॥ల॥సౌ॥ శైలజ శ్రద్ధాదీక్షలతో అమ్మవారిని ఆరాధించే భక్తురాండ్రు.

15 మాసముల క్రితము సుజనగారు అన్నారు "మీరు కూడా లలితాసహస్రనామ పారాయణము రోజూ చేయండి."

ఆ కోరిక చాలా సౌమ్యముగా, ప్రోత్సాహముగా వుండెను. "అడిగినపుడు కాదనుట సవ్యంబు గాదు" (శ్రీమదాంధ్ర భగవద్గీత). కావున వెంటనే ప్రతిరోజూ భోజనముకన్న ముందు లలితా సహస్రనామ పారాయణము జరుగుతూ వస్తుంది.



"ఆ పరమాత్మకు స్థానమైన హృదయ కుహరములో కూర్చుని తమ పుణ్యఫలాన్ని అనుభవించేవారు ఇద్దరున్నారు. బ్రహ్మవిదులు వారిద్దరినీ వెలుగు నీడలని చెప్పుచున్నారు. (బ్ర.సూ.(393) కఠ.ఉ.III-3-1



**శిల్పి యొక్క పరికరములతో కాక కేవలము శ్రీమతి సుజన గారి ఉపాసనతో దివ్య నేత్రములు వెలసిన, వడోదరాలో విరాజిల్లుతున్న శ్రీ లలితాంబికాదేవి**

**"బ్రహ్మదృష్టిరుత్కర్షాత్" - బ్ర.సూ. (482) IV-1-5**

ప్రతీకయందు బ్రహ్మదృష్టి యుండవలెను. ప్రతీకగా చేసుకొని దానియందు భగవానుడను ఉద్దేశ్యము చేయు ఉపాసన వలన పరమదయాళువైన పరమాత్మ తనను ఉపాసించుచున్నట్లు భావించి గ్రహించి ఆ ఉపాసనకు ఆ భావనానుసారము ఫలమునిచ్చును. బ్ర.సూ.(481) IV-1-4




**వడోదరాలో బ్రహ్మసూత్ర భోదామృతలహరి వ్రాస్తున్నప్పుడు 06.03.2016 నాడు “సచామర రమావాణి” శ్రీ లలితాంబికాదేవికి అయిన ఆదిత్యప్రకాశకిరణాభిషేకము. బ్ర.సూ.(482) IV-1-5, బ్ర.సూ.(483) IV-1-6**



“ఆదిత్య ప్రకాశాభిషేకముఅయిన తరువాత 14-6-2016 నాడు ఈ శ్రీ బాదారాయణ బ్రహ్మసూత్ర బోధామృతలహరి” ముద్రణా అఖరి రోజులలో ఆదిత్యానుగ్రహము Elecon Company Chairman శ్రీ ప్రయాస్విన్ భాయి పటేల్ మరియు శ్రీమతి తరుణా బహెన్ పటేల్ ద్వారా ఆయన స్వయము తీసిన అద్భుత ఆదిత్య దర్శనము అందినది. “అపి చ సంరాధనే” బ్ర.సూ. 342), “బ్రహ్మదష్టిరుత్కర్షాత్” (బ్ర.సూ. 482), “ఆదిత్యాది మతయశ్చాంగ ఉపపత్తేః” (బ్ర.సూ. 483) అనే బ్రహ్మసూత్రాల పరమార్థము సాక్షాత్కారమవటము కేవలము పరమాత్మానుగ్రహమే.

ఒక సంవత్సరము క్రితము మా కుమార్తె చి॥సౌ॥ శైలజ "డాడీ! మీకు ఇప్పుడు రవి దశ నడుస్తున్నది. కనుక రోజూ ఆదిత్య హృదయము చదవండి" అని అడిగినది.

"అడిగినపుడు కాదనుట సవ్యంబుగాదు"

వెంటనే ఆదిత్య హృదయపారాయణ కూడా మొదలైంది. ప్రతి ఉదయము మొదలు ఆదిత్య హృదయము, వెంటనే లలితా పరాయణము.

8 సంవత్సరముల క్రితము ఆదిత్య హృదయము ప్రతినామము అనువాదము తెలుగు గీతములలో చేసియుండినా ఆ పారాయణము చేయలేదు. ఇప్పుడు అవుతుంది.

అయితే సూర్యభగవానుని కృప ఎన్నో రీతుల ఎన్నోసార్లు అందినది. (బ్ర.సూ. (103) I-3-40, బ్ర.సూ. (488) IV-1-1) 1983లో వాషింగ్టన్ వెళ్లినపుడు అక్కడ లభించిన ప్రేరణ వలన "SUN AND WASHINGTON?" అనే గీతము వ్రాయటము అయినది. దానిని ముందరి పేజీలలో చూడగలరు.

అదే విధముగా 1994లో సూర్యభగవానుని అనుగ్రహము Indian Airline ప్రయాణములో అయిన వుదంతము "SUN AND MEDITATION" గూర్చి డా॥ అనిల్ నవ్‌లే గారు వ్రాసినది చూడగలరు.

అయితే ఒక సంవత్సరము నుండి చి॥సౌ॥ శైలజ వలన ఆదిత్య హృదయము, లలితా సహస్రనామములను కూడ పారాయణము చేస్తున్నందులకు సంతోషము అవుతున్నది.

ఈ బ్రహ్మసూత్ర బోధామృతలహరికి-ముందుమాట వ్రాసిన డా॥ ముద్దురామకృష్ణ ఈ గ్రంథమును మరలమరల చదివి Proof Reading చేసి సరిదిద్దుటకు సహయ్యపడుతున్నారు. నేడు ప్రొద్దుటి నుండి మధ్యాహ్నము వరకు హిమాలయములలో జరిగిన సూర్యదర్శనము గూర్చి, సుజన గారి భిక్షేశ్వర దర్శనము గూర్చి, సూర్యభగవానుని గూర్చి దూరవాణిలో సత్సంగము చేసినాము.

సాయంత్రము 4 గం॥లకు సుజన గారు పూజగదిలోకి తాను వెళ్లివెంటనే పిలిచినారు. పూజగది వంటగదిలో వున్నది. పూజాగృహములో లలితాంబికాదేవి ముఖము పడమర వైపు వున్నది. దానిపైన ఝాలీ (Wire net) వున్నది. వంటయింటి పడమరవైపు కిటికీ తెరచి వున్నది. లోపలికి వెళ్లగానే తెల్లగా వెలిగే సూర్యప్రకాశము "సచామర రమావాణీ" అయిన అమ్మవారిపైన అద్భుతంగా కిరణాభిషేకము చేస్తున్నది.

ముగ్గురు అమ్మవార్లు మెరిసిపోతున్నారు. సుజనగారు ఒక ఐదు నిమిషాలు ముందుగాని,

వెనుకగాని వంటఇంటిలోకి వెళితే ఈ కిరణాభిషేక దర్శనము అయ్యేది కాదు. ఆ ఫోటో తీసి శ్రీరామకృష్ణకు, చి॥సౌ॥ శైలజకు, చి॥సౌ॥ పద్మకు పంపినాము.

అప్పుడే వెంటనే స్ఫురించింది ఏమంటే

1.. ఇది లలితా పారాయణము, ఆదిత్య హృదయము పారాయణముల సంయుక్త అనుగ్రహము, ఆశీస్సులు, ఆమోదము.

2.. **"బ్రహ్మదృష్టి"** బ్ర.సూ. (482) మరియు ప్రతీకోపాసనల బ్ర.సూ. (481) ప్రత్యక్షానుభూతి.

డా॥ రామకృష్ణ చాలా సంతోషపడినారు. ఆయనకు పంపిన ఫోటోలో వున్న అమ్మవారి చిత్రము కూడా పూజాగదిలోని చిత్రములో వుండటము, కాంతి ఆ దేవిపై కూడా వెలగటము ఆయన గమనించినారు.

అప్పుడు నేడు సాయంత్రము అయిన కిరణాభిషేకము చిత్రము కూడా ఈ బ్రహ్మసూత్ర బోధామృతలహరిలో వుంచాలని స్ఫురించింది. ఆ చిత్రమును ఎక్కడ వుంచాలి? బ్ర.సూ. (482)లోనే అయితే ఈ చిత్రము బ్ర.సూ. 482 మరియు బ్ర.సూ. 483ల మధ్యలో వస్తుంది. బ్ర.సూ. 483 ఏమిటి?

(483) IV-1-6. "ఆదిత్యాదిమతయశ్చాంగ ఉపపత్తేః" - "ఆదిత్యాదుల సంబంధమైన బుద్ధియుండవలెను."!! (బ్ర.సూ.(483) చూడండి.) అద్భుతము. అమ్మవారి మరియు ఆదిత్య భగవానుల ఆశీస్సులు, ఆమోదము ఇదియే కదా! ఇంకా ఈరోజు రవివారము. శ్రీ లలితా సహస్రనామములలో భానుమండల మధ్యస్థా, ప్రభావతీ, ప్రభారూపా, స్వప్రకాశా, రవిప్రఖ్యా, సావిత్రీ, మార్తండ భైరవారాధ్యా, పరంజ్యోతి, ఓజోవతి, ద్యుతిధరా, తేజోవతి, గాయత్రి, వ్యహృతి, సంధ్యా, ఇంద్రధనుప్రభా మొదలైన అమ్మవారి నామములు ఆదిత్యాదుల సంబంధమైనవే కదా?!

అదే విధముగా ఆదిత్య హృదయములోనున్న ఆదిత్య దేవుని పేర్లు మార్తాండాయ, రవి, ప్రభాకర, సవితా, భాను, తేజస్వి, జ్యోతిర్గణానాం పతయే, జ్యోతిషాం పతే అను మొదలైనవి లలితాసహస్ర నామములలో వున్న లలితాదేవి పేర్లతో సంబంధము వున్నవే కదా?

అంటె సూర్యదేవుని తేజస్సు అమ్మవారే ! అమ్మవారి తేజమే సూర్యదేవుని వెలిగిస్తున్నది కదా !!

అదేకాక అమ్మవారు బంధూక కుసుమప్రఖ్యబంధూక పుష్పము సాక్షాత్తు లలితాదేవి స్వరూపమే.

సూర్యాష్టకములో సూర్యదేవుని "బంధూకపుష్ప సంకాశ" అని సంబోధించబడినది. అంటే లలితాదేవి, సూర్యదేవుడూ ఇద్దరూ బంధూకపుష్ప స్వరూపులే. లలితాదేవి, ఆదిత్య దేవుడూ (నారాయణి, సూర్యనారాయణ) ఒకరే.

రవివారము నాడు రవిప్రఖ్య అయినా లలితాంబిక అమ్మవారిని రవి, తన రవిప్రకాశములో అభిషేకము చేయటము లలితాదేవి యొక్క మార్తాండ భైరవారాధ్యా అనే పేరు అక్షరాలా సత్యము, తథ్యము అవుతుంది.

అదేకాక అమ్మవారు బ్రహ్మగ్రంథివిభేదినీ, ఆబ్రహ్మకీటజననీ, హరిబ్రహ్మేంద్ర సేవితా, అనేక కోటి బ్రహ్మాండజననీ, లీలాక్లుప్త బ్రహ్మాండమండలా, బ్రహ్మరూపా, బ్రాహ్మణీ, బ్రాహ్మీ, బ్రహ్మాణి, బ్రహ్మాత్మైక స్వరూపిణీ, బ్రహ్మ, బ్రహ్మానందా, బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవసంస్తుత వైభవా, పరంజ్యోతి మొదలైన నామములు ధరించిన పరబ్రహ్మ స్వరూపిణి.

అదేవిధముగా ఆదిత్య భగవానుడు బ్రహ్మ, బహ్మ అనే పేర్లతో వెలుగుతున్నాడు. బ్రహ్మసూత్ర బోధామృతలహరి వ్రాస్తున్నపుడు బ్రహ్మాత్మైక స్వరూపిణి ఐన లలితమ్మ బ్రహ్మస్వరూపుడైన రవి ప్రకాశముతో అభిషేకము చేయబడటము అద్వైతామృతానుభవమే.

దీనివలన "బ్రహ్మదృష్టిరుత్కర్షాత్" బ్ర.సూ.(482) మరియు "పరమాత్మ తనను ఉపాసించినట్లు భావించి గ్రహించి ఆ ఉపాసనా భావనానుసారము ఫలమునిచ్చును" బ్ర.సూ.(481), "జ్యోతిర్దర్శనాత్" "జ్యోతి అనే శబ్దము పరమాత్మ వాచకము" బ్ర.సూ.(103), అనేవి అక్షరాలా అనుభూతియైన సత్యము.

ఇదియే శ్రీ లలితాదేవి, అంటే శ్రీ సూర్యభగవానుని అనుగ్రహము.



# SUN AND WASHINGTON

(WASHINGTON) 05.05.1993

**Son Asked :**

How are you! How are you, Sun ?
Tell me Sir how is Washington?

**Sun Replied :**

1. My Dear Man I am as how think you,
   I am same as yourself too.
2. I am that way how you see,
   Reflections of each other is you and me.
3. Consciousness inside you is essence of "ME",
   To experience Me with yourself you "BE"
4. Your bright thought is Sunlight,
   When your thought shines you are sun-bright.
5. Environment, Nature is between Me and you,
   Your mind, nature, is between yourself and you.
6. Your body moves in physical world,
   For Me body is the physical world.
7. Because of me the world shines,
   Because of you the body shines.
8. The light is covered when clouds come,
   The light is covered when doubts come.
9. But do not worry behind clouds is Me,
   Behind the doubts is self-confident; Be.
10. My dear Man you are my son,
    You are chip of old block we are Sun & Son.
11. Now I will tell you how is Washington,
    With you here Washington is more joyful one!

This dialogue between Narayana (Son) and Aditya Bhagavan (Sun) occured in Washington on 05.08.1993, when he was invited to address at "Vision 2000" Conference in chicago and Washington. Narayana's speech of 1993 was for that conference whichcommemorated Swami Vivekananda's speech of 1893 at Chicago.

This intuitional-Inspirational interaction is Narayana's way of connecting with Infinity. All such dialogues are recorded in gurubodh as Divine dialogues, Sixty offerings, Month of Love, Glimpses and Greetings and about Time.

బ్ర.సూ. (103) I-3-40, బ్ర.సూ. (483) IV-1-6

## SUN AND MEDITATION

When I received draft of "Meditation-A Perfect Action. Pathway to Universal Peace" in California from Guruji Shri G. Narayana and when I had gone through the same I felt tremendous feeling of happiness.

This work is full of Insights about Peace, Attention, Awareness, Process of Noble thoughts to Noble peace, the insights of Time consciousness, love consciousness, Truth consciousness and Responsibility consciousness.

Actually Guruji himself is an example of the processes mentioned in the book.

Let me share a profound experience of meditation as a perfect action that occured in 1994.

I was traveling from Delhi to Baroda via Ahmedabad by Indian Airlines flight which started at around 5:00 a.m. in Delhi and scheduled to reach Baroda by 8:30 a.m. I was in the middle seat and Guruji Sri G. Narayana was sitting in window seat next to me. That was first time we were meeting. He was meditating.

Flight reached Ahmedabad in time at about 6:30 a.m. and was expected to leave for Baroda by 7:15 a.m. After lot of waiting, at 7:45 a.m. it was announced that there were heavy rains, strong winds and low visibility at Baroda and there would be delay.

The gentleman next to me became alert and asked air hostess about the situation and was informed that it was not certain when we would leave. He closed his eyes and was silent and still for 10 minutes. Then he took a paper and wrote a note to pilot and sent it though the air hostess. I asked him what was that note about. He replied "We have to reach Baroda by 9:00 a.m. There is a commitment with 40 Engineers of G.S.F.C. for whole day for a leadership training programme. That is a request to pilot to make an attempt to proceed."

I said "Weather is not O.K.!". He smiled and said "It will be O.K. I have meditated and sent message to Sun and Pilot!"

I was shocked and surprised. There was an announcement saying "There is a slight improvement in visibility. We are proceeding to see the possibility of landing".

I was further surprised. I looked at him and introduced myself and smiled. He said "Narayana!" and smiled with warmth and gave a shake hand and told me that "we will land". I thought he was over confident.

We reached Baroda and plane circled and circled. Silent meditation continued. The pilot announced "Situation has worsened. We are going back." Plane gained height and proceeded back.

I smiled and said to my neighbour "Pilot is ready, but Sun is not ready!". Narayana smiled and closed his eyes. His face was calm but serene. He opened his eyes and I said "What will happen?!". Now I was enjoying the network of Sun, Weather, Pilot and Narayana.

He said 'I requested for Sun to appear first and then for the grace for landing.' I laughed "Well! It will be a miracle."

Narayana was looking through window and suddenly pointed out to window and said "Look! There is our Sun!". I looked out and up but it was all cloudy and dim. I said "No! There is no Sun!" Narayana said "Not up! Look down!". I bent over him and looked down. There was the reflection of sun in Mahi river. Through and opening in cloud, sun was reflected in river. Narayana said "Now! Pilot will turn the Plane!". Pilot announed "There is a reduction in rain. We make a last attempt." More surprise! Plane turned once again. The wind and rain were visible. Narayana closed his eyes and remained silent. Plane circled, Meditation continued. It was great experience for me to watch and see. Plane was descending. Pilot said "Ladies and Gentlemen This is it! Let us land!"

We landed! Water splashed all around on the ground. All passengers clapped for pilot. Narayana opened his eyes and we shook hands and he embraced me. I said "Thanks". Narayana pointed out towards up and forward. He took out two copies of the book "Stairways to Excelence". On one of the book he wrote "Congratulations! Thanks!". He gave me the second copy writing on it "To Prof. Navale with love and Light". He had sent the first copy to pilot through Air hostess.

When doors opened we moved forward. Pilot was standing at the door with the copy of "Stairways to Excellence". He was beaming and smiling. Narayana shook

his hand and thanked, admired and embraced him. Pilot said "But for you I would not have tried again."

Mrs. Nanda Dave from Baroda Management Association was all smiles at the exit of Airport. Narayana said "Let us rush!". It was 9:05 a.m.

Narayana became Guruji, mentor and guide to me and my faculty members and many batches of MBA (HRM) students. He inspired us and helped whenever we needed. Whenever I met him I felt the presence of an "Aulia" connecting us to divinity. Meeting him, talking to him and discussing with him always generated elation and joy uplifting the spirit. It is a connecting experience.

His contribution to University, Baroda Management Association and the Industries and Management Leaders, teachers and students is exemplary and profound. I deem it as an honour that Guruji has thought of me for write this foreword and I am very happy that I could dictate this message over telephone.

For me it is a divine blessing that I could witness such a miracle and share the experience with you.

I believe that power of meditation and its practice can transform the wold. My best wishes for the success of the function.

**_ANIL NAVALE**

---

**Prof. Anil Navale is a founder Director of HRM Programme and is former Dean of Faculty of Social Work at Maharaja Sayaji Rao University, Baroda and he is a path making visionary in the field of Human Resources Management and Social Contributions.*



## (6) ఆసీనాధికరణము (159)

## (484) IV-1-7

**సూ. ఆసీనస్సంభవాత్**

**క్ర. ఆసీనః, సంభవాత్**

**ప్ర.అ.** ఆసీనః = **కూర్చుండియే ఉపాసనచేవలెను,** సంభవాత్ = **అట్లున్నపుడు ఉపాసన నిర్విఘ్నముగా సాగుట సంభవము**

**వి.** పరబ్రహ్మమును ఏ రూపమున వినుదుమో, ఏ రూపమున విచారింతుమో, అప్పుడు మనస్సుకు బుద్ధికి ఎట్లు అవగతమగునో, దానిని మరల మరల నిరంతర చింతనము చేయుటను ఉపాసన అందురు.

ఆ ఉపాసన నిలుచుండుచు, కదలుచు, శరీర సంబంధమైన మరియొక కర్మ చేయునపుడు కాదు. అట్టి పరిస్థితులలో మనసు విక్షిప్తమగును. అదే విధముగ పడుకున్నపుడు నిద్ర వలన విఘ్నము వచ్చును. కేవలము కూర్చుండియే ఉపసాన విఘ్నము లేకుండ జరుగ వచ్చును. కావున ఉపాసన అభ్యాసము ఆసీనమై కూర్చుండియే చేయవలెను.

"శుచియైన సుప్రదేశమందు
ఎత్తు పల్లము గాని చోటు నందు
కదలకుండని యాసనంబు పైన
కుశంబు జినంబు చేలంబు వేసి" (భ.గీ. VI-11)

"దానిపైన మనసు నొక చోట చేర్చి
జితేంద్రియముల యతమొనర్చి
కూర్చుండి నేర్చుదురు యతులు
ఆత్మ విశుద్ధికి యోగమెపుడు" (భ.గీ. VI-12)

ఆసనముపై స్థిరముగా కూర్చుండి అంతఃకరణశుద్ధి కొరకు యోగమును అభ్యసించవలెను. పడుకుంటే నిద్ర, నిలపడుతే కదలిక, కూర్చుంటే స్థిరత్వము. పడుకుంటే సుఖము, నిలబడుతే కష్టము, కూర్చుంటే కష్టసుఖ రాహిత్యము.
(భ.గీ. VI-11/12)

**[నారాయణ వాక్యము :**

వ్రాయుట కూడ ఒక ధ్యానము. వ్రాస్తున్నపుడు కాళ్లు, చేతులు, ఇంద్రియములు కదలకుండ మనసు, బుద్ధి వ్రాస్తున్న దానిలో ఏకాగ్రతనందుతాయి. పడుకుండి రాయలేము, నిలుచుండి కదలుచుండి వ్రాయలేము. కూర్చుని చక్కగా వ్రాయగలము. అప్పుడు వ్రాయటం కూడా ఉపాసన అవుతుంది. కూర్చుని మననము, నిదిధ్యాసన చేయుట సులభము, యుక్తము. కూర్చుని శ్రవణము కూడా మేలుగా అవుతుంది.

పద్మాసనములో కాని, వజ్రాసనములో కాని, నేలపైన కాని, ఆసనముపై గాని, కుర్చీపైన కాని మరియు బల్లపైన కాని చక్కగా కూర్చుని ఉపాసన చేయటము ఉత్తమము]

(భ.గీ. VI-11/12)

## (485) IV-1-8

**సూ. ధ్యానాచ్చ**

**క్ర. ధ్యానాత్, చ**

**ప్ర.అ.** ధ్యానాత్ = **ఉపాసనా స్వరూపముయైన ధ్యానము వలన,** చ= **కూడ**

**వి.** పరమాత్మ యొక్క ధ్యానమే ఉపాసన, పరమాత్మను ఇష్ట దేవతలో భావించు ధ్యానము కూడ ఉపాసనయే.

"న చక్షుషా గృహ్యతే నాపి వాచా, నాన్యై ర్దేవై స్తపసా కర్మణా వా।

జ్ఞాన ప్రసాదేన విశుద్ధసత్త్వః, తతస్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః॥" (ముం.ఉ.III-1-8)

"కన్నులచే చూడబడదు, దిక్కులచే చెప్పబడదు, ఇతరేంద్రియములకందబడదు, తపస్సు కర్మలచే చెందబడదు, జ్ఞాన ప్రసాదమున శుద్ధ సత్త్వమునంది యున్న, ధ్యానమున నిష్కలమైన ఆనందాత్మ దర్శించబడును"

కావున ఉపాసన, ధ్యానము ఆసీనుడైయుండియే చేయవలయును.

(ముం.ఉ.III-1-8)

## (486) IV-1-9

**సూ. అచలత్వం చాపేక్ష్య**

**క్ర. అచలత్వం, చ, ఆపేక్ష్య**

**ప్ర.అ.** అచలత్వం = **శరీరము నిశ్చలయముగా నుండుట,** చ = **కూడ,** ఆపేక్ష్య = **అపేక్షించబడినది.**

**వి.** ధ్యానోపాసనకు శరీరము యొక్క ఇంద్రియముల యొక్క, మనసు యొక్క అచలత్వము, నిశ్చలత్వము అవసరము, ఆవశ్యకము. "బ్రహ్మ ప్రాప్తి కొరకు ధ్యానము చేయు విద్వాంసుడు, శిరస్సు, కంఠము, హృదయము ఈ మూడింటిని ఉన్నతముగా నిలిపి శరీరము నిటారుగా స్థిరము చేసి సమస్త ఇంద్రియములను మనస్సు ద్వారా హృదయమందు నిరోధించి బ్రహ్మమనెడు నావద్వారా జన్మాంతర్య రూప ప్రవాహములను తరింపవలెను." (శ్వే.ఉ.II-8)

దీని వలన శరీరము నిశ్చలముగా నుండవలెనని చెప్పబడినది.

"కాయము, శిరము, గ్రీవంబు చూడ
సూటి నుంచి నిలిపి కదల కుండి
తన ముక్కు కొనపై చూపు నుంచి
దిశల యవలోకనంబు త్యజించి" (భ.గీ.VI-13)

ప్రశాంతాత్ముడై భయము విడిచి
బ్రహ్మచర్య వ్రతము గట్టిజేసి
మనసు నాకు నిచ్చి చాల కట్టి
మత్పరుడై యోగి యుండవలయు" (భ.గీ. VI-14)

భగవద్గీతలో కూడా శరీరము యొక్క ఇంద్రియముల యొక్క అచలత్వము అవసరమని చెప్పబడినది.

"ధ్యానం వావ చిత్తాత్, భూయో ధ్యాయతీవ పృథివీ,
ధ్యాయతీవాంతరిక్షం" (ఛాం.ఉ. VII-6-1)

"చిత్తము కంటే ధ్యానము గొప్పది. భూమి, అంతరిక్షము ధ్యానము చేయువానివలె కనిపించుచున్నవి" నిలకడగా నున్న భూమి, అంతరిక్షము ధ్యానము చేయుచున్నవాని వలె వున్నవని అద్భుతముగా ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. **అచలత్వము ధ్యానమందు, ఉపాసన యందు చాల అవసరము**

(ఛాం.ఉ. VII-6-1)

[**నారాయణ వాక్యము :**
స్థిరత్వము ధ్యానము, కదలిక కర్మ. స్థిరముగా వుండేది చైతన్యము, కదిలేది శక్తి. కొండనాలుక స్థిరము, నాలుక కలదలిక. మీది దవడ స్థిరము, క్రింది దవడ కదలిక. మీది పెదవి స్థిరము, క్రింది పెదవి కదలిక. కొండ నాలుక బ్రహ్మ, నాలుక సరస్వతి. మీది దవడ విష్ణువు, క్రింది దవడ లక్ష్మి. మీది పెదవి శివుడు, క్రింద పెదవి శక్తి. స్థిరత్వము పరబ్రహ్మ, కదలిక పరాశక్తి. ధ్యానములో చైతన్యము అనుభూతి అవుతుంది. కదలికలలో శక్తి కర్మ రూపమౌతుంది.]
(శ్వే.ఉ. II-8; ఛాం.ఉ. VI-13-14; VII-6-1)

---

## (487) IV-1-10

**సూ. స్మరన్తి చ**

**క్ర. స్మరంతి, చ**

**ప్ర.అ.** స్మరంతి చ = **స్మృతికారులు ఉపాసనయందు ఆసనమును అవసరమని అనినారు.**

**వి.** "శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః"
(భ.గీ. VI-11)

"తన కొరకు శుచియగు ప్రదేశమున స్థిరమగు ఆసనమును ప్రతిష్ఠించుకొని" (భ.గీ. VI-11) స్మృతులు ఆసనమును, ఉపాసనమునకు అంగముగ చెప్పుచున్నవి. అందువలననే యోగ శాస్త్రమునందు పద్మాసనము మొదలగు ఆసనములు ఉపదేశింపబడినవి.

**దేహము నిశ్చలముగా, అచలముగా, కదలకుండా వుండే ఆవశ్యకత గురించి స్మృతులు చెప్పుచున్నవి.**
(భ.గీ.VI-13, VI-14, VI-11)

---

## (7) ఏకాగ్రతాధికరణము (160)

## (488) IV-1-11

**సూ. యత్రైకాగ్రతా తత్రావిశేషాత్**

**క్ర. యత్ర, ఏకాగ్రతా, తత్ర, అవిశేషాత్**

**ప్ర.అ.** యత్ర= **ఏఏ దిగ్దేశ కాలములయందు,** ఏకాగ్రతా = **చలనము లేక చిత్తము ఒకే విషయమునందు నిలుచునో,** తత్ర=**ఆయా దిగ్దేశ కాలములయందు ఉపాసన చేయవలెను,** అవిశేషాత్=**దిక్కులు మొదలగు వానియందు విశేషము వినవచ్చుట లేదు గనుక.**

**వి.** "శుద్ధము, సమతలము, రాళ్లు, ఇసుక, లేక అగ్ని గాలి లేని చోట, శబ్ద, జలాశ్రయములచే మనస్సునకనుకూలమైన చోట, కన్నులకు పీడ కలిగించు దృశ్యములు లేనిచోట, వాయువు, పీడనము, అధికమైన వేడి లేని చోట, గుహ, చెట్టునీడ మొదలైన చోటుల ధ్యానము చేయవలెను" (శ్వే.ఉ.II-10)

ఎక్కడ మనస్సునకనుకూలమైనదో అక్కడ ధ్యానాభ్యాసము చేయుమని శ్రుతి చెప్పుచున్నది. కావున ఎక్కడ మనస్సుకు ఏకాగ్రత కుదురునో అదియే పవిత్ర స్థలముగా తలుచవలెను. అట్టి దానిని వెతికి నిర్విఘ్నము అయిన ఆ చోటు నుండి ధ్యానము చేయవలయును.

**[నారాయణ వాక్యము :**

**6 ఏండ్ల క్రింద మంథనిలో వర్షములు రాక గోదావరి ఎండిపోయినపుడు గోదావరి తీరమున 24 గం॥ల నిరంతర ధ్యానము చేయవలయునని సంకల్పించినపుడు, గోదావరి తీరములో నున్న రామేశ్వర మందిర వాటికలో తీవ్రమైన ఎండ వేడిరాని చోట, గాలి అనుకూలముగా వీచే చోట, ఒకరోజు నిష్ఠతో ఉపవాసముతో, శ్రీ అష్టధని గంగాధర్ గారు వెంటవుండగా ధ్యానము చేసినపుడు ధ్యానము కుదిరి పరమేశ్వర కృపతో ఆ రోజు రాత్రియే వర్షములు వచ్చి ఇప్పటి వరకు గోదావరి ఎండిపోకుండా ప్రవహిస్తూనే వున్నది.**

అదే విధముగా ధ్యానమునకు, ఏకాగ్రతకు అనుకూలమైన సమయము కూడా ఏర్పరచుకొనవలెను. నిరంతర ధ్యానము చేస్తున్నపుడు ఏ ఆటంకము వచ్చినా ధ్యానము కొనసాగించాలి. లేకపోతే బ్రహ్మముహూర్తము ఉదయము 3-30 నుండి 5-30 వరకు అనుకూలమైనదని నారాయణ అనుభవము]

భగవద్గీతలో శుచియైన సుప్రదేశమందు, ఎత్తుపల్లము కాని చోటు నందు" అని చెప్పబడినది. (భ.గీ.VI-11)

**మనస్సునకనుకూలమైన చోట ధ్యానమునకనుకూలమైన చోటు.**

(శ్వే.ఉ.II-10; భ.గీ.VI-11)

## (8) ఆప్రాయణాధికరణము (161)

## (489) IV-1-12

**సూ. ఆ ప్రాయణా త్త్రాపి హి దృష్టమ్**

**క్ర. ఆప్రాయణాత్, తత్ర, అపి, హి, దృష్టమ్**

**ప్ర.అ.** ఆప్రాయణాత్ = **జీవన పర్యంతము, మరణము కొరకు ఉపాసన చేయవలయును,** తత్రాపి = **మరణ సమయమున కూడ,** హి = **ఎందుకంటే,** దృష్టమ్ = **ఉపాసన చేయు విధానము కనిపించుచున్నది.**

**వి. మరణ సమయము వరకు ఉపాసన చేయాలని శ్రుతి, స్మృతులలో చెప్పబడినది.**

"యావదాయుషం బ్రహ్మలోకమభి సంపద్యతే, న చ పునరావర్తతే, న చ పునరావర్తతే" (ఛాం.ఉ. VIII-15-1)

"బ్రహ్మ ప్రజాపతికి ఉపదేశించిన ఈ ఆత్మజ్ఞానమును తెలిసి ఆయుస్సు ఉన్నంత వరకు ఉపాసన తత్పరుడైన యతడు అంతమందు నిస్సందేహముగా బ్రహ్మలోకమును పొందును. అతనికి మరలిరాక కూడ లేదు." అట్లు జీవనకాల పర్యంతము, చివరి క్షణము వరకు ఉపాసన చేయవలయును. భగవద్గీతలో ఇలా చెప్పబడినది.

"అంతకాలమున దానెవరు సరిగ నన్ను
మది తలచుచు కలేబరము విడచివెడలు
యతడు నా రూపమును సరిగ చెందుచుంద్రు
ఎంతయు సంశయము వలదు దానియందు" (భ.గీ. VIII-5)

**కనుక ఉపాసన ధ్యానము నిరంతరము జీవనములో తుది క్షణము వరకు చేయవలయును.**
(ఛాం.ఉ. VIII-15-1; భ.గీ. VIII-5)

**[నారాయణ వ్యాక్యము :**

(సుమారు 65 సంవత్సరముల క్రితము శివరాత్రి నాడు, మంథనిలో డా॥ చొప్పకట్ల చంటయ్య గారి నాయన గారు శ్రీ చొప్పకట్ల రాజన్న గారు ఉదయము వేలాల నుండి బయలుదేరి గోదావరిలో స్నానం చేసి శ్రీ గౌతమేశ్వరుని మందిరమునకు ఎక్కివెళ్లి, గౌతమేశ్వరుని దర్శనము చేస్తూ గంట కొట్టుతూ "హరోం హర! హర!" అంటూ ఈ లోకమును త్యజించినారు. అవశ్యము ఆయన బ్రహ్మలోకమును పొంది శివునిలో సాయుజ్యమైనారు.

జనవరి 30, 1948 నాడు ప్రార్థనకు వెళ్ళుతున్నపుడు తుపాకి గుండు దెబ్బతిన్న మహాత్మా గాంధీ "హే రామ్!" అన్ని కన్నులు మూసినాడు.

మా తల్లి గారు శ్రీమతి సీతమ్మ గారు, తండ్రిగారు శ్రీ రామన్న గారు 1972లో ఆరోగ్యము బాగుగాలేని సమయములో **శ్రీరామన్న** గారు ఉదయము 11 గం॥ల ప్రాంతములో కన్ను మూసినారు. ఆయన శరీరమును క్రింద పెట్టినారు. 5 నిముషములలో **శ్రీమతి సీతమ్మ** గారు వచ్చి ఆయన శరీరము

ప్రక్క పడుకుండి "ఓ! రామ ఓ! రామ" అని కన్నులు మూసి ఆయనలో శ్రీరామునిలో ఐక్యము అయినారు. అదికూడ మార్గశీర్ష ఏకాదశినాడు ఐనది. వారిద్దరూ బ్రహ్మలోకము చేరినారనుటలో సందేహము లేదు.

2011లో ఒకనాడు మంథనికి వెళ్లి మా అన్న గారు శ్రీ పంగునూరి రామన్న గారి ఇంటికి రాత్రి 8 గం॥లకు వెళ్లితే ఆయన దమ్ము తీస్తున్నాడు. ప్రమీలమ్మ గారు ఆయన దగ్గరనే వున్నారు. ఆయన ఏదో ఏదో మాట్లాడుతుంటే" అన్నాను.

"నమః శంభవే చ, మయోభవే చ, నమః శంకరాయ చ, మయస్కరాయ చ, నమః శివాయ చ, శివతరాయ చ"

"ఓం! నమః శివాయ" అని అనమన్నాను. ఆయన అలా అన్నాడు.

దాన్ని మరల మరల చెప్పుమంటే, ఆయన కన్నులు మూసికొని ధ్యానము లాగా ఆ మంత్రాన్ని పునరావృత్తి చేసినాడు. అప్పుడు మా చెల్లెలు సుమతి ఆయన చెవులలో "రామ, రామ" అని చెబుతూ వుంటె, ఆయన "నమః శివాయ" అని ధ్యానంలో వుంటూనే పరమాత్మలో ఐక్యము అయినారు.

**ఈ విధముగా చివరి క్షణము వరకు ఉపాసన చేయుటము యుక్తము మరియు కొందరి మహాత్ములకు అది సాధ్యము.**]

## (9) తదధిగమాధికరణము (162)

## (490) IV-1-13

**సూ. తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్**

**క్ర. తదధిగమే, ఉత్తరపూర్వాఘయోః, అశ్లేషవినాశౌ, తద్వ్యపదేశాత్**

ప్ర.అ. తదధిగమే = **బ్రహ్మ ప్రాప్తి అయిన పిమ్మట,** ఉత్తరపూర్వాఘయోః = **రాబోవు మరిగతించిన పాపములకు,** అశ్లేషవినాశౌ = **అసంపర్కము వినాశము కలుగును,** తద్వ్యపదేశాత్ = **శ్రుతి యందు మరల చెప్పబడకుండుట వలన.**

వి. **బ్రహ్మ జ్ఞానము కలిగిన తరువాత పూర్వోత్తర పాపాలన్నీ నశిస్తాయి. తామరాకు మీద నీరు అంటనట్లుగా పాపాలు అంటవు.**

బ్రహ్మజ్ఞానము, బ్రహ్మ సాక్షాత్కారము కలిగినపుడు వెనుకటి పాపాలతో, రాబోయే పాపాలతో ఎట్టి సంబంధమూ వుండదు. ఆ పాపాలు ఆ బ్రహ్మజ్ఞానిని అంటవు. క్రమముగా ఉత్తర పాపము అంటదని, పూర్వ పాపము నశిస్తుందని గ్రహించాలి. గురువైన సత్యకామ జాబాలి ఉపకోసలునితో ఇట్లనెను. "ఏ విధముగా జలబిందువులు పద్మపత్రమును (తామరాకును) అంటుకొనవో, ఆ విధముగా పాపములు బ్రహ్మ జ్ఞానిని అంటవు." (ఛాం.ఉ. IV-14-2).

"దూదిపింజ అగ్నిలో పడి దగ్ధమై పడిపోయినట్లు, బ్రహ్మజ్ఞాని యొక్క పాప కర్మములు జ్ఞానాగ్నిలో పడి దగ్ధమైపోతాయి."(ఛాం.ఉ. V-24-3)

అని అశ్వపతి మహారాజు ప్రాచీనశాలుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనుడు, బుడిలుడు, ఉద్దాలకుడు అనువారలతో అనెను.

"యెర్రగ మండెడు యగ్గి యెపుడు
కర్రలను బూడిదగ గాల్చివేయు
నిర్మలమైన జ్ఞానాగ్ని చిరము
కర్మల సర్వంబు భస్మంబు జేయు" (శ్రీ.మ.భ.గీ. IV-37)

**ఇట్లు శ్రుతిస్మృతులందు బ్రహ్మజ్ఞానము లభించిన పిమ్మట లోక సంగ్రహము కొరకు వ్యావహారిక చేష్టల వలన కలుగు అనుషంగిక పాపములు జ్ఞానికి అంటవనియు, పూర్వకృత పాపములు నశించుననియు తెలియుచున్నది.**

(ఛాం.ఉ. IV-14-2, 3, V-24-3; భ.గీ. IV-37)

## (10) ఇతరాసంశ్లేషాధికరణము (163)

## (491) IV-1-14

**సూ. ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు**

**క్ర. ఇతరస్య, అపి, ఏవమ్, అసంశ్లేషః, పాతే, తు**

ప్ర.అ. ఇతరస్య = **పుణ్యకర్మ సముదాయమునకు,** అపి = **కూడ,** ఏవమ్ = **ఇదే ప్రకారము,** అసంశ్లేషః = **సంబంధము లేకపోవుట, నాశనమగుట తెలియవలెను,** పాతే తు = **దేహపాతమైన తరువాత పరమాత్మప్రాప్తి ఎట్లైనను అగును.**

వి. **పాపము కంటే ఇతరమైన పుణ్యానికి కూడ అంటకపోవటము, నాశనమవటము వున్నాయి. అంటే బ్రహ్మజ్ఞానికి పాపపుణ్యములు రెండూ నశించిపోతాయి. పుణ్యము నశించకపోతే ఆ పుణ్యఫలము అనుభవించటానికి మళ్లీ శరీరము ధరించవలసి వస్తుంది. అపుడు మోక్షము అసంభవము అవుతుంది.**

కావుననే

"భిద్యతే హృదయగ్రంథిః, ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే॥ (ముం.ఉ. II-2-70)

"హృదయ గ్రంథి ముడి తీయబడును
సర్వ సంశయములు ఛేదించబడును.
అన్ని కర్మములు క్షయము యగును
పరమమైన దాని దృష్టియైనయపుడు"

బ్రహ్మదర్శనమైన వానికి అన్నికర్మలు-పుణ్య పాప కర్మలన్నీ క్షయము అయిపోతాయి.

"ఉభే ఉహై వైష ఏతే తరతి" (బృ.ఉ. IV-4-22)

**"బ్రహ్మవేత్త పుణ్యపాపాలు రెంటినీ తరిస్తాడు." ఈ విధముగా బ్రహ్మ జ్ఞానికి పాప పుణ్యాలు రెండింటికీ నాశము చెప్పబడింది. అట్టి జీవన్ముక్తుడు దేహపాతము ఐన తరువాత మోక్షము చెందుతాడు.**

(ముం.ఉ. II-2-70; బృ.ఉ. IV-4-22)

## (11) అనారబ్ధకార్యాధికరణము (164)

### (492) IV-1-15

**సూ. అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః**

**క్ర. అనారబ్ధకార్యే, ఏవ, తు, పూర్వే, తదవధేః**

ప్ర.అ. అనారబ్ధకార్యే = **ఎవరికి ఫలభోగ రూపమైన కార్యము ఆరంభించబడదో,** ఏవ = **నష్టమగునో,** తు = **అయితే,** తదవధేః = **అంత వరకు, ప్రారబ్ధ కర్మలు ఉన్నంత వరకు శరీరము వుండును.**

వి. **పూర్వకృతమైన ప్రారబ్ధ కర్మలు అనుభవించుటకే ఈ శరీరము వచ్చినది. విద్వాంసులకును అంతే. దాని నాశనము చెప్పబడలేదు.**

"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే, అథ సంపత్స్య ఇతి" (ఛాం.ఉ. VI-14-2) అని ఉద్దాలకుడు అన్నాడు." ఆ బ్రహ్మజ్ఞానికి శరీరము ప్రాణాల చేత విడచిపెట్టబడటమే మోక్షానికి ఆలస్యము. శరీర పాతము కాగానే మోక్షము."

**శరీర పాతము వరకు ప్రారబ్ధము వుంటుంది. అంతవరకు జ్ఞాని సంసారిగానే వుంటాడు. అతడే జీవన్ముక్తుడు.** ఫలాన్ని ఇవ్వటము ఆరంభించిన కార్యాలు ఆరబ్ధ కర్మములు. వీటినే ప్రారబ్ధ కర్మములు అంటారు. ఫలాన్ని ఇవ్వటము ఆరంభించని కర్మలు అనారబ్ధ కర్మములు.ప్రారబ్ధ కర్మములు విలుకాని విల్లునించి విడువబడిన బాణముల వంటివి. వదిలిపెట్టబడిన బాణము యొక్క వేగము మార్చటానికి విలుకాని వల్ల కాదు. ఆ బాణ వేగము తగ్గగానే అది పడిపోతుంది. **అనారబ్ధ కార్యాలు అంటే అమ్ముల పోదిలోనున్న బాణాల వంటివి.** కావున, జ్ఞాని అనారబ్ధ కార్యాలను నాశనము చేసుకోగలడు. ఆరబ్ధాలనుంచి తప్పించుకోలేడు. **అనారబ్ధ కార్యాలు అంటే సంచిత కర్మలు. అనారబ్ధ కార్యాలు బ్రహ్మజ్ఞానము వల్ల నశిస్తాయి. ఆరబ్ధ కార్యాలు శరీరము వున్నంత వరకు వుంటాయి. అనారబ్ధ కార్యాలు మొదలే జ్ఞానము వలన నశించి ఆరబ్ధ కార్యాల ఫలము పూర్తి కాగానే, శరీరము విడువగానే మోక్షము అవుతుంది.**

(ఛాం.ఉ. VI-14-2)

## (12) అగ్నిహోత్రాద్యధికరణము (165)

### (493) IV-1-16

**సూ. అగ్నిహోత్రాది తు తత్కార్యా యైవ తద్దర్శనాత్**

**క్ర. అగ్నిహోత్రాది, తు, తత్కార్యాయ, ఏవ, తద్దర్శనాత్**

ప్ర.అ. అగ్నిహోత్రాది తు= **అగ్ని హోత్రాదికమైతే,** తత్కార్యాయ ఏవ = **జ్ఞానమునకు ఏది కార్యమో ఆ కార్యమును పుట్టించడం కోసమే,** తద్దర్శనాత్ = **ఆ విధంగా శ్రుతిలో చూపడం వలన.**

వి. **మహాత్ములైన జ్ఞానుల కొరకు శ్రుతి యందు ఏ విధానము చెప్పబడినదో అది ఆశ్రమసంబంధమైన**

**ఆ అగ్నిహోత్రాది కర్మలు జీవనపర్యంతము చేయుట కొరకే చెప్పబడినది. అది ఆ కర్మల రక్షణ కొరకే చెప్పబడినది. వారిని చూచి సామాన్యులు కర్మల త్యాగము చేయకుందురు గాక అని చెప్పబడినది. వేరు ఉద్దేశ్యము లేదు.**

**"ఎట్లు చరించుచుండు శ్రేష్ఠుండు**
**అట్లు చరించుచుంద్రు జనులు**
**ఎట్టి ప్రమాణమతడి దౌను**
**అట్లు లోకులను వర్తించుచుంద్రు"** (భ.గీ. III-21)

కనుక శ్రేష్ఠులైనవారు జీవన్ముక్తులు కూడ యుక్తకర్మలు లోక సంగ్రహము కొరకు చేస్తూనే వుండాలి. అవి చేసినా వారికి సంసిద్ధి అందుతుంది, ఎందుకంటే వారి పూర్వ అనారబ్ధ కర్మలు మొదలె నాశనమైనవి కనుక. అందుకే

"జనకాదులు దాము పొంద లేద
సంసిద్ధి యుక్త కర్మలననుసరించి
లోక సంగ్రహార్థంబు నైన నీవు
యోచించ కర్మ యుక్తంబు నీకు" (భ.గీ. III-20) మరియు

"అవిద్వాంసులు నాసక్తులై చేతురు కర్మలెట్లు
అవివేకులై లోక సంగ్రహంబు లోటు పడగ
సువిద్వాంసులు నసక్తులై చేతురు కర్మలట్లు
సువివేకులై లోక సంగ్రహంబు నెరవేర్చుకొరకు" (భ.గీ. III-25)

**ఇట్లు వివిధ ప్రమాణముల చేత విద్వాంసులు, జ్ఞానులు, కర్మలాచరించుట లోక సంగ్రహము కొరకే అని తెలియుచున్నది.**

(భ.గీ. III-21, III-20, III-25)

## (494) IV-1-17

**సూ. అతోఽన్యాపి హ్యేకేషాముభయోః**

**క్ర. అతః, అన్యా, అపి, హి, ఏకేషామ్, ఉభయోః**

ప్ర.అ. అతః = **దీని వలన,** అన్యాపి = **జ్ఞాన భిన్నమైన కర్మ కూడ,** హి = **కూడ,** ఏకేషామ్ = **కొందరి మతయందు విహితమైనది,** ఉభయోః = **జ్ఞానికి, సాధకునికి ఇరువురకు.**

వి. **నిత్యనైమిత్తిక కర్మల కంటే వేరైనది మరొక కర్మ వున్నది. అది కామ్యకర్మ. కోరికతో చేసే కర్మ, కామ్య కర్మలు జ్ఞానోత్పత్తికి ఉపకారకాలు కావు.** ఈ విషయాన్ని జైమిని, బాదరాయణులు ఇరువురూ అంగీకరించినారు. **కావున, నిత్య నైమిత్తిక కర్మలు మోక్షాపేక్ష కలవారి చేత, జ్ఞానుల చేత కూడ ఆచరింపబడతగినవే.**

"ఈశా వాస్యమైయది యుండుచుండు
లేశమే దేని జగమున జరుగుచుండు
చేసి మట్టి త్యక్తత్వముమన్నవలెను
యాసక్తిని ఇతరుల ధనమందు వీడు" (ఈ.ఉ. 10)
"కర్మములు చేయుచుండియే ఇహన
వర్షములు నూరు జీవించకోరవలెను
నరుడ! వేరేది విధమది నీకుగన్న
కర్మలు లిప్తంబు ఎందు కాక మాను (ఈ.ఉ. 2)
బ్రతికినంత వరకు శాస్త్రవిహితమైన కర్మలు చేస్తూనే నూరు సంవత్సరాలు జీవించాలి.
"విద్యాఽవిద్యలు గూడ యెవరు
అంతదాము దెలియువారు
మృత్యువునవిద్యన గెలుచువారు
విద్యన యమృతత్వంబునందు వారు" (ఈ.ఉ.-11)

**కర్మ జ్ఞానముల రెంటిని తెలియువారు కర్మవలన మృత్యువును తరించి, జ్ఞానమువలన అమృతత్వంబు నందువారు (అందువలననే కర్మములు తెలిసిన జైమిని మహర్షి, జ్ఞానమును తెలిసిన బాదరాయణ మహర్షి ఉభయులు ఈ విషయములో ఏకీభవించారు!)**

"యదృచ్ఛమగు లభ్యముల యందు
సంతుష్టి చెంది మరి యుండు వాడు
ద్వంద్వములకు దానతీతుడైన వాడు
విమత్సరత యెంతయులేనివాడు
సిద్ధియైన మరి నసిద్ధి యైన యపుడు
సమముగ సరి ప్రవర్తించు వాడు
యతడు కర్మలు దా జేయునపుడు
ఎంతయు నిబంధించ బడనివాడు" (భ.గీ.IV-22)

**"ముక్తుడు గత సంగముల వాడు**
**జ్ఞానావస్థిత చేతసుడు వాడు**
**యజ్ఞముల మరి యాచరించువాడు**
**వాడు కర్మలు పూర్తి లీనమైన వాడు."** (భ.గీ.IV-23)

**జ్ఞాని కర్మలనాచరించినను ఆ కర్మలచే బద్ధుడు కాదు.**

**కామ్యకర్మలు జ్ఞానోత్పత్తికి ఉపకారకాలు కావు. జ్ఞానులు, కర్మసాధకులు ఇరువురూ యుక్త కర్మలు లోకసంగ్రహము కొరకు చేయుచుండాలి.**

(ఈ.ఉ.-1, 2, 11; భ.గీ. IV-22,23)

## (13) విద్యాజ్ఞానసాధనత్వాధికరము (166)

## (495) IV-1-18

**సూ. యదేవ విద్యయేతి హి**

**క్ర. యత్, ఏవ, విద్యయా, ఇతి, హి**

ప్ర.అ. యదేవ = **ఏ కర్మ,** విద్యయా = **విద్యతో కూడి చేయబడును.** ఇతి = **అను శ్రుతి కలదో,** హి = **అచట విద్య కర్మకు అంశమని అర్థము కావచ్చును.**

వి. **విద్యతో కూడిన (ఉపాసనతో కూడిన) నిత్య కర్మము, కేవలము నిత్యకర్మ ఈ రెండూ ఈ జన్మలో బ్రహ్మజ్ఞానానికి సాధకాలు అవుతాయి.**

"యదేవ విద్యయా కరోతి, శ్రద్ధయా ఉపనిషదా తదేవ వీర్యవతరం

భవతి, ఇతి ఖలు ఏతస్యైవాక్షరస్య ఉపవ్యాఖ్యానం భవతి" (ఛాం.ఉ. I-1-10)

"ఏ కర్మ విద్య, శ్రద్ధ, రహస్య జ్ఞానము, వీనితో చేయబడునో అది అధిక, సామర్థ్య సంపన్నము కాగలదు."

ఈ శ్రుతి కర్మలకు అంగభూతమైన ఉద్గీథాదుల ఉపసనా ప్రకరణమున చెప్పబడినది. ఇది ఉపాసనా సంబంధమగుట వలన ఈ విద్య బ్రహ్మ విద్య కాదు. జ్ఞాని పరమాత్మ ప్రాప్తికి అభ్యాసము చేయు విద్యకు, ఈ ఉపాసనార్థము చెప్పు విద్యకు సంబంధము లేదు. ఉపాసన కొరకైన విద్య కర్మలకు అంగమగును కాని బ్రహ్మ విద్య కర్మలకు అంగము కాదని రూఢి అగుచున్నది.

మరియు

**విద్యాయుక్తమైనట్టి, శ్రద్ధతో, యోగముతో చేసిన కార్యము వీర్యవత్తరము అవుతుంది. ఉపసనారహితమైన కర్మము వీర్యవంతమని, ఉపాసనతో కూడిన కర్మము వీర్యవత్తరమని (అంటే దానికంటె వీర్యవంతమని) తెలుస్తున్నది. దీనిని బట్టి ఉపాసన లేని కర్మలు జ్ఞాన ప్రాప్తికి ఉపయోగపడవు అనే అర్థము లేదు. అవి కూడా జ్ఞానోత్పత్తికి ఉపయోగపడుతాయి.**

**అయితే రెండింటిలో తారతమ్యం వున్నది. విద్యతో-ఉపాసనతో కూడిన కర్మకు శీఘ్రమే ఫలితాన్ని ఇచ్చే శక్తి వున్నది అని తెలుస్తున్నది.**

(ఛాం.ఉ. I-1-10)

## (14) ఇతరక్షపణ్యాధికరణము (167)

## (496) IV-1-19

**సూ. భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే**

**క్ర. భోగేన, తు, ఇతరే, క్షపయిత్వా, సంపద్యతే**

ప్ర.అ. భోగేన = **ఉపభోగము ద్వారా,** తు = **అయితే,** ఇతరే = **సంచితము ఆగామి కాని ప్రారబ్ధ**

**రూపమైన శుభాశుభ కర్మ,** క్షపయిత్వా = **క్షీణింపచేసి,** సంపద్యతే = **జ్ఞాని పరమాత్మను పొందును.**

**vi. జ్ఞానియైనవాడు అరబ్ధాలైన పుణ్య పాపాలు అనుభవించటము ద్వారా క్షయము కావించుకొనియే బ్రహ్మను పొందుచున్నాడు.**

బ్రహ్మజ్ఞానయైనవాడు పూర్వ కృతమైన సంచిత కర్మను భస్మము చేయును. క్రియామాణమగు ఆగామి కర్మలతో అతనికి ప్రమేయము లేదు. ఇక మిగిలిన శుభాశుభరూపమైన ప్రారబ్ధ కర్మలను ఉపభోగము ద్వారా నశింపచేసి జ్ఞానియైనవాడు పరమ పదమును పొందును.

"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్య ఇతి" (ఛాం.ఉ. VI-14-2)
"జ్ఞానికి మోక్షము కలుగుట యందు ఎంత వరకు దేహ సంబంధముండునో అంత వరకే విలంబము. ఆ పిమ్మట యతడు సత్సంపన్నుడగును సత్యము లభించినవాడగును - బ్రహ్మ పదమును చేరును."
(ఛాం.ఉ. VI-14-2)

[**నారాయణ వాక్యము**
బ్రహ్మ జ్ఞానము ఒక డస్టరు వంటిది. బోర్డు పైన రాసిన దంతయు జ్ఞానము కలుగగానే మాపి వేయబడుతుంది. ఇప్పుడు రాయటానికి సిద్ధమైనది, రాసింది రాసినట్లే ఆరిపోతుంది. ఇక ముందు వ్రాసేది అంటు లేకుండా వుండే చాకుతో వ్రాయబడుతుంది. ఏమీ అంటకుండా ఆరిపోతుంది. బ్రహ్మ జ్ఞానమనే డస్టరు రాసే దానిని వెంట వెంటనే మాపి వేస్తుంది.]

ఇట్లు
**చతుర్తాధ్యాయ ప్రథమ పాదము**



# చతుర్థాధ్యాయ ప్రథమ పాద సమాసము

## జీవన్ముక్తి

**1. ఆవృత్త్యధికరణము**

బ్రహ్మవిద్యారూపమైన ఉపాసనము యొక్క అభ్యాసము చేత బ్రహ్మవిద్యాభ్యాసము చేసి దానిని మాటిమాటికి విచారణచేసి ఆ పరమాత్మయందే సంలగ్నులు కావలెను. మరల మరల చేసే ఆవృత్తి ఉపాసన వలన బ్రహ్మవిద్యను నిరంతరము అభ్యాసము చేయవలయును.

**2. ఆత్మత్వోపాసనాధికరణము**

"తత్త్వమసి", "అదియే నీవై యున్నావు" అని గురువు బోధించినపుడు సాధకుడు శ్రవణముచేసి, అర్థముచేసుకొని, మననముచేసి, ధ్యానించి, అనుభూతి చెంది, "తాను పరమాత్మయే" అని తెలిసి "అహం బ్రహ్మాస్మి" – "నేనే బ్రహ్మమునై వున్నాను" అని అనుకుంటాడు, అంటాడు.

**3. ప్రతీకాధికరణము**

మూర్తి మొదలైన వాని యందు భగవంతుని ధ్యానముచేసి ఉపాసన చేయబడుతున్నది. అదే విధముగా మనస్సు, ఆకాశము, ఆదిత్యుడు మొదలైన ప్రతీకలయందు కూడా ఉపాసన చేయు విధానమున్నది. ప్రతీక యందు భగవంతడను ఉద్దేశ్యముతో ఉపాసన వలన పరమాత్మ తనను ఉపాసించుచున్నట్లు భావించి గ్రహించును, అనుగ్రహించును. ప్రతిమను భగవంతునిగా ఉపాసించాలి. భగవంతుణ్ణి ప్రతిమగా చూడరాదు.

**4. బ్రహ్మదృష్ట్యధికరణము**

ప్రతీకమునందు బ్రహ్మదృష్టి వుండాలి. కాని బ్రహ్మను ప్రతీకగా తలచరాదు. నికృష్ఠమైన దానిని ఉత్కృష్టమైన దానిగా చూడవచ్చును గాని, ఉత్కృష్టమైన దానిని నికృష్ఠమైనదానిగా చూడరాదు.

**5. ఆదిత్యాదిమత్యధికరణము**

కర్మాంగాలయందు దేవతాభావం ఉండాలి. ''ఈ తపింపచేయు ఆదిత్యుని ఉద్గీథముగా ఉపాసనచేయవలయును. ఇతడు ఉదయించు ప్రజల కొరకు ఉద్గానము చేయుచున్నాడు. ఉదయించుచు అంధకారమును భయమును నశింపచేస్తున్నాడు. ఎవరు ఈ విధముగా తెలిసికొని ఉపాసన చేయుచున్నాడో అతడు నిశ్చయముగా అంధకారమును, భయమును పొగొట్టువాడు అగుచున్నాడు" ఈ రీతిగా ఆదిత్యాది భావనాపూర్వక ఉపాసన చేయువిధానము.

**6. ఆసీనాధికరణము**

కూర్చుండే ధ్యానం చేయాలి. కేవలము కూర్చుండియే ఉపాసన విఘ్నములేకుండ జరుగవచ్చును. కావున ఉపాసనాభ్యాసము ఆసీనమై, కూర్చుండియే చేయవలయును. ధ్యానోపాసనకు శరీరము, ఇంద్రియములు, మనస్సుల అచలత్వము, నిశ్చలత్వము అవసరము, ఆవశ్యకము. శ్రుతి, స్మృతులలో అట్లు చెప్పబడినది.

**7. ఏకాగ్రతాధికరణము**

ఎక్కడ మనస్సుకు అనుకూలమైనదో, ఏకాగ్రతకుదురునో అక్కడ ధ్యానము చేయవలయును. అదే విధముగా ధ్యానమునకు, ఏకాగ్రతకు అనుకూలమైన సమయము కూడా ఎన్నుకొనవలెను. సాధకుడు తన ధ్యానమునకు అనుకూలమైన స్థానము, సమయము, పరిస్థితి ఎన్నుకొని నిర్విఘ్నముగా అభ్యాసము చేయవలెను.

**8. ఆప్రాయాణాధికరణము**

జీవనకాలపర్యంతము, చివరిక్షణము వరకు ఉపాసన చేయవలయును. ధ్యానమనేది మరణపర్యంతం చేయాలి.

**9. తదధిగమాధికరణము**

జ్ఞానికి పూర్వోత్తర కృతములైన పాపాలు అంటవు. బ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత పూర్వోత్తర పాపములన్నీ నశిస్తాయి. తామరాకు పైన నీటిబొట్టులాగ పాపములు బ్రహ్మజ్ఞానిని అంటవు. బ్రహ్మ జ్ఞానము లభించిన పిదప, జ్ఞానికి లోకసంగ్రహము కొరకు చేయు వ్యావహారిక కర్మల వలన కలుగు పాపములు అంటవు. పూర్వకృత పాపములు నశించును.

**10. ఇతరాసంశ్లేషాధికరణము**

జ్ఞానికి పుణ్యకర్మలు అంటవు. బ్రహ్మదర్శనమైన వారికి అన్నికర్మలు - పుణ్యపాప కర్మములు అన్నీ క్షయము అవుతాయి. అట్టి జీవన్ముక్తునికి దేహపాతము అయిన వెంటనే మోక్షము కలుగును.

**11. అనారబ్ధకార్యాధికరణము**

అనారబ్ధకార్యాలు (సంచిత కర్మలు) బ్రహ్మజ్ఞానమువల్ల నశిస్తాయి. ఆరబ్ధకార్యములు (ప్రారబ్ధ కర్మలు) వున్నంతవరకు శరీరము వుంటుంది. అనారబ్ధకార్యములు (ప్రారబ్ధ కర్మలు) మొదలే నశించి, ఆరబ్ధ కార్యములఫలములు పూర్తి కాగానే, శరీరము విడువగానే మోక్షము అవుతుంది. అనారబ్ధ కర్మలకే ఈ లక్షణము వర్తిస్తుంది.

**12. అగ్నిహోత్రాద్యధికరణము**

జ్ఞానోత్పత్తి హేతువులైనందున నిత్యకర్మలు అనుష్టింప తగ్గవే. శ్రేష్ఠులైన వారు, జీవన్ముక్తులు, అగ్నిహోత్రాది యుక్త కర్మలు లోక సంగ్రహము కొరకు చేస్తూనే వుండాలి. వారు అట్లు చేసినపుడు ప్రజలు కూడా తమ తమ ఆశ్రమకర్మలను ఆపకుండా ఆచరిస్తారు. నిత్య, నైమిత్తిక కర్మలు మోక్షాపేక్ష కలవారిచేత (జ్ఞానులచేత) కూడ ఆచరింపదగినవే. కామ్యకర్మలు జ్ఞానోత్పత్తికి ఉపకారకాలు కావు. ఈ విషయములు కర్మములు, జ్ఞానములు తెలిసినవారు ఏకీభవించారు. జైమిని మహర్షి, బాదరాయణ మహర్షి ఈ విషయములో ఏకమతముతో నున్నారు.

**13. విద్యాజ్ఞానసాధనత్వాధికరణము**

విద్యతో కూడిన (ఉపాసనతో కూడిన) నిత్యకర్మము, కేవలము నిత్యకర్మ ఈ రెండు ఈ జన్మలో

బ్రహ్మజ్ఞానానికి సాధనాలు అవుతాయి. అయితే ఉపాసనలు లేని కర్మ వీర్యవంతము మరియు ఉపాసనతో కూడిన కర్మ వీర్యవత్తరము. ఉపాసనతో కూడిన కర్మకు శీఘ్రమే ఫలితాన్ని ఇచ్చే శక్తి వున్నది.

## 14. ఇతరక్షపణాధికరణము

కర్మ క్షయంకాగా బ్రహ్మవేత్త బ్రహ్మముతో ఏకీభావం చెందుతాడు. బ్రహ్మజ్ఞానమందినవాడు పూర్వకృతమైన సంచితకర్మను భస్మము చేయును. క్రియమాణమగు ఆగామికర్మలతో అతనికి ప్రమేయము లేదు. ఇక మిగిలిన శుభాశుభరూపమైన ప్రారబ్ధకర్మలను ఉపభోగము ద్వారా నశింపచేసి, జ్ఞాని పరమపదమును పొందును.

ఇట్లు

**చతుర్థాధ్యాయ ప్రథమపాద సమాసము**



# చతుర్ధాధ్యాయ ప్రథమపాద సారము

## జీవన్ముక్తి

దేని విద్యారూపమైన ఉపాసన అభ్యాసము చేసి, దానిని మాటిమాటికి విచారణ చేయాలో, దేనియందు సంలగ్నులు కావాలో, మరలమరల చేసే ఆవృత్తి ఉపాసన దేని గూర్చి చేయవలయునో, దేని విద్యాభ్యాసము నిరంతరము చేయవలయునో,

"తత్త్వమసి" - "అదియే నీవైయున్నావు" అని గురువు బోధించినపుడు సాధకుడు శ్రవణము చేసి, అర్థము చేసికొని, మననము చేసి, ధ్యానించి, అనుభూతి చెంది, "తాను అదియే" అని తెలిసి, "నేను అదియే అయివున్నాను" అని అంటూ, "అది ఇదియే" "ఇది అదియే", అనుభూతినందునదో ఆ "అది" ఏదియో,

మూర్తి మొదలైన వానియందు ఏది ఉపాసించబడుచున్నదో, మనస్సు, ఆకాశము, ఆదిత్యుడు మొదలైన ప్రతీకలయందు దేని ఉపసానావిధానమున్నదో, ప్రతీకలయందు ఏది కలదను ఉద్దేశ్యముతో ఉపాసించినపుడు ఏది తనను ఉపాసించుచున్నట్లు భావించి, గ్రహించి, అనుగ్రహించునో, ప్రతిమను దేనిగా ఉపాసించాలో, దేనిలో ప్రతిమను చూడరాదో,

ప్రతీకను దేనిగా తలచి గొప్పగా చేయవలెనో, కాని దేనిని ప్రతీకగా దలచి చిన్న చేయరాదో,

ఈ ఆదిత్యుడే అది, అని తెలిసి ఆదిత్యాది భావనా, ఉపాసన దేన్ని గూర్చి చేయాలో,

కేవలము కూర్చుండియే దేన్ని గూర్చి ఉపాసన, ధ్యానము చేయాలో; దేని ఉపాసనకు, దేనిధ్యానమునకు శరీరము, ఇంద్రియములు మరియు మనస్సు యొక్క అచలత్వము, నిశ్చలత్వము అవసరమో, ఆవశ్యకమో,

సాధకునికి అనుకూలమైన స్థానము, సమయము, పరిస్థితులలో దేనిని గూర్చి ఉపాసన, ధ్యానము నిర్విఘ్నముగా చేయాలో,

జీవనకాలపర్యంతము, చివరిక్షణము వరకు దేనిని ఉపాసన చేయాలో,

దేని జ్ఞానము కలిగిన తరువాత పూర్వోత్తర పాపములన్నీ నశిస్తాయో, మరియు పాపములు తామరాకుమీద నీటిబొట్టువలె అంటవో, దేని జ్ఞానము తరువాత జ్ఞానికి లోక సంగ్రహము కొరకు చేసే వ్యావహారిక కర్మముల వలన కలుగు పాపములు అంటవో మరియు పూర్వ కృతపాపములు నశించునో,

దేని దర్శనమైనతరువాత జ్ఞానికి అన్నికర్మలు-పుణ్యపాప కర్మలు అన్నీ క్షయము అవుతాయో, దేని దర్శనము అయిన జీవన్ముక్తునికి దేహపాతము అయిన వెంటనే మోక్షము కలుగునో,

అనారబ్ధ కార్యములు (సంచితకర్మలు) దేని జ్ఞానము వలన నశిస్తాయో, మరియు ఆరబ్ధ కర్మములు వున్నంత వరకు శరీరము వుండి, అనారబ్ధ కార్యములు మొదలే నశించి, ఆరబ్ధకార్యముల ఫలములు పూర్తి కాగానే, శరీరము విడువగానే, దేని జ్ఞానము వలన మోక్షము అవుతుందో,

దేని జ్ఞానము అందిన తరువాత జీవన్ముక్తులు నిత్య, నైమిత్తిక కర్మలు లోక సంగ్రహము కొరకు జీవనపర్యంతము చేస్తూండాలో,

విద్యతో కూడిన (ఉపాసనతో కూడిన) నిత్యకర్మలు, కేవలము నిత్యకర్మలు రెండూ దేని జ్ఞానోత్పత్తికి సాధనాలు అవుతాయో, దేని ఉపాసనతో కూడిన కర్మలు వీర్యవత్తరము అవుతాయో మరియు నిత్యకర్మలవలె కేవలము వీర్యవంతము కావో,

దేని జ్ఞానమందినవాడు పూర్వకృతమైన సంచితకర్మను భస్మము చేయునో, మరియు అతనికి క్రియామాణమగు ఆగామి కర్మలతో ప్రమేయము లేదో, దేని జ్ఞానమందినవాడు మిగిలిన శుభాశుభ రూప ప్రారబ్ధకర్మలను ఉపభోగముద్వారా నశింపజేసి, పరమపదము నందునో, అదియే బ్రహ్మము

ఇట్లు

**చతుర్థాధ్యాయ ప్రథమపాద సారము**



# IV-2
# చతుర్థ అధ్యాయము - ద్వితీయ పాదము
## ఉత్ర్కాంతి

## (1) వాగధికరణము (168)

## (497) IV-2-1

సూ. వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ

క్ర. **వాక్, మనసి, దర్శనాత్, శబ్దాత్, చ**

ప్ర.అ. వాక్ = **వాక్కు,** మనసి = **మనస్సునందుండును,** దర్శనాత్ = **ప్రత్యక్షముగా చూచుట వలన;** శబ్దాత్ = **శ్రుతి వాక్యము వలనను**

వి. "అస్య సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణస్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం, సః యః ఏషో అణిమా" (ఛాం.ఉ. VI-8-6)

"సౌమ్యా! మరణించు మనుష్యుని యొక్క వాక్కు మనస్సులో, మనస్సు ప్రాణములో, ప్రాణము తేజస్సు నందు, తేజస్సు పర దేవత యందు చేరును.అది సూక్ష్మము." (ఛాం.ఉ. VI-8-6) అని ఉద్దాలకుడు తన పుత్రుడైన శ్వేతకేతువుతో అన్నాడు.అయితే "వాక్కు మనస్సులో చేరును" అనే దానిలో వాక్కు మనస్సులో లయమౌతుందా లేక వాగ్వృత్తి మనస్సులో లయమౌ తుందా? అనే ప్రశ్న వస్తుంది. వాక్కు లయమౌతుంది అంటే వాగ్వృత్తి లయమౌతుంది అని అర్థము. అంటే వాక్ వ్యాపారము మనస్సునందు లయమౌతుంది అని తెలుసుకోవాలి. ఇది **ప్రత్యక్షముగా చూచుచున్నాము. మరణాసన్నుడైన వ్యక్తియందు మనస్సు వుండగానే వాక్కు ఇంద్రియ కార్యమును, మాటలను ఆపి వేయుచున్నది.**

**ఉత్ర్కాంతి (లేచిపోయే సమయములో) సమయములో మొదలు వాగ్వృత్తి వాక్కు వ్యాపారము - మనస్సులో కలసిపోతోంది.**

(ఛాం.ఉ. VI-8-6)

## (498) IV-2-2

సూ. అత ఏవ చ సర్వాణ్యను

క్ర. **అతః ఏవ, చ, సర్వాణి, అను**

ప్ర.అ. అత ఏవ = **ఇందువలన,** చ = **కూడ,** సర్వాణి = **సమస్తేంద్రియములు,** అను = **వెను వెంట**

వి. **వాక్కువలెనె చక్షు, పాణి, పాద, శ్రోత్ర, త్వక్, ఘ్రాణేంద్రియముల వృత్తులు కూడ మనస్సులో లయమైపోతాయి.**

వాగ్వ్యాపారం లాగానే మిగతా నేత్రాదీంద్రియాల వృత్తులు అన్నీ మనస్సు నందు లయమై పోతాయి. వృత్తిలయమే కాని స్వరూపలయము కాదు అని గ్రహించాలి. శ్రుతిలో ఈ విధముగా నున్నది.

"తేజో హ వై ఉదానః తస్మాదుపశాన్త తేజాః,
పునర్భవ మింద్రియైః, మనసి సంపద్యమానైః" (ప్ర.ఉ. III-9)

అని భగవంతుడు పిప్పరాదుడు కౌసల్యునితో అన్నాడు.

"ఎవరు తనలో దేహగత ఉదానమునకు తోడుగా నుండు తేజస్సు ఉపశాంతించి యుండునో, అతడు మనస్సులో ప్రవేశించుచున్న వాగింద్రియములతో పాటు పునర్జన్మ పొందుచున్నాడు"

**కావున ఇంద్రియాలన్నింటికి వృత్తిలయము ఈ శ్రుతిలో కనిపిస్తున్నది. ఒక వాక్కు విషయమే (బ్ర.సూ. IV-2-1, 498) శ్రుతి చెప్పింది అని అనుకొనరాదు. అన్ని ఇంద్రియ వృత్తులకు మనస్సులో లయము వున్నది.**

(ప్ర.ఉ.III-9; బ్ర.సూ.IV-2-1, (498))

**[నారాయణ వాక్యము :**
**మరణము కన్న ముందు ఒక వాక్కే ఆగిపోదు. మనస్సు చైతన్యముగా వున్నా వాక్కుతో పాటు, చక్షు, శ్రోత్రము, త్వక్కు, ఘ్రాణము కూడా మనసులో కలిసిపోతాయి అంటే మిగతా ఇంద్రియములు వృత్తి రూపములలో వాక్కును అనుసరించి మనస్సులో లయము అవుతాయి.]**

## (2) మనోఽధికరణము (169)

## (499) IV-2-3

**సూ.** **తన్మనః ప్రాణ ఉత్తరాత్**

**క్ర.** **తత్, మనః, ప్రాణే, ఉత్తరాత్**

**ప్ర.అ.** తత్ = **ఆ ఇంద్రియములతో కూడిన,** మనః = **మనస్సు,** ప్రాణే = **ప్రాణమందు నిలచును,** ఉత్తరాత్ = **చెప్పబడిన శ్రుతి వాక్యము వలన**

**వి.** (ఛాం.ఉ.VI-8-6) (బ్ర.సూ.VI-2-1)లో చెప్పబడిన శ్రుతి వాక్యము వలన "వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే" అనే దానిలో ఇంద్రియము (వృత్తి రూపములలో) **మనస్సులో కలిసిన తరువాత మనస్సు ప్రాణములో లయము అవుతుంది అని వుంది. అయితే మనోవృత్తి అని అర్థమా? లేక మనస్సు అని అర్థమా? అని ప్రశ్న వస్తుంది దానికి సమాధానము ఈ సూత్రము.**

అన్ని ఇంద్రియ వృత్తుల లయమునకు ఆధారమైన మనస్సు కూడా తన వృత్తిద్వారా (వ్యాపారము ద్వారా) ప్రాణములో లీనము అవుతుంది. ఈ విషయము తరువాతి వాక్యమైన "మనః ప్రాణే" అనే దానివల్ల తెలుస్తున్నది.

ఇంద్రియ వ్యాపారాలన్ని మనస్సులో లయం అయినట్లు మనో వ్యాపారాలన్ని ప్రాణములో లయమవుతాయని తెలిసికోవాలి.

**అయితే మనస్సు ఇంద్రియములతో కూడియే ప్రాణములో కలసిపోతాయి. అంటే ఇంద్రియ వ్యాపారాలన్ని మనస్సులో, మనో వ్యాపరాలన్నీ, ఇంద్రియ వ్యాపారములతో కూడి ప్రాణములో చేరుతాయి.**

## (3) అధ్యక్షాధికరణము (170)

## (500) IV-2-4

**సూ. సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః**

**క్ర. సః, అధ్యక్షే, తదుపగమాదిభ్యః**

ప్ర.అ. సః = **ఆ ప్రాణము మనస్సు ఇంద్రియములతో గూడి,** అధ్యక్షే = **తన స్వామియైన జీవాత్మయందు నిలచును,** తదుపగమాదిభ్యః = **ఆ జీవాత్మ యొక్క గమనాదికము గూర్చి వర్ణనము చేత**

**వి.** బృహదారణ్యక ఉపనిషత్తులో యాజ్ఞ్యవల్క్యుడు జనక మహారాజుతో ఇలా చెప్పినాడు.

"తద్యథా రాజానం ప్రమీయాసంతం ఉగ్రాః,ప్రత్యేన సః సూత గ్రామణ్యో, అభిసమాయ న్త్యేవమే వేమమాత్మాన మంతకాలే,
సర్వే ప్రాణాః అభిసమాయంతి, మత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి" (బృ.ఉ. IV-3-38)
"ఏ రీతిగా సైన్యసమేతుడై వెళ్లుటకు సంసిద్ధుడైన మహారాజు ననుసరించిన ఆయన సైనికులు, అంగరక్షకులు, సేవకులు, గ్రామాధికారులు అందరు అతని చెంతకు వచ్చెదరో, ఆ రీతిగా అంత్యకాలమున, ఈతని శ్వాస పైకి పోవనారంభించిన, జీవుని కడకు (ఆత్మ కడకు) సర్వ ప్రాణములు వచ్చి చేరును."

మరియు

"ఏష ఆత్మా నిష్క్రామతి, చక్షు షా, మూర్ధ్నో వా, అన్యేభ్యో వా, శరీర దేశేభ్యః, తముత్క్రామంతం ప్రాణో అనుత్క్రామతి, ప్రాణః అనూత్క్రామతి, ప్రాణం సర్వే ప్రాణాః అనూత్క్రామంతి"
(బృ.ఉ. IV-4-2)

"ఆ సమయమున ఆ జీవుడు (ఆత్మ) నేత్రముల నుండి గాని, బ్రహ్మ రంధ్రము నుండి గాని, లేక శరీరమందలి మరి ఏ ఇతర మార్గము నుండి గాని, శరీరము వదలి వెలికిపోవును. ఆ పోవునప్పుడు దానివెంట ప్రాణము పోవును." (ఛాం.ఉ.IV-8-6)లో (బ్ర.సూ.IV-2-1) అయితే **"మనః ప్రాణే, ప్రాణ స్తేజసి, తేజః పరస్యాం" అని వున్నది కదా? దీనిలో "ప్రాణ స్తేజసి" అని వున్నదంటే ప్రాణములు తేజస్సులో లయమగునని అందుచెప్పి ఇప్పుడు ప్రాణములు జీవుని వెంటపోవునని ఎలా చెప్పబడినది ?" అనే ప్రశ్న వస్తుంది. దానికి సమాధానము ఈ తరువాత సూత్రము**

(బృ.ఉ.IV-3-38, IV-4-2, IV-2-1; ఛాం.ఉ.IV-8-6)

## (501) IV-2-5

**సూ. భూతేషు తచ్ఛ్రుతేః**

**క్ర. భూతేషు, తత్ + శ్రుతేః**

ప్ర.అ. భూతేషు = **ప్రాణేంద్రియ సహితమైన జీవాత్మ, పంచ సూక్ష్మ భూతముల యందు నిలచును,** తత్ శ్రుతేః = **ఆ విషయములో శ్రుతి చెప్పినందు వలన.**

వి. పూర్వ శ్రుతిలో చెప్పబడినట్లు "ప్రాణ స్తేజసి" అంటే "ప్రాణములు తేజస్సున లయమగును." దీని నుండి తెలియునది ఏమనగా, జీవాత్మ మనస్సు సర్వేంద్రియములు, అన్ని సూక్ష్మభూత సముదాయము నందు నిలిచును. ఎందుకనగా సూక్ష్మభూతములన్నియు తేజస్సుతో మిళితములగును. అందుచేత 'తేజస్సు' అను పేరుతో, సమస్త సూక్ష్మ భూత సముదాయము చెప్పబడినదగును. శబ్ద స్పర్శ రూప రస గంధములు సూక్షభూత సముదాయము. మరణకాలములో జీవుడు భూతసూక్ష్మాలతో కూడుకొని వుంటాడు. ఆ భూతాలే జీవునికి ఉపాధులు. కావున జీవుణ్ణి చెందిన ఆ ప్రాణము ఉపాధులైన భూతాలని చేరినేట్లే.

**దీనిని బట్టి ప్రాణవృత్తి జీవుని యందే లయము అవుతుంది - తేజస్సు నందుకాదు. అందుచేత శ్రుతి విరోధము ఏమీ లేదు.**

**భూత సూక్ష్మములు అంటే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రలు.**

## (502) IV-2-6

సూ. **నైకస్మిన్దర్శయతో హి**

క్ర. **న, ఏకస్మిన్, దర్శయతః, హి**

ప్ర.అ. న=**కాదు,** ఏకస్మిన్=**ఒకచోట,** దర్శయతి = **శ్రుతి, స్మృతులందు అట్లు చెప్పబడినది.** హి = **ఎందుకనగా**

వి. **అంతకాలములో జీవుడు ఒక తేజస్సు నందు మాత్రమే వుండడు. ఛాందోగ్యోపనిషత్తులో పాంచాల రాజు ప్రవహణుడు, ఆరుణి తనయుడైన ఉద్దాలకునితో ఇట్లనెను.**

"పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవంతి" (ఛాం.ఉ. V-3-3)

"పంచమహవిస్సు జలము, పురుషుడు అను సంజ్ఞ ఎట్లు పొందును ?"

పంచమ ఆహుతి

(పంచమ ఆహుతి - యువతియే అగ్ని, ఉపస్థయే సమిధ, సంకేతమే పొగ, యోని జ్వాల, మైథునమే అగ్ని, రతి సుఖమే కిరణములు - ఈ అగ్నిలో ఇంద్రియాది దేవతలు రేతస్సును హోమము చేసెదరు. ఆ ఆహుతి నుండి గర్భము పుట్టుచున్నది." (ఛాం.ఉ. V-8-2)

ఈ ఐదవ ఆహుతి యందు పురుషుడనే పేరు కలుగుతుంది అని చెప్పటము వలన జీవుడు సమస్త భూతాలయందు వున్నట్లు తెలుస్తుంది. శ్రుతులు ఈ విధముగా చెప్పుతున్నాయి. అంటే మరణ సమయములో శరీరాన్ని విడిచి, మరొక శరీరాన్ని పొందేటప్పుడు అన్ని భూతాల యొక్క సూక్ష్మాంశములందు సూక్ష్మ శరీరముతో వుంటాడు. భావి శరీరానికి ఈ భూతాలన్ని అవసరమే కద!

(పంచభూతముల వినాశశీలమైన పంచ సూక్ష్మతన్మాత్రలు రూప రస గంధ స్పర్శ శబ్దములని చెప్పబడినవి. వానితో గూడ ఈ సంపూర్ణ జగత్తు క్రమముగా ఉత్పన్నమైనది) **అట్లు మరణ సమయములో జీవుడు శరీరాన్ని విడిచి, మరొక శరీరము పొందేటప్పుడు అన్ని భూతాలయొక్క సూక్ష్మాంశ తన్మాత్రలలో వుంటాడు.**

(ఛాం.ఉ.V-3-3, V-8-2)

# (4) ఆస్కృత్యుపక్రమాధికరణము (171)

## (503) IV-2-7

సూ. సమానా చాసృత్యుపక్రమాదమృతత్త్వం చానుపోష్య

క్ర. సమానా, చ, అసృత్యుపక్రమాత్, అమృతత్త్వం, చ, అనుపోష్య

ప్ర.అ. సమానా = **ఇద్దరి గమనము సమానమే,** చ = **కూడ,** ఆసృత్యుప క్రమాత్ = **దేవయానము ద్వారా బ్రహ్మలోకము చేరుటకు క్రమారంభము కలుగు వరకు,** అమృతత్త్వం = **బ్రహ్మలోకమందు అమృతత్త్వమందుట బ్రహ్మ విద్యకు ఫలము అని చెప్పబడినది,** చ = **కూడ,** అనుపోష్య = **సూక్ష్మ శరీరమును సురక్షితముగా గ్రహించి**

వి. ఛాందోగ్యోపనిషత్తులో

"శతం చైకా చ హృదయస్య నాడ్యః, తాసాం మూర్ధాన మభి నిస్సృతైకా। తయోర్ధ్వమాయన్ అమృతత్వమేతి, విష్వఙ్గన్యా ఉత్క్రమణే భవన్తి, ఉత్క్రమణే భవంతి" - (ఛాం.ఉ. VIII-6-6) "హృదయము నుండి 101 నాడులు వెడలుతున్నవి. వానిలో ఒక్క నాడి (సుషుమ్న) మూర్ధమునకు పోవుచున్నది. ఆ ద్వారములో పోవువాడు అమృతత్వమందును. తక్కిన నాడులు పలు దిక్కులకు తీసుకొని పోవును." అయితే,

"వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే" (ఛాం.ఉ. VI-8-6) అని చెప్పబడిన ఉత్క్రాంతి ఉపాసకునికీ, ఉపాసకుడు కాని వానికి కూడా సమానమేనా ? కాదా ? అనే ప్రశ్న వస్తుంది. మరియు పైన "అమృతత్వమేతి" అని సగుణ బ్రహ్మజ్ఞానికి మోక్షఫలము చెప్పబడినది. కావున "వాఙ్మనసి" అనిన ఉత్క్రాంతి ఉపాసకుడు కాని వానికేనా ? అనే ప్రశ్న కూడా వస్తుంది.

దీనికి సమాధానము ఈ సూత్రము.

దేవయాన మార్గారంభమునకు పూర్వము విద్వాంసుడు, అవిద్వాంసుడు ఇద్దరి ఉత్క్రాంతి సమానమే. ఒకే రీతిగా జరుగుతుంది. ఎందుకంటే "వాఙ్మనసి" అనే శ్రుతి విశేషమైనది. సగుణ విద్య యందు చెప్పబడిన అమృతత్వము ఔపచారికమే - గౌణమే. అవిద్య అనేది దహించక పూర్వమే కలుగుతున్నది కనుక.

సగుణ బ్రహ్మజ్ఞానికి మూర్ధన్య నాడీ ప్రవేశము, ఉత్తర మార్గాన పోవటము కలుగుతుంది. జ్ఞానము లేని వానికి ఇతర నాడుల్లో ప్రవేశం కలిగి దక్షిణ మార్గమున పోవటము కలుగుతుంది.

ఆయా రెండు మార్గాల వరకు ఉపాసకుడైన జ్ఞానికీ, ఉపాసకుడు కాని అజ్ఞానికీ కూడా భూత సూక్ష్మావయనము సమానమే.

దేవయాన మార్గాన పోకుండా బ్రహ్మలోక ప్రాప్తి అనేది సగుణ బ్రహ్మజ్ఞానికైనా కలుగదు. కావున ఉత్క్రాంతి ఇతనికీ సమానమే. ఇక్కడ చెప్పిన ఉపాసకుడు పొందే అమృతత్వము అవిద్యా క్లేశాదులన్ని నాశనమై పోగా కలిగే బ్రహ్మానుభూతి అమృతత్వము (నిర్గుణ బ్రహ్మోపాసకునకు కలిగే) కాదు. అపేక్షికమైన అమృతత్వము అన్న మాట.

ఇంకొక తీరుగా చెప్పాలంటే - వాక్కు మనస్సు నందు నిలిచును. అక్కడ నుండి ప్రాణము, మనస్సును, ఇంద్రియములను వెంట తీసుకొని జీవాత్మ సూక్ష్మభూత సముదాయమందుండు వరకు అనగా స్థూల శరీరము నుండి విడివడి సూక్ష్మ శరీరమందుండు వరకు సాధారణ మనుష్యులకు, బ్రహ్మలోకమునకు పోవు సగుణోపాసకులకు గతి సమానముగనే చెప్పబడినది. ఎందుకంటే సూక్ష్మ శరీరము సురక్షితముగా నుండినందు వలననే ఈ లోకము నుండి బ్రహ్మలోకము పోవుటకు వీలు కలుగును. అక్కడికి పోయి అమృతత్వమును పొందును. అదే ప్రకారము అన్యలోకములందును, అన్య శరీరములందును కూడా సూక్ష్మ శరీరము ద్వారా గమనము కలుగును.

(ఛాం.ఉ. VIII-6-6, VI-8-6)

## (5) సంసారవ్యపదేశాధికరణము (172)

## (504) IV-2-8

**సూ. తదాపీతేః స్సంసారవ్యపదేశాత్**

**క్ర. తత్, ఆపీతేః, సంసారవ్యపదేశాత్**

ప్ర.అ. తత్ = **వారి సూక్ష్మ శరీరము,** ఆపీతేః = **భుక్తావస్థ ప్రాప్తించు వరకు వుండును.** సంసారవ్యపదేశాత్ = **సాధారణ జీవులు మరణించిన పిమ్మట తిరిగి జన్మించుట గూర్చి చెప్పబడనందు వలన. అందుచేత నూతన స్థూల శరీరము ప్రాప్తించుటకు ముందు పరమాత్మ యందు వుండుట ప్రళయ కాలమందు వలెనె వుండును.**

వి. ఒక శరీరము నుండి మరియొక శరీరములోనికి పోవువానికి పరదేవత యందుండుట చెప్పబడినది. అదే ప్రళయ కాలమందు వాటి కర్మ సంస్కారము.

సూక్ష్మ శరీరముతో కూడి జీవాత్మ అజ్ఞాన పూర్వక స్థితిలో వుండును. అందుచేత అది పరమాత్మ ప్రాప్తి కాదు. సమస్త జగత్తు ఆ పరమ కారణుడైన పరమాత్మ యందుండుట వంటిది. ఆ స్థితి జీవాత్మకు ఎంత వరకు అనగా, దాని కర్మభోగమునకు ఉపయుక్తమగు మరియొక శరీరము సమకూరునంత వరకు. అది పునర్జన్మ.

"యోనిమన్యే ప్రపద్యంతే, శరీరత్వాయ దేహినః
స్థాణుమన్యే అనుసంయంతి, యథా కర్మ యథా శ్రుతం" (కఠ.ఉ. II-2-7)

"వేరు దేహములు కొందరు చెందుచుంద్రు
తరువులందు కొందరు చేరుచుంద్రు
వేరు వేరు రూపములందు చుంద్రు
వారి కర్మకొలది వారి జ్ఞానమ్ము కొలది". (కఠ.ఉ. II-2-7)

అందువలన ఎంతవరకు ముక్తి లభింపదో అంతవకు సూక్ష్మ శరీర సంబంధము వుండును. కావున అతడు ముక్తపురుషుల వలె బ్రహ్మజ్ఞానుల వలె పరమాత్మ యందు విలీనుడు కాడు. (కఠ.ఉ. II-2-7)

## (505) IV-2-9

**సూ. సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః**

**క్ర. సూక్ష్మం, ప్రమాణతః, చ, తథాఉపలబ్ధేః**

ప్ర.అ. సూక్ష్మం = **దేనియందు జీవాత్మయుండునో ఆ భూత సముదాయము సూక్ష్మము,** ప్రమాణతః = **శ్రుతి ప్రమాణము చేత,** చ = **కూడ,** తథోపలబ్ధేః = **అట్టి ఉపలబ్ధి కలుగుట వలన ఇది సిద్ధించుచున్నది.**

వి. **మరణ కాలమందు ఏ ఆకాశాది భూత సముదాయమందు అన్నింటితో కూడిన జీవాత్మ చెప్పబడినదో ఆ భూత సముదాయము సూక్ష్మము. స్థూలము కాదు.** దీనికి శ్రుతి ప్రమాణము కలదు. "హృదయము నుండి 101 నాడులు వెలుపడుచున్నవి. దానిలో ఒక్క నాడి సుషుమ్న, మూర్ధమునకు పోవుచున్నది. ఆ ద్వారములో పోవు జీవాత్మ అమృత స్వరూపుడగును. తక్కిన నాడులు పలుదిక్కులకు పోవుచున్నవి." (ఛాం.ఉ.VIII-6-6) నాడుల ద్వారా వెలువడుట చెప్పబడినది కావున అది సూక్ష్మ భూతములందున్న జీవాత్మకే సంభవము.

మరియు మరణ కాలములో అతడు పోవుట దగ్గరనున్న మనుజులు ఎప్పుడు చూడలేదు. ఈ ప్రకారము శ్రుతి ప్రమాణము మరియు ప్రత్యక్ష ప్రమాణముల వలన ఆభూత సముదాయము సూక్ష్మము మరియు, ఈ శరీరము నుండి పోతున్న జీవునికి ఆశ్రయభూతమైన తేజస్సు ప్రమాణాన్ని బట్టి "ప్రాణస్తేజసి" (ఛాం.ఉ.VI-8-6), నాడీ నిష్క్రమణాది శ్రుతిని బట్టి (ఛాం.ఉ.VI-6-6) జీవాత్మ స్వరూపము సూక్ష్మముగా వుంటుందని తెలుస్తున్నది.
(ఛాం.ఉ.VIII-6-6, VI-8-6, VI-6-6)

---

## (506) IV-2-10

**సూ. నోపమర్దేనాతః**

**క్ర. న, ఉపమర్దేన, అతః**

ప్ర.అ. న = **దానికి నాశనము లేదు,** ఉపమర్దేన = **ఈ స్థూల శరీరము దహనము మొదలైన వానిచేత నశింపచేయ బడుట చేత,** అతః = **భూత సముదాయము సూక్ష్మమగుట వలన**

వి. **మరణ కాలమందు జీవాత్మ ఏ ఆకాశాది భూత సముదాయ రూపమైన శరీరమందుండునో అది సూక్ష్మ శరీరము. అందుచేత శరీరము దహనాదుల ద్వారా నాశనము పొందినను ఆ సూక్ష్మ శరీరమునకు జెరపు ఏమియు వుండదు.**

జీవాత్మ సూక్ష్మ శరీరముతో కూడి, ఆ స్థూల శరీరము నుండి వెలువడును.

కావున స్థూల శరీరముకు దహనది సంస్కారములు చేసిన పిమ్మట కూడ జీవాత్మకు తత్సంబంధమైన కష్టానుభవము ఏ మాత్రము కలుగదు. అంటే సూక్ష్మ శరీరమనేది అత్యంత సూక్ష్మమైనందు వలన స్థూల శరీరమునకు ఉపమర్దము చేత (ఒరిపిడి చేత) ఈ సూక్ష్మ శరీరానికి బాధ కలుగును.

[**నారాయణ వాక్యము :** మల్లెమొగ్గలు పెద్దవి చిన్నవి అయినా సుగంధము మారదు. బెల్లము గడ్డ ముక్కలు అయినా రుచి మారదు.]

**సూక్ష్మము, స్వచ్ఛము అయినందు వలన, ఈ స్థూల శరీరానికి ఏ బాధ కలిగినా సూక్ష్మ శరీరానికి ఆ దెబ్బ తగలదు. సూక్ష్మ శరీరము దహింపబడదు. సూక్ష్మ శరీరము అనేది వున్నదా? అనే ప్రశ్నకు ఈ దిగువ సూత్రములో సమాధానము వున్నది.**

## (507) IV-2-11

సూ. **అస్యైవ చోపపత్తేరేష ఊష్మా**

క్ర. **అస్య, ఏవ, చ, ఉపపత్తేః, ఏష, ఊష్మా**

ప్ర.అ. అస్య ఏవ= **ఈ సూక్ష్మ శరీరమునకు సంబంధించినది అయి ఉన్నది,** ఉపపత్తేః= **అందుకు కారణము కనిపించుట వలన,** ఏష ఊష్మా = **ఈ వేడి**

వి. **ఈ స్థూల శరీరములో మనకు లభించే ఆవిరి (ఊష్మము-వేడి) ఈ సూక్ష్మ శరీరమునకు సంబంధించినది.** మృతదేహాన్ని తాకి చూస్తే వేడి వుండదు. కాళ్లూ, చేతులు చల్లబడి పోయినాయని అంటాము. **కావున ఊష్మము అనేది సూక్ష్మ శరీర ధర్మమని తెలుస్తున్నది. కావున సూక్ష్మ శరీరము అనేది వున్నది.**

## (6) ప్రతిషేధాధికరణము (173)

## (508) IV-2-12

సూ. **ప్రతిషేధాదితి చేన్న శారీరాత్**

క్ర. **ప్రతిషేధాత్, ఇతి, చేత్, న, శారీరాత్**

ప్ర.అ. ప్రతిషేధాత్ = **ప్రతిషేధమగుట వలన,** ఇతిచేత్ = **దానికి గమనము లేదు అని అనినచో,** న = **కాదు,** శారీరాత్ = **ఎందుకనగా ఈ ప్రతిషేధ వచనము వలన, జీవాత్మ నుండి ప్రాణములు వేరుపడుట నిషేధించబడినది.**

వి. బృహదారణ్యకములో

"కామయ మానో, అథ అకామయమానో,
యో అకామో, నిష్కామః, ఆప్తకామః, ఆత్మకామో,
న తస్య ప్రాణాః ఉత్క్రామంతి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి." (బృ.ఉ.IV-4-6)

"జ్ఞాని కర్మఫలములను కోరనివాడు, నిష్కాముడు, ఆప్తకాముడు, ఆత్మకాముడు (తన స్వరూపమును మాత్రము కోరువాడు) అగుచున్నాడు. వాని యొక్క ప్రాణములు ఉత్క్రమించవు. ఇక్కడనే బ్రహ్మయై పరబ్రహ్మమును పొందుచున్నాడు." (బృ.ఉ.IV-4-6)

**కావున బ్రహ్మవిదుని ప్రాణాదులకు ఉత్క్రమణము లేదు.** అయితే **ప్రాణాదులతో కూడిన జీవునికే ఉత్క్రమణము వుంటుంది కదా ? ఇది పూర్వపక్షము ఈ ప్రశ్నకు సమాధానము ముందరి సూత్రము.** (బృ.ఉ.IV-4-6)

## (509) IV-2-13

**సూ. స్పష్టో హ్యేకేషాం**

**క్ర. స్పష్టః, హి, ఏకేషాం**

**ప్ర.అ.** స్పష్టః = **స్పష్టముగా శరీరము నుండి ప్రాణములు ఉత్క్రమణము చేయవు అని చెప్పబడినది,** హి = **అందుచేత వానికి గమనము వుండదు,** ఏకేషాం = **కాణ్వశాఖీయుల పాఠము నందు.**

**వి. ఒక శాఖవారిచే శ్రుతి యందు స్పష్టముగా చెప్పబడినది. "న తస్య ప్రాణాః ఉత్క్రామంతి" (బృ.ఉ. IV-4-6) "అతని ప్రాణములు ఉత్క్రమించవు." "ఆప్తకాముడైన మహాపురుషుని ప్రాణములు ఉత్క్రమణము చేయవు. ఇక్కడనే విలీనము అగును. అతడు బ్రహ్మ అయి బ్రహ్మమును పొందును."**

మరియు "అత్ర బ్రహ్మ సమశ్నుతే" (బృ.ఉ. VI-4-7)
"అతడిక్కడనే బ్రహ్మమును పొందుచున్నాడు."

"ఓ సౌమ్య! అతడు సర్వజ్ఞుడైన
మహాపురుషుడు, సర్వరూపుడైన
పరమాత్మ యందు ప్రవేశించును" (ప్ర.ఉ.IV-11)

**ఈ శ్రుతి ప్రమాణముల నుండి ఆ బ్రహ్మజ్ఞానులైన మహాపురుషులకు లోకాంతర గమనముండదు. జీవాత్మ నుండి ప్రాణముల నిష్క్రమణము నిషేధించు అవసరము లేదు. బ్రహ్మజ్ఞాని ఇచటనే పరబ్రహ్మమును పొందును.**

(బృ.ఉ. IV-4-6, VI-4-7; ప్ర.ఉ. IV-11)

## (510) IV-2-14

**సూ. స్మర్యతే చ**

**క్ర. స్మర్యతే, చ**

**ప్ర.అ.** స్మర్యతే = **స్మృతి,** చ = **కూడ, అట్లేచెప్పుచున్నది.**

**వి. స్మతి కూడ బ్రహ్మ జ్ఞానులకు లోకాంతర గమనము వుండదని, వారు ఇచటనే పరబ్రహ్మమును అందుదురని చెప్పుచున్నది.**

"బ్రహ్మస్థితిని చెందిన బ్రహ్మవిదుడు
సమ్మూఢుడు కాదు స్థిరబుద్ధి యతడు
దా మురిసి పొంగడు ప్రియము గలుగ
దా మునిగి ఏడ్వదు దు:ఖంబు గలుగ" (భ.గీ. V-20)

"దొరుకున్ బ్రహ్మ నిర్వాణంబు సరిగన్
యా ఋషులకున్ క్షీణ కల్మషులకున్

మరి ఛిన్నవ్యధులకు యతాత్ములకున్
సర్వభూత హితులకు నెంతయున్" (భ.గీ. V-25)
"కామక్రోధ వియుక్తులకు మరియున్
సమ యోగులకున్ యత చేతసులకున్
దము యాత్మన విదితులైన వారికిన్
బ్రహ్మనిర్వాణంబు దొరకున్ లెస్సగన్" (భ.గీ. V-26)
"అరయ జీవలోకమందు జీవమ్మ యగుచు
చేరి నాయంశ అతి సనాతనంబు
ప్రకృతి స్థానమందు నుండి మనము గూడి
యారు యంద్రియముల కర్షించుచుండు" (భ.గీ. XV-7)
"యెట్లు వాయువు దాను దాకి వీచునపుడు
పూల నుండి వాసనల గ్రహించి పోవు
నట్లు ప్రభువు దాను యుండి వెడలు నపుడు
ఇల దేహము నుండి ఆరింటి గ్రహించి పోవు"(భ.గీ. XV-8)
"శ్రోతంబు చక్షవు మరియు ఘ్రాణంబు
చర్మంబు నాలుక మరియు మనంబు
నరాధిప నధిష్ఠించుచుండి యతడు
మరి విషయములుప సేవించుచుండు" (భ.గీ. XV-9)
"వాని వెడలు వాని యుండు వాని
అనుభవించు వాని గుణాన్వితుని
కనలేరు మూఢులైనట్టి వారు
జ్ఞాన చక్షువులు సరిగ చూడ గలరు" (భ.గీ. XV-10)
"యతులైన యోగులు చూచు వారు
యాత్మ నందు స్థితమైనట్టి వాని
యతన్తులైనను యకృతాత్ములైన వారు
యాత్మ లోపల యచేతసులు చూడ లేరు" (భ.గీ. XV-11)

అట్లు ఆత్మజ్ఞానులైన వారు ఇక్కడనే ఆత్మ దర్శనము, బ్రహ్మ దర్శనము చేయుదురు. బ్రహ్మ సాక్షాత్కారము కలిగిన విద్వాంసునికి దేవయానాది మార్గాలు కాని, ఉత్క్రమణం కాని లేదని మహాభారతాది స్మృతులు తెలుపుతున్నాయి.

"సర్వ భూతాత్మ భూతస్య సమ్యగ్భూతాని పశ్యతః
దేవా అపి మార్గే ముహ్యంతి అపదస్య పదైషిణిః"

(మ.భా. XII-270-22)

"సమస్త భూతాలను ఆత్మ మాత్రముగా తెలుసుకొని అన్ని భూతాలలోనూ వున్న పరమాత్మను తెలిసికొని, బ్రహ్మ కంటే భిన్నమైన స్థానమును కోరని బ్రహ్మవేత్త యొక్క స్థితి తమకు కావాలని కోరే దేవతలు కూడ అతని జ్ఞానమును గూర్చి భ్రాంతులవుతారు. బ్రహ్మవేత్తకు మార్గము లేనందున, అవసరము కూడా లేనందున, దేవతలు కూడా ఆశ్చర్యమందుతారు."

**"మోక్ష సమయమందు ప్రాణాదులైన పదిహేను కళలు పంచ జ్ఞానేంద్రియముల, పంచ కర్మేంద్రియముల తమ తమ కారణములను, మూల ప్రతిష్ఠలందు చేరును, సమస్తములైన చక్షురాది ఇంద్రియ దేవతలు, ప్రతి దేవతలైన సూర్యాదుల యందు చేరును. వానితో జీవన్ముక్తునకేమియు సంబంధము లేదు.**

(భ.గీ. V-20, 25,26; XV-7,8,9,10,11;(మ.భా. XII-270-22)

## (7) వాగాదిలయాధికరణము (174)

## (511) IV-2-15

**సూ. తాని పరే తథా హ్యాహ**

**క్ర. తాని, పరే, తథా, హి, ఆహ**

ప్ర.అ. తాని = **ఇంద్రియములు మొదలైనవి,** పరే=**పరబ్రహ్మమునందు లీలమౌతాయి,** తథా=**అట్లు,** హి=**యే,** ఆహ=**శ్రుతులు చెప్పుచున్నవి.**

**వి.** ఇంద్రియములు మొదలైనవి పరబ్రహ్మమునందే లీనమౌతాయని శ్రుతులు చెప్పుచున్నవి. ఇంద్రియముల విలీనము గూర్చి రెండు శ్రుతులు రెండు తీర్ల చెపుతున్నాయి.

"గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా
దేవాశ్చ సర్వే ప్రతి దేవతా సు
కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా
పరే అవ్యయే సర్వ ఏకీభవంతు" (ము.ఉ.III-2-7)

"మోక్ష సమయమందు ప్రాణాదులైన పదిహేను కళలు (పంచ ప్రాణములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు) తమ తమ కారణములను చేరిపోవును. సమస్తమైన చక్షురాది ఇంద్రియ దేవతలు తమ ప్రతి దేవతలైన సూర్యాదులయందు చేరిపోవును. కర్మలును, విజ్ఞానమయ జీవాత్మము అన్నియు అవ్యయమైన పరబ్రహ్మమందు లీనమగును." అని ముండకోపనిషత్తు అనుచున్నది. అంటే ప్రాణాదులైన ఇంద్రియాదులు తమతమ మూలకారణములలో చేరి జీవాత్మ తన కర్మములతో పాటు పరబ్రహ్మమున లీనము యగును. అయితే ప్రశ్నోపనిషత్తు ఇంకొక రీతిగా చెప్పుచున్నది.

"స యథేమా నద్యః స్యందమానాః, సముద్రాయణాః సముద్రం ప్రాప్య అస్తం గచ్ఛంతి, భిద్యతే తాసాం నామరూపే సముద్రః ఇత్యేవం ప్రోచ్యతే। ఏవమేవాస్య పరిద్రష్టుః ఇమాః షోడశకళాః పురుషాయణాః పురుషం ప్రాప్య, అస్తం గచ్ఛంతి, భిద్యేతే చ ఆసాం నామరూపే పురుషః ఇత్యేవం ప్రోచ్యతే, సః ఏషోఽకళోఽమృతే భవతి" (ప్ర.ఉ.VI-5)

"ఏ రీతిగా సముద్రమే తమ గమ్యముగా ప్రవహించు నదులు సముద్రమును పొంది లీనమై పోవుచున్నవో, సముద్రము మాత్రమే మిగులుచున్నదో అదే రీతిగా అంతటను చూచుచున్న, రూపవంతుడైన ఈ పురుషుని యొక్క శోడష కళలు, ఈ పురుషుని చేరి కనబడకుండ పోవును. ఈ కళల యొక్క నామరూపములు నశించి పోవును. పరమాత్మ అని మాత్రమే చెప్పబడును. ఈ జీవుడట్టి పరమేశ్వరుని తెలిసికొని కళల రూప దేహము నుండి విముక్తుడై అమరుడగును." (ప్ర.ఉ.VI-5)

ఈ రెండు శ్రుతులను పరిశీలించి చూస్తే సామాన్యముగా ఇంద్రియములు మరియు భూతములు తమతమ మూలకారణ ప్రతిష్ఠలతో కలుస్తాయి. సగునోపాసకులైన కలుస్తాయి. ఇది సగుణోపాసకులైన వారికి వర్తిస్తుంది. వారి విషయములో ప్రాణాదులైన వారి కళలు తమతమ కారణములలో చేరి వారి జీవాత్మ కర్మములతో పాటు అవ్యయమైన పరబ్రహ్మములో లీనము అవుతుంది. ఇది ముండకోపనిషత్తులో చెప్పినది.

అయితే బ్రహ్మజ్ఞాని విషయములో ఇంద్రియాది షోడషకళలు, బ్రహ్మజ్ఞానము అందగానే నామరూపములు లేకండా నశించిపోయి జీవాత్మ పరమాత్మ బేధము లేకుండాపోయి తక్షణమే పరబ్రహ్మత్వమునందుతాడు.

ఆ విధముగా బ్రహ్మజ్ఞాని విషయములు ఇంద్రియాదులన్ని పరబ్రహ్మములోనే కలుస్తాయి. (ముం.ఉ. III-2-7, ప్ర.VI-5)

## (8) అవిభాగాధికరణము (175)

## (512) IV-2-16

**సూ. అవిభాగో వచనాత్**

**క్ర. అవిభాగః, వచనాత్**

**ప్ర.అ.** అవిభాగః = **విభాగముండదు,** వచనాత్ = **శ్రుతివచనాను సారము.**

**వి. విద్వాంసుని ఇంద్రియాలకు (కళలకు) బ్రహ్మముతో పూర్తిగా అవిభాగమైన లయముయేనని శ్రుతివచనము.**

"భిద్యతే తాసాం నామరూపే పురుష ఇత్వేవం
ప్రోచ్యతే, స ఏషోఽకళోఽమృతో భవతి" (ప్ర.ఉ. VI-5)

"ఆ కళల యొక్క (ఇంద్రియాలు, ప్రాణాల యొక్క నామరూపాలు నశిస్తాయి. అన్ని కలిసి పోయి పురుషుడనేది మాత్రమే వుండును. ఇలా బ్రహ్మైక్య రూపమైన వుండును. ఇలా బ్రహ్మైక్య రూపమైన

లయమును పొందినపుడు జ్ఞాని కళలు లేనివాడు, ముక్తుడు అవుతాడు.” అంటే నిశ్శేషలయము అని తెలుస్తున్నది.

అజ్ఞానులకు అవిద్యాశేషము వుంటుంది కనుక, వారి ఇంద్రియ లయము సావశేషమై వుంటుంది. ఇదే విషయము ముండకోపనిషత్తు ఇలా చెప్పింది.

“యథా నద్యస్స్యంద్య మానాస్సముద్రే,

తంగచ్ఛంతి నామరూపే విహాయః

తథా విద్వాన్నామ రూపాద్విముక్త

పరాత్పరం పురుషముపైతి దివ్యం” (ముం.ఉ. II-5)

“ఎట్లు నదులు ప్రవహించి సముద్రమందు కలిసిపోవుచు తమ నామ రూపములు విడచివేయునో అట్లు విద్వాని నామ రూపముల నుండి ముక్తుడగుచు దివ్యమైన పరాత్పర పురుషనందు కలియుచుండు” **ఇట్లు జ్ఞానులైన మహాత్ములు తమ శరీరములను వదలి బ్రహ్మము తోడి పూర్తిగా అవిభాగమైన లయమునందుదురు.**

(ప్ర.ఉ. VI-5; ముం.ఉ. II-5)

## (9) తదోకోఽ ధికరణము (176)

## (513) IV-2-17

**సూ. తదోకోగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగ్రహీతః శతాధికయా**

**క్ర. తదోకోఅగ్రజ్వలనం, తత్ప్రకాశికతద్వారః, విద్యాసామర్థ్యాత్, తచ్ఛేష గత్యనుస్మృతియోగాత్, చ, హార్దానుగృహీతః, శతాధికయా**

ప్ర.అ. తదోకోఅగ్రజ్వలనం = **జీవాత్మ తన నివాసమైన హృదయము యొక్క అగ్రభాగమందు ప్రకాశించుచు,** తత్ప్రకాశిక ద్వారాః = **ఆ ప్రకాశించుట వలన ద్వారము తెరచికొనుచు,** విద్యా సామర్థ్యాత్ = **బ్రహ్మ విద్యా ప్రభావము వలన,** చ = **కూడ,** తచ్ఛేష గత్యనుస్మృతి యోగాత్ = **బ్రహ్మ విద్యకు శేషాంగమైన బ్రహ్మలోక గమన విషయకమైన సంస్కారము యొక్క స్మృతి సంబంధ యోగము వలన,** హర్దాను గృహీత = **హృదయస్థ పరమేశ్వర కృప చేత అనుగ్రహింపబడిన,** శతాధికమో = **నూరు నాడుల కంటే అధికమగు సుషుమ్నా నాడిచే బ్రహ్మరంధ్రము నుండి వెలువడును.**

**వి. సగుణ బ్రహ్మవేత్త యొక్క ఆత్మ శరీరము నుండి నిష్క్రమించేటప్పుడు జీవునికి వాసస్థానమైన హృదయము యొక్క చివరి భాగములో ఒక విధమైన జ్వలనము కలుగుతుంది. దానిచేత ప్రకాశింప చేయబడిన మార్గము కలవాడై, హృదయములో అధివసించి యున్న బ్రహ్మము చేత అనుగ్రహింపబడిన వాడై, బ్రహ్మ విద్యా సామర్థ్యము వలనను, బ్రహ్మ విద్యకు అంగముగా**

**చెప్పబడిన గతిని ధ్యానించటము వలనను నూటఒకటవదైన మూర్ధన్య నాడీ (సుషుమ్న) మార్గాన వెల్వడును.**

వాగింద్రియాలు ఉపసంహరింపబడటము, జీవుడు హృదయ స్థానాన్ని ప్రవేశించటము, హృదయాగ్రము ప్రకాశించటము అనేవి జ్ఞానికీ, అజ్ఞానికీ సమానమే. దాని వలన నిర్ణయించే మార్గము ప్రకాశితమౌతుంది.

జ్ఞాని మూర్ధ స్థానములో ఉన్న సుషుమ్నా నాడీ మార్గాన వెలువడుతాడు, అమృతత్వాన్ని పొందుతాడు. అజ్ఞానులు కండ్లు, ముక్కులు, చెవులు మొదలైన ద్వారాల ద్వారా నిష్క్రమిస్తారు.

"తస్యహైతస్య హృదయస్య అగ్రం ప్రద్యోతతే,
తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి" (బృ.ఉ.IV-4-2)

"బ్రహ్మవేత్తకు మరణామాసన్నమైనపుడు ఇంద్రియములు, ప్రాణములు, అంతఃకరణము లింగశరీరమునందు ఏకమై హృదయము యొక్క అగ్రభాగమందు ప్రకాశించును. ఆ ప్రకాశించు ద్వారమున ఆత్మ వెడలును." (బృ.ఉ.IV-4-2)

"శతం చైకా చ హృదయస్య నాడ్యః
తాసాం మూర్ధాన మభినిస్సృతైకా।
తయోర్ధ్వమాయన్ అమృతత్వమేతి, విష్వఙ్గన్యా
ఉత్క్రమణే భవన్తి, ఉత్క్రమణే భవన్తి॥" (ఛాం.ఉ.VIII-6-6)

"హృదయ మందలి నూరు నాడులలో ఒకటి మస్తకమునకు పోవును. దాని ద్వారా పైకి పోవు విద్వాంసునకు అమృతత్వము ప్రాప్తించును. శరీరములో అటు ఇటు పోవు నాడుల ద్వారా పోవువారు పలు యోనులకు పోవుదురు." (ఛాం.ఉ.VIII-6-6)

దీని వలన తెలుస్తున్నదేమిటంటే, మరణ కాలమందు మహా పురుషుడు హృదయాగ్రమునందలి ప్రకాశము చేత ప్రకాశితముయైన బ్రహ్మరంధ్రము గుండా స్థూల శరీరము నుండి బయల్వెడలును. **బ్రహ్మవిద్యాఫలరూపమైన బ్రహ్మలోక ప్రాప్తి రూప సంస్కారస్మృతితో హృదయస్థితుడైన పరమాత్మ అనుగ్రహముతో జ్ఞాని సూర్యరశ్మి మార్గమున వెళ్లును.**
(బృ.ఉ. IV-4-2; ఛాం.ఉ. VIII-6-6)

## (10) రశ్మ్యనుసార్యధికరణము (177)

## (514) IV-2-18

సూ. రశ్మ్యనుసారీ

క్ర. రశ్మ్యనుసారీ

ప్ర.అ. రశ్మ్యనుసారీ = **సూర్యుని రశ్మి యందు నిలచి అది అవలంబముగా సూర్యలోక ద్వారము గుండా బ్రహ్మజ్ఞాని బ్రహ్మలోకమునకు పోవును.**

వి. **సుషుమ్నా నాడీ ద్వారా శరీరము నుండి ఉత్క్రమణము చెందిన ఉపాసకుడు ఆ నాడితో**

**సంబంధము వున్న సూర్య కిరణములను అనుసరించి బ్రహ్మలోకమును చేరుతాడు.**

ఆ రశ్మి (కిరణముల వెలుగు) సంబంధము ఎప్పుడు వెడలిపోయినా వుంటుంది. ఆ రశ్మలను అనుసరించి సూర్యమండలమును పొందుతాడు. సూర్యరశ్మలను ఆశ్రయిస్తాడు అని అర్థము.

అది ఎలా అవుతుంది అంటే, ఈ స్థూల శరీరము నుండి వెలువడి ఆ జీవాత్మ ఈ సూర్యరశ్మి ద్వారా పైకిపోవును. అక్కడ "ఓం" అను శబ్దమునుచ్చరించునంత కాలములో సూర్యలోకమునకు పోవును. ఆ సూర్యుడు బ్రహ్మలోకము పోవు వారికి ద్వారము అవిద్వాంసులకది మూయబడి యుండును. అట్టి వారు నీచలోకములకు పోవుదురు.

విద్వాంసులకది తెరిచికొనును.

"యత్రైత దస్మాత్ శరీరా దుత్క్రామత్యథై తైరేవ
రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే,
సఓమితి వాహో ద్వామీయతే
సయావత్ క్షిప్యేన్మనః తావదాదిత్యం
గచ్ఛతే తద్వైఖలు లోకద్వారం
విదుషాం ప్రపదనం నిరోధో అవిదుషామ్." (ఛాం.ఉ. VIII-6-5)

"ఈ దేహమును వదలిపోవునపుడు అతడు ఈ కిరణముల ద్వారా పైకి పోవును. **ఓం అనిపలుకుతూ పైకి పోవును.** ఎంతవరకు మనసు వెడలునో, అంత వరకు అతడు ఆదిత్యలోకమునకు వెళ్లును. ఇదియే ఆదిత్య లోకమునకు ద్వారము. జ్ఞానులు ఆ ద్వారము దాటి వెళ్లుదురు. అజ్ఞానులు అచ్చటనే ఆపబడి నిలిచిపోవుదురు."

**దీని వలన బ్రహ్మరంధ్రము ద్వారా బ్రహ్మవేత్త స్థూలశరీరము నుండి వెడలి, సూర్యరశ్మి యందు నిలచి దానినాశ్రయించి ఓం అనుచు సూర్య లోకము ద్వారమున బ్రహ్మలోకము పోవుననియు, ఇందు ఏమియు విలంబనము లేదని తెలియుచున్నది.**

(ఛాం.ఉ. VIII-6-5)

## (515) IV-2-19

**సూ. నిశి నేతి చేన్న సంబంధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ**

**క్ర. నిశి, న, ఇతి, చేత్, న, సంబంధస్య,యావద్దేహభావిత్వాత్, దర్శయతి, చ**

ప్ర.అ. నిశి = **రాత్రియందు,** న = **సూర్యరశ్మితో నాడులకు సంబంధము వుండదు,** ఇతి చేత్ = **అని అనినచో అట్లు కాదు,** సంబంధస్య = **నాడులు సూర్యరశ్మి సంబంధము,** యావద్దేహభావిత్వాత్ = **శరీరమున్నంత వరకు భావింపబడునదగుట వలన పగలు గాని రాత్రి గాని వుండును,** దర్శయతి చ = **ఇది శ్రుతిలో కనిపించుచున్నది.**

వి. **రాత్రియందు దేహపాతమైనచో నాడులకు సూర్యమండలముండదు కదా, అప్పుడు మరణమందిన జ్ఞాని సూర్యలోక గమనము రశ్మి మార్గమున చేయలేడు అని అనటము సరికాదు.**

ఉపనిషత్తులో ఇలా వున్నది

"ఈ సూర్యుని రశ్మలు ఈ లోకమందును ఆ సూర్యలోకమందును రెండింటియందును గమనము చేయగలవు. అవి సూర్య మండలము నుండి వెలువడి శరీర నాడులందు వ్యాప్తములగును." (ఛాం.ఉ. VIII-6-2)

**కావున ఏ సమయమైనను కూడ దేహపాతమైన పిమ్మట సూక్ష్మ శరీర రహితుడైన జ్ఞాని యొక్క జీవాత్మ నాడుల ద్వారా అప్పటికప్పుడే సూర్యరశ్మల సంబంధము వలన సూర్యలోక ద్వారము గుండా పోవును.**

(ఛాం.ఉ. VIII-6-2)

## (11) దక్షిణాయనాధికరణము (178)

### (516) IV-2-20

**సూ.** **అతశ్చాయనేఽపి దక్షిణే**

**క్ర.** **అతః, చ, ఆయనే, అపి, దక్షిణే**

**ప్ర.అ.** అతః = **ఇందువలన,** చ = **కూడ,** ఆయనే = **ఆయనమందు,**
దక్షిణే = **దక్షిణాయనమందు, (కూడ బ్రహ్మలోకమునకు వెళ్లుదురు)**

**వి.** **రాత్రి సమయములో సూర్యరశ్మల సంబంధము వుండుటలో ఆటంకము లేనట్లుగా దక్షిణాయన కాలమందు కూడ ఏ బాధ లేకపోవుట వలన విద్వాంసుడు సూర్యలోక మార్గము ద్వారా దక్షిణాయన సమయములో కూడా పోగలదు.**

ఉత్తరాయణము అంటే కేవలము కాలాన్ని చెప్పే విభాగము కాదు. ఉత్తరాయణా భిమానియైన దేవత అని అర్థము. **కాలాభిమానియైన దేవత అన్ని కాలములలోనూ వుంటాడు. ఉత్తరాయణము మంచిదని అజ్ఞానులైన వారి విషయములో చెప్పిన మాట.**

భీష్ముడు ఉత్తరాయణం కోసం వేచి వుండటము అనేది లోకాచారము కొరకు తన తండ్రి తనకు ఇచ్చిన స్వచ్ఛంద మరణము అనే వరము యొక్క శక్తిని వెల్లడించటము కొరకు అని మనము గ్రహించాలి.

(ఇంకొక విధముగా చూస్తే భీష్ముడు వసువులలో ఒకడు. అతడు దేవలోకము పోవలసియుండెను. దక్షిణాయన సమయము చేత లోకమున రాత్రి కావున కొన్ని దినములు వేచియుండ వచ్చెను)

**(బ్రహ్మలోకము రాత్రి, దినములకు అతీతము. వేచియుండే అవసరము లేదు. కావున బ్రహ్మజ్ఞానికి ఎప్పుడైనా సరియైన సమయమే. బ్రహ్మము, బ్రహ్మజ్ఞాని సమయాతీతము)**

### (517) IV-2-21

**సూ.** **యోగినః ప్రతి చ స్మర్యతే స్మార్తే చైతే**

**క్ర.** **యోగినః, ప్రతి, చ, స్మర్యతే, స్మార్తే చ, ఏతే**

ప్ర.అ. యోగినః = **యోగుల కొరకు,** ప్రతి = **ఈ కాల విశేష నియమము,** చ = **అట్లు,** స్మర్యతే = **స్మృతియందు చెప్పబడినది,** స్మార్తే = **స్మృతి దృష్టి ప్రకారము,** చ = **అట్లు,** ఏతే = **అక్కడ చెప్పబడిన రెండు మార్గములు.**

వి. **భగవద్గీత యందు రెండు మార్గములు చెప్పబడినవి. అనావృత్తి, ఆవృత్తి అని ఆ రెండు మార్గములు. ఈ మార్గములు దినము - రాత్రి, శుక్లపక్షము-కృష్ణపక్షము, ఉత్తరాయణము - దక్షిణాయణము** అనే కాల విశేషముగా చెప్పబడినవి.

"అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్"

"జ్యోతి, యగ్ని, దినము, శుక్లపంబులింక
ఉత్తరాయణము వీని మార్గంబులందు" (భ.గీ. VIII-24)

"ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్"

"రాత్రంబు, ధూమంబు కృష్ణపక్షంబులింక
యాదక్షణాయనంబు వాని మార్గంబులందు (భ.గీ. VIII-25)

శ్రుతులలో చెప్పిన మార్గములు కాలమునకతీతము. బ్రహ్మజ్ఞాని ఏ కాలములోనైనా, ఎపుడైనా రశ్మి ద్వారము గుండా బ్రహ్మలోకము చేరుతాడని తెలిసికొన్నాము కదా.

గీతలో ఈ విషయములో చెప్పినవి యోగము, సాంఖ్యము, ప్రకారము. యోగము, సాంఖ్యము స్మృతులు. వాటికి శ్రుతి ప్రమాణము లేదు.

అయితే గీతలో చెప్పబడిన అర్చిరాది-ధూమాది మార్గములు, శ్రుతిలో చెప్పబడిన దేవయాన-పితృయాన మార్గములు ఒకటే అనుకుంటే విరోధము లేదు. అయితే కాల విశేషములకు అర్థము కాలాభిమాన దేవతలు అని మన్నించితే శ్రుతిలో, గీతలో ఏమీ భేదము వుండదు.

[**నారాయణ వాక్యము :**

శ్రీ భగవద్గీతలో చెప్పినది ఈ రీతిగా చూడాలి.

"వెలుగు జీకట్ల పక్షములు రెండు
కల్గి యీ జగమున శాశ్వతంబు యందు
వెలుగు మార్గములు నివృత్తి జేయ
కల్గ జేయు నావృత్తిని చీకట్ల తోవ" (భ.గీ. VIII-26)

"ఈ రెండు దోవలు తెలియువాడు
అరయ మోహమెపుడు చెందలేడు
సర్వ కాలమందు కనుక నీవు
అర్జున యోగ యుక్తుడవు కమ్ము" (భ.గీ. VIII-27)

**వెలుగు చీకట్లతోవలు అంటే జ్ఞానము-అజ్ఞానము, సత్యము - అసత్యము, జ్యోతి-తమస్సు, అమృతము-మర్త్యము అని తెలుసుకోంటే బ్రహ్మ మార్గము-సంసార మార్గముల గురించి స్పష్టము**

**అవుతుంది. అప్పుడు శ్రుతులలో చెప్పినది స్మృతులలో చెప్పినది ఒకటి అవుతాయి.**

వెలుగు మార్గము తిరుగులేని తోవ
చీకట్ల మార్గము తిరుగు వుండే తోవ
జ్ఞాన మార్గము తిరుగులేని తోవ
అజ్ఞాన మార్గము తిరుగు తోవ]

ఇట్లు

**చతుర్ధాధ్యాయ ద్వితీయ పాదము**



# చతుర్థాధ్యాయ ద్వితీయపాద సమాసము

## ఉత్క్రాంతి

1. **వాగధికరణము**

ఉత్క్రాంతి సమయములో (లేచి పోయే సమయములో) మొదలు వాగ్వృత్తి - వాక్కు వ్యాపారము - మనస్సులో కలసిపోతుంది. ఒక వాక్కు విషయమే కాదు. అన్ని ఇంద్రియములు ఉత్క్రాంతి సమయములో మనస్సులో లయము అవుతాయి. అన్ని ఇంద్రియములు వృత్తి రూపములో వాక్కును అనుసరించి మనస్సులో లయము అవుతాయి.

2. **మనో అధికరణము**

ఇంద్రియ వ్యాపారాన్నీ మనస్సులో లయము అవుతున్నట్లు మనో వ్యాపారాలన్నీ ప్రాణములో లయము అవుతాయి. మనో వ్యాపారాలన్నీ ఇంద్రియ వ్యాపారములతో పాటు ప్రాణములో లయము అవుతాయి.

3. **అధ్యక్షాధికరణము**

ప్రాణ వృత్తి జీవుని యందే లయము అవుతుంది. తేజస్సునందు కాదు. మరణ కాలమందు జీవుడు భూత సూక్ష్మాదుల యందు కూడుకొని యుంటాడు. మరణ సమయములో జీవుడు శరీరాన్ని వదిలి, మరొక శరీరము పొందేటప్పుడు అన్ని భూతాల యొక్క సూక్ష్మాంశ తన్మాత్రలలో వుంటాడు.

4. **అసృత్యుపక్రమాధికరణము**

సగుణ బ్రహ్మజ్ఞానికి మూర్ధన్యనాడీ ప్రవేశము, ఉత్తర మార్గాన పోవటము కలుగుతుంది. జ్ఞానము లేని వానికి ఇతర నాడుల్లో ప్రవేశము కలిగి దక్షిణ మార్గములో పోవటము కలుగుతుంది.

ఆయా రెండు మార్గాల వరకు ఉపాసకుడైన జ్ఞానికీ, ఉపాసకుడు గాని అజ్ఞానికీ కూడా భూత సూక్ష్మావయవము సమానమే.

దేవయాన మార్గాన పోకుండా బ్రహ్మలోక ప్రాప్తి అనేది సగుణ బ్రహ్మోపాసకునకు కూడా కలుగదు. కావున ఉత్క్రాంతి ఇతనికీ సమానమే.

వాక్కు మనస్సునందు నిలచును. అక్కడ నుండి ప్రాణమును మనస్సును ఇంద్రియములను వెంట తీసుకొని, జీవాత్మ సూక్ష్మ భూత సముదాయము వుండు వరకు అనగా స్థూలశరీరము నుండి విడివడి సూక్ష్మశరీరముందుండు వరకు సాధారణ మనుజులకు, బ్రహ్మలోకమునకు పోవు సగుణోపాసకులకు గతి సమానమే.

5. **సంసారవ్యపదేశాధికరణము**

అజ్ఞానికి ఎంతవరకు ముక్తి లభించదో అంతవరకు పరదేవత యందు ఉన్నా అతనికి

సూక్ష్మశరీరముతో సంబంధము వుండును. ముక్తపురుషలవలె అతడు పరమాత్మ యందు విలీనుడు కాడు. అజ్ఞానికి నాడీ నిష్క్రమణము వుండి, ఆ నిష్క్రమణము సూక్ష్మ భూత సముదాయముతో పాటు వుంటుంది. స్థూల శరీరమునకు అందేదహనము మొదలైన బాధలు కలిగిన అవి సూక్ష్మ శరీరమునకు అంటవు. ఊష్మము (వేడి) సూక్ష్మ శరీర ధర్మము.

## 6. ప్రతిషేధాధికరణము

బ్రహ్మజ్ఞానులైన మహాపురుషులకు లోకాంతర గమనము వుండదు. జీవాత్మ నుండి ప్రాణముల నిష్క్రమణము నిషేధించు అవసరము లేదు. బ్రహ్మజ్ఞాని ఇచ్చటనే పరబ్రహ్మమును పొందురు. బ్రహ్మ సాక్షాత్కారము కలిగిన విద్వాంసునికి దేవయానాది మార్గాలు కాని, ఉత్క్రమణము కాని లేదు.

## 7. వాగాదిలయాధికరణము

బ్రహ్మవేత్త యొక్క ఇంద్రియములు (కళలు) పరమాత్మ యందే లయము అవుతాయి. సామాన్యముగా ఇంద్రియములు మరియు భూతములు తమ తమ మూల కారణ ప్రతిష్ఠలలో కలిసినా బ్రహ్మజ్ఞాని విషయములో అవి పరబ్రహ్మములోనే కలుస్తాయి.

## 8. అవిభాగధికరణము

బ్రహ్మజ్ఞానులైన మహాత్ములు తమ శరీరములను వదిలి బ్రహ్మములో పూర్తిగా అవిభాగమైన లయము నందుతారు.

## 9. తదోకోఽధికరణము

మరణ కాలమున మహాపురుషుడు హృదయాకాశము నందలి ప్రకాశము చేత వెలుగందిన బ్రహ్మరంధ్రము గుండా స్థూలశరీరము నుండి బయల్వెడలును. బ్రహ్మవిద్యా ఫలరూపమైన బ్రహ్మలోక ఫల ప్రాప్తి రూప సంస్కార స్మృతిలో, హృదయ స్థితుడైన పరమాత్మ అనుగ్రహముతో జ్ఞాని సూర్యరశ్మి మార్గమున వెడలును.

## 10. రశ్మ్యనుసారాధికరణము

బ్రహ్మరంధ్రము ద్వారా బ్రహ్మవేత్త స్థూలశరీరము నుండి వెడలి, సూర్యరశ్మి యందు నిలచి, దానినాశ్రయించి సూర్యలోకము ద్వారము గుండా బ్రహ్మలోకము పోవుననియు, అందు ఏమియు విలంబనము లేదనియు తెలియుచున్నది.

## 11. దక్షిణాయనాధికరణము

జ్ఞాన మార్గము - అజ్ఞాన మార్గము అను రెండు త్రోవలే శుక్ల పక్షము - కృష్ణ పక్షము, దినము - రాత్రి, ఉత్తరాయణము - దక్షిణాయనము అని కాల రూపములో చెప్పబడినవి. అవియే వెలుగు తోవ మరియు చీకటి తోవ. ఇవి నిజముగ కాలమునకతీతము. ఏ సమయములోనైనా పగలుయైనా,

రాత్రియైనా మరియు ఉత్తరాయణము అయినా, దక్షిణాయనము అయినా ఈ రెండు మార్గములు - వెలుగు తోవ, చీకట్ల తోవ-వర్తిల్లుతాయి. బ్రహ్మ జ్ఞానికి సరియైన సమయము, ఆయనము కొరకు వేచియుండే అవసరము లేదు. ఏ సమయమైన, ఈ కాలమైనా, ఏ ఆయనము అయినా బ్రహ్మజ్ఞానికి వెలుగు తోవయే.

కాల విశేషములకు అర్థము కాలాభిమాన దేవతలు.

జ్ఞానమార్గము వెలుగు తోవ తిరుగులేని తోవ.

అజ్ఞాన మార్గము చీకట్ల తోవ. తిరుగువుండే తోవ.

ఇట్లు

**చతుర్థాధ్యాయ ద్వితీయ పాద సమాసము**



# చతుర్థాధ్యాయ ద్వితీయపాద సారము

## ఉత్క్రాంతి

దేని అంశయైన జీవాత్మ యొక్క ఉత్క్రాంతి సమయములో అన్ని ఇంద్రియములు వృత్తి రూపములో వాక్కును అనుసరించి మనస్సుల లయము అవుతాయో,

దేని అంశయైన జీవాత్మ ఉత్క్రాంతి సమయములో మనో వ్యాపారములన్ని కూడ ఇంద్రియ వ్యాపారములతో పాటు ప్రాణములో లయము అవుతాయో,

ప్రాణ వృత్తి దేని అంశయైన జీవాత్మ యందే లయము అవుతుందో, కాని తేజస్సు నందు లయము కాదో, మరియు దేని అంశమైన జీవాత్మ మరణ కాలమందు భూత సూక్ష్మాదులతో కూడుకొని యుంటాడో,

దేని సగుణ రూప జ్ఞానికి మూర్ధన్యనాడీ ప్రవేశము, ఉత్తర మార్గములో పోవటము కలుగుతుందో, దేనిలోకప్రాప్తి సగుణోపాసకునికి దేవయాన మార్గము ద్వారానే కలుగుతుందో,

దేని జ్ఞానము లేనియతనికి ఒక శరీరము నుండి ఇంకొక శరీరములోనికి పోవునపుడు పరదేవత యందుండుట చెప్పబడినదో; మరియునతనికి ముక్తి లభించనంతవరకు సూక్ష్మశరీరముతో సంబంధము వుండునో మరియు అతనికి ముక్తపురుషులవలె, దాని జ్ఞానము అందినవారి వలె దానియందు విలీనుడు కాడో, అతనికి దేని అంశయైన జీవాత్మస్వరూపము వుంటుందో మరియు శరీరము దహనాదుల ద్వారా నాశనము పొందినను ఆ జీవాత్మకు నాశము వుండదో, దేని అంశమైన జీవాత్మలేచి పోయినపుడు శరీరములో ఊష్మము వుండక శరీరము చల్లబడునో, దేని జ్ఞానులైన మహాపురుషులకు లోకాంతరగమనము వుండదో; మరియు వారు ఇచటనే దేనిని పొందుతారో, దేని సాక్షాత్కారము కలిగిన జ్ఞానికి దేవయానాది మార్గాలు కాని, ఉత్క్రమణం కాని లేదని స్మృతులు తెలుపుతున్నాయో, శరీరము నశించినపుడు దేనిని తెలిసిన జ్ఞానియొక్క ఇంద్రియములు అన్నియు దాని యందే కలియునో; మరియు సామాన్యముగా ఇంద్రియములు మరియు సూక్ష్మభూతములు తమ తమ మూల ప్రతిష్ఠలలో కలిసినా దేనిని తెలిసిన జ్ఞాని ఇంద్రియములు సూక్షభూతములు దాని యందే కలుస్తాయో; దేని జ్ఞానులైన మహా పురుషులు తమ తమ శరీరములను వదలి దాని యందే అవిభాగమైన లయమునందుతారో; మరణ కాలమున దేనిని తెలిసిన మహాపురుషుడు హృదయాకాశము నందలి ప్రకాశముచే వెలుగందిన దాని రంధ్రము గుండా స్థూల శరీరము నుండి బయలు వెడలునో; దేని విద్యా ఫలరూపమైన దానిలో ఫలాది ప్రాప్తిరూప సంస్కార స్మృతిలో, హృదయస్థితమైన దేని అనుగ్రహముతో జ్ఞాని సూర్యరశ్మి మార్గమున వెడలునో,

దేనిని తెలిసిన మార్గము జ్ఞానమార్గము మరియు వెలుగు తోవయో; దేనిని తెలియని మార్గము అజ్ఞానమార్గము మరియు చీకట్ల తోవయో;-దేనిని తెలిసినవారు ఎప్పుడైనా, ఏ ఆయనములోనైనా శరీరము వదులగానే దానిని పొందుతారో; మరియు దేనిని తెలియనివారు, ఏ ఆయనములోనైన, ఎప్పుడైన శరీరమును వదలగానే దేని మార్గములో కాక వేరు మార్గములలో వెళ్లుతారో, అదియే బ్రహ్మము.

ఇట్లు

చతుర్థాధ్యాయ ద్వితీయ పాద సారము

# IV-3

# చతుర్థ అధ్యాయము - తృతీయ పాదము

## దేవయాన మార్గము

### (1) అర్చిరాద్యధికరణము (179) (పర్యంక విద్య)

### (518) IV-3-1

సూ. అర్చిరాదినా తత్ప్రథితేః

క్ర. అర్చిరాదినా, తత్ప్రథితేః

ప్ర.అ. అర్చిరాదినా = **అర్చితో ఆరంభమగు మార్గమున,** తత్ప్రథితేః = **బ్రహ్మలోకమునకు అదే మార్గము ప్రసిద్ధము.**

వి. **బ్రహ్మలోక ప్రాప్తిని కోరే ఉపాసకులంతా అర్చిరాదిమార్గము గుండానే వెళ్లుతారు. సగుణోపాసనా విద్వాంసులకు అందరికీ, ఈ మార్గమే ప్రసిద్ధము.**

**అర్చిరాది మార్గము అంటే వెలుగుమార్గము. దీనినే దేవయాన మార్గము, ఉత్తరాయణ మార్గము, అర్చిరాదిమార్గము అందురు.**

"ఎవరు అరణ్యములో నివసిస్తూ శ్రద్ధతో, తపస్సుతో పరమాత్మను ఉపాసిస్తారో, అట్టి వారు అర్చిరాదిమార్గాన్నే పొందుతారు." (ఛాం.ఉ.V-10-1)

"అర్చిరాది లోకములను (కాంతివంతమగు లోకములను) పొందుదురు. అచ్చటి నుండి అహల్లోక (దినము లోకము), శుక్లపక్షము, ఉత్తరాయణము, సంవత్సరము, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు మార్గమున వెళ్లుదురు. అచ్చట అమానవుడగు పురుషుడు వుండును. అతడు వానిని బ్రహ్మలోకమునకు చేర్చును. ఇది దేవయానమార్గము" (ఛాం.ఉ. V-10-2)

ఇందులో స్పష్టముగా అర్చిరాదిమార్గము ఒక్కటే చెప్పబడినది. వాయ్వాది మార్గములేమైనా వుంటే, అవన్నీ గూడా "గుణోప సంహార న్యాయం"గా దీనిలోనే అన్వయిస్తాయి.

ఒక్కొక్క చోట కొన్ని విద్యలకు ఏ మార్గమైనది చెప్పకపోయినా ఆయా విద్యలకు అర్చిరాదిమార్గము ద్వారానే బ్రహ్మలోక ప్రాప్తి అని గ్రహించాలి. వేరు మార్గములని తలచరాదు. గంతవ్యమైన బ్రహ్మలోకము ఒకటే కనుక విద్యా భేదమున్నా మార్గ భేదము వుండదు.

"తేఽర్చిషః సంభవంతి" (ఛాం.ఉ.V-10-1) అని స్పష్టముగా **"అర్చిరాదిమార్గాన్ని ఒక దానినే చెప్పినందున అన్ని మార్గములు ఒకటే - భిన్నము కావు."**
(ఛాం.ఉ. V-10-1, V-10-2)

### (2) వాయ్వధికరణము (180) (పర్యంక విద్య)

### (519) IV-3-2

సూ. వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్

క్ర. వాయుమ్, అబ్దాద్, అవిశేషవిశేషాభ్యామ్

ప్ర.అ. వాయుమ్ = **వాయులోకమును,** అబ్దాద్ = **సంవత్సరము తరువాత** అవిశేషవిశేషాభ్యాం = **వాయువర్ణనము ఒకచోట విశేషము తోడను వున్నది.**

వి. **అర్చిరాదిమార్గము లేక దేవయానమార్గము గురించి మూడు ఉపనిషత్తులు ఇలా చెబుతున్నాయి.**

"బ్రహ్మవిద్యా రహస్యములెరిగి వనమందుండి, శ్రద్ధా పూర్వకముగా నిత్యోపాసనము చేయువారు అర్చి (జ్యోతి, అగ్ని, సూర్యరశ్మి)ని పొందుదురు. **అర్చి నుండి దినమును, దినము నుండి శుక్లపక్షమును, శుక్లపక్షము నుండి ఉత్తరాయణమును, ఉత్తరాయణము నుండి సంవత్సరమును, దాని నుండి సూర్యుని, సూర్యుని నుండి చంద్రుని, చంద్రుని నుండి విద్యుత్తును, విద్యుత్తు నుండి అమానవపురుషుడు అతనిని బ్రహ్మలోకమునకు చేర్చును."** (ఛాం.ఉ. 10-1-2)

బృ. ఉపనిషత్తులో

"ఎపుడు మనుష్యుడీ లోకము నుండి బ్రహ్మ లోకమునకు పోవునో అప్పుడతడు వాయువును పొందును. వాయువతనికి రథచక్రనాభి రంధ్రము నుండి తోవనిచ్చును. అతడచట నుండి పైకి సూర్యుని చేరును. సూర్యుడు అంబరవాద్య రంధ్రము వంటి తోవనిచ్చును. అతడచట నుండి శోకరహితమైన బ్రహ్మ లోకమునకు పోవును." (బృ.ఉ. V-10-1)

కౌషీతకీ ఉపనిషత్తులో

**"అతడీ దేవయాన మార్గమున అగ్ని లోకమునకు పోవును. అచట నుండి వాయులోకమునకు, సూర్యలోకమునకు, వరుణ లోకమునకు, ఇంద్రలోకమునకు, ప్రజాపతి లోకమునకు, బ్రహ్మ లోకమునకు పోవును."** (కౌషీతకీ.ఉ.I-3)

ఛాందోగ్యోపనిషత్తులో అర్చి నుండి మొదలై అమానవ పురుషుని వరకు చెప్పబడినది. అందులో వాయువు గురించి లేదు.

బృహదారణ్యకమున వాయువు తరువాత సూర్యలోకము కలదు.

కౌషీతకీ ఉపనిషత్తులో వాయులోకము, సూర్యలోకము నుండి మొదలై బ్రహ్మలోకము చేరుట కలదు. అయితే అర్చిరాది మార్గములో, దేవయాన మార్గములో,వాయులోకమును చేర్చాలా, అవసరము లేదా ? అని మరియు ఒకవేళ చేరిస్తే దేని తరువాత వాయులోకము వుంటుంది. అనే ప్రశ్నలు వస్తాయి.

దానికి సమాధానము ఈ సూత్రము. **వాయువును సంవత్సరానికి తరువాత ఆదిత్యునికి ముందుగా పొందుతున్నట్లు చెప్పాలి.**

కౌషీతకీలో చెప్పినది సామాన్య శ్రుతి. బృహదారణ్యకములో చెప్పినది విశేష శ్రుతి. కౌషీతకీలో వాయులోకము, తరువాత సూర్యలోకము గలదు. ఛాందోగ్యములో సంవత్సరము తరువాత సూర్యలోకము కలదు. కాని వాయు లోకము లేదు. బృహదారణ్యకములో వాయువు తరువాత సూర్యలోకము కలదు. కావున వాయులోకము సంవత్సరము తరువాత, సూర్యలోక ముందు వుంటుంది అని తెలుసుకోవాలి. మూడు ఉపనిషత్తులను కలిపి సమన్వయము చేస్తే వాయులోకము సంవత్సరము మరియు సూర్యలోకము మధ్యలో వుంటుంది. అని తేలుతుంది. వాయులోకమును వుంచాలి.

(బృ.ఉ. V-10-1; ఛాం.ఉ. V-10-1/2; కౌషీతకీ.ఉ. I-3)

## (3) వరుణాధికరణము (తడిదధికరణమ్) (181) (పర్యంక విద్య)

## (520) IV-3-3

**సూ. తడితోఽధి వరుణః సంబంధాత్**

**క్ర. తడితః, అధి, వరుణః, సంబంధాత్**

ప్ర.అ. తడితః = **విద్యుత్తు నుండి,** అధి = **పైన,** వరణః = **వరుణ లోకము,** సంబంధాత్ = **పరస్పర సంబంధము వలన**

వి. **విద్యుత్తు తరువాత, పైన వరుణలోకానికి సంబంధము కలిగించాలి.** ఎందుచేతనంటే వరుణునికి విద్యుత్తుతో మెరుపుతో సంబంధము వుంది విద్యుల్లోకానికి మీద, తరువాత, వర్షాన్ని ఇచ్చే మేఘాలు ఉన్నట్లు, జలానికి వరుణుడు అధిపతి ఐనట్లు ప్రసిద్ధి వున్నది. కాబట్టి వరుణునికి, విద్యుత్తుకు సంబంధము వున్నది.

వరుణుని తరువాత, ఇంద్రునికి, ప్రజాపతికి స్థానము ఇవ్వాలి. తరువాత బ్రహ్మలోకము.

ఇంద్రప్రజాపతులు ఛాందోగ్యములో, బృహదారణ్యములో లేరు. వారు కౌషీతకీలో క్రొత్తగా వచ్చిన ఆగంతుకులు.

"ఆగంతూనామంతేనివాసః" (కౌషీ.ఉ. I-3)

"ఆగంతుకంగా వచ్చినవారిని చివర చేర్చాలి" అనే న్యాయము ప్రకారము వారిని వరుణుని తరువాత ఇంద్రుడు, ప్రజాపతులకు స్థానము ఇవ్వాలి.

**ఈ విధముగా అర్చిరాది మార్గానికి ఒక పద్ధతి ఏర్పడుతుంది. ఇది అన్ని ఉపనిషత్తులలో చెప్పబడిన లోకముల సమన్వయము.**

(కౌషీ.ఉ. I-3)

## (4) ఆతివాహికాధికరణము (182) (పర్యంక విద్య)

## (521) IV-3-4

**సూ. ఆతివాహికాస్తల్లింగాత్**

**క్ర. ఆతివాహికాః, తల్లింగాత్**

ప్ర.అ. ఆతివాహికాః = **సాధకులకు ఒక స్థానము నుండియో ఇంకొక స్థానమునకు కొనిపోవుటకు (అతివాహకులు పైకి మూసుకొని పోవు) ఆయాలోక అభిమాన పురుషులు,** తల్లింగాత్ = **శ్రుతిలో ఆ లక్షణము చెప్పబడినది.**

వి. **అర్చి, అహః, మొదలైన శబ్దముల ద్వారా చెప్పబడినవారు ఆయా లోకములకు అభిమాన దేవతలు లేక పురుషులు.**

వీరి పని బ్రహ్మలోకమునకు పోవు విద్వాంసులను ఒక స్థానము నుండి వేరొక స్థానమునకు కొనిపోవుట. వీరిని అతివాహికులు అని అంటారు. **విద్యుల్లోకమునకు పోయిన పిమ్మట అమానవ పురుషుడు జ్ఞానిని బ్రహ్మలోకమునకు చేర్చును. ఇంతకు ముందు వారు మానవాకార పురుషులు. వారు కూడ దివ్యులే అయినా మానవాకృతిలో వుంటారు.**

# అర్చిరాది మార్గము - దేవయాన మార్గము

| ఉపనిషత్తులు | | | లోకములు | తత్త్వము |
|---|---|---|---|---|
| క్రా | బృ | ఛాం | | |
| ✓ | ✓ | ✓ | బ్రహ్మ లోకము | మోక్షము, సత్యలోకము |
| ✓ | — | — | ప్రజాపతి లోకము | ప్రజనము |
| ✓ | — | — | ఇంద్ర లోకము | అధిపత్యము |
| ✓ | — | — | వరుణ లోకము | వర్షము, మేఘము |
| — | — | ✓ | విద్యుల్లోకము | విద్యుత్తు |
| — | — | ✓ | చంద్ర లోకము | చంద్రుడు |
| ✓ | ✓ | ✓ | ఆదిత్య లోకము | సూర్యుడు |
| ✓ | ✓ | — | వాయు లోకము | వాయువు |
| — | — | ✓ | సంవత్సరము | పూర్ణవత్సరము |
| — | — | ✓ | ఉత్తరాయణము | సూర్యుడు ఉత్తరముగా |
| — | — | ✓ | శుక్లపక్షము | శుద్ధపక్షము |
| — | — | ✓ | అహల్లోకము | దినము, పగలు |
| ✓ | — | ✓ | అర్చి లోకము | జ్యోతి,అగ్ని, సూర్యరశ్మి |
| ✓ | ✓ | ✓ | ఇహ లోకము | ప్రపంచము |

బ్ర.సూ. **(519) IV-3-1, నుండి (532) IV-3-14**

**(522) IV-3-5**

**సూ. ఉభయవ్యామోహా త్తత్సిద్ధేః**

**క్ర. ఉభయవ్యామోహాత్, తత్సిద్ధేః**

ప్ర.అ. ఉభయవ్యామోహాత్ = **రెండు మోహయుక్తములైన ప్రసంగములు కలుగుట వలన,** తత్సిద్ధేః = **వానిని అభిమాన దేవతలుగా మన్నించనిచో బ్రహ్మలోకము వరకు కొనిపోవ కార్యము సిద్ధించును.**

**వి. మార్గము జడమై, గంత (పోవువాడు) అస్వతంత్రుడైనందు వలన, ఉపాసకునికి ఊర్ధ్వగతి వుండజాలదు.**

**"స్వప్రయత్నము లేకుండా పోవాలంటే అన్యుని చేత (చేతనుని ద్వారా) తీసుకోబడాలి" అనే న్యాయము వలన లభించిన లింగాన్ని బట్టి అర్చిరాది దేవతలకు నేతృత్వ సిద్ధి కలుగుతుంది.**

[**నారాయణ వాక్యము :** దీనిలో న్యూటన్ మహాశయుని సూత్రము జ్ఞాపకము వస్తుంది. "Every object will continue in a state of rest or uniform motion unless an external force is applied." తనంతట తాను కదలలేకపోతే బాహ్యశక్తి అవసరము

**ఉపాసకులు వెళ్లే అర్చిరాది మార్గాలు జడాలు, అచేతనాలు అందుచేత అవి వ్యామోహితాలు**]

[**నారాయణ వాక్యము :**

అర్చిరాది మార్గాలు కదులని మార్గములు. అవి Conveyor belt కాని Escalator కాని కావు, అవి కదలవు వాని మీద గంత కదలాలి, లేక కదిలించబడాలి, తీసుకోపోబడాలి అవి మెట్లవంటివి.] జడములైనందున వాటికి సంకల్పము వుండదు. అవి ఉపాసకుణ్ణి తీసుకొనపోలేవు. ఇక ఉపాసకుడు అంటేనో అతడు విద్వాంసుడైనా, ఇప్పుడు శరీరము లేదు కనుక, ఇంద్రియములు అన్ని లీనము అయినాయి కాబట్టి అతడు కూడా వ్యామోహితుడు!

[**నారాయణ వాక్యము :** ట్రైన్ ఆగిపోయింది ప్యాసెంజర్ కుంటివాడు, చేతులు లేనివాడు. ఆయనను మోసుకొని వెళ్లాలి!]

అతనికి మార్గ జ్ఞానము వుండదు, కదిలే శక్తి కూడా వుండదు. ఆ స్థితిలో బ్రహ్మలోకము పోవటము అసంభవము! అందుకోసము, విద్యుత్పురుషునికి నేతృత్వము (తీసుకొని పోవుటము) చెప్పినట్లుగా అంతకు ముందు వున్న అర్చిరాది పురుషులకు కూడా నేతృత్వము చెప్పాలి.

అట్లా అయితే అర్చిరాది దేవతలు, అతి వాహిక దేవతలు. సూక్ష్మ శరీరాన్ని మోసుకొని పోయే దేవతలు అవుతారు. అతివాహికులు అయ్యే ఈ అర్చిరాది దేవతలు అన్ని కాలములలో, అన్ని సమయములలోనూ వుంటారు. కావున ఉపాసకుడు దక్షిణాయనములో మరణించినా, రాత్రి వేళ చనిపోయినా బ్రహ్మలోకాన్ని చేరటములో ఏ సమస్య వుండదు.

ఒక లోక అధిష్ఠానదేవత ఉపాసకుని సూక్ష్మ శరీరమును తరువాత లోకము యొక్క అధిష్ఠానదేవతకు అప్పగించుట, ఆ దేవత పనిగా ఎరుగవలెను. **ఈ విధముగా సాధకుని సూక్ష్మశరీరము అంచెంచెలుగా పైకి (ముందుకు) వెళ్లుతుంది.**]

## (523) IV-3-6

**సూ. వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః**

**క్ర. వైద్యుతేన, ఏవ, తతః, తచ్ఛ్రుతేః**

ప్ర.అ. వైద్యుతేన = **విద్యుల్లోకమునందలి అమానవ పురుషుని,** ఏవ = **ద్వారానే,** తతః = **అక్కడ నుండి ముందుకు బ్రహ్మలోకము వరకు,** తచ్ఛ్రుతేః = **శ్రుతి చెప్పుట వలన విద్యుల్లోకము నుండి అక్కడ ప్రకటమగు అమానవపురుషుడు జ్ఞానిని బ్రహ్మలోకమునకు తీసుకొని వెళ్లును. ఆ విషయము శ్రుతి స్పష్టముగా చెప్పినది.**

వి. "విద్యుతం తత్పురుషో అ మానవస్స ఏవాన్

బ్రహ్మ గమయత్యేష దేవయానః పంథా ఇతి" (ఛాం.ఉ.V-X-1,2)

"విద్యుత్తు మార్గమున వెళ్లుదురు. అచ్చట అమానవుడగు పురుషుడుండును. అతడు వారిని బ్రహ్మలోకమునకు చేర్చును. ఇది దేవయాన మార్గము" (ఛాం.ఉ.V-X-1,2)

**[నారాయణ వాక్యము :**
అర్చిరాది లోకముల గుండా విద్యుల్లోకము వరకు ఆయా లోకముల దేవతలు విద్వాంసుల సూక్ష్మ దేహాన్ని అంచెలంచెలుగా తీసుకువెళుతారు. దేవతలు తీసుకువెళ్లతారు కనుక అది దేవయాన మార్గము అయినది.]

### (5) కార్యాధికరణము (183) (పర్యంక విద్య)

## (524) IV-3-7

**సూ. కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః**

**క్ర. కార్యమ్, బాదరిః, అస్య, గత్యుపపత్తేః**

ప్ర.అ. కార్యం = **కార్య బ్రహ్మను అనగా హిరణ్య గర్భ బ్రహ్మను పొందుట,** బాదరిః = **బాదరి చెప్పేది ఏమనగా,** అస్య = **ఈ కార్యబ్రహ్మ కొరకే,** గత్యుపపత్తేః = **గమన కార్యము యొక్క ఉపపత్తి**

వి. **శ్రుతి యందు గంతవ్య రూపములో, ప్రజాపతి రూపములో, గ్రహింపబడినందున, కార్యబ్రహ్మ యందే గతి, గమనము అనేది సరిపోతుంది అని బాదరి ఆచార్యుని అభిప్రాయము.**

కార్యబ్రహ్మరూపమే (చతుర్ముఖః బ్రహ్మరూపమే) పొందదగినది. ఎందుకంటే శ్రుతిలో పొందదగినది అని చెప్పబడినది. చతుర్ముఖ బ్రహ్మ అయితేనే పొందటానికి చేరటానికి వీలవుతుంది. పరబ్రహ్మమైతే ఆయన అంతటా వున్నవాడు కాబట్టి, జీవాత్మ శుద్ధ స్వరూపుడు కాబట్టి ప్రత్యగాత్మకు అభిన్నుడు కాబట్టి, అతనిని చేరటము అనేది వుండదు. **గమనము, ఆగమనము చేయించే వాడు, గమనము వల్ల పొందదగిన స్థానము అనేవి పరబ్రహ్మ విషయములో కుదరవు. కాబట్టి సగుణ బ్రహ్మముగా చెప్పే బాదరి మతము సమ్మతము.**

## (525) IV-3-8

**సూ. విశేషితత్వాచ్చ**

**క్ర. విశేషితత్వాత్, చ**

ప్ర.అ. విశేషితత్వాత్ = **విశేషణము చేత స్పష్టమగుట వలన,** చ=ఇది **కార్యబ్రహ్మ అని అనుకొనుటయే ఉచితము.**

వి. బృహదారణ్యకములో

"తాన్ వైద్యుతానా పురుషో మానసఏత్య

బ్రహ్మలోకాన్ గమయతి" (బృ.ఉ.VI-2-15)

"అతనిని విద్యుల్లోకము నుండి మానస (బ్రహ్మమానస-అమానవ) పురుషుడు వారిని బ్రహ్మలోకములకు కొనిపోవును"

ఇక్కడ "బ్రహ్మలోకములు" అని బహువచనము వున్నది. బ్రహ్మమునకు చేర్చు అనే ప్రసక్తి లేదు. **అట్లు విశేషముగా చెప్పుట వలన కార్యబ్రహ్మ ప్రాప్తియే కాగలదు. ఆయనే ఆ లోకములకు స్వామి. భోగ్యభూములనేకములుండుట వలన లోక శబ్దమునకు బహువచన ప్రయోగము సమంజసము.**

(బృ.ఉ. VI-2-15)

## (526) IV-3-9

**సూ. సామీప్యాత్తు తద్వ్యపదేశః**

**క్ర. సామీప్యాత్, తు, తద్వ్యపదేశః**

ప్ర.అ. సామీప్యాత్ = **బ్రహ్మకు సమీపమున నుండుట వలన బ్రహ్మయే అని అనుకొనబడును.** తు = **అయితే,** తద్వ్యపదేశః = **ఆ కథనము**

వి. యో బ్రహ్మాణం విధదాతి పూర్వం

యో వైవేదాంశ్చ ప్రహిణోతి తస్మై

తంహ దేవమాత్మ బుద్ధి ప్రకాశం

ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే" (శ్వే.ఉ.VI-18)

"ఏ పరబ్రహ్మ సృష్ట్యాదిలో చతుర్ముఖ బ్రహ్మను సృజించి అతనికి వేదములు ఉపదేశించెనో, అట్టి దేవుని ఆత్మబుద్ధి ప్రకాశకుని మోక్ష ఇచ్ఛ కలిగిన నేను శరణందుచున్నాను"

ఈ శ్రుతి వాక్యము వలన బ్రహ్మ ఆ పరబ్రహ్మ యొక్క ప్రథమ కార్యము. బ్రహ్మనే ఇక్కడ బ్రహ్మ శబ్దవాచ్యునిగా గ్రహించుట యుక్తము.

సగుణ బ్రహ్మను 'బ్రహ్మము' అని అనటములో దోషము లేదు. ఎందుకంటే సగుణ బ్రహ్మము నిర్గుణ బ్రహ్మము సమీపములో వుండుట వలన.

**అదేకాక ఏది సగుణమని తెలియబడెనో అది మనస్సు, బుద్ధులతో గ్రహించబడనప్పుడు మరియు తపస్సుతో ఉపాసనయే చేయబడునప్పుడు నిర్గుణ బ్రహ్మము అగును.**

**మరియు, ఉపాసనకోసము మనోమయత్వాది గుణములతో కూడినదిగా చెప్పబడే నిర్వికార బ్రహ్మమే కార్యబ్రహ్మము.**

కావున, సామీప్యము వలన సగుణ బ్రహ్మను కూడా బ్రహ్మము, కార్యబ్రహ్మము అని నపుంసక లింగములో వ్యవహరించినారు. పరిశుద్ధమైన అద్దములో ప్రతిబింబించిన ముఖము, ప్రతిబింబమే అయినా దానిని కూడా ముఖమే అని అనుచున్నాము కదా ?

**అట్లే, కల్పిత గుణాలతో కూడిన వాడైనా కార్యబ్రహ్మను నిర్గుణ బ్రహ్మములాంటివాడే అని అంటున్నాము. కావున కార్యబ్రహ్మము అని అనుట సమంజసమే.**

(శ్వే.ఉ. VI-18)

## (527) IV-3-10

**సూ. కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్**

**క్ర. కార్యాత్యయే, తదధ్యక్షేణ, సహ, అతః, పరమ్, అభిధానాత్.**

ప్ర.అ. కార్యత్యయే = **కార్యరూపమైన బ్రహ్మలోకము నశించిన తరువాత,** తదధ్యక్షేణ=**దాని స్వామియైన బ్రహ్మ (చతుర్ముఖ బ్రహ్మ)తో,** సహ = **కూడి,** అతః = **అంతకంటే వేరైన,** పరం = **పరబ్రహ్మము,** అభిదానాత్ = **పొందుటను గూర్చి చెప్పటము వలన.**

వి. **కార్యబ్రహ్మకు ప్రళయము సంభవించినపుడు ఆ కార్యబ్రహ్మ లోకానికి అధ్యక్షుడైన హిరణ్యగర్భునితో పాటు (ప్రజాపతితో పాటు), ఈ అపర బ్రహ్మ కంటె ఉత్తమము, విశుద్ధము అయిన పరబ్రహ్మ** స్వరూపాన్ని బ్రహ్మజ్ఞానులైన వారు పొందుతున్నారు.

శ్రుతిలో అనావృత్తిని (తిరిగి రాకపోవటాన్ని) గూర్చి చెప్పబడిన దానిని ఒప్పుకోవాలి అని శ్రుతి చెప్పింది. క్రమముక్తి కావున, అర్చిరాది మార్గాల ద్వారా వెంటనే పరబ్రహ్మ ప్రాప్తి కలుగదు.

కార్యబ్రహ్మ లోకానికి పోవటము, అక్కడ వుండి, కల్పాంతములో ఆ బ్రహ్మలోకముతో లయము అయ్యేటప్పుడు దానితోబాటు ఈ ఉపాసకుడు కూడా పరబ్రహ్మలో లీనమౌవుతాడు. ఇది క్రమముక్తి. దీన్ని గూర్చియే ముండకోపనిషత్తులో ఇలా చెప్పబడినది.

**"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః**
**సన్న్యాస యోగాద్యతయః శుద్ధ సత్త్వాః ।**
**తే బ్రహ్మలోకేషు పరాంతకాలే**
**పరామృతాః పరిముచ్యంతి సర్వే" ॥ (ముం.ఉ. -2-6)**

**"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులైనవారు**
**సన్న్యాస యోగయతులు, శుద్ధ సత్త్వులైనవారు,**

**వారందరు, బ్రహ్మలోకమున పరాంతకాలమందు**
**పరామృతత్త్వమ్మునంది, పూర్ణముక్తినందు చుంద్రు"**

**ఈ ప్రకారము ఉపనిషత్తులో పరాంతకాలమున ముక్తి యొక్క కథనము వుండుట వలన ప్రళయ కాలమందు బ్రహ్మలోకము నశించిన పిమ్మట దాని స్వామియైన బ్రహ్మతో పాటు బ్రహ్మ విద్యోపాసకులు పరబ్రహ్మ ప్రాప్తిని పొంది ముక్తులగుదురు.**

(ముం.ఉ. 2-6)

## (528) IV-3-11

**సూ. స్మృతేశ్చ**

**క్ర. స్మృతేః, చ**

**ప్ర.అ.** స్మతేః = **స్మృతి ప్రమాణము వలన కూడ,** చ = **ఇది సిద్ధించుచున్నది.**

**వి.** స్మృతి కూడ ఈ పూర్వముక్తి గురించి చెప్పుచున్నది.
"బ్రహ్మణా సహతే సర్వే, సంప్రాప్తే ప్రతిసంచరీ ।
పరస్యోంతే కృతాత్మనః, ప్రవిశంతి పరమం పదమ్ ॥
(కూర్మ పురాణము పూ.ఖండము XII-269)

"కృతాత్ములైనవారు ప్రళయ కాలము సంప్రాప్తమైన పిమ్మట సమస్త జగత్తు కూడ అంతమగు వేళ బ్రహ్మతో కూడ ఆ పరమ పదమును ప్రవేశింతురు" ఈ విధముగ స్మృతి యందు కూడ అదే భావము కనిపిస్తున్నది. అందువలన సుగుణోపాసకులకు కార్యబ్రహ్మ ప్రాప్తియే అగునని మన్నించుట ఉచితము.

(కూర్మ పురాణము పూ.ఖండము XII-269)

## (529) IV-3-12

**సూ. పరం జైమినిర్ముఖ్యత్వాత్**

**క్ర. పరమ్, జైమినిః, ముఖ్యత్వాత్**

**ప్ర.అ.** పరమ్ = **యుక్తి సంగతమగును,** జైమినిః = **ఆచార్యుడైన జైమిని మహర్షి అనుచున్నాడు.** ముఖ్యత్వాత్ = **బ్రహ్మశబ్దమునకు ముఖ్యమైన వాచ్యార్థము వుండుట వలన**

**వి.** జైమిని మహర్షి అభిమతము ఈ విధము.
"తత్పురుషో అమానవః, స ఏవాన్
బ్రహ్మగమయ త్యేషః దేవయానః పంథా" (ఛాం.ఉ.V-10-2)

**"ఆ అమానవ పురుషుడు వీరిని బ్రహ్మ సమీపమునకు తీసుకొని పోవును." ఉపనిషత్తులోన ఈ వాక్యమందు చెప్పబడిన బ్రహ్మ శబ్దము ముఖ్యముగా పరబ్రహ్మమునకే వాచకమగును.**

"కావున అర్చిరాది మార్గములలో పోవు వారికి పరబ్రహ్మ ప్రాప్తి కలుగును. కార్యబ్రహ్మ ప్రాప్తి

కాదు" ఎక్కడ ముఖ్యార్థమునకు ఉపయోగితముండదో అక్కడ గౌణార్థము కల్పించవచ్చును. పరబ్రహ్మ సర్వత్ర పరిపూర్ణుడైయున్నను పరమధామము యొక్కయు అక్కడకు విద్వాంసులు పోవుట యొక్కయు వర్ణనము శ్రుతులలో, స్మృతులలో కనిపించుచున్నవి.

అందుచేత లోక విశేషమునకు పోవుట గాని, కార్యబ్రహ్మద్యోతకము కాని లేదు. "బ్రహ్మలోకములు" అను బహువచన ప్రయోగము కూడా గౌరవార్థమే.

సర్వశక్తిమంతుడు, పరమేశ్వరుడు రచించిన అనేక లోకములుండుట కూడా అసంభవము కాదు.

**అందుచేత ఆ పరమధామమున కెవ్వరు పోయిన గాని, వారికి ప్రాప్తించునది పరబ్రహ్మ గాని కార్యబ్రహ్మ కాదు.**

"స ఏవతాన్ బ్రహ్మగమయతి" అనే చోట బ్రహ్మ పదార్థానికి అర్థము పరబ్రహ్మమే. నపుంసక లింగమైన బ్రహ్మశబ్దానికి ముఖ్యార్థము పరబ్రహ్మము అనియే.

**కాబట్టి ఆ అర్థాన్నే గ్రహించాలి. కార్యబ్రహ్మ అనే అర్థము కాదు**
**ఇది జైమిని మహర్షి అభిమతము.**
(ఛాం.ఉ. V-10-2)

## (530) IV-3-13

**సూ. దర్శనాచ్చ**

**క్ర. దర్శనాత్, చ,**

ప్ర.అ. దర్శనాత్ = **శ్రుతియందు గతి పూర్వకమైన పరబ్రహ్మ ప్రాప్తి కనిపించుట వలన,** చ = **కూడ ఇది కార్యబ్రహ్మ ప్రాప్తి కాదు.**

వి. "తయోర్ధ్వ మాయన్నమృతత్వమేతి" (ఛాం.ఉ. VIII-6-6, కఠ.ఉ. VIII-3-16)

"ఈ బ్రహ్మ నాడీ మార్గాన నిర్ణయించినవాడు అమృతత్వాన్ని (ముక్తిని) పొందుతాడు." అని శ్రుతి అమృతత్వాన్ని చూపిస్తున్నది. అమృతత్వమనేది పరబ్రహ్మమందే సంభవము. అంతే తప్ప నాశస్వభావము కల కార్యబ్రహ్మయందు అమృతత్వము సంభవము కాదు. మరియు "విజ్ఞాన సారథిర్యస్తు,
మనః ప్రగహ వాన్నరః,
సోఽధ్వనః పారమవాప్నోతి,
తద్విష్ణో పరమంపదమ్" (కఠ.ఉ. I-3-9)

"మనుజుండు ఎవని సారథి విజ్ఞానమగును
మనసు బిగి పగ్గముల తోడ యుంచునెవడు
దాను పరమధ్యేయమ్మునతడు చేరుచుండు
అదియే విష్ణువు పరమ పదము" (కఠ.ఉ. I-3-9)

**ఈ విధముగ గతి పూర్వకమగు పరబ్రహ్మ ప్రాప్తి శ్రుతియందు ప్రదర్శితమైనది. దీనివలన దేవయాన మార్గము ద్వారా పోవు బ్రహ్మ విద్యోపాసకులు పొందునది పరబ్రహ్మ ప్రాప్తి కాని కార్యబ్రహ్మ ప్రాప్తి కాదు.**

(ఛాం.ఉ. VIII-6-6; కఠ.ఉ. VIII-3-16, I-3-9)

## (531) IV-3-14

**సూ. న చ కార్యే ప్రతిపత్త్యభిసంధిః**

**క్ర. న, చ, కార్యే, ప్రతిపత్త్యభిసంధిః**

ప్ర.అ. న = **సంభవం కాదు,** చ = **ఇంకను,** కార్యే = **కార్య బ్రహ్మము నందు,** ప్రతిపత్త్యభి సంధి = **బ్రహ్మవిద్యోపాసకుల పాప్తి విషయక సంకల్పము.**

వి. **బ్రహ్మ విద్యోపాసకులకు ప్రాప్తి విషయిక సంకల్పము కార్యబ్రహ్మ సంబంధమైనది కాదు. అది పరబ్రహ్మ విషయికమైనట్లు వారి సాధనములు, ప్రవృత్తి తెలుపును. అందుచేత కూడ అది పరబ్రహ్మ ప్రాప్తి కొరకుయే**

"తద్బ్రహ్మతదమృతం స ఆత్మా, ప్రజాపతేస్సభాం వేశ్మ ప్రపద్యే" (ఛాం.ఉ. VIII-14-1)

"అదియే బ్రహ్మము, అదియే అమృతము, అదియే ఆత్మ ప్రజాపతి సభాభవనమును ప్రవేవించితిని" అనే ప్రసంగములో ఉపాసకుని లక్ష్యము ప్రజాపతి లోకమున వుండుట కాదు. పరబ్రహ్మ పరమధాయమును చేరుటయే. ఎందుకంటే, అక్కడ యశస్సులకు యశస్సైన మహాయశస్సు యొక్క వర్ణనమున్నది.

"యశోఽహం భవామి, బ్రాహ్మణానాం యశో, రాజ్ఞాం యశో, విశాం యశోఽహం"

(ఛాం.ఉ. VIII-14-1)

"నేను యశస్సును అవుతాను

బ్రహ్మణుల యశస్సు నేను, క్షత్రియుల యశస్సు

నేను, వైశ్యుల యశస్సు నేను అగుదును గాక."

ఇది మహా యశస్సు. ఇది బ్రహ్మ యొక్క పేరు..

ఇంకా

"నైన మూర్ధ్వం నతిర్యంచం, న మధ్యే పరిజగ్రభాత్

న తస్య ప్రతిమాస్తి, యస్య నామ మహద్యశః" (శ్వే.ఉ. IV-19)

"ఈ పరబ్రహ్మను ఊర్ధ్వాది దిక్కులందు గాని, తిర్యగ్ దిక్కులందు గాని గ్రహించుటకు వీలు కాదు. అనంత కీర్తి అని పేరు గల ఆ పరమాత్మ పోల్చుటకు తగిన ప్రతిమ ఏదియును లేదు."

"కృతాత్మా బ్రహ్మలోకమభి సంభవామీతి, అభిసంభవామీతి" (ఛాం.ఉ. VIII-13-1)

"కృతాత్మనై బ్రహ్మలోకమును బాగుగ వెళ్లెదను, బాగుగా వెళ్లెదను"

**ఈ విధముగా సాధకుని లక్ష్యము అప్రతిమాయుతమైన, మహద్యశమైన, అనంతకీర్తియైన పరబ్రహ్మమే కాని కార్యబ్రహ్మ కాదని అనుట సమ్మతము, సమంజసము, యుక్తము.**

(ఛాం.ఉ. VIII-14-1, VIII-13-1; శ్వే.ఉ. IV-19)

**అంతే కాదు**

"నామరూపయోర్నిర్వహితా తేయదంతరా తద్బ్రహ్మ" (ఛాం.ఉ. VIII-14-1)

"నామరూపాలను నిర్వహిస్తూ వాని మధ్య వెలిగే బ్రహ్మము" అని చెప్పటము వలన పరబ్రహ్మమనే ప్రస్తుతార్థము, కార్యబ్రహ్మ అని కాదు.

**(530 సూత్రము IV-3-12-నుండి ఇప్పటి వరకు జైమిని మహర్షి మరియు ఆయన అభిమతము చెప్పబడినవి. ఇక తరువాతి సూత్రములో బాదరాయణ మహర్షి యొక్క సర్వ సమ్మత అభిప్రాయము చెప్పబడుచున్నది.)**

## (6) అప్రతీకాలంబనాధికరణము (184) (పర్యంక విద్య)

## (532) IV-3-15

సూ. **అప్రతీకాలంబనాన్నయ తీతిబాదరాయణ ఉభయథాదోషాత్తత్క్రతుశ్చ**

క్ర. **అప్రతీకాలంబనాన్, నయతి, ఇతి, బాదరాయణః, ఉభయథా అదోషాత్, తత్క్ర తుః చ**

ప్ర.అ. అప్రతీకాలంబనాన్ = **ప్రతీక యొక్క ఆలంబనముతో ఉపాసన చేయువారు తప్ప అన్యోపాసకులందరను,** నయతి = **అర్చి మొదలైన దేవతలు క్రమముగా దేవయాన మార్గమున కొనిపోవుదురు,** ఇతి = **అని,** బాదరాయణః = **బాదరాయణ మహర్షి చెప్పుచున్నారు,** ఉభయథా = **రెండు ప్రకారముల,** అదోషాత్ = **దోషము లేకపోవుట వలన,** తత్క్రతుః = **వారి సంకల్పానుసారము,** చ = **పరబ్రహ్మను, కార్యబ్రహ్మను పొందుట సిద్ధించుచున్నది.**

వి. **ప్రతీకోపాసన చేయని ఉపాసకులను అర్చి మొదలైన దేవతలు మరియు అ మానవ పురుషుడు బ్రహ్మలోకము చేరుస్తాడు అని మహర్షి బాదరాయణుల అభిప్రాయము. వాళ్లనే చేరుస్తాడు ఇతరులను (అంటే ప్రతీకోపాసనము చేసే వారిని) చేర్చదు అని కూడా, రెండు విధముల చెప్పవచ్చును.**

గతి (యానము) కార్యబ్రహ్మ విషయకమే కాని పరబ్రహ్మ విషయము కాదు. పరబ్రహ్మోపాసకులకు శరీర త్యాగము తరువాత అచటనే, అప్పుడే బ్రహ్మానుభవము అవుతుంది.

కార్యబ్రహ్మోపాసకులకు దేవయానము, గతి వుంటుంది. అయితే కార్యబ్రహ్మోపసకులందరికీ ఏ విశేషమూ లేకుండా అమానవ పురుషుడు బ్రహ్మలోకము పొందిస్తాడా? లేక కొంత మందిని మాత్రమే పొందిస్తాడా? అనే సందేహము వస్తుంది. ఏమి ప్రాప్తించును అంటే ఈ ఉపాసకులందరికీ పరబ్రహ్మ దగ్గరికి కాక కార్యబ్రహ్మ దగ్గరికి గతి వుంటుంది.

ఎందువల్లనంటే (బ్ర.సూ.III-3-31)

"అనియమ సర్వేషామవిరోధః, శబ్దానుమానాభ్యాం"

"ప్రత్యేక విద్యలననుసరించి బ్రహ్మనుపాసించువారు మాత్రమే దేవయాన శరీరమున బ్రహ్మలోకమునకు పోవుదురు అని నియమము లేదు. ఏ విద్యకలవారైననూ బ్రహ్మలోకమునకు పోవువారు ఈ దేవయాన మార్గముననే పోవుదురు."

**ఇక్కడ ప్రతీకోపాసన తప్ప మిగిలిన ఉపాసకులనందరినీ బ్రహ్మలోకానికి తీసుకొని వెళుతాడు అని బాదరాయణాచార్యులు అంటున్నారు.**

ఈ విధముగా రెండు విధాలను అంగీకరించినా దోషముల లేదు. **అనియమ న్యాయము ప్రతీకోపాసన చేసేవారు కాని ఉపాసకులకు మాత్రమే వర్తిస్తుంది. ఇట్లు రెండు విధాలుగా చెప్పటానికి బ్రహ్మోపాసనము (తత్క్రతువు) సమర్ధమైన హేతువు అని తెలుసుకోవాలి.**

"తం యథాయథోపాసతే తదేవ భవతి" (ముం.ఉ.III-3)

"దానిని ఏ విధముగా సేవిస్తే అదే అవుతుంది." బ్రహ్మను ఉపాసించేవాడే, బ్రహ్మ క్రతువైనవాడే బ్రహ్మకు సంబంధించిన ఐశ్వర్యాన్ని పొందుతాడు అని చెప్పటము సమంజసము. ప్రతీ కలలోనైతే బ్రహ్మక్రతుత్వము లేదు. ("మనో బ్రహ్మేతి ఉపాసీత" మొదలైన ఉపాసనలలో బ్రహ్మదృష్టితో ఉపాసించబడేది మనస్సే గావున దానికే ప్రాధాన్యం. అటువంటి ప్రతీకోపాసనలలో బ్రహ్మ అ ప్రధానముగా వుంటుంది.)

అయితే "బ్రహ్మక్రతువు కానివాడు కూడ బ్రహ్మను పొందుతాడు." అని చెప్పబడింది కదా ? పంచాగ్ని విద్యలో "స ఏతాన్ బ్రహ్మ గమయతి" (ఛాం.ఉ. IV-15-5)

"వారు బ్రహ్మలోకమునకు వెళ్లుతారు" అని చెప్పబడినది. ఈ పంచాగ్ని విద్య బ్రహ్మక్రతువు కాదు.

**అయితే ఎక్కడనైతే ప్రత్యేకంగా అట్లా చెప్పబడినదో అట్టి సందర్భములో బ్రహ్మక్రతువు కాకపోయినా బ్రహ్మోపాసన కాకపోయినా, బ్రహ్మలోకము చేరుతారు.**

అలా ప్రత్యేకముగా చెప్పబడని చోట్ల తత్క్రతు న్యాయము చేత - ఎవరు దేనిని ధ్యానిస్తాడో దానిని పొందుతాడు. బ్రహ్మ క్రతువులకు మరియు ప్రత్యేకముగా (పంచాగ్ని విద్యలో వలె) బ్రహ్మలోకము చేరుతారు అని చెప్పిన సందర్భములకు మాత్రమే బ్రహ్మప్రాప్తి కాని ఇతర ప్రతీకోపాదకులకు బ్రహ్మ ప్రాప్తి లేదు.

**ప్రతీకోపాసనలలో బ్రహ్మోపాసన లేదు కనుక బ్రహ్మలోక ప్రాప్తి లేదు.** అయితే, పంచాగ్ని విద్యోపాసకులు గూడా బ్రహ్మోపాసకులు **కాకపోయినా శ్రుతి బలము వలన వారికి బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.**

మరియు ఏ ప్రకారము నామోపాసన మొదలైన వాని యందు బ్రహ్మ యొక్క ప్రతీకోపాసన వర్ణింపబడినదో, అదే ప్రకారము ఇతర ఉపాసనలు కూడ శ్రుతులందు వర్ణింపబడినవి.

ఆ ఉపాసకులు తప్ప బ్రహ్మలోకమందు భోగములను స్వేచ్ఛగా అనుభవించు కోరిక గల కార్యబ్రహ్మోపాసకులును, పరబ్రహ్మ ప్రాప్తి కొరకు ఇచ్ఛ కలిగి సర్వజ్ఞుడు సర్వశక్తి సంపన్నుడు

అయిన పరమాత్మను ఉపాసించువారు ఈ రెండు విధములైన ఉపాసకులను వారి భావానుసారము కార్యబ్రహ్మ యొక్క భోగ సంపన్నములైన లోకములు మరియు పరబ్రహ్మ యొక్క పరంధామము అను ఈ రెండు తావులకు ఆ అమానవపురుషుడు తీసుకొనిపోవును. కావున ఈ రెండు విధములైన ఉపాసకులను మన్నించటములో దోషము లేదు. ఎందుకనగా ఉపాసన సంకల్పమే ఈ విషయమునకు కారణము. ఉపనిషత్తులో ఇది స్పష్టముగా వర్ణించబడినది.

"దేవయాన మార్గములో ప్రయాణమైన జీవుడు ముందుగా అగ్ని లోకమును చేరుచున్నాడు. ఆ పిమ్మట వాయులోకమునకు, వరుణలోకమునకు, ఆదిత్యలోకమునకు, ఇంద్రలోకమునకు, ప్రజాపతి లోకమునకు వరుసగా వెళ్లి బ్రహ్మలోకమును చేరుచున్నాడు."

(కౌషీ.ఉ. I-3)

ఎవరిని పరబ్రహ్మ యొక్క పరమధామమునకు పంపుదురో వారి మార్గము కూడా ప్రజాపతి యొక్కయు, బ్రహ్మ యొక్కయు లోకముల గుండానే కలదు.

**అందువలన ఎవరి అంతఃకరణమందు ఏలోకముల యందు రమించు సంకల్పము వుండునో వారినచ్చట విడిచిపెట్టుదురు. ఎవరి మనస్సునందు అట్టి సంకల్పము, భావము వుండదో వారిని పరమధామమందు చేర్తురు. అయినను దేవయాన మార్గమున పోవు రెండు రకములైన ఉపాసకులకు, సగుణోపాసకులైన కార్యబ్రహ్మ ఉపాసకులు మరియు పరబ్రహ్మోపాసకులకు పునరావృత్తి లేదు. ఇది మహర్షి శ్రీ బాదరాయణ ఆచార్యుల అభిమతము.**

(బ్ర.సూ. III-3-31; ముం.ఉ. III-3; కౌషీ.ఉ. I-3)

## (533) IV-3-16

**సూ. విశేషం చ దర్శయతి**

**క్ర. విశేషం, చ, దర్శయతి**

ప్ర.అ. విశేషం = **దీనికి గల విశేష కారణము,** చ = **గూడ,** దర్శయతి = **శ్రుతి చెప్పుచున్నది.**

వి. **నామాది ప్రతీకోపాసనలలో పూర్వ పూర్వోపాసనల కంటే ఉత్తరోత్తర ఉపాసనలలో విశేష ఫలము చెప్పబడినది. కావున ప్రతీకోపాసకులు బ్రహ్మలోకానికి పోరు.**

సనత్కుమారుడు నారదునికి చెప్పినాడు. "నామమును బ్రహ్మమని ఉపాసించువాడు నామ విషయము గల జ్ఞానమును బడసి దానియందు యథేచ్ఛగా విహరించును. నామమెంత వరకు వ్యాప్తి కలదో అంతవరకు వ్యాప్తికలవాడై పూర్ణ ఫలమును పొందును." (ఛాం.ఉ. VII-1-5)

"వాక్కు నామము కంటె గొప్పది - వాక్కును బ్రహ్మమని ఉపాసించువాడు వాక్కు యొక్క పూర్ణ జ్ఞానమును పొంది వాక్కు ఎంతగా వ్యాప్తి చెందియున్నదో అంతవరకు స్వేచ్ఛగా విహరించును." (ఛాం.ఉ. VII-2-2)

ఈ విధముగా వాక్కు కంటె మనస్సు, మనస్సు కంటె సంకల్పము, సంకల్పము కంటె చిత్తము, చిత్తము కంటె ధ్యానము, ధ్యానము కంటె విజ్ఞానము, విజ్ఞానము కంటె జలము, జలము కంటె

అన్నము, అన్నము కంటె జలము, జలము కంటె తేజము, తేజము కంటె ఆకాశము, ఆకాశము కంటె స్మృతి, స్మృతి కంటె ఆశ, ఆశ కంటె ప్రాణము, ప్రాణము కంటె సత్యము, సత్యము కంటె విజ్ఞానము, విజ్ఞానము కంటె మనము, మనము కంటె శ్రద్ధ, శ్రద్ధ కంటె నిష్ఠ, నిష్ఠ కంటె కర్మ, కర్మ కంటె సుఖము, సుఖము కంటె భూమ (గొప్పది, బ్రహ్మము, ఆత్మ) ఒకదాని కంటె ఒకటి గొప్పది. భూమ కంటె గొప్పది లేదు.
(ఛాం. VII-1 నుండి VII-23)

**ఈ ఉపాసనాలన్నీ ఒకదాని కంటె ఒకటి విశేష ఫలము కలవి. ఈ ఉపాసనలు ప్రతీకల మీద ఆధారపడినవి. కావున ఈ ఉపాసనలలో ప్రతీకాలైన నామాలే ప్రధానము కనుక ఫలములో విశేషము ఉపపన్నముగా వుంటుంది. బ్రహ్మోపాసనలో మాత్రము బ్రహ్మలో విశేషం ఏమీ లేదు కనుక ఫలవిశేషము వుండదు. అందువలన ప్రతీకోపాసనలు చేసే వారికి బ్రహ్మోపాసన చేసే వారితో తుల్య ఫలత్వము వుండదు. ప్రతీకోపాసన చేసే వారికి బ్రహ్మలోక ప్రాప్తి లేదు.**
(ఛాం.ఉ. VII-1-5, VII-2-2; ఛాం. VII-1 నుండి VII-23)

ఇట్లు
**చతుర్థాధ్యాయ తృతీయ పాదము**



# చతుర్థాధ్యాయ తృతీయపాద సమాసము

## దేవయాన మార్గము

### 1. అర్చిరాద్యధికరణము

బ్రహ్మలోకప్రాప్తి కోరే ఉపాసకులు అంతా అర్చిరాదిమార్గము గుండా వెళ్లుతారు. సగుణోపాసనా విద్వాంసులకు అందరికీ ఈ మార్గమే ప్రసిద్ధము. అర్చిరాదిమార్గము అంటే వెలుగుమార్గము. దీనినే దేవయానమార్గము, ఉత్తరాయణమార్గము అని అంటారు. ఒక్కొక చోట ఏ మార్గమూ చెప్పకపోతే ఆయా విద్యలకు అర్చిరాదిమార్గము ద్వారానే బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

### 2. వాయ్వధికరణము

అర్చిరాదిమార్గములో వాయులోకము, సంవత్సరము తరువాత, సూర్యలోకము కన్న ముందు వుంటుంది.

### 3. వరుణాధికరణము

విద్యుత్తులోకము తరువాత వరుణలోకము వుంటుంది. వరుణలోకము తరువాత ఇంద్రలోకము, ప్రజాపతి లోకమునకు చోటు ఇవ్వాలి.

### 4. అతివాహికాధికరణము

బ్రహ్మలోకమునకు పోవు విద్వాంసులను ఒకచోటు నుండి ఇంకొక చోటునకు తీసుకుని పోయేవారిని అతివాహికులు అంటారు. అర్చిరాది దేవతలు అతివాహిక దేవతలు అంటే సూక్ష్మశరీరాన్ని మోసుకొనిపోయే దేవతలు అవుతారు. అతివాహికులు అయ్యే ఈ అర్చిరాది దేవతలు అన్ని కాలములలోనూ, అన్ని సమయములలోనూ వుంటారు. కావున ఉపాసకుడు దక్షిణాయనములో మరణించినా, రాత్రివేళ చనిపోయినా బ్రహ్మలోకాన్ని చేరటములో సమస్య వుండదు. విద్యుల్లోకము నుండి అక్కడ ప్రకటమగు అమానవపురుషుడు జ్ఞానిని బ్రహ్మలోకమునకు తీసుకొని వెళ్లును.

### 5. కార్యాధికరణము

శ్రుతియందు గంతవ్య రూపములో, ప్రజాపతి రూపములో గ్రహింపబడినందున కార్యబ్రహ్మ యందే గతి, గమనము అనేది సరిపోతుంది అని చెప్పిన బాదరి ఆచార్యుని అభిప్రాయము సమ్మతము. కల్పిత గుణాలతో కూడిన వాడైనా కార్యబ్రహ్మను నిర్గుణ బ్రహ్మములాంటివాడే కావున కార్యబ్రహ్మము అనుట సమంజసమే.

ప్రళయకాలములో బ్రహ్మలోకము నశించిన పిమ్మట దాని స్వామి అయిన బ్రహ్మతోపాటు బ్రహ్మవిద్యోపాసకులు పరబ్రహ్మ ప్రాప్తిని అంది ముక్తులగుదరు." అమానవపురుషుడు వీరిని బ్రహ్మ సమీపమునకు తీసుకువెళ్లును" అన ఉపనిషత్తు వాక్యము నందు చెప్పబడిన బ్రహ్మ శబ్దము ముఖ్యముగా పరబ్రహ్మ వాచకము అని జైమినిమహర్షి అభిమతము. దేవయానమార్గము ద్వారా పోవు బ్రహ్మవిద్యోపాసకులు పొందునది పరబ్రహ్మప్రాప్తి కాకుండ కార్యబ్రహ్మ విషయకము. సాధకుని

లక్ష్యము అప్రతిమాయుతమైన, మహద్యశమైన, అనంత కీర్తియైన పరబ్రహ్మమే కాని కార్యబ్రహ్మ ప్రాప్తి కాదు. బ్రహ్మవిద్యోపాసకునకు ప్రాప్తి విషయక సంకల్పము కార్యబ్రహ్మ సంబంధమైనవి కాదు. అది పరబ్రహ్మ విషయకము. సాధకుని లక్ష్యము అప్రతిమాయుతమైన, మహాద్యశమైన, అనంతకీర్తియైన పరబ్రహ్మమే కాని, కార్యబ్రహ్మ కాదు.

## 6. అప్రతీకాలంబనాధికరణము

ప్రతీకోపాసన చేయని వాళ్లను అర్చి మొదలైన దేవతలు మరియు అమానవ పురుషుడు బ్రహ్మలోకమునకు చేరుస్తాడు. దేవయానమార్గమున పోవు రెండు రకములైన ఉపాసకులకు, సగుణోపాసకులైన కార్యబ్రహ్మ ఉపాసకులు మరియు పరబ్రహ్మ ఉపాసకులు మరియు పరబ్రహ్మ ఉపాసకులకు పునరావృత్తి లేదు. ప్రతికోపాసకులకు బ్రహ్మలోక ప్రాప్తి లేదు. బ్రహ్మఉపాసకులకు బ్రహ్మలోకప్రాప్తి కలదు.

ఇట్లు

**చతుర్థాధ్యాయ తృతీయ పాద సమాసము**



# చతుర్థాధ్యాయ తృతీయ పాద సారము

## దేవయాన మార్గము

దేనిలోక ప్రాప్తి కోరే ఉపాసకులు అర్చిరాది మార్గము గుండా వెళుతారో, దేని సగుణోపాసనా విద్వాంసులకు అందరికీ ఈ వెలుగు మార్గము అంటే దేవయాన మార్గము లేక ఉత్తరాయణ మార్గము ప్రసిద్ధమో

కొన్ని చోట్ల చెప్పకపోయినా ఆయా విద్యలకు అర్చిరాది మార్గము ద్వారానే దేనిలోక ప్రాప్తి కలుగుతుందో,

దేనిలోకము చేరే అర్చిరాది మార్గములో వాయులోకము సంవత్సరము తరువాత, సూర్యలోకము కన్న ముందు వుంటుందో,

దేనిలోకమునకు పోవు విద్వాంసుల సూక్ష్మ శరీరములను ఒక చోట నుండి ఇంకొక చోటుకు తీసుకొని పోవు వారిని అతివాహికులు అని అంటారో మరియు దేని లోకమునకు తీసుకుని పోయే ఈ అతివాహక దేవతలు అన్ని కాలములలోనూ, అన్ని సమయములలోనూ వుంటారో, కావున ఉపాసకుడు దక్షిణాయనములో మరిణించినా, రాత్రి మరణించినా దేని లోకమును చేరుటకు సమస్య వుండదో - విద్యుల్లోకము నుండి అమానవ పురుషుడు జ్ఞానిని దేనిలోకమునకు తీసుకొనివెళ్లునో,

దేని విద్యోపాసకునకు ప్రాప్తి విషయిక సంకల్పము కార్యబ్రహ్మ సంబంధమైనదికాదో మరియు దేని సంబంధమైనదో,

ప్రతీకోపాసన చేయని ఉపాసకులను అర్చి మొదలైన దేవతలు మరియు అమానవ పురుషుడు దేనిలోకమునకు చేరుస్తాడో, దేని ఉపాసకులకు పునరావృత్తి లేదో, ప్రతీకోపాసకులకు దేనిలోక ప్రాప్తి లేదో మరియు దేని ఉపాసకులకు దేనిలోకప్రాప్తి కలదో, అదియే బ్రహ్మము.

ఇట్లు

**చతుర్థాధ్యాయ తృతీయపాద సారము.**



## IV-4

# చతుర్థ అధ్యాయము - చతుర్థ పాదము

## విదేహముక్తి

### 1. సంపద్యావిర్భావాధికరణము (185) (జ్యోతిషాంజ్యోతి విద్య)

### (534) IV-4-1

**సూ. సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్**

**క్ర. సంపద్య, ఆవిర్భావః, స్వేన, శబ్దాత్**

**ప్ర.అ.** సంపద్య = **స్వప్రకాశమైన ఆత్మను తెలిసికొని,** ఆవిర్భావః = **ఆత్మమాత్రముగా ఆవిర్భావమే,** స్వేన శబ్దాత్ = **'స్వేన' అను శబ్దము వలన**

**వి.** స్వప్రకాశ రూపమైన ఆత్మసాక్షాత్కారాన్నిపొంది, ఆ ఆత్మరూపములో విద్వాంసుడు ఆవిర్భూతుడౌతాడు. "స్వేనరూపేణ" అనినప్పుడు అందులో 'స్వ'శబ్దము వున్నందున "ఏష మేవైష సంప్రసాదో అస్మాద్ శరీరాత్ సముత్థాయ, పరంజ్యోతిరూపంసంపద్య, స్వేన రూపేణాభినిష్పద్యత, ఏష ఆత్మేతిహోవాచ ఏచైత దమృత మభయం, ఏతద్బ్రహ్మ తస్య హ వా ఏతస్య బ్రహ్మణోనామ సత్యమితి" (ఛాం.ఉ.VIII-3-4)

"ఉపాసకుడు ఈ శరీరము నుండి పైకిపోయి పరంజ్యోతియైన పరమధామమును పొంది, అక్కడ అతడు తన స్వరూపముతో సంపన్నుడు అగును. అదియే ఆత్మ, అదియే అమృతము, అభయము మరియు అదియే బ్రహ్మము. దానిపేరు సత్యము."

అట్టి ఆత్మయెట్టిది?

"ఏష ఆత్మా అపహతపాప్మా, విజరః విమృత్యుః విశోకో విజిఘోత్సోఽపిపాసః, సత్యకామః సత్యసంకల్పః" (ఛాం.ఉ. VIII-1-5)

"ఈ ఆత్మపాపరహితమైనది. దానికి జర (ముసలితనము), మరణము, దుఃఖము, ఆకలి, దప్పిక ఏమియులేవు. అది సత్యసంపన్నము, సత్యకామము అయివున్నది."

"ఇది ఆత్మ స్వరూపము, మహిమ. 'జ్ఞాని' పితృలోకమును కోరినచో, అతని సంకల్పమాత్రముననే, పితరులతని దగ్గరకు వచ్చెదరు. అతడు పితృలోక సంపదకలవాడగును" (ఛాం.ఉ.VIII-2-1)" "అతడు మాతృలోకమును కోరినచో అతని సంకల్పమాత్రముననే, మాతృదేవతలతని దగ్గరకు వచ్చెదరు. అతడు మాతృలోక సంపద కలవాడగును." (ఛాం.ఉ.VIII-2-2)

ఈ విధముగా జ్ఞాని తన సంకల్పమాత్రముననే భ్రాతృలోక, స్వప్నలోక, సఖిలోక, గంధమాల్యలోక, అన్నపానలోక, గీత వాద్యత్రలోక, స్త్రీ లోకములు పొందగల్గి, "ఏయే లోకములనతడు కోరుకొనునో, ఏయే భోగములనను భావించవలెనని సంకల్పించునో, అవన్నియు అతని సంకల్పమాత్రముతో

అతనికి ప్రాప్తించును. అవి అన్నియు పొంది అతడు మహిమకల వాడగును" (ఛాం.ఉ. VIII–2–3) నుండి (ఛాం.ఉ. VIII–2–10). ఇది ఆత్మజ్ఞాని, బ్రహ్మజ్ఞాని మహిమ. "సర్వేషు లోకేషు కామచారో భవతి" (ఛాం.ఉ. VIII–1–6)

ఈ వర్ణనము వలన ఆత్మజ్ఞానమహిమ చెప్పబడినది. మరియు స్వేనరూపేణ అని అనుట వలన జీవుడు తానేయైన రూపములో వుండుటయే ముక్తి. కావున ముక్తి అనేది జన్యము కాదు. ముక్తి అనేది వున్నది. లోననే వున్నది.

భగవద్గీతలో ఇలా వున్నది

"అహమాత్మా గుడాకేశ, సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ, భూతానామంత ఏవ చ" (భ.గీ. X–20).

"నేను ఆత్మను గుడా కేశుండ వినుము
సర్వభూతాశయ స్థితమునేనుందు
ఆది నేను. మరియు నేను మధ్యంబు
సర్వభూతములకు నేను అంతంబు".

(భ.గీ. X–20, ఛాం.ఉ. VIII–3–4, 2–2, 1–5, 2–1, 2–2, 2–3, 2–10, 1–6)

## (535) IV-4-2

**సూ. ముక్తః ప్రతిజ్ఞానాత్**

**క్ర. ముక్తః ప్రతిజ్ఞానాత్**

**ప్ర.అ.** ముక్తః = **అతడు ముక్తుడు,** ప్రతిజ్ఞానాత్ = **శ్రుతిలో చెప్పబడినందువలన, కథనము చేయబడినందువలన**

**వి.** పరమాత్మను పొందిన ఉపాసకుడు, సాధకుడు సమస్త బంధముల నుండి ముక్తుడగును.

"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః
సన్న్యాస యోగాద్యతయః శుద్ధసత్త్వాః
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే
పరామృతాః పరిముచ్యంతి సర్వే॥" (ముం.ఉ. III–2–6)

"వేదాంత విజ్ఞానమందు నిస్సందేహమైన సునిశ్చిత బుద్ధికలవారై, సన్న్యాసయోగముచేత పరిశుద్ధ మనస్సుకలవారైన యతివరులు మరణానంతరము బ్రహ్మలోకమును చేరి, యచట కల్పాంతము వరకు ఉండి, తరువాత సంపూర్ణ మోక్షమునందుచున్నారు" ఇట్లు ముండకోపనిషత్తులో కథనము, ప్రతిజ్ఞ చేయబడినది.

ఇది ప్రతిజ్ఞానము. అట్టి ఉపాసకులు, తమ వాస్తవిక స్వరూపముతో సంపన్నులై, సమస్త బంధములనుండి ముక్తులై, విజ్ఞానమయులై వికారరహితులు అగుదురు. పూర్వకాలమందు అనాది సిద్ధమైన కర్మసంస్కారముల వలన వారి స్వరూపము కర్మానుసారము ప్రాప్తమైన శరీరముకు

అనురూపముగా వుండేడిది. మరియు వారు సత్వ, రజస్తమములనెడు దోషములచే కప్పబడి యుండెడువారు. అవస్థాత్రయ దోషములుకూడ వుండేడివి. (జాగ్రత, స్వప్న, సుషుప్తి అవస్థల దోషములు). బ్రహ్మలోకమును పరంధామమును చేరిన పిమ్మట అట్లుండదు. వారు సర్వబంధ విముక్తులగుదురు. భగవద్గీతలో ఇలా చెప్పబడినది.

"మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే" (భ.గీ. XIV-26)

"ఎవరు నన్ను అవ్యభిచార భక్తిచేత
చేరి కొలతురు తలతురు శ్రద్ధచేత
వారు గుణములన్నియు దాటగలరు
పరబ్రహ్మమును చెందగలరు" (భ.గీ. XIV-26)
(ముం.ఉ. III-2-6, భ.గీ. XIV-26)

## (536) IV-4-3

**సూ. ఆత్మా ప్రకరణాత్**

**క్ర. ఆత్మా, ప్రకరణాత్**

**ప్ర.అ.** ఆత్మా = **'జ్యోతి'శబ్దమునకు 'ఆత్మ' అనియే అర్థము,** ప్రకరణాత్ = **ప్రకరణమును బట్టి**

**వి.** జ్యోతి అంటే ఆత్మయే ఛాందోగ్యోపనిషత్తులో

"ఏష ఆత్మా అహహతపాప్మా" (ఛాం.ఉ. VIII-1-5)

"ఈ ఆత్మ పాపరహితమైనది" అని చెప్పేముందు

"అగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచంద్రమాసౌ ఉభౌ విద్యున్నక్షత్రాణి యచ్చాస్యేహాస్తి యచ్చ నాస్తి, సర్వం తదస్మిన్ సమాహితమితి" (ఛాం.ఉ. XVIII-1-3)

"అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, నక్షత్రములు, ఏవి వున్నాయో, ఏవి లేనివో, అన్నియు హృదయాకాశమందు స్థితమై వున్నవి".

అన్నియు జ్యోతులలోని యందువున్నవి.

తరువాత

"పరంజ్యోతి రుపసంపద్య, స్వేనరూపేణాభినిష్పద్యత, ఏష ఆత్మా" (ఛాం.ఉ. XVIII-3-4)

"పరంజ్యోతియైన పరమధామమును పొంది, అక్కడ అతడు తన స్వరూపములో సంపన్నుడు అగును. అదియే ఆత్మ" అని చెప్పబడినది.

**అక్కడ "జ్యోతి" శబ్దానికి "ఆత్మ" అని అర్థము. భౌతికమైన వెలుగు అని అర్థము కాదు.**

"జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతే అమృతం" (బృ.ఉ. VI-4-16)

"ఆ ఆత్మను, జ్యోతులకు జ్యోతియైన దానిని దేవతలు ఆయువుగా ఉపాసించుచున్నారు"

కావున ఈ ప్రకరణములో వచ్చిన "పరంజ్యోతి"లో వున్న "జ్యోతి" శబ్దానికి "ఆత్మ" అనే అర్థము.

భగవద్గీతలో

"జ్యోతిషామపితజ్జ్యోతిః తమసః పరముచ్యతే

జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం, హృది సర్వస్య విష్ఠితమ్" (భ.గీ. XIII-18)

"సర్వజోతులకు జ్యోతియగుచు
మరి తమసమున కావలయునగుచు
పరమజ్ఞానమ్ము జ్ఞేయమ్ము జ్ఞానగమ్యమ్ము
సర్వహృదయములందు విష్ఠితమ్ము" (భ.గీ. XIII-18)
ఈ బ్రహ్మసూత్రములలో జ్యోతిరధికరణములో

"జ్యోతిర్దర్శనాత్" (బ్ర.సూ. I-3-40)

"జ్యోతి అనునది పరమాత్మ (ఆత్మ) వాచకము ఉపనిషత్తులలో చెప్పబడినందువలన" అనుచు **"జ్యోతి మరియు పరంజ్యోతి పరబ్రహ్మ వాచకములు"** అని చెప్పబడినది.

ఆత్మ అనేదియే జ్యోతి కనుక "ముక్తి" అనేది (ఆత్మ లభించేది అనేది) పూర్వసిద్ధియే. ముక్తి అనేది ఉపాసకుని దగ్గరనే వున్నది. బయటది కాదు. ఇపుడు పుట్టినది కాదు, ఇప్పుడు వచ్చినది కాదు. వున్నది లోననే వున్నది.
(ఛాం.ఉ. VIII-1-5, XVIII-1-3, XVIII-3-4, XVIII-18, బృ.ఉ. VI-4-16, భ.గీ. XIII-18, బ్ర.సూ. I-340)

## 2. అవిభాగేనదృష్టత్వాధికరణము (186) (జ్యోతిషాంజ్యోతి విద్య)

## (537) IV-4-4

**సూ. అవిభాగేన దృష్టత్వాత్**

**క్ర. అవిభాగేన, దృష్టత్వాత్**

ప్ర.అ. అవిభాగేన = **ముక్తాత్మ యొక్క స్థితి పరమాత్మయందు అవిభక్త రూపములోనైనది,** దృష్టత్వాత్ = **ఉపనిషత్తులో కనిపించుట వలన**

వి. "పరంజ్యోతి రుపసంపద్య
స్వేనరూపేణాభినిష్పద్య, ఏష ఆత్మా" (ఛాం.ఉ. XVIII-3-4)

"పరంజ్యోతియైన పరమధామమును పొంది, అక్కడ అతడు తన స్వరూపములో సంపన్నుడు అగును. అదియే ఆత్మ" అని చెప్పబడిన ముక్తపురుషుడు పరమాత్మకంటే భిన్నమైన రూపములో వుంటాడా? లేక ఏకరూపములో వుంటాడా? అనే ప్రశ్న వస్తుంది. దానికి సమాధానము ఈ సూత్రము. **ముక్తపురుషుడు బ్రహ్మముతో అవిభక్త రూపములో వుంటాడు.**

"స తత్ర పర్యేతి" (ఛాం.ఉ. XVIII-12-3)

"అతడు దానిని (పరంజ్యోతిని) చేరి వుంటాడు." అంటే "ముక్త పురుషుడు బ్రహ్మతో కలిసి పోతాడు". "పరంజ్యోతి రుపసంపద్య" (ఛాం.ఉ. VIII-12-2)

"పరంజ్యోతిని చేరి"
అంటే "పరబ్రహ్మను కలిసి"
"తత్త్వమసి" (ఛాం.ఉ. VI-8-7)
"ఆ బ్రహ్మము నీవే అయి వున్నావు"
**అంటే ముక్తపురుషుడు బ్రహ్మమే అయి అవిభక్తముగా వుంటాడు.**
**వామదేవ ఋషి తల్లి గర్భములో నేను బ్రహ్మమును ధ్యానించి**
"అహం బ్రహ్మాస్మి" (బృ.ఉ. III-4-10)
"నేను పరబ్రహ్మనైతిని" అని తెలిసికొనెను.
**ముక్త పురుషుడు "పరబ్రహ్మమునేను" అని తన్నే తాను తెలిసికొనెను.**
"యత్రనాన్యత్పశ్యతి" (ఛాం.ఉ. VII-24-1)
"ఏ ఆత్మయందు ఆత్మకంటే వేరైనది
కనిపించుట లేదో" ఆత్మ నుండి విభక్తమైనది ఏదీవుండదు.
"న తు తద్ద్వితీయమస్తి, తతో అన్యద్విభక్తం యత్పశ్యేత్" (బృ.ఉ. IV-3-23)
"వేరుగా చూడడానికి అది తప్ప మరొకటి ఏమీలేదు"
**ఆ బ్రహ్మకంటే (ఆ ఆత్మకంటే) వేరైనది విభక్తమైనది వేరు ఏమీలేదు.**

"యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృవేవ భవతి,
తథా మునేర్విజానత, ఆత్మా భవతి గౌతమ" (కఠ.ఉ. IV-15)

"ఓ నచికేతా! పరిశుద్ధమైన నీటిలో కలుపబడిన పరిశుద్ధమైన నీరు ఏవిధముగా పరిశుద్ధమైన నీరే అవుతుందో, జ్ఞానముగల మునియొక్క ఆత్మ పరమాత్మలో కలసి పరమాత్మయే అవుతుంది. జ్ఞానియొక్క ఆత్మ, పరమాత్మలో ఏ విభాగమూ వుండదు."

ఈ వాక్యములు, నిదర్శనములు మరియు ముండక ఉపనిషత్తులోని నదులు, సముద్రములో కలిసి నామరూపాలు వదిలి, సముద్రమే అవటము (యథానద్యః సందమానాః సముద్రే అంతం గచ్ఛంతి నామారూపే విహాయ) - (ముం.ఉ. III-2-8), అనే అనేక శ్రుతి వాక్యములు ముక్తాత్మ మరియు పరమాత్మల అవిభాగ ఏకరూపమును తెలుపుతున్నాయి. మరియు "స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని" (ఛాం.ఉ. VII-24-1)

"ఓ భగవంతా! ఆ భూమా (బ్రహ్మ) దేనియందు ప్రతిష్ఠితమైనది?" అని నారదుడడిగెను.
"తన మహిమ యందే తాను ప్రతిష్ఠితమై వున్నది" అని సనత్కుమారుడు చెప్పెను.
"ఆత్మరతిః ఆత్మక్రీడః" - (ఛాం.ఉ. VII-24-1)

"ఆత్మయందే రతికలవాడు, ఆత్మయందే క్రీడించువాడు"

**ఈ విధముగా వేరు వేరు చోట్ల, వేరు వేరు రీతుల ముక్తాత్మస్థితి, పరమాత్మయందు అవిభక్తముగా వుంటుందని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.**

(ఛాం.ఉ. XVIII-3-4, VIII-12-3, VIII-12-2, VI-8-7; బృ.ఉ. III-4-10; ఛాం.ఉ.VII-24-1; బృ.ఉ. IV-3-23; కఠ.ఉ. IV-15; ముం.ఉ. III-2-8; ఛాం.ఉ. VII-24-1)

## 3. బ్రహ్మాధికరణము (187) (పర్యంక విద్య)

## (538) IV-4-5

**సూ.** బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః

**క్ర.** బ్రాహ్మేణ, జైమినిః, ఉపన్యాసాదిభ్యః

**ప్ర.అ.** బ్రాహ్మేణ = **ముక్తుడు బ్రహ్మ సంబంధమైన తన రూపముతో కలుస్తాడు అని,** జైమినిః = **జైమిని మహర్షి అంటున్నాడు,** ఉపన్యాసాదిభ్యః = **శ్రుతి, స్మృతులలో గల వాక్యముల వలన,**

**వి.** **ఉపన్యాసము, విధి, ఉపదేశము అనే కారణాలవలన ముక్త పురుషుడు బ్రహ్మధర్మాలైన సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ స్వరూపములో అవస్థితుడై వుంటాడని జైమిని అభిప్రాయము.**

**1. ఉపన్యాసము –** ఇంతకు ముందు తెలిసిన దానిని ఉద్దేశ్య పూర్వకముగా తెలపటము.

"య ఆత్మాఽపహతపాప్మా, విరజో విమృత్యుః,
విశోకో, విజిఘిత్సోఽపిపాసః, సత్యకామః సత్యసంకల్పః" (ఛాం.ఉ.VIII-7-1)

"ఏ ఆత్మ అయితే సర్వపాపరహితుడు ముసలితనము, చావు, శోకము, ఆకలిదప్పులులేనివాడో, సత్యకాముడు, సత్యసంకల్పుడో" అని ఇంతకు ముందు తెలిసిన విషయాన్ని మరల ఉద్దేశ్యపూర్వకముగా చెప్పినందున ఇది ఉపన్యాసము.

"ఏ ఆత్మ అయితే" అని ప్రారంభించబడినది. కావున ఆత్మను గూర్చి, ఇంతకు ముందు చెప్పబడినదని అర్థము మరియు "సత్యసంకల్పః" అనిన తరువాత వెంటనే "సోఽన్వేష్టవ్యః" అని ఈ అట్టి ఆత్మయే వెతుకదగినది అని కూడ చెప్పినందున ఇది ఉపన్యాసము.

**2. విధి –** విధి అంటే క్రియాప్రవృత్తిని చెప్పే వాక్యము.

"స తత్రపర్యేతి జక్షత్ క్రీడన్రమమాణః" – (ఛాం.ఉ. VIII-12-3)

"భుజిస్తూ, క్రీడిస్తూ, రమిస్తూ కూడా ఆ జీవుడు బ్రహ్మమందే నిలుస్తాడు. వానికి అన్ని లోకాల్లోనూ స్వేచ్ఛా సంచారము వుంటుంది" ఇది విధి.

**3. వ్యపదేశము –** ఉపదేశము, విధి కానిది వ్యపదేశము.

"సర్వజ్ఞః, సర్వేశ్వరః" మొదలైనవన్నీ వ్యపదేశాలు. ఇది ఇంతకు ముందు తెలియని విషయము కాబట్టి ఉపన్యాసము కాదు. కొత్త కార్యాలు చెప్పటము లేదు. కనుక విధి కాదు. తెలియనిదానిని తెలియచేయటము వ్యపదేశము.

ఈ విధముగా ఉపన్యాసము, విధి, వ్యపదేశము అనే వాటి వలన బ్రహ్మ సగుణుడు అన్నారు. కాబట్టి ముక్త పురుషుడు కూడా సగుణుడే అని జైమిని అభిప్రాయము.

ఇంకా ఇదే విచారధార ఇలా వుంది.
“యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం,
కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్ ।
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ,
నిరంజనం పరమం సామ్యముపైతి దివ్యమ్” (ముం.ఉ. III–1–3)

“తేజస్వరూపుడై సృష్టికర్తకు గూడ కారణభూతుడైన ఆ పరమాత్మను విద్వాంసుడు ఎప్పుడు దర్శించుచున్నాడో అప్పుడా బ్రహ్మజ్ఞాని పుణ్యపాపముల నుండి ముక్తుడై, నిరంజనుడై, సర్వోత్తమమైన ఆ సమానస్థితిని పొందుచున్నాడు”

మరియు
“పరంజ్యోతి రుపసంపద్యతే,
స్వేన రూపేణాభినిష్పద్య ఏష ఆత్మా ” (ఛాం.ఉ. VIII–3–4)
“పరంజ్యోతియైన పరమధామము పొంది అక్కడ అతడు తన స్వరూపములో సంపన్నుడు అగును అదియే ఆత్మ”
భగవద్గీతలో
“ఇదం జ్ఞానముపాశ్రిత్య,
మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేపి నో పజాయంతి,
ప్రలయేనవ్యథంతి చ” (భ.గీ. XIV–2)
“ఈ జ్ఞానము నాశ్రయించి నా సాధర్మ్యమును పొందుదురు. సృష్టి సమయమున జనించరు, ప్రలయమున నశించరు”

**ఈ రీతిగా శ్రుతి స్మృతుల ప్రకారము ఉపాసకుడు ఆ పరమాత్మతో సదృశమైన దివ్యస్వరూపముతో సంపన్నుడగును.**

(ఛాం.ఉ. VIII–7–1, VIII–12–3, ముం.ఉ. III–1–3, ఛాం.ఉ. XVIII–3–4, భ.గీ. XIV–2)

## (539) IV-4-6

**సూ. చితి తన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః**

**క్ర. చితి తన్మాత్రేణ, తదాత్మకత్వాత్, ఇతి, ఔడులోమిః**

ప్ర.అ. చితితన్మాత్రేణ = **కేవల చేతనా మాత్ర స్వరూపముతో నుండును,** తదాత్మకత్వాత్ = **వాస్తవరూపము అట్లే వుండుట వలన,** ఇతి = **అని,** ఔడులోమిః = **ఔడులోమి ఆచార్యులు చెప్పుచున్నారు.**

**వి. జీవుడు చైతన్యరూపుడు కాబట్టి ముక్తపురుషుడు కేవలము చైతన్య స్వరూపములో వుంటాడని**

# ముక్త పురుషుని స్థితి

| సగుణ<br>దివ్య స్వరూపము | కేవల<br>చేతనామాత్ర స్వరూపము |
|---|---|
| జైమిని ఆచార్యుల<br>అభిమతము | ఔడులోమి ఆచార్యుల<br>అభిమతము |

సంకల్పానుసారము
సగుణ దివ్య స్వరూపము,
కేవల చేతనామాత్ర స్వరూపము
మరియు రెండు స్వరూపములు
అను మూడు విధముల వుండగలుగునని
సగుణము ⟵ బాదరాయణ ఆచార్యుల అభిమతము ⟶ కేవల చైతన్యము

బ్ర.సూ. (538) IV-4-5, (539) IV-4-6, (540) IV-4-7

**ఔడులోమి ఆచార్యుని అభిప్రాయము.**

"సత్యం జ్ఞానమ్ అనంతం బ్రహ్మ" (తై.ఉ. II-1)

"సత్యము, జ్ఞానము, అనంతము అయివున్నది బ్రహ్మము"

"ఏవం వా అంతరే అయమాత్మా అనంతరో అబాహ్యో కృత్స్న ప్రజ్ఞాన ఘనః ఏవ"
(బృ.ఉ. IV-5-13)

"మైత్రేయీ ! ఈ ఆత్మ అనేది బాహ్యాంభంతర భేదాలులేనిది, సంపూర్ణమైనది ప్రజ్ఞాన ఘనమైనది"

"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముం.ఉ.III-2-1)

"బ్రహ్మవేత్త బ్రహ్మయే అవుతాడు."

"తరతి శోక మాత్మవిత్" - (ఛాం.ఉ.VII-1-3)

"ఆత్మవేత్త శోకాన్ని తరిస్తాడు."

శ్రుతుల ప్రకారము బ్రహ్మ చైతన్య స్వరూపుడైనందున అతనిని పొందే ముక్తపురుషుడు కూడా చైతన్య స్వరూపుడుయే అయి వుంటాడు అని ఔడులోమి ఆచార్యుని అభిమతము.

సత్యకామ, సత్యసంకల్పత్వాదులు ఉపాధి సంబంధముకలవి. చైతన్య భూతాలు కావు.

"జక్షత్క్రీడన్రమమాణః" (ఛాం.ఉ. VII-12-3)

"భుజిస్తూ, క్రీడిస్తూ, రమిస్తూ కూడా ఆ జీవుడు బ్రహ్మయందే నిలుస్తాడు. వానికి అన్ని లోకములలోనూ స్వేచ్ఛా సంచారము వుంటుంది" అన్నది కూడా దుఃఖము లేకపోవటమును సూచిస్తున్నది. అంతే! మరొకరితో కూడి జరుపబడే రతిక్రీడాదులు పరబ్రహ్మలో ఉత్పన్నముకావు. మరియు ఇవి రెండవది ఏదైనా వుంటేనే కుదురుతాయి. అద్వితీయమైన పరమాత్మ విషయములో అవి వర్తించవు. **అందువలన ముక్తుడు నిరస్తమైన సమస్త ప్రపంచము కలది, ప్రసన్నము, నిర్మలము, వర్ణనాతీతము అయిన బోధాత్మతో చైతన్యముతో అభినిష్పన్నము అవుతాడు. అభిన్నముగా వుంటాడు అని ఔడులోమి ఆచార్యుని అభిమతము.**

(తై.ఉ. II-1; బృ.ఉ. IV-5-13; ముం.ఉ. III-2-1; ఛాం.ఉ.VII-1-3, VII-12-3)

## (540) IV-4-7

సూ. **ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః**

క్ర. **ఏవం, అపి, ఉపన్యాసాత్, పూర్వభావాత్, అవిరోధం, బాదరాయణః**

ప్ర.అ. ఏవం = **ఈ ప్రకారము ఔడులోమి ఆచార్యులు, జైమిని ఆచార్యులు చెప్పిన ప్రకారము,** అపి = **కూడ,** ఉపన్యాసాత్ = **శ్రుతి యొక్క ముక్తాత్మ యొక్క స్వరూపనిరూపణము ఉండుట వలన,** పూర్వభావాత్ = **వెనుక చెప్పినదానితో,** అవిరోధమ్ = **విరోధమేమియు కలుగదు అని, బాదరాయణః = బాదరాయణుడు చెప్పుచున్నాడు.**

వి. **పారమార్థికమైన చైతన్యస్వరూపాన్ని అంగీకరించినా కూడ వ్యవహారదృష్టితో, ఉపన్యాసాదుల వల్ల**

**తెలియుచున్న వెనుకటి** బ్రాహ్మమైన ఐశ్వర్య రూపాన్ని ప్రత్యాఖ్యానం చేయలేదు. గావున విరోధములేదు అని బాదరాయణులు తలచుచున్నారు.

**జైమిని మహర్షి చెప్పినట్లు ముక్తాత్మస్వరూపము పరమాత్మతో సదృశమైనది, దివ్యగుణ సంపన్నమైనది.** ఈ విషయము శ్రుతిస్మృతులందు చెప్పబడినది. **ఔడులోమి ఆచార్యులు చెప్పినట్లు చేతనామాత్రస్వరూపముతో ఉండుటకూడ మన్నింపదగినది.** పూర్వము బ్ర.సూ.IV-4-4 (సూ.538) లో చెప్పబడినట్లు **ముక్తపురుషుడు పరమాత్మతో అభిన్నరూపము** (అవిభక్తరూపము)లో **ఉండునను వర్ణనము** కలదు. **అందుచేత ముక్తాత్మ యొక్క భావానుసారము మూడు విధములను వుండవచ్చును.**

(బ్ర.సూ. IV-4-4, సూ. 538)

## 4. సంకల్పాధికరణము (188) (పర్యంక విద్య)

## (541) IV-4-8

**సూ. సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః**

**క్ర. సంకల్పాత్, ఏవ, తు, తచ్ఛ్రుతేః**

ప్ర.అ. సంకల్పాత్ ఏవ తు = **సంకల్పము మాత్రము చేతనే పిత్రాదులు కనబడుతారు,** తచ్ఛ్రుతేః = **అట్లు వినిపించబడడము వలన**

వి. **అర్చిరాది మార్గములో బ్రహ్మలోకమును పొందిన ఉపాసకునికి భోగ్యవస్తువులను సృష్టించటము సంకల్పమాత్రము చేత సాధ్యము అవుతుందా ? లేక ప్రయత్నము చేత సాధనాంతరాలచేత సాధ్యము అవుతుందా? అనే ప్రశ్న వస్తుంది. దానికి సమాధానము ఈ సూత్రములో ఇవ్వబడుతున్నది. విద్వాంసుడు కోరినంతనే సంకల్పం చేతనే పితృదేవతలు మొదలైనవారు హాజరు అవుతారు అనే విషయము శ్రుతిలో తెలుపబడినది.**

"సయది పితృకామోభవతి, సంకల్పాదేవస్య పితరః సముత్తిష్ఠంతి" (ఛాం.ఉ. VIII-2-1)

"బ్రహ్మలోకాన్ని పొందిన విద్వాంసుడు (సగుణోపాసకుడు) భోగార్థమై పితృలోకాన్ని సంకల్పించినట్లైతే, అట్లా అనుకున్నంత మాత్రముననే పితరులు అతని దగ్గరికి వచ్చి, పిలిచి, పితృలోకభోగాలను అనుభవింప చేస్తారు". కావున బ్రహ్మలోకవాసియైన సగుణో పాసకునకు సంకల్పము మాత్రముననే భోగవస్తూత్పత్తి, వస్తుప్రాప్తి కలుగుతుంది.

"ఈ ఆత్మమనోరూపమైది, దివ్యనేత్రములతో బ్రహ్మలోకము యొక్క సమస్త భోగములను చూచుచు రమించును" (ఛాం.ఉ. VIII-12-5,6).

ఈ విధముగా శ్రుతి చెప్పుచున్నది. **దీని వలన మనస్సు ద్వారా కేవలము సంకల్పముతోనే**

**ఉపాసకునకు ఆ లోకముల దివ్యభోగములు అనుభవము కలుగును. ముక్తుని సంకల్పము సామాన్య జనుల సంకల్పము కంటే విలక్షణమైనది గావున ఆ సంకల్పబలము చేతనే పిత్రాదులు ప్రయోజనము చేకూరేవరకు సిద్ధముగా వుండటము కుదురుతుంది.**
(ఛాం.ఉ. VIII-2-1, VIII-12-5,6)

## (542) IV-4-9

**సూ. అత ఏవ చానన్యాధిపతిః**

**క్ర. అతః, ఏవ, చ, అనన్యాధిపతిః**

ప్ర.అ. అతః ఏవ = **అందువలననే,** చ = **కూడ,** అనన్యాధిపతిః = **ముక్తాత్మ బ్రహ్మ తప్ప అన్యస్వామి లేనిదిగా చెప్పబడినది.**

వి. **అటువంటి తిరుగులేని సంకల్పము వలన విద్వాంసుడు అనన్యాధిపతి అవుతున్నాడు. తనకు వేరొక ప్రభువులేనివాడు అవుతున్నాడు.** "అథ య ఇహాత్మానమనువిద్య వ్రజన్త్యేతాంశ్చ సత్యాన్ కామాన్ తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" (ఛాం.ఉ. 8-1-6)

"ఏ పురుషుడు స్వస్వరూపాన్ని తెలుసుకొని, తనయందే సర్వకామములు వున్నాయని తెలుసుకొని, పరలోకానికి పోతాడో, అటువంటి వానికి చక్రవర్తివలె సమస్త లోకాల్లోనూ స్వతంత్ర సంచారము వుంటుంది. ఇట్లు శ్రుతి అతనికి సర్వస్వాతంత్రాలను చెప్పుతున్నది. ఇంకా **"ఆప్నోతి స్వారాజ్యమ్, ఆప్నోతి మనసస్పతిం వాక్పతిశ్చక్షుస్పతిః, శ్రోత్రపతిర్విజ్ఞానపతిః, ఏతత్తతోభవతి, ఆకాశ శరీరం బ్రహ్మ, సత్యాత్మ ప్రాణారామం, మన ఆనందం, శాంతి సమృద్ధమమృతం, ఇతి ప్రాచీనయోగ్యోపాస్వ్వాయావమృతమేకం చ॥** 2 (తై.ఉ. I-6)

"విద్వాంసుడు స్వరాడ్భావమును పొందుచున్నాడు. ఇట్లు పొంది సర్వస్వరూపుడగుట వలన సర్వమనస్సులకు అధిపత్యమును పొందుచున్నాడు. అట్టివాడు సర్వవాక్కులకు ప్రభువును అగుచున్నాడు. ఇదేకాదు, అతనికి అంతకంటే అధికమైన స్వరూపమునగుచున్నాడు. ఆకాశమువలెనే సూక్ష్మశరీరము కలిగి సర్వవ్యాపకమైనదియును, సర్వప్రాణములును క్రీడాస్థానము గలదియును, సుఖకరమగు మనస్సే ఆనందముగా కలదియును శాంతిచేత సమృద్ధమైనదియును మరణములేనిదియుననగు పరబ్రహ్మ స్వరూపముననగుచున్నాడు. కనుక ప్రాచీనయోగ్యుడా! నీవు అట్టి పరబ్రహ్మమును ధ్యానించుము"

**అందువలన ముక్తుడు మనస్సు మాత్రముచేతనే సర్వదివ్య భోగములను పొందును అని** (బ్ర.సూ. IV-4-8) **లో చెప్పబడినది. అట్టు ముక్తుడు స్వస్వామి స్వారాట్టు"**
(ఛాం.ఉ. 8-1-6, తై.ఉ. I-6)

## 5. అభావాధికరణము (189)

## (543) IV-4-10

**సూ. అభావం బాదరిరాహ హ్యేవమ్**

**క్ర. అభావం, బాదరిః, ఆహ, హి, ఏవమ్**

ప్ర.అ. అభావం = **ముక్తాత్మకు శరీరము వుండదని అనినారు,** బాదరిః = **ఆచార్య బాదరి అనినారు,** హి = **ఎందుకనగా,** ఏవం = **ఇట్లు,** ఆహ = **శ్రుతి చెప్పినది.**

వి. **విద్వాంసునికి అక్కడ శరీరము వుండదు. (అంటే స్థూల శరీరము వుండదు) అని బాదరి ఆచార్యుల అభిప్రాయము. ఎందుకు అంటే శ్రుతిలో చెప్పబడినది కనుక? కావున అతడు అచట శరీరము లేక మనసుతోనే ఆ భోగములను అనుభవించును.**

"అథ యో వేదం మన్వానీతి,
స ఆత్మామనో అస్యదైవం
చక్షుః సవా ఏష ఏతేన
దైవేన చక్షుషా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే,
యఏతే బ్రహ్మలోకే తం వా ఏతం
దేవా ఆత్మానముపాసతే, తస్మాదేషాం
సర్వే చ లోకా అత్తా, స్సర్వే చ కామాన్సర్వాంశ్చ
లోకానాప్నోతి, సర్వాంశ్చ కామాన్యస్త
మాత్మానమనువిద్య, విజానాతీతి,
హ ప్రజాపతి రువాచ, ప్రజాపతిరువాచ" (ఛాం.ఉ.VIII-12-5,6)

**"నేను మననము చేయగలననునదే ఆత్మ, మనస్సు దానిదైవమయమగు నేత్రమైయున్నది. దైవికమగు నేత్రమైన మనస్సుచే, కామ్య పదార్థముల తెలిసికొని ఆనందించును. బ్రహ్మలోకములో నివాసించువారు, దేవతలు, ఈ ఆత్మను గురించి ఉపాసన చేయుచున్నారు. అందువలన వారు అన్నిలోకములను, అన్నివాంఛలను పొందకలుగుచున్నారు. ఈ ఆత్మ తత్వమును తెలిసికొని సర్వవాంఛలను, సర్వవాంఛలను, సర్వలోకములను పొందుచున్నారు" అని ప్రజాపతి ఇంద్రునకు బోధించెను.**

**ఈ విధముగా ఉపాసకునికి మనస్సుకంటే భిన్నమైన శరీరము, ఇంద్రియములు లేవు అని తెలుస్తున్నది.**

(ఛాం.ఉ.VIII-12-5,6)

## (544) IV-4-11

సూ. **భావం జైమినిర్వికల్పామననాత్**

క్ర. **భావం, జైమినిః వికల్పామననాత్**

ప్ర.అ. భావమ్ = **శరీరేంద్రియాల ఉనికిని,** జైమిని = **జైమిని ఆచార్యులు అంగీకరిస్తూన్నా,** వికల్పామననాత్ = **శాస్త్రములో వికల్పాలు చెప్పటము వలన**

వి. **ఆచార్యులైన జైమిని మహర్షి అయితే ముక్తునికి మనస్సువలె, శరీరము, ఇంద్రియాలూ కూడా వుంటాయని అనుకుంటున్నారు ఎందువల్లనంటే ఛాందోగ్యపషత్తులో భూమవిద్య- (బ్రహ్మవిద్య)లో "స**

# ముక్తాత్మస్థితి

| | |
|---|---|
| శరీరము వుండును<br>అనేక రూపములు వుండును | శరీరము వుండదు<br>మనస్సుయే వుండును |
| జైమిని ఆచార్యుల<br>అభిమతము | బాదరి ఆచార్యుల అభిమతము |
| రెండు విధముల<br>శరీరముతో కూడి మరియు శరీరము లేక మనస్సుతోనే<br>దివ్య భోగములననుభవించగల్గును<br>అని బాదరాయణ ఆచార్యుల అభిమతము<br>శరీరము ⟵ ⟶ కేవల మనస్సు | |

బ్ర.సూ. (543) IV-4-10, (544) IV-4-11, (545) IV-4-12

**ఏకధా భవతి, త్రిధాభవతి, పంచధా భవతి, సప్తధా భవతి, నవధా చైవ, పునశ్చైకాదశః స్మృతః"** (ఛాం.ఉ. VII-26-2)

**"ఆ ఆత్మ(బ్రహ్మము) ఒకటియై, మూడై, ఐదై, ఏడై, తొమ్మిదియై, పదునొకొండుయై అనేకమైయున్నది"**

ఈ విధముగా ముక్తుని విషయములో అనేక రూపాలుగా వుండడాన్ని వికల్పముగా చెపుతున్నారు. శరీర బేధము లేకుండా అనేక విధాలుగా వుండటము కుదరదు. అనేకధా భావాన్ని గూర్చిన ఈ వికల్పము నిర్గుణమైన భూమ విద్యలో చెప్పబడిన కూడా సగుణావస్థలో ఉన్న ఈ ఐశ్వర్యాన్నే భూమావిద్యాస్తుతి కోసం అక్కడ చెప్పటము జరిగినది. కావున అది సగుణ విద్యా ఫలముగా ఇక్కడ గ్రహించ బడుతున్నది అని చెప్పబడినది. అంటే శరీరముతో కూడుకొని యున్నది అని అర్థము **అట్లు కానిచో శ్రుతిలో చెప్పబడుట అసంగతము.** (ఛాం.ఉ. VII-26-2)

## (545) IV-4-12

**సూ. ద్వాదశాహవదుభయవిధం బాదారాయణోऽతః**

**క్ర. ద్వాదశాహవత్, ఉభయవిధం, బాదరాయణః, అతః**

ప్ర.అ. ద్వాదశాహవత్ = **ద్వాదశాహయజ్ఞమువలె (12 దినముల యజ్ఞమువలె),** ఉభయవిధం = **రెండు తీర్ల వుండటాన్ని అంగీకరిస్తున్నారు,** బాదరాయణః = **ఆచార్యబాదరాయణులు,** అతః = **అందువల్లనే**

వి. **బాదరాయణ మహర్షి, బాదరిఆచార్యులు మరియు జైమిని ఆచార్యులు ఇద్దరూ చెప్పినది ప్రమాణయుక్తమే అని అనినారు.** అందువలన ఉపాసకుని సంకల్పానుసారము శరీరము వుండుట లేకుండుట రెండునూ సంభవమే, శ్రుతియందు చెప్పబడిన ద్వాదశాహ యజ్ఞమునందు అనేక కర్తృకమయినచో సత్రమనియు మరియు నియంత్ర కర్తృకము అయితే అహీనము అనియు చెప్పబడినది.అట్లే ఇక్కడ కూడ రెండు ప్రకారములైన కథనములుండుట వలన **ముకాత్మ స్థూలశరీరముతో గూడి దివ్యభోగములనుభవించుటము, శరీరములో కూడక కేవలము మనస్సుతో ఆ భోగములను అనుభవించుటము కూడ సంభవమే. ముక్తాత్మకు రెండు ప్రకారముల స్థితియు ఉచితము. ఇందులో విరోధములేదు.**

## (546) IV-4-13

**సూ. తన్వభావే సంధ్యవదుపపత్తేః**

**క్ర. తనుఅభావే, సంధ్యవత్, ఉపపత్తేః**

ప్ర.అ. తనుఅభావే = **శరీరములేనపుడు,** సంధ్యవత్ = **స్వప్నమువలె భోగాను భావముండును,** ఉపపత్తేః = **ఇట్లు మన్నించుటయే సమంజసము**

వి. **ఎట్లు స్వప్న కాలమందు శరీరము లేకుండ మనస్సులో సమస్త భోగములను అనుభవించుట చూచుచున్నామో, అట్లే బ్రహ్మలోకమందు కూడ శరీరము లేకుండా సమస్త దివ్యభోగములను అనుభవించుట సంభవము.** అందువలన బాదరి ఆచార్యులు అట్లు మన్నించుట ఉచితమే. అదేరీతిగా ఎట్లు మనష్యుడు జాగ్రదవస్థలో శారీరకముగా, **స్వప్నావస్థలో మానసికముగా భోగములను భావించగలడో, అట్లే ముక్తుడు శారీరకముగా మరియు మానసికముగా దివ్యభోగములనుభవిస్తాడని బాదారాయణుడు మన్నించుట కూడ ఉచితమే.**

## (547) IV-4-14

**సూ. భావే జాగ్రద్వత్**

**క్ర. భావే, జాగ్రద్వత్**

ప్ర.అ. భావే = **శరీరము వున్నపుదు,** జాగ్రద్వత్ = **జాగృదవస్థవలె అనుభవముండుట యుక్తి సంగతము**

వి. **జైమిని మతానుసారము ముక్తాత్మకు శరీరోపలబ్ధి కలుగును. అది దాని ద్వారా అదే ప్రకారము ఆ భోగములను భవించును.** జాగ్రదవస్థయందు సాధారణ మనుష్యుడు విషయానుభవము పొందినట్లుండును. బ్రహ్మలోకముననట్లు వుండటము సంభవమే. **అందుచేత రెండు ప్రకారములైన స్థితిని మన్నించుటలో ఆపత్తిలేదు.**

## 6. ప్రదీపాధికరణము (190) (పర్యంక విద్య)

## (548) IV-4-15

**సూ. ప్రదీపవదావేశస్తథా హి దర్శయతి**

**క్ర. ప్రదీపవత్, ఆవేశః, తథా, హి, దర్శయతి**

ప్ర.అ. ప్రదీపవత్ = **దీపమువలె,** ఆవేశః = **సమస్త శరీరములయందు, ముక్తాత్మ యొక్క ప్రదేశము కాగలదు,** హి = **ఎందుకనగా,** తథా దర్శయతి = **శ్రుతిలో అట్లున్నది**

వి. **ఎట్లు అనేక దీపములయందు ఒకే అగ్ని ప్రకాశించుచున్నదో, అదే ప్రకారము ఒక ముక్తాత్మ తన సంకల్పము చేత రచింపబడిన సమస్త శరీరములందు ప్రవేశించి, దివ్యలోక భోగములను భవించగలదు.** ఎందుచేతననగా శ్రుతియందు ఆ ఒక్కటే అనేక రూపముల పొందుట కనిపించుచున్నది.

"సః ఏకధా భవతి, త్రిధా భవతి, పంచధా, సప్తధా, నవధా, చైవ పునశ్చైకాదశః స్మృతః, శతం చ, దశ చైకశ్చ, సహస్రాణి చ విగ్ంశతిః, ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః, స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః, తస్మై మృదితకషాయాయ, తమసః పారం దర్శయతి, భగవాన్ సనత్కుమారః తగ్ం స్కందః ఇత్యాచక్షతే, తగ్ం స్కందః ఇత్యాచక్షతే ॥" (ఛాం.ఉ. VII-16-2)

"ఆ ఆత్మ ఒకటియై, మూడై............ తొమ్మిదియై, పదునొకండుయై అనేకమై వున్నది."

**కావున ఒక ముక్తాత్మ, ఒకే అగ్ని అనేక దీపములలో ఒకేసారి వున్నట్లు అనేక శరీరములలో ఒకేసారి వుండుట సంభవము.**

(ఛాం.ఉ. VII-16-2)

## (549) IV-4-16

**సూ. స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హి**

**క్ర. స్వాప్యయసంపత్త్యోః, అన్యతరాపేక్షమ్, ఆవిష్కృతం, హి**

ప్ర.అ. స్వాప్యయసంపత్త్యోః = **సుషుప్తి పరమముక్తులలో,** పరబ్రహ్మప్రాప్తి = **ఈ రెండింటి నుండి,** అన్యతరాపేక్షితం = **ఏదో ఒకదాని అపేక్ష చెప్పబడిన వచనమిది,** హి = **ఎందుకనగా,** ఆవిష్కృతమ్ = **శ్రుతి ఈ మాట స్పష్టముగా చెప్పినది.**

వి. **శ్రుతియందు, ఏవిధమైన జ్ఞానము లేకుండా సముద్రమందు నదులవలె ఆ పరమాత్మయందు మిళితమగుట చెప్పబడినది.** ఆ కార్యము బ్రహ్మలోకము పొందువారి విషయమున కాదు. కాని లయావస్థకు సంబంధించి చెప్పబడినది. ప్రళయకాలమందు కూడ ప్రాణులస్థితి సుషుప్తివలెనుండును. పరబ్రహ్మ ప్రాప్తి ముక్తిని గ్రహించి చెప్పబడినది. అంటే లయావస్థ సాయుజ్యయుక్తి ఈ రెంటిలో ఏదో ఒక దానిని ఉద్దేశించి అట్లు చెప్పబడినది. **ఎందుకంటే బ్రహ్మలోకమునకు పోవు అధికారుల కొరకు స్పష్టముగా అక్కడ దివ్య భోగానుభవము, అనేక శరీరభరణము మరియు యథేచ్ఛగా లోకములలో చరించుట కూడా శ్రుతియందు ఆయాచోట్ల చెప్పబడినది. కావున ఎట్టి విరోధములేదు.**

## 7. జగద్వ్యాపారాధికరణము (191) (ఈశ విద్య)

## (550) IV-4-17

సూ. **జగద్వ్యాపార వర్జం ప్రకరణాదసన్నిహిత్వాచ్చ**

క్ర. **జగద్వ్యాపారవర్జం, ప్రకరణాత్, అసన్నిహితత్వాత్, చ**

ప్ర.అ. జగద్వ్యాపారవర్జం = **జగత్తు యొక్క రచన మొదలైన వ్యాపారములు విడచిగూడ సామర్థ్యమున్నది,** ప్రకరణాత్ = **ప్రకరణమునుబట్టి,** చ = ఇంకను, అసన్నిహతత్వాత్ = **జగద్రచనాది వ్యాపారముతో దీనికి (ముక్తాత్మకు) ఎట్టి సంబంధము కన్పించదు. అందుచే కూడ అదే మాట సిద్ధించును.**

వి. **ఎక్కడెక్కడ ఈ జడ చేతనాత్మకమగు ఈ సమస్త జగత్తు యొక్క ఉత్పత్తి, సంచలనము, లయము గూర్చి శ్రుతియందు వచ్చునో అక్కడక్కడ ఈ కార్యము పరబ్రహ్మకే చెప్పబడినది.** (జన్మాదస్య యతః) (బ్ర.సూ.I-1-2-1) **బ్రహ్మలోకమును పొందిన ముక్తాత్మలకు ఈ సృష్టి, స్థితి, లయ కార్యములో సంబంధము ఎక్కడ కూడ చెప్పబడలేదు.** ఈ రెండు కారణముల వలన ఇదియే సిద్ధించును. ఈ జడ చేతనాత్మకమైన సమస్త జగత్తు యొక్క రచన, సంచలనము ప్రళయము మొదలైన కార్యములన్నిటియందు యుక్తాత్మలకు ఎట్టి ప్రమేయముకాని, సామర్థ్యము కానిలేదు. వారు కేవలము అక్కడి దివ్యభోగములను యథేష్టముగా అనుభవించుటకు సమర్థులు. (బ్ర.సూ.I-1-2-1)

## (551) IV-4-18

సూ. **ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారికమండలస్థోక్తేః**

క్ర. **ప్రత్యక్షోపదేశాత్, ఇతి, చేత్, న, ఆధికారికమండలస్థోక్తేః**

ప్ర.అ. ప్రత్యక్షోపదేశాత్ ఇతి చేత్ = **ప్రత్యక్షముగా శ్రుతిలో చెప్పటము వలన ముక్తాత్మల ఐశ్వర్యము నిరంకుశమైనది అని అనిన,** న = **అట్లుకాదు,** ఆధికారికమండలస్థోక్తేః = **అధికారికమైన సూర్య మండలములో వున్న వానిని గూర్చి చెప్పటము వలన**

వి. "ఆప్నోతి స్వారాజ్యం" (తై.ఉ. I-6-2)
"అతడు స్వారాజ్యాన్ని పొందుతాడు" అనీ
"ఆప్నోతి మనసస్పతిమ్" (తై.ఉ. I-6-2)
"అతడు మనస్సుకు అధిపతియైన బ్రహ్మను పొందుతాడు" అనీ
"సర్వేஉస్మైదేవా బలిమావహంతి" (తై.ఉ. I-5-3)
"దేవతలందరు అతనికి బలిని తీసుకోవస్తారు" అనీ
"తేషాం సర్వేషులోకేషు కామచారో భవతి" (ఛాం.ఉ. VIII-1-6)

"ఆత్మవేత్తలైన వారికి అన్ని లోకాల్లోనూ యథెచ్ఛా సంచారం లభిస్తుంది" అనీ శ్రుతులు ప్రత్యక్షోప దేశము చేస్తున్నాయి. కావున **విద్వాంసునికి ఈశ్వరునితో సమానమైన ఐశ్వర్యము మాత్రము కలుగుతున్నది. అయితే జగద్వ్యాపారము - జగద్కర్తృత్వము కూడా కలుగుతుంది అని అనటము యుక్తముకాదు.** వీరికి వుండే స్వారాజ్యాదికము అంతా అధికార బ్రహ్మమండలము మీద అధికారముగల బ్రహ్మదే తప్ప వీరిది మాత్రముకాదు. వీరంతా బ్రహ్మలోకములో వుండేవారు కావున బ్రహ్మలోకాధిపతి బ్రహ్మమే! వీరికున్న స్వాతంత్ర్యము అంతా ఆనిత్యసిద్ధుడైన ఈశ్వరునికి లోబడినదే. కావున ఉపాసకులకు లోకసృష్టి చేసే సామర్థ్యములేదు. (తై.ఉ. I-6-2, తై.ఉ. I-5-3, ఛాం.ఉ. VIII-1-3, ఛాం.ఉ. VIII-1-6)

[**నారాయణ వాక్యము**-ముక్తపురుషులు బ్రహ్మసమానులే (ఐశ్వర్యములో) కాని బ్రహ్మకాదు.
"జన్మాద్యస్యయతః" అనునది వీరికి వర్తించదు.
వీరు బ్రహ్మలోకములో, బ్రహ్మవలె వుండి, బ్రహ్మ సమానులు కాని బ్రహ్మ కారు.]

(తై.ఉ. I-6-2, తై.ఉ. I-5-3, ఛాం.ఉ. VIII-1-3, ఛాం.ఉ. VIII-1-6)

## (552) IV-4-19

**సూ. వికారావర్తి చ తథా హిస్థితిమాహ**

**క్ర. వికారావర్తి, చ, తథా, హి, స్థితిమ్, ఆహ**

ప్ర.అ. వికారావర్తి = **ముక్తాత్మ జన్మాది వికారరహితమై ఫలమును అనుభవించును,** చ = **ఇంకను,** తథా = **ఆ ప్రకారమైన,** హి = **ఎందుకనగా,** స్థితిమ్ = **స్థితిని గూర్చి,** ఆహ = **శ్రుతి చెప్పినది.**

వి. శ్రుతిలో బ్రహ్మ విద్యకు ఫలము పరబ్రహ్మ ప్రాప్తి చెప్పబడినది.
"ఏష ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యుః విశోకో విజిఘత్సోஉపిపాసః సత్యకామః సత్యసంకల్పః" (ఛాం.ఉ.VIII-1-5)

"ఈ ఆత్మ పాపరహితమైనది. దానికి జర, మరణము, దుఃఖము, ఆకలి, దప్పి ఏమియులేవు. అది సత్యసంకల్పము. సత్యకామము అయివున్నది." అందుచేత ముక్తాత్మకు ప్రాప్తమగు ఫలము కర్మఫలమువలె వికారములులేనిది. బ్రహ్మలోక భోగము అను షంగికము. బ్రహ్మవిద్యకు సార్ధకత బ్రహ్మప్రాప్తియందు కలదు. ముక్తాత్మాస్థితి ఇట్లు చెప్పబడినది.

"యదా హ్యేవైష ఏతస్మిన్, అదృశ్యే అనాత్మ్యే అనిరుక్తే అనిలయనే అభయం, ప్రతిష్ఠాం విందతే। అథసో అభయం గతోభవతి" (తై.ఉ. II-7)

"ఎప్పుడును జీవాత్మ కనబడనిది, శరీరరహితమైనది, చెప్పశక్యము కానిది, నిరాధారము, పరబ్రహ్మయందు నిర్భయపూర్వక స్థితిని పొందునది. అందుకు దానికి అభయపదము ప్రాప్తమగును"

**పరమేశ్వరునిలో సగుణ-నిర్గుణరూపాలు రెండూ వున్నాయి (వికారము-నిర్వికారము రెండూ వున్నాయి)**

**ఆ పరమేశ్వరుని నిర్గుణ రూపాన్ని సగుణోపాసకులు పొందలేరు. అలాగే సగుణస్వరూపములోని నిత్యసిద్ధేశ్వర, జగత్సృష్టి సామర్థ్యాన్ని కూడా పొందలేరు.**

(ఛాం.ఉ. VIII-1-5; తై.ఉ. II-7)

## (553) IV-4-20

**సూ. దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే**

**క్ర. దర్శయతః, చ, ఏవం, ప్రత్యక్షానుమానే**

ప్ర.అ. దర్శయతః = **చూపుచున్నవి,** చ = **కూడ,** ఏవం = **ఈ విధముగా,** ప్రత్యక్షానుమానే = **శ్రుతులు, స్మృతులు**

వి. **శ్రుతులు, స్మృతులు ఈ విధముగా పరమేశ్వరుని వికారరాహిత్యాన్ని చూపుతున్నాయి.** శ్రుతిలో స్పష్టముగా ఇలా చెప్పబడినది.

"పరంజ్యోతి రుపసంపద్య, స్వేనరూపేణ అభినిష్పద్యతే।
ఏష ఆత్మేతిహోవాచ, ఏతదమృతం అభయం, ఏతద్బ్రహ్మేతి" (ఛాం.ఉ. VIII-3-4)

"ముక్తాత్మ పరమజ్యోతిస్సును పొందును. తన వాస్తవిక స్వరూపముతో సంపన్నమగును అది ఆత్మ. అది అమృతము అదియే బ్రహ్మ."

బ్రహ్మలోకము, అన్యలోకములలోవలె వికారసహితము కాదు. వికారములులేనిది అది సత్యము, సమస్త పాపరహితము, రజోగుణాదులులేనిది, విశుద్ధము అని చెప్పబడినది.

భగవద్గీతలో కూడ ఇలా చెప్పబడినది.

"ఇదం జ్ఞానముపాశ్రిత్య, మమసాధర్మ్యమాగతాః ।
సర్గేపినోపజాయంతే, ప్రలయే న వ్యథంతి చ" (భ.గీ. XIV-2)

"ఇట్టి జ్ఞానమును ఉపాశ్రించిన వారు నా స్వరూపమును పొందిరి. వారు సృష్టికాలమున

జన్మించరు, ప్రళయకాలమున నశింపరు" **ఈ ప్రకారము ముక్తాత్మ యొక్క స్థితి చెప్పబడినది. మరియు ఆయాలోకములకు పోవుట వచ్చుట అక్కడ భోగములు అనుభవించుట లీలామాత్రము. అవి బంధన కారకములు పునర్జన్మకారకములు కావు.**
(ఛాం.ఉ. VIII-3-4; భ.గీ. XIV-2)

## (554) IV-4-21

సూ. **భోగమాత్రసామ్యలింగాచ్చ**

క్ర. **భోగమాత్రసామ్యలింగాత్, చ**

ప్ర.అ. భోగమాత్రసామ్యలింగాత్ = **భోగమాత్రమున సమతారూప లక్షణము వలన,** చ = **కూడ ముక్తాత్మకు జగద్రచనాద్యధికారము లేదని సిద్ధించుచున్నది.**

వి. **ఏవిధముగా ఆ బ్రహ్మ సమస్త దివ్యకల్యాణమయభోగముల యొక్క అనుభవము కలిగియున్నను, దానిచే లిప్తముకాదో, అదే ప్రకారము ఆ ముక్తాత్మకూడా ఆ బ్రహ్మలోకమందు ఉపాసనాకాలమున కలిగిన భావనానుసారము ప్రాప్తమైన దివ్యభోగములను, శరీరము లేకుండా స్వప్నమువలె కేవలము సంకల్పము చేతగాని, శరీరధారణ పూర్వకమైన జాగృతియందువలె అనుభవము పొందినను వానిచే లిప్తముకాదు.** ఈ ప్రకారము భోగమాత్రమందు బ్రహ్మతో దానికి సమానత కలదు. **ఈ లక్షణము చేత గూడ జగద్రచనాది కార్యమందు ఏ అంశమందు కూడ అధికారముగాని సామర్థ్యముగాని లేదు.**

## (555) IV-4-22 (శ్రీమన్-న్యాస విద్య)

సూ. **అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్**

క్ర. **అనావృత్తిః, శబ్దాత్, అనావృత్తిః, శబ్దాత్**

ప్ర.అ. అనావృత్తిః = **పునరాగమనము లేదు,** శబ్దాత్ = **ఇది శ్రుతి వచనము వలన తెలియుచున్నది,** అనావృత్తిః = **పునరాగమనము లేదు,** శబ్దాత్ = **శ్రుతివచనము వలన తెలియుచున్నది.**

వి. **ఉపనిషత్తులలో బ్రహ్మలోకమునకు పోయిన ఉపాసకుడు, సాధకుడు తిరిగిరాడు అని చెప్పబడినది.**
"తేషాం న పునరావృత్తిః" (బృ.ఉ. VI-2-15) "అట్టి వారికి పునరావృత్తిలేదు" (తిరిగి రాకలేదు)
"ఏత స్మాన్నపునరావర్తంతే" (ప్ర.ఉ. I-10)
"దీని నుండి తిరిగి మరల జన్మించరు"
"తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" (ఛాం.ఉ. VIII-6-6)
"ఆద్వారములో పోవువాడు అమృతస్వరూపుడగును"
"బ్రహ్మలోకమభిసంపద్యతే న పునరావర్తతే-(ఛాం.ఉ. VIII-15-1)
బ్రహ్మలోకమును బాగుగా పొందును. అతనికి పునరావర్తనము, తిరిగిరాక లేదు.
(బ్ర.సూ. (527) IV-3-10) లో (కార్యాత్యయే తదధ్యక్షేణ, సహాతః పర మభిధానాత్) చెప్పబడినట్లుగా **సగుణోపాసకులు కార్యబ్రహ్మకు ప్రళయకాలము సమీపించినపుడు జ్ఞానంవుదయించి**

# ముక్తాత్మస్థితి

| |
|---|
| ముక్తాత్మ అగ్ని అనేక దీపములలో ఒకేసారి వున్నట్లు<br>ఒకేసారి అనేక శరీరములలో వుండగల్గును |
| బ్రహ్మలోకమును పొందిన ముక్తాత్మలకు<br>ఈ సృష్టి, స్థితి, లయ కార్యముల అధికారము, సంబంధము లేదు.<br><br>ఈ సమస్త జగత్తు యొక్క ఉత్పత్తి, సంచలనము, లయము<br>పరబ్రహ్మము యొక్క కార్యములే.<br><br>బ్రహ్మజ్ఞాని విదేహముక్తిని అంది పరబ్రహ్మము అవుతాడు. |

బ్ర.సూ. (548) IV-4-15, (549) IV-4-16, (550) IV-4-17, (554) IV-4-21, (555) IV-4-22

**ఆ కార్యబ్రహ్మతోపాటు, పరబ్రహ్మ స్వరూపమును పొందుతారు. నిర్గుణజ్ఞాన సంపన్నులైనవారికి ఆవృత్తి లేనే లేదు. ఆవృత్తిలేనే లేదు.** (బృ.ఉ. VI-2-15; ప్ర.ఉ. I-10; ఛాం.ఉ. VIII-6-6; VIII-15-1) (బ్ర.సూ. IV-3-10, 527)

ఇట్లు

## శ్రీ బాదరాణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి

**చతుర్థ అధ్యాయము**

**శుభము శుభము శుభము**



# చతుర్థాధ్యాయ చతుర్థ పాద సమాసము

## విదేహముక్తి

**1. సంపద్యావిర్భావాధికరణము**

స్వప్రకాశమైన ఆత్మసాక్షాత్కారాన్నిపొంది, ఆ ఆత్మరూపములో విద్వాంసుడు ఆవిర్భూతుడు అవుతాడు. "స్వ"రూపములో వుంటాడు. బ్రహ్మస్వరూపము వంటి జీవుడు తానెయైన నిజస్వరూపములో వుండుటయే ముక్తి. అజ్ఞాన నివృత్తికాగానే స్వరూపావిర్భావము అవుతుంది. కాబట్టి ముక్తి అనేది వచ్చినది కాదు, పుట్టినది కాదు. ముక్తి అనేది మొదలే వున్నది. వున్నదని తెలియకపోవటము అజ్ఞానము. ముక్తియే తన స్వభావము అని తెలియటము జ్ఞానము. పరంజ్యోతిలో వున్న జ్యోతి శబ్దానికి ఆత్మ అని అర్థము.

**2. అవిభాగేన దృష్టత్వాధికరణము**

ముక్తాత్మయొక్క స్థితి పరమాత్మయందు అవిభక్తరూపముకులోనైనది. జ్ఞానియొక్క ఆత్మలో, పరమాత్మలో ఏ విభాగమూ వుండదు.

**3. బ్రహ్మాధికరణము**

ముక్తుడు బ్రహ్మసంబంధమైన తనరూపములో కలుస్తాడు అని జైమిని మహర్షి అభిమతము. ముక్తపురుషుడు సగుణుడు అని ఆయన మతము. శ్రుతి, స్మృతుల ప్రకారము ఉపాసకుడు ఆ పరబ్రహ్మతో సదృశమైన దివ్యస్వరూపముతో సంపన్నుడు అగును. ఔడులోమిఆచార్యుని ప్రకారము ముక్తపురుషుడు కేవలము చైతన్య స్వరూపములో వుంటాడు. ముక్తుడు నిరస్తమైన సర్వప్రపంచము కలది, ప్రసన్నము, నిర్మలము, వర్ణనాతీతము అయిన బోధాత్మతో, చైతన్యముతో నిష్పన్నము అవుతాడు, అభిన్నముగా వుంటాడు అని ఆయన అభిమతము. బాదరాయణ మహర్షి అభిప్రాయములో ముక్తపురుషుడు సగుణరూపములో ఆ పరమాత్మకు సదృశమైన దివ్యరూపములో జైమిని మహర్షి చెప్పినట్లు, కేవలము చైతన్యరూపము స్వరూపములో ఔడులోమి ఆచార్యుడు చెప్పినట్లు మరియు పరమాత్మలో అభిన్నరూపములో కూడా అంటే తన భావానుసారము సగుణ రూపములో కాని చైతన్య రూపములో తన కాని మరియు ఈ మూడు రూపముల సంకల్పానుసారము వుండగలదు.

**4. సంకల్పాధికరణము**

బ్రహ్మలోకమునకు చేరిన ఉపాసకునికి సంకల్పమాత్రముననే పితృదేవతలు మొదలైనవారు హాజరు అవుతారు. మరియు మనస్సు ద్వారానే కేవలము సంకల్పముతోనే ఆ లోకముల, దివ్యభోగముల అనుభవము కలుగును. అటువంటి తిరుగులేని సంకల్పము వలన విద్వాంసుడు అనన్యాధిపతి అవుతున్నాడు. తనకు వేరొక ప్రభువులేనివాడు అవుతున్నాడు. అతనికి సమస్త లోకాల్లోనూ స్వతంత్ర సంచారము వుంటుంది.

**5. అభావాధికరణము**

విద్వాంసునికి బ్రహ్మలోకములో శరీరము వుండదు మరియు మనసుతోనే భోగములను అనుభవించును. అతినికి మనస్సుకంటే భిన్నమైన శరీరము ఇంద్రియములు వుండవు-ఈ రీతిగా బాదరి ఆచార్యుల మతము. జైమిని ఆచార్యుల ప్రకారము ముక్తునికి శరీరము, ఇంద్రియములు కూడా వుంటాయి. బాదరాయణ ఆచార్యుల ప్రకారము ముక్తుడు సంకల్పానుసారము శరీరముతో వుండుట, లేకుండుట రెండూ సంభవము అవుతుంది. ఒకే ద్వాదశాహః క్రతువు అనేక కర్తృత్వముగా (సత్రముగా), నియతకర్తృత్వముగా (అహీనముగా) రెండు విధముల చేయవచ్చునో అదే విధముగా ముక్తుడు సంకల్పానుసారముగా శరీరముతో, శరీరము లేకుండా వుండవచ్చును. ఏవిధముగా స్వప్నములో మానసికముగా, జాగ్రదవస్థలో శారీరకముగా మనుజుడు ఈ లోకములో భోగములు అనుభవించగలడో, అదే విధముగా ముక్తుడు బ్రహ్మలోకములో భోగములు రెండు విధములుగా అనుభవించవచ్చును. ఆ రీతిగా జైమిని, బాదరి, బాదరాయణ ఆచార్యులు ముగ్గురి అభిమతము ముక్తునికి వర్తించవచ్చును.

**6. ప్రదీపాధికరణము**

ఎట్లు అనేక దీపములందు ఒకే అగ్ని ప్రకాశించుచున్నదో, అదే ప్రకారము ఒక ముక్తాత్మ తన సంకల్పముచేత రచింపబడిన సమస్త శరీరములందు ప్రవేశించి, దివ్యలోక భోగములను అనుభవించ గలదు. బ్రహ్మలోకమునకు పోవు అధికారులకు అక్కడ దివ్య భోగానుభవము, అనేక శరీరధారణ, యథేచ్ఛగా లోకముల చరించుట కూడా చెప్పబడినది కనుక విరోధము లేదు.

**7. జగద్వ్యాపారాధికరణము**

ఈ జడచేతనాత్మకమైన సమస్త జగత్తుయొక్క రచన, సంచాలనము, ప్రళయము మొదలైన కార్యములన్నింటి యందు ముక్తాత్మలకు ఎట్టి ప్రమేయము కాని సామర్థ్యముకాని లేదు. వారు కేవలము అక్కడి దివ్యభోగములననుభవించుటకు సమర్థులు. వీరికి వుండే స్వారాజ్యము, స్వాతంత్రము అంతా ఆ నిత్యసిద్ధుడైన ఈశ్వరునికి లోబడినదే. కావున ఉపాసకులకు లోకసృష్టి చేసే సామర్థ్యము వుండదు. వీరు బ్రహ్మసమానులే కాని బ్రహ్మకాదు. ముక్తాత్మకు ప్రాప్తమగు ఫలము కర్మఫలమువలె వికారములేనిది. బ్రహ్మలోక భోగములు అనుషంగికములు. బ్రహ్మవిద్యకు సార్థకత బ్రహ్మప్రాప్తి యందు కలదు. పరబ్రహ్మలో సగుణ-నిర్గుణరూపాలు రెండూ వున్నాయి. ఆ పరమేశ్వరుని నిర్గుణరూపాన్ని సగుణోపాసకులు పొందలేరు. అలాగే సగుణస్వరూపములోని నిత్యసిద్ధేశ్వర జగత్సృష్టి సామర్థ్యాన్ని కూడా పొందలేరు. బ్రహ్మలోకములు వికారములులేనిది. విశుద్ధము. జీవన్ముక్తుడు ఆయాలోకములకు పోవుట అక్కడ భోగములు అనుభవించుట కేవలము లీలామాత్రము. అవి అంటవు. అవి పునర్జన్మ కారకములు కావు. సగుణోపాసకులు కార్య బ్రహ్మతో పాటు ప్రళయకాలమున పరబ్రహ్మ స్వరూపమును పొందుతారు. నిర్గుణజ్ఞానసంపన్నులైన వారికి పునరావృతం లేదు. పునరావృత్తి లేదు.

ఇట్లు

**చతుర్థాధ్యాయ చతుర్థపాద సమాసము**

# చతుర్థాధ్యాయ చతుర్థపాద సారము

## విదేహముక్తి

స్వప్రకాశమైన దేని సాక్షాత్కారాన్ని పొంది, దేని రూపములో విద్వాంసుడు ఆవిర్భూతుడు అవుతాడో, ఏ స్వరూపములో వుంటాడో, ఆ స్వరూపమే దేని రూపమో మరియు అదియేనో, దేని రూపములో జీవుడు తానేయైన నిజస్వరూపములో వుండుటయే ముక్తి మరియు ఏకము అవటమో, అజ్ఞాననివృత్తి కాగానే స్వరూపావిర్భావము అయి ఏది అవుతారో, ఏది యుండిన తరువాత తనలోననే వున్న ముక్తి అవుతుందో, ఏది తన స్వభావము అని తెలియుటయే జ్ఞానమో, పరంజ్యోతిలో వున్న 'పరము', 'జ్యోతి' అనే శబ్దాలకు ఏది అర్థమో, ముక్తాత్మయొక్క స్థితి దేనియందు అవిభక్తరూపమునకు లోనైనదో, జ్ఞాని యొక్క ఆత్మలో మరియు దేనిలో ఏ విభాగములేదో, ముక్తుడు దేని సంబంధమైన తనరూపములో కలుస్తాడని జైమినిమహర్షి అభిమతమో, మరియు ముక్తుడు దేని సదృశమైన స్వరూపముతో సంపన్నుడు అవుతాడో, ముక్తుడు నిరస్తమైన సర్వప్రపంచము కలది, ప్రసన్నము, నిర్మలము, వర్ణానాతీతము, బోధాత్మ మరియు చైతన్యము ఐన దేనిలో నిష్పన్నము అవుతాడని, వుంటాడని, ఔడులోమి ఆచార్యుని అభిమతమో, బాదరాయణ మహర్షి అభిప్రాయ ప్రకారము ముక్తాత్మ సగుణరూపములో దేనికి సదృశముగా వుంటుందో మరియు కేవలము చైతన్యరూపము మరియు దేనిలో అభిన్నరూపములో కూడా వుంటాడో, దేని లోకము చేరిన ఈ మూడు రూపములలో వుండుట సంభవమో, దేని లోకమునకు చేరిన విద్వాంసునికి సంకల్పమాత్రముననే పితృదేవతలు హాజరు అవుతారో, మరియు సంకల్పమాత్రముననే సకల వస్తువులు, భోగములు అనుభవము అవుతుందో, దేనిలోకము చేరిన ఉపాసకుడు తిరుగులేని సంకల్పము వలన అనన్యాధిపతి, వేరొక ప్రభువులేనివాడు అవుతాడో, మరియు అతనికి సమస్తలోకములలోనూ స్వతంత్ర సంచారము వుంటుందో, ఏ లోకము చేరిన విద్వాంసునకు బాదరి ఆచార్యుల ప్రకారము మనస్సు తప్ప వేరు శరీరము వుండదో, జైమిని ఆచార్యుల ప్రకారము శరీరము, ఇంద్రియములు, మరియు మనస్సు వుంటాయో, బాదరాయణఆచార్యుల ప్రకారము శరీరము వుండక మరియు శరీరముతో పాటు కూడా వుండవచ్చునో మరియు ఈ మూడు రీతుల కూడా వుండవచ్చునో ఏ లోకము చేరిన ముక్తాత్మ తన సంకల్పము చేత రచించబడిన సమస్త శరీరములందు, ఒకే అగ్ని అనేక దీపములందు వెలుగునట్లు ప్రవేశించి, యథేచ్ఛగా లోకములలో తిరుగవచ్చునో.

ఈ జడ చైతన్యాత్మకమైన సమస్త జగత్తు యొక్క రచన, సంచలనము, ప్రళయము మొదలైన కార్యములన్నింటిని దేని అంశమైన ముక్తాత్మ చేయలేదో, మరియు ఏది చేయుచుండునో, అదియే బ్రహ్మము. అదియే బ్రహ్మము.

ఇట్లు

**చతుర్థాధ్యాయ చతుర్థపాద సారము**

**ఓం తత్సత్**

# 2

# శ్రీ బాదరాయణీయ బ్రహ్మ సూత్రబోధామృత లహరి

## సర్వాధికరణ సమాస సంగ్రహము

### శ్రీ బాదరాయణుల వారి సిద్ధాంత సమాస సంగ్రహము

## I. ప్రథమాధ్యాయము- సమన్వయము

## I.1. ప్రథమాధ్యాయ ప్రథమ పాద సమాసము

### స్పష్ట బ్రహ్మలింగ వాక్యముల విచారణ

**1. (1) జిజ్ఞాసాధికరణము**

బ్రహ్మమును గూర్చి జిజ్ఞాస, విచారణ అవసరము.

**2. (2) జన్మాద్యధికరణము**

బ్రహ్మము ఈ జగమునకు జన్మ, స్థితి, లయములకు మూలము మరియు కారణము.

**3. (3) శాస్త్రయోనిత్వాధికరణము**

సర్వజ్ఞత కలిగిన బ్రహ్మము శాస్త్రములకు మూలము.

**4. (4) సమన్వయాధికరణము**

బ్రహ్మమును గూర్చి చెప్పిన వేదాంత వాక్యముల సమన్వయము ద్వారా, పరస్పర విరోధము లేని ఏకాభిప్రాయము వలన, ఆ బ్రహ్మమును గూర్చి తెలిసికొనవచ్చును.

**5. (5) ఈక్షత్యధికరణము**

ప్రధానము జగత్తునకు కారణము కాదు. ప్రధానము అచేతనము. బ్రహ్మముయే చేతనము.

**6. (6) ఆనందమయాధికరణము**

ఆనందమయ పురుషుడు బ్రహ్మముయే. జీవుడు కాని, ప్రధానము కాని ఆనందమయుడు అన్నదానికి అర్థము కాదు.

**7. (7) అంతరధికరణము**

ఆదిత్యమండలములోని పురుషుడు, అక్షిస్థపురుషుడు బ్రహ్మమే.

**8. (8) ఆకాశాధికరణము**

ఆకాశము పరబ్రహ్మవాచకము.

**9. (9) ప్రాణాధికరణము**

ప్రాణము అనగా బ్రహ్మము.

**10. (10) జ్యోతిశ్చరణాధికరణము**

జ్యోతిస్సు అనగా బ్రహ్మము.

**11. (11) ప్రతర్దనాధికరణము**

ప్రాణశబ్దము బ్రహ్మపరము.

## I.2. ప్రథమాధ్యాయ ద్వితీయ పాద సమాసము

### అస్పష్ట బ్రహ్మ సంబంధ వాక్యముల విచారణ

**1. (12) సర్వత్రప్రసిద్ధ్యధికరణము**

ఉపనిషత్తుల ద్వారా ఎన్నో చోట్ల చెప్పబడిన ఉపాస్యదైవము బ్రహ్మమే. జీవుడు ఉపాస్యదైవము కాదు. జీవుడు ఉపాసకుడు. ఉపాస్యదైవము సూక్ష్మ స్థలమున వున్నట్లు చెప్పబడినా బ్రహ్మము సర్వవ్యాపకము, అవిచ్ఛిన్నము. బ్రహ్మము ఆవగింజకన్నా సూక్ష్మమైనది మరియు సర్వలోకముల కన్నా గొప్పది. బ్రహ్మ చిన్న కన్న చిన్న మరియు పెద్ద కన్న పెద్ద. బ్రహ్మమునకు సంభోగప్రాప్తిలేదు. జీవునకు సంభోగప్రాప్తి కలదు.

**2. (13) అత్త్రధికరణము**

బ్రహ్మము సర్వ ప్రపంచములను గ్రహించి లీనము చేసుకొంటుంది. బ్రహ్మ సర్వభోక్త.

**3. (14) గుహా ప్రవిష్టాధికరణము**

హృదయమైన గుహను ప్రవేశించిన ఇద్దరు పరమాత్మ జీవాత్మలు. వారు వెలుగునీడలవలె ఒకటి అయినా రెండుగా కనిపిస్తారు. అవిద్య అనే నీడ లేకుంటే ఇద్దరు ఒకటి అవుతారు.

**4. (15) అంతరాధికరణము**

నేత్రము లోపలి అక్షిస్థపురుషుడు బ్రహ్మము. పరబ్రహ్మ స్థానాతీతుడు. ఉపాసనకోసము స్థాన, నామ, రూపాదులు చెప్పబడినవి. నేత్రస్థ పురుషుడు ఆనందమయుడు.

**5. (16) అంతర్యామిఅధికరణము**

అంతర్యామి పరబ్రహ్మ. అన్నిటియందు వుండి వాటిని తెలిపి, వాటిచే తెలియకుండా వాటిని నియమించునది అంతర్యామి. అదియే ఆత్మ.

**6. (17) అదృశ్యత్వాధికరణము**

అదృశ్యత్వాది గుణములు, జ్ఞాతాది ధర్మములుకలవాడు, సర్వభూతయోనియైన పరమాత్మయే. ప్రధానము కాని, జీవుడు కాని కాదు.

**7. (18) వైశ్వానరాధికరణము**

వైశ్వానరుడు కేవలము జఠరాగ్నికాక పరబ్రహ్మమే. వైశ్వానరునికి విరాటస్వరూపము, త్రైలోక్య శరీరత్వము కలదు. అనంతుడు, అవిచ్ఛిన్నుడు ఐన పరమాత్మ ప్రదేశమునకు స్థానమునకు అతీతుడు. ఉపాసనకోసము ప్రదేశములు, స్థానములు, రూపములు, నామములు చెప్పినారు. సమస్త విశ్వమైన నరుడు, సమస్త జీవులకు నరుడు, సమస్త జీవులు అతనికి సంబంధించినవారు వైశ్వానరుడు. విశ్వానరుడే వైశ్వానరుడు.

## I.3. ప్రథమాధ్యాయ తృతీయ పాద సమాసము

### జ్ఞేయ బ్రహ్మసంబంధ వాక్య విచారణ

**1. (19) ద్యుభ్వాద్యధికరణము**

ద్యులోకానికి, భూలోకానికి, సమస్తమునకు ఆయతనము ఆధారము బ్రహ్మమే.

**2. (20) భూమాధికరణము**

భూమము అన్నిటికన్న మిన్నయైనది. భూమము పరబ్రహ్మమే.

**3. (21) అక్షరాధికరణము**

అన్నిటినీ శాసించేది, ధరించేది అక్షరము. అక్షరము పరబ్రహ్మము.

**4. (22) ఈక్షతికర్మాధికరణము**

ఈక్షించేవాడు, ధర్శనీయుడు పరమాత్మయే.

**5. (23) దహరాధికరణము**

హృదయాకాశము, దహారాకాశము పరమాత్మవాచకమే.

**6. (24) అనుకృత్యధికరణము**

బ్రహ్మము స్వప్రకాశము. జీవాత్మను అనుకరించునది బ్రహ్మము.

**7. (25) ప్రమితాధికరణము**

అంగుష్ఠమాత్రుడు పరమాత్మయే.

**8. (26) దేవతాధికరణము**

దేవతలు బ్రహ్మవిద్యకు అధికారులు.

**9. (27) అపశూద్రాధికరణము**

మనుష్యులకు మాత్రమే బ్రహ్మవిద్యాశాస్త్రమునందు అధికారము లేదని, దేవతాదులకు సైతం బ్రహ్మవిద్యాధికారం ఉన్నదని నిరూపించబడినది కదా! అలాగే, కేవలం ద్విజులైన వారికి మాత్రమే - బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు మాత్రమే - బ్రహ్మవిద్యాధికారం ఉన్నదనే నియమాన్ని తొలగించి, సాధనచతుష్ఠయసంపత్తి కలిగిన శూద్రునికి (ఎవరికైనా) సైతం బ్రహ్మవిద్యాధికారము వున్నదని ఛాందోగ్యంలో, చతుర్థాధ్యాయంలో జానశ్రుతి అనే రాజుకి బ్రహ్మజ్ఞాని అయిన రైక్వునికి సంబంధించిన కథ ద్వారా చెప్పవచ్చును. ఉపనయనము లేక వేదవిద్యాధికారము లేదు. గాయత్రి, బ్రహ్మ విద్యాద్వారము.

**10. (28) కంపనాధికరణము**

సమస్తమును కంపింపచేసేది, చలింపచేసేది, నడిపింపచేసేది ఐన ప్రాణము బ్రహ్మమే.

**11. (29) జ్యోతిరధికరణము**

జ్యోతిః-శబ్దము పరంజ్యోతియైన బ్రహ్మవాచకమే.

**12. (30) అర్ధాంతరాత్వాదివ్యపదేశాధికరణము**

నామరూపాలను విస్తరింపచేసేది, దానికొరకు జీవాత్మలో ప్రవేశించేది పరబ్రహ్మమే.

**13. (31) సుషుప్త్యుత్క్రాన్త్యధికరణము**

సుషుప్తియందు, ఉత్క్రాంతి (మృత్యువు) యందు జీవాత్మతో ప్రాజ్ఞాత్మగా ఉండు పురుషుడు బ్రహ్మమే.

## I.4. ప్రథమాధ్యాయ చతుర్థ పాద సమాసము

### బ్రహ్మము కాని వాని నిరాకరణ

**1. (32) ఆనుమానికాధికరణము**

ప్రధానము శ్రుతిప్రతిపాదితము కాదు. అవ్యక్తము అనే పదము శరీరమును గూర్చి చెబుతున్నది.

**2. (33) చమసాధికరణము**

అజము అనేది పరమాత్మశక్తియే కాని ప్రధానము కాదు.

**3. (34) సంఖ్యోపసంగ్రహాధికరణము**

"పంచజన" అనునది ఆత్మకు సంబంధించినదియే కాని, ప్రధానమునకు సంబంధించినది కాదు.

**4. (35) కారణత్వాధికరణము**

పరమాత్మ జగత్కారణము అనుటలో వివిధ శ్రుతివాక్యములలో విరోధము లేదు.

**5. (36) జగద్వాచిత్వాధికరణము**

వేదితవ్యుడైన పురుషుడు మరియు జగత్కారణము బ్రహ్మమే.

**6. (37) వాక్యాన్వయాధికరణము**

ద్రష్టవ్యము, శ్రోతవ్యము అయినది పరామాత్మయే. తెలియదగినది చూడదగినది, వినదగినది బ్రహ్మమే.

**7. (38) ప్రకృత్యధికరణము**

జగత్తుకు బ్రహ్మమే నిమిత్తకారణము మరియు ఉపాదానకారణము కూడాను.

**8. (39) సర్వవ్యాఖ్యానాధికరణము**

జడమైన ప్రధానాన్ని నిరాకరించటములో బ్రహ్మముకాని వాటినన్నింటినీ నిరాకరించటమే.

# II. ద్వితీయాధ్యయము - అవిరోధము

## II.1. ద్వితీయాధ్యయ ప్రథమ పాద సమాసము

### సాంఖ్యాది మత నిరాకరణ

**1. (40) స్మృత్యధికరణము**

వేద ప్రమాణములేని సాంఖ్యమందు చెప్పబడిన ప్రధానము జగత్కారణము కాదు. శ్రుతులకు విరుద్ధమైన స్మృతులు ప్రమాణములు కావు.

**2. (41) యోగప్రత్యుక్త్యధికరణము**

సాంఖ్యమును నిరాకరించుటవలన సాంఖ్యము ఆధారముగా గల యోగమును గూడా నిరాకరించుటమైనది.

**3. (42) విలక్షణత్వాధికరణము**

జగత్తుకు ఉపాదానకారణమైనందున బ్రహ్మస్వభావమునకు భంగము లేదు. జగత్తు బ్రహ్మములో లీనమైపుడు దోషములు లేకుండా పోవును. బ్రహ్మము యొక్క శుద్ధత్వము నిత్యము మరియు సత్యము. బ్రహ్మము నుండి వచ్చిన జగము బ్రహ్మములో లీనమై తన అస్తిత్వాన్ని కోల్పోయి బ్రహ్మమే ఉంటుంది.

**4. (43) శిష్టాఽ పరిగ్రహాధికరణము**

శిష్టులు స్వీకరించని మతములు మరియు వేదవిరోధమైన మతములు నిరాకరించబడినవి.

**5. (44) భోక్త్రాపత్త్యధికరణము**

భోక్త, భోగ్యాలకు భేదం వుండటములో సమస్యలేదు. వస్తుభేదం వున్నా కారణభేదం లేదు. బ్రహ్మము జగత్తుకు ఉపాదానకారణము మరియు నిమిత్తకారణము.

**6. (45) ఆరంభణాధికరణము**

బ్రహ్మవికారమైన జగత్తు బ్రహ్మకు భిన్నముకాదు. కారణమైన బ్రహ్మము, కార్యమైన జగత్తు భిన్నముకావు. బ్రహ్మము, జగత్తులకు అనన్యత్వము కలదు. జగము మొదట బ్రహ్మములో అప్రకటితముగా వుండి ఆ తరువాత సృష్టిలో ప్రకటితముగా వుండును. బ్రహ్మమునకు జగత్తు ఎప్పుడూ అనన్యము. మిగతా అంతా వాచారంభణమే.

**7. (46) ఇతరవ్యపదేశాధికరణము**

ఇతరుడైన జీవుడు సదాముక్తుడు కాడు. సదాముక్తుడైన పరబ్రహ్మకు హితము, అహితము రెండూ లేవు. కార్యవైచిత్రముల వలన కారణమైన బ్రహ్మములో భేదము కాని, భేదభావము కాని లేవు.

**8. (47) ఉపసంహారదర్శనాధికరణము**

పరబ్రహ్మము జగత్తుకు కారణమే. తనకు తానే జగత్తుగా కావలసిన స్వాభావికశక్తి బ్రహ్మమునకు వున్నది. ఏ సాధనము, సహాయము లేకుండా జగత్తును సృష్టించును.

**9. (48) కృత్స్నప్రసక్త్యధికరణము**

బ్రహ్మము జగత్తుకు కారణము, ఆశ్రయము, సాక్షి మరియు అతీతము. బ్రహ్మము జగత్తుకన్న మిన్న. జగత్తు బ్రహ్మయొక్క ప్రకటితమైన ఒక పాదము మాత్రమే. మూడు పాదములు జగత్తుకు మించి వున్నాయి.

**10. (49) సర్వోపేతాధికరణము**

పరబ్రహ్మము సర్వశక్తి సామర్థ్యవంతుడు, సర్వజ్ఞుడు. సంకల్ప మాత్రముననే సర్వము సంపన్నము చేయగల సర్వాంతర్యామి ఆ బ్రహ్మము. సర్వశక్తులు ఉపేతమైన పరబ్రహ్మ సర్వమూలము.

**11. (50) సప్రయోజనవత్త్వాధికరణము**

జగద్రచన పరబ్రహ్మయొక్క ప్రయోజనరహిత ఆనందస్వరూపలీల. పరబ్రహ్మ ఆప్తకాముడు.

**12. (51) వైషమ్యనైర్ఘృణ్యాధికరణము**

అనాది ఐన మరియు ఆది, మధ్యములు లేని ఈ జగత్తును కర్మ, అకర్మల ప్రకారము పక్షపాతము మరియు నిర్దయత్వము లేకుండా లీలగా సృష్టిస్తుంది పరబ్రహ్మము.

**13. (52) సర్వధర్మోపపత్త్యధికరణము**

జగత్తుకు కారణము కావలసిన ధర్మములైన సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము మొదలైన సర్వధర్మములు తనయందు ఉపపన్నమైనందువలన, ఉండుటవలన, బ్రహ్మమే జగత్కారణము అను సిద్ధాంతము దోషరహితము, సంశయాతీతము మరియు సత్యము.

# II.2. ద్వితీయాధ్యాయ ద్వితీయ పాద సమాసము

## శ్రుత్యసమ్మత మార్గ నిరాకరణ

**1. (53) రచనానుపపత్త్యధికరణము**

అచేతనమైన ప్రధానము జగత్కారణము కాజాలదు. పరస్పర విచార విరుద్ధములుగల సాంఖ్యమతము అసంపూర్ణము మరియు అసమంజసము.

**2. (54) మహద్దీర్ఘాధికరణము**

పరమాణువులు జగత్కారణము కావు. నిత్యతలేని పరమాణువువాదమైన, యుక్తి సమ్మతము కాని, ప్రమాణసమ్మతము కాని, శిష్ఠ సమ్మతము కాని వైశేషికమతము అసమంజసము మరియు అసమ్మతము.

**3. (55) పరమాణుజగదకారణత్వాధికరణము**

జడములు మరియు వాటంతటఅవి కలియలేని, విడిపోలేని పరమాణువులు జగత్కారణము కావు. జగద్రచనను సమవాయసంబంధము వివరించలేదు. పరమాణువాదము నిరాకరణీయము.

**4. (56) సముదాయాధికరణము**

సముదాయములు అచేతనములు, జడములు. కాని అవి జగత్కారణము కాదు. 'సర్వమూ క్షణికము' అనే మరియు నిరీశ్వరవాదమైన బౌద్ధమతము అయుక్తము, అసమ్మతము.

**5. (57) అభావాధికరణము**

విజ్ఞానము తప్ప వేరు పదార్థములులేవు అనే యోగాచారబౌద్ధము సరికాదు. బాహ్యపదార్థముల సత్యమును స్వీకరించని విజ్ఞానవాద బౌద్ధము, శూన్యవాదమైన మాధ్యమికబౌద్ధము రెండూ నిరాకరణీయములు మరియు అసమ్మతములు.

**6. (58) నైకస్మిన్నసంభవాధికరణము**

పరస్పర విరుద్ధవిచారములు కల సప్తభంగీన్యాయముపై ఆధారపడిన ఆత్మ,శరీరపరిమాణము కలదనినదైన జైనమతము నిరాకరణీయము.

**7. (59) పత్యధికరణము**

వేదమును స్వీకరించి, వేదోక్తమైన ఈశ్వరుడు జగత్తుకు కేవలము నిమిత్తమాత్రమనే, ఆరు ముద్రలచే శరీరము చిహ్నితము చేస్తే ముక్తి కలుగుతుందనే, ఈశ్వరునికి ఆధిపత్యములేని పాశుపతము అసమంజసము.

సాంఖ్య, పాతంజల, తార్కికమతములు సర్వజ్ఞత, అవిచ్ఛిన్నత, జగత్తుకు నిమిత్త, ఉపాదానకారణమైన చైతన్యమును (పరబ్రహ్మమును) స్వీకరించని కారణమున నిరాకరణీయములు.

**8. (60) ఉత్పత్త్యసంభవాధికరణము**

వాసుదేవుడనే పరబ్రహ్మ జగత్తుకు అభిన్న-నిమిత్త-ఉపాదాన కారణమనే, శ్రుతి-స్మృతులకు సమ్మతమైన ఈశ్వరభక్తిని (వాసుదేవారాధనను) బోధించే శాండిల్యుని పాంచరాత్రమతము (భాగవత మతము) సమ్మతము, యుక్తము. కానీ, ఒక వాసుదేవుడే కాక సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే నలుగురు సమాన ఈశ్వరతత్త్వములు చెప్పే పాంచరాత్రము అసమ్మతము. పరబ్రహ్మము అద్వితీయము.

## II.3. ద్వితీయాధ్యాయ తృతీయ పాద సమాసము

### స్వావిరోధ నిరూపణ

**1. (61) వియదధికరణము**

ఆకాశము యొక్క ఉత్పత్తి చెప్పబడలేదనుట సరికాదు. ఆకాశము యొక్క ప్రకటనము చెప్పబడినది. ఆకాశము యొక్క ఉత్పత్తిని గూర్చి చెప్పినది గౌణము. వస్తువుల ఉత్పత్తితో ఆకాశము ప్రకటనము అవుతుంది. బ్రహ్మము ఆకాశముగా ప్రకటనము అయినది. ఆకాశము అమృతము.

**2. (62) మాతరిశ్వాధికరణము**

ఏ విధముగా ఆకాశము యొక్క ఉత్పత్తి చెప్పకపోయినా అది ప్రకటము అయినట్లు, ఛాందోగ్యములో వాయుఉత్పత్తి చెప్పక పోయినా అది ప్రకటము అయినది. ఆకాశము, వాయువు అమృతములు.

**3. (63) అసంభవాధికరణము**

బ్రహ్మమునకు ఉత్పత్తి లేదు. బ్రహ్మము అనాది మరియు అనంతము. ఎప్పుడూ వుండేది బ్రహ్మమే.

**4. (64) తేజోధికరణము**

తేజము బ్రహ్మము నుండి ఉత్పత్తి అయినది. ఆ బ్రహ్మము తేజమును సృజించినది. వాయుభావాన్ని చెందిన బ్రహ్మమునుండి తేజము సృజనము అయినది.

**5. (65) అబధికరణము**

బ్రహ్మస్వరూపమైన వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము ఉద్భవించినది. జలమునకు కూడా మూలము బ్రహ్మమే.

**6. (66) పృథివ్యధికారాధికరణము**

జలము ఉత్పత్తి తరువాత పృథివి ఉత్పత్తి అయినది. జలము అన్నమును సృజించినది అని అనుటలో అన్నము అంటే ఐదవ తత్త్వమైన పృథివి అని అర్థము. జలము నుండి పృథివి, పృథివి నుండి అన్నము వచ్చినవి.

**7. (67) తదభిధ్యానాధికరణము**

అన్నిటి యందు వుంటూ, అన్నిటినీ ప్రవర్తింపచేసేది బ్రహ్మమే. అన్నింటినీ నియమించుట అనేది, ఆత్మయే కర్త అవటానికి గుర్తు, లింగము.

**8. (68) విపర్యయాధికరణము**

కారణబ్రహ్మము నుండి సృష్టిసమయములో కార్యములైన భూతములు జగత్తు సృష్టిక్రమములో అనులోమపద్ధతిలో ఉత్పన్నమౌతాయి. ఆ విధముగా ప్రళయసమయములో భూతములు, జగత్తు విలోమపద్ధతిలో కారణమైన బ్రహ్మమునందు విలీనమౌతాయి.

**9. (69) అంతరావిజ్ఞానాధికరణము**

బ్రహ్మము నుండి ఆకాశాది పంచభూతముల ఉత్పత్తి లయములను వర్ణించుటలో భూతసంబంధమైన అంతరములైన ఇంద్రియాల ఉత్పత్తి చెప్పటము అయినదనుట సమంజసము. భౌతికమైన పంచ జ్ఞానేంద్రియములు, భౌతికమైన పంచభూతముల ప్రతిబింబములు మరియు రూపములే.

**10. (70) చరాచరవ్యపాశ్రయాధికరణము**

జీవునికి మృత్యువులేదు. జీవుడు శాశ్వతము, అమృతము. జన్మమరణములనే వ్యవహారము స్థావరజంగమాత్మకమైన శరీరమునకేగాని జీవునికి చెందినదికాదు. జీవాత్మ నిత్యము.

**11. (71) ఆత్మాధికరణము**

జీవాత్మకు ఉత్పత్తి లయములు లేవు. జీవాత్మ యొక్క నిత్యత్వము శృతిస్మృతుల ప్రమాణసిద్ధము, పరమ సత్యము.

**12. (72) జ్ఞాధికరణము**

ఆత్మనిత్యుడు, జ్ఞాత, చైతన్యస్వరూపుడు. జీవాత్మ నిత్య చైతన్యజ్ఞాన స్వరూపుడు.

**13. (73) ఉత్క్రాంతిగత్యధికరణము**

శరీరనాశముతో ఆత్మనాశము లేదు. రావటము పోవటము అనునది మహత్పరిమాణుడు అయిన బ్రహ్మమునకు కాదు. జీవుడు (అవిద్యలో వున్నప్పుడు) అణుపరిమాణుడు. జీవుడు నిత్యుడు మరియు రావటము పోవటము వున్నది కనుక చలన స్వభావుడు. అజుడు, మహానుడు అని చెప్పినది

పరమాత్మగురించి జీవుని గురించి కాదు. జీవాత్మ సర్వాంగచైతన్యము మరియు ప్రదేశపరిమితము కాదు. ఆత్మ హృదయములో వుంది. దీపము నుండి వెలుగువలె, శరీరమంతా చైతన్యరూపములో ప్రసరించి వుంటుంది. ఆత్మ సర్వేంద్రియములను, అంతరంగమును చైతన్యముతో నింపి వుంటుంది. అణుప్రమాణమైనా అంతా వుంటుంది. చేతనుడైన ఆత్మ సాధనములైన బుద్ధి, జ్ఞానములకన్న వేరు మరియు మిన్న. అవిద్యలేనపుడు ఆత్మ, పరమాత్మల భేదములేదు. సమ్యక్‌దర్శనము అయినపుడు ఉపాధులు నశించి జీవాత్మ పరమాత్మభేదము విలీనము అవుతుంది. బుద్ధి, చిత్తము, మనస్సు, అహంకారము అనే నాల్గింటి కూడికయైన అంతఃకరణము యొక్క సంబంధము ఆత్మకు సంసారిత్వమును అతికిస్తుంది. ఆ అతుకులేనపుడు ఆత్మ అనంత పరమాత్మ.

### 14. (74) కర్త్రధికరణము

జీవాత్మయేకర్త. స్వప్న విహారము కల జీవాత్మ కర్త. జడ ప్రకృతికి స్వేచ్ఛాపూర్వక ప్రవృత్తి వుండదు. ఇచ్చిపుచ్చుకొనుట వలన జీవాత్మకు కర్తృత్వము కలదు. పరమాత్మకు కర్తృత్వము, ఇచ్చిపుచ్చుకొనుటలు లేవు. జీవునికి అశుభకర్మల ప్రమాదము నుంచి దూరము అగుచుండి, తన స్వభావమును పరిష్కరించి అశుభకర్మల నివృత్తి, శుభకర్మల ప్రవృత్తివైపు పురోగమించగల స్వతంత్రత కలదు. జీవుడు పరతంత్రుడు మరియు స్వతంత్రుడు. జీవుడు తన ప్రారబ్ధకర్మల ప్రకారము పరమేశ్వరుడు విధించిన శుభాశుభ పరిస్థితులు తటస్థించుటలో పరతంత్రుడు. కాని ఆ శుభాశుభకర్మలు తటస్థించినపుడు, అదే పరమేశ్వరుడు ప్రసాదించిన బుద్ధి, వివేకములతో అశుభకర్మలను వదలివేసి, శుభకర్మలవైపు ప్రవృత్తి కావటము ఎన్నుకొనుటములో స్వతంత్రుడు. ప్రేయస్సు వదలి శ్రేయస్సును ఎన్నుకొని పురోగమించటములో జీవాత్మకు స్వతంత్రత కలదు. జీవుని కర్తృత్వము, స్వరూపగతము మరియు స్వాభావికము కావు. కాని, అనాది సిద్ధమైన అంతః కరణ సంబంధమువలన కర్తృత్వము అవుతుంది.

### 15. (75) తక్షాధికరణము

జీవాత్మ వడ్రంగివలె అంతఃకరణముల, ఇంద్రియముల సంబంధము (పరికరముల సంబంధము) వున్నప్పుడు కర్త. ఆ సంబంధము లేనపుడు కర్తగా కాక (అకర్తగా) వుండును. జీవాత్మ కర్తృత్వము స్వభావసిద్ధముకాదు, తన బుద్ధి, చిత్తము, మనస్సు, అహంకారముల అంటువలన వచ్చును. అంటులేని జీవాత్మ పరమాత్మ.

### 16. (76) పరాయత్తాధికరణము

జీవాత్మ ఎన్నో విధాల పరమాత్మాధీనము. జీవాత్మ యొక్క అనాది ప్రారబ్ధమునసరించి, పరమాత్మ శుభాశుభకర్మఫలములను జీవునికి కల్గిస్తుంటాడు. అయితే అవి ఎదురైనపుడు అశుభముల నివృత్తి, శుభముల ప్రవృత్తి మార్గమును యోచించేవివేకము, బుద్ధి కూడా పరమాత్మ ఇస్తాడు. ఆ బుద్ధిని, వివేకమును ఉపయోగించుకొని శుభమార్గములో నడిచేందుకు శక్తి, యుక్తి, సహయోగము గూడా పరమాత్మ ప్రసాదిస్తాడు. ఆ విధముగా జీవుడు తన స్వభావమును పరిష్కారము, సుధారణము చేసుకొనే అవకాశము కలదు. ఆ విధముగా పరమాత్మ జీవాత్మకు సమస్య, సమాధానము, సాధనములు మరియు శక్తి ఒకేసారి కల్గిస్తాడు. ఈ విధముగా జీవుడు, జీవాత్మ పరాయత్తము

మరియు పరమాత్మాయత్తము. పరమాత్మాయత్తుడైన జీవుడు, సమస్య ఎదుర్కొని, సమాధానమును అర్థము చేసుకొని, సాధనములను ఉపయోగించి, శక్తిని ప్రయోగించి, నిరంతర సాధనతో తన్ను తాను ఉద్ధరించగలడు. ఈ విధముగా జీవుడు స్వాయత్తము. జీవాత్మ పరాయత్తము మరియు స్వాయత్తము. జీవాత్మ పరతంత్రుడు మరియు స్వతంత్రుడు. ప్రారబ్ద సమస్యలలో పరతంత్రుడు. ప్రస్తుత సమాధానము, సాధనలో స్వతంత్రుడు.

### 17. (77) అంశాధికరణము

జీవాత్మ, పరమాత్మయొక్క అంశము. అవిద్య వున్నపుడు జీవాత్మ, పరమాత్మయొక్క అంశము. అవిద్య తొలగినపుడు జీవాత్మ పరమాత్మయే. జీవుని దోషములు పరమాత్మకు అంటవు. జీవుడు పరమాత్మయొక్క ఆభాస. జీవుడు పరమాత్మ యొక్క ఆభాస అయినా, పరమాత్మకన్న భిన్నముకాదు. పరమాత్మ సమస్తఉపాధులలో సర్వదేశములలో, సర్వదేహములలో అభేదముగా విరాజమానమై వుండును. పరమాత్మ జీవాత్మల 'అంశి–అంశ'భావము ఉపాధి నిమిత్తము కాదు. ఆ భావము సర్వత్రము, సర్వదేశ, సర్వకాల సర్వపరిస్థితి, సర్వజీవ సత్యము.

## II.4. ద్వితీయాధ్యాయ చతుర్ధ పాద సమాసము

### ప్రాణాదివాక్య విరోధ పరిహారము

### 1. (78) ప్రాణోత్పత్త్యధికరణము

బ్రహ్మము నుండియే బ్రహ్మవికారములైన ప్రాణములు, ఇంద్రియములు ప్రాదుర్భవము అయినవి. ప్రాణోత్పత్తి ముఖ్యము. గౌణము కాదు. ప్రాణోత్పత్తికి బ్రహ్మమే కారణము.

### 2. (79) సప్తగత్యధికరణము

ఇంద్రియములు ఏడుకాక పంచకర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు మరియు మనస్సు కలిపి పదకొండు అనునది సరియైనది.

### 3. (80) ప్రాణాణుత్వాధికరణము

ప్రాణములన్నీ (ఇంద్రియములన్నీ) సూక్ష్మరూపములు, అణు రూపములు. సర్వవ్యాపకములు కావు. అవి విజ్ఞానసాధనములే కాని, విభువులు కావు.

### 4. (81) ప్రాణశ్రేష్ఠ్యాధికరణము

పదకొండు ప్రాణాలకు (ఇంద్రియాలకు) సామర్థ్యాన్ని ఇచ్చే మొదటి ముఖ్యప్రాణము కూడా బ్రహ్మమునుండి ఉత్పత్తి అయినది.

### 5. (82) వాయుక్రియాధికరణము

ప్రాణము అంటే వాయువు కాని దానికి సంబంధమైన స్పందనకానికాదు. ప్రాణము మిగతా ఇంద్రియములకు శక్తినిచ్చేది మరియు శ్రేష్ఠమైనది. ప్రాణము చైతన్యము కాదు జడమే.

ముఖ్యప్రాణము వాయువుకంటే భిన్నమైనది.

6. **(83) శ్రేష్ఠాణుత్వాధికరణము**

ముఖ్యప్రాణము అణుపరిమాణము కలది మరియు సర్వవ్యాపకము.

7. **(84) జ్యోతిరాద్యధికరణము**

అగ్ని మొదలైన వాటికి అధిష్ఠానము బ్రహ్మమే. జీవాత్మయే భోక్త.

8. **(85) ఇంద్రియాధికరణము**

ప్రాణములు ఇంద్రియములకన్న వేరు. మనస్సు కూడా ఇంద్రియముల కన్న వేరు. ఇంద్రియములు ముఖ్య ప్రాణముకన్న భిన్నము. ఇంద్రియములు ముఖ్యప్రాణముయొక్క వృత్తిభేదాలు కావు.

9. **(86) సంజ్ఞామూర్తిక్లప్త్యధికరణము**

నామరూపవ్యాకర్త పరమేశ్వరుడే, బ్రహ్మమే కాని జీవాత్మ కాదు. త్రివృత్కరణము బ్రహ్మము యొక్క కార్యము. జీవాత్మ కార్యము కాదు.

# III. తృతీయాధ్యాయము - సాధన

## III.1. తృతీయాధ్యాయ ప్రథమ పాద సమాసము

### దేహాంతరగమనము

1. **(87) తదనంతరప్రతిపత్త్యధికరణము**

జీవుడు ఒక దేహము నుండి దేహాంతర గమనము చేసినపుడు బీజ రూపములోనున్న సూక్ష్మభూతములైన అన్ని తత్త్వములతో సంయుక్తమై నిష్క్రమణ చేస్తుంటాడు. అన్ని తత్త్వములతో పాటు జీవాత్మలు తమ తమ కర్మల ప్రకారము దేహాంతర గమనము చేస్తుంటాయి. మరణసమయములో జీవుడు భూతసూక్ష్మపరివేష్టితుడై వుంటాడు.

2. **(88) కృతాత్యయాధికరణము**

శేషకర్మానుసారము జన్మలను జీవాత్మ పొందుతుంది. పూర్వకర్మ ఫలములను ఆయాకర్మలకనుగుణమైన లోకములలో అనుభూతి నొంది, శేషకర్మలననుసరించి నవీన జన్మలను జీవాత్మ పొందుతుంది. "చరణ" శబ్దముతో జీవాత్మ కర్మసంస్కారములతో తిరిగివస్తుందని నిశ్చయమౌతున్నది. కర్మశేషం నూతన జన్మస్వరూపాన్ని నిర్ణయిస్తుంది.

3. **(89) అనిష్టాదికార్యధికరణము**

శ్రేష్ఠకర్మలయందు సంలగ్నులైన జీవులు మాత్రమే చంద్రలోకమునకు వెళ్లుదురు. శుభకర్మలవారు శుభలోకములకును, అశుభకర్మలవారు అశుభలోకములకును వెళ్లుదురు. పాపములు చేయువారు నరకమునకేగాని, చంద్రలోకమునకుగాని, స్వర్గమునకుగాని వెళ్లకుందురు. దేవయాన, పితృయానములు అను రెండు మార్గములలో పైకి వెళ్లనివారు క్షుద్రులు. వారు మాటిమాటికి పుట్టుచు చచ్చుచుందురు. వారికి మర్త్యలోకమే తృతీయస్థానము. ఈ మూడవగతిలో యమయాతనారూపమైన అంతర్భావములేదు. ప్రాణులన్నింటికి మూడుగతులన్నది సమంజసము.

ఇష్టాపూర్తములు చేయనివారికి కూడా చంద్రలోకప్రాప్తి ఉంది.

4. **(90) సాభావ్యాపత్త్యధికరణము**

జీవాత్మ ఆకాశము, వాయువు, ధూమము, వేడి, వెలుగు, మేఘము, వర్షముయై వర్షిస్తుంది. జీవాత్మ ఆయా తత్త్వముల రూపములో పరిణితి నంది మరలి రావటము యుక్తి సంగతము. జీవాత్మ ఆయా తత్త్వముల సాదృశ్యాన్ని, పోలికను పొందుతుంది కాని, వాని స్వరూపాన్ని పొందదు. అవరోహణములో జీవుడు ఆకాశాదుల సాదృశ్యాన్ని మాత్రమే పొందుతాడు.

5. **(91) నాతిచిరాధికరణము**

జీవుడు తిరిగివచ్చునపుడు కర్మఫలభోగము సమాప్తమైనందున విలంబము వుండదు. పైకి పోవుటకు సమయము అవసరము. పడిపోవుట శ్రీఘ్రముగా అగును. చంద్రలోకమునుండి దిగడం శీఘ్రంగానే జరుగుతుంది.

6. **(92) అన్యాదిష్టితాధికరణము**

ధాన్యము మొదలైన వాటియందు తన కర్మఫలములను అనుభవించుటకు మొదలే వున్న జీవాత్మ వుండగానే చంద్రలోకము నుండి వచ్చిన జీవాత్మ మొదలే వున్న జీవాత్మతో పాటు అనురూపమున పురుషుని ఉదరమందు చేరి, ఆ పురుషుని వీర్యము నందు ప్రవేశింపచేయబడి, వీర్యముతోపాటు గర్భక్షేత్రము చేరి, అచట సంబద్ధమై, తన కర్మఫలముల అనుసారము నవీన దేహమును ప్రాప్తించుకొనును. ధాన్యములో వుండిన జీవాత్మలు ఆధారరూప పరికరణములే. జీవునికి ధాన్యాదులతో సంసర్గము మాత్రమే వుంటుంది.

# III.2. తృతీయాధ్యాయ ద్వితీయ పాద సమాసము

## జీవాత్మ పరమాత్మ తత్త్వ విచారణ

1. **(93) సంధ్యాధికరణము**

స్వప్నఅవస్థలో జీవునిస్థితి మరియు స్వప్నములో సంసారిక వస్తువుల యొక్క రచన జీవుడు తానేచేస్తుంటాడు. అయితే పరబ్రహ్మము నియమించినట్లే జీవుడు అట్లు చేస్తుంటాడు. స్వప్నమునందలి ఘటనలు జీవాత్మ స్వతంత్రరచనలు కావు. జీవుడు నిమిత్తమాత్రుడు. సమస్తము జీవాత్మ కర్మానుసారము. పరమాత్మ శక్తి ద్వారానే సంపన్నము అవుతుంది. స్వప్నకాలములో చూడబడిన దృశ్యములు పరమాత్మచే ప్రేరణ చేయబడిన శుభాశుభ సూచకములు. స్వప్నమనే మాయను జీవాత్మ చేత, జీవాత్మకర్మానుసారము, పరమాత్మ అనుభవింపచేయుచున్నాడు.

2. **(94) తదభావాధికరణము**

సుషుప్తిఅవస్థలో జీవునిస్థితి, సుషిప్తియందు జీవి పక్షిగూడు యందువలె, తన ఆత్మయందు విశ్రమించి సుఖముగా వుండటము. జీవుడు షుషప్తిలో బ్రహ్మభావాన్ని పొందుతాడు.

3. **(95) కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము**

సుషుప్తిలోకి వెళ్లి బ్రహ్మానుభూతి చెందిన జీవుడే మరల తిరిగి జాగ్రదవస్థలోనికి వస్తున్నాడు.

సుషుప్తిలో బ్రహ్మముతో ఏకీభవించి, మళ్ళీ అందుండే మేల్కొంటున్నాడు.

4. **(96) ముగ్ధేర్ధసంపత్త్యధికరణము**

మూర్ఛయొక్క స్వరూపము, ముగ్ధావస్థ, అర్ధసుషుప్తిఅవస్థ. సుషుప్తిలోవలె సుఖముండదు. కాని అజ్ఞానముండును. ముగ్ధావస్థలో బ్రహ్మానుభూతి వుండదు.

5. **(97) ఉభయలింగాధికరణము**

పరబ్రహ్మము సాకారము, నిరాకారము అను రెండు లక్షణములు కలిగి రెండు స్వరూపములలో సంపన్నమైనది అని చెప్పబడినను, పరమాత్మలో బేధము లేదు. ఉపాసన కోసము సగుణ రూపము చెప్పబడినను పరబ్రహ్మము నిరాకారము, ఏకము. పరమాత్మ –జీవాత్మ, సూర్యుడు–ప్రతిబింబము వలె ఒకటి అయినా రెండనిపిస్తారు. పరబ్రహ్మము విభాగరహితము, అవిభక్తము, నిరాకారము అయినను సమస్తభూతములలో ప్రాణులతో, ఉపాధులతో వేరు వేరు అనిపిస్తుంది, కనిపిస్తుంది. ఉపాధుల గుణదోషములు బ్రహ్మమునకు అంటవు. బ్రహ్మము దోషరహితము, అపరిచ్ఛిన్నము, ఏకము.

6. **(98) ప్రకృతైతావత్త్వాధికరణము**

"ఇది కాదు", "ఇది కాదు" అని అన్ని నిషేధించబడిన తరువాత ఉన్నదని ఉపదేశించబడిన బ్రహ్మము కంటే అన్యమైనది లేదు. బ్రహ్మము ఒక్కటే వున్నవస్తువు. బ్రహ్మము ఇంద్రియాతీతము. చక్షురాదులకు అతీతమైనను యోగులు అనన్యధ్యానములో బ్రహ్మమును దర్శించగలరు. ఉపాధులలో భేదమున్నను పరమాత్ముడికి భేదములేదు. భేదముగా అనిపించినా, కనిపించినా అభేదము పరబ్రహ్మతత్త్వము. ఉపాధి నివృత్తికాగానే, అజ్ఞానమునశించగానే జీవాత్మ పరమాత్మకు అభిన్నము అనే బ్రహ్మత్వమునందుతుంది. లేని ఉపాధుల పోగానే, ఉన్న బ్రహ్మముయే అనుభవమౌవుతుంది. రెండుగా అనిపించినా, కనిపించినా రెండూ ఒకటే. అభేదము యథార్థము. భేదము కల్పనామాత్రమే. నిరాకారమైన బ్రహ్మము సాకారముగా కనిపించినా, ప్రపంచముగా అనిపించినా నిరాకారమే. "నేతి నేతి" వాక్యము బ్రహ్మమును నిషేధించడం లేదు.

7. **(99) పరాధికరణము**

బ్రహ్మము ఒక్కటే ! అది అద్వితీయము. బుద్ధికి అర్థమయ్యే విధముగా బ్రహ్మమునకు పాదములు మొదలైన అవయవములు చెప్పబడినా బ్రహ్మము నిరవయవము. పరబ్రహ్మము అద్వితీయము, సర్వగతము. బ్రహ్మము అన్నింటా వున్నది, ఎప్పుడూ వున్నది.

8. **(100) ఫలాధికరణము**

కర్మఫలాన్ని ఇచ్చేవాడు పరమాత్మయే. సర్వాంతర్యామి, సర్వాధ్యక్షుడు, సృష్టి–స్థితి–లయములకు కారకుడైన పరమాత్మ కర్మలు ఆచరించిన వారికి వారి కర్మలకు అనుగుణముగా ఫలములను కలిగిస్తున్నాడు. కర్మలు చేయించటానికి ప్రేరణ కల్గించేవాడూ, ఆ కర్మఫలములు ఇచ్చేవాడూ పరమాత్మయే, పరబ్రహ్మమే.

# III.3. తృతీయాధ్యాయ తృతీయ పాద సమాసము

## అంతరంగ సాధన

**1. (101) సర్వవేదాంత ప్రత్యాయాధికరణము :**

అన్ని ఉపనిషత్తులు బ్రహ్మమును లక్ష్యముగా బోధించినవి. అన్ని శ్రుతులు బ్రహ్మమును ఉద్దేశ్యము చేసినవే. వానిలో చెప్పబడిన ఉపాసనలు, విద్యలు భిన్నము కావు. అన్నింటి ఉద్దేశ్యములు, విధానములు, ఫలములు అభిన్నములు. వివిధ ఉపనిషత్తులు బ్రహ్మమును గూర్చి చెప్పుచున్నవి. బ్రహ్మము తెలుసుకొనదగినదని, సర్వజ్ఞానలక్షణమని ఏకగ్రీవముగా చెప్పుచున్నవి.

**2. (102) ఉపసంహారాధికరణము :**

ఒక శాఖలో చెప్పబడిన ఉపాసనలను, విద్యలను ఇతర శాఖలలోనికి ఉపసంహారము, గ్రహించటము చేయవచ్చును. తమ శాఖలలో చెప్పబడిన గుణములు ఉపకారము చేసినట్లు వేరుశాఖల గుణములు కూడ ఉపకారము చేయును. యోగ్యమైన ఉపాసనలు ఒకే శాఖకు పరిమితముకాక అన్నిశాఖలకు ఉపయోగము అగును.

**3. (103) అన్యథాత్వాధికరణము :**

అన్ని ఉపనిషత్తులలో వేరు వేరు నామములతో భిన్నములైన బ్రహ్మవిద్యలు చూపబడినవి. దానిలో విధి, ఫలము, ఉద్దేశ్యము ఒకటి కావున అన్యథాత్వము లేదు. దానిలో ఏకతను చూడవచ్చును.

**4. (104) వ్యాప్త్యధికరణము :**

ఓంకారము మూడు వేదములందంతటా వ్యాప్తిచెంది యున్నది. అదే విధముగ పరబ్రహ్మ, సర్వవ్యాపకత్వము కలిగిన పరమసత్యము. అన్ని ఉపనిషత్తులు పరమాత్మ యొక్క సర్వవ్యాపకత్వము, సర్వశక్తిమత్త్వము, సర్వజ్ఞత ప్రతిపాదించినవి. పరబ్రహ్మ ప్రాప్తియే సర్వవిద్యల లక్ష్యము, ఉద్ధేశ్యము, గమ్యము అనటయే సమంజసము.

**5. (105) సర్వాభేదాధికరణము :**

మూడు వేదములలో చెప్పబడిన ప్రాణవిద్యలు భిన్నము కావు. ఉపాస్యరూపములో ఏకత్వము, ప్రాణసంవాదములో సాదృశ్యము వున్నాయి. కావున ప్రాణవిద్య అన్ని శాఖలలోనూ సమానము.

**6. (106) ఆనందాద్యధికరణము :**

ఆనందాది సర్వగుణ సంపన్నమైన బ్రహ్మము సర్వదా, సర్వత్ర వున్నది. ఆనందాది లక్షణములు బ్రహ్మమునకు స్వాభావికములు. రూపకల్పనలు అర్థమగుటకే కాని బ్రహ్మమునకు స్వాభావికములు కావు. పరబ్రహ్మతత్త్వము అన్ని రూపములకు మించినది. పరబ్రహ్మము పరాత్పరము.

**7. (107) ఆధ్యానాధికరణము :**

పరబ్రహ్మము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లేనిదియును, అవ్యయము ఐనదియును, మహత్తునకు పరమైనదియును, ఆద్యంతములు లేనిదియును, నిత్యమైనదియును అయి వున్నది.

అట్టి పరబ్రహ్మమును చక్కగ చింతనచేసి, చిత్తమును సంలగ్నము చేసి తెలిసికొనినవాడు మృత్యుముఖము నుండి పూర్తిగా విడువబడును.

**8. (108) ఆత్మగృహీత్యధికరణము :**

బ్రహ్మమే ఆత్మ. ఆత్మయే సత్తు. సత్తుయే ఆత్మ. ఆత్మయే బ్రహ్మము. బ్రహ్మము, ఆత్మ, ఆనందము, సత్తు మరియు జగత్కారణము ఒకటియే.

**9. (109) కార్యాఖ్యానాధికరణము :**

ఆచమనము చేయటము, అన్నముపై ఉదకమును చల్లటము అనేవి అన్నమునకు వస్త్రము సమర్పించటము. అన్నమయకోశము నుండి ఆనందమయకోశము వరకు పరబ్రహ్మచైతన్య స్థానములు. ఎవరికి సత్యము, జ్ఞానము, అనంతము అను లక్షణములు చెప్పబడినవో, ఏ ఆత్మ ఆనందమయముగా చెప్పబడినదో, ఆ బ్రహ్మమునకు ఈ జగత్తు మరియు అన్నమయ కోశము నుండి విజ్ఞానమయకోశము వరకు గల కార్యములు. ఆ బ్రహ్మమే అందరికీ అంతరాత్మ.

**10. (110) సమానాధికరణము :**

శతపథబ్రాహ్మణములోని శాండిల్యవిద్య మరియు బృహదారణ్యకములోని శాండిల్యవిద్య రెండు, ఒకటే అయిన మనోమయుడు, ప్రాణశరీరుడు, ఆకాశరూపుడు అయిన బ్రహ్మమునే ఉపాసించుచున్నవి. శతపథ బ్రాహ్మణములోని శాండిల్యవిద్య విధి సహితము. బృహదారణ్యక ఉపనిషత్తులోని శాండిల్యవిద్య పునరుక్తము, అనువాదము. రెండింటి లక్ష్యము పరబ్రహ్మమే.

**11. (111) సంబంధాధికరణము :**

సూర్య మండలములో నున్న పురుషుని పేరు "అహః" మరియు అక్షిగోళములో నున్న పురుషుని పేరు "అహం", "అహః" అనుననది అధిదైవతము. "అహం" అనునది అధ్యాత్మికము. వారి స్థానములు పేర్లు, తత్త్వాలు వేరు కనుక వారిద్దరు వేరు వేరు మరియు వారి ఉపాసనలు కూడా వేరు వేరు.

**12. (112) సంభృత్యధికరణము :**

అక్షరబ్రహ్మ యొక్క సర్వలోకములను భరించుట అనే "సంభృతి" లక్షణము మరియు ద్యులోకాది సర్వ బ్రహ్మాండములలో వ్యాపించుట అనే "వ్యాప్తి" లక్షణము అను రెండు గుణములు నేత్రాంతరవర్తియైన పురుషుని యందు గాని, సూర్యమండలవర్తియైన పురుషుని యందు గాని అన్వయించుటకు వీలుగాదు. అక్షరబ్రహ్మవిద్యా లక్షణములు శాండిల్య విద్యకు ఉపసంహరించ వీలుకాదు.

**13. (113) పురుషవిద్యాధికరణము :**

ఛాందోగ్యములోని తాండి-పైంగి పురుషవిద్య మరియు తైత్తరీయ ఆరణ్యకములోని పురుషవిద్య భిన్నములు. వాటికి పరస్పర ఉపసంహారము, అన్వయము లేదు. తాండిలో బ్రహ్మోపాసన, తైత్తరీయకములో బ్రహ్మవిద్యా ప్రశంసా వున్నాయి.

**14. (114) వేధాద్యధికరణము :**

వేధ మొదలైన (హృదయాన్ని వేధించి, ధమనులను ఛేదించి) వానిలో అర్థ భేదము వున్నందున వీటికి విద్యలలో, ఉపాసనలతో ఉపసంహారము లేదు. హృదయాన్ని ఛేదించటము మొదలైన మంత్రములకు లింగములను బట్టి అభిచారికకర్మలందు వినియోగము, ప్రవర్గ్యాదులకు అగ్నిష్టోమాది యాగములందు వినియోగము వున్నది. లింగ వాక్యములు–హేతువును చెప్పే వాక్యములు–సన్నిధి (సామిప్యం) కంటే బలవత్తరమైనవి. కాబట్టి వీటికి విద్యలయందు ఉపసంహారము లేదు.

**15. (115) హాన్యధికరణము :**

"హాని" అంటే పుణ్య పాపములను వదలివేయటము, ఉపాయనము అంటే పుణ్యపాపములను గ్రహించుటము. ఉపనిషత్తులలో కొన్ని చోట్ల "హాని" గురించి చెప్పి, ఉపాయనము గురించి వదలి వేసినారు. మరికొన్ని చోట్ల "ఉపాయనము" గురించి చెప్పి, హాని గురించి చెప్పలేదు. ఉపాయనములు వున్నచోట హానులను, హానులు వున్నచోట ఉపాయనములను అధ్యాహారము (అన్వయము– స్వీకారము) చేయవచ్చును. సమాన విద్యలలో హాని, ఉపాయనముల దృష్టాంతములను యథాయోగ్యముగా అధ్యాహారము చేయవచ్చును.

**16. (116) సాంపరాయాధికరణము :**

అన్నీ సుకృతదుష్కృతములు, జ్ఞానికి మరణ సమయములోనే వీడిపోతాయి. బ్రహ్మజ్ఞానులుకాని ఉపాసకులకు బ్రహ్మప్రాప్తి, దేహము వదలినతరువాత దేవయానమార్గములో జరుగుతుంది. వారికి జీవితకాలములో చేయబడిన అనుష్ఠానముల శక్తి వలన దేవయానములో పయనించేవానికి మార్గమధ్యములో బ్రహ్మప్రాప్తి కలుగుతుంది అని చెబితే ఉభయశాఖలకు విరోధం ఉండదు.

**17. (117) గతేరర్థవత్త్వాధికరణము :**

సగుణోపాసన, నిర్గుణవిద్యాపద్ధతి అనే రెండు పద్ధతులలో సగుణోపాసనా పద్ధతిలో మాత్రమే దేవయానము వుంటుంది. నిర్గుణవిద్యాపద్ధతిలో దేవయానానికి తావు లేదు, అవసరము లేదు. అవిద్య నశించడంతోనే సాధకుడు పుణ్యపాపాలను వదలి తత్కాలమే, అపుడే బ్రహ్మమును పొందుతాడు. ఈ విధముగా 'బ్రహ్మవిదునకు తత్కాల బ్రహ్మప్రాప్తి' మరియు 'సగుణోపాసకులకు దేవయానములో బ్రహ్మ లోకమునకు చేరుట' అని రెండువిధములు కలవు. నిర్గుణ బ్రహ్మజ్ఞాన ద్రష్టకు బ్రహ్మలోకము ఇచ్చటనే యున్నది. సగుణ బ్రహ్మోపాసకులకు ఉపాసనా మార్గము–దేవయానమార్గము అవుతుంది. సాధకుని సంకల్పానుసారము ఉభయవిధముల ముక్తి లభించుకో వచ్చును.

నిర్గుణ బ్రహ్మవేత్తకు స్వరూపాన్ని పొందటానికి (జీవ–బ్రహ్మ ఐక్యము) మార్గము అవసరము లేదు. కావున దేవయానమార్గముయొక్క ప్రసక్తి వుండదు. సగుణ బ్రహ్మప్రాప్తికి దేవయానమార్గము. నిర్గుణ బ్రహ్మానుభవము ఒక స్థితి, బ్రాహ్మీస్థితి. అంతర్ముఖ సమారాధన, బహిర్ముఖసమారాధన అనేవి నిర్గుణ, సగుణ పద్ధతులు.

**18. (118) అనియమాధికరణము :**

ప్రత్యేక విద్యలననుసరించి బ్రహ్మమునుపాసించువారు మాత్రమే దేవయాన మార్గమున బ్రహ్మలోకమునకు పోవుదురు అను నియమము లేదు. సగుణోపాసనయందు దేవయానము కొన్ని చోట్ల చెప్పబడినది, కొన్ని చోట్ల చెప్పబడలేదు. దేవయాన మార్గము కూడా కొన్ని చోట్ల చెప్పబడినది, కొన్ని చోట్ల చెప్పబడలేదు. అయితే అధ్యాహరము, అన్వయముల వలన దేవయాన మార్గము అన్ని రకముల ఉపాసనలకు వున్నది అనేది సమ్మతము, యుక్తియుక్తము బ్రహ్మ విదులకు రావటము, పోవటము లేదు. బ్రహ్మవిదులు బ్రహ్మ స్థితులు మరియు బ్రహ్మ స్వరూపులు.

**19. (119) యావదధికారాధికరణము :**

జ్ఞానులందరికి ఈ శరీరము విడిచిన తరువాత ముక్తి లభిస్తుందనే నియమము లేదు. కొందరు మహానులైన పురుషులు ఈశ్వరాజ్ఞచే లోకకళ్యాణము కోసము అధికారులై, బాధ్యతనీయబడి భువికి అవరోహణ చేస్తారు. ఆ అధికారము, భాధ్యత వున్నంతవరకు వారికి రాకపోకలు వుంటాయి. వారు ఇచ్ఛానుసారము శరీరములను స్వీకరించుటకు విస్తరించుటకు సమర్థులు. అటువంటి బ్రహ్మవేత్తలకు దేహసంబంధమైన లింగ శరీరములను వదలినంతటనే మోక్షము కలిగి బ్రహ్మత్వమునొందుతారు.

**20. (120) అక్షరధ్యధికరణము :**

అక్షరబ్రహ్మమునకు సత్యము, జ్ఞానము, ఆనందములవలెనె అనంతము, అగ్రాహ్యము, అశబ్దము, అస్పర్శము, నిర్వికారమువంటి నిషేదవాక్యములు గూడా అన్ని చోట్ల అధ్యాహారము, అన్వయము చేసుకోవచ్చును.

**21. (121) ఇయదధికరణము :**

ముండకము, కఠోపనిషత్తుల్లో చెప్పబడిన రెండుపక్షులు జీవాత్మ, పరమాత్మలు. ఈ రెండింటిలో చెప్పబడిన విద్యలు రెండూ ఒకటియే. జీవాత్మ పక్షి, పరమాత్మ పక్షిని చూడగానే ముక్తి చెందుతున్నది. అంటే బ్రహ్మదర్శనమే ముక్తి. అజ్ఞానము పోగానే జీవాత్మ, పరమాత్మ వెలుగు నీడలవలె ఒకటేనని తెలుస్తున్నది. నీడ పోగానే వెలుగే వుంటుంది. జీవాత్మ భోక్త. పరమాత్మ సాక్షి. జ్ఞానము కలుగగానే భోక్తా భావము మానిపోయి పరమాత్మ రూపము అవుతుంది.

**22. (122) అంతరత్వాధికరణము :**

బృహదారణ్యకములో యాజ్ఞ్యవల్క్యుడు ఉషస్తికి చెప్పిన, మరల కహోలునికి చెప్పిన సర్వాంతర విద్యలు ఒకటియే. ప్రాణముల ప్రాణక్రియ చేయించు, కన్నులకు కనబడని, చెవులకువినబడని సర్వాంతరుడు మరియు ఆకలి–దప్పులు, శోకము, మోహము, జరామృత్యువులకు అతీతుడైన అంతరాత్మ రెండూ, అన్ని భూతములందు సర్వాంతరుడైన, సర్వవ్యాపియైన, అందరియందు దాగివున్న దివ్యాత్మ ఒక్కరే.

**23. (123) వ్యతిహారాధికరణము :**

“సర్వాంతరుడే నీయాత్మ, నీయాత్మయే సర్వాంతరుడు” అని అనటము వ్యతిహారము, పరస్పర వినిమయ క్రమము. యాజ్ఞవల్క్యుడు, బృహదారణ్యకములో ఉషస్తి, కహోలునికి ఈ విధముగా

చెప్పటము, ఉపాసకునకు స్పష్టముగా ఏకత్వము చెప్పుటకొరకె. వ్యతిరేకముగా వ్యతిహారము చెప్పటము సత్యమును నొక్కి చెప్పటము.

**24. (124) సత్యాద్యధికరణము :**

బృహదారణ్యకములో చెప్పబడిన లోకజయమును కలిగించే సత్యవిద్య మరియు పాపనాశనము కలిగించే సత్యవిద్య రెండూ ఒకటియే. బ్రహ్మమే సత్యము. ఆదిత్యుడు మరియు కుడికంటి యందలి పురుషుడు ఒకటియే.

**25. (125) కామాద్యాధికరణము :**

ఛాందోగ్యపనిషత్తులో దహరాకాశము (హృదయాకాశము) లో వున్నట్లు చెప్పబడిన బ్రహ్మము, సత్యకామము సత్యసంకల్పము కలిగినది. బృహదారణ్యకములో హృదయాకాశములో శయనించే పురుషుడు (బ్రహ్మము) గొప్పది, పూజనీయము అని చెప్పబడినది. రెండింటిలోనూ హృదయమున ఆయతనముగా ఉపాస్యముగాను చెప్పబడిన బ్రహ్మము ఒకటే. ఛాందోగ్యోమున చెప్పబడినది, సగుణ విద్య, బృహదారణ్యకమున చెప్పబడినది. నిర్గుణవిద్య అయిననూ ఆయతనము, ఉపాస్యము ఒకటియే కావున ఈ రెండు విద్యలను అధ్యాహారము చేయవచ్చును.

**26. (126) ఆదరాధికరణము :**

భోజనమును ఆదరించటము యుక్తము. భోజనము లేనపుడు ప్రాణాగ్నిహోత్రము కూడా వుండవలదు.

**27. (127) తన్నిర్ధారణాధికరణము :**

కర్మఫలము లభించటానికి ఉపాసనలు అడ్డంకులు కావు. క్రతువు తన ఫలసిద్ధి కొరకు ఉపాసనను అపేక్షించదు. ఉపాసన అనేది క్రతువుకు కర్మాంగము కాదు. అది ఐచ్ఛికమే. ఓంకారోపాసన బ్రహ్మోపాసన. అది ఆత్మశుద్ధికి మార్గము కాని కర్మఫలము కర్మముపైనే ఆధారపడి వుంటుంది. కర్మాంగముగా ఓంకారోపాసన చేయాలని నిర్బంధము లేదు. కాని ఓంకారోపాసన చేయటము ఉత్కృష్టము, ఉత్తమము.

**28. (128) ప్రదానాధికరణము :**

ప్రాణము, వాయువు రెండూ వేరువేరు. వాయువు దేవతల సంవర్గము. సంవర్గము అంటే మిగితా వాటిని లీనము చేసుకోవటము. వాయువు దేవతల సంవర్గము. ప్రాణము ఇంద్రియముల (ప్రాణముల) సంవర్గము.

వాయువు దేవతలలో శ్రేష్ఠము. ప్రాణము ఇంద్రియములలో శ్రేష్ఠము. వాయువు, ప్రాణములు వేరు వేరు. కావున వాటి విద్యలు వేరు వేరు. వాయువులో దేవతల సంవర్గము అధిదైవతము. ప్రాణములో ఇంద్రియముల సంవర్గము అధ్యాత్మికము. గుణభేదము వలన వాయువు, ప్రాణము మరియు వాటి విద్యలు వేరు వేరు.

**29. (129) లింగభూయస్త్వాధికరణము :**

అనేక లింగములు (గుర్తులు, సంకేతములు) వున్నందున వాజసనీయములో, అగ్నిరహస్యవిద్యలో

చెప్పబడిన 36,000 (100X360–మనుజుని జీవితములో వున్న రోజులు) అగ్నులు మనశ్చితాలు, కర్మలకు, కర్మాంగములకు సంబంధించినవి కావు. ఉపాసనాపూర్వక స్వతంత్రములు. ప్రకరణము కంటే లింగము, లింగము కంటే శ్రుతి బలవత్తరము. "శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యానం, సమవాయే, పారాదౌర్బల్యమ్, అర్థవిప్రకర్షాత్ (జైమిని సూత్రం 3–3–13)) "ఈ అగ్నులు విద్యా సంపాదితాలు" అని శ్రుతి అన్నందున అది విద్యాసంబంధము కలవి, కర్మ సంబంధము కలవికావు. కావున మనశ్చితాలకు (మానసికాగ్నులకు) కర్మాంగత్వము లేదు. అవి స్వతంత్ర ఉపాసనలు.

**30. (130) ఐకాత్మ్యాధికరణము :**

ఆత్మ శరీరము కన్న భిన్నము, వేరు. మరణము తరువాత చైతన్యము (ఆత్మ) లేకున్నా శరీరము వుండటము చూస్తున్నాము. ఆత్మ శరీరము కాదు. శరీరము ఆత్మ కాదు. ఆత్మ శరీరములో ఉన్నపుడు జ్ఞానము వుంటుంది. ఆత్మయే జ్ఞాత రూపమున శరీరములో ఉపలబ్ధి అవుతున్నది. జ్ఞాత, జ్ఞేయము ఐన ఆత్మ శరీరము కన్న భిన్నము. రథములో రథికుడు ఉపలబ్ధి అయినపుడు రథము నడుస్తుంది. శరీరములో ఆత్మ ఉపలబ్ధి అయినపుడు శరీరమునడుస్తుంది.

**31. (131) లింగావబద్ధాధికరణము :**

ఒక శాఖలో చెప్పబడిన ఉపాసనలను ఆశాఖవారే చేయవలయును, వేరు శాఖలవారు చేయరాదు అనేది సమంజసము కాదు. ప్రతి శాఖవారు, వేరు శాఖలవారి ఉపాసలను స్వీకరించవచ్చును. అనుష్ఠానములు సర్వజన ఉపాసనాయోగ్యములు (శాఖలకు అనుష్ఠానములు వున్నవి. అనుష్ఠానములకు శాఖలు లేవు–మతములకు ప్రార్థనలువున్నవి, ప్రార్థనలకు మతములు లేవు).

**32. (132) భూమజ్యాయస్త్వాధికరణము :**

వైశ్వానరాత్మను సమష్ఠిగా, సమగ్రముగా, పూర్ణముగా ఉపాసించవలెను. ఆవైశ్వానరాత్మకు ద్యులోకము శిరస్సు, సూర్యుడు నేత్రము, వాయువు ప్రాణము, ఆకాశము శరీరము, జలము కడుపు మరియు భూమి పాదములు. వృష్టి ఉపాసనకన్న సమష్ఠి ఉపాసన (భూమ్నః క్రతువత్–క్రతువువలె) శ్రేష్ఠము.

**33. (133) శబ్దాదిభేదాధికరణము :**

విద్యలు ఎన్నియో వున్నవి. అధికారమును బట్టి ఒక్కొక్క విద్య ఉపయుక్తమగుచున్నది. కాని అన్ని విద్యలకు ఫలము బ్రహ్మ ప్రాప్తియే. అన్నింటిని కలుపుట, అన్నింటితో ఉపాసించుట అసాధ్యము. యోగ్యముకాదు. ఏ విద్యకావిద్యను పూర్ణముగా ఉపాసించుట మేలు. ఒక విద్య అయినాగాని పూర్ణముగా పూర్ణ సాధనతో ఉపాసించుట, అనుభూతినందుట సాధ్యము, యోగ్యము, ఉత్తమము మరియు బ్రహ్మానుభూతికి మంచిమార్గము.

**34. (134) వికల్పాధికరణము :**

సగుణ విద్యలకు వికల్పమే, వేరువేరుగా సాధన, ఉపాసన చేయటమే యుక్తము. ఒకే విద్య వలన సాక్షాత్కారము కలుగుతున్నపుడు అదే ఫలము కొరకు ఇంకొక ఉపాసన అనవసరము. విరుద్ధమైన ఉపాస్య సాక్షాత్కారము ఒకే సమయములో జరుగదు.

**35. (135) కామ్యాధికరణము :**

సకామోపాసనల అనుష్ఠానమునందు, అధికారియైన వ్యక్తి తన కామములననుసరించి ఏది అవశ్యకమని తలచునో దానిని చేయవచ్చును. ఆ ఫలమును కావాలని అనుకొనునో, దానికి చెప్పబడిన సమస్త ఉపాసనలను సముచ్చయము చేసి అనుష్ఠానము చేయవచ్చును.

**36. (136) యథాశ్రయభావాధికరణము :**

లౌకికములైన ఉపాసనలు ఇష్టమైన రీతి, అనుకూలమైన రీతి ఆచరించవచ్చును. మూడు వేదములందు విహితములైన అంగములకు సహాభావము ఉన్నది, ఓంకారమువలె. కాని కర్మలకు కర్మాంగాలకు (ఆశ్రయాలకు), ఉపాసనలకు (ఆశ్రితములకు) సహాభావము చెప్పే శ్రుతి లేదు. క్రతువునందలి అంగాలతో, ఉపాసనలకు నిత్య సంబంధాలు కలవికావు. ఉపాసనలను అనుష్ఠించవచ్చు లేక మానవచ్చును. (కర్మనిర్దుష్టము, ఉపాసన స్వానుసంకల్పానుకూలము. కర్మానుష్ఠానము చెప్పినది చేయునది. ఉపాసనానుష్ఠానము భావించునదే చేయుటము. కర్మానుష్ఠానము నియమసాధన. ఉపాసనానుష్ఠానము స్వానుభావన.)

# III.4. తృతీయాధ్యాయ చతుర్థ పాద సమాసము

## బహిరంగ సాధన

**1. (137) పురుషార్థాధికరణము**

బ్రహ్మజ్ఞానము వల్లనే మోక్షము, పరమ పురుషార్థము లభిస్తుంది. బ్రహ్మ జ్ఞానము కర్మాంగము కాదు. వేదాంత జ్ఞానము వలన, సన్యాసము వలన, త్యాగము వలన అమృతత్వము, బ్రహ్మానుభవము అవుతుందని నిశ్చయముగా చెప్పబడినది. జ్ఞానము, కర్మ బంధమునకు విరుగుడుమందు, సమాధానము మరియు కత్తి. జ్ఞానముతో చేయబడే కర్మములు కూడా పవిత్రము అవుతాయి. బ్రహ్మజ్ఞానము కర్మాంగము కాదు. మోక్షసాధనము.

**2. (138) పరామర్శాధికరణము**

బ్రహ్మచారులకు, గృహస్థులకు, వానప్రస్థులకు సన్యాసులందరికీ బ్రహ్మవిద్యాధికారము సమముగానున్నది. విద్య కర్మాంగము కాదు, స్వతంత్రము. నాలుగు ఆశ్రమములను గూర్చి విధి శ్రుతులలో చెప్పబడలేదనే జైమినిమహర్షి అభిమతము సమంజసము కాదు. ఎవరికైనను ఎపుడు బలీయమైన వైరాగ్యము కలుగునో అపుడే సన్యాసము స్వీకరించవచ్చును. సన్యాసము క్రమముగా, బ్రహ్మ చర్యము నుండి గృహస్థము, గృహస్థము నుండి వానప్రస్థము, వానప్రస్థము నుండి సన్యాసము కాని, నేరుగా (బ్రహ్మచర్యము నుండి, గృహస్థము నుండి లేక వానప్రస్థము నుండి) కాని పొందవచ్చును. యతి ఆశ్రమము శ్రుతులలో చెప్పబడ్డది.

**3. (139) స్తుతిమాత్రాధికరణము**

"ఉద్గీథాది శ్రుతులు కర్మాంగములు కనుక కేవలము స్తుతి కోసమే" అని అనటము సమంజసము కాదు. అపూర్వమైన రసతమత్వాది గుణములతో కూడిన ఉద్గీథాదుల ఉపాసనయే విధించబడినదనుట సమంజసము. విద్య కర్మాంగము కాదు. కర్మకు అంగభూతమని ఉద్గీథము

స్తుతించబడలేదు. దానికి ప్రత్యేక ఉపాసనావిధానము, ఫలములు కలవు. కొన్ని శ్రుతులు స్తుతి పరాలు కావు. ఉపాసనలను విధిస్తున్నాయి.

**4. (140) పారిప్లవాధికరణము**

ఉపనిషత్తులలో చెప్పబడిన అభ్యాసము, కథలు విద్యాశేషములే కాని కర్మశేషములు కావు. పారిప్లవ కర్మలకు పారమార్థక విద్యా కథలకు సంబంధము లేదు. పారిప్లవకథలు యజ్ఞముల మధ్యలో సమయము సమన్వయముగా జరగటానికి చెప్పబడు కథలు. పారమార్థకకథలు జ్ఞానబోధకు సహకరించటానికి చెప్పబడిన తత్త్వగుళికలు. ఉపనిషత్తులోని కథలు శిష్యులకు విద్యయందు అభిలాష కల్గించటానికి ఆ విద్యను తేలికగా బోధించటానికి ఉపయోగ కారకములు. ఆ కథలు ఉపాసనకోసము చెప్పబడినాయి అనటము సమంజసము. ఉపనిషత్తుల్లోని కథలు క్రతుకర్మాంగాలు కావు.

**5. (141) అగ్నీంధనాద్యధికరణము**

ఏ వస్తువులు, పదార్థములు లేకుండా అయ్యే బ్రహ్మయజ్ఞము కర్మలను అపేక్షించదు. బ్రహ్మవిద్య పరమపురుషార్థసిద్ధి యందు సర్వదా స్వతంత్రమగుట వలన కర్మకు అంగము కాదు. సన్యాసులకు కర్మానుష్ఠానము అక్కరలేదు.

**6. (142) సర్వాపేక్షాధికరణము**

జ్ఞానోత్పత్తికి విహిత కర్మలు ఉపయోగిస్తాయి. యజ్ఞము, దానము, తపము, అధ్యయనము అనునవి మోక్షాన్ని ఇప్పించలేకపోయినా యోగ్యతను బట్టి జ్ఞానోత్పత్తి విషయములో సహాయపడుతాయి. శమ, దమాది సాధనములు బ్రహ్మవిద్యకు అవసరము. మదము, మాత్సర్యము, కామము, క్రోధము, లోభము, మోహము అను ఆరుగురు శత్రువులను తరిమివేయటము మరియు శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము అను ఆరుగురు మిత్రులను దరిచేయటము, బ్రహ్మవిద్యకు, బ్రహ్మప్రాప్తికి తోడ్పడుతాయి.

**7. (143) సర్వాన్నానుమిత్యధికరణము**

ప్రాణాపాయ సమయములో నిషిద్ధమైన ఆహారాన్ని దేనినైనా తిని ప్రాణము నిలుపుకోవటము యుక్తము. ఆహారనియమాలకు సడలింపు వుంది. ఏది తినవచ్చునో, ఏది తినరాదో నిర్ణయించే శాస్త్రములు వున్నాయి. శాస్త్రములకు విరోధము రావలదు కనుక అన్నిరకాల అన్నానికి, ప్రాణ భయము వున్నప్పుడుతప్ప, అనుమతి గలదు అనేది ప్రాణవిద్యాంగము కాదు అనటము సమంజసము. అభక్ష్యభక్షణము కేవలము ప్రాణసంకటములోనే మరియు కేవలము ఆపద్ధర్మము రీతిలోనే అనుమతము. శాస్త్రప్రకారము నిర్దేశించిన భక్ష్యము, అభక్ష్యముల నియమము పాటించవలెను. అన్నీ తినగలిగినా అయోగ్యములను వదులవలెను, యోగ్యములను స్వీకరించవలెను.

**8. (144) ఆశ్రమకర్మాధికరణము**

ఆశ్రమములలో వున్నవారు బ్రహ్మజ్ఞానమందిన పిదప కూడ తమ తమ ఆశ్రమవిహితమైన కర్మములు చేయుచుండవలయును. శ్రేష్ఠకర్మలు వ్యవహారికముగా కామ్యకర్మలు ఫలములనిచ్చుటలో మరియు

అధ్యాత్మికముగా జ్ఞానమందుటకు సహాయకారిగా రెండు విధములుగా ఉపయోగమగును. నిత్యకర్మములు జ్ఞానసహకారులు కూడా అవుతాయి. అన్ని ఆశ్రమములకు సంబంధించిన శ్రేష్ఠ కర్మలు కూడా సాధకునిలోని అవిద్య, రాగము, ద్వేషము, అస్మిత మొదలైన క్లేషములను పోగొట్టి విద్యాఉత్పదకాలు అవుతాయి. అందుచేత అధ్యయనము, దానము మొదలైన నిత్యకర్మలు విద్యకు, జ్ఞానానికి సహాయకములు అవుతాయి. బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధన చేయుటయు యుక్తము, శ్రేష్ఠము. మోక్షాపేక్ష లేనివారు కూడా ఆశ్రమ విహితకర్మలు చేయవలెను.

**9. (145) విధురాధికరణము**

ఆశ్రమరహితులకు కూడా బ్రహ్మవిద్యాధికారము వున్నది. కేవలము అశ్రమస్థితులమీదనే కాకుండా కాని సాధకుని ఉపాసన, నిష్ఠ, అభ్యాసము, నిరంతరసాధన మీద ఆధారపడి వుంటుంది. ఏ ఆశ్రమము లేని దిగంబరుడైన సంవర్తకుడు మొదలైనవారు మహాజ్ఞానులైనట్లు స్మృతులలో వున్నది. ప్రస్తుత సాధన, పూర్వాభ్యాసములు రెండూ ఆశ్రమకర్మలతో సంబంధము లేకున్నా, బ్రహ్మజ్ఞానము వైపుకు తీసుకువెళ్లుతాయి.

ఏదో ఆశ్రమములో వుంటూ, ఆ ఆశ్రమనియతమైన సత్కర్మలు చేస్తూ బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనచేయుటము యుక్తము. శ్రేష్ఠము.

**10. (146) తద్భూతాధికరణము**

ఉన్నతాశ్రమముననున్న వారు అనగా యతిఆశ్రమ స్వీకారము చేసినవారు చ్యుతిని పొందకూడదు. ఎందుకంటే నియమము, అతద్రూపము, అభావము అనే కారణాలవలన. ఆశ్రమభ్రంశము పనికి రాదనేది నియమము. ఆశ్రమములలో ఆరోహణ వున్నది కాని అవరోహణ (క్రిందికి వచ్చుట) ఎక్కడా చెప్పబడలేదు, ఇది అతద్రూపము. అటువంటి శిష్టాచారము లేదుకనుక, ప్రచ్యుతి అనేది లేకపోవటము అభావము. సన్యాసాశ్రమమునందిన వారికి తిరుగులేదు. సన్యాసాశ్రమము నందినవారు నిరంతర బ్రహ్మచింతనచే బ్రహ్మవిద్యానిష్ఠులై బ్రహ్మానుభూతికి సాధన చేయవలయును.

**11. (147) ఆధికారికాధికరణము**

సన్యాస, వానప్రస్థాశ్రమముల వారికి ప్రాయశ్చిత్తము చెప్పబడలేదు. జైమినిమహర్షి కూడ అట్లే చెప్పినారు.

**12. (148) బహిరధికరణము**

ఉన్నతమైన సన్యాసి కాని, వానప్రస్థుడు కాని పతనము చెందిన యెడల స్మృతి ప్రమాణము చేత మరియు శిష్టాచారము చేత, రెండు విధముల బహిష్కరింపబడుదురు. ప్రచ్యుతి పొందిన నైష్ఠికునికి సంఘ బహిష్కారం వుంది.

**13. (149) స్వామ్యధికరణము**

ఉద్గీథాది ఉపాసనలకు కర్త ఋత్విక్కే. ఫలకామనా యుక్తములైన ఉపాసనలకు ఫలము మరియు కర్తృత్వము రెండు యజమానికే చెందును అని ఆత్రేయ మహర్షి అభిమతము. ఔడులోమి ఆచార్యుని అభిమతములో ఫలము యజమానిది కాని, కర్తృత్వము ఋత్విజునిది. ఎందుకంటే ఋత్విజుడు యజమానిచే ధన–దానాదులచే వరింపబడును కావున శ్రుతులప్రకారము కూడ కర్తృత్వము

ఋత్విజునిది మరియు ఫలము యజమానిది.

**14. (150) సహకార్యంతరవిధ్యధికరణము**

జ్ఞానము (పాండిత్యము), వికారములు లేకుండుట (బాల్యభావము), నిరంతర మననము (నిదిధ్యాసము–మౌనము) అను మూడింటి యొక్క పరిపక్వావస్థ కలిగినంతనే బ్రహ్మసాక్షాత్కారము యగును. గృహస్థాశ్రమములో నాలుగు ఆశ్రమముల భావమున్నది. సన్యాసాశ్రమములో బ్రహ్మవిద్య స్వభావసిద్ధము. అయితే ఇతర ఆశ్రమముల వారికి బ్రహ్మవిద్యా నిషేధము లేదు. బ్రహ్మవిద్యాధికారము అన్ని ఆశ్రమముల వారికి కలదు. పాండిత్య, బాల్యాలతో పాటు మౌనం కూడా విధియే. !

**15. (151) అనావిష్కారాధికరణము**

బాల్యమంటే రాగక్రోధాదులు లేని నిర్మల భావం. బ్రహ్మజ్ఞాని అయివుండి కూడా బాలునివలె శుద్ధముగా మౌనముగా తెలియని వానివలె ఉండటము శ్రేష్ఠము.

**16. (152) ఐహికాధికరణము**

బ్రహ్మజ్ఞానము ఈ జన్మలోనే కాని మారు జన్మలో కాని కలుగవచ్చును. బ్రహ్మజ్ఞానప్రాప్తికి ప్రతిబంధకములు కూడా వుంటాయి. ఉపాసనద్వారా, మౌనము ద్వారా, తపస్సుద్వారా, అనుగ్రహముద్వారా ప్రతిబంధకములు వీడిపోగానే బ్రహ్మజ్ఞానము, ముక్తి కలుగుతుంది.

**17. (153) ముక్తిఫలఅనియమాధికరణము**

మోక్షమనేది అందరికి ఒక్కటే. బ్రహ్మవిద్యా విదునకు ముక్తి ఫలము ఈ జన్మలో లేక మరుజన్మలో అని నియమము లేదు. అట్లే ఈ లోకములోనా, బ్రహ్మలోకములోనా అనే నియమము కూడా లేదు. ఎప్పుడు హృదయము నందు సమస్తకామములు సర్వథా అభావ స్థితిని పొందునో, అపుడు ఆ సాధకుడు అమృతుడగును. అతనికి ఇప్పుడు ఇచ్చటనే బ్రహ్మప్రాప్తి కలుగును. ఎవరికి ఇక్కడ అట్టి స్థితి కలుగదో అతనికి బ్రహ్మలోకము చేరగానే బ్రహ్మప్రాప్తి కలుగును.

# IV. చతుర్థాధ్యాయము - ఫలము

## IV.1. చతుర్థాధ్యాయ ప్రథమ పాద సమాసము

### జీవన్ముక్తి

**1. (154) ఆవృత్త్యధికరణము**

బ్రహ్మవిద్యారూపమైన ఉపాసనము యొక్క అభ్యాసము చేత బ్రహ్మవిద్యాభ్యాసము చేసి దానిని మాటిమాటికి విచారణచేసి ఆ పరమాత్మయందే సంలగ్నులు కావలెను. మరల మరల చేసే ఆవృత్తి ఉపాసన వలన బ్రహ్మవిద్యను నిరంతరము అభ్యాసము చేయవలయును.

**2. (155) ఆత్మత్వోపాసనాధికరణము**

"తత్త్వమసి" "అదియే నీవై యున్నావు" అని గురువు బోధించినపుడు సాధకుడు శ్రవణముచేసి,

అర్థముచేసుకొని, మననముచేసి, ధ్యానించి, అనుభూతి చెంది, "తాను పరమాత్మయే" అని తెలిసి "అహం బ్రహ్మాస్మి" – "నేనే బ్రహ్మమునై వున్నాను" అని వుంటాడు.

**3. (156) ప్రతీకాధికరణము**

మూర్తి మొదలైన వాని యందు భగవంతుని ధ్యానముచేసి ఉపాసన చేయబడుతున్నది. అదే విధముగా మనస్సు, ఆకాశము, ఆదిత్యుడు మొదలైన ప్రతీకలయందు కూడా ఉపాసన చేయు విధానమున్నది. ప్రతీక యందు భగవంతడను ఉద్దేశ్యముతో ఉపాసన వలన పరమాత్మ తనను ఉపాసించుచున్నట్లు భావించి గ్రహించును, అనుగ్రహించును. ప్రతిమను భగవంతునిగా ఉపాసించాలి. భగవంతుణ్ణి ప్రతిమగా చూడరాదు.

**4. (157) బ్రహ్మదృష్ట్యధికరణము**

ప్రతీకమునందు బ్రహ్మదృష్టి వుండాలి. కాని బ్రహ్మను ప్రతీకగా తలచరాదు. నికృష్ఠమైన దానిని ఉత్కృష్ఠమైన దానిగా చూడవచ్చును గాని, ఉత్కృష్టమైన దానిని నికృష్టమైనదానిగా చూడరాదు.

**5. (158) ఆదిత్యాధిమత్యధికరణము**

కర్మాంగాలయందు దేవతాభావం ఉండాలి. "ఈ తపింపచేయు ఆదిత్యుని ఉద్గీథముగా ఉపాసన చేయవలయును. ఇతడు ఉదయించు ప్రజల కొరకు ఉద్గానము చేయుచున్నాడు. ఉదయించుచు అంధకారమును భయమును నశింపచేస్తున్నాడు. ఎవరు ఈ విధముగా తెలిసికొని ఉపాసన చేయుచున్నాడో అతడు నిశ్చయముగా అంధకారమును, భయమును పొగొట్టువాడు అగుచున్నాడు" ఈ రీతిగా ఆదిత్యాది భావనాపూర్వక ఉపాసన చేయువిధానము.

**6. (159) ఆసీనాధికరణము**

కూర్చుండే ధ్యానం చేయాలి. కేవలము కూర్చుండియే ఉపాసన విఘ్నములేకుండ జరుగవచ్చును. కావున ఉపాసనాభ్యాసము ఆసీనమై, కూర్చుండియే చేయవలయును. ధ్యానోపాసనకు శరీరము, ఇంద్రియములు, మనస్సుల అచలత్వము, నిశ్చలత్వము అవసరము, ఆవశ్యకము. శ్రుతి, స్మృతులలో అట్లు చెప్పబడినది.

**7. (160) ఏకాగ్రతాధికరణము**

ఎక్కడ మనస్సుకు అనుకూలమైనదో, ఏకాగ్రతకుదురునో అక్కడ ధ్యానము చేయవలయును. అదే విధముగా ధ్యానమునకు, ఏకాగ్రతకు అనుకూలమైన సమయము కూడా ఎన్నుకొనవలెను. సాధకుడు తన ధ్యానమునకు అనుకూలమైన స్థానము, సమయము, పరిస్థితి ఎన్నుకొని నిర్విఘ్నముగా అభ్యాసము చేయవలెను.

**8. (161) ఆప్రాయాణాధికరణము**

జీవనకాలపర్యంతము, చివరిక్షణము వరకు ఉపాసన చేయవలయును. ధ్యానమనేది మరణపర్యంతం చేయాలి.

## 9. (162) తదధిగమాధికరణము

జ్ఞానికి పూర్వోత్తర కృతములైన పాపాలు అంటవు. బ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత పూర్వోత్తర పాపములన్నీ నశిస్తాయి. తామరాకు పైన నీటిబొట్టులాగ పాపములు బ్రహ్మజ్ఞానిని అంటవు. బ్రహ్మ జ్ఞానము లభించిన పిదప, జ్ఞానికి లోకసంగ్రహము కొరకు చేయు వ్యావహారిక కర్మల వలన కలుగు పాపములు అంటవు. పూర్వకృత పాపములు నశించును.

## 10. (163) ఇతరాసంశ్లేషాధికరణము

జ్ఞానికి పుణ్యకర్మలు అంటవు. బ్రహ్మదర్శనమైన వారికి అన్నికర్మలు - పుణ్యపాప కర్మములు అన్నీ క్షయము అవుతాయి. అట్టి జీవన్ముక్తునికి దేహపాతము అయిన వెంటనే మోక్షము కలుగును.

## 11. (164) అనారబ్ధ కార్యాధికరణము

అనారబ్ధకార్యాలు (సంచిత కర్మలు) బ్రహ్మజ్ఞానమువల్ల నశిస్తాయి. ఆరబ్ధకార్యములు (ప్రారబ్ధకర్మలు) వున్నంతవరకు శరీరము వుంటుంది. అనారబ్ధకార్యములు మొదలే (ప్రారబ్దకర్మలు) నశించి, ఆరబ్ధ కార్యములఫలములు పూర్తి కాగానే, శరీరము విడువగానే మోక్షము అవుతుంది. అనారబ్ధ కర్మలకే ఈ లక్షణము వర్తిస్తుంది.

## 12. (165) అగ్నిహోత్రాద్యధికరణము

జ్ఞానోత్పత్తి హేతువులైనందున నిత్యకర్మలు అనుష్టింప తగ్గవే. శ్రేష్ఠులైన వారు, జీవన్ముక్తులు, అగ్నిహోత్రాది యుక్త కర్మలు లోక సంగ్రహము కొరకు చేస్తూనే వుండాలి. వారు అట్లు చేసినపుడు ప్రజలు కూడా తమ తమ ఆశ్రమకర్మలను ఆపకుండా ఆచరిస్తారు. నిత్య, నైమిత్తిక కర్మలు మోక్షాపేక్ష కలవారిచేత (జ్ఞానులచేత) కూడ ఆచరింపదగినవే. కామ్యకర్మలు జ్ఞానోత్పత్తికి ఉపకారకాలు కావు. ఈ విషయములు కర్మములు, జ్ఞానములు తెలిసినవారు ఏకీభవించారు. జైమిని మహర్షి, బాదరాయణ మహర్షి ఈ విషయములో ఏకమతముతో నున్నారు.

## 13. (166) విద్యాజ్ఞానసాధనత్వాధికరణము

విద్యతో కూడిన (ఉపాసనతో కూడిన) నిత్యకర్మము, కేవలము నిత్యకర్మ ఈ రెండు ఈ జన్మలో బ్రహ్మజ్ఞానానికి సాధనాలు అవుతాయి. అయితే ఉపాసనలు లేని కర్మ వీర్యవంతము మరియు ఉపాసనతో కూడిన కర్మ వీర్యవత్తరము. ఉపాసనతో కూడిన కర్మకు శీఘ్రమే ఫలితాన్ని ఇచ్చే శక్తి వున్నది.

## 14. (167) ఇతరక్షపణాధికరణము

కర్మ క్షయంకాగా బ్రహ్మవేత్త బ్రహ్మముతో ఏకీభావం చెందుతాడు. బ్రహ్మజ్ఞానమందినవాడు పూర్వకృతమైన సంచితకర్మను భస్మము చేయును. క్రియమాణమగు ఆగామికర్మలతో అతనికి ప్రమేయము లేదు. ఇక మిగిలిన శుభాశుభరూపమైన ప్రారబ్ధకర్మలను ఉపభోగము ద్వారా నశింపచేసి, జ్ఞాని పరమపదమును పొందును.

# IV.2. చతుర్థాధ్యాయ ద్వితీయ పాద సమాసము

## ఉత్క్రాంతి

1. **(168) వాగధికరణము**

ఉత్క్రాంతి సమయములో (లేచి పోయే సమయములో) మొదలు వాగ్వృత్తి – వాక్కు వ్యాపారము – మనస్సులో కలసిపోతుంది. ఒక వాక్కు విషయమే కాదు. అన్ని ఇంద్రియములు ఉత్క్రాంతి సమయములో మనస్సులో లయము అవుతాయి. అన్ని ఇంద్రియములు వృత్తి రూపములో వాక్కును అనుసరించి మనస్సులో లయము అవుతాయి.

2. **(169) మనో అధికరణము**

ఇంద్రియ వ్యాపారాన్నీ మనస్సులో లయము అవుతున్నట్లు మనో వ్యాపారాలన్ని ప్రాణములో లయము అవుతాయి. మనో వ్యాపారాలన్నీ ఇంద్రియ వ్యాపారములతో, ప్రాణములో లయము అవుతాయి.

3. **(170) అధ్యక్షాధికరణము**

ప్రాణ వృత్తి జీవుని యందే లయము అవుతుంది. తేజస్సునందు కాదు. మరణ కాలమందు జీవుడు భూత సూక్ష్మాదుల యందు కూడుకొని యుంటాడు. మరణ సమయములో జీవుడు శరీరాన్ని వదిలి, మరొక శరీరము పొందేటప్పుడు అన్ని భూతాల యొక్క సూక్ష్మాంశ తన్మాత్రలలో వుంటాడు.

4. **(171) అసృత్యుపక్రయాధికరణము**

సగుణ బ్రహ్మజ్ఞానికి మూర్ధన్యనాడీ ప్రవేశము, ఉత్తర మార్గాన పోవటము కలుగుతుంది. జ్ఞానము లేని వానికి ఇతర నాడుల్లో ప్రవేశము కలిగి దక్షిణ మార్గములో పోవటము కలుగుతుంది.

ఆయా రెండు మార్గాల వరకు ఉపాసకుడైన జ్ఞానికీ, ఉపాసకుడు గాని అజ్ఞానికీ కూడా భూత సూక్ష్మావయవము సమానమే.

దేవయాన మార్గాన పోకుండా బ్రహ్మలోక ప్రాప్తి అనేది సగుణ బ్రహ్మోపాసకునకు కూడా కలుగదు. కావున ఉత్క్రాంతి ఇతనికీ సమానమే.

వాక్కు మనసుసనందు నిలచును. అక్కడ నుండి ప్రాణమును మనస్సును ఇంద్రియములను వెంట తీసుకొని, జీవాత్మ సూక్ష్మ భూత సముదాయము వుండు వరకు అనగా స్థూలశరీరము నుండి విడివడి సూక్ష్మశరీరముందుండు వరకు సాధారణ మనుజులకు, బ్రహ్మలోకమునకు పోవు సగుణోపాసకులకు గతి సమానమే.

5. **(172) సంసారవ్యపదేశాధికరణము**

అజ్ఞానికి ఎంతవరకు ముక్తి లభించదో అంతవరకు పరదేవత యందు ఉన్నా అతనికి సూక్ష్మశరీరముతో సంబంధము వుండును. ముక్తపురుషులవలె అతడు పరమాత్మ యందు విలీనుడు కాడు. అజ్ఞానికి నాడీ నిష్క్రమణము వుండి, ఆ నిష్క్రమణము సూక్ష్మ భూత సముదాయముతో

పాటు వుంటుంది. స్థూల శరీరమునకు అందే దహనము మొదలైన బాధలు కలిగిన అవి సూక్షశరీరమునకు అంటవు. ఊష్మము (వేడి) సూక్ష్మ శరీర ధర్మము.

### 6. (173) ప్రతిషేదాధికరణము

బ్రహ్మజ్ఞానులైన మహాపురుషులకు లోకాంతర గమనము వుండదు. జీవాత్మ నుండి ప్రాణముల నిష్క్రమణము నిషేధించు అవసరము లేదు. బ్రహ్మజ్ఞాని ఇచ్చటనే పరబ్రహ్మమును పొందురు.
బ్రహ్మ సాక్షాత్కారము కలిగిన విద్వాంసునికి దేవయానాది మార్గాలు కాని, ఉత్క్రమణము కాని లేదు.

### 7. (174) వాగాదిలయాధికరణము

బ్రహ్మవేత్త యొక్క ఇంద్రియములు (కళలు) పరమాత్మ యందే లయము అవుతాయి. సామాన్యముగా ఇంద్రియములు మరియు భూతములు తమ తమ మూల కారణ ప్రతిష్ఠలలో కలిసినా బ్రహ్మజ్ఞాని విషయములో అవి పరబ్రహ్మములోనే కలుస్తాయి.

### 8. (175) అవిభాగధికరణము

బ్రహ్మజ్ఞానులైన మహాత్ములు తమ శరీరములను వదిలి బ్రహ్మములో పూర్తిగా అవిభాగమైన లయము నందుతారు.

### 9. (176) తదోకోఅధికరణము

మరణ కాలమున మహాపురుషుడు హృదయాకాశము నందలి ప్రకాశము చేత వెలుగందిన బ్రహ్మరంధ్రము గుండా స్థూలశరీరము నుండి బయల్వెడలును. బ్రహ్మవిద్యా ఫలరూపమైన బ్రహ్మలోక ఫల ప్రాప్తి రూప సంస్కార స్మృతిలో, హృదయ స్థితుడైన పరమాత్మ అనుగ్రహముతో జ్ఞాని సూర్యరశ్మి మార్గమున వెడలును.

### 10. (177) రశ్మ్యనుసారాధికరణము

బ్రహ్మరంధ్రము ద్వారా బ్రహ్మవేత్త స్థూలశరీరము నుండి వెడలి, సూర్యరశ్మి యందు నిలచి, దానినాశ్రయించి సూర్యలోకము ద్వారము గుండా బ్రహ్మలోకము పోవుననియు, అందు ఏమియు విలంబనము లేదనియు తెలియుచున్నది.

### 11. (178) దక్షిణాయనాధికరణము

జ్ఞాన మార్గము - అజ్ఞాన మార్గము అను రెండు త్రోవలే శుక్ల పక్షము - కృష్ణ పక్షము, దినము - రాత్రి, ఉత్తరాయణము - దక్షిణాయణము అని కాల రూపములో చెప్పబడినవి. అవియే వెలుగు తోవ మరియు చీకటి తోవ. ఇవి నిజముగ కాలమునకతీతము. ఏ సమయములోనైనా పగలుయైనా, రాత్రియైనా మరియు ఉత్తరాయణము అయినా, దక్షిణాయనము అయినా ఈ రెండు మార్గములు - వెలుగు తోవ, చీకట్ల తోవ-వర్తిల్లుతాయి. బ్రహ్మ జ్ఞానికి సరియైన సమయము. ఆయనము కొరకు వేచియుండే అవసరము లేదు. ఏ సమయమైనా, ఈ కాలమైనా, ఏ ఆయనము అయినా బ్రహ్మజ్ఞానికి వెలుగు తోవయే.
కాల విశేషములకు అర్థము కాలాభిమాన దేవతలు.

జ్ఞానమార్గము వెలుగు తోవ తిరుగులేని తోవ.
అజ్ఞాన మార్గము చీకట్ల తోవ. తిరుగువుండే తోవ.

# IV.3. చతుర్థాధ్యాయ తృతీయ పాద సమాసము

## దేవయాన మార్గము

### 1. (179) అర్చిరాద్యధికరణము

బ్రహ్మలోకప్రాప్తి కోరే ఉపాసకులు అంతా అర్చిరాదిమార్గము గుండా వెళ్లుతారు. సగుణోపాసనా విద్వాంసులకు అందరికీ ఈ మార్గమే ప్రసిద్ధము. అర్చిరాదిమార్గము అంటే వెలుగుమార్గము. దీనినే దేవయానమార్గము, ఉత్తరాయణమార్గము అని అంటారు. ఒక్కొక చోట ఏ మార్గమూ చెప్పకపోతే ఆయా విద్యలకు అర్చిరాదిమార్గము ద్వారానే బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

### 2. (180) వాయ్వధికరణము

అర్చిరాదిమార్గములో వాయులోకము, సంవత్సరము తరువాత, సూర్యలోకము కన్న ముందు వుంటుంది.

### 3. (181) వరుణాధికరణము

విద్యుత్తులోకము తరువాత వరుణలోకము వుంటుంది. వరుణలోకము తరువాత ఇంద్రలోకము, ప్రజాపతి లోకమునకు చోటు ఇవ్వాలి.

### 4. (182) అతివాహికాధికరణము

బ్రహ్మలోకమునకు పోవు విద్వాంసులను ఒకచోటు నుండి ఇంకొక చోటునకు తీసుకుని పోయేవారిని అతివాహికులు అంటారు. అర్చిరాది దేవతలు అతివాహిక దేవతలు అంటే సూక్ష్మశరీరాన్ని మోసుకొనిపోయే దేవతలు అవుతారు. అతివాహికులు అయ్యే ఈ అర్చిరాది దేవతలు అన్ని కాలములలోనూ, అన్ని సమయములలోనూ వుంటారు. కావున ఉపాసకుడు దక్షిణాయనములో మరణించినా, రాత్రివేళ చనిపోయినా బ్రహ్మలోకాన్ని చేరటములో సమస్య వుండదు. విద్యుల్లోకము నుండి అక్కడ ప్రకటమగు అమానవపురుషుడు జ్ఞానిని బ్రహ్మలోకమునకు తీసుకొని వెళ్లును.

### 5. (183) కార్యాధికరణము

శ్రుతియందు గంతవ్య రూపములో, ప్రజాపతి రూపములో గ్రహింపబడినందున కార్యబ్రహ్మ యందే గతి, గమనము అనేది సరిపోతుంది అని చెప్పిన బాదరి ఆచార్యుని అభిప్రాయము సమ్మతము. కల్పిత గుణాలతో కూడిన వాడైనా కార్యబ్రహ్మను నిర్గుణ బ్రహ్మములాంటివాడే కావున కార్యబ్రహ్మము అనుట సమంజసమే.

ప్రళయకాలములో బ్రహ్మలోకము నశించిన పిమ్మట దాని స్వామి అయిన బ్రహ్మతోపాటు బ్రహ్మవిద్యోపాసకులు పరబ్రహ్మ ప్రాప్తిని అంది ముక్తులగుదరు. అమానవపురుషుడు వీరిని బ్రహ్మ సమీపమునకు తీసుకువెళ్లును" అన ఉపనిషత్తు వాక్యము నందు చెప్పబడిన బ్రహ్మ శబ్దము ముఖ్యముగా పరబ్రహ్మ వాచకము అని జైమినిమహర్షి అభిమతము. దేవయానమార్గము ద్వారా

పోవు బ్రహ్మవిద్యోపాసకులు పొందునది పరబ్రహ్మప్రాప్తి కాకుండ కార్యబ్రహ్మ విషయకము. సాధకుని లక్ష్యము అప్రతిమాయుతమైన, మహద్యశమైన, అనంత కీర్తియైన పరబ్రహ్మమే కాని కార్యబ్రహ్మ ప్రాప్తి కాదు. బ్రహ్మవిద్యోపాసకునకు ప్రాప్తి విషయక సంకల్పము కార్యబ్రహ్మ సంబంధమైనవి కాదు. అది పరబ్రహ్మ విషయకము. సాధకుని లక్ష్యము అప్రతిమాయుతమైన, మహాదృశమైన, అనంతకీర్తియైన పరబ్రహ్మమే కాని, కార్యబ్రహ్మ కాదు.

### 6. (184) అప్రతీకాలంబనాధికరణము

ప్రతీకోపాసన చేయని వాళ్లను అర్చి మొదలైన దేవతలు మరియు అమానవ పురుషుడు బ్రహ్మలోకమునకు చేరుస్తాడు. దేవయానమార్గమున పోవు రెండు రకములైన ఉపాసకులకు, సగుణోపాసకులైన కార్యబ్రహ్మ ఉపాసకులు మరియు పరబ్రహ్మ ఉపాసకులకు పునరావృత్తి లేదు. ప్రతికోపాసకులకు బ్రహ్మలోక ప్రాప్తి లేదు. బ్రహ్మ ఉపాసకులకు బ్రహ్మలోక ప్రాప్తి కలదు.

## IV.4. చతుర్థాధ్యాయ చతుర్థ పాద సమాసము

### విదేహ ముక్తి

### 1. (185) సంపద్యావిర్భావాధికరణము

స్వప్రకాశమైన ఆత్మసాక్షాత్కారాన్నిపొంది, ఆ ఆత్మరూపములో విద్వాంసుడు ఆవిర్భూతుడు అవుతాడు. "స్వ"రూపములో వుంటాడు. బ్రహ్మస్వరూపము వంటి జీవుడు తానెయైన నిజస్వరూపములో వుండుటయే ముక్తి. అజ్ఞాన నివృత్తికాగానే స్వరూపావిర్భావము అవుతుంది. కాబట్టి ముక్తి అనేది వచ్చినది కాదు, పుట్టినది కాదు. ముక్తి అనేది మొదలే వున్నది. వున్నదని తెలియకపోవటము అజ్ఞానము. ముక్తియే తన స్వభావము అని తెలియటము జ్ఞానము. పరంజ్యోతిలో వున్న జ్యోతి శబ్దానికి ఆత్మ అని అర్థము.

### 2. (186) అవిభాగేన దృష్టత్వాధికరణము

ముక్తాత్మయొక్క స్థితి పరమాత్మయందు అవిభక్తరూపముకులోనైనది. జ్ఞానియొక్క ఆత్మలో, పరమాత్మలో ఏ విభాగమూ వుండదు.

### 3. (187) బ్రహ్మాధికరణము

ముక్తుడు బ్రహ్మసంబంధమైన తనరూపములో కలుస్తాడు. అని జైమిని మహర్షి అభిమతము. ముక్తపురుషుడు సగుణుడు అని ఆయన మతము. శ్రుతి, స్మృతుల ప్రకారము ఉపాసకుడు ఆ పరబ్రహ్మతో సదృశమైన దివ్యస్వరూపముతో సంపన్నుడు అగును. ఔడులోమిఆచార్యుని ప్రకారము ముక్తపురుషుడు కేవలము చైతన్య స్వరూపములో వుంటాడు. ముక్తుడు నిరస్తమైన సర్వప్రపంచము కలది, ప్రసన్నము, నిర్మలము, వర్ణనాతీతము అయిన బోధాత్మతో, చైతన్యముతో నిష్పన్నము అవుతాడు, అభిన్నముగా వుంటాడు అని ఆయన అభిమతము. బాదరాయణ మహర్షి అభిప్రాయములో ముక్తపురుషుడు సగుణరూపములో ఆ పరమాత్మకు సదృశమైన దివ్యరూపములో జైమిని మహర్షి చెప్పినట్లు, కేవలము చైతన్యరూపము స్వరూపములో ఔడులోమి ఆచార్యుడు

చెప్పినట్లు మరియు పరమాత్మలో అభిన్నరూపములో కూడా అంటే తన భావానుసారము సగుణ రూపములో కాని చైతన్య రూపములో తన  కాని మరియు ఈ మూడు రూపముల సంకల్పానుసారము వుండగలదు.

**4. (188) సంకల్పాధికరణము**

బ్రహ్మలోకమునకు చేరిన ఉపాసకునికి సంకల్పమాత్రముననే పితృదేవతలు మొదలైనవారు హాజరు అవుతారు. మరియు మనస్సు ద్వారానే కేవలము సంకల్పముతోనే ఆ లోకముల, దివ్యభోగముల అనుభవము కలుగును. అటువంటి తిరుగులేని సంకల్పము వలన విద్వాంసుడు అనన్యాధిపతి అవుతున్నాడు. తనకు వేరొక ప్రభువులేనివాడు అవుతున్నాడు. అతనికి సమస్త లోకాల్లోనూ స్వతంత్ర సంచారము వుంటుంది.

**5. (189) అభావాధికరణము**

విద్వాంసునికి బ్రహ్మలోకములో శరీరము వుండదు మరియు మనసుతోనే భోగములను అనుభవించును. అతినికి మనస్సుకంటే భిన్నమైన శరీరము ఇంద్రియములు వుండవు-ఈ రీతిగా బాదరి ఆచార్యుల మతము. జైమిని ఆచార్యుల ప్రకారము ముక్తునికి శరీరము, ఇంద్రియములు కూడా వుంటాయి. బాదరాయణ ఆచార్యుల ప్రకారము ముక్తుడు సంకల్పానుసారము శరీరముతో వుండుట, లేకుండుట రెండూ సంభవము అవుతుంది. ఒకే ద్వాదశాహః క్రతువు అనేక కర్తృత్వముగా (సత్రముగా), నియతకర్తృత్వముగా (అహీనముగా) రెండు విధముల చేయవచ్చునో అదే విధముగా ముక్తుడు సంకల్పానుసారముగా శరీరముతో, శరీరము లేకుండా వుండవచ్చును. ఏవిధముగా స్వప్నములో మానసికముగా, జాగృదవస్థలో శారీరకముగా మనుజుడు ఈ లోకములో భోగములు అనుభవించగలడో, అదే విధముగా ముక్తుడు బ్రహ్మలోకములో భోగములు రెండు విధములుగా అనుభవించవచ్చును. ఆ రీతిగా జైమిని, బాదరి, బాదరాయణ ఆచార్యులు ముగ్గురి అభిమతము ముక్తునికి వర్తించవచ్చును.

**6. (190) ప్రదీపాధికరణము**

ఎట్లు అనేక దీపములందు ఒకే అగ్ని ప్రకాశించుచున్నదో, అదే ప్రకారము ఒక ముక్తాత్మ తన సంకల్పముచేత రచింపబడిన సమస్త శరీరములందు ప్రవేశించి, దివ్యలోక భోగములను అనుభవించ గలదు. బ్రహ్మలోకమునకు పోవు అధికారులకు అక్కడ దివ్య భోగానుభవము, అనేక శరీరధారణ, యథేచ్ఛగా లోకముల చరించుట కూడా చెప్పబడినది కనుక విరోధము లేదు.

**7. (191) జగద్వ్యాపారాధికరణము**

ఈ జడచేతనాత్మకమైన సమస్త జగత్తుయొక్క రచన, సంచాలనము, ప్రళయము మొదలైన కార్యములన్నింటి యందు ముక్తాత్మలకు ఎట్టి ప్రమేయము కాని సామర్థ్యముకాని లేదు. వారు కేవలము అక్కడి దివ్యభోగములననుభవించుటకు సమర్థులు. వీరికి వుండే స్వారాజ్యము, స్వాతంత్రము అంతా ఆ నిత్యసిద్ధుడైన ఈశ్వరునికి లోబడినదే. కావున ముక్తులైన ఉపాసకులకు లోకసృష్టి చేసే సామర్థ్యము వుండదు. వీరు బ్రహ్మసమానులే కాని బ్రహ్మకాదు. ముక్తాత్మకు ప్రాప్తమగు ఫలము కర్మఫలమువలె వికారములేనిది. బ్రహ్మలోక భోగములు అనుషంగికములు.

బ్రహ్మవిద్యకు సార్థకత బ్రహ్మప్రాప్తి యందు కలదు. పరబ్రహ్మలో సగుణ-నిర్గుణరూపాలు రెండూ వున్నాయి. ఆ పరమేశ్వరుని నిర్గుణరూపాన్ని సగుణోపాసకులు పొందలేరు. అలాగే సగుణస్వరూపములోని నిత్యసిద్ధేశ్వర జగత్సృష్టి సామర్థ్యాన్ని కూడా పొందలేరు. బ్రహ్మలోకములు వికారములులేనిది. విశుద్ధము. జీవన్ముక్తుడు ఆయాలోకములకు పోవుట అక్కడ భోగములు అనుభవించుట కేవలము లీలామాత్రము. అవి అంటవు. అవి పునర్జన్మ కారకములు కావు. సగుణోపాసకులు కార్య బ్రహ్మతో పాటు ప్రళయకాలమున పరబ్రహ్మ స్వరూపమును పొందుతారు. నిర్గుణ జ్ఞాన సంపన్నులైన వారికి పునరావృత్తి లేదు. పునరావృత్తి లేదు.

ఇట్లు

**సర్వాధికరణ సమాస సంగ్రహము**



# శ్రీ బాదరాయణీయ బ్రహ్మ సూత్రబోధామృత లహరి

## సర్వాధికరణ సార సంగ్రహము

### శ్రీ బాదరాయణుల వారి సిద్ధాంత సార సంగ్రహము

# I. ప్రథమాధ్యాయము - సమన్వయము

## I.1. ప్రథమాధ్యాయ ప్రథమపాద సారము

### స్పష్టబ్రహ్మలింగ వాక్య విచారణ

**జిజ్ఞాస చేయవలసినది, ఈ జగమునకు జన్మ, స్థితి, లయములకు మూలము మరియు కారణము, సర్వజ్ఞత కలిగి సర్వశాస్త్రములకు మూలము, సర్వవేదాంతవాక్యముల లక్ష్యము మరియు గమ్యము, మూలచైతన్యము, ఆనందమయము, ఆదిత్యమండల పురుషుడు మరియు అక్షిస్థ పురుషుడు, ఆకాశము, ప్రాణము, జ్యోతిస్సు మరియు ప్రాణ శబ్దార్థము అన్నియు బ్రహ్మముయే.**

## I.2. ద్వితీయ పాద సారము

### అస్పష్ట బ్రహ్మ లింగ సంబంధ వాక్య విచారణ

సర్వత్ర ప్రసిద్ధమైన ఉపాస్యదైవము, సర్వ ప్రపంచములను గ్రహించి లీనము చేసుకొనునది, హృదయ **గుహలో ప్రవేశించిన ఇద్దరు పరమాత్మ, జీవాత్మల మూల ఐక్యరూపము, నేత్రమందున్న అక్షిస్థ పురుషుడు, అందరియందుండి నియమించు అంతర్యామి, అదృశ్యత్వాది గుణములు జ్ఞాతాది ధర్మముతో కలది,** వైశ్వానరుడు అన్నియు పరబ్రహ్మ వాచకములే.

## I.3. తృతీయ పాద సారము

### జ్ఞేయ బ్రహ్మ సంబంధ వాక్య విచారణ

**ద్యు, భూలోకములకు ఆయతనము మరియు ఆధారము,** భూమము, అక్షర పురుషుడు, ఈక్షించేవాడు మరియు దర్శనీయుడు, హృదయ దహరాకాశము, స్వప్రకాశమై జీవాత్మనానుకరించేది, అంగుష్ఠమాత్ర పురుషుడు, దేవతలకు తెలిసికొన అధికారమున్న జ్ఞానగమ్యము, ఉపనయనము కవాటమై గాయత్రీ ద్వారముగాకలది, సాధన చతుష్ఠయసంపత్తి ద్వారమున బ్రహ్మవిద్యాధికార లక్ష్యము ఐనది, సమస్త జగములను జీవులను కంపనము, చలనము చేయించేది, **జ్యోతులకు జ్యోతి పరంజ్యోతి, జీవాత్మలో ప్రవేశించి నామరూపాలను విస్తరింప చేసేది మరియు గాఢనిద్రయందు మరియు మృత్యువుయందు జీవునితో కలియునది అన్నియు పరబ్రహ్మమే.**

## I.4. చతుర్థ పాద సారము

### బ్రహ్మము కాని వాని నిరాకరణ

ఏది ప్రధానముకన్నమించినదో, దేనికి అజము అనేది శక్తియో, పంచజన అనే శబ్దము దేనికి సంబంధము అవుతుందో, ఏది జగత్కారణమని శ్రుతివాక్యములన్నీ పరస్పర విరోధము లేకుండా

చెబుతున్నాయో, ఏది వేదితవ్యుడైన పురుషుడో, ఏది దృష్టవ్యము, శ్రోతవ్యము, జ్ఞాతవ్యమో, ఏది జగత్తుకు నిమిత్తకారణము మరియు ఉపాదానకారణమో (ఏది తాను తననే సృజించినదో), **ఏది జగత్కారణములు కావని నిరాకరించబడిన జడములన్నింటికి ఆధారమైయుండి జగన్మూలమైనదో అదియే బ్రహ్మము.**

# II. ద్వితీయాధ్యాయము - అవిరోధము

## II.1. ద్వితీయాధ్యాయ ప్రథమ పాద సారము

### సాంఖ్యాది మత నిరాకరణ

**ఏది వేద ప్రమాణం కాని సాంఖ్యమునందు చేప్పబడనిదో; ఏది ప్రధానము కన్న మించినది మరియు చైతన్యవంతమైనదో; ఏది సాంఖ్యము మరియు యోగముల ద్వారా అర్థము, అనుభూతి కాజాలని అతీతమో;** ఏది జగత్తునకు ఉపాదాన కారణమైనందున తన స్వభావమునకు భంగము లేనిదో; దేనిలో జగత్తు లీనమైనప్పుడు దోషములు లేకుండా పోవునో; ఏది శిష్టులు ఒప్పుకొనిన మతములు, వేదసమ్మతమైన మతములు స్వీకరించునదో; దేని విషయంలో వస్తు భేదము ఉన్నా, కారణ భేదము లేదో మరియు ఏది జగత్తుకు ఉపాదాన కారణము మరియు నిమిత్త కారణమో; దేని వికారణమైన జగత్తు ఏదానికి భిన్నము కాదో; ఏది తానే కారణము మరియు కార్యమైన జగత్తుయో; దేనిలో జగత్తు మొదలు అప్రకటితముగా ఉండి తరువాత సృష్టిలో ప్రకటింతముగా ఉండునో; దేనికి జగత్తు ఎప్పుడూ అనన్యమో; ఏది సదా ముక్తమో మరియు దేనికి హితము, అహితము రెండూ లేవో; కారణమైన దేనిలో కార్యవైచిత్ర్యముల వలన భేదము, భేద భావము లేవో; ఏది జగత్తుకు కారణమై, తనయందే జగత్తుగా కావలసిన స్వాభావిక శక్తి కలదో; ఏది ఏ సాధనము సహాయము లేకుండా జగత్తును సృష్టించునో; ఏది జగత్తునకు కారణము ఆశ్రయము, సాక్షి మరియు అతీతమో; ఏది జగత్తుకన్నా మిన్నయో; జగత్తు దేనియొక్క ప్రకటితమైన ఒక పాదము మాత్రమేనో మరియు దేని మూడు పాదములు జగత్తుకు మించి ఉన్నాయో; ఏది సర్వశక్తి సామర్థ్యవంతమో; ఏది సర్వజ్ఞుడు మరియు సంకల్ప మాత్రముననే సర్వము సంపన్నము చేయగల సర్వాంతర్యామియో; ఏది సర్వశక్తి ఉపేతము మరియు సర్వమూలమో; జగద్రచన దేనియొక్క ప్రయోజన రహిత ఆనందస్వరూపమో; **ఏది ఆప్త కాముడో; ఏది అనాది మరియు ఆది మధ్యములు లేని ఈ జగత్తును కర్మ అకర్మల ప్రకారం పక్షపాతము మరియు నిర్దయత్వము లేకుండా లీలగా సృష్టిస్తుందో; ఏది జగత్తుకు కారణము కావలసిన ధర్మములైన సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము మొదలైన సర్వధర్మములు తన యందు ఉత్పన్నమైనందున దేనికి జగత్తు కారణము అను సిద్ధాంతము దోషరహితము, సంశయాతీతము మరియు సత్యమో అదియే బ్రహ్మము.**

## II.2. ద్వితీయ పాద సారము

### శ్రుత్యసమ్మత మార్గ నిరాకరణ

**సాంఖ్యము యొక్క ప్రధానము, వైశేషికన్యాయముల యొక్క పరమాణువులు, నిరీశ్వర బౌద్ధము యొక్క సముదాయములు,** యోగాచార బౌద్ధము యొక్క విజ్ఞానము, మాధ్యమిక బౌద్ధము యొక్క శూన్యము, **జైనము యొక్క సప్తభంగిన్యాయతత్త్వము,** పాశుపతమతము యొక్క నిమిత్తకారణమైన కేవలము మహేశ్వరుడు మరియు

ఉపాదాన కారణమైన కేవలము ప్రకృతి, పాంచరాత్ర భాగవతుల చతుర్వ్యూహము **అన్నియు జగత్కారణాములు కాక ఏది జగత్తుకు తానే నిమిత్త కారణము మరియు ఉపాదాన కారణమో అదియే బ్రహ్మము.**

## II.3. తృతీయ పాద సారము

### స్వావిరోధ నిరూపణ

దేని నుండి ప్రకటమైన, ఉత్పత్తి చెప్పబడని ఆకాశము అమృతమో, అట్లే దేని నుండి ప్రకటమైన మరియు ఉత్పత్తి చెప్పబడిన వాయువు కూడా అమృతమో, దేనికి ఉత్పత్తి లేదో మరియు ఏది అనంతమై ఎప్పుడూ వుండేదో, వాయుభావాన్ని చెందిన దేని నుండి తేజము సృజించినదో, దేని రూపమైన వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము ఉద్భవించినదో మరియు జలమునకు మూలము కూడా నేదియో, దేని రూపము అయిన వాయువు నుండి వచ్చిన అగ్ని నుండి వచ్చిన జలము నుండి పృథివి, పృథివి నుండి అన్నము ఉత్పత్తి అయినదో, ఏది అన్నిటియందు వుంటూ అన్నిటిని ప్రవర్తింపచేసేదియో మరియు అన్నింటిని నియమింప చేయటము దేని లింగముయో, దేని నుండి సృష్టి సమయములో భూతములు అనులోమ పద్ధతిలో ఉత్పన్నమై ప్రళయ సమయములో దేనిలో విలోమ పద్ధతిలో విలీనము అవుతాయో, దేని నుండి వచ్చిన భౌతికమైన పంచభూతములతో పాటు ఉద్భవిల్లిన పంచేంద్రియములు ఆ పంచ భూతముల అనురూప ప్రతిబింబము అయిన జీవాత్మ నిత్యము, అమృతము మరియు జననమరణ సంబంధములు లేనిదో, దేని అనురూపము ప్రతబింబము అయిన జీవాత్మకు ఉత్పత్తి లయములు లేవో, దేని అనురూపము, అంశఅయిన జీవాత్మ నిత్యుడు, జ్ఞాత, చైతన్య స్వరూపుడుయో, దేని గూర్చి తెలిస్తే విద్య అయితే దానికి, జీవాత్మకు బేధము వుండదో, ఏది ప్రసాదించిన బుద్ధితో జీవాత్మ కర్తగా తన ప్రారబ్ధ కర్మల ప్రకారము అదియె విధించిన శుభాశుభకర్మలను ఎన్నుకొనుటలో స్వతంత్రమో, తనకు బుద్ధి-చిత్తము- అహంకారము- కర్తృత్వము అనే అంటులు లేని జీవాత్మ ఏది అవుతుందో, జీవాత్మ అంటువున్నపుడు తన రూపము అంటులేనపుడు దేని రూపము అను రెండు రూపములు వంద్రంగివలె అందుచున్నాడో, జీవాత్మ ప్రారబ్ధ సమస్యలలో పరతంత్రుడుగా దేని ఆధీనములో వుండి ప్రస్తుత సమాధానము సాధనలో స్వతంత్రుడో, **జీవాత్మదేని అంశమో మరియు అవిద్య తొలగినపుడు ఏది అవుతాడో మరియు జీవాత్మదేని అభాసయో, అదియే బ్రహ్మము.**

## II.4. చతుర్ధ పాద సారము

### ప్రాణాదివాక్య విరోధ పరిహారము

దేని నుండి వికారములైన ప్రాణములు, ఇంద్రియములు ప్రాదుర్భవము ఐనవో మరియు దేనినుండి పుట్టిన ప్రాణములు ముఖ్యమో మరియు గౌణము కావో, ఏది ప్రాణోత్పత్తికికారణమో, దేని నుండి పుట్టిన ప్రాణములు ఏడుకాక పదుకొండుయో (5+5+1), దేని నుండి వచ్చిన ప్రాణములన్నీ సూక్ష్మరూపములు, అణురూపములు మరియు విజ్ఞాన సాధనములే కాని దేనివలె అవి సర్వ వ్యాపకములు కావో, దేని నుండి వచ్చిన పదునొకండు ప్రాణములకు (ఇంద్రియములకు) సామర్ధ్యాన్ని ఇచ్చే మొదటి ముఖ్యప్రాణము వాయువు కాని-దానికి సంబంధించిన స్పందన కాని కాక శక్తినిచ్చేది మరియు శ్రేష్ఠమైనది

ఐనను చైతన్యముకాక జడమే అవునో, దేని నుండి వచ్చిన ఆ ముఖ్యప్రాణము అణుస్వరూపము మరియు సర్వవ్యాపకమో, ఏది అగ్ని మొదలైన తత్త్వములలో ప్రవేశించినదో, ప్రాణములకు దేనితోబాటు ప్రాణభారియైన జీవాత్మతోనే సంబంధము వున్నదో, **దేని నుండి వచ్చిన ప్రాణములు మరియు మనస్సు ఇంద్రియముల కన్న వేరో మరియు ఏది జీవరూపములో ప్రవేశించి నామరూపములను విస్తరింపచేసినదో అదియే బ్రహ్మము**

# III. తృతీయాధ్యాయము - సాధన

## III. తృతీయాధ్యాయ ప్రథమ పాద సారము - సాధన

### దేహాంతర గమనము

**ఒక దేహము నుండి ఇంకొక దేహమునకు దేహాంతర గమనము చేసేది, బీజరూపములో సూక్ష్మభూతములైన అన్ని తత్త్వములతో సంయుక్తమై నిష్క్రమణ చేసేది,** శేషకర్మానుసారము జన్మలనందేది, పూర్వకర్మలను ఆయా కర్మలకనుగుణమైన లోకములలో అనుభూతి నొంది శేషకర్మలననుసరించి నవీన జన్మనందేది, తను చేసిన కర్మల ప్రకారము దేవయాన, పితృయాన, తృతీయ యానములనే మూడు మార్గములలో వెళ్లేది, కర్మఫలభాగము పూర్తియైన తరువాత శీఘ్రముగ క్రిందకు వచ్చేది, తత్వరూపములలో క్రమముగా సూక్ష్మభూతములతో పాటు క్రిందికి దిగేది, వర్షరూపముతోపాటు క్రిందికి దిగి, భూమిని చేరి, ధాన్యరూపములో అనురూపముతో వుండి, పురుషునిచే భుజింపబడి, వీర్యమై, స్త్రీలో గర్భరూపమై, తన సంస్కారములతో పాటు నవీన జన్మమందేది పరిమితరూపములో అవిద్యచే కప్పబడి యుండేది అయిన జీవాత్మ దేని అంశమో అదియే **బ్రహ్మము.**

## III.2. ద్వితీయ పాద సారము

### జీవాత్మ పరమాత్మ తత్త్వ విచారణ

**జీవుల కర్మానుసారము శుభాశుభ సూచకములైన స్వప్నములు కలుగటానికి ప్రేరణ చేసేది. సుషుప్తియందు అనుభవమయ్యేది** – సుషుప్తిలోకి వెళ్లి జీవుడు అనుభూతి చెంది మరియు ఆ జీవుడు జాగృదావస్థలోకి వచ్చి అనుభూతి కానిది, ముగ్ధావస్థలో (మూర్ఛవస్థలో) అనుభూతి కాబడలేనిది – నిరాకార, సాకారలక్షణములు రెండూ కలిగినది అని అనిపించునది మరియు ఉపాధుల వలన సాకారముగ కనిపించి అనిపించినను గుణరహితము, నిర్విశేషము, విభాగరహితము, అవిభక్తము, అపరిచ్ఛిన్నము, ఏకము అయినది – **భేదములు అనిపించినను భేదములు లేనిది, జీవాత్మ, పరమాత్మ అని రెండనిపించినను రెండు కానిది మరియు ఒకటే అయినది – నిరవయవము, అద్వితీయము, సర్వగతము, అంతటా వున్నది, ఎప్పుడూ వున్నది – సర్వాంతర్యామియై, సర్వాధ్యక్షత కలిగి కర్మానుగుణముగా జీవులకు కర్మఫలములను కలిగింపచేసేది అదియే పరబ్రహ్మము.**

[నారాయణ వాక్యము :

బ్రహ్మసూత్ర బోధామృత లహరి వ్రాసేటందుకు ప్రేరణ ఇచ్చేది, రాయటానికి శక్తి, భక్తి, యుక్తి, స్ఫూర్తినిచ్చేది, వ్రాస్తున్నపుడు ప్రవహించే చైతన్యము, వ్రాసిన తరువాత వచ్చే సంతృప్తి, శాంతి, ఆధారము, సేవాస్ఫూర్తి బ్రహ్మమే! వ్రాయుటకాధారమైన కాగితము, వ్రాతకు సాధనమైన కలము, వ్రాసే చేతిని నడిపించే శక్తి, వ్రాత వ్రాయటానికి కలిగే స్ఫూర్తి పరబ్రహ్మము.]

# III.3. తృతీయ పాద సారము

## అంతరంగ సాధన

దేనిని గూర్చి సర్వవేదాంతము, అన్ని ఉపనిషత్తులు లక్ష్యము చేసి ఉద్దేశ్యము చేసి చెప్పినవో; మరియు దానిని గూర్చి చెప్పిన విద్యలు భిన్నములు కావో; దేనిని గూర్చి ఒక శాఖలోని విద్యలు ఇంకొక శాఖలోనికి ఉపసంహారము చేయవచ్చునో; దేని గూర్చి వేరువేరు విద్యలలో అన్యధాత్త్వము లేదో; ఏది సర్వవ్యాపకత్వము, సర్వశక్తిమత్త్వత, సర్వజ్ఞత కలిగి సర్వవిద్యల లక్ష్యము- ఉద్దేశ్యము- గమ్యముయో, మూడు వేదములలో దేని గూర్చి చెప్పిన ప్రాణవిద్యలు భిన్నముకాక సమానమో; ఏది ఆనందాది సర్వగుణసంపన్నమై సర్వదా-సర్వత్ర వుండునదియో దేనికి ఆనందాది లక్షణములు స్వాభావికమో; మరియు రూపకల్పనలు స్వాభావికముకాదో, శబ్ద-స్పర్శ-రూప-రసగంధాది గుణములు లేనిదై, ఆద్యంతములు లేనిదైన ఏ దానిని గూర్చి చింతనచేసి తెలిసికొనినవాడు మృత్యు ముఖమునుండి విడువబడునో; ఏది ఆత్మ-సత్తు మరియు జగత్కారణమో, అన్నమయకోశము నుండి ప్రాణమయకోశము వరకు అన్నికోశములు దేని చైతన్య స్థానములో మరియు ఉదకమనే వస్త్రము కప్పబడిన అన్నము దేని రూపమో, ఏది శతపథబ్రాహ్మణములోని శాండిల్యవిద్య మరియు బృహదారణ్యకములోని శాండిల్యవిద్య అనే రెండు విద్యలకు లక్ష్యమో; ఏది అధిదైవతముగా సూర్యమండలములో "అహః" అనే పురుషునిగా మరియు అధ్యాత్మికముగా అక్షి గోళములో "అహం" అనబడే పురుషునిగా వేరువేరు పేర్లతో వేరు స్థానములలో వేరువేరుగా ఉపాసన చేయబడుతున్నదో; దేని యొక్క సంభృతి అనే సర్వలోకములను భరించుట మరియు వ్యాప్తి అనే ద్యులోకాన్ని సర్వబ్రహ్మాండములు వ్యాపించుట అనే గుణములు నేత్రాంతవర్తియైన పురుషునికి గాని సూర్యమండలవర్తియైన పురుషునికి గాని వర్తించవో; దేనిని గురించి చెప్పిన తాండి, పైంగి పురుషవిద్య మరియు తైత్తరీయ ఆరణ్యకములోని పురుషవిద్య, భిన్నములో; దేని విద్యయందు హృదయాన్ని వేధించటము, ధమనులను ఛేదించటము అనే అభిచారిక కర్మలయందు వినియోగము వున్న మంత్రములకు ఉపసంహారము లేదో; దేనిని గూర్చిన సమాన విద్యలలో పుణ్య పాపముల హాని, ఉపాయనముల దృష్టాంతములను యధాయోగ్యముగా అధ్యాహారము చేయవచ్చునో; దేని జ్ఞానమందిన వారికి సకృతదుష్కృతములు మరణ సమయములోనే వదిలిపోతాయో మరియు దేని జ్ఞానము లేనివారికి దేవయానమార్గములో దాని ప్రాప్తి కలుగదో; దేని జ్ఞానమంది తెలిసినవారికి దాని తత్కాల ప్రాప్తి మరియు దేని సగుణోపాసన చేసిన వారికి దేవయానమార్గములో దాని లోకమునకు పోవుట అనునవి అగునో; దేనిని తెలిసినప్పుడు రాకపోకలు ఉండవో; అక్షరమైన దేనికి సత్యము, జ్ఞానము, ఆనందములవలెనె అనంతము, అగ్రాహ్యము అస్పర్శము, అశబ్దము, నిర్వికారము అనే

నిషేధవాక్యములు అన్ని చోట్ల అధ్యాహారము చేసుకొనవచ్చునో; దేనిని గూర్చి ముండకములో, కాఠకములో రెండుపక్షులని-వెలుగునీడలని-పరమాత్మజీవాత్మలని చెప్పిన రెండువిద్యలూ ఒకటియో; ఏది సర్వ భూతములందు సర్వాంతరుడైన సర్వవ్యాపియో; ఏది ఆత్మయో మరియు ఆత్మ ఏదియో అనుచు వ్యతిరేకముగా వ్యతిహారముగా చెప్పబడుచుండునో; దేనిని గూర్చిన లోకజయము కలిగించే సత్యవిద్య మరియు పాపనాశము చేసే సత్యవిద్య ఒకటియో మరియు ఏది సత్యమో-ఆదిత్యుడో-కుడికంటి యందలి పురుషుడో, ఏది ఛాందోగ్యములో దహరాకాశములోవున్న సత్యకామము మరియు సత్యసంకల్పము అని చెప్పబడిన పురుషుడుగా మరియు బృహదారణ్యకములో దహరాకాశములో వున్న గొప్పది-పూజనీయము అని చెప్పబడిన పురుషుడుగా ఒకటియేనో; దేనిని గూర్చిన ప్రాణాగ్ని హోత్రము భోజనము లేనపుడు వుండదో; దేనిని గూర్చిన ఉపాసనములు క్రతువులకు కర్మాంగము కాదో మరియు ఏవి ఐచ్ఛికములో; దేనిని గూర్చిన ప్రాణవిద్యలలో వాయువు దేవతల సంవర్గమై అధిదైవతమో మరియు ప్రాణము ఇంద్రియముల సంవర్గమై ఆధ్యాత్మికమో మరియు ఆ రెండు విద్యలు వేరువేరో; దేని ఉపాసనా పూర్వకములైన 36,000 మనశ్చితాలు కర్మాంగత్వము లేని స్వతంత్ర ఉపాసనకు సంబంధించినవో; ఏది ఆత్మగా శరీరము నుండి భిన్నమో; దేని గురించి ఒక శాఖవారు చేసే ఉపాసన అన్ని శాఖల వారూ స్వీకరించవచ్చునో; దేనిని వైశ్వానరాత్మగా పూర్ణముగా ఉపాసించుట శ్రేష్ఠమో; దేని గురించి సగుణ విద్యలలో వికల్పముగా-వేరువేరుగా-ఉపాసించుటయే యుక్తమూ, దేనిని కామోపాసనలకు అధికారియైన వ్యక్తి ఏ ఫలమునకు కామన వుండునో దానికి సమస్త ఉపాసనలను సముచ్చయముగా చేసుకొనవచ్చునో; మరియు దేని గూర్చిన అనుష్ఠానము స్వానుభవభావనానుష్ఠానముయో; మరియు నియమసాధనమైన కర్మానుష్ఠానము కాదో; మరియు దేని అనుష్ఠానము స్వానుసంకల్పానుకూలమో అదియే బ్రహ్మము.

## III.4. చతుర్థ పాద సారము

### బహిరంగ సాధన

దేని జ్ఞానము వలన మోక్షము, పరమపురుషార్థము లభిస్తుందో, దేని జ్ఞానము కర్మాంగముకాదో, వేదాంత జ్ఞానము వలన, సన్న్యాసము వలన, త్యాగము వలన అమృతత్వము మరియు దేని అనుభవము అవుతుందో, దేని జ్ఞానము కర్మబంధమునకు విరుగుడు మందు, సమాధానము మరియు కత్తియో, దేని జ్ఞానముతో చేయబడుకర్మలు పవిత్రమో, దేని జ్ఞానము కర్మాంగము లేక కర్మాంశము కాదో, దేని జ్ఞానము స్వతంత్రముగా మోక్షసాధనమో,

దేని విద్యాధికారము బ్రహ్మచారులకు, గృహస్థులకు, వానప్రస్థులకు మరియు సన్యాసులకు సమముగా నున్నదో, దేని విద్య కర్మాంశము కాక స్వతంత్రమో, దేనిని గూర్చి సాధన చేయగల నాలుగు ఆశ్రమములను గూర్చి విధి శ్రుతులలో చెప్పబడలేదు అనిన జైమిని మహర్షి అభిమతము సరికాదో, దేని కొరకు ఎవరైనను ఎపుడైనను వైరాగ్యము కలిగినపుడు సన్యాసము స్వీకరించవచ్చునో, దేని జ్ఞానము పొందుట కొరకు సన్యాసము క్రమముగా కాని, నేరుగా కాని పొందవచ్చునో,

దేని కొరకు ఉద్దేశించబడిన ఉద్గీథాది శ్రుతులు కర్మాంగములు కావో మరియు అవి కేవలము

స్తుతి కోసము కావో, దేని ఉద్దేశించబడిన ఉద్గీథవిద్య కర్మాంగము కాదో మరియు అట్టి విద్యకు ఉపాసనా విధానము, ఫలము కలవో,

ఉపనిషత్తులలో చెప్పబడిన అభ్యాసములు, కథలు దేని విద్యా శేషములేకాని, కర్మశేషములు కావో, పారిప్లవ కథలు దేనిని ఉద్దేశించి కావో మరియు పారమార్థిక కథలు దేనిని ఉద్దేశించినవో మరియు అవి దేని జ్ఞానబోధకు సహకరించటానికి చెప్పబడిన తత్త్వ గుళికలో, ఉపనిషత్తులలోని కథలు దేని ఉపాసనకోసమో,

దేనిని గూర్చిన యజ్ఞము ఏ వస్తువులు మరియు పదార్థములు లేకుండా అవుతుందో మరియు కర్మలను అపేక్షించదో, దేనిని గూర్చిన విద్య పరమ పురుషార్థసిద్ధి కలిగిస్తుందో మరియు సర్వదా స్వతంత్ర మగుట వలన కర్మల అంశము కాదో,

యజ్ఞము, దానము, తపము, అధ్యయనము అనునవి మోక్షాన్ని ఇప్పించలేక పోయినా, యోగ్యతను బట్టి దేని జ్ఞానోత్పత్తి విషయములో సహాయపడుతాయో, శమ-దమాది సాధనములు దేని విద్యకు అవసరమో; మదము, మాత్సర్యము, కామము, కోధము, లోభము మరియు మోహము అను అరుగురు శత్రువులు లేకుండపోయి; శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ మరియు సమాధానము అను ఆరుగురు మిత్రులు వచ్చి వుండటము వలన దేని విద్యకు, దేని ప్రాప్తికి తోడ్పడుతాయో;

దేనిని ప్రాప్తి చెందే సాధన చేయుట కొరకు ప్రాణాపాయ సమయములో నిషిద్ధమైన ఆహారాన్ని ఆపద్ధర్మముగా తినవచ్చునో, దేని ప్రాప్తి సాధనలో అన్ని తినగలగినా అయోగ్యములను వదలి, యోగ్యములు స్వీకరించవలెనో,

దేని జ్ఞానమందిన తరువాత కూడ ఆశ్రమములలో నున్నవారు తమ ఆశ్రమవిహితమైన కర్మములు చేయుచుండవలయునో, శ్రేష్ఠకర్మలు వ్యవహారికముగా కామ్యకర్మల ఫలమునిచ్చుచు అధ్యాత్మికముగా దేని జ్ఞానమందుటకు సహయ్యకారిగా నుండునో; అధ్యయనము, దానము, తపము, యాగము మొదలైన నిత్యకర్మలు దేని విద్యకు, దేని జ్ఞానానికి సహయ్యము అవుతాయో;

దేని విద్యాధికారము కేవలము ఆశ్రమస్థితుల మీద కాక, సాధకుని నిష్ఠ, ఉపాసన, అభ్యాసము, నిరంతరసాధన మీద ఆధారపడి వుంటుందో, ప్రస్తుత సాధన, పూర్వాభ్యాసము రెండూ ఆశ్రమ కర్మలతో సంబంధము లేకున్నా దేని జ్ఞానమువైపు తీసుకువెళ్లుతాయో, ఏదో ఆశ్రమములో వుంటూ, ఆ ఆశ్రమనియతమైన సత్కర్మలు చేస్తూ, దేని విద్యాప్రాప్తికి సాధన చేయుట యుక్తమో మరియు శ్రేష్ఠమో, దేని ప్రాప్తికై ఉన్నాతాశ్రమములలో నున్నవారు ప్రచ్యుతి పొందకూడదో, ఆశ్రమములోనే వుంటూ దేని ప్రాప్తికి, దేని అనుభూతికై సాధన చేస్తుండవలయునో,

దేని మార్గములో నున్న సన్న్యాస, వానప్రస్థ ఆశ్రమముల వారికి ప్రాయశ్చిత్తము చెప్పబడలేదో, దేని మార్గము నుండి పతనము చెందిన సన్న్యాసి కాని, వానప్రస్థుడు కాని స్మృతి ప్రమాణముచేత, శిష్టాచారముచేత బహిష్కరింబడుదురో,

దేని విద్యాసాధనలో సహాయపడు సత్కర్మలు చేయుటములో కర్తృత్వము ఋత్విజునిదో, మరియు ఫలము యజమానిదో,

పాండిత్యము, బాల్యభావము, నిరంతర మననము అను మూడింటి పరిపక్వావస్థ కలిగినంతనే దేని సాక్షాత్కారము యగునో,

సన్న్యాసాశ్రమములో దేని విద్య స్వభావసిద్ధమో మరియు ఇతర ఆశ్రమముల వారికి కూడ దేని విద్యానిషేధము లేదో, దేని విద్యాధికారము అన్ని ఆశ్రమముల వారికి కలదో,

దేని జ్ఞానము ఈ జన్మలోనే కలుగగలదో, దేని జ్ఞానప్రాప్తికి ప్రతిబంధకములు వుంటాయో, ఉపాసనద్వారా, మౌనముద్వారా ప్రతిబంధకములు వీడిపోగానే దేని జ్ఞానము కలిగి, ముక్తి వస్తుందో,

దేని విద్యావిదునకు ఈ జన్మలోనే ముక్తిఫలము అని నియమము లేదో, అట్లే ఈ లోకములోనా, లేక దేని లోకములోనా అనే నియమము కూడా లేదో; ఎప్పుడు హృదయమునందు సమస్త కామములు సర్వదా అభావస్థితిని పొందునో, అపుడు ఆ సాధకుడు అమృతుడై ఇప్పుడు, ఇచ్చటనే దేని ప్రాప్తి పొందునో, ఎవరికి అట్టి స్థితి ఇక్కడ కలుగదో అతనికి బ్రహ్మలోకము చేరగానే దేని ప్రాప్తి కలుగుతుందో, అదియే బ్రహ్మము.

# IV. చతుర్థాధ్యాయము - ఫలము

## IV.1. చతుర్థాధ్యాయ ప్రథమ పాద సారము - ఫలము

### జీవన్ముక్తి

దేని విద్యారూపమైన ఉపాసన అభ్యాసము చేసి, దానిని మాటిమాటికి విచారణ చేయాలో, దేనియందు సంలగ్నులు కావాలో, మరలమరల చేసే ఆవృత్తి ఉపాసన దేని గూర్చి చేయవలయునో, దేని విద్యాభ్యాసము నిరంతరము చేయవలయునో,

"తత్త్వమసి" – "అదియే నీవైయున్నావు" అని గురువు బోధించినపుడు సాధకుడు శ్రవణము చేసి, అర్థము చేసికొని, మననము చేసి, ధ్యానించి, అనుభూతి చెంది, "తాను అదియే" అని తెలిసి, "నేను అదియే అయివున్నాను" అని అంటూ, "అది ఇదియే" "ఇది అదియే", అని అనుభూతినందుతాడో, ఆ "అది" ఏదియో,

మూర్తి మొదలైన వానియందు ఏది ఉపాసించబడుచున్నదో, మనస్సు, ఆకాశము, ఆదిత్యుడు మొదలైన ప్రతీకలయందు దేని ఉపసానావిధానమున్నదో, ప్రతీకలయందు ఏది కలదను ఉద్దేశ్యముతో ఉపాసించినపుడు ఏది తనను ఉపాసించుచున్నట్లు భావించి, గ్రహించి, అనుగ్రహించునో, ప్రతిమను దేనిగా ఉపాసంచాలో, దేనిలో ప్రతిమను చూడరాదో,

ప్రతీకను దేనిని తలచి గొప్పగా చేయవలెనో, కాని దేనిని ప్రతీకగా దలచి చిన్న చేయరాదో,

ఈ ఆదిత్యుడే అది, అని తెలిసి ఆదిత్యాది భావానాఉపాసన దేన్ని గూర్చి చేయాలో,

కేవలము కూర్చుండియే దేన్ని గూర్చి ఉపాసన, ధ్యానము చేయాలో; దేని ఉపాసనకు, దేనిధ్యానమునకు శరీరము, ఇంద్రియములు మరియు మనస్సు యొక్క అచలత్వము, నిశ్చలత్వము అవసరమో, ఆవశ్యకమో,

సాధకునికి అనుకూలమైన స్థానము, సమయము, పరిస్థితులలో దేనిని గూర్చి ఉపాసన, ధ్యానము

నిర్విఘ్నముగా చేయాలో,

జీవనకాలపర్యంతము, చివరిక్షణము వరకు దేనిని ఉపాసన చేయాలో,

దేని జ్ఞానము కలిగిన తరువాత పూర్వోత్తర పాపములన్నీ నశిస్తాయో, మరియు పాపములు తామరాకుమీద నీటిబొట్టువలె అంటవో, దేని జ్ఞానము తరువాత జ్ఞానికి లోక సంగ్రహము కొరకు చేసే వ్యావహారిక కర్మముల వలన కలుగు పాపములు అంటవో మరియు పూర్వ కృతపాపములు నశించునో,

దేని దర్శనమైనతరువాత జ్ఞానికి అన్నికర్మలు-పుణ్యపాప కర్మలు అన్నీ క్షయము అవుతాయో, దేని దర్శనము అయిన జీవన్ముక్తునికి దేహపాతము అయిన వెంటనే మోక్షము కలుగునో,

అనారబ్ధ కార్యములు (సంచితకర్మలు) దేని జ్ఞానము వలన నశిస్తాయో, మరియు ఆరబ్ధ కర్మములు వున్నంత వరకు శరీరము వుండి. అనారబ్ధ కార్యములు మొదలే నశించి, ఆరబ్ధకార్యముల ఫలములు పూర్తి కాగానే, శరీరము విడువగానే, దేని జ్ఞానము వలన మోక్షము అవుతుందో,

దేని జ్ఞానము అందిన తరువాత జీవన్ముక్తులు నిత్య, నైమిత్తిక కర్మలు లోక సంగ్రహము కొరకు జీవనపర్యంతము చేస్తూండాలో,

విద్యతో కూడిన (ఉపాసనతో కూడిన) నిత్యకర్మలు, కేవలము నిత్యకర్మలు రెండూ దేని జ్ఞానోత్పత్తికి సాధనాలు అవుతాయో, దేని ఉపాసనతో కూడిన కర్మలు వీర్యవత్తరము అవుతాయో మరియు నిత్యకర్మలవలె కేవలము వీర్యవంతము కావో,

దేని జ్ఞానమందినవాడు పూర్వకృతమైన సంచితకర్మను భస్మము చేయునో, మరియు అతనికి క్రియామాణమగు ఆగామి కర్మలతో ప్రమేయము లేదో, దేని జ్ఞానమందినవాడు మిగిలిన శుభాశుభ రూప ప్రారబ్ధకర్మలను ఉపభోగముద్వారా నశింపజేసి, పరమపదము నందునో అదియే బ్రహ్మము.

## IV.2. ద్వితీయ పాద సారము

### ఉత్క్రాంతి

దేని అంశయైన జీవాత్మ యొక్క ఉత్క్రాంతి సమయములో అన్ని ఇంద్రియములు వృత్తి రూపములో వాక్కును అనుసరించి మనస్సుల లయము అవుతాయో,

దేని అంశయైన జీవాత్మ ఉత్క్రాంతి సమయములో మనో వ్యాపరములన్ని కూడ ఇంద్రియ వ్యాపారములతో పాటు ప్రాణములో లయము అవుతాయో,

ప్రాణ వృత్తి దేని అంశయైన జీవాత్మ యందే లయము అవుతుందో, కాని తేజస్సు నందు లయము కాదో, మరియు దేని అంశమైన జీవాత్మ మరణ కాలమందు భూత సూక్ష్మాదులతో కూడుకొని యుంటాడో,

దేని సగుణ రూప జ్ఞానికి మూర్ధన్యనాడీ ప్రవేశము, ఉత్తర మార్గములో పోవటము కలుగుతుందో, దేనిలోకప్రాప్తి సగుణోపాసకునికి దేవయాన మార్గము ద్వారానే కలుగుతుందో,

దేని జ్ఞానము లేనియతనికి ఒక శరీరము నుండి ఇంకొక శరీరములోనికి పోవునపుడు పరదేవత యందుండుట చెప్పబడినదో; మరియునతనికి ముక్తి లభించనంతవరకు సూక్ష్మశరీరముతో సంబంధము వుండునో మరియు అతనికి ముక్తపురుషులవలె, దాని జ్ఞానము అందినవారి వలె దానియందు విలీనుడు కాడో, అతనికి దేని అంశయైన జీవాత్మస్వరూపము వుంటుందో మరియు శరీరము దహనాదుల ద్వారా

నాశనము పొందినను ఆ జీవాత్మకు నాశము వుండదో, దేని అంశమైన జీవాత్మలేచి పోయినపుడు శరీరములో ఊష్మము వుండక శరీరము చల్లబడునో, దేని జ్ఞానులైన మహాపురుషులకు లోకాంతరగమనము వుండదో; మరియు వారు ఇచటనే దేనిని పొందుతారో, దేని సాక్షాత్కారము కలిగిన జ్ఞానికి దేవయానాది మార్గాలు కాని, ఉత్క్రమణం కాని లేదని స్మృతులు తెలుపుతున్నాయో, శరీరము నశించినపుడు దేనిని తెలిసిన జ్ఞానియొక్క ఇంద్రియములు అన్నియు దాని యందే కలియునో; మరియు సామాన్యముగా ఇంద్రియములు మరియు సూక్ష్మభూతములు తమ తమ మూల ప్రతిష్ఠలలో కలిసినా దేనిని తెలిసిన జ్ఞాని ఇంద్రియములు సూక్షభూతములు దాని యందే కలుస్తాయో; దేని జ్ఞానులైన మహా పురుషులు తమ తమ శరీరములను వదలి దాని యందే అవిభాగమైన లయమునందుతారో; మరణ కాలమున దేనిని తెలిసిన మహాపురుషుడు హృదయాకాశము నందలి ప్రకాశముచే వెలుగందిన దాని రంధ్రము గుండా స్థూల శరీరము నుండి బయలు వెడలునో; దేని విద్యా ఫలరూపమైన దానిలో ఫలాది ప్రాప్తిరూప సంస్కార స్మృతిలో, హృదయస్థితమైన దేని అనుగ్రహముతో జ్ఞాని సూర్యరశ్మి మార్గమున వెడలునో,

దేనిని తెలిసిన మార్గము జ్ఞానమార్గము మరియు వెలుగు తోవయో; దేనిని తెలియని మార్గము అజ్ఞానమార్గము మరియు చీకట్ల తోవయో;-దేనిని తెలిసినవారు ఎప్పుడైనా, ఏ ఆయనములోనైనా శరీరము వదులగానే దానిని పొందుతారో; మరియు దేనిని తెలియనివారు, ఏ ఆయనములోనైన, ఎప్పుడైన శరీరమును వదలగానే దేని మార్గములో కాక వేరు మార్గములలో వెళుతారో, అదియే బ్రహ్మము.

## IV.3. తృతీయ పాద సారము

### దేవయాన మార్గము

దేనిలోక ప్రాప్తి కోరే ఉపాసకులు అర్చిరాది మార్గము గుండా వెళుతారో, దేని సగుణోపాసనా విద్వాంసులకు అందరికీ ఈ వెలుగు మార్గము అంటే దేవయాన మార్గము లేక ఉత్తరాయణ మార్గము ప్రసిద్ధమో, కొన్ని చోట్ల చెప్పకపోయినా ఆయా విద్యలకు అర్చిరాది మార్గము ద్వారానే దేనిలోక ప్రాప్తి కలుగుతుందో, దేనిలోకము చేరే అర్చిరాది మార్గములో వాయులోకము సంవత్సరము తరువాత, సూర్యలోకము కన్న ముందు వుంటుందో, దేనిలోకమునకు పోవు విద్వాంసుల సూక్ష్మ శరీరములను ఒక చోట నుండి ఇంకొక చోటుకు తీసుకొని పోవు వారిని అతివాహికలు అని అంటారో మరియు ఈ అతివాహక దేవతలు అన్ని కాలములలోనూ, అన్ని సమయములలోనూ వుంటారో. కావున ఉపాసకుడు దక్షిణాయనములో మరిణించినా, రాత్రి మరణించినా దేని లోకమును చేరుటకు సమస్య వుండదో – విద్యుల్లోకము నుండి అమానవ పురుషుడు జ్ఞానిని దేనిలోకమునకు తీసుకొనివెళ్లునో, దేని విద్యోపాసకునకు ప్రాప్తి విషయిక సంకల్పము కార్యబ్రహ్మ సంబంధమైనదికాదో మరియు దేని సంబంధమైనదో, ప్రతీకోపాసన చేయని ఉపాసకులను అర్చి మొదలైన దేవతలు మరియు అమానవ పురుషుడు దేనిలోకమునకు చేరుస్తాడో, దేని ఉపాసకులకు పునరావృత్తి లేదో, ప్రతీకోపాసకులకు దేనిలోక ప్రాప్తి లేదో మరియు దేని ఉపాసకులకు దేని లోకప్రాప్తి కలదో అదియే బ్రహ్మము.

## IV.4. చతుర్థ పాద సారము

### విదేహముక్తి

స్వప్రకాశమైన దేని సాక్షాత్కారాన్ని పొంది, దేని రూపములో విద్వాంసుడు ఆవిర్భూతుడు అవుతాడో, ఏ స్వరూపములో వుంటాడో, ఆ స్వరూపమే అదియేనో, దేని రూపములో జీవుడు తానేయైన

నిజస్వరూపములో వుండుటయే ముక్తి మరియు ఏకము అవటమో, అజ్ఞాననివృత్తి కాగానే స్వరూపావిర్భావము అయి ఏది అవుతారో, ఏది యుండిన తరువాత తనలోననే వున్న ముక్తి అవుతుందో, ఏది తన స్వభావము అని తెలియుటయే జ్ఞానమో, పరంజ్యోతిలో వున్న 'పరము', 'జ్యోతి' అనే శబ్దాలకు ఏది అర్థమో, ముక్తాత్మయొక్క స్థితి దేనియందు అవిభక్తరూపమునకు లోనైనదో, జ్ఞాని యొక్క ఆత్మలో మరియు దేనిలో ఏ విభాగములేదో, ముక్తుడు దేని సంబంధమైన తనరూపములో కలుస్తాడని జైమినిమహర్షి అభిమతమో, మరియు ముక్తుడు దేని సదృశమైన స్వరూపముతో సంపన్నుడు అవుతాడో, ముక్తుడు నిరస్తమైన సర్వప్రపంచము కలది, ప్రసన్నము, నిర్మలము, వర్ణానాతీతము, బోధాత్మ మరియు చైతన్యము ఐన దేనిలో నిష్పన్నము అవుతాడని, వుంటాడని, ఔడులోమి ఆచార్యుని అభిమతమో, బాదరాయణ మహర్షి అభిప్రాయ ప్రకారము ముక్తాత్మ సగుణరూపములో దేనికి సదృశముగా వుంటాడో మరియు కేవలము చైతన్యరూపము మరియు దేనిలో అభిన్నరూపములో కూడా వుంటాడో, ఏది ఈ మూడు రూపములలో వుండుట సంభవమో, దేనిలోకమునకు చేరిన విద్వాంసునికి సంకల్పమాత్రముననే పితృదేవతలు హాజరు అవుతారో, మరియు సంకల్పమాత్రముననే సకల వస్తువులు, భోగములు అనుభవము అవుతుందో, దేనిలోకము చేరిన ఉపాసకుడు తిరుగులేని సంకల్పము వలన అనన్యాధిపతి, వేరొక ప్రభువులేనివాడు అవుతాడో, మరియు అతనికి సమస్తలోకములలోనూ స్వతంత్ర సంచారము వుంటుందో, ఏ లోకము చేరిన విద్వాంసునకు బాదరి ఆచార్యుల ప్రకారము మనస్సు తప్ప వేరు శరీరము వుండదో, జైమిని ఆచార్యుల ప్రకారము శరీరము, ఇంద్రియములు, మరియు మనస్సు వుంటాయో, బాదరాయణ ఆచార్యుల ప్రకారము శరీరము వుండక మరియు శరీరముతో పాటు కూడా వుండవచ్చునో మరియు ఈ మూడు రీతుల కూడా వుండవచ్చునో ఏ లోకము చేరిన ముక్తాత్మ తన సంకల్పము చేత రచించబడిన సమస్త శరీరములందు, ఒకే అగ్ని అనేక దీపములందు వెలుగునట్లు ప్రవేశించి, యథేచ్ఛగా లోకములలో తిరుగవచ్చునో,

ఈ జడ చైతన్యాత్మకమైన సమస్త జగత్తు యొక్క రచన, సంచలనము, ప్రళయము మొదలైన కార్యములన్నింటిని దేని అంశమైన ముక్తాత్మ చేయలేదో, మరియు ఏది చేయుచుండునో, అదియే బ్రహ్మము. అదియే బ్రహ్మము.

ఇట్లు

**సర్వాధికరణ సార సంగ్రహము**

## ఉపనిషత్తుల శాంతి మంత్రములు

**ఇపుడు ఓం వాఙ్మేమనసి ప్రతిష్ఠితా - ఓం పూర్ణమదః-ఓం సహనావవతు**

**ఓం అప్యాయంతు మమంగాని - ఓం భద్రం కర్ణేభిః**

**అను పంచశాంతి మంత్రములను పఠించవలెను.**

**(పేజీలు ② ③ ④ ⑤లు చూడగలరు.)**



# 3

# శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి

## ఆచార్యులు-అభిమతములు

శ్రీ బాదరాయణ మహర్షి మనకందించిన బ్రహ్మసూత్రములు ఒక అద్భుత చైతన్య ప్రవంతి ఈ మహానదిలో ఇంకెన్నో జ్ఞాననదులు కలిసినాయి. ఇందులో బాదరాయణ మహర్షి సిద్ధాంత ధారాప్రవాహమే కాక ఎందరో మహర్షుల ఆచార్యుల విచారధారలు కలిసినాయి.

బాదరాయణులు, తన అభిమతముతో సమన్వయముగానున్న ఆచార్యుల మతములనే కాక తన అభిమతముతో వేరుగా, మరియు విరోధముగానున్న వారి విచారములను కూడ ప్రస్తుతము చేసినారు. యధాయోగ్యము వాటిని స్వీకరించినారు లేక నిరాకరించినారు కాని ఎవరినీ నిరాదరించలేదు.

వేదాంత దర్శనమైన బ్రహ్మసూత్ర సంపుటములో మనకు కనిపించే ఆచార్యులు, వారి పేరు కనిపించిన సంఖ్య ఈ విధము

1. జైమిని మహర్షి – 11సార్లు
2. బాదరాయణ మహర్షి – 9 సార్లు
3. ఔడులోమి ఆచార్యులు – 3 సార్లు
4. బాదరి ఆచార్యులు – 3 సార్లు
5. ఆశ్మరథ్య ఆచార్యులు – 2 సార్లు
6. కాశకృత్స్న ఆచార్యులు – 1 సారి
7. కార్ష్ణాజిని ఆచార్యులు – 1 సారి
8. ఆత్రేయ ఆచార్యులు – 1 సారి

బ్రహ్మసూత్రములలో పరబ్రహ్మ నిరాకార నిర్గుణ రూపముగా మరియు సాకార, సగుణ రూపముగా మరియు రెండు రూపములుగా కూడా వివిధ ఆచార్యులచే స్వీకరించబడినారు.

కాశకృత్స్న, ఔడులోమి, బాదరి ఆచార్యులు నిర్గుణ, నిరాకార రూపమును అంగీకరిస్తే జైమిని, ఆత్రేయ ఆచార్యులు సగుణ రూపమును స్వీకరించినారు. బాదారాయణ, ఆశ్మరథ్య, కార్ష్ణాజిని ఆచార్యులు మధ్యమార్గమైన రెండు రూపములను ఒప్పుకొనినారు. వీరందరి అభిమతములు వివిధ విషయములలో వేరువేరుగా వున్నాయి.

వాటిని సంక్షిప్త రూపములో పరిశీలించి పరబ్రహ్మతత్త్వమును ఎనిమిది దిక్కులలో అష్టకోణములలో దర్శించుకొందాము.

నమస్తే

# బ్రహ్మసూత్రములు
## ఆచార్యులు-విచార బోధలు

**1. కాశకృత్స్న :**

(1) జీవబ్రహ్మములకు బింబ ప్రతిబింబ భావముచే ఏ మాత్రము భేదము లేదు. బ్రహ్మము జగత్తుకు నిమిత్త కారణము మరియు ఉపాదాన కారణము. -(128) I-4-22

**2. ఔడులోమి :**

(1) బ్రహ్మసాక్షాత్కారము అయిన తరువాత దేహాది సంఘాతమును వదిలి జీవుడు పరమాత్మలో లీనము అవుతాడు. -(127) I-4-21

(2) కర్తృత్వము ఋత్విక్కునిది, యజమానిది కాదు. ఋత్తిక్కు ధనదానాదులచే వరించబడినాడు. కనుక ఫలము యజమానికే లభించును. -(470) III-4-45

(3) జీవుడు చైతన్యరూపుడు కాబట్టి ముక్తపురుషుడు కేవల చైతన్య స్వరూపములో వుండును. నిరస్తమైన ప్రసన్నము, వర్ణనాతీతమైన బోధాత్మతో, చైతన్యముతో అభినిష్పన్నము అవుతాడు. అభిన్నముగా వుంటాడు. -(539) IV-4-6

**3. బాదరి :**

(1) పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు, అవిచ్ఛిన్నుడు, పరిమాణపరిమితుడు కాడు. ధ్యానము కొరకు పరమాత్మకు పరిమాణములు చెప్పబడినవి. -(61) I-2-30

(2) జీవాత్మ అవశేష సుకృత, దుష్కృత కర్మ సంస్కారములతో తిరిగి వస్తుంది-(302) III-1-11

(3) ముక్తాత్మకు శరీరము వుండదు. దైవికము నేత్రమైన మనస్సుచే కామ్యపదార్థములు తెలిసికొని ఆనందిస్తుంటాడు. -(543) IV-4-10

**4. బాదరాయణుడు :**

(1) మనుష్యులకు, దేవతలకు బ్రహ్మవిద్యాధికారము వున్నది. -(89) I-3-26

(2) బాదరాయణ మహర్షి బ్రహ్మ విద్యయందు దేవతలకు అధికారము వున్నదని అంగీకరిస్తున్నారు. -(96) I-3-33

(3) కర్మలు చేయటానికి ప్రేరణ ఇచ్చేవాడూ, ఆ కర్మలను ఫలితము కల్గించే వాడూ పరబ్రహ్మమే. పరబ్రహ్మమే ఫలనిర్ణేత. -(359) III-2-41

(4) ఆత్మజ్ఞానము వలననే, బ్రహ్మజ్ఞానమువలననే మోక్షము లభిస్తుంది. -(426) III-4-1

(5) విద్య కర్మ శేషము కాదు. ఆత్మజ్ఞానము కర్మాంగము కాదు. -(433) III-4-8

(6) మూడు స్కంధములైన గృహస్థులకు, బ్రహ్మచారులకు, వానప్రస్థులకు మరియు సన్యాసులకు, నలుగురికీ బ్రహ్మవిద్యాధికారము, బ్రహ్మలోకప్రాప్తి అధికారము వున్నాయి. -(444) III-4-19

(7) ప్రతికోపాసన చేసేవాడు తప్ప మిగతా వారిని ఆ అమానవపురుషుడు బ్రహ్మలోకమునకు తీసుకొని వెళుతాడు. దేవయానమార్గమున వెళ్లు ఆ సగుణ కార్య బ్రహ్మోపాసకులకు మరియు పరబ్రహ్మోపాసకులకు పునరావృత్తి లేదు. -(532) IV-3-15

(8) ముక్తాత్మ తన ఇచ్ఛానుసారము చేతనామాత్ర స్వరూపము, బ్రహ్మ సమాన ఐశ్వర్య స్వరూపము, రెండు రూపములు అనే మూడు విధములుగా వుండగలుగును. -(540) IV-4-7

(9) ముక్తాత్మ శరీరముతో కూడి మరియు శరీరము లేక మనసుతోనే తన సంకల్ప ప్రకారము దివ్యభోగములననుభవించును. -(545) IV-4-12

**5. ఆశ్మరథ్య :**

(1) పరమాత్మ ఉపాసకులను అనుగ్రహించుకొరకు హృదయాదిస్థానములలో అభివ్యక్తము, ప్రాకట్యము అగుచున్నాడు. -(60) I-2-29

(2) జీవాత్మ, పరమాత్మలకు భేదము, అభేదము రెండూ వున్నాయి. బ్రహ్మముయే జగత్కారణము. -(126) I-4-20

**6. కార్ష్ణాజిని :**

(1) జీవాత్మ భుక్తశేషకర్మలతో తిరిగి వస్తాడు. -(300) III-1-9

**7. జైమిని :**

(1) వైశ్వానరాత్మ పరమాత్మయే -(59) I-2-28

(2) పరబ్రహ్మ అనంత ఐశ్వర్య సంపత్తి కలవాడగుట వలన స్థాన, దేశ, విదేశాలతో సంబంధము యున్నదనుటలో విరోధము లేదు. -(62) I-2-31

(3) దేవతలకు యజ్ఞ విద్య, బ్రహ్మవిద్యలయందు అధికారము లేదు. -(94) I-3-31

(4) బ్రహ్మమే జగత్కారణము. -(124) I-4-18

(5) కర్మము నశించుటకు పూర్వము సృష్టించే అపూర్వము అనే సూక్ష్మశక్తి ద్వారా, ధర్మమే-యజ్ఞమే ఫలమును ఇస్తుంది. -(337) III-2-40

(6) కర్తృ రూపములో ఆత్మ కర్మాంగము. జ్ఞానము కూడా కర్మాంగమే -(427) III-4-2

(7) శ్రుతిలో ఆశ్రమముల సూచనయే కాని, విధి చెప్పబడలేదు. శ్రుతి సన్యాసమును విధిస్తుంది అని అనటము సరికాదు. -(443) III-4-18

(8) యతి ఆశ్రమముల వారికి చ్యుతి లేదు. -(465) III-4-40

(9) పరమ ధామమునకు వెళ్లిన వారందరికీ ప్రాప్తించునది పరబ్రహ్మ. కార్యబ్రహ్మ కాదు. -(529) IV-3-12

(10) ముక్తపురుషుడు బ్రహ్మసంబంధమైన సర్వేశ్వర, సర్వజ్ఞ స్వరూపములో వుంటాడు. -(538) IV-4-5

(11) ముక్తపురుషునికి మనస్సు, శరీరము వుంటాయి. -(544) IV-4-11

**8. ఆత్రేయ :**

(1) ఫలము కర్తృత్వము రెండూ యజమానివే. -(469) III-4-44

# బ్రహ్మసూత్రములు

## ఆచార్యులు-సిద్ధాంత వైఖరి

**నిరాకారము, నిర్గుణము, చైతన్యము**

| | | |
|---|---|---|
| 1. కాశకృత్స్న - (1) | నిర్గుణము ↑ | |
| 2. ఔడులోమి - (3) | | |
| 3. బాదరి - (3) | | |
| 4. బాదరాయణ - (9) | సగుణము ↕ నిర్గుణము | |
| 5. ఆశ్మరథ్య - (2) | | |
| 6. కార్ష్ణాజిని - (1) | | |
| 7. జైమిని - (11) | సగుణము ↑ | |
| 8. ఆత్రేయ - (1) | | |

**సాకారము, సగుణము, ఐశ్వర్యము**

## ఉపనిషత్తులు-వ్యాఖ్యాతలు-ఆచార్యులు

శ్రీ గౌడపాదాచార్యుల వారు మాండూక్యోపనిషత్తు పై కారిక వ్రాసినారు. శ్రీ ఆది శంకరాచార్యుల వారు దశుపనిషత్తులపై, ఐదు రుద్ర ఉపనిషత్తులపై, నృషింహతాపినీ ఉపనిషత్తులపై వ్యాఖ్యానము చేసినారు. శ్రీ శంకరానందులవారు, సదాశివ బ్రహ్మేంద్రులవారు, స్వయం ప్రకాశానందులవారు 32 ఉపనిషత్తులపై మరియు శ్రీ విద్యారణ్య స్వాముల వారు 108 ఉపనిషత్తులపై వ్యాఖ్యానము చేసినారు.

శ్రీ రామచంద్రుల వారు తమ మహాభక్తుడైన ఆంజనేయుల వారికి జ్ఞానవైరాగ్యమందించునవి, వాసనాత్రయమును మసిచేయునవి అయిన 108 ఉపనిషత్తుల గూర్చి భోదించినారు. వాని వివరములు ముక్తికోపనిషత్తులో గలవు.

ఆ 108 ఉపనిషత్తుల నుండి 1008 మహావాక్యములను రత్నములను ఏరి పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ రామచంద్రేంద్ర సరస్వతి వారు మహావాక్య రత్నావళిగా కూర్చినారు. వేదాంత తత్వమును వెలిగింపచేయు ఆ మహావాక్య రత్నావళికి శ్రీ సదానందేంద్ర సరస్వతి వారు (శ్రీ వెంపటి అమ్మన్న శాస్త్రి గారు) ప్రకాశమానమైన "మహావాక్య రత్న ప్రభావళి" అనే అద్భుత వ్యాఖ్యానము వ్రాసినారు.

# 4

# 108 ఉపనిషత్తులు

అధ్యాత్మ విద్యకు మూలములైన నాలుగు వేదముల చివర 1180 ఉపనిషత్తులు వున్నట్లు చెప్పబడినది. ఆ 1180 ఉపనిషత్తులలోని 108 ఉపనిషత్తులు ముక్తికోపనిషత్తులో శ్రీరామచంద్రుడు మహాభక్తుడు, జ్ఞానియైన ఆంజనేయస్వామికి చెప్పినట్లు పేర్కొనబడినది. ఆ ఉపనిషత్తులు ఈ విధము :

1. ఈశావాస్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు

6. మాండూక్యోపనిషత్తు — జీవన్ముక్తికి ఒక ఉపనిషత్తు

7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందోగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు

మొదటి 10 ఉపనిషత్తులు — పూర్ణ జ్ఞాన సిద్ధి

11. బ్రహ్మోపనిషత్తు
12. కైవల్యోపనిషత్తు
13. జాబాలోపనిషత్తు
14. శ్వేతాశ్వతరోపనిషత్తు
15. హంసోపనిషత్తు
16. ఆరుణికోపనిషత్తు
17. గర్భోపనిషత్తు
18. నారాయణోపనిషత్తు
19. పరమహంసోపనిషత్తు
20. అమృతబిందూపనిషత్తు
21. అమృతనాదోపనిషత్తు
22. అథర్వశిరోపనిషత్తు
23. అథర్వశిఖోపనిషత్తు
24. మైత్రాయణ్యోపనిషత్తు
25. కౌశీతకీ ఉపనిషత్తు
26. బృహజ్జాబాలోపనిషత్తు

27(1). నృసింహపూర్వతాపిన్యుపనిషత్తు

27(2). నృసింహోత్తరతాపిన్యుపనిషత్తు

28. కాలాగ్నిరుద్రోపనిషత్తు
29. మైత్రేయోపనిషత్తు
30. సుబాలోపనిషత్తు
31. క్షురికోపనిషత్తు
32. మంత్రికోపనిషత్తు

మొదటి 32 ఉపనిషత్తులు — సర్వబంధ విముక్తి

33. సర్వసారోపనిషత్తు
34. నిరాలంబోపనిషత్తు
35. శుకరహస్యోపనిషత్తు
36. వజ్రసూచికోపనిషత్తు
37. తేజోబిందూపనిషత్తు
38. నాదబిందూపనిషత్తు
39. ధ్యానబిందూపనిషత్తు
40. బ్రహ్మవిద్యోపనిషత్తు
41. యోగతత్త్వోపనిషత్తు
42. ఆత్మబోధోపనిషత్తు
43. నారదపరివ్రాజకోపనిషత్తు
44. త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు
45. సీతోపనిషత్తు
46. యోగచూడామణ్యుపనిషత్తు
47. నిర్వాణోపనిషత్తు
48. మండల బ్రాహ్మణోపనిషత్తు
49. దక్షిణామూర్త్యుపనిషత్తు
50. శరభోపనిషత్తు
51. స్కందోపనిషత్తు
52. మహానారాయణోపనిషత్తు
53. అద్వయతారకోపనిషత్తు
54. రామరహస్యోపనిషత్తు

55 (1). రామపూర్వతాపిన్యుపనిషత్తు
55 (2). రామోత్తరతాపిన్యుపనిషత్తు
56. వాసుదేవోపనిషత్తు
57. ముద్గలోపనిషత్తు
58. శాండిల్యోపనిషత్తు
59. పైంగలోపనిషత్తు
60. భిక్షుకోపనిషత్తు
61. మహోపనిషత్తు
62. శారీరికోపనిషత్తు
63. యోగశిఖోపనిషత్తు
64. తురీయాతీతోపనిషత్తు
65. సన్న్యాసోపనిషత్తు
66. పరమహంసపరివ్రాజకోపనిషత్తు
67. అక్షమాలికోపనిషత్తు
68. అవ్యక్తోపనిషత్తు
69. ఏకాక్షరోపనిషత్తు
70. అన్నపూర్ణోపనిషత్తు
71. సూర్యోపనిషత్తు
72. అక్ష్యుపనిషత్తు
73. అధ్యాత్మోపనిషత్తు
74. కుండికోపనిషత్తు
75. సావిత్ర్యుపనిషత్తు
76. ఆత్మోపనిషత్తు
77. పాశుపతబ్రాహ్మణోపనిషత్తు
78. పరబ్రహ్మోపనిషత్తు
79. అవధూతోపనిషత్తు
80. త్రిపురతాపిన్యుపనిషత్తు
81. శ్రీదేవ్యుపనిషత్తు
82. త్రిపురోపనిషత్తు
83. కఠరుద్రోపనిషత్తు
84. భావనోపనిషత్తు
85. రుద్రహృదయోపనిషత్తు
86. యోగకుండల్యుపనిషత్తు
87. భస్మజాబాలోపనిషత్తు
88. రుద్రాక్షజాబాలోపనిషత్తు
89. గణపత్యుపనిషత్తు
90. దర్శనోపనిషత్తు
91. తారసారోపనిషత్తు
92. మహావాక్యోపనిషత్తు
93. పంచబ్రహ్మోపనిషత్తు
94. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు
95(1). గోపాల పూర్వతాపిన్యుపనిషత్తు
95(2). గోపాలోత్తరతాపిన్యుపనిషత్తు
96. కృష్ణోపనిషత్తు
97. యాజ్ఞవల్క్యోపనిషత్తు
98. వరాహోపనిషత్తు
99. శాట్యాయనీయోపనిషత్తు
100. హయగ్రీవోపనిషత్తు
101. దత్తాత్రేయోపనిషత్తు
102. గారుడోపనిషత్తు
103. కలిసంతారణోపనిషత్తు
104. జాబాల్యుపనిషత్తు
105. సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్తు
106. సరస్వతీరహస్యోపనిషత్తు
107. బహ్వృచోపనిషత్తు
108. ముక్తికోపనిషత్తు

108 ఉపనిషత్తులు
విదేహముక్తి

# మాండూక్య మహిమ

ముక్తికోపనిషత్తులో శ్రీరామచంద్రుల వారు ఇలా అన్నారు. “ఆంజనేయా ! ముముక్షువులు జీవన్ముక్తులగుట కొరకు మాండూక్యోపనిషత్తు ఒకటయే చాలును. అప్పటికిని జ్ఞానసిద్ధి కలుగనిచో మొదటి పది ఉపనిషత్తులు పఠించవలెను. ఇంకను మొదటి 32 ఉపనిషత్తులు అధ్యయనము, అభ్యాసము వలన సర్వబంధ విముక్తి కలుగును. మొత్తము 108 ఉపనిషత్తుల వలన విదేహముక్తి కలుగును. కావున మాండూక్యోపనిషత్తు చాలా ముఖ్యము.

(మాండూక్య విద్య - పేజీ 550, ఉద్గీథ విద్య - పేజీ 520, బ్ర.సూ. (368) చూడగలరు).

# 108 ఉపనిషత్తులు - వేదానుబంధము

## ఋగ్వేదమునందలి ఉపనిషత్తులు

1. ఐతరేయ 2. కౌషీతకీబ్రాహ్మణ 3. నాదబిందు 4. ఆత్మబోధ 5. నిర్వాణ 6. ముద్గల 7. అక్షరమాలికా 8. త్రిపుర 9. సౌభాగ్యలక్ష్మి 10. బహ్వృచ.

## శుక్ల యజుర్వేదమునందలి ఉపనిషత్తులు

1. ఈశావాస్య 2. బృహదారణ్యక 3. జాబాల 4. హంస 5. పరమహంస 6. సుబాల 7. మంత్రిక 8. నిరాలంబ 9. త్రిశిఖిబ్రాహ్మణ 10. మండల బ్రాహ్మణ 11. అద్వయతారక 12. పైంగల 13. భిక్షుక 14. తురీయాతీత 15. అధ్యాత్మ 16. తారసార 17. యాజ్ఞవల్క్య 18. శాట్యాయని 19. ముక్తిక.

## కృష్ణ యజుర్వేదమునందలి ఉపనిషత్తులు

1. కఠవల్లి 2. తైత్తిరీయ 3. బ్రహ్మ 4. కైవల్య 5. శ్వేతాశ్వతర 6. గర్భ 7. నారాయణ 8. అమృతబిందు 9. అమృతనాద 10. కాలాగ్నిరుద్ర 11. క్షురిక 12. సర్వసార 13. శుకరహస్య 14. తేజోబిందు 15. ధ్యానబిందు 16. బ్రహ్మవిద్య 17. యోగతత్త్వ 18. దక్షిణామూర్తి 19. స్కంద 20. శారీరక 21. యోగశిఖ 22. ఏకాక్షర 23. అక్షి 24. అవధూత 25. కఠరుద్ర 26. హృదయ 27. యోగకుండలినీ 28. పంచబ్రహ్మ 29. ప్రాణాగ్నిహోత్ర 30. వరాహ 31. కలిసంతరణ 32. సరస్వతీ రహస్య.

## సామ వేదమునందలి ఉపనిషత్తులు

1. కేన 2. ఛాందోగ్య 3. ఆరుణిక 4. మైత్రాయణి 5. మైత్రేయి 6. వజ్రసూచిక 7. యోగచూడామణి 8. వాసుదేవ 9. మహత్ 10. సన్యాస 11. అవ్యక్త 12. కుండిక 13. సావిత్రి 14. రుద్రాక్షజాబాల 15. దర్శన 16. బాబాలి

## అథర్వ వేదమునందలి ఉపనిషత్తులు

1. ప్రశ్న 2. ముండక 3. మాండూక్య 4. అథర్వశిర 5. అథర్వశిఖ 6. బృహజ్జాబాల 7. నృసింహతాపిని 8. నారద పరివ్రాజక 9. సీత 10. శరభ 11. మహానారాయణ 12. రామ రహస్య 13. రామతాపిని 14. శాండిల్య 15. పరమహంసపరివ్రాజక 16. అన్నపూర్ణ 17. సూర్య 18. ఆత్మ 19. పాశుపత బ్రహ్మ 20. పరబ్రహ్మ 21. త్రిపుర తాపిని 22. దేవి 23. భావన 24. భస్మజాబాల 25. గణపతి 26. మహావాక్య 27. గోపాలతాపిని 28. కృష్ణ 29. హయగ్రీవ 30. దత్తాత్రేయ 31. గరుడ

---

**10+19+32+16+31=108 ఉపనిషత్తులు**

---

# 5
# బ్రహ్మవిద్యలు-ఉపాసనలు

బ్రహ్మవిద్య అంటే బ్రహ్మజ్ఞానము కలిగించే విద్య. ఉపనిషత్తులు బ్రహ్మవిద్యాకోశములు. భగవద్గీత బ్రహ్మవిద్య. బ్రహ్మసూత్రములు బ్రహ్మవిద్య వ్యవస్థ. ఈ బ్రహ్మవిద్యలు ఉపాసనల రూపములో వుంటాయి. ఉపనిషత్తులలో వేరు వేరు చోట్ల వివిధములుగా ఉన్న ఉపాసనలను గూర్చి ఇపుడు తెలుసుకొందాము.

కర్మ నుండి జ్ఞానము వైపు పురోగమించటానికి ఉపాసనలు వంతెనలు. నిరంతర ధ్యానము ఉపాసన. బ్రహ్మానుభూతి, బ్రహ్మానుభవము, బ్రహ్మదర్శనము, బ్రహ్మస్థితి ఉపాసనా గమ్యములు.

ఉపాసనలు రెండు విధములు, సగుణోపాసన మరియు నిర్గుణోపాసన.

ప్రతీకోపాసన, ఆదిత్యోపాసన, అన్ని భక్తి ఉపాసనలు సగుణోపాసనలు.

మౌనము, నిర్వితర్క, నిర్విచార, నిర్వికల్ప, అసంప్రజ్ఞాత ధ్యానములు, సమాధి నిర్గుణోపాసనలు.

నిర్గుణోపాసన కైవల్యానుభూతి.

ఓంకారోపాసన సగుణోపాసన నుండి నిర్గుణోపాసనయైన మౌనస్థితికి తెరచి వున్న ద్వారము.

**1. గాయత్రి విద్య : జ్యోతిస్సు అనగా బ్రహ్మము**

బ్ర.సూ. I-1-10 అధికరణము, బ్ర.సూ. (24),(25),(26),(27) - ఛాం.ఉ. 3-12-1, 3-12-6, 3-13-7, 3-14-1.

---

**2. అక్షి విద్య : ఆదిత్య మండలములోని పురుషుడు, అక్షిస్థ పురుషుడు బ్రహ్మమే.**

బ్ర.సూ. (20),(21)-కౌశీ.ఉ.1-3-15, ఛాం.ఉ.1-6-6, 1-6-7, 1-6-8, బ్ర.ఉ. 5-7-9

---

**3. అంతరాదిత్య విద్య :** ఆదిత్యమండలములోని పురుషుడు అక్షిస్థ పురుషుడు బ్రహ్మమే.

బ్ర.సూ. (20),(21)-కౌశీ.ఉ.1-3-15, ఛాం.ఉ.1-6-6,7,8, బ్ర.ఉ. V-7-9, V-3, 4.

---

**4. మధు విద్య :** ఆదిత్యుడే దేవతలకు మధువు. ఆదిత్యుణ్ణి మధు రూపములో ఉపాసన చేయాలి. ఇది మనుష్యుల ఉపాసనా మార్గము. బ్ర.సూ.(24)కు చెందిన చిత్రపటలము షడ్విధా గాయత్రి-మధువిద్య చూడండి.

బ్ర.సూ. (94),(21)- ఛాం.ఉ.3-1-1 నుండి ఛాం.ఉ.3-11-6, బ్ర.సూ.(24),(25),(26),(27).

---

**5. పురుష విద్య :** "పురుషుడే యజ్ఞము, ఆ పురుషుని ఆయువులో మొదటి 24 సంవత్సరములు ప్రాతస్సవము, తరువాతి 44 సంవత్సరములు మధ్యాహ్న సవనము చివరి 48 సంవత్సరములు సాయం సవనము. అతని జీవనము యజ్ఞములో ఇచ్చేబలి. అతని ఆకలి దప్పులు, ఇష్టమైన వస్తువులు లభించకపోవటము అతని దీక్ష. అతని నవ్వు, భోజనము, స్తుతి. ఈ విధముగా పురుష యజ్ఞము చెప్పబడినది. ఇది తాండి, పైంగి రహస్య బ్రాహ్మణము ప్రకారము (ఛాం.ఉ. III-16-13)

# బ్రహ్మ విద్యలు

1. గాయత్రి విద్య
2. అక్షి విద్య
3. అంతరాదిత్య విద్య
4. మధు విద్య
5. పురుష విద్య
6. ప్రాణ విద్య/ప్రతర్దన విద్య
7. ప్రాణాగ్నిహోత్ర విద్య
8. ఉద్గీథ విద్య
9. నాచికేతాగ్ని విద్య
10. ఉపకోసల విద్య
11. సత్యకామ విద్య
12. పంచాగ్ని విద్య
13. వైశ్వానర విద్య
14. సంవర్గ విద్య
15. ఆకాశ విద్య
16. గార్గి అక్షర విద్య
17. భృగు వారుణి విద్య
18. ఆనందమయ విద్య
19. అంగుష్ఠమాత్ర విద్య
20. హృదయ విద్య
21. సత్య విద్య
22. శాండిల్య విద్య
23. దహర విద్య
24. బాలాకి విద్య
25. ఉషస్తి కహోల విద్య
26. ఉద్దాలకి ఆరుణి విద్య
27. మైత్రేయి విద్య
28. పరమపురుష విద్య
29. అక్షరాక్షర విద్య
30. సద్విద్య
31. భూమ విద్య
32. ప్రజ్ఞాన విద్య
33. మాండూక్య విద్య
34. వామదేవ విద్య
35. శ్వేతకేతు విద్య
36. అమృత విద్య
37. పర్యంక విద్య
38. జ్యోతిషాంజ్యోతి విద్య
39. ఈశ విద్య
40. శ్రీమన్-న్యాస విద్య
41. సర్వ విద్య

# ఉపాసనలు - భగవద్గీత

ఉపాసనల యొక్క ప్రాముఖ్యము, పథములు, పద్ధతులు, ఫలముల గూర్చి, సగుణనిర్గుణోపాసనల గూర్చి భగవద్గీతలో చాలా చక్కగా చెప్పబడినది. శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునితో ఇలా అన్నాడు,

"సతతం కీర్తయంతోమాం, యతంతశ్చ ధృఢవ్రతాః।
నమస్యంత మాంభక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥" (భ.గీ. IX-14)

"కీర్తించువారు కీర్తనలవారు
నిత్యయుక్తులై యుపాసించువారు
యత్నించువారు ధృఢవ్రతులు
భక్తితోడ నమస్కరించువారు" (శ్రీ.మ.భ.గీ. IX-14)

"జ్ఞానయజ్ఞేన చాప్యన్యే, యజంతో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖం॥" (భ.గీ. IX-15)

"ఇక జ్ఞానయజ్ఞమున నన్నుపాసించువారు
ఏకత్వమున పృథక్త్వము చూచువారు
పెక్కు విధముల నన్ను పూజించువారు
నిక్కము విశ్వతోముఖుడు నన్ను కొలచువారు" (శ్రీ.మ.భ.గీ. IX-15)

"అనన్యాశ్చింతయంతోమాం, యేజనాపర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్॥"(భ.గీ. IX-22)

"ఏరు అనన్యచింతన తోడ నన్ను
పర్యుపాసించుచుండు జనులు
నిత్యాభియుక్తులైన యట్టి
వారి యోగక్షేమములు వహింతునేను" (శ్రీ.మ.భ.గీ. IX-22)

"యే తు సర్వాణి కర్మాణి, మయి సంన్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన, మాం ధ్యాయంత ఉపాసతే॥" (భ.గీ. XII-6)

"తేషామహం సముద్ధర్తా, మృత్యుసంసార సాగరాత్।
భవామి న చిరాత్పార్థ, మయ్యావేశిత చేతసామ్॥" (భ.గీ. XII-7)

"మయ్యేవ మన ఆధత్స్వ, మయిబుద్ధిం నివేశయ
నివసిశ్యసిమయ్యేవ, అథఊర్ధ్వం న సంశయః।" (భ.గీ. XII-6,7,8)

"అన్ని కర్మములు నాయందు సన్న్యసించి
మనసునెపుడు నా యందు చేర్చి నిలిపి
అనన్యయోగ ధ్యానంబు చేయుచుండి
నన్ను కొలచి ఉపాసించుచుండునెవడు" (శ్రీ.మ.భ.గీ. XII-6)

"మృత్యుసమమై యుండు దాని నుండి
లోతు సంసారపు మొసలి పట్టు నుండి
ఉద్ధరించి వాని గట్టు నెక్కించగలను.
పార్థ నన్ను నమ్మినవాడు మునుగబోడు" (శ్రీ.మ.భ.గీ. XII-7)

"నా యందు మనసు స్థిరముగా నిలుపు
నా యందు బుద్ధిని నివేశంబు చేయు
నా యందు నాపైననేమగును వదులు
నా యందు తప్పక నివసించగలవు" (శ్రీ.మ.భ.గీ. XII-8)

(ఇది నారాయణ స్వానుభవము - బ్ర.సూ. (342) III-2-24 చూడగలరు.)

"ధ్యానేనాత్మనిపశ్యంతి, కేచిదాత్మనమాత్మనా।
అన్యే సాంఖ్యేనయోగేన, కర్మయేగేన చాపరే॥"
"అన్యేత్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాపి తరంత్యేవ మృత్యుం శ్రుతి పరాయణాః॥" (భ.గీ. XIII-25/26)

"కొందరు తమ యాత్మధ్యానంబు వలన
ఆత్మను యాత్మయందు తెలియగలరు
కొందరు వారు సాంఖ్యయోగంబు వలన
కొందరు మరి కర్మయోగంబు వలన" (శ్రీ.మ.భ.గీ. XIII-25)

"మరికొందరు అట్లు తెలియలేనివారు
వేరు వారి నుండి విని ఉపాసించువారు
దా శ్రుతి పరాయణులైనట్టివారు కూడ
యా మృత్యువును తుది తరియించువారు" (శ్రీ.మ.భ.గీ. XIII-26)

(భక్తి సంగీత ఉపాసనను శ్రీ త్యాగబ్రహ్మ "నాదోపాసన" అని అన్నారు.)

ఈ విధముగా శారీరకంగా, మానసికంగా, బౌద్ధికంగా, ఆత్మికముగా ఉపాసన చేస్తే బ్రహ్మదర్శనము, బ్రహ్మసాయుజ్యం ప్రసాదించబడుతాయి.

తైత్తిరీయ అరణ్యకము ప్రకారము (తై.అ. X-64) యజమానుడే యజ్ఞము, భార్యయే శ్రద్ధ, శరీరము ఇధ్మము, రొమ్ము యజ్ఞవేది, రోమాలు బహిర్వేది అని వర్ణించబడినది.

బ్ర.సూ.(383), III-3-24, ఛాం.ఉ. III-16-1, తై.అ.X-64)

---

**6.** **(1) ప్రాణ విద్య :** శ్రుతి యందు చెప్పబడిన బ్రహ్మలక్షణములైన జన్మ, స్థితి, లయములు ప్రాణ శబ్దమునకు వర్తిస్తాయి కనుక ప్రాణము అనగా బ్రహ్మము, ప్రాణవాయువు కాదు.
బ్ర.సూ.(23), I-1-23, ఛాం.ఉ. I-11-5, తై.అ.X-64)

**(2) ప్రతర్దన విద్య :** ప్రాణ శబ్దమునకు ప్రాణ వాయువనియో, ఇంద్రుడనియో, జీవాత్మ అనియో చెప్పుట తగదు. ఇచట ప్రాణ శబ్దము బ్రహ్మమునకు వర్తిస్తుంది. అట్లు ప్రాణము బ్రహ్మము.

ఉపాస్య రూపముగా చెప్పబడిన తత్త్వము ఇంద్రుని గూర్చికాదు. కావున ప్రాణశబ్దము బ్రహ్మమే. వామదేవుడు బోధించినది. ఇంద్రుడు బోధించినది, తన గురించి కాదు. బ్రహ్మము గురించి. ప్రాణము బ్రహ్మము. ప్రాణమును బ్రహ్మముగా ఉపాసించవలెను.

బ్ర.సూ.(28), I-1-28,(29) I-1-29, (30), I-1) (31) I-1-31

---

**7.** **ప్రాణాగ్నిహోత్ర విద్య :** అశ్వపతి రాజు ఇలా చెప్పినాడు. ప్రాణములను అగ్ని హోత్రముగా ఉపాసించవలెను.

(1) మొదటి ఆహుతిని **'ప్రాణాయస్వాహా'** అని హోమము సలుపవలెను. అపుడు ప్రాణములు, నేత్రేంద్రియములు, ఆదిత్యుడు, ద్యులోకము సకలము సంతృప్తి చెందుచున్నది.

(2) రెండవ ఆహుతిని **'వ్యానాయస్వాహా'** అని హోమము చేయవలెను. అపుడు వ్యాన వాయువు సంతృప్తి చెందును. అపుడు శ్రోత్రేంద్రియము (చెవులు), చంద్రుడు, దిక్కులు సమస్తము తృప్తి చెందును.

(3) మూడవ ఆహుతిని **'అపానాయస్వాహా'** అని హోమము చేయవలయును. దాని వలన అపాన వాయువు, వాక్కు, అగ్ని, పృథివి సర్వము సంతృప్తి చెందును.

(4) నాలుగవ ఆహుతిని **'సమానాయస్వాహా'** అని హోమము చేయవలయును. అపుడు సమాన వాయువు, మనస్సు, పర్జన్యము, విద్యుత్తు సర్వము సంతృప్తి చెందును.

(5) అయిదవ ఆహుతిని **'ఉదానాయస్వాహా'** అని హోమము చేయవలెను. అపుడు ఉదాన వాయువు, త్వక్కు (చర్మము), వాయువు, ఆకాశము సమస్తము తృప్తి చెందును.

ఈ వైశ్వానరాత్మ పరిజ్ఞానము కలిగి అగ్ని హోత్రము చేయు వాని హోమము సర్వ లోకములలోను, సర్వాత్మలలోనూ హోమము చేసినట్లగును. అతని దోషములు అగ్నిలో వేసిన ముంజగడ్డివలె భస్మము అగును. మనము ఆరగించేది అంతా ఆహుతియే, నైవేద్యమే. అలా ఉపాసన చేస్తే అది ప్రసాదమౌతుంది.

బ్ర.సూ. (55), (56), (416).

ఛాం.ఉ. V-11 నుండి V-24 వరకు.-28

బ్ర.సూ.(370), (371) చూడగలరు.

# ప్రాణాగ్ని హోత్ర విద్య

ఛాం.ఉ.V-11 నుండి ఙ-24 వరకు బ్ర.సూ.(370), (371) బ్ర.సూ.(55),(56),(57)

| | ఆహుతి | ప్రాణ వాయువు | యంత్రము | ఇంద్రియము | దేవత | సంతృప్తి లోకము | ఫలము |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ప్రథమ ఆహుతి | ప్రాణము | ప్రాణాయస్వాహా | నేత్రము | ఆదిత్యుడు | ద్యులోకము | పశువులు, ప్రజలు, అన్నము, బ్రహ్మతేజస్సు |
| 2 | ద్వితీయ ఆహుతి | వ్యానము | వ్యానాయస్వాహా | శ్రోత్రము | చంద్రుడు | దిక్కులు | పశు సంపద, ప్రజలు, అన్నము, బ్రహ్మతేజస్సు |
| 3 | తృతీయ ఆహుతి | అపానము | అపానాయస్వాహా | వాక్కు | అగ్ని | పృథివి | పశువులు, ప్రజలు, అన్నము, బ్రహ్మతేజస్సు |
| 4 | చతుర్థ ఆహుతి | సమానము | సమానాయస్వాహా | మనస్సు | పర్జన్యము | విద్యుత్తు | పశువులు, ప్రజలు, అన్నము, బ్రహ్మతేజస్సు |
| 5 | పంచమ ఆహుతి | ఉదానము | ఉదానాయస్వాహా | త్వక్కు | వాయువు | ఆకాశము | పశువులు, ప్రజలు, అన్నము, బ్రహ్మతేజస్సు |

వైశ్వానర విద్య మరియు ప్రాణాగ్ని హోత్ర విద్య యొక్క పరిజ్ఞానము తెలిసి ఉపాసన, అగ్ని హోత్రము చేయువాని హోమము సర్వలోకములలోను, సర్వాత్మలలోను హోమము చేసినట్లగును. అతని దోషములు అగ్నిలో వేసిన ముంజగడ్డివలె భస్మమగును. మనము ఆరగించెడి అంతా ఆహుతియే, నైవేద్యమే అలా ఉపాసజిన చేస్తే అది ప్రసాదమౌతుంది.

**8. ఉద్గీథ విద్య :** "ఓం ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" (ఛాం.ఉ. I-1-1)

ఓం అను అక్షరమే ఉద్గీథము. ఓంకారమునుపాసించవలెను. ఈ సమస్త సృష్టి యొక్క సారము పృథివి. పృథివి రసమయముగానున్నది. పృథివి యొక్క సారము జలము. ఓషధులు జలము యొక్క సారము. ఓషధుల సారము పురుషుడు. పురుషుని సారమువాక్కు. పురుషుని వాక్కు సారము ఋక్కులు, ఋగ్వేద మంత్రములు. ఋగ్వేద మంత్రముల సారము సామములు సామవేద మంత్రములు. ఓంకారము సామవేద సర్వస్వమై యున్నది. ఓంకారము సర్వమునకు సారభూతమై సర్వోత్కృష్టమైయున్నది. సారములలో ఎనిమిదిదైన ఓంకారము పరమాత్మ యందుండుటకు సమర్థమై వున్నది.

వాక్కే ఋక్కు. ప్రాణమే సామము. ఓంకారమే ఉద్గీథము. ఇదే మిథునము, కూడిక. ఋక్కు స్థానమగు వాక్కు మరియు సామము స్థానమగు ప్రాణము ఈ రెండింటి యొక్క ఐక్యత్వమే మిథునము, (**నారాయణ వాక్యము :** వాక్కును, ప్రాణములను ఒకటి తరువాత ఒకటి క్రమముగా ఆపి నిలిపినపుడు ప్రాణాయామము అగును. గీతము పాడినపుడు, శ్లోకము చదివినపుడు, ఓం అని ఉచ్ఛరించినపుడు ప్రాణాయామము అగును).

ఓంకారమునందు ఈ మిథునము యొక్క సంయోగమగును. ప్రకృతి పురుషుల సమాగమము అనగా పరస్పరేచ్ఛ పూర్ణమగుట.

ఇట్లు తెలిసి ఓంకారోపాసన చేసినవాడు సర్వకామము పొందినవాడగును. లోకమునందు దేనికైనను ఓం అనియే అనుజ్ఞ, అనుమతి నొసంగుట వలన దీనికి అనుజ్ఞాక్షరమనియు అందురు. అనుజ్ఞనొసగునపుడు మనుష్యుడు ఓం అని అనును. అనుజ్ఞచే వృద్ధియగును. అందువలన దీనికి సంవృద్ధి అని పేరు. ఈ రీతిగా గ్రహించి యే విద్వాంసుడు ఓంకారమునుపాసించునో, అట్టి వాని సర్వకాంక్షలు నెరవేరుచున్నవి.

ఈ ఓంకారముతో ఈ త్రయీ విద్య యొక్క ప్రవృత్తి కలుగును. ఓం అని అధ్వర్యుడు ఆశ్రవణ కర్మ (ఋగ్వేదము) చేయును. హోత, ఓం అని శంసన కర్మ (యజుర్వేదము) చేయును మరియు ఓం అని ఉద్గాత ఉద్గీథము (సామగానము) చేయును. ఈ అక్షరము యొక్క మహిమ వలననే సర్వకర్మలును ప్రవర్తిల్లుచున్నవి. ఈ ఓంకార రహస్యము తెలిసిన యతడును, తెలియని అతడును, ఇద్దరును కర్మలు చేయుదురు. జ్ఞానయుక్త కర్మలు, శ్రద్ధతో చేయబడునది వీర్యవత్తరము అగును.

**"అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతం, ఓంకారం యో నజానాతి బ్రాహ్మణో నభవేత్తు సః"**

మహా వాక్యములు (104,105-పేజీ 603), (ధ్యానబిందు.ఉ.-13)

"విశ్వ తైజస ప్రాజ్ఞ విరాట్ హిరణ్యగర్భ అంతర్యామి కూటస్థ పరమాత్మ అను ఎనిమిది అంగములును ; అకార, ఉకార, మకార అర్ధమాత్రలు అను నాలుగు పాదములును, జాగృత స్వప్న సుషుప్తులను మూడు స్థానములును, బ్రహ్మ విష్ణు మహేశ్వర రుద్ర సదాశివులను పంచదైవతములును, స్వరూపముగా గలది 'ఓం'కారము. అట్టి ఓంకారమును తెలియనువాడు బ్రహ్మవిదుడు కాదు. సమస్తమును ఓంకారముగా భావింపవలెను."

ఇది ఓంకారము యొక్క వ్యాఖ్యానము.

(మాండూక్య విద్య పేజీ550, మాండూక్య మహిమ పేజీ 512,బ్ర.సూ.(368)-పేజీ250 చూడగలరు.)

# ఉద్గీథ విద్య




వాక్కే ఋక్కు. ప్రాణమే సామము.

ఓంకారమే ఉద్గీథము.

ఋక్కు స్థానము వాక్కు, సామము స్థానము ప్రాణము.

ఓంకారమునందు ఈ మిథునము యొక్క సంయోగము.

బ్ర.సూ. (368) III-3-9. ఛాం.ఉ. (I-1-1)

**9. నాచికేతాగ్ని విద్య :** నాచికేతాగ్ని విద్య గురించి కఠోపనిషత్తులో వున్నది. వాజశ్రవుడనే ఋషి కుమారుడైన నచికేతుడు తండ్రిమాట ప్రకారము (వాసనలను విడిచి, మనసునాపి, బుద్ధిని శుద్ధముచేసి, ఆహారము త్యజించి) మృత్యుద్వారమున మూన్నాళ్లు వున్నాడు.

యమధర్మరాజుకు మూడు రోజులు ఆహారము లేకుండా తన యమలోక ద్వారములో ఉన్న బ్రహ్మచారి గురించి తెలిసి, అది తనకు, తన లోకమునకు అశుభమని గ్రహించి, నచికేతుని వద్దకు వెళ్లి నయముగా మాట్లాడి మూడు వరములిచ్చినాడు.

నచికేతుడు మొదటి వరముగా తన తండ్రి కోపం మాసిపోవాలని, ఆయన కాలుని భయం లేకుండా దీర్ఘ జీవితం అందాలని కోరాడు. (కఠ.ఉ. I-1-10) వరదాత వల్లె అనినాడు.

రెండవ వరముగా నచికేతుడు ఇలా అన్నాడు.

"స్వర్గములో ఆకలి దప్పులు, జరామరణములు లేక సమస్త దుఃఖాతీతులై వుండవచ్చును. అక్కడ ఏ భయమూ వుండదు, శోకమూ లేదు. నీవూ (మరణము) అక్కడ వుండవు. అట్టి స్వర్గసాధనమైన అగ్ని గూర్చి నీకు బాగా తెలియును. శ్రద్ధాళునైన నేను అట్టి విజ్ఞానమును రెండవ వరముగా కోరుచున్నాను". (కఠ.ఉ. I-1-12) ఇది నచికేతుడు మనుజుల శ్రేయస్సు కొరకు అడిగిన వరము.

కాలుడు బాలునకిట్లా అన్నాడు "ఓ నచికేతా ! స్వర్గమునకు తీసుకొని వెళ్లే ఆ అగ్ని, విజ్ఞానము, యజ్ఞ విధానము నాకు తెలియును. నీకు చెపుతాను. శ్రద్ధగా నేర్చుకో. ఆ విద్య శాశ్వత స్వర్గసుఖమునకు సాధనము. సకలలోకములకు ఆధారము. అది విద్వాంసుల హృదయములలో వెలుగుచున్నది."

తరువాత యమధర్మరాజు ఆ అగ్ని విజ్ఞానాన్ని వివరించినాడు. ఆ యజ్ఞము అన్ని లోకములకు కారణమని, ఏరీతి ఇటుకలు ఎన్నిటిని ఎలా ఉపయోగించాలో తెలిపినాడు. నచికేతుడు దానినంతయు వెంటనే ధారణ చేసి యథాతథము అప్ప చెప్పినాడు.

అంత హంత సంతుష్టినంది ఇలా అన్నాడు.

"భళిరే! నచికేత మెచ్చితి చాలా నచ్చతిన్
చాలక వరము వేరొకటి నీకిచ్చితిన్
తెలియు, దీనికి నాచికేతాగ్ని అని పేరిచ్చితిన్
బాల ! నీకీ అనంత రూపముల పేరిచ్చితిన్" (కఠ.ఉ. I-1-16)

అలా అని యమధర్మరాజు ఆ అగ్నికి నాచికేతాగ్ని అని పేరిచ్చి తన మెడలోనున్న అనంత రూపముల దివ్యమాలను నచికేతుని మెడపైన వేసి ఇంకా ఇలా అనినాడు,

"మూడు సార్లు నాచికేతాగ్ని యజ్ఞము చేసినవాడు తల్లి, దండ్రి, గురువు అను ముగ్గురి చేతను అనుశాసనము పొంది మూడు విధులను పాలించిన వాడగును, జనన మరణములకతీతుడగును. అట్టివాడు బ్రహ్మజ్ఞానమును అంది ఈ యజ్ఞము వలన శాంతి పొందును. ఈ త్రిణాచికేత విద్యయైన

నాచికేతాగ్నిని ఎవరైతే ఉపాసించెదరో వారు సంసార దుఃఖ ముక్తులై స్వర్గములో దివ్య సుఖముతో ఆనందించగలరు. స్వర్గమునకు తీసుకొనిపోవు ఈ అగ్ని విద్యను నీవు రెండవ వరముగా గ్రహించిన దానిని ప్రజలు నీ పేరుతో నాచికేతాగ్ని అని పిలిచెదరు గాక. ఇక మూడవ వరమును కోరుకొనుము". ఇదియే కఠోపనిషత్తులో చెప్పబడిన నాచికేతాగ్ని విద్యా ప్రసంగము.

[**నారాయణ వాక్యము :** కఠోపనిషత్తులో నాచికేతాగ్ని యజ్ఞ వివరములు, విధానము, ఆ ఇటుకలు ఎన్ని, ఏమి అనే విషయములు, దేవలోకము ఎలా వస్తుంది అనేది చెప్పబడలేదు. మనము నాచికేతాగ్ని యజ్ఞము ఎలా చేయాలి? దీనికి సమాధానము ప్రశ్నగానే వుండిపోయింది కదా? నిజంగా ఆ నాచికేతాగ్ని విద్య ఏమిటి ?

కఠోపనిషత్తు ఒక అద్భుతమైన ఉపనిషత్తు. కాలుని జయించిన బాలుని కథ. బ్రహ్మవిద్య నేర్పి, నేర్పబడిన గురు శిష్యుల కథ కదా !

ఉపనిషత్తులన్నీ ఆవులు, గోపాలనందనుడు దోగ్ధ, అర్జునుడు లేగదూడ. బుద్ధిమానులైన భక్తులు గీతామృతమునకు భోక్తలు అని విన్నాము కథా ! ఉపనిషత్తుల రహస్యములు భగవద్గీతలో నిండుగా వున్నాయి. అందుకే "ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జు సంవాదే" అని అంటాము.

భగవద్గీతలో వున్న అమృతము అనే పాలు ఇచ్చిన ఉపనిషత్తులు అన్న గోవులలో ఒక చాలా ముఖ్యమైన గోవు కఠోపనిషత్తు.

మృత్యు ముఖములో వున్న జిజ్ఞాసువైన నచికేతునికి బ్రహ్మజ్ఞానము బోధించిన గురువు ధర్మస్వరూపుడు యమధర్మరాజు. మృత్యు ముఖములో వున్న జిజ్ఞాసువైన అర్జునునికి బ్రహ్మజ్ఞానము బోధించిన గురువు ధర్మ స్వరూపుడు శ్రీకృష్ణుడు.

కఠోపనిషత్తులోని జ్ఞానగుళికలు భగవద్గీతలోకి యథాతథముగా (కొన్ని చోట్ల చిన్న సవరణలతో) స్వీకరించినవి ఈ విధము.

1. "న జాయతే మ్రియతే వా కదాచిత్
   నాయం భూత్వాఽ భవితా వానభూయః
   అజోనిత్యః శాశ్వతోఽ యంపురాణో
   నహన్యతే హన్యమానే శరీరే" (కఠ.ఉ.I-2-15, భ.గీ.II-29)
2. ఉభౌ తౌ నవిజానీతో నాయం హంతి నహన్యతే" (కఠ.ఉ. I-2-19, భ.గీ.II-19)
3. "ఆశ్చర్యోవక్తా కుశలోఽ స్య లబ్ధా
   ఆశ్చర్యోజ్ఞాతా కుశలానుశిష్టః" (కఠ.ఉ.II-7)

   ఆశ్చర్య వత్పశ్యతి కశ్చిదేనం
   ఆశ్చర్యవద్వదతి తథైవచాన్యః
   ఆశ్చర్యవచ్చైవమన్యః శృణోతి

శృత్వాప్యేనం వేదన చైవ కశ్చిత్”		(భ.గీ.II-29)

4.	సర్వే వేదా యత్పదమామనంతి
తాంసి సర్వాణి చ యద్వదంతి
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్.		(కఠ.ఉ.II-2-15)

“యదక్షరం వేదవిదోవదంతి
విశంతి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే”		(భ.గీ.II-11)

భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ పురుషోత్తమ ప్రాప్తియోగములో శాశ్వత ధర్మము, ఏకాంతిక సుఖము గూర్చి, సంసార వృక్షము గూర్చి, దాని బంధముల నుండి తప్పించుకునే విధము గూర్చి, పరమధామము గూర్చి, వైశ్వానరుని గూర్చి (వైశ్వానర విద్య), అందరి హృదయములలో వున్న పరమాత్మ గూర్చి, వేద వేదాంత జ్ఞానము గూర్చి, క్షర అక్షర పురుషుల గూర్చి, పురుషోత్తమ స్థితి గూర్చి చెప్పి ముందుకు సాగి దివ్యగణముల గూర్చి చెప్పినాడు.

దైవాసుర సంపద్విభాగములో అసుర స్వభావము నుండి, దివ్య స్వభావము వైపు పురోగమించి దివ్య లోకములందగలిగే దైవాసుర సంపద్వ భాగములో దైవీ సంపద గురించి ఇలా చెప్పినాడు.

“అభయం సత్త్వ సంశుద్ధిర్ జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ తపఆర్జవమ్” -1
“అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాంతిరపైనుశమ్
దయాభూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్
తేజ, క్షమాధృతి శౌచమద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీం అభిజాతోసి భారత” -2

దీనిలో దివ్యత్వమునందటానికి 26 పదములు (ఇటికెలు) వున్నాయి. ఆ గుణాలనే ఇటుకలను, ఏలా పేర్చాలి జీవన యజ్ఞము అనే నాచికేతాగ్ని యజ్ఞము ఎలా జరిపించాలి అనే విషయాలను ఇపుడు చూతాము.

అభయము, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగ వ్యవస్థితి, దానము, దమము, యజ్ఞము, స్వాధ్యాయము, తపము, ఆర్జవము, అహింస, సత్యము, అక్రోధము, త్యాగము, శాంతి, అపైశునము, భూతదయ, అలోలుప్త్వము, మార్గవము, హ్రీ, అచాపలము, తేజము, క్షమ, ధృతి, శౌచము, అద్రోహము, నాతిమానిత అనునవి దైవి సంపద అనే యజ్ఞవేదిక యొక్క ఇటుకలు.

వీటిని ఎలా పేర్చాలి? వీటిని యజ్ఞకుండములో వుండే నల్లని, ఎర్రని, తెల్లని వర్ణములున్న తమస్సు, రజస్సు, సత్త్వము అనే మూడు తలములలో అమర్చాలి. గుణాతీతమైన నాలుగవ తలము అగ్ని ముఖము.

జీవన యజ్ఞములో మానవతా రాహిత్యమును తీసివేయటము, తమస నాశనమైన నల్లని మొదటిమెట్టు. మానవత్వాన్ని ముందుకు నడిపేది రజసరూపమైన ఎఱ్రని రెండవమెట్టు. చైతన్యత్వాన్ని పైకి లేపేది సత్త్వరూపమైన మూడవ మెట్టు. ఏ రంగూ లేని కేవలము అగ్ని జ్యోతి రూపాన్ని స్పర్శించేది గుణాతీతమైన నాలుగవ మెట్టు.

నాతిమానిత, అపైశునము, అద్రోహము, అలోలుప్త్వము, అచాపలము, అక్రోధము, అహింస అనునవి తమస్సు నాశనము చేసే మొదటి మెట్టు యొక్క ఇటుకలు.

స్వాధ్యాయము, సర్వభూత దయ, క్షమ, దానము, యజ్ఞము, త్యాగము అనునవి మానవత్వాన్ని అభివృద్ధి చేసే రజస్సు రూపమైన రెండవ మెట్టు యొక్క ఇటుకలు.

దమము, మార్దవము, హ్రీ, ధృతి, తపస్సు, సత్త్వ సంశుద్ధి, తేజము అనునవి చైతన్యమునుపైకి లేపే సత్త్వరూపమైన మూడవ మెట్టు యొక్క ఇటుకలు.

జ్ఞానయోగ వ్యవస్థితి, ఆర్జవము, శౌచము, సత్యము, శాంతి అనునవి దివ్యత్వము నిలిపే తురీయ స్థితి యొక్క జ్వాలల శుద్ధ రూపములు.

దైవీ సంపద అనునది ఈ యజ్ఞ వేదిక నుండి కలిగే జీవన యజ్ఞ ఫలము.

తమస్సు, రజస్సు, సత్త్వములనే మెట్లలో ఆ మూడు గుణములను కాల్చివేసినవి మూడు తలముల అగ్నులు. నాలుగవది కాంతి రూపమైన తేజాగ్ని.

ఇదియే త్రిణాచికేతాగ్నులు అని మూడుతీర్ల వుంటాయి. ఈ విధముగా జీవనయజ్ఞాన్ని నచికేతుని వలె జిజ్ఞాస, శుద్ధి, శ్రద్ధ, సాధనలతో ఇక్కడనే దివ్య స్వర్గ సుఖమునంది బ్రహ్మానుభూతి ద్వారమున నిలువవచ్చును.

అయితే ఈ దివ్యమార్గములో వెళ్లటానికి అర్హత పొందటము ఒక తపస్సే. అది చాలా కష్టమైన కత్తిపదును వంటి మార్గము.

యమధర్మరాజే నచికేతునికి ఈ విదముగా చెప్పినాడు.

"ఉత్తిష్ఠత జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత<br>
క్షురస్య ధారానిశితా దురత్యయా,<br>
దుర్గంపథస్తత్కవయో వదంతి" (కఠ.ఉ. I-3-14)

"లెమ్ము జాగృతుడవు కమ్ము<br>
రమ్ము వరులత్రోవన పొమ్ము<br>
కత్తి పదునువంటి బాట<br>
విదులు కష్టమంద్రు దాట !"

అయితే ఈ కష్టమైన మార్గములో నడిచి జ్ఞానమందినవారికి బ్రహ్మానుభూతి లభిస్తుంది.

ఈ "ఉతిష్ఠత జాగ్రత" అనే దాన్ని స్వామి వివేకానంద మానవ జాతిని ప్రేరణ చేయటానికి నియోగించినాడు.

"Arise, Awake and stop not till the goal is achieved"

నారాయణ దీనిని అనేక విద్యాలయములలో ఇలా అర్థం చేయించారు.

"ఉత్తిష్ఠత జాగ్రత, ఉత్కృష్ట భవ"

"Arise, Awake! Become and Be Excellent"]

(కఠ.ఉ. I-1-10,12,16,19, కఠ.ఉ. I-3-14)

(బ్ర.సూ. (393) III-3-34).

---

**10.** **ఉపకోసల విద్య :** సత్యకామ జాబాలి శిష్యుడైన ఉపకోసల కామలాయనునికి యజ్ఞాజ్ఞులు ఇట్లు బోధించినవి. "ప్రాణము బ్రహ్మము. కం అనగా బ్రహ్మము. ఖం అనగా బ్రహ్మము." తరువాత గార్హపత్యాగ్ని ఇట్లు బోధించెను. "భూమి, అగ్ని, ఆహారము, సూర్యుడు నా రూపములే. సూర్యునిలో నున్న పురుషుడు నేనే, నేనే. ఇది నిజము".

తదుపరి అన్వాహార్య వచనాగ్ని ఇట్లు ఉపదేశించెను. "జలము, దిక్కులు, నక్షత్రములు, చంద్రుడు నా రూపములే. చంద్రునిలో నున్న పురుషుడు నేనే, నేనే. ఇది నిజము."

తరువాత గురుదేవులైన సత్యకామ జాబాలి ఉపకోసలునికి ఇట్లు బోధించెను.

"నేత్రములో నివసించు పురుషుడే ఆత్మ. ఈ ఆత్మ అమరము, భయరహితము, పరబ్రహ్మము. బ్రహ్మజ్ఞానిని ఆశీర్వాద నిధిగా గుర్తించవలెను. అన్ని అభినందనలు అతనిలో వున్నవి. బ్రహ్మజ్ఞాని ఆశీర్వాద భాగ్యము నీయగల మహాత్ముడు. దీనిని తెలిసికొనిన వారు సర్వ ఆశీర్వాదములను పొందగలరు. బ్రహ్మజ్ఞాని కాంతికి నిధానము. అతడు అన్నింట ప్రకాశించును. ఈ విషయమును తెలిసిన వారు అన్ని పరిస్థితులలోనూ ప్రకాశించగలరు."

(ఛాం.ఉ. IV-4-10 నుండి 4-15 వరకు. బ్ర.సూ. (44) I-2-13, నుండి (47) I-2-17 వరకు)

---

**11.** **సత్యకామ విద్య :** సత్యకామ జాబాలుడనే అతడు గురుశూశ్రస చేసి విద్యను పొందాలని హారిద్రు మత గౌతముని వద్దకు వెళ్లినాడు. గౌతముడు సత్యకాముని గోత్రం అడిగినాడు. సత్యకాముడు "నా గోత్రం నాకు తెలియదు. ఈ విషయములో నా తల్లి ఇట్లు చెప్పినది. 'బాబూ! యవ్వనములో పలుచోట్ల దాసిగా పరిచర్య చేసియుంటిని అప్పుడు నీవు జన్మించితివి. నీ గోత్రం నాకు తెలియదు. నీ పేరు సత్యకాముడు' అని తెలిపినది" అని చెప్పినాడు.

అది విని గౌతముడు "నీవు దాచకుండా సత్యము చెప్పినావు. సత్యము పలుకుట బ్రాహ్మణుల లక్షణము. నీకు ఉపనయనం చేసి బ్రహ్మ విద్య భోదింతును" అని చెప్పి నాలుగు వందల గోవుల నప్పచెప్పి "వీటిని బాగుగా మేపికొని అవి వేయి గోవులైన తరువాత తిరిగి రమ్ము" అని ఆజ్ఞాపించెను.

కొన్ని సంవత్సరముల తరువాత ఆ ఆవులు వెయ్యి అయినాయి. అపుడు ఒక వృషభము "ఓ సత్యకామా! మేము ఒక వేయి అయినాము, మమ్ములను గురుకులమునకు తీసుకొని వెళ్లుము."

అని చెప్పి "ఇపుడు పరబ్రహ్మ పాదమును గూర్చి తెలిపెదను. తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము అను నాలుగు దిక్కులు నాలుగు కళలు. ఇది పరమాత్మకు ఒక పాదము. దీని పేరు ప్రకాశవాన్. ఈ విధముగా గ్రహించి బ్రహ్మోపాసన చేయువాడు బ్రహ్మలోకమునకు వెళ్లి అక్కడ ప్రకాశముతో నుండి ప్రకాశపూర్ణమగు లోకములకు కూడా వెళ్లును. ఇంకొక పాదము నీకు అగ్ని దేవుడు బోధించును." అని తెలిపెను.

సాయంత్రము ఎండు పుల్లలతో సత్యకాముడు అగ్నిని వెలిగించగా అగ్ని "పృథివి, అంతరిక్షము, ద్యులోకము, సముద్రము ఇవి నాలుగు కళలు. ఇవి నాలుగు కలసి బ్రహ్మమునకు అనంతవాన్ అని రెండవ పాదము. ఈ విధముగా ఉపాసించితే అనంతలోకములు జయించబడును. మూడవ పాదము గురించి నీకు హంస తెలుపును" అని చెప్పెను.

సాయంత్రము ఒక హంస వచ్చి "సత్యకామా ! అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు అనునవి బ్రహ్మము యొక్క మూడవ పాదము. ఇది జ్యోతిస్మాన్ అనే మూడవ పాదము. ముద్గు అను నీటి పక్షి నీకు నాలుగవ పాదము తెలుపగలదు." అని చెప్పెను.

తరువాత ముద్గు అనే నీటి పక్షి వచ్చి "ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు అనునవి ఆయతనవాన్ అనే నాలుగవ పాదము" అని చెప్పెను.

తరువాత గురుకులమునకు చేరినపుడు హారిద్రుమత గౌతముడు "సత్యకామా ! నీవు బ్రహ్మవిద్య తెలిసినట్లున్నావు. ఎవరు బోధించినారు." అని అడుగగా సత్యకాముడు ప్రణమిల్లి "గురుదేవా ! నాకు మనుష్యేతరులు తెలిపినారు. మీరు ఉపదేశించి నన్ను ధన్యుడిని చేయండి. గురుముఖము నుండి నేర్చిన విద్య అత్యుత్తమ విద్య" అని వేడుకొనెను. అపుడు ఆ సద్గురువు షోడష కళా విద్యలను బోధించెను. సద్గురువు షోడష కళావిద్యలను బోధించినపుడే సత్యకామునికి సాధుత్వము బ్రహ్మజ్ఞానము అందెను. బ్రహ్మ జ్ఞానమును ఈ విధముగా ఉపాసించవలెను.

(ఛాం.ఉ. IV-4 నుండి IV-9 వరకు, బ్ర.సూ.(100) I-3-37. పేజీ 52 చూడగలరు.)

---

**12. వైశ్వానర విద్య :** బ్రహ్మజ్ఞానియైన అశ్వపతిరాజు, ఉద్దాలక మహర్షికి మరియు ఆయన శిష్యులు ప్రాచీనశాల, సత్యయజ్ఞ, ఇంద్రద్యుమ్న, జన, బుడిల అనే ఐదుగురు ఋషులకు వైశ్వానరాత్మను గూర్చి ఇలా చెప్పాడు. "ఆ వైశ్వానరునకు ద్యులోకము శిరస్సు, సూర్యుడు నేత్రములు, వాయువు ప్రాణము, ఆకాశము శరీర మధ్య భాగము, జలము వస్తి స్థానము (మూత్ర స్థానము), పృథివి పాదాలు, ధర్భలు రోమములు, గార్హాపత్యాగ్ని హృదయము, అన్వాహార్య వచనాగ్ని మనస్సు, అహవనీయాగ్ని ముఖము" (ఛాం.ఉ.5-18-2).

ఇక్కడ విశ్వమునకు ఆత్మరూపుడైన విరాట్పురుషుని గూర్చియే వైశ్వానరాత్మగా చెప్పబడినది. కనుక ఇచట వైశ్వానర శబ్దమునకు సాధారణ అర్థమైన జఠరాగ్నికాక, పరబ్రహ్మముగా నిర్దేశించబడినది. "వైశ్వానరాత్మకు ద్యులోకము, సూర్యుడు, వాయువు, ఆకాశము, జలము, పృథివి అనునవి శిరస్సు, నేత్రములు, ప్రాణము, శరీర మధ్యభాగము, వస్తి, పాదాలుగా వేరువేరుగా కాక సమిష్టిగా పూర్తి విశ్వరూపములో ఉపాసన చేయాలి." అని అశ్వపతిరాజు బోధించినాడు. వైశ్వానరుడు కేవలము

జఠరాగ్ని కాక పరబ్రహ్మమే. వైశ్వానరునికి విరాట్ స్వరూపము, త్రైలోక్య శరీరత్వము కలదు. అనంతుడు, అవిచ్ఛిన్నుడు ఐన పరమాత్మ ప్రదేశమునకు, స్థానమునకు అతీతుడు. ఉపాసన కోసము ప్రదేశములు, స్థానములు, రూపములు, నామములు తెలిపినారు. సమస్త విశ్వమైన నరుడు, సమస్త జీవులకు నరుడు, సమస్త జీవులు అతనికి సంబంధించినవారు వైశ్వానరుడు. విశ్వనరుడే వైశ్వానరుడు.

(ఛాం.ఉ. V-11 నుండి V-24 వరకు)

(బ్ర.సూ.లలో సూత్రములు (55), (56), (57), (58), (59), (60), (61), (62), (63), (416)

---

**13. పంచాగ్ని విద్య :** ప్రవహణుడనే రాజు ఆరుణి ఉద్దాలక మునికి, ఆయన కుమారుడు శ్వేతకేతువుకు ఇలా బోధించినాడు,

"ఈ జగత్తులో స్వర్గము, మేఘము, పృథ్వి, పురుషుడు, స్త్రీ అనే పంచాగ్నులు వున్నాయి. శ్రద్ధ, సోమము, వృష్టి, అన్నము, వీర్యము అని ఆ పంచాగ్నుల ఆహుతులు కలవు.

1. స్వర్గరూపమైన అగ్నిలో శ్రద్ధ యొక్క ప్రథమ ఆహుతి వలన సోమము ఉద్భవిస్తుంది.
2. మరల మేఘరూపమైన అగ్నిలో సోమము ఆహుతి చేస్తే వృష్టి (వర్షము) ఉత్పత్తి అవుతుంది.
3. పృథివీ రూప అగ్నిలో వృష్టిని ఆహుతి ఇస్తే అన్నము ఉద్భవిస్తుంది.
4. పురుష రూప అగ్నిలో అన్నము ఆహుతి ఇస్తే వీర్యము ఉత్పత్తి అవుతుంది.
5. స్త్రీ రూప అగ్నిలో వీర్యము పంచమ ఆహుతిగా ఇస్తే గర్భము ఉత్పత్తి అవుతుంది."

ఆ విధముగా జలము పంచమ ఆహుతిలో పురుష రూపమును పొందుతుంది. అట్లు జన్మించిన వ్యక్తి ఆయువు వున్నంత వరకు ఇక్కడ జీవనమును ప్రాప్తి చెందుతాడు.

(ఛాం.ఉ. V-3-3 నుండి V-9-2 వరకు, బ్ర.సూ.(292) III-1-1.)

(ఆరవ ఆహుతిగా అగ్నిరూప అగ్నిలో తుదకు ఆ జీవనము చెందిన పురుషుని ఆహుతి చేసినపుడు దీప్తి ఉత్పత్తి అవుతుంది.)

(బృ.అ. VI-2-1 నుండి VI-2-9 వరకు, బ్ర.సూ.(361) III-3-2) చూడండి.

---

**14. సంవర్గ విద్య :** ఛాందోగ్యోపనిషత్తులో మహా అన్నదాత యైన జానశ్రుతి అనే రాజుకు బండి రైక్వుడు అనే బ్రహ్మజ్ఞాని బ్రహ్మవిద్య బోధించిన వుదంతము వున్నది. [బ్ర.సూ.(97) I-3-35. చూడండి.] రైక్వుడు జానశ్రుతికి బోధించినది సంవర్గవిద్య. రైక్వుడు ఇలా చెప్పినాడు "వాయువే సంవర్గము, అనగా చివరి ఆశ్రయము. సూర్యుడస్తమించి వాయువున చేరును. చంద్రుడస్తమించి వాయువున లీనమగును. జలము ఇంకిన వాయువునాశ్రయించును. వాయువే ఈ సమస్తమును మ్రింగును. ఇది అధిదైవతము. ఇది విశ్వమునందలి శక్తుల గురించినది.

ఇక అధ్యాత్మమైన శరీరస్థమైన శక్తుల గురించిన విషయము. ప్రాణము సంవర్గము. మనిషి పడుకున్నప్పుడు వాక్కు, నేత్రము, శ్రోత్రము, మనస్సు మొదలైన సర్వఇంద్రియములు ప్రాణములో చేరుచున్నవి. ప్రాణమే సర్వమును భుజించుచున్నది. దేవతలయందు వాయువు, జీవులయందు ప్రాణము సంవర్గములు. భూతములందు వాయువు, ఇంద్రియములందు ప్రాణము సంవర్గములు. వాయువును, ప్రాణములను సంవర్గములుగా ఉపాసించవలెను." (ఛాం.ఉ. IV-3-1,3,4).

"వాగాదీంద్రియములన్నీ ప్రాణరూపమునే ఆత్మగా పొందినవి. అందువల్లన ఇంద్రియములన్నీ ప్రాణములని చెప్పబడుచున్నవి. అన్ని ఇంద్రియములకు ముఖ్యమైన ప్రాణాత్మను తెలుసుకొనినవాడు తన వంశమునకు యశస్సు కలిగించుచున్నాడు అదే విధముగ వాయువు అన్ని దేవతలో అధిదైవతము అని వ్యాఖ్యాతము" (బృ.అ. 1-5-21 నుండి 1-5-23 వరకు)

ఇట్లు దేవతలందు వాయువును, ఇంద్రియములందు ముఖ్యప్రాణమును సంవర్గమని ఉపాసించవలెను.

(బ్ర.సూ. (97) I-3-35, (402) III-3-43).
(ఛాం.ఉ. IV-3-1,3,4, బృ.అ.1-5-21 నుండి 1-5-23 వరకు).

---

**15. ఆకాశ విద్య :** ఛాందోగ్యోపనిత్తులోని ఒక ఉదంతము ప్రకారము చైకితాయన దాల్భ్యుడు, శిలక శాలాపత్యుడు, ప్రవాహణ జైబలి కలిసి సమావేశమై ఒకరినొకరు ప్రశ్నలు అడిగి సమాధానములు చెప్పుచున్నారు. చైకితాయన దాల్భ్యుడు వినుచుండుగా శిలక శాలాపత్యుడు ప్రవహణ జైబలిని అడిగెను,

"ఈ లోకములో సారభూతమేది?"

ప్రవహణుడిట్లు చెప్పెను. "ఈ జీవులందరు ఆకాశము నుండి పుట్టుచున్నారు. చివరకు ఆకాశముననే లీనమగుచున్నారు. ఆకాశము అన్ని భూతములకంటె పెద్దది మరియ అన్నింటికి ఆధారమై వున్నది". (ఛాం.ఉ. I-9-1,2)

"భూతాకాశమునకు ఇది సంభవము కాదు.పరమాత్మాకాశము భూతాకాశము కన్న మిన్న మరియు పరాయణము." (బ్ర.సూ. (22) I-1-22)

(చిదాకాశము → ఆకాశము → వాయువు → తేజము → జలము → పృథివి)

"ఈ ఆకాశమనునది నామరూపములను వ్యక్తము చేయును. ఈ నామరూపములు ఏ ఆత్మయందున్నవో అదియే బ్రహ్మము, అమృతము, ఆత్మ. నేను ప్రజాపతి సభాగృహమును చేరితిని. నేను బ్రాహ్మణ యశస్సు, వైశ్యుల యశస్సు, అగుదును గాక. అట్టి యశస్సునే వాంచింతును. నేనాయశస్సుల యశస్సుయై వున్నాను. నేను ఎపుడును మోహమున పడకుందును గాక" అని బ్రహ్మ ప్రజాపతికి బోధించెను. (ఛాం.ఉ. VIII-14-1)
ఈ విధముగా ఆకాశమును బ్రహ్మముగా ఉపాసించవలెను.

బ్ర.సూ. (22) I-1-22) (బ్ర.సూ.217 నుండి 223 వరకు)
(ఛాం.ఉ. I-9-1,2, ఛాం.ఉ. VIII-14-1).

---

**16.** **గార్గి అక్షర విద్య :** సమస్త సృష్టి ఆకాశములో ఓతప్రోతము అని చెప్పి అన్నింటికీ అధిష్ఠానము అయిన ఆకాశము అక్షరములో ఓతప్రోతమైనదని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడినది. (బృ.అ.3-8-9). కావున ఆకాశముతో సహా సర్వమును ధరించటం పరమాత్మకే అన్వయం అవుతుంది. అక్షరమంటే పరమాత్మ బోధకము. బ్ర.సూ. (73) I-3-10).

జనకమహారాజు సభలో గార్గి వాచక్నవి యాజ్ఞవల్క్యుని ఇలా అడిగింది. "ద్యులోకము కంటె మీదను భూమి కంటె క్రిందుగాను, అండ కపాలము యొక్క మధ్యమునందును, ఈ భూమ్యంతరిక్షములు మరియు భూత వర్తమాన భవిష్యత్తులు ఏదియో ఆ సమస్తమును ఏ సూత్రమని చెప్పుచున్నారో, ఆ సూత్రము దేనియందు ఓతప్రోతమై వున్నది?"

యాజ్ఞావల్క్యుడు ఇలా చెప్పెను " ఓ గార్గీ ! బ్రహ్మాండము యొక్క ఊర్ధ్వాధోభాగముల యందును మధ్యభాగముల యందును, భూత భవిష్యత్ వర్తమాన కాలములగు ఈ సూత్రరూపమైన సమస్తమును దేనిగా చెప్పుచున్నారో, ఆ సర్వమును అవ్యాకృతమగు ఆకాశమందు పడుగుపేకలుగా కల్పింపబడియున్నది. గార్గీ! అవ్యాకృతాకాశ స్వరూపము అవాచ్యము కనుక అవాచ్యమైన దానిని చెప్పినచో అప్రతిపత్తి, విప్రతిపత్తి అని రెండు దోషములు కలుగుచున్నవి".

గార్గి ఇట్లడిగెను. "ఓ యాజ్ఞవల్క్యా ! ఆ అవ్యాకృతాకాశము దేనియందు పడుగుపేక వలె కల్పించబడి యున్నది"?

యాజ్ఞవల్క్యుడు ఇట్లనెను "ఓ గార్గీ! బ్రహ్మజ్ఞానులు దానిని అక్షరమునందని చెప్పుదురు. నాశరహితమైన దానియందు ఓతప్రోతమైయున్నదని చెప్పెదరు. అది స్థూలముకాదు, సూక్షము కాదు, అణువును కాదు, పొడుగుది కాదు, పొట్టిది కాదు.

ఆ అక్షరము అరక్తము, అస్నేహము, అచ్ఛాయువు, అతమము, అవాయువు, అనాకాశము, అసంగమము, అరసము, అగంధము, అచక్షువు, అశ్రోత్రము, అవాక్కు, అమనస్సు, అతేజస్కము, అప్రాణము, అముఖము, అమాత్రము. అది లోపల వెలుపల అనునవి లేనిది. అదే వున్నది. అది దేనిని తినుటలేదు. దానిని ఎవరూ తినలేరు. అది భోక్త, భోజనము కాదు. అక్షరమైన వ్యాపక స్వరూపము, అపూర్వమగు ఆ తత్త్వమును తెలియవలెను."

"ఈ అక్షరుని ఆజ్ఞతో సూర్యచంద్రులు సంచరించుచున్నారు, భూమ్యంతరక్షములు శక్తివంతముగా నున్నవి, హిమవంతము మొదలైన పర్వతముల నుండి నదులు తూర్పు పడమరలకు ప్రవహించుచున్నవి."

"ఈ అక్షరము యొక్క ఆజ్ఞతో దానార్హములైన సువర్ణము మొదలైన వానిని మనష్యులు శ్లాఘించుచున్నారు. దేవతలు యజమానుని, పితృదేవతలు దర్వీ హోమమును అనుసరించి ప్రవర్తించుచున్నారు."

"ఓ గార్గీ! ఎవరు ఈ అక్షర పరబ్రహ్మమును తెలియక హోమమును చేయుచున్నారో, యాగమును చేయుచున్నారో, తపస్సును చాలా సంవత్సరములు చేయుచున్నారో, వారి యొక్క కర్మ ఫలమంతయు అంతమగుచున్నది. ఎవరు ఈ అక్షరుని తెలియక మరణించుచున్నాడో అతడు జననమరణ రూపమైన సంసార కష్టమను నిరంతరము పొందుచున్నాడు. ఎవరు ఈ అక్షర పరబ్రహ్మమును తెలిసికొని ఈ లోకమునందు మరణమునందుచున్నాడో, అతడు ఆ అక్షరబ్రహ్మరూపమే అగుచున్నాడు.

"ఓ గార్గీ ! ఈ అక్షరము తానెవ్వరికి కనపించక అందరిని చూచును. వినబడకుండి వినును. తెలియబడదు, తెలిసికొనును. అది తప్ప వేరుచూచేవారెవరూ లేరు. ఈ సత్య వస్తువు తప్ప వినేవారెవ్వరూ లేరు. తెలియువారెవ్వరూ లేరు. ఓ గార్గీ ! ఈ అక్షరమునందే ఆకాశము ఓతప్రోతమైనది".

"పరమాత్మకు భిన్నమైన భావము అక్షరునిలో లేకపోవటము వలన అక్షరుడు పరమాత్మయే కాని జడ పదార్థము కాదు." (బ్ర.సూ. (75) I-3-12).

"అన్నిటినీ శాసించి, ధరించేది అక్షరము. అచేతనమైన ప్రధానము ఇది చేయలేదు. అక్షరము పరబ్రహ్మమే" బ్ర.సూ. (74) I-3-11), (బ్ర.సూ. (164) II-1-30), (బృ.అ.3-8-8/9).

---

**17. భృగువారుణి విద్య :** "ఆనందము మొదలైనవి సర్వోత్తమమైన బ్రహ్మము యొక్క ధర్మములు" (బ్ర.సూ. (370) III-3-11). "ఆనందము, సర్వగతత్వము, సర్వజ్ఞత్వము, అనంతత్వము, నిత్యత్వము మొదలైనవి అన్నీ పరమాత్మ ధర్మములు" (బ్ర.సూ. (371) III-3-12).

"ఆనందమయ శబ్దము మరల మరల బ్రహ్మము కొరకే ప్రయోగించబడినందున ఆనందమయుడంటే పరమాత్మయే తప్ప జీవుడు కాదు" (బ్ర.సూ. (12) I-1-12).

"ఆనందానికి హేతువు, కారణము అని చెప్పటము వలన కూడా ఆంనదమయుడంటే బ్రహ్మమే" (బ్ర.సూ. (14) I-1-14).

"సత్యం జ్ఞానం ఆనందము అనంతము బ్రహ్మము" (పై.ఉ.-2)

"ఈ పరమాత్మయే లోకమును ఆనందపరచుచున్నాడు" (తై.ఉ. 2-7-1).

"ఈ పరబ్రహ్మము రసస్వరూపము. అట్టి రస స్వరూపమును పొంది జీవుడు సుఖవంతుడు అగుచున్నాడు." (బ్ర.సూ. (17) I-1-17).

"ఆనందము నుండియే సమస్త భూతములు జనించి, ఆనందము వలననే జీవించి, ఆనందము నందు ప్రవేశించి, ఆనంద స్వరూపమగుచున్నవి. కనక ఆనందమును పరబ్రహ్మ స్వరూపముగా తెలిసికొని భృగువు తపస్సు వలన పరిశుద్ధాంతరంగుడయ్యెను.

భృగువను పేరు గల వరుణ పుత్రుడు బ్రహ్మవిద్యను తెలిసికొనుటకు తన తండ్రియైన వరుణ భగవానుని సమీపించి" భగవంతా ! బ్రహ్మము గూర్చి బోధించుము అని వేడుకొనెను.

వరుణుడు బ్రహ్మవిద్యకు ప్రాణము, నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు

సాధనాద్వారములని చెప్పి దేని నుండి ఈ భూతములన్నీ జనిస్తాయో, జనించి దేని వలన జీవిస్తాయో తుదకు దేని యందు కలసి యుంటాయో అదియే బ్రహ్మము. దానిని గూర్చి తెలిసికొనుటకు కోరుము, ప్రయత్నించుము, తపస్సు చేయుము" అని చెప్పెను.

భృగువు అట్లు తపించి విచారించి అన్నము బ్రహ్మమని తెలిసికొనెను. జీవులన్నీ అన్నమునందు జనించి, అన్నము వలన జీవించి అన్నమునందే కలియుచున్నవి కనుక అన్నము బ్రహ్మము అని తెలిసి మరల తండ్రిని సమీపించెను. అన్నము పైన ఇంకా ఏమి గలదో అని మరల బ్రహ్మము గూర్చి అడిగెను. వరుణుడు భృగువును మరల తపస్సుకు పంపెను. ఈసారి ప్రాణము బ్రహ్మమని తెలిసెను. ఈ విధముగా నాలుగు సార్లు తపించి వరుసగా అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము బ్రహ్మము అని తెలిసికొని చివరకు ఆనందము బ్రహ్మమని గ్రహించి ఆనందమునంది ఆనందమే పరమమని జ్ఞానము చెంది ఆనందముగా గీతములు పాడి మరల ప్రశ్నించటానికి తిరిగి వెళ్లలేదు.

ఈ విధముగా ఒక్కొక్క మెట్టు లోపలికి వెళ్ళి పరమ ధామమైన ఆనందమును చేరినాడు. ఇదియే భృగువారుణీ విద్య, భార్గవీ వారుణీ విద్య. బ్రహ్మమును అన్నముగా, ప్రాణముగా, మనస్సుగా, విజ్ఞానముగా, ఆనందముగా ఉపాసించి పరమానందములో కలిసిపోవాలి.

(తై.ఉ. III-1,2,3,4,5,6,7,8,9,10) : ముందు కవరు చిత్రము.
(బ్ర.సూ. (12) I-1-12, (13) I-1-13, (14) I-1-14, (15) I-1-15, (16) I-1-16, (17) I-1-17, (18) I-1-18, (19) I-1-19), (370) III-3-11, (371) III-3-12, (372) III-3-13, (373) III-3-14, (374) III-3-15, (375) III-3-16, (376) III-3-17)).

---

**18. ఆనందమయ విద్య :** బ్రహ్మవిదుడు బ్రహ్మమును పొందుచున్నాడు. సత్యము, జ్ఞానము, అనంతము బ్రహ్మము. (తై.ఉ.II-1) (పై.ఉ.-2). ఆ పరబ్రహ్మము శ్రేష్ఠముగ అవ్యాకృతమను పేరు గల హృదయాకాశమునందలి బుద్ధి గుహయందున్నది. దీనిని తెలిసినవాడు సర్వజ్ఞ స్వరూపమగు ఆ పరబ్రహ్మముతో పాటు సమస్త కామములను పొందుచున్నాడు.

ఆ పరబ్రహ్మము నుండి వరుసగా ఆకాశము, వాయువు, తేజము, జలము, పృథివి కలిగినవి. పృథివి నుండి అన్నము కలిగినవి. అన్నము నుండి పురుషుడు జనించినాడు. అ పురుషుడు అన్నమయ పురుషుడు. అన్నమయపురుషునిలో ప్రాణమయపురుషుడు, మనోమయ పురుషుడు, విజ్ఞానమయ పురుషుడు, ఆనందమయ పురుషుడు లోలోపల వున్నారు. ఆనందమయ పురుషుడే పరమపురుషుడు, పరబ్రహ్మము.

ఆ ఐదుగురు పురుషులకు శిరస్సు, దక్షిణ పక్షము, ఉత్తర పక్షము, ఆత్మ, పుచ్ఛము కల్పించబడినాయి. ధ్యానము కొరకు ఈ రూపకల్పన చేయబడినది. ఆనందమయ ఆత్మ-బ్రహ్మము అనే రూపకల్పన బ్ర.సూ. (370) III-3-11, బ్ర.సూ. (371) III-3-12, (372) III-3-13, (376) III-3-17) లో చూడండి. (తై.ఉ.II-1) (పై.ఉ.-2) బ్రహ్మమును ఆనందముగా ఉపాసించాలి.

---

**19. అంగుష్ఠమాత్ర విద్య :** కఠోపనిషత్తులో పరమాత్మ అంగుష్ఠమాత్రుడని వర్ణించబడినది.

"అంగుష్ఠమాత్రః పురుషో, మధ్య ఆత్మని తిష్ఠతి
ఈశానోభూత భవ్యస్య, న తతోవిజిగుప్సతే, ఎతద్వైతత్" (కఠ.ఉ.2-1-12)

"అతడంగుష్ఠ మాత్రపురుషుండు తెలియ
అంతరంగమున తాను తిష్ఠించి యుండు
భూతభవ్యముల ఈశానుడతడు
అంత భయము లేదు, ఇదియెనదియ॥

"అంగుష్ఠ మాత్రపురుషో, జ్యోతిరివాధూమకః
ఈశానో భూత భవ్యస్య స ఏవాద్య స ఉశ్వః ఎతద్వైతత్" (కఠ.ఉ.2-1-13)

"అతడంగుష్ఠ మాత్ర పురుషుండు దాను
ఇంతయు ధూమంబులేని జ్యోతి దాను
భూతభవ్యముల ఈశానుడతడు
అతడె నిన్న, నేడు, మరునాడు, నిదియెనదియ"

మరల అదే కఠోపనిషత్తులో,
"అంగుష్ఠ మాత్రః పురుషోంతరాత్మా
సదా జనానాం హృదయేసన్ని విష్ఠ
తం స్వాచ్ఛరీరాత్ ప్రవృహేన్
ముంజ్ఞాది వేషీకాం ధైర్యేణ
తం విద్యాచ్ఛుక్రమమృతం
తం విద్యాచ్ఛుక్రమమృతమితిః" (కఠ.ఉ. II-3-17, VI-17)

అంగుష్ఠమాత్ర పరిమాణము కలిగి ఎప్పుడూ జనుల హృదయ పద్మములందుండు పురుషుడు అంగుష్ఠ మాత్రుడనబడును. అట్టి అంగుష్ఠమాత్ర పురుషుని ముంజగడ్డియందుండు పరకను వెలుపలకు లాగినట్లు స్వశరీరము నుండి జ్ఞానము చేత వెలుపలకు తీయవలయును. శరీరము నుండి వేరుపరచబడిన చిన్మాత్రుడైన ఆ యాత్మనే శుద్ధమైన బ్రహ్మముగా తెలియవలెను. ఆ యాత్మనే శుద్ధమైన బ్రహ్మముగా తెలియవలెను".

అట్లు అంగుష్ఠమాత్రుడని చెప్పబడిన పురుషుడు భూతభవ్యముల ఈశానుడని చెప్పబడినాడు. అతడు నిన్న, నేడు, మరునాడు, ఎప్పుడూ వున్నాడని కూడా చెప్పబడినాడు.

పరబ్రహ్మము హృదయములందు వున్నదని చెప్పబడినది. హృదయము అంగుష్ఠ మాత్రముగా తెలియబడినది. కావున అంగుష్ఠ మాత్రమని చెప్పబడినది పరబ్రహ్మమే. పరమాత్మ పరిమాణాతీతుడు, అనంతస్వరూపుడు. అయితే హృదయమందు ఉపాసన, ధ్యానము చేసే కొరకు బొటనవేలంత అని చెప్పబడినాడు.

[**నారాయణ వాక్యము :** ఐదు వేళ్లలో చిన్నవేలు శరీరము, ఉంగరము వేలు మనస్సు, నడిమి

వేలు బుద్ధి, చూపుడు వేలు అహంకారముకల జీవుడు, బొటనవేలు పరమాత్మ. చూపుడు వ్రేలును బ్రొటనవ్రేలుతో కలిపి ధ్యానము ఉపాసన చేస్తే జీవాత్మ పరమాత్మల ఐక్యత అనుభూతి అవుతుంది.]

బ్ర.సూ.(87) I-3-24, (83) I-3-25), (కఠ.ఉ. 2-1-12, 2-1-13, 2-1-17)

---

**20.** **హృదయ విద్య :** బ్రహ్మపుత్రులగు దేవ మనుష్య అసురులు ప్రజాపతియైన బ్రహ్మను సమీపించి "బ్రహ్మచర్యము (నియమము) బోధించుము" అని కోరుకొనిరి. అపుడు బ్రహ్మ దేవతలకు "ద" అను అక్షరమును ఉపదేశించెను మరియు "దేవతలారా ! "ద" అన్న దాని అర్థము గ్రహించితిరా?" అని అడిగెను. దేవతలు "దేవా! "ద" అనగా దమము, ఇంద్రియ నిగ్రహము" అని సమాధానము ఇచ్చి దమమును అభ్యసించి పాటించిరి.

ఆయన మనుష్యులకు కూడా "ద" అని ఉపదేశించెను. వారు దానిని దానముగా గ్రహించి అట్లే నియమముగా అభ్యసించి పాటించిరి.

మరల బ్రహ్మ అసురులకు కూడా "ద" అని బోధించెను. వారు దానిని దయగా అర్థము చేసుకొని అభ్యసించి పాటించిరి. (బృ.అ.ఉ.V-2-1,2,3)

కరుణామయుడగు తండ్రి దమము లేని దేవతలకు దమము (ఇంద్రియనిగ్రహము)ను, దానము చేయని మనుజులకు దానమును, దయా హీనులగు అసురులకు దయను బోధించెను. **లేనిది ఇచ్చుటయే అనుగ్రహము.** అనుగ్రహమును గ్రహించవలయును. (దమహీనులు, దానహీనులు, దయాహీనులైన మనుజులకే ఈ సందేశము).

మనము మనలోనే వున్న దివ్యప్రవృత్తిని, మనుష్య ప్రవృత్తిని, అసురప్రవృత్తిని దమము, దానము, దయ ద్వారా శుద్ధి చేసుకొని ఉద్ధరించుకోవాలి. దమము, దానము, దయకలవాడు సర్వోపాసనల యందును అధికారియగుచున్నాడు.

ఇంతవరకు నిరుపాధిక పరబ్రహ్మోపాసన గూర్చి చెప్పబడినది. ఇక సోపాధిక పరబ్రహ్మోపాసన గూర్చి చెప్పబడుచున్నది. అయితే దమ, దాన, దయలను ఉపదేశించిన బ్రహ్మము ఎవరనగా ఈ హృదయమే బ్రహ్మము. ఈ హృదయమే స్వర్గము. కనుక హృదయమే పరబ్రహ్మమని ఉపాసించవలయును. (బృ.అ.ఉ.V-3-1).

"హృదయ"ము అను దానియందలి ఒక్కొక్క అక్షరమును ఉపాసించుట వలననే మానవుడు విశేష ఫలములనందుచున్నాడు.

ఇది సోపాధిక బ్రహ్మోపాసన.

"హృ" అని ఉపాసించు వారి హృదయము శుద్ధమై దివ్యత్వమునకు అధికారియై సంతసమందు చున్నాడు. "ద" అని ఉపాసించువాడు దమము, దానము, దయ అను గుణములు లభించి సత్వరజస్తమములు దాటుచున్నాడు. "య" అని ఉపాసించువారు దేవలోకమును పొందుచున్నాడు.

సమిష్ఠిగా మూడు ఉపాసనలు మరియు "హృదయ" ముసు పరబ్రహ్మముగా ఉపాసించువారు బ్రహ్మజ్ఞానమందగలరు. ఈ విధముగా హృదయ బ్రహ్మము గూర్చి నాలుగు ఉపాసనలు చెప్పబడినవి.

(బృ.అ.ఉ.V-2-1,2,3, బృ.అ.ఉ.V-3-1)

(నిరుపాధిక బ్రహ్మోపాసనలు అమూర్తము. సోపాధిక బ్రహ్మోపాసన మూర్తము. ఈ విధముగా మూర్తామూర్త ఉపాసనలు చెప్పబడినవి).

---

**21. సత్య విద్య :** ఇంతకుముందు చెప్పబడిన హృదయ బ్రహ్మము మూర్తాముర్తముగా నుండెడి పంచ భూతాత్మముగానున్నది. అట్టి హృదయ బ్రహ్మమును తెలిసికొని ఉపాసించువాడు ఈ సర్వలోకములను జయించుచున్నాడు. అట్లు ఉపాసించువానికి తనకంటె వేరు ఏమీ లేకపోవటము వలన అజాత శత్రువు అగుచున్నాడు. (బృ.అ.ఉ.V-4-1)

"ఆప ఏవేదమగ్ర ఆసుః ఆపః సత్యమసృజంత, సత్యం బ్రహ్మ" (బృ.అ.ఉ.V-5-1)

(ఇపుడు సత్య బ్రహ్మమునుపాసించు విధము చెప్పబడుచున్నది).

ఈ వికారరూపమగు జగము సృష్టికి పూర్వము జలముగానె వుండెడిది. ఉదకములు సత్యము. సత్యము బ్రహ్మము. ఆ సత్యము హిరణ్యగర్భుని, హిరణ్యగర్భుడు విరాట్పురుషుని, విరాట్పురుషుడు దేవతలను సృష్టించెను. ఆ దేవతలు సత్యబ్రహ్మమునే ఉపాసించుచున్నారు, ధ్యానించుచున్నారు.

సత్యము మూడు అక్షరములు కలిగియున్నది. స, తీ, య అనునవి ఆ మూడక్షరములు. స, య అనునవి ఈ సృష్టికి మొదలు, తరువాతయుండు సత్యములు, బ్రహ్మస్వరూపములు.

"తీ' అనునది మధ్యనవున్న అసత్యమైన అభాస ఐన ఈ జగత్తు. మూడక్షరములైన స,తీ,య (సత్య) అను దానిలో బ్రహ్మమే మించినది, నిత్యమైనది. మధ్యలో వున్నదనిపించే జగము అనిత్యము. (బృ.అ.ఉ.V-4-2).

అట్లు సత్యమునుపాసించవలెను.

[**నారాయణ వాక్యము :** "స" అంటే సృష్టి కన్న మొదలు వుండే సంపూర్ణ బ్రహ్మము యొక్క 'స'. య అంటే సృష్టి బ్రహ్మమునందు కలిసే "లయ" యందలి "య" "తి" ప్రతిభాసతి (అనిపిస్తుంది) అనే దానిలోని "తి"

(దీని తరువాత సత్యవిద్యాక్రమమైన శాండిల్యవిద్యను తెలియవలెను.)

(బృ.అ.ఉ.V-4-1)

---

**22. శాండిల్య విద్య :** (అగ్నిరహస్య విద్య)

ఇంతకుముందరి సత్యవిద్యలో "సత్యం బ్రహ్మ" (బృ.ఉ. V-4-2) అని చెప్పబడినది కదా. ఆ సత్యాన్ని ముందుకు సాగిస్తూ,

వాజసనీయశాఖకు చెందిన శతపథ బ్రాహ్మణములో శాండిల్య విద్య అని పేరుగాంచిన

39

# శాండిల్య విద్య

(సత్య విద్య)




**ఆదిత్య మండల పురుషుడు**

**అహః**

**అధి దైవతము**

# శాండిల్య విద్య

(సత్య విద్య)




## అక్షిస్థ పురుషుడు

## అహం

## అధ్యాత్మికము

అగ్ని రహస్య విద్యలో (శథపథ, బ్రా. X-6-3-2)

"సత్యమే బ్రహ్మ అని ఉపాసించవలెను. ఈ పురుషుడు సత్యసంకల్పుడు. ఎన్ని సంకల్పములతో అతడీ లోకముల నుండి ప్రయాణమై పరలోకమునకు పోవునో ఆ సంకల్పములు కలవాడై పుట్టును".

అదే వాజసనీయ శాఖకు చెందిన బృహదారణ్యకములో (బృ.అ. V-6-1) "ప్రకాశము ఎవరి సత్యస్వరూపమో ఆ పురుషుడు మనోమయుడు. అతడు వ్రీహి, యవగింజలు మొదలైన వానితో సమానమైన సూక్ష్మపరిమాణముకలవాడై హృదయాకాశ స్థితుడగును. అంతడందరకు స్వామి అధిపతి. అతడన్నిటిని శాసించును".

శతపథ బ్రాహ్మణములోని, అగ్ని రహస్యములోని శాండిల్యవిద్య విధి సహితము. బృహదారణ్యక ఉపనిషత్తులోనిది పునరుక్తము, అనువాదము. రెండు విద్యలు ఒక్కటే. అవి ఒకటే అయిన మనోమయుడు, ప్రాణ శరీరుడు ఆకాశరూపుడు అయిన బ్రహ్మమునే ఉపాసించుచున్నవి. (బ్ర.సూ. (378) III-3-19).

బృహదారణ్యకోపనిషత్తులో సత్యవిద్య ప్రారంభములో "సత్యం బ్రహ్మ" (బృ.అ. V-5-1) అని చెప్పి వెంటనే "ఆ సత్యమే ఈ ఆదిత్యుడు. ఆదిత్య మండములోనున్న పురుషుడే ఈ కుడికన్నులో నుండు పురుషుడు" అని చెప్పి ఆదిత్య పురుషునికి "అహః" అని, అక్షిస్త పురుషునికి "అహం" అని నామములు ఇవ్వబడినవి. (బ్ర.సూ. (379) III-3-20).

అధిదైవతమైన "అహః" అనబడిన ఆదిత్యపురుషునకు అధ్యాత్మమైన "అహం" అనబడిన అక్షిస్థ పురుషునకు భూః అని, భువః, సువః అను వ్యాహ్రుతులే అవయవములు.భూః అను ఒక అక్షరము శిరస్సు, భువః అను రెండక్షరములు రెండు భుజములు, సువః అను రెండక్షరములు రెండు పాదములు అని చెప్పి వెంటనే,

అట్లు సత్యబ్రహ్మను, "అహః" అనబడిన ఆదిత్యపురుషుని, "అహం" అనబడిన అక్షిస్థ పురుషుని ఉపాసన చేయవలెను. ఇదే సత్యవిద్య శాండిల్య విద్యగా ఛాందోగ్యోపనిషత్తులో ఈ విధముగా చెప్పబడినది.

"సర్వం ఖల్విదం బ్రహ్మ. నామరూపాత్మకమగు ఈ జగత్తు అంతా పరబ్రహ్మమే అయివున్నది. సృష్టి, స్థితి లయములు బ్రహ్మమునందే కలుగుచున్నవి. కావున శాంతముతో బ్రహ్మమునుపాసించవలెను. పరమాత్మ యజ్ఞమయుడు. ఈ లోకములో మానవుడు ఎట్టి పుణ్యకర్మలు చేయునో, అంతకు తగిన పుణ్యలోకములను మరణాంతరము పొందుచున్నాడు.

"ఆ బ్రహ్మము, మనోమయుడు, ప్రాణశరీరుడు, మహాకాంతికలవాడు, సత్యసంకల్పుడు, ఆకాశమే ఆత్మగాకలవాడు. సర్వకర్మలు, సర్వకామములు, శబ్దస్పర్శ రూపరస గంధములు బ్రహ్మమే. ఆ బ్రహ్మము సర్వవ్యాపకుడు, వాగాది ఇంద్రియములు లేకయుండియు సర్వేంద్రియ కార్యములు చేయువాడు".

“అంతర హృదయములో నివసించు ఈ ఆత్మ నీవార శూకముల కంటె, వడ్లగింజ మొనకంటె ఆవాల గింజలోనున్న విత్తు కంటె అత్యంత సూక్ష్మముగానున్నది. నా హృదయములో నివసించు నీయాత్మ భూగోళము కంటె పెద్దది. ఆకాశము కంటె పెద్దది. దేవలోకము కంటె పెద్దది. నా హృదయ కమలములో నివసించు బ్రహ్మమే సృష్టికర్త. సర్వకామములు, సర్వగంధములు, సర్వరసములు స్వరూపముగా గలవాడు. అతడే పరబ్రహ్మము. ఈ సత్యమైన శ్రద్ధను ఎవరు కలిగియుండునో, వారికి ఏ విధమైన సందేహములు లేవు.”

శాండిల్య మహాముని ఈ విధముగా ప్రకటించెను. ఈ విధముగా సూక్ష్మాతి సూక్ష్మముగా, మహత్తు కన్న మహత్తుగా, ప్రకాశ స్వరూపముగా స్వహృదయములోనున్న సత్యస్వరూపమైన పరబ్రహ్మమును ఉపాసించవలెను.

(ఛాం.ఉ. III-14-1,2,3,4, బృ.అ. V-6-1, V-6-2, శతపథ.బ్రా. X-6-3-2, ఛాం.ఉ. III-14-1,2,3,4, ఛాం.ఉ. I-7-5)

((బ్ర.సూ. (378)III-3-19, (379)III-3-20, (380)III-3-21, (381)III-3-22)

---

**23. దహర విద్య :** ఛాందోగ్యోపనిషత్తులో,

“ఈ బ్రహ్మపురములో (మానవ దేహములో) హృదయగుహలో చిన్న పద్మము కలదు. ఆ పద్మములో సూక్ష్మమగు అంతరాకాశము కలదు. ఆ లోపలి వస్తువును విచారించవలెను. ఈ బ్రహ్మపురములో నున్న చిన్న పద్మములో గల సూక్ష్మాకాశములో ఏమున్నదో దానిని పరిశోధన చేయవలెను.” అని గురువు బోధించగా “ఏమి తెలిసికొనవలెను?” అని శిష్యులు అడుగగా సద్గురువు ఏమి చెప్పెను? “బయట వున్న ఆకాశము ఎంత అనంతమైవున్నదో అంతే హృదయమునందలి ఆకాశమును కలదు. ద్యులోకము, పృథివి అనునవి లోపలనే వున్నవి. అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, నక్షత్రములు సర్వము హృదయాకాశములో స్థితమై వున్నవి. నిరుపాధికమగు బ్రహ్మోపాసనార్థమైన హృదయాకాశమందు సర్వజగత్తు కల్పనయని తాత్పర్యము. ఈ బ్రహ్మపురము నందు ఇది అంతయును, సమస్త కామములును అంతర్భూతముయై వున్నచో, ఈ శరీరమునకు వార్ధక్యము కలిగిన, మరణమేర్పడిన ఇందు భూతములు ఎమగుననిన, ఘటము పగిలిన అందలి ఆకాశము నశించనట్లు, హృదయాకాశమందలి ఇవి నశించవు అని చెప్పబడినది” (ఛాం.ఉ. VIII-1-1) మరియు “ఈ ఆత్మ (పరబ్రహ్మము) పాపరహితమైనది మరియు ముసలితనము, మరణము, దుఃఖము, ఆకలి, దప్పిక ఏమియు లేనిది. ఆత్మ సత్య కామము, సత్య సంకల్పము కలది. సంకల్ప సిద్ధి కలిగియుండును”. (ఛాం.ఉ. VIII-1-8).

బృహదారణ్యకములో “ఈ ఆత్మగొప్పది, పుట్టుకలేనిది, పూజ్యమైనది. అది ప్రాణములందు విజ్ఞాన జ్యోతి, స్వయంజ్యోతి స్వరూపమైనది. హృదయములోనున్న ఆకాశములో ఈ పురుషుడు శయనిస్తాడు.” (బృ.అ.ఉ. IV-4-22)

ఛాందోగ్యోములో చెప్పబడినది సగుణోపాసన విద్య మరియు బృహదారణ్యకములో చెప్పబడినది నిర్గుణోపాసన విద్య.

"బ్రహ్మ రంధ్రము ద్వారా బ్రహ్మవేత్త స్థూల శరీరము (బ్రహ్మపురము) నుండి వెడలి, సూర్యరశ్మినందు నిలచి దానినాశ్రయించి "ఓం" అనుచు సూర్యలోకము ద్వారమున బ్రహ్మలోకము పోవుననియు ఇందు ఏమియు విలంబనము లేదనియు తెలియుచున్నది" (ఛాం.ఉ. VIII-6-5).

హృదయములోనున్న పరమాత్మను నిర్గుణోపాన కాని సగుణోపాసన కాని చేయవలయును. అభ్యాసముగా ఓంకారోపాసన చేయటము చాలా మంచిది.

(ఛాం.ఉ. VIII-1-1, VIII-1-8) (బృ.అ.ఉ. IV-4-22, బ్ర.సూ. (398) III-3-39, (514) IV-2-18).

---

**24.** **బాలాకి విద్య :** కౌశీతకీ బ్రాహ్మణోపనిషత్తులో గార్గ్య బాలాకిముని కాశీ రాజైన అజాతశత్రు మహారాజు వద్దకి వెళ్లి బ్రహ్మవిద్య గురించి బోధించుతానని చెప్పి మొదలు ఆదిత్యునిలోనున్న పురుషుడు బ్రహ్మమని చెప్పి వరసగా ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు, ఉరుములు, ఆకాశము, వాయువు, అగ్ని మరియు జలములలో, అద్దములో, నీడలో, అహంతత్త్వము, ఛాయలో, శరీరములో, స్వప్నములో, కుడికంటిలో, ఎడమకంటిలో వుండు పురుషులు బ్రహ్మమని చెప్పినాడు.

అప్పుడు అజాతశత్రువు ఇలా బోధించినాడు.

"ఓ బాలాకీ ! నీవు ఆదిత్య, చంద్ర, విద్యుత్తు, ఆకాశాదులలో వుండే 16 పురుషులను బ్రహ్మము అని చెప్పావు. వీరు బ్రహ్మము కాదు. వీరందరికీ ఎవరు కర్తయో, ఇది అంతా ఎవరి కర్మమో అతడే తెలిసికొనదగిన బ్రహ్మము. నీచే చెప్పబడినవి జగత్కారణము కాదు."

"పైన చెప్పబడిన పదునారు తత్త్వములకు ఎవరు మూలమో, ఆ సమస్త లక్షణములకు ఆశ్రయమో అదియె బ్రహ్మము". (కౌ.బ్రా.ఉ. IV-18).

ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు, ఉరుములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, అద్దములోనిది, నీడవెనుకది, అహంతత్త్వములోనిది, ఛాయలోనిది, శరీరములో, కుడికంటిలో, ఎడమకంటిలోని పురుషులకు పురుషుడైనది, వెలుగులకు వెలుగు అయినది వీటన్నిటికి మూలకారణమైన దానిని బ్రహ్మముగా ఉపాసించవలెను.

(కౌ.భా.ఉ. IV-18, IV-19), (బ్ర.సూ. I-4-16,17,18)
(బ్ర.సూ. I-1-11, I-1-28,29,30,31) కూడా చూడండి.

---

**25.** **ఉషస్త-కహోల విద్య :** (సర్వాంతర విద్య)

బృహదారణ్యకములో ఉషస్త బ్రాహ్మణములో, కహోల బ్రహ్మణములో ఉషస్తుడు, కహోలుడు తమకు సర్వాంతరాత్మ గురించి వివరించి చెప్పమని అడిగినపుడు యాజ్ఞవల్క్యుడు ఉషస్త మునితో ఇలా అన్నాడు.

"ఎవరు ప్రాణములతో ప్రాణక్రియిచేయుచున్నాడో అతడే ఆత్మ, సర్వాంతరుడు" అని "నీ దృష్టికి కనబడదు, శ్రోత్రములకు వినబడదు అట్టి "నీఆత్మ సర్వాంతరాత్మ" (బృ.అ.ఉ. III-4-1).

"తరువాత అదే ప్రశ్నకు కహోలునితో ఇలా అన్నాడు" నీ అంతరాత్మయే సర్వాంతరత్మా. ఎవరు ఆకలి-దప్పి, శోకము-మోహము, జన్మ-మృత్యువులకు అతీతుడో అతడు సర్వాంతరాత్మ" అని

చెప్పినాడు (బృ.అ.ఉ. III-5-1).

శ్వేతాశ్వతరోపనిషత్తులో,

"ఏకోదేవః సర్వభూతేషుగూఢః
సర్వవ్యాపీ సర్వాంతరాత్మా" శ్వే.ఉ. VI-1-1

"అన్ని భూతములందు సర్వాంతరుడైన, సర్వవ్యాపియైన, అందరియందు దాగివున్న దివ్యాత్మ ఒక్కడే." కావున పరబ్రహ్మమును ప్రాణములచే ప్రాణక్రియ చేయించు, దృష్టికి కనబడని, శ్రోత్రములకు వినబడని అంతర్యామి మరియు అన్ని భూతములందును సర్వాంతరుడైన, సర్వవ్యాపియైన, అందరియందు దాగి వున్న దివ్యాత్మగా ఉషస్తి, కహోలునికి యాజ్ఞవల్క్యుడు తెలియచేసిన సర్వాంతరాత్మగా ఉపాసన చేయాలి.

(బ్ర.సూ. (394) III-3-35, (395) III-3-36)
(బృ.అ.ఉ. III-4-1, బృ.అ.ఉ. III-5-1, శ్వే.ఉ. VI-11)

---

**26. ఉద్దాలక ఆరుణి విద్య :** (అంతర్యామి విద్య)

బృహదారణ్యకములో జనక సభలో ఉద్దాలక ఆరుణి మహాముని యాజ్ఞవల్క్య మహర్షిని అంతర్యామి స్వరూపమును గూర్చి అడిగినాడు.

యాజ్ఞవల్క్యుడు ఇలా చెప్పినాడు,

"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో
యం పృథివీ నవేదయస్య పృథివీ శరీరం
యః పృథివీ మంతరో యమయతేయత్యేష
త ఆత్మా అంతర్యామ్యమృతః" బృ.ఉ. III-7-3 నుండి III-7-23 వరకు

"భూమియందుండి, భూమికి వేరుగా నుండి దేనిని భూమి తెలియలేదో, దేనికి భూమి శరీరమో ఏది భూమిని నియమించునో, అది నీ యొక్క అంతర్యామి రూపమైన ఆత్మ, అమృతము. అదే విధముగా జలము, అగ్ని, వాయువు, ద్యులోకము, ఆదిత్యుడు, దిక్కులు, చంద్ర తారకలు, ఆకాశము, ప్రాణము, వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు, త్వక్కు, విజ్ఞానము, రేతస్సులో వుండి దేనిని అవి తెలియలేవో, అవి దేనికి శరీరములో, వాటి యందుండి వాటినే నియమించునో, అదియే అంతర్యామి, అమృతము, ఆత్మ, బ్రహ్మము" బృ.అ.ఉ. 3-7-3 నుండి 3-।322 వరకు.

ఈ అంతర్యామి "దృష్టికి కనిపించదు, దృష్టయై వుండును. శ్రోతకు వినిపించదు, శ్రోతయై వుండును. బుద్ధికి విజ్ఞాతము కాదు, విజ్ఞాతమై వుండును. ఆ అంతర్యామి ఆత్మయే. తాను దృష్ట, శ్రోత, మంత మరియు విజ్ఞాత. అదియే నీ ఆత్మ. అంతర్యామి, అమృతము. ఈ అంతర్యామి పరమాత్మ కన్నా వైరైనది నశించిపోవుచుండు" (బృ.అ.ఉ. 3-7-23) కనిపించకుండా చూసేది, వినబడకుండా వినేది, అనిపించకుండా అనుకునేది, తెలియబడకుండా తెలిసేది, అంతర్యామి ఐన ఆత్మయే. అదియే పరమాత్మ-పరబ్రహ్మ.

ఈ అంతర్యామి ఆత్మయే గాని, ఆత్మకు అభిన్నంగా చూసేది, వినేది, అనుకునేది, తెలిసికోనేది వేరేదేమి లేదు.

ఈ విధముగా అంతర్యామియైన బ్రహ్మము గూర్చి ఉపాసన చేయవలయును.

(బృ.అ.ఉ. 3-7-23 నుండి 3-7-23 వరకు)
(బ్ర.సూ. (49) I-2-18, (50) I-2-19, (51) I-2-20)

---

**27. మైత్రేయి విద్య :** బృహదారణ్యకములో యాజ్ఞావల్క్యుడు, మైత్రేయిల జ్ఞానసంవాదము యొక్క ఉదంతము రెండు చోట్ల కలదు. (II-4 మరియు IV-5) కొంచెము బేధము వున్నా రెండింటి విషయము ఒకటియే.

యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయితో ఇలా అన్నాడు.

"మైత్రేయీ ! నేను సన్న్యాసాశ్రమము స్వీకరించతలచాను. నీయొక్క అనుమతిని కోరుచున్నాను. నీకును, కాత్యాయనికిని నా సంపదను విభజించి ఇచ్చెదను".

"ధనముచేత నేను ముక్తురాలనగుదునా?" అని మైత్రేయి అడిగెను.

"ధనము చేత సుఖజీవనము కలుగును కాని మోక్షము లభించదు" అని యాజ్ఞవుల్క్యుడు చెప్పెను. "ఏ ధనము చేత మోక్షము లభించదో ఆ ధనముచేత ఏమి ప్రయోజనము? నీవు దేనిని ముక్తి సాధనముగా తెలిసినావో ఆ సాధనమును నాకు ప్రసాదించుము" అని మైత్రేయి అడిగెను.

**[నారాయణ వాక్యము :**
ధనము కన్నా సాధనము మేలైనది. ధనము సుఖమునిచ్చును, సాధనము ముక్తినిచ్చును].

యాజ్ఞవల్క్యుడు సంతసించి జ్ఞానబోధ చేస్తూ ఇలా చెప్పినాడు. "అరే! మైత్రేయి! భార్య తన భర్త యొక్క ప్రయోజనము కొరకు ప్రియమై వుండుట లేదు. తన ఆత్మ ప్రనయోజనము కొరకే ప్రియమైయున్నది." అదే విధముగా భర్త తన భార్యయందును, తండ్రి కుమారునందును, ఒకడు ధనమునందును, ఒకడు బ్రాహ్మణునియందును, ఒకడు క్షత్రియుని యందును, ఒకడు లోకుల యందును, ఒకడు దేవతలయందును, ఒకడు ప్రాణులయందును, వేరొకడు సమస్తమునందును ప్రీతి కలిగియున్నాడు. సమస్తమును ఆత్మ కొరకే కాని అన్యము కాదు.

ఆత్మయే దర్శించదగినది, ఆత్మయే వినదగినది. ఆత్మయే భావించదగినది, ఆత్మయే ధ్యానించదగినది. ఆత్మ యొక్క దర్శనము చేతను, శ్రవణము చేతను, స్మరణము చేతను, ధ్యానము చేతను, సమస్తము అనుభవముకు వచ్చును".

యాజ్ఞవల్క్యుడు ఎన్నో విషయములు ఆత్మ గురించి, ఆత్మయే ఐన బ్రహ్మము గురించి చెప్పి ఇంకా ఇలా అన్నాడు.

"ఓ మైత్రేయి ! ఇదియే బ్రహ్మ జ్ఞానము. ఇపుడు విజ్ఞాన స్వరూపమని చెప్పబడిన కేవలాత్మకు అజ్ఞానము లేదు. నామరూప క్రియాత్మకమైన దేహేంద్రియాది సంబంధము వలననైన జీవ భావములో నేను, వీడు అనే ద్వైత భావము కలుగుచున్నది. బ్రహ్మజ్ఞానము చేత దేహేంద్రియాది

సంబంధము వలననైన జీవ భావము నశించినపుడు ఈ ద్వైత జ్ఞానము కూడ నశించుచున్నది".

"ఆ విద్య వలన జీవ భావమునందు ఆత్మ సర్వమును ద్వైతము వలెనె కనిపించుచున్నది. అపుడు చూచుట, వినుట, పలుకుట, తలచుట, తెలిసికొనుట మొదలైన ద్వైత జ్ఞానము కలుగుచున్నది".

"ఎపుడు బ్రహ్మవేత్తకు బ్రహ్మ జ్ఞానము చేత సర్వము ఆత్మ మాత్రమగుచున్నదో అపుడు దేని చేత దేనిని చూచును? దేని గూర్చి పలుకును? దేని చేత దేనిని వినును, తెలిసికొనును?"

"దేనిచేత సర్వమును తెలిసికొనబడుచున్నదో దానిని దేని చేత తెలిసికొనవచ్చును? సర్వమును తెలిసికొనునది విజ్ఞానమయమైన ఆత్మయే!" ఈ విధముగా తానే సమస్తమని సమస్తము తానె అని ఆత్మభావములో, బ్రహ్మ భావముతో, అద్వైత భావముతో ఉపాసన చేయవలయును".

(బృ.అ.ఉ. IV-4 మరియు VI-5)
((బ్ర.సూ. (49) I-4-19, II-3-39, II-3-40)

---

**28. పరమ పురుష విద్య (సుపర్ణ విద్య) :** పరాత్పరుడైన, పరమ పురుషుని గురించి, పరబ్రహ్మము గురించి ఇలా చెప్పబడినది.

"ఇంద్రియములకన్న అర్థములు పరము
అర్థములకన్న మరియు మనము పరము
పొందుగ మనము కన్నను బుద్ధిపరము
బుద్ధి కన్నను ఆత్మ మహత్పరము"

"అంతమహత్ కన్న అవ్యక్తమ్ము పరము
అది అవ్యక్తము కన్న పురుషుండు పరము
లేదేదియు పురుషుని కన్న పరము
తుది యతడె పరమగతియునతడు" (కఠ.ఉ. 1-3-10, 1-3-11)

పరబ్రహ్మము, పరమ పురుషుడు ఇంద్రియములకన్న, అర్థములకన్న, మనస్సుకన్న, బుద్ధికన్న, మహత్‌కన్న, అవ్యక్తము కన్న అన్నిటికన్న, మిన్న మరియు పరము.

"ఏతాస్మాజ్జాయతే ప్రాణో, మనః సర్వేంద్రియాణి చ
ఖం వాయు ర్జ్యోతి రాపః, పృథివీ విశ్వస్య ధారిణీ" (ముం.ఉ. II-1-3)

ఈ పురుషుని నుండి ప్రాణములు, మనస్సు, అన్ని ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అన్నియు జనించుచున్నవి". (ముం.ఉ. II-1-3)

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం,
తథారసం, నిత్యమగంధ వచ్చయత్ ।
అనాద్యనంతం మహతః పరం ధ్రువమ్,
నిచాయ్య తన్మృత్యు ముఖాత్ప్రముచ్యతే ॥" (కఠ.ఉ. I-3-15)

"ఆ బ్రహ్మము (ఆత్మ) శబ్దస్పర్శరూప రసగంధములు లేనిదియును, అవ్యయమైనదియును,




(బ్ర.సూ. I-4-1, II-3-15, III-3-14, III-3-15, III-3-34)

ఆద్యంతములు లేనిదియును, నిత్యమైనదియును, మహత్తునకు పరమైనదియును అయివున్నది. అట్టి ఆత్మను తెలిసికొనినవాడు మృత్యుముఖము నుండి పూర్తిగా విడువబడును".

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి" (ముం.ఉ. III-1-1)

అన్యోన్యమైత్రిచే కలుపబడి ఒకే చెట్టు మీద రెండు పక్షులు నివసించుచున్నవి. అందులోనొకటి పిప్పలఫలమువనుభవించుచుండగా రెండవది తినకుండా దానిని చూచుచున్నది" ఈ రెండు పక్షులు ఒకే శరీరము (చెట్టు)లో వున్న జీవాత్మ పరమాత్మలు.

ఇదే విద్య శ్వేతాశ్వతర ఉపనిషత్తులో వేరు తీరుగా చెప్పబడినది.

"సమానేవృక్షేపురుషోనిమగ్నో
అనీశయాశోచతిముహ్యమానః
జుష్టం యదా పశ్యత్యన్యమీశం
అస్య మహిమానమితి వీతశోకః" (శ్వే.ఉ. IV-7)

"ఒకే చెట్టుమీద కూర్చున్నను జీవుడైన ఒక పక్షి అజ్ఞాన మోహములో మునిగినదై దుఃఖించుచున్నది. పూజ్యుడైన రెండవ పక్షియగు ఈశ్వరుని, అతని మహిమను ఎప్పుడైతే చూచుచున్నదో మొదటి పక్షియైన జీవుడు కూడ దుఃఖము నుండి విముక్తుడు అగుచున్నాడు." పరమ పురుషుడే జీవుడుగా వుంటాడు.

పరమపురుషుడు, జీవపురుషుడు వెలుగు నీడలలాగా రెండుగా కనిపించే ఒక్కరే.

"ఋతం పిబంతౌ సుకృతస్యలోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే
ఛాయా తపౌ బ్రహ్మవిదో వదంతి
పంచాగ్నియో త్రిణాచికేతా" (కఠ.ఉ. I-3-1)

"ఆ పరమాత్మకు స్థానమైన హృదయకుహ్వరములో కూర్చుని తమ పుణ్యపలాన్ని అనుభవించేవారు ఇద్దరున్నారు. బ్రహ్మవిదులు వారినిద్దరినీ వెలుగు నీడలని చెప్పుచున్నారు. ఈ విధముగనే మూడుసార్లు నాచికేతాగ్ని చయనము చేసినవారు, పంచాగ్ని ఉపాసన చేసే వారూ చెప్పుచున్నారు". పరమ పురుషుడు, జీవపురుషుడు వెలుగునీడలైతే నీడ అనేది అజ్ఞానమువంటిది. మొత్తము వెలుగు రాగానే నీడ లేకండా పోతుంది. నీడ లేనపుడు వెలుగే వుంటుంది. జ్ఞానము రాగానే వుండేది ఒక పరమపురుషుడే. పరమ పురుషుడే పరమ సత్యము, పరమాత్మను వెలుగుగా, ఒకే సత్యముగా, స్వాత్మగా, పరబ్రహ్మముగా అద్వైత నిజముగా ఉపాసన చేయాలి.

(కఠ.ఉ. I-3-10, I-3-11, III-3-1, ముం.ఉ. II-1-3)

(బ్ర.సూ. I-4-1, II-3-15, III-3-14, III-3-15, III-3-34)

**29. అక్షరాక్షర విద్య :** (అక్షరపరా విద్య)

ఇంతకుముందు మనము గార్గి అక్షర విద్య గురించి తెలుసుకున్నాము. ఇపుడు ముండకోపనిషత్తులో చెప్పబడిన అక్షరాపరావిద్య గురించి తెలుసుకొందాము.

గృహస్థుడగు శౌనకుడు అంగిరసుని సమీపించి పూజించి అడిగినాడు." భగవన్ దేనిని తెలిసికొనిన అన్నిటినీ తెలుసుకొన్నట్లు అవుతుంది? అది ఏది?" (ముం.ఉ. I-1-3)

అంగిరసుడు ఇట్లు చెప్పెను,

"ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మయద్బ్రహ్మవిదో వదంతి పరాచైవాపరాచ" (ముం.ఉ. I-1-4)

"పరావిద్య అపరవిద్య అని రెండు విద్యలు వున్నాయని వేదవిదులు అనినారు".

"ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్ష, కల్పము, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిష్యము ఇవి అన్ని కలసి అపరవిద్య. (ముం.ఉ. I-1-5)

"ఏ విద్యచే ఆ అక్షరుడగు పరబ్రహ్మ యొక్క జ్ఞానము లభించునో అది పరావిద్య" (ముం.ఉ. I-1-5)

"ఈ పరబ్రహ్మ తత్త్వము అదర్శనీయము, అగ్రాహ్యము, అవర్ణము, అచక్షువు, అశ్రోత్రము, అపాణిపాదము, నిత్యము, సర్వగతము, సుసూక్ష్మము, అవ్యయము. సమస్త భూతములకు ఉత్పత్తి స్థానమైనట్టు సర్వభూతముయైన దానిని ధీరులు బాగుగ చూచుచుందురు" (ముం.ఉ. I-1-6).

"ఏ విధముగా ఊర్ణనాభి (సాలె పురుగు) దారమును వెలితీయుచున్నదో (సృజించుచున్నదో) మరియు తానే దానిని లోనికి తీసుకొనుచుండునో (గ్రహించునో) ఆ విధముగా భూములందు ఔషధులు పుట్టుచున్నవి. అదే విధముగా మనుజులకు కేశములు, రోమములు కలుగుచున్నవి. ఆ రీతిగా ఆ అక్షరము నుండి ఈ విశ్వము ఉద్భవించుచున్నది" (ముం.ఉ. I-1-7).

"అక్షర బ్రహ్మము తపస్సుచే వృద్ధియగుచున్నది. ఆ అక్షరము (బ్రహ్మము) నుండి అవ్యాకృతము (అన్నము) జనించుచున్నది. అవ్యాకృతము నుండి హిరణ్యగర్భుడు (ప్రాణము), మనస్సు, ఆకాశాది పంచభూతములు సప్తలోకములు, కర్మలు, కర్మఫలములు కలుగుచున్నవి" (ముం.ఉ. I-1-8).

"ఎవరు సర్వజ్ఞుడు, సర్వవిదుడు మరియు ఎవరి తపము జ్ఞానమయమో అతని నుండియే ఈ సమస్త నామరూపములు కలిగిన జగము, అన్నమును కలుగుచున్నవి" (ముం.ఉ. I-1-9).

"ఈ పరావిద్యకు సంబంధించినదే ఈ పరమ సత్యము. ప్రకాశించి ప్రజ్వలించుచున్న అగ్ని నుండి, ఆ అగ్నికి సమాన రూపములైన మిణుగురులు వేలకొలది ఎట్లు పుట్టుచున్నవో అదే రీతిగా అక్షరము నుండి అనేక విధములైన జీవులు జనించుచున్నారు, ఆ అక్షర పరబ్రహ్మమునందే లీనమగుచున్నారు" (ముం.ఉ. II-1-1).

అట్టి నిర్గుణము, నిరాకారము, నిత్యము, సర్వగతముయైన పరాత్పరుని ఉపాసన చేయవలయును.

(ముం.ఉ. I-1-3,4,5,6,7,8,9, II-1-1)

బ్ర.సూ. (52) I-2-21, (392) III-3-33.

**30. సద్విద్య :** (సత్ విద్య)

సృష్టి సత్తు నుండి వచ్చినదా? అసత్తు నుండి వచ్చినదా అనే ప్రశ్న గురించి ఉపనిషత్తులలో గాఢమైన పరిశీలన వున్నది. దీనికి మూలము ఋగ్వేదములోనే వున్నది. ఋగ్వేదములో (ఋ.వే X-129) సృష్టి క్రమము గురించి "నాసదీయ సూక్తము"లో వున్నది.

దానిలో మొట్టమొదలే

"నా సదాసీన్నోసదాసీత్తదానీం
నాసీద్రజో నో వ్యోమా పరో యత్
కిమావరీవః కుహ కస్య శర్మన్
నంభః కిమాసీద్గహనం గభీరం" (ఋ.వే X-11)

"ఆ యపుడు అసత్తు లేదు సత్తు గూడ లేదు
లోకములు లేవు మరి ఆకాశము పైన ఏమి లేదు
ఏమి ఆవరణ ? ఎచట ఎవరి ఆశ్రయమ్ము వుండె?
గంభీరమైన గహనమైన నీరు యుండెనా ఏమి ?"

అట్లు అన్న దానిలో మొదట్లో సత్తులేకుండెను అసత్తు కూడ లేకుండెను అని చెప్పబడినది.

తైత్తరీయ ఉపనిషత్తులో,

"అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత
తథాత్మానం స్వయమకురుత, తస్మా త్తత్సుకృత ముచ్యతే" (తై.ఉ.2-7)

"అసత్తుయే దీనికన్న మొదలు యుండెను, దాని నుండియే సత్తు జనియించెను.
అట్లు అది తననుండి తనను చేసికొనెను. అందువలన అదిసుకృతమని అనుచుందురు"

ఉత్పత్తికి పూర్వము అసత్తు అని చెప్పటం వలన కార్యము కారణ రూపములో లేదనుట సరికాదు. ఎందుకనగా తరువాతి వాక్యములో అది తననుండి తనను చేసికొనెను అని అనబడినది కదా. అంటే అది (బ్రహ్మము) లేక, వుండినది. అంటే మొదలు అవ్యాకృతముగా (జీవము, వరిమొలక, వడ్లగింజలో వలె) వుండినది. తరువాత వ్యాకృతముగా తనను చేసుకొనెను. చెప్పలేని దానిగావుండి చెప్పే దానిగా చేసికొనెను. కనిపించకుండా వుండి కనిపించే దానిగా చేసుకొనెను. మొదలే లేకుంటే తనను తాను ఎట్లు చేసుకోగలదు? బ్ర.సూ. (151) II-1-17). ఈ విషయము ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహిర్షి శ్వేతకేతువుకు తేటగా తెలిపినాడు.

"సదేవ సోమ్యేదమగ్ర ఆసీద్" (ఛాం.ఉ. VI-2-1).

"నాయనా! సత్‌యే సృష్టికి మొదలు ఒక్కటిగా నుండెను", "సత్" అంటే బ్రహ్మములో ఇదం (సృష్టి) వున్నదని సూచన. బ్రహ్మము కారణము కార్యములో (సృష్టి) బ్రహ్మములో మొదలే వున్నది. కావున బ్రహ్మమునకు జగత్తుకు భేదం లేదు. మొదట్లో కారణ బ్రహ్మము అవ్యాకృతముగా వుండెను. కార్యమైన జగత్తు ఆ అవ్యాకృత బ్రహ్మములోన వుండెను. ఇది సత్యము.

బ్రహ్మమును సమస్తమునకు కారణముగా అవ్యాకృత సత్యముగా ఉపాసించవలెను.

వుండకుండా వుండే, వుండి లేకుండి, లేక వుండి లేకుండా లేకపోని పరమ సత్యమే పరబ్రహ్మము.

(తై.ఉ.2-7, ఛాం.ఉ. VI-2-1)
(బ్ర.సూ. (151) II-1-14,15,16,17,18,19,20, I-4-15).

---

**31. భూమ విద్య :** (సనత్కుమార విద్య)

భూమము అంటే అన్నింటికన్న ఉత్కృష్టము, శ్రేష్ఠము మరియు గొప్పది. ఛాందోగ్యోపనిషత్తులో దేవర్షి సనత్కుమారుడు నారద మహర్షికి భూమవిద్య బోధించినాడు.

ఛాందోగ్యములో నారదుడు "ఆత్మవేత్త ఐననతడు శోకాన్ని తరిస్తాడు. తరింపచేసే మార్గము బోధించండి" అని సనత్కుమారుని అడిగినాడు. సనత్కుమారుడు "నామమే పరమాత్మ" అని పలికినాడు. నారదుడు బ్రహ్మమును నామముగా ఉపాసించి "నామము కన్న గొప్పది ఏమైనా వున్నదా?" అని అడిగితే సనత్కుమారుడు "వాక్కు నామము కన్నా గొప్పది" అని అనినాడు. అపుడు నారదుడు బ్రహ్మమును వాక్కుగా ఉపాసించినాడు.

ఆ విధముగా నామము, వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, జలము, తేజస్సు, ఆకాశము, స్మరణము, ఆశ, ప్రాణం ఒకటికంటేఒకటి ఎక్కువ అని తెలిసి అలానే నారదుడు ఉపాసన చేసినాడు. ప్రాణము అంటే జీవాత్మ అనియే తెలుసుకోవాలి. సనత్కుమారుడు "ప్రాణము కన్న భూమయే గొప్పది. ఏది తెలిసిన ఉపాసకుడు మరియొక దానిని చూడడో, వినడో, తెలిసికొనడో అది భూమము. ఏది తెలిసినపుడు ఇంకొక దానిని చూస్తాడో, వింటాడో, తెలిసికొంటాడో అది అల్పము. నిరతిశయమైన ఆనందాన్ని కోరేవాడు, భూమమునే తెలుసుకోవాలి. సుషుప్తిలో జాగరూకమైన ప్రాణమే సంప్రసాదము (ఆనందము)" అని చెప్పినాడు ఆ విధము భూమము అన్నిటికన్నా మించినది. భూమము పరబ్రహ్మము.
భూమమునే ఉపాసన చేయాలి.

(ఛాం.ఉ. 7-1-3) (బ్ర.సూ. (71) I-3-8)
(బ్ర.సూ. (71) I-3-8 లో వున్న చిత్రపటమును చూడగలరు).

---

**32. ప్రజ్ఞాన విద్య :** "ప్రజ్ఞానం బ్రహ్మ." ఐతరేయోపనిషత్తులో మాతృగర్భములో నివసించుచు బ్రహ్మజ్ఞానమునందిన వామదేవ మహర్షి ఉదంతము ఇలా చెప్పబడినది.

"ఆత్మయని మనమెవ్వని ఉపాసించుచున్నామో, ఆ యాత్మ మెట్టివాడు? దేని వలన రూపమును చూచుచున్నాడో, దేనివలన శబ్దమును వినుచున్నాడో, దేని వలన వాసనలను గ్రహించుచున్నాడో, దేని వలన నోటితో మాట్లాడుచున్నాడో, దేని వలన రుచియని యెరుంగుచున్నాడో, యే కారణముతో వాక్కును వివరించుచున్నాడో, ఏ కారణముచే మధుర, మధురేతర వస్తువులను గుర్తించుచున్నాడో, అట్టి శ్రుతి ప్రతిపాదితమైన ఆత్మలలో నీ ఆత్మ ఎట్టివాడు?

ఈ హృదయము, మనస్సు, చైతన్యము, ఈశ్వరత్వము, సమస్త వివేకము, సద్జ్ఞానము,

శాస్త్ర జ్ఞానము, సర్వము తెలిసెడు జ్ఞానము, ధైర్యము, మననము, మనోధార్ద్యము, మనోవేదన జ్ఞానము, స్మరణము, రూపములను వేరువేరుగ చూచుట, నిశ్చయము, ప్రాణ వృత్తి, ఆశ, స్వాధీనత అనునవి అన్నియు ప్రజ్ఞానము యొక్క నామములే.

అతడే బ్రహ్మ, అతడే ఇంద్రుడు, అతడే ప్రజాపతి, ఈ దేవతలందరు అతడే. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, పంచభూతములు, జంతువులు, విత్తనములు, మిగతా స్థావర జంగమములు, అండజములు, జరాయుజములు, స్వేదజములు, ఉద్భిజములు, జంతువులు, మనుష్యులు, పక్షులు, అన్ని ప్రాణులూ మిగతా స్థావరము ఆ ప్రజ్ఞానేత్రమే. ప్రజ్ఞానమునందే నిలుకడ కలవి. లోకములు ప్రజ్ఞానేత్రముగానే యున్నవి. ప్రజ్ఞానమే ఆధారముగా గలవి.
'ప్రజ్ఞానం బ్రహ్మ' "ప్రజ్ఞానమే బ్రహ్మము." (ఐ.ఉ. III-1-2-3)

ప్రజ్ఞానం బ్రహ్మ, ప్రజ్ఞానము బ్రహ్మము. ప్రజ్ఞానమే చైతన్యము. ప్రజ్ఞానమే ఆత్మ, ప్రజ్ఞానమే బ్రహ్మ, ప్రజ్ఞానమే నీవు, ప్రజ్ఞానమే ఈ "నేను" అనబడేది. మనయందే వున్న ప్రజ్ఞానము, చైతన్య బ్రహ్మముగా ఉపాసించవలెను.
(ఐ.ఉ. III-1/2/3) (బ్ర.సూ. III-3-17).

---

**33. మాండూక్య విద్య :** "అయమాత్మాబ్రహ్మ".
మాండూక్యోపనిషత్తులో ఇలా చెప్పబడినది.

"ఓమిత్యేదక్షరం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, సోఽయయాత్మా చతుష్పాద్" (మాం.ఉ.-1)
ఈ జగము, ఈ సర్వము అంతయు ఓంకారము మరియు అక్షరమైన బ్రహ్మము. ఈ ఆత్మయే బ్రహ్మము. అట్టి ఆత్మకు నాలుగు పాళ్లు కలవు. జాగృదవస్థలో, బహిఃప్రజ్ఞ కల వైశ్వానరుడు మొదటి పాదము. స్వప్నావస్థలో, అంతఃప్రజ్ఞ కల తైజసుడు రెండవ పాదము. సుషుప్తావస్థలో, కేవలము ప్రజ్ఞాన ఘనుడైన చేతోముఖుడు ఐన ప్రాజ్ఞుడు మూడవ పాదము. అంతఃప్రజ్ఞ కాని, బహిః ప్రజ్ఞకాని, ప్రజ్ఞాన ఘనుడు కాని, వాటికతీతుడైన శాంతుడు, అద్వైతుడు తురీయుడు. ఆ తురీయుడే ఆత్మ. ఈ ఆత్మయే విజ్ఞేయము, తెలిసికొనదగినది.

ఓంకారముకు అ,ఉ,మ, బిందువు అను నాలుగు పాదములు కలవు. అకారము జాగృదవస్థకు చెందిన వైశ్వానరుడు, ఉకారము స్వప్నావస్థకు చెందిన తైజసుడు. మకారము సుషుప్తావస్థుడైన ప్రాజ్ఞుడు. మాత్రరహితమైనది, బిందురూపమైన తురీయము చైతన్యము. అట్లు ఓంకారము ఆత్మ, బ్రహ్మము. సమస్త సృష్టి (జగము) బ్రహ్మరూపము, ఓంకార రూపము.
'అ' అంటే అన్నింటి ఆది, ప్రారంభము, సృష్టి. 'ఉ' అంటే ఉన్నది, మధ్యన వుండునది. 'మ' అంటే ముగింపు, లయము. మాత్రలేనిది బిందువు, అంటే మౌనము, నిరాకారము, శబ్దాతీతము, తురీయము. ఈ నాలిగింటి కూడికయే ఓంకారము, బ్రహ్మము, ఆత్మ.
ఓంకారమును ఉచ్ఛ స్వరముతో, మంద స్వరముతో, మౌనముగా ధ్యానము ఉపాసన చేయవచ్చును. ఆత్మను బ్రహ్మముగా ఉపాసన చేయవలయును.
(మాం.ఉ. 1-12. ఓంకారము ఉద్గీతముగా ఉపాసన గూర్చి ఉద్గీత విద్యలో కలదు.)
(మాం.ఉ. 1 నుండి 12 వరకు, బ్ర.సూ. (368) III-3-9 పేజీ 250).
(ఉద్గీథ విద్య పేజీ 520, మాండూక్య మహిమ పేజీ 512 చూడగలరు.)

---

**34. వామదేవ విద్య :** "అహం బ్రహ్మాస్మి"

బృహదారణ్యక ఉపనిషత్తులో (బృ.అ. III-4-10) ఇలా చెప్పబడినది.

ఈ సమస్త ప్రపంచము పరబ్రహ్మము. జ్ఞానము కంటె, సృష్టి కంటే పూర్వము అది పరబ్రహ్మముగానే వుండెను. పరబ్రహ్మము "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మమును) అని తన్నుతాను తెలిసికొనెను. ఈ రీతిగా తెలిసికొనుట వలన ఆ పరబ్రహ్మము సర్వ స్వరూపముగానయ్యెను. దేవతలలో ఎవరెవరు ఆ పరబ్రహ్మమును తెలిసికొనెనో ఆతడు పరబ్రహ్మగానయ్యెను. (దేవతలలో ఇంద్రుడు అట్లు తెలిసికొని తానె బ్రహ్మమునయ్యెను.)

మహర్షులతోనూ, మనుష్యులలోనూ అట్లె ఆయెను. ఆ ప్రకారమే వామదేవుడను ఋషి, తల్లి గర్భములోనే, బ్రహ్మస్వరూపమును చూచుచు నేను మనువునైతిని, నేను సూర్యుడనైతిని, నేను బ్రహ్మమును అని భావించి అట్లే ఆయెను.

ఎవరు ఈ పరబ్రహ్మమును అట్లు ఉపాసించి తెలుసుకొనుచున్నాడో అతడు సమస్తము అగుచున్నాడు.

(బృ.ఉ. III-4-10, బ్ర.సూ.(30) (I-1-30)
(బ్ర.సూ.(345) III-2-27, బ్ర.సూ. (537) IV-4-4).

---

**35. శ్వేతకేతు విద్య :** "తత్త్వమసి"

ఛాందోగ్యోపనిషత్తులో ఆరుణిమునియైన ఉద్దాలకుడు విద్యావానుడైన వానినని గర్వించిన తన కుమారుడు శ్వేతకేతువుకు అధ్యాత్మవిద్య బోధిస్తూ ఇలా అన్నాడు.

"సౌమ్యా! ఈ మఱ్ఱి చెట్టు నుండి ఒక పండును తెమ్ము". శ్వేతకేతువు "తండ్రీ ఇదుగో తెచ్చితిని" "దానిని చీల్చుము". "ఇదుగో చీల్చితిని". "దానిలో ఏమి కనిపించుచున్నది?" "చాలా చిన్నవైన విత్తులు వున్నవి". "ఒక విత్తును చీల్చుము" "చీల్చితిని తండ్రి". "దానిలో ఏమి వున్నది" "భగవన్ ! ఏమియు కనిపించుట లేదు".

"సౌమ్యా! ఈ వటవృక్ష ఫల బీజము యొక్క అత్యంత సూక్ష్మ భాగము నీకు కనిపించుట లేదు. కాని కనిపించని ఆ సూక్ష్మ భాగము నుండియే ఈ పెద్ద వట వృక్షము పుట్టుచున్నది. ఈ సత్వమును విశ్వసించుము. ఇది అత్యంత సూక్ష్మము, ఇది అంతయును పరబ్రహ్మ స్వరూపము ఇదే సత్యము. ఇదే పరమాత్మ శ్వేతకేతూ ! "తత్త్వమసి" ఆ ఆత్మవు నీవేయై వున్నావు" ఈ విధముగా ఎన్నియో విధముల ఉద్దాలకముని శ్వేతకేతుకు "తత్త్వమసి" అని బోధించినాడు.

శ్వేతకేతువు తన యాత్మయే పరబ్రహ్మముగా ఉపాసించి బ్రహ్మజ్ఞానమంది అమృత స్వరూపుడాయెను.
(ఛాం.ఉ. VI-8 నుండి 16 వరకు)

---

**36. అమృత విద్య :** బృహదారణ్యక ఉపనిషత్తులో ఇలా చెప్పబడినది. (బృ.అ.ఉ.III-3-28)

"అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ"

"అసత్తు నుండి సత్తుకు కొనిపొమ్ము నన్ను

తమస్సు నుండి జ్యోతికి కొనిపొమ్ము నన్ను
మృత్యువు నుండి అమృతమునకు కొనిపొమ్ము నన్ను"

"అసత్తు నుండి సత్తుకు కొని పొమ్ము నన్ను" అని అనినపుడు, అసత్తు అంటే మృత్యువు మరియు సత్తు అంటే అమృతము కదా! కావున దాని అర్థము "మృత్యువు నుండి అమృతమునకు కొనిపొమ్ము నన్ను" అనియే అవుతుంది.

"తమస్సు నుండి జ్యోతికి కొనిపొమ్ము నన్ను" అని అనినపుడు, తమస్సు అంటే మృత్యువు మరియు జ్యోతి అంటే అమృతము. కావున దాని అర్థము కూడా "మృత్యువు నుండి అమృతమునకు కొనిపొమ్ము నన్ను" అనియే మరల అవుతుంది.

మూడవది "మృత్యువు నుండి అమృతమునకు కొనిపొమ్ము నన్ను" అని మొదలే వున్నది.

అంటే మూడుసార్లు

"మృత్యువు నుండి అమృతమునకు కొనిపొమ్ము నన్ను" అని చెప్పినట్లు అవుతుంది.

బ్రహ్మము సత్యము, జ్యోతి మరియు అమృతము. కావున సత్యమును, జ్యోతిని బ్రహ్మముగా ఉపాసన చేయాలి.

సత్యమును, జ్యోతులన్నింటిని అమృతముగా ఉపాసన చేస్తూ సత్యమును పాటిస్తు, జ్ఞానము (జ్యోతి)ను ఆర్జించాలి.

[**నారాయణ వాక్యము :** మనలో వున్న అహంకారమే మృత్యువు మరియు ఆత్మయే అమృతము. కావున "అహంతాయాః ఆత్మగమయా"
"అహంకారము నుండి ఆత్మకు కొనిపొమ్ము నన్ను" అనేది కూడా వర్తిస్తుంది.

అసత్తు, తమస్సు, అహంకారము అన్నియు మృత్యు రూపములు.

(అనంహకారముయే సత్యము, జ్యోతి, అమృతము మరియు ఆత్మ).

"నేను", "నాది" అనేది లేకుండా చేసి, సత్యమును పాటించి, జ్ఞానార్జన-ఉపాసన చేయటమే ఆత్మవైపు, పరబ్రహ్మవైపు పురోగమించటము.

(బృ.అ.ఉ. III-3-28, బ్ర.సూ. (103) I-3-28)]

---

**37. పర్యంక విద్య :** కౌషీతకీ ఉపనిషత్తులో (I-1,2,3,4,5,6) చిత్ర గార్గ్యాయణ ముని ఉద్దాలక ఆరుణి మహర్షికి, ఆయన కుమారుడైన శ్వేతకేతువుకు ఊర్ధ్వలోకములకు వెళ్లే మార్గము గురించి బోధించాడు.

"ఈ ప్రపంచమును విడిచి చంద్రలోకమునకు చేరిన జీవులు అక్కడ నుండి తిరిగి ప్రయాణము చేయవలసి వున్నది. చంద్రలోకము స్వర్గలోకమునకు ద్వారముగానున్నది. పూర్వ పక్షములో (శుక్లపక్షములో, వెలుగు మార్గములో, ధర్మమార్గములో, సత్యమార్గములో) చంద్రలోకమునకు చేరినవారు స్వర్గలోకమునకు వెళ్లే అవకాశము కలదు. అపరపక్షములో (కృష్ణపక్షములో,

అజ్ఞానమార్గములో, అధర్మమార్గములో, అసత్యమార్గములో) చంద్రలోకమునకు చేరినవారు తిరిగి భూలోకములో జన్మించవలసి వుంటుంది. (చంద్రలోకము మానసికలోకము. అది రైలు బండి మార్చే కొద్దికాలపు స్టేషను (Transit తత్కాల స్థానము) వంటిదే. అందుకే చంద్రలోకము ఎప్పుడూ నిండిపోదు!)

ఏ జీవులైతే (శుభకర్మలు చేసినామని) తగిన సమాధానములు చెప్పగలిగేవారో, ఆ జీవులు మాత్రమే స్వర్గమునకు పోగలరు. పుణ్యకర్మలు తగినంత చేయని జీవులు తిరిగి వర్షము ద్వారా భూలోకమునకు వచ్చెదరు. వర్షబిందువుల నుండి కీటకముగానో, పక్షిగానో, జంతువుగానో, చేపగానో, క్రూరమృగముగానో, మనిషిగానో వారి వారి పూర్వకర్మలననుసరించి జన్మించెదరు. అట్లు జన్మించి సంసారచక్రములో మరియొక్కసారి తిరగటం ప్రారంభిస్తారు.

[**నారాయణ వాక్యము :** ఈ జన్మలో శుభకర్మలు చేసి, అనహంకారమునంది నైష్కర్మ్య సిద్ధివైపు, ఉపాసన ద్వారా, జ్ఞానార్జన ద్వారా, తపస్సు ద్వారా ఆ చక్రము నుండి బయటపడి దేవయానము వైపు, ముక్తివైపు పురోగమించే అవకాశము వున్నది. ప్రతి క్షణము మన ప్రగతిని మనమే నిర్మించికోవచ్చును. అందులో పరమాత్మ ప్రేరణ, చేయూత వుంటుంది.]

దేవయాన మార్గములో బ్రహ్మలోక మార్గమును గురించి ప్రయాణము చేయు జీవాత్మ ముందు అగ్ని లోకము చేరుకొంటున్నాడు. ఆ పిమ్మట వాయులోకమునకు, వరుణ లోకమునకు, ఆదిత్య లోకమునకు, ఇంద్రలోకమునకు, ప్రజాపతి లోకమునకు వెళ్లి బ్రహ్మలోకమునకు చేరుచున్నాడు.

ఆ బ్రహ్మలోకములో "అరః" "ణ్య" అనే రెండు సరస్సులు వున్నాయి. (ఈ అరణ్య సరస్సులను చేరగానే కామములనే అరులు (శత్రువులు–ఆరుగురు) లేకుండా పోతారు (అర–ణ్య)).

అక్కడ "ఐష్టిహా" ముహూర్తములు గడువును (చేసిన ఇష్టి కర్మలు అన్నీ రాహిత్యము అవుతాయి). అంటే మొదలు శత్రువులు లేకుండాపోయి తరువాత మిత్రులు కూడా వెళ్లిపోతారు. బంధములు వీడిపోతాయి.

అక్కడ విరజా (రజస్సులేని) శుద్ధమైన నది, ఈల్యః (అనుగ్రహము) అనే వృక్షము, సాయుజ్యము (పరమాత్మలో కలిసిపోవటము) అనే పట్టణము, అపరాజిత (సంపూర్ణ విజయము) అనే సౌధము కలవు. ఆ సౌధములో ఇంద్రుడు (విద్యుత్తేజము) ద్వారపాలకుడుగా వుండును. ఆ భవనములో విభు (విశేషమైన కాంతి గల) గొప్ప సభావేదిక కలదు.

అందులో విచక్షణ (పరము నుండి ఇహమును వేరుచేసేది నిర్ణయరూపమైనది) అనే తేజోమయమైన సింహాసనము కలదు. అక్కడ "అమితౌజః" (అపరిమిత ఐశ్వర్యరూపము) అను గొప్ప పర్యంకము కలదు. మానసీ (మనస్సు), చాక్షుసీ (దృష్టి) అను ఇద్దరు దేవకాంతలు పుష్పములున్న చేతులతో జగత్తులను చూపుదురు. అప్సరసలు, మాతృదేవతలు, నదీమ తల్లులు, పరిచారికలు అక్కడ సహకరించెదరు. అక్కడకు చేరినవారు బ్రహ్మలోక సుఖమునందెదరు. బ్రహ్మ స్వయముగా వచ్చి "ఈ ఐశ్వర్యమును దర్శించండి, అనుభవించండి, విరజా నదిలో స్నానము చేయండి. ఇక్కడ ముసలి తనము లేదు!" అని చెప్పును. ఎందరో అప్సరసలు పండ్లు, సుగంధ లేపములను, పుష్పలమును తెచ్చెదరు.

బ్రహ్మదేవునితో పాటు అందరిని అలంకరించెదరు. అపుడు బ్రహ్మ సన్నిధానమునకు యానము అగును. అరః అను సరస్సులో మనస్సుతోనే స్నానము చేసెదరు. ఏషిహా ముహూర్తములను అనుభవించి విరజానదిలో గూడ మనస్సుతోనే స్నానము చేయుదురు. వెంటనే పుణ్యపాపములు కడుగబడి వీడిపోవును. పుణ్యములు తనకు మంచిచేసిన వారికి పోవును, పాపములు తనకు హాని చేసిన వారికి పోవును. రెండు రథచక్రములు పడిపోయినట్లు పుణ్యపాపములు, సుఖ దుఃఖములు, ఇష్టానిష్టములు, అన్ని ద్వందములు వెడలిపోవును. ద్వందాతీతుడై అతడు బ్రహ్మమును చేరును.

ఈల్యః (అనుగ్రహము) అనే వృక్షము చేరగానే సుగంధ చైతన్యము అనుగ్రహము వలె అతనిలో నిండిపోవును. తరువాత సాయుజ్యపట్టణము చేరగానే అక్కడ బ్రహ్మచైతన్యము అతనిలో చేరును. అపరాజిత అనే సౌధము చేరగానే బ్రహ్మ తేజస్సు ఇతనిలో చేరును. పిమ్మట ఇంద్రుడు, ప్రజాపతి అనే ద్వార పాలకులు ప్రీతితో మార్గమునిచ్చెదరు. అపుడు విభు అనే సభావేదికకు అతడు చేరును. అక్కడ అతను బ్రహ్మతేజస్సుతో వెలుగును.

ఆ తరువాత విచక్షణ అనే బ్రహ్మ సింహాసనము వైపు వెళ్లును. ఆ సింహాసనము ముందు కాళ్లలో బృహద్రథంతర సామగానములు వినిపించును. ద్వైత నౌరస సామ గానములు వెనుక కాళ్లలో వినిపించును. వైరూప, వైరాజ, శాశ్వత, రైవత, ప్రజ్ఞలు ప్రకాశించును. ఆ ప్రజ్ఞలతో సంభాషణలు జరుగును. అక్కడ అమితౌజః అను పర్యంకము కనిపించును. అది ప్రాణవాయువు. భూత, భవిష్యత్తులు దానికి ముందుకాళ్లు. సంపదలు, ఆహారములు దానికి వెనుక కాళ్లు. భద్ర యజ్ఞాయజ్ఞీయములు రెండు శిరస్సులు.

బృహత్ రథంతర సామములు రెండు పక్క కర్రలు. యజుస్సులు అడ్డముగా నుండు చెక్కలు. సోమ లతలు క్రిందటి చాపలు. ఉద్గీథములు మెత్తని దిండ్లు. అక్కడ బ్రహ్మ ఆసీనుడై వుండును. అక్కడికి వెళ్లి జ్ఞానాత్మలు బ్రహ్మను సమీపించెదరు. ఆయన వారిని "మీరెవరు" అని ప్రశ్నించెదరు.

"నేను ఋతదేవతను, ఆకాశము నుండి శుక్లరూపములో చేరి, స్త్రీ గర్భములో చేరి, సంవత్సర తేజస్సుగా అన్ని జీవాత్మల వలె ఆత్మగానుంటిని. నీవు సర్వ జీవాత్మలకు ఆత్మవు. నీవలెనె "నేనూ ఆత్మనే" అని అనగానే అప్పుడు బ్రహ్మ "నేను ఎవరు?" అని అనును. అపుడు "నీవు సర్వాత్మవు" అని అనవలెను. "సర్వాత్మ అనగా ఎవరు?" "ఇంద్రియాది దేవతలు కారు, ప్రాణ వాయువు కాదు – అదియే సత్యము, సత్. అదియే ఈ సమస్త జగత్తు. నీవు కూడ ఈ జగత్ రూపమై వున్నావు." అనగా బ్రహ్మ "నా పురుష రూపములను నీవెట్లు తెలుసుకొంటివి?" అని అనును. "ప్రాణ శ్వాసల వలన తెలిసికొంటిని" అని అనగా "నా స్త్రీ రూపములనెట్లు తెలుసుకొంటివి?" అని అనును. "వాక్కు ద్వారా" అని అనవలెను. "నపుంసక రూపములనెట్లు తెలుసుకొంటివి?" అని అనగా "మనస్సు ద్వారా" అని చెప్పవలెను. "వాసనలనెట్లు తెలుసుకొంటివి?" అనగా "ఘ్రాణేంద్రియము ద్వారా" అని చెప్పవలెను. "రూపము?", "నేత్రేంద్రియముల ద్వారా", "శబ్దము?" "శ్రోత్రేంద్రియముల ద్వారా", "అన్ని రసములను?" "జిహ్వేంద్రియము ద్వారా", "కర్మలు;", "హస్తేంద్రియముల ద్వారా!", "సుఖదుఃఖములను?" "శరీరము ద్వారా!", "రతి సుఖమును?" "ఉపస్థేంద్రియము ద్వారా!", "పడమట?" "రెండు పాదముల ద్వారా", "సంకల్పములను,

భావనలను, కోరికలను?, "బుద్ధి, ప్రజ్ఞ ద్వారా!" "ఈ జలమయమైన ప్రపంచమంతయు నాదియే! నీది కూడ, ఈ సమస్త ప్రపంచము బ్రహ్మమయము. దీనిని అర్థము చేసుకొన్న వారు బ్రహ్మమే అగుచున్నారు". అని బ్రహ్మ అనగానే ముక్తాత్మ బ్రహ్మము అగును." కౌ.బ్రా.I-1.

అహంకారమును మాపివేసి తానే రజస్సు లేని, పుణ్యపాపములు, సుఖ దుఃఖములు, ద్వంద్వములు లేని, విభువుగా, విచక్షణా చైతన్యముగా, అమిత తేజముగా బ్రహ్మముగా ఉపాసన చేయవలయును. (కౌ.బ్రా. 1-1)

**[నారాయణ వాక్యము :- బ్రహ్మయోగము :** ఈ దివ్య గ్రంథము సిద్ధము అవుతున్నపుడు 21-6-2016 నాడు కంప్యూటర్ అంతిమప్రతి సిద్ధము చేస్తున్న వడ్లకొండ శ్రావణ్ కుమార్ 555 సూత్రములు కల ఈ రచనలో 555వ పేజీలో "బ్రహ్మలోకము" రావటము గూర్చి తెలిపినాడు. ఇది కాకతాళీయము కాదు. ఇది బ్రహ్మస్పర్శ, యోగము, బ్రహ్మయోగము, పరమ అనుగ్రహము**]**

---

**38. జ్యోతిషాంజ్యోతి విద్య :** బృహదారణ్యకములో యాజ్ఞవల్క్యుడు జనక మహారాజుకు జ్యోతులకు జ్యోతియైన ఆత్మ గురించి బోధించినాడు.

జనకుడు అడిగానాడు. "దేహేంద్రియ ప్రాణమనస్సులందు విజ్ఞాన స్వరూపుడగు ఆత్మ ఎయ్యది?"

యాజ్ఞవల్క్యుడు చెప్పినాడు. "బుద్ధియందు తేజోస్వరూపుడగు పురుషుడు ఆత్మ మరియు విజ్ఞాన స్వరూపమగు ఆత్మ, ధ్యానించుచున్న దానివలెనే, చలించుచున్న దాని వలెనే, బుద్ధితో సమానరూపము దాల్చి, ఇహ పరలోకములను అనుసరించి తిరుగుచున్నది. ఆ ఆత్మయే స్వప్న స్వరూపమై ఈ లోకమును, మృత్యువు సమానరూపమైన దేహేంద్రియములను అతిక్రమించియున్నది, పరిశుద్ధమైయున్నది."

"ఈ లోకము పరలోకమని రెండు స్థానములున్నవి. మూడవది స్వప్న స్థానము, ఈ రెండింటికి సంధిగానున్నది. ఈ పురుషుడు సంధియందు నిలిచి ఈ రెండు స్థానముల వైపు చూచును. అతడు తన సాధనములననుసరించి ఈ లోకమున పాపము మరియు ఆనందము అనుభవించును. నిద్రా సమయమున అతడు ఈ లోకము యొక్క సర్వవస్తువులను సూక్ష్మాంశములతో గూడి, ఈ దేహమును క్రింద పడవైచి, స్వప్నమునందు, వాసనారూపములో స్వయంప్రకాశమానుడై వుండును. ఈ అవస్థయందు పురుషుడు స్వయం జ్యోతియగుచున్నాడు".

"దృక్స్వరూపమగు ఆత్మజ్యోతి ఒర నుండి తీయబడిన కత్తివలె స్వయంజ్యోతియై స్వప్రకాశముతో వెలుగుచున్నాడు." (బృ.అ.ఉ. IV-3-7,9)

"ఓ జనక మహారాజా! భూతభవిష్యద్వర్తమాన కాల త్రయమునకు నియామకుడగు ఈశ్వరుని తన ఆత్మగా తెలుసుకొనువాడు సర్వస్వరూపుడగుచున్నాడు. అతడు దేనికిని భయపడే అవసరము లేదు". (బృ.అ.ఉ. VI-4-15)

"యస్మాదర్వాక్సంవత్సరోऽహోభిః పరివర్తతేః
తద్దేవా జ్యోతిషాంజ్యోతిరాయుర్హోపాసతేऽమృతం" (బృ.అ.ఉ. VI-4-16)

# పర్యంక విద్య

## బ్రహ్మా లోకము




సాయుజ్య పట్టణము



ఈల్యః
వృక్షము

విరజానది

అరః
సరస్సు

ణ్య
సరస్సు

"ఈశ్వరుని కంటే వేరుగానున్న సంవత్సరము (కాలాత్మ) కాలావయవములగు దినముల చేత అంతటను నిండి వున్నది. ఆ జ్యోతులకు జ్యోతియైన అమృతమును దేవతలు ఆయుస్సు అని ధ్యానించుచున్నారు."

"యస్మిన్పంచపంచజనా ఆకాశశ్చప్రతిష్ఠితః
తమేవ మన్య ఆత్మానం విద్వాన్బ్రహ్మామృతోఽమృతం" (కౌ.ఉ. VI-4-17)

"అయిదుగురు గంధర్వులు (గంధర్వులు, పితరులు, దేవతలు, అసురులు, రక్షస్సులు) అక్షర స్వరూపమునందు ఉంచబడెనో, ఆ పరమాత్మనే, ఆత్మ స్వరూపముగా భావించుచున్నారు. నాశరహితమగు పరబ్రహ్మమును తెలిసికొనినవాడనై అమృతమయమగు పరమాత్మనైతిని" (కౌ.ఉ. VI-4-17).

"సవాఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయోబ్రహ్మ
అభయంవై బ్రహ్మాభయం హి వై బ్రహ్మ భవతి ఏవంవేద" (బృ.అ.ఉ. VI-4-25).

"ఈ పురుషుడు మహాత్ముడు, అజుడు, ఆత్మయే. ఇతడు జరామరణములు లేనివాడు, అమరుడు, అమృతుడు, అభయ స్వరూపమగు పరబ్రహ్మము. ఇట్లు తెలిసికొనినవాడు భయరహితమగు పరబ్రహ్మ స్వరూపమే." (బృ.అ.ఉ. VI-4-25).

జ్యోతిషాంజ్యోతి అంటే పరమజ్యోతి. అదియే బ్రహ్మము యొక్క, ఆత్మ యొక్క స్వరూపము.

"పరంజ్యోతిరుప సంపద్య
స్వేనరూపేణాభినిష్పద్యతే" (ఛాం.ఉ.VIII-12-2/3, బ్ర.సూ. (103) I-3-40).

"ప్రత్యగాత్మ ఈ శరీరము నుండి వెడలి, పరంజ్యోతియందు నొకటియై స్వరూపమున ప్రకాశించును". ఈ విధముగా జ్యోతి మరియు పరంజ్యోతి పరబ్రహ్మ వాచకములు.

"తమసోమాజ్యోతిర్గమయా" (బృ.అ.ఉ. III-3-28)

"తమస్సు నుండి జ్యోతికి నన్ను తీసుకొని వెళ్లుము."

అట్లు పరబ్రహ్మమును జ్యోతులకు జ్యోతిగా అంతర్జ్యోతిగా, స్వయంజ్యోతిగా ఉపాసన చేయవలెను.

(బ్ర.సూ.(103) I-3-40)
(బృ.అ.ఉ. VI-4-15, VI-4-16, VI-4-17, VI-4-25, ఛాం.ఉ.VIII-12-2/3, బృ.అ.ఉ. III-3-28).

---

**39. ఈశ విద్య :** ఈశావాస్యోపనిషత్తులో

"ఓం ఈశావాస్యమిదం సర్వం
యత్కించ జగత్యాంజగత్
తేన త్యక్తేన భుంజీథాః
మాగృధః కస్యస్విద్ ధనమ్" (ఈ.ఉ.-1.)

"ఈశావాస్యమై అదియుండుచుండు
లేశమేదేని జగమున జరుగుచుండు
చేసియట్టిత్యక్తత్వము మన్నవలెను
యాసక్తిని ఇతరుల ధనమందు వీడు"

"ఈ సమస్త జగత్తులో, సృష్టిలో ఎది జరిగినా, అంటే జరుగుతున్నా అది ఈశ్వరుని పరిమితిలోనే జరుగుతుంది. అంటే సృష్టిలో జనించి, జీవించి మరల లయము అయ్యేటివి అన్నీ ఆ పరబ్రహ్మమునందే అవుతాయి."

"జన్మాదాస్యయతః" (బ్ర.సూ. I-1-1)

"దేని వలన ఈ జగమునకు జన్మ, స్థితి మరియు లయములు కలుగునో, అదియే బ్రహ్మమే."

తండ్రియైన వరుణుడు తనయుడైన భృగువుకు ఇలా ఉపదేశించాడు,

"దేని నుండి భూతములు జనియంచుచుండు
జనియించి దేని వలన జీవించుచుండు
దేని యందు మరియవి కలియుచుండు
అదియే బ్రహ్మమని నీవు తెలియుచుండు" (తై.ఉ. 3-1)

అట్లు చెప్పి "తపస్సే బ్రహ్మము. తపస్సు వలన బ్రహ్మమును తెలిసికొనవలెను." అని బోధించినాడు అపుడు భృగువు బ్రహ్మమును సర్వములకు జన్మ, స్థితి, లయ కారణముగా సర్వమూలముగా సర్వాధారముగా, సర్వగమ్యముగా ఉపాసన, ధ్యానము, తపస్సు చేసి బ్రహ్మము క్రమముగా అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందముగా తెలిసి ఆంనందించి బ్రహ్మజ్ఞాని అయినాడు.

అట్లు బ్రహ్మమును మానసికంగా, బౌద్ధికంగా ఉపాసన చేయవలెను.
ఇంకో విధమైన ఉపాసన కూడా ఈశావాస్యోపనిషత్తులో వున్నది. జగత్తంతా ఈశావాస్యమని, ఈశ్వరుని పరిమితిలోనేనని చెప్పిన వెంటనే ఇలా చెప్పిబడినది.

"కుర్వన్నేవేహ కర్మాణి, జిజీవిషేచ్ఛతం సమా
ఏవంత్వయినాన్యథేతోఽస్తి న కర్మలిప్యతేనరే" (ఈ.ఉ.-2)

ఈ జగమంతా, ఈ సృష్టియంతా అంటే ఇల్లు, బట్టలు, అన్నము, ధనము, తల్లి, తండ్రి, పిల్లలు, ఆస్తులు, పరికరములు అన్నీ ఈశ్వరునివే అని సమర్పణా భావముతో, ఏదీ నాది కాదనే అనహంకార భావములో కర్మలు చేయాలి.

అంటే మనవి అనిపించేవి అన్నియే కాక మనము చేసే వాటి కర్మఫలములు మనవి కావని సర్వము పరబ్రహ్మముకే సమర్పించి నూరేండ్లూ జీవించటానికి సిద్ధంగా వుండాలి. అప్పుడు జీవితమే ఉపాసన అవుతుంది. కర్మలు అంటని, బంధము కాని శారీరక (కర్మల సమర్పణ) మానసిక (మనస్సు అంకితము) బౌద్ధిక (అనన్య ధ్యానము) మరియు ఆత్మిక (అనుభూతి)

ఉపాసనలతో బ్రహ్మ స్థితిని అందాలి.
ఇదియే మార్గము.

(ఈ.ఉ.-1,2, (బ్ర.సూ. (బ్ర.సూ. III-4-1 నుండి III-4-17 వరకు). (బ్ర.సూ. (1) I-1-1 నుండి (555) IV-4-22 వరకు)

[**నారాయణ వాక్యము :** ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీత (ప్రస్థానత్రయము) అంతా ఈశ విద్య. ఈశ విద్యయే బ్రహ్మవిద్య].

---

**40. శ్రీమన్-న్యాస విద్య :**

యజుర్వేదమునకు సంబంధించిన నారాయణ యాజ్ఞిక్యుపనిషత్తులో,
"న్యాసం ఇత్యాహుర్మనీషిణో బ్రహ్మాణం" (నా.యా.ఉ.-242)
"బ్రహ్మము న్యాసమని మనీషులు అనెదరు"
న్యాసము, సంన్యాసము, సన్యాసము, త్యాగముయే పరబ్రహ్మ స్వరూపము అని అర్థము.
దీని గురించి కైవల్యోపనిషత్తులో ఇలా చెప్పబడినది.
"పరేణ నాకం విహితం గుహాయాం
విభ్రాజదే తద్యయతయో విశంతిః
వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః
సన్యాస యోగాద్యతయ శ్శుద్ధ సత్వాః" (కై.ఉ. 4) (ముం.ఉ.III-2-6)
స్వర్గముకంటె శ్రేష్ఠమైనదై, హృదయ గుహ యందు ఉండునదై ఏది ప్రకాశించుచున్నదో, ఆ పరబ్రహ్మమును, వేదాంత విజ్ఞానము చేత బాగుగా నిశ్చయించబడిన అర్థము తెలిసికొన్నవారును, సన్యాసయోగము చేత పరిశుద్ధమైన అంతఃకరణము కలవారును యగు యతులు ప్రవేశించుచున్నారు, పొందుచున్నారు.
"తే బ్రహ్మలోకేషు పరాంత కాలే
పరామృతా పరి ముచ్యంతి సర్వేః
వివిక్త దేశేచ సుఖాసనస్థః
శుచి సమగ్రీవ శిరశ్శరీరః (కై.ఉ. 5) (ముం.ఉ. III-2-6)
"ఆ యతులందరును కడపటి జన్మము యొక్క అంతమునందు బ్రహ్మలోకమున పరమాత్మను పొంది, అమృతత్వమునంది పునర్జన్మ రహితమైన మోక్షమును పొందుచున్నాడు."
"ఏకాంత ప్రదేశమున సుఖాసీనుడై, పరిశుద్ధమనస్కుడై కంఠము, శిరస్సు, దేహము అనే మూడింటిని సమముగానించి - పరమాత్మను పరిశుద్ధ అంతఃకరణముతో ధ్యానించి పరాత్పరుడైన పరమేశ్వరుని యందు చేరును."
ఈ విధము నిరంతరము త్యాగముతో సంపూర్ణ సన్యాసముతో పరబ్రహ్మమునుపాసించి జిజ్ఞాసువులు పరబ్రహ్మమునందగలరు.
(కై.ఉ. 5) (ముం.ఉ. III-2-6) బ్ర.సూ. (535) IV-4-2, (438) III-4-8)
బ్రహ్మవిద్యాసాధన
ఈ బ్రహ్మవిద్యలు ఆ ముక్తి మార్గము గూర్చి బాగుగా బోధించినవి.
ఇక్కడ చెప్పబడిన 41 విద్యలు, ఇంకా చెప్పబడని అన్నీ విద్యలు, అనంత విద్యలు, ఈశ విద్య,

శ్రీమన్-న్యాస విద్య అన్నీ బ్రహ్మవిద్యలే.
"ఇది ఏమి బ్రహ్మవిద్యయా?" అని అంటే అవును. ఈ అన్ని విద్యలూ బ్రహ్మవిద్యలే.
బ్రహ్మవిద్య కఠినమా? ఉపాసన, అభ్యాసము చేయకపోతే, కేవలము చేయాలనుకుంటే, నామమాత్రముగా చేస్తే చాలా కఠినము.
అభ్యాసము, ఉపాసన నిరంతరముగా ప్రవాహము వలె (మన సామాన్య జీవన కార్యములు కూడా అనాసక్తితో చేస్తూ) సాధనగా చేస్తే చాలా సులువు, అద్భుతము, ఆనందము అమృత ప్రాయము.
ఏదైన ఒక విద్య (ఓంకారోపాసన వంటిది) ను ఎన్నుకొని శ్రద్ధతో అభ్యాసము, ఉపాసన చేసి తరించాలి.

---

**41. సర్వవిద్య :**

ఈ జగత్తు సర్వమూ బ్రహ్మమేనని ఉపనిషత్తులు మరల మరల ఉద్ఘోషిస్తున్నాయి.
**"ఈశావాస్యమిదం సర్వం, యత్కించ జగత్యా జగత్"** (ఈ.ఉ.-1)
"ఈ సర్వము జగత్తు మరియు ఏ కొంచెమైనా ఈ జగత్తులో జరుగుచున్నది బ్రహ్మముచే, ఈశ్వరునిచే ఆవరించబడి, నిండబడియున్నది."
**"సర్వంహ్యేతద్ బ్రహ్మ"** (మా.ఉ.-2)
"ఈ సంపూర్ణ జగము నిశ్చయముగా బ్రహ్మమే"
**"ఆత్మేదమమృతమిదం బ్రహ్మేదం సర్వమ్"**
(బృ.అ.V-5-1,2,3,4,5,6,7,8,9,10,11,12,13,14)(ఇట్లు మరల మరల మరల చెప్పబడినది.)
"ఈ జగమంతయును అమృతస్వరూపమైన ఆత్మయే. ఈ సర్వము బ్రహ్మమే".
**"ఏకోదేవ సర్వబూతేషు గూఢః"** (శ్వే.ఉ.-11)
"ఒకటియేయైన దేవుడు, పరబ్రహ్మము, సర్వభూతములందు దాగివున్నాడు."
**"స ఏష సర్వభూతాంతరాత్మా"** (అధ్యాత్మ.ఉ.-1)
"ఆ బ్రహ్మమే సర్వభూతముల అంతరాత్మ.
**"యస్మిన్ సర్వమిదం ప్రోతం బ్రహ్మస్థావర జంగమమ్**
**తస్మిన్నేవ లయంయాతి స్రవన్త్య సాగరేయథా"** (మంత్రికోపనిషత్తు-17)
"స్థావరజంగమాత్మకమైన ఈ సర్వప్రపంచము ఎవనియందు సచ్చబడియున్నదో, సముద్రమందు నదులు అన్నియు కలిసిపోవునట్లు ఆ బ్రహ్మమునందే లయమగుచున్నవి."
**"సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాంత ఉపాసీత"** (ఛాం.ఉ. III-14-1)
"నామరూపాత్మకమగు ఈ జగత్తు సర్వము బ్రహ్మమే అయి వున్నది. కావున శాంతముతో ఉపాసించవలెను."
అన్నింటిలో, అంతట, క్రింద మీద, ముందు వెనుక, కుడి ఎడమ వైపుల, లోన బయట, అందరి యందు, మిత్రులలో శత్రువులలో, దగ్గర దూరము, సర్వత్ర సర్వదా వున్న బ్రహ్మము గూర్చి ఉపాసన చేయాలి.
(ఈ.ఉ.-1) (మా.ఉ.-2) (బృ.అ.ఉ. V-5-1,2,3,4,5,6,7,8,9,10,11,12,13,14) (శ్వే.ఉ.-11) (అధ్యాత్మ.ఉ.-1) (మంత్రికోపనిషత్తు-17) (ఛాం.ఉ. III-14-1)

---

# సర్వవిద్య-భగద్గీత

సర్వాత్మయే పరమాత్మ. ఆ సర్వాత్మను గూర్చి తెలిపేది సర్వవిద్య, ఉపాసన ద్వారా సర్వాత్మయైన పరబ్రహ్మ దర్శనము అనుభూతి చేయించేది సర్వవిద్య. సర్వాత్మ గురించి భగవద్గీతలో భాగుగా చెప్పబడినది. (భ.గీ. XIII-14,15,16,17,18)

**శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥**

**తా॥** సర్వత్రము పాణి పాదమ్ము నగుచు, సర్వతోక్షి శిరో ముఖము నగుచు
సర్వత్రము శ్రుతి మంతమగచు, సర్వము నావరించి నట్టి దగుచు

**శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥**

**తా॥** సర్వేంద్రియ గుణా భాసమ్మునగుచు, సర్వేంద్రియ వివర్జితమ్ము నగుచు
సర్వభర్త యనాసక్తమ్ము నగుచు, సర్వభూత బాహ్యాంతరమ్ము నగుచు

**శ్లో॥ బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ ।**
**సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥**

**తా॥** నిర్గుణమ్మునై గుణ భోక్త గూడయగుచు, చరమ్మును నచరమ్మునగుచు
మరి సూక్ష్మమ్ము నవిజ్ఞేయమగుచు, దూరస్థము మరి దగ్గరకు నగుచు

**శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్తితమ్ ।**
**భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥**

**తా॥** సర్వ భూతముల నవిభక్తమ్ము నగుచు, మరి విభక్తముగ స్థితమ్ము నగుచు
సర్వభూతముల పుట్టించు దగుచు, మరి భరించుయు గిట్టించు దగుచు

**శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥**

**తా॥** సర్వో జ్యోతులకు దాను జ్యోతియగుచు, మరి తమసమున కావలయు నగుచు
పరమ జ్ఞానమ్ము జ్యేయము జ్ఞానమూలమ్ము, సర్వ హృదయములందు విష్ఠితమ్ము

సర్వ హృదయములలో, స్వ హృదయములోనున్న ఆ సర్వాత్మను ఈ విధంగా స్తుతిచేసి ధ్యానములో ఉపాసించాలి.
**సర్వకర్తవు నీవు సర్వములు నీవల్ల సర్వధాత, సర్వధర్తవు నీవు సర్వములు నీవుండ సర్వదేవ**
**సర్వహర్తవు నీవు సర్వములు నీయందు సర్వరూప, సర్వభర్తవు నీవు సర్వములు నీవంత సర్వనాథ**
సర్వవిద్యోపాసన వలన సర్వాత్మ సందర్శనము స్వానుభూతి అవుతుంది.

# బ్రహ్మ విద్యల సారములు

| | | |
|---|---|---|
| **1. గాయత్రి విద్య** | : | జ్యోతిస్సును బ్రహ్మముగా ఉపాసన చేయాలి. |
| **2. అక్షి విద్య** | : | ఆదిత్య పురుషుడు, అక్షిస్థ పురుషుడు బ్రహ్మమే. |
| **3. అంతరాదిత్య విద్య** | : | ఆదిత్య మండలములోని పురుషుడు కుడికంటి యందలి పురుషుడు బ్రహ్మము. |
| **4. మధు విద్య** | : | ఆదిత్యుడే దేవతలకు మధువు |
| **5. పురుష విద్య** | : | పురుషుడే యజ్ఞము. మొదటి 24 యేండ్లు ప్రాతస్సవము, తరువాతి 44 మధ్యాహ్న సవనము. చివరి 48 సాయాసవము |
| **6. ప్రాణ విద్య/ప్రతర్దన విద్య** | : | ప్రాణము అనగా బ్రహ్మము. ప్రాణము అంటే ప్రాణ వాయువు, ఇంద్రుడు, జీవాత్మ కాదు. ప్రాణము బ్రహ్మము. |
| **7. ప్రాణాగ్నిహోత్ర విద్య** | : | ప్రాణములను అగ్ని హోత్రముగా ఉపాసన చేయాలి. ప్రాణాయస్వాహా, వ్యానాయస్వాహా, అపానాయస్వాహా, సమానాయస్వాహా, ఉదానాయస్వాహా |
| **8. ఉద్గీథ విద్య** | : | ఓం అనే అక్షరము ఉద్గీథము. ఓంకారమును ఉపాసన చేయాలి. సృష్టి, పృథివి, జలము, ఓషధులు, పురుషుడు, వాక్కు, ఋగ్వేదము, సామవేదము, ఓంకారము ఒకటికొకటి సాటి. |
| **9. నాచికేతాగ్ని విద్య** | : | ప్రేయమును వదిలి, శ్రేయమును ఎంచుకొని జీవనమే యజ్ఞముగా మూడు గుణములు దాని దివ్యత్వమును అందాలి. |
| **10. ఉపకోసల విద్య** | : | ప్రాణము బ్రహ్మము. కం అనగా బ్రహ్మము. ఖం అనగా బ్రహ్మము. నేత్రములోని పురుషుడు ఆత్మ, అవము, అభయము, పరబ్రహ్మము. |
| **11. సత్యకామ విద్య** | : | సత్యము పలకటము బ్రాహ్మణత్వము. పడమర దక్షిణము, ఉత్తరము, పృథివి, అంతరిక్షము, ద్యులోకము, సముద్రం. |
| **12. పంచాగ్ని విద్య** | : | ఈ జగత్తులో స్వర్గము, మేఘము, పురుషుడు, స్త్రీ అనేవి పంచాగ్నులు, శ్రద్ధ, సోమము, వర్షము, అన్నము, రేతస్సు ఆహుతులు, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, ప్రాణము, చక్షుస్సు, మనస్సు అనే బ్రహ్మము 16 కళలు. |
| **13. వైశ్వానర విద్య** | : | వైశ్వానరుడు అంటే జఠరాగ్ని కాదు. వైశ్వానరుడు అంటే విశ్వస్వరూపుడు అయిన విరాట్పురుషుడు. విశ్వనరుడే వైశ్వానరుడు. |
| **14. సంవర్గ విద్య** | : | దేవతలయందు వాయువు, ఇంద్రియములందు ప్రాణములు సంవర్గములుగా (సమిష్ఠిగా) ఉపాసన చేయాలి. |

**15. ఆకాశ విద్య** : ఈ ఆకాశమనునది నామరూపములు వ్యక్తము చేయును. ఈ నామరూపములు ఏ ఆత్మయందున్నవో అదియే బ్రహ్మము.

**16. గార్గిఅక్షర విద్య** : త్రికాల రూపమైన ఈ సమస్తము అవ్యాకృత ఆకాశమందు ఓతప్రోతము, అవ్యాకృత ఆకాశము అక్షరమునందు ఓతప్రోత ఆకాశము బ్రహ్మము.

**17. భృగువారుణి విద్య** : అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము ఒకటికన్న నొకటిలోపలి బ్రహ్మము ఆనందము పరమ బ్రహ్మము, అక్షరము పరబ్రహ్మము.

**18. ఆనందమయ విద్య** : సత్యము, జ్ఞానము, అనంతము బ్రహ్మము. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ పురుషులు బ్రహ్మము. ఆనందమయుడు పరబ్రహ్మ.

**19. అంగుష్ఠమాత్ర విద్య** : పరబ్రహ్మము హృదయమందున్నది. హృదయము అంగుష్ఠమాత్రము. కావున అంగుష్ఠమాత్రుడు పరబ్రహ్మము.

**20. హృదయ విద్య** : "హృ" అనగా హృదయ శుద్ధి, "ద" అనగా దయము, దానము, దయ. "య" అనగా దివ్యత్వము.

**21. సత్య విద్య** : "స" అనగా సత్యము బ్రహ్మ, "తి" అనగా జగత్తు, "య" అనగా పరబ్రహ్మము స,య అమూర్తములు, తి మూర్తము, స,తి,య సత్య బ్రహ్మము.

**22. శాండిల్య విద్య** : శాండిల్య ముని సూక్ష్మాతి సూక్ష్మముగా, మహత్తు కన్నా మహత్తుగా ప్రకాశ స్వరూపముగా స్వ హృదయములో నున్న బ్రహ్మమునుసాసించాలి.

**23. దహర విద్య** : హృదయములోనున్న పరమాత్మను సగుణోపాసన కాని నిర్గుణోపాసన గాని చేయాలి, ఓంకారోపాసన శ్రేష్ఠము.

**24. బాలాకి విద్య** : ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు, ఉరుములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, అద్దము, నీడ, అహం, ఛాయ, కుడికన్ను, ఎడమ కన్నులలోని పురుషులకు పురుషుడు పరబ్రహ్మము.

**25. ఉషస్తి కహోల విద్య** : అన్ని భూతములందు కనబడని, వినబడని సర్వాంతరుడు పరబ్రహ్మ.

**26. ఉద్దాలక ఆరుణి విద్య** : కనిపించకుండా చూసేది, వినబడకుండా వినేది, అనిపించకుండా అనుకునేది, తెలియబడకుండా తెలిసేది, అంతర్యామి పరబ్రహ్మ.

**27. మైత్రేయి విద్య** : దేని చేత సర్వమును తెలియచబడుచున్నదో, సర్వమును తెలిసికొనునది విజ్ఞానమయమైన, సమస్తము అయిన పరమాత్మ.

**28. పరమపురుష విద్య** : పరబ్రహ్మము ఇంద్రియముల కన్న, అర్థములకన్న మనస్సు కన్న, బుద్ధికన్న,

మహత్‌కన్న, అవ్యక్తముకన్న పరము. పరాత్పరుడు. ఒకటే అయిన పరమాత్మ జీవాత్మలు ఒకే కొమ్మ మీది రెండు పక్షులు, వెలుగు నీడల వలె వుండును.

**29. అక్షరాక్షర విద్య** : ప్రకాశించి ప్రజ్వలించుచున్న అగ్ని నుండి అగ్నికి సమానమైన వెలకొలది మిణుగురులు కలుగునట్లు ఆ అక్షరము నుండి అనేకములైన జీవులు, జనించి లయించుచుండు.

**30. సద్విద్య** : సత్‌యే సృష్టికి మొదలు యుండెను. మొదట్లో కారణబ్రహ్మము అవ్యాకృతముగా వుండెను. దానిలో జగత్తు వుండెను.

**31. భూమ విద్య** : నామము, వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, జలము, తేజస్సు, ఆకాశము, స్మరణము, ఆశ, ప్రాణముల కన్న గొప్పది భూమము అనగా బ్రహ్మము.

**32. ప్రజ్ఞాన విద్య** : ఇది 4 మహావాక్యములలోని లక్షణ వాక్యము "ప్రజ్ఞానం బ్రహ్మ" ప్రజ్ఞానము, చైతన్యమే బ్రహ్మము.

**33. మాండూక్య విద్య** : ఇది 4 మహావాక్యములలోని సాక్షాత్కార వాక్యము "అయమాత్మా బ్రహ్మ", "ఈ ఆత్మయే బ్రహ్మము".

**34. వామదేవ విద్య** : ఇది 4 మహావాక్యములలోని స్వానుభూతి వాక్యము "అహం బ్రహ్మాస్మి", "నేను పరబ్రహ్మమును. నేనే పరబ్రహ్మము అయి వున్నావు".

**35. శ్వేతకేతు విద్య** : ఇది 4 మహావాక్యములలోని ఉపదేశ వాక్యము "తత్త్వమసి", "నీవే పరబ్రహ్మము అయి వున్నావు".

**36. అమృత విద్య** : బ్రహ్మము సత్యము, జ్యోతి మరియు అమృతము. బ్రహ్మము కానిది అసత్యము, తమస్సు మరియు మృత్యువు. సత్యమును జ్యోతులన్నింటిని అమృతముగా ఉపాసన చేస్తూ జ్ఞానమును (జ్యోతిని) ఆర్జించి అమృతత్వము నందాలి.

**37. పర్యంక విద్య** : బ్రహ్మజ్ఞానులు దేవయానము ద్వారా బ్రహ్మలోకము చేరి అమితౌజసా పర్యంకమును పొంది బ్రహ్మమునందెదరు.

**38. జ్యోతిషాంజ్యోతి విద్య** : పరబ్రహ్మము జ్యోతులకు జ్యోతి, అంతర్జ్యోతి, పరంజ్యోతి.

**39. ఈశ విద్య** : ఈ జగమంతా ఈశావాస్యము. మనది కాదు. ఆ విధముగా అనాసక్తిగా కర్మలు ఈశ్వరుని కర్పించి నూరేండ్లు జీవించి ముక్తినందవచ్చును.

**40. శ్రీమన్-న్యాస విద్య** : నిరంతరము త్యాగముతో, సంపూర్ణ సన్యాసముతో పరబ్రహ్మనుసాసించి పరబ్రహ్మమునందవచ్చును.

**41. సర్వ విద్య** : సర్వభూతములలో, సర్వజీవరాశులలో, సర్వత్ర, సర్వ సమయములలో, సర్వ స్థానములలో, సర్వ దిశలలో, సర్వ దశలలో, సర్వ రూపములుగా, సర్వ మూలమై, సర్వాధారమై, సర్వభోక్తయై, సర్వకర్తయై, సర్వధర్తయై, సర్వహర్తయై, సర్వభర్తయై, సర్వదావుండు సర్వాత్మయే పరబ్రహ్మము. సర్వాత్మను తనయాత్మగా ఉపాసన ధ్యానము చేయవలెను.

## ALL -(సర్వము)

All, All-in-all is verily you.
In small, in tall, All is you.
When we call, readily on-call is you.
In the Hall of our Hearts, Almighty is you.
As wall of protection always is you.
All time within each one of us already is you.
Also in altering unaltering is you.
All-covering altruistic overall is you.

(Humanity to Divinity, Narayana, 2003)

---

## 6

# ప్రస్థానత్రయ బ్రహ్మవిద్యలు

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు వేరువేరు విధములుగా ఒకే తత్త్వము గురించి చెప్పినాయని, ఒకే సందేశమిచ్చినాయని మరియు ఆ రహస్యము భగవద్గీతలోని క్షేత్రక్షేత్రజ్ఞ యోగములో నున్నదని ఉపోద్ఘాతములోని త్రివేణీ సంగమములో తెలుసుకున్నాము కదా.

భగవద్గీతలోని పదమూడవ అధ్యాయము అయిన క్షేత్ర క్షేత్రజ్ఞ యోగములోని ప్రతి శ్లోకములో బ్రహ్మవిద్య నింపబడియున్నది. దీనిలోని 35 శ్లోకములలో ఇంతకుముందు విశదీకరించబడిన ఉపాసనలు-బ్రహ్మవిద్యలు ఇమడ్చబడియున్నాయి.

మొత్తము భగవద్గీత బ్రహ్మవిద్య అయితే ఈ పదమూడవ అధ్యాయములో చెప్పబడిన క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానమే నిజమైన పరమజ్ఞానమని, అన్ని క్షేత్రములలో వెలసియున్న సర్వాంతరుడు, సర్వాంతర్యామి పరమాత్మయైన తానేనని శ్రీకృష్ణ పరమాత్మ మూడవ శ్లోకములో స్పష్టముగా చెప్పినాడు.

ఈ యోగములో మనము తెలుసుకొన్న విద్యలు ఎలా అమర్చబడి యున్నాయో ఇప్పుడు తెలుసుకుందాము. ఆ విద్యలకు బ్రహ్మసూత్రములకు వున్న సంబంధము మొదలే తెలుసుకొన్నాము. ఆ విధముగా ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత యొక్క త్రివేణీ సంగమములో మరొకసారి లోతైన మునకవేతాము రండి.

(ప్రస్థానత్రయ త్రివేణి సంగమము పేజీ (53) చూడగలరు)

# శ్రీ భగవద్గీత

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

**అర్జున ఉవాచ,**

**1.** ప్రకృతిం పురుషం చైవ (పరమపురుష విద్య)
క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ । (పరమాత్మ-ప్రకృతి)
ఏత ద్వేదితు మిచ్ఛామి (జిజ్ఞాస)
జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥ (బ్రహ్మజ్ఞానం)

**వ.** భక్తిమార్గమునెరిగిన పార్థుండు పరమాత్మకిట్లనియె :

**1.** ప్రకృతి యేది పురుషుండు నెవరు
క్షేత్రంబది యేది క్షేత్రజ్ఞు డెవరు
మరి జ్ఞానంబది యేది జ్ఞేయంబు నేది
కోరెద దెలియ కేశవ దెలుపు నీవు.

**శ్రీ భగవానువాచ,**

**2.** ఇదం శరీరం కౌంతేయ (శరీరం-శారీరకం)
క్షేత్ర మిత్యభిధీయతే ।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥

**వ.** ప్రభువిట్లనియె :

**2.** తెలియు శరీరమును క్షేత్రమంద్రు
తెలిసిన దాని వాని క్షేత్రజ్ఞుడంద్రు
తెలిసిన వారికివి రెండు దెలియు
తెలియ జెప్పెద నీవు దెలిసి కొనుము

**3.** క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి (సర్వాంతర విద్య)
సర్వక్షేత్రేషు భారత । (అంతర్యామి విద్య)
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం (పరాపరములు)
యత్తద్ జ్ఞానం మతం మమ ॥

**3.** సర్వ క్షేత్రములందు వెలిగియున్న
క్షేత్రజ్ఞుడ నేను భారత నీవు కన్న
క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞానంబదియె జూడ
పరమ జ్ఞానంబు చాల తరచి చూడ

**4.** తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ (జగత్తు, సృష్టి)
యద్వికారి యతశ్చ యత్ ।(అపరము)
స చ యో యత్ప్రభావశ్చ
తత్సమాసేన మే శృణు ॥ (ఉపదేశము)

**4.** క్షేత్రంబు యెట్లు దాని విధము లెట్లు
యది పుట్టెనెట్లు దాని వికారంబు యెట్లు
క్షేత్రజ్ఞుడెట్లు నతని ప్రభావ మెట్లు
కొంత జెప్పెద నీకిపుడు వినుము నిట్లు

**5.** ఋషిభి ర్బహుధా గీతం (ఉపనిషద్విద్య)
ఛన్దోభి ర్వివిధైః పృథక్ । (వేద విద్య)
బ్రహ్మసూత్రపదైశ్చైవ (బ్రహ్మ విద్య)
హేతుమద్భి ర్వినిశ్చితైః (న్యాయ ప్రస్థానము)

**5.** మహా ఋషుల చేత వేదముల చేత
బహు విధముల నది చాల చెప్పబడెను
సహేతువుల తోన వినిశ్చితంబు నయిన
బ్రహ్మ సూత్రములు కూడ చాలా చెప్పెనట్లు

**6.** మహాభూతా న్యహంకారో
బుద్ధి రవ్యక్త మేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ
పంచ చేన్ద్రియగోచరాః ॥ (ప్రపంచము)

**6.** భూతములు గొప్పవి నహంకారంబు
బుద్ధి మరి నవ్యక్తమదియ మూలంబు
ఇంద్రియ దశకము లొకటి మనంబు
ఇంద్రియ గోచరములు పంచకంబు

**7.** ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం (ద్వైతములు)
సంఘాత శ్చేతనా ధృతిః । (ప్రపంచము)
ఏతత్ క్షేత్రం సమాసేన (శరీరము)
సవికార ముదాహృతమ్ ॥

**7.** కోరిక ద్వేషంబు సుఖము దుఃఖంబు
మరియు సంఘటన ధృతి చేతనంబు
చేరి వీని సముదాయంబు సవికారంబు
నీరీతి క్లుప్తముగ వినుము క్షేత్రమ్ము

**8.** అమానిత్వ మదంబిత్వమ్
అహింసా క్షాన్తి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచమ్
స్థైర్య మాత్మవినిగ్రహః ॥

**8.** అదంబిత్వమ్ము యమానిత్వమ్ము
క్షాంతి యహింసా యార్జవమ్ము
శుద్ధియు యాచార్యోపాసనమ్ము
ఆత్మ వినిగ్రహమ్ము స్థైర్యమ్ము

**9.** ఇన్ద్రియార్థేషు వైరాగ్య
అనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధి
దుఃఖదోషానుదర్శనమ్ ॥

(శ్రీమన్-న్యాస విద్య)
(బ్రహ్మజ్ఞానము)
(ఉపాసన)
(నిర్గుణోపాసన, తపస్సు)

**9.** ఇంద్రియార్థముల వైరాగ్యమ్ము
ఎందు నహంకార వివర్జితమ్ము
వ్యాధి జన్మ మృత్యువు జ్వరమ్ము
యందుండు దుఃఖ దోషాను దర్శనమ్ము

**10.** అసక్తి రనభిష్వంగః
పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ
ఇష్టానిష్టోపపత్తిషు ॥

**10.** అనాసక్తమును నిర్మమత్వమ్ము
దన పుత్ర దార గృహములందు
ఎన్న నిత్య సమ చిత్తత్వమ్ము
అనిష్ట యిష్టము లందు నందు

**11.** మయి చానన్యయోగేన
భక్తి రవ్యభిచారిణీ । (సగుణోపాసన)
వివిక్తదేశసేవిత్వమ్ (శ్రీమన్-న్యాస విద్య)
అరతిర్జనసంసది ॥

**11.** అవిచలిత మనన్య యోగమ్ము
దైవభక్తి నాయందుంచటమ్ము
వివిక్త దేశముల సేవనమ్ము
ఆవు జన సమూహా వర్జనమ్ము

**12.** అధ్యాత్మజ్ఞాననిత్యత్వం
తత్త్వజ్ఞానార్థదర్శనమ్ । (బ్రహ్మజ్ఞానము)
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమ్
అజ్ఞానం యదతోఽన్యథా ॥

**12.** అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వమ్ము
తవ్వ జ్ఞానార్థ దర్శనమ్ము
ఇది యంతము జ్ఞానమంద్రు
ఇది లేని దాని నాజ్ఞానమంద్రు

**13.** జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి
యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే । (శ్రీమన్-న్యాస విద్య)
అనాది మత్పరం బ్రహ్మ (భూమ విద్య)
న సత్తన్నా సదుచ్యతే ॥ (సద్విద్య)

**13.** కను జ్ఞేయమును గూర్చి చెప్ప బోదు
దేని దెలియగ గలుగు నమృతమ్ము
విను ఆదిలేని యా పరమబ్రహ్మ
యున్నదని లేనిదని చెప్పబడదు.

14. సర్వత్రః పాణిపాదం (పరమపురుష విద్య)
తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ । (వైశ్వానర విద్య)
సర్వత్రః శ్రుతిమ ల్లోకే (ఆకాశ విద్య)
సర్వ మావృత్య తిష్ఠతి ॥ (ఈశ విద్య) (సర్వ విద్య)

14. సర్వత్రము పాణి పాదమ్ము నగుచు
సర్వతోక్ష శిరో ముఖము నగుచు
సర్వత్రము శ్రుతి మంతమగుచు
సర్వము నావరించి నట్టి దగుచు

15. సర్వేన్ద్రియగుణాభాసం (ఉద్దాలక ఆరుణి విద్య)
సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ
నిర్గుణం గుణభోక్తృ చ ॥ (సర్వ విద్య)

15. సర్వేంద్రియ గుణా భాసమ్మునగుచు
సర్వేంద్రియ వివర్జితమ్ము నగుచు
సర్వభర్త యనాసక్తమ్ము నగుచు
సర్వభూత బాహ్యాంతరమ్ము నగుచు

16. బహిరన్తశ్చ భూతానాం (ఉద్దాలక ఆరుణి విద్య)
అచరం చరమేవ చ । (అంతర్యామి, అంగుష్ఠమాత్ర విద్య)
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం (శాండిల్య విద్య)
దూరస్థం చాన్తికే చ తత్ ॥ (సర్వాంతర, ఉషస్తికహోళ విద్య)

16. నిర్గుణమ్మునై గుణ భోక్త గూడ యగుచు
చరమ్మును నచరమ్ము నగుచు
మరి సూక్ష్మమ్ము నవిజ్ఞేయమగుచు
దూరస్థము మరి దగ్గరకు నగుచు

17. అవిభక్తం చ భూతేషు (అక్షరాక్షర విద్య)
విభక్తమివ చ స్థితమ్ । (సుపర్ణ విద్య)
భూతభర్తృ చ తజ్జ్ఞేయం (పరమపురుష విద్య)
గసిష్ణు ప్రభవిష్ణు చ ॥ (ఈశ విద్య)

17. సర్వ భూతముల నవిభక్తమ్ము నగుచు
మరి విభక్తముగ స్థితమ్ము నగుచు
సర్వభూతముల పుట్టించుదగుచు
సర్వభూతముల గిట్టించుదగుచు,
సర్వభూతముల భర్తయగుచు

18. జ్యోతిషామపి తజ్జ్యోతి (జ్యోతిషాంజ్యోతి విద్య)
స్తమసః పరముచ్యతే । (గాయత్రి, అంగుష్ఠమాత్ర విద్య)
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం (హృదయ, సత్యవిద్య)
హృది సర్వస్య విష్ఠితమ్ ॥ (శాండిల్య విద్య) (సర్వ విద్య)

18. సర్వజ్యోతులకు దాను జ్యోతి యగుచు
మరి తమసమున కావలయు నగుచు
పరమ జ్ఞానమ్ము జ్ఞేయము జ్ఞానమూలమ్ము
సర్వ హృదయములందు విష్ఠితమ్ము

19. ఇతి క్షేత్రం తథా జ్ఞానం (పరమపురుష విద్య)
జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏత ద్విజాయ (శ్రీమన్-న్యాస విద్య)
మద్భావాయోపపద్యతే ॥

19. అది సమాసముగనట్లు క్షేత్రంబు
ఇది జ్ఞానమ్ము మరియు జ్ఞేయమ్ము
నాదు భక్తుడిట్లు దెలిసి నతడు
చెందగలుగు నా భావమ్మునతడు

20. ప్రకృతిం పురుషం చైవ (సత్య విద్య)
విద్ధ్యనాదీ ఉభావపి । (స,తి,య విద్య)
వికారాంశ్చ గుణాంశ్చైవ
విద్ధి ప్రకృతిసమ్భవాన్ ॥

20. ప్రకృతికి మరి పురుషునికి గూడ
అరయు ఆది లేదెంత చూడ
మరి గుణ వికారములన్ని గూడ
ప్రకృతి సంభవము లందు జూడ

21. కార్యకరణ కర్తృత్వే (సుపర విద్య)
హేతుః ప్రకృతి రుచ్యతే । (పరమపురుష విద్య)
పురుష సుఖదుఃఖానాం (పురుష విద్య)
భోక్తృత్వే హేతు రుచ్యతే ॥

21. కార్య కారణ కర్తృత్వమందు
ప్రకృతి హేతువని యందు రందు
మరి సుఖ దుఃఖ భోక్తృత్వ మందు
పురుషుందు హేతువందు నిందు

**22.** పురుషః ప్రకృతిస్థో హి (సుపర్ణ విద్య)
భుంక్తే ప్రకృతిజా న్గుణాన్ । (పంచాగ్ని విద్య)
కారణం గుణసంగోఽస్య (పురుష, ఉపకోసల విద్య)
సదసద్యోనిజన్మసు ॥ (సత్యకామ విద్య)

**22.** ప్రకృతి యందుండి పురుషుండు
ప్రకృతీజంబులగు గుణము లందు
కారణంబు నది గుణ సంగంబు
మరి సదసద్‌యోని జన్మ పొందటంబు

**23.** ఉపద్రష్టానుమన్తా చ (సుపర్ణ విద్య)
భర్తా భోక్తా మహేశ్వరః । (పరమపురుష విద్య)
పరమాత్మేతిచాప్యుక్తో (పురుష విద్య)
దేహేఽస్మి న్పురుషః పరః ॥

**23.** పురుషుండు దాను దేహ మందుండి గూడ
పురుషుండు వేరు దేహముకు జూడ
పరమాత్మ పురుషుండు దేహమ్ము నందు
భర్త భోక్తసాక్షి పరమేశ్వరుండు

**24.** య ఏవం వేత్తి పురుషం (సుపర్ణ విద్య)
ప్రకృతించ గుణైః సహ । (పరమపురుష విద్య)
సర్వథా వర్తమానోఽపి (పురుష, శ్రీమన్-న్యాస విద్య)
న స భూయోఽభిజాయతే ॥ (సత్యకామ విద్య)

**24.** ప్రకృతి యది గుణ సహితంబు ననియు
పురుషుండు దేహమున సాక్షి యనియు
సరి తెలిసి యున్న వాడు తెలియు వాడు
మరి వాడెప్పుడును దాను పుట్టబోడు

**25.** ధ్యానేనాత్మని పశ్యన్తి (ఉపాసన)
కేచి దాత్మాన మాత్మనా । (నిర్గుణోపాసన)
అన్యే సాంఖ్యేన యోగేన (సగుణ ఉపాసన)
కర్మయోగేన చాపరే ॥ (పర్యంక విద్య)

**25.** కొందరు తమ యాత్మ ధ్యానంబు వలన
ఆత్మను యాత్మ యందు తెలియ గలరు
కొందరు వారు సాంఖ్య యోగంబు వలన
కందరు మరి కర్మ యోగంబు వలన

**26.** అన్యే త్వేనమజానన్తః (ఉపాసన)
శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే । (పర్యంక విద్య)
తేఽపిచాతితరన్త్యేవ
మృత్యుం శ్రుతిపరాయణాః ॥

**26.** మరికొందరు యట్లు తెలియలేని వారు
వేరు వారి నుండి విని యుపాసించు వారు
దా శ్రుతి పరాయణులైనట్టి వారు కూడ
యామృత్యువును తుది తరియించువారు

**27.** యావత్సంజాయతే కించిత్ (పంచాగ్ని విద్య)
సత్త్వం స్థావరజంగమమ్ । (సత్యకామ విద్య)
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ (ఉపకోసల విద్య)
తద్విద్ధి భరతర్షభ ॥

**27.** స్థావర జంగమంబులు కించిదంబు గూడ
యేవి కల్గుచున్నవి యన్నియును గూడ
మరి క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగంబు వల్ల
అవును గల్గు భరతర్షభ దెలియు దెలియు

**28.** సమం సర్వేషు భూతేషు (నాచికేత విద్య)
తిష్ఠన్తం పరమేశ్వరమ్ । (గార్గి అక్షర విద్య)
వినశ్య త్స్వవినశ్యన్తం (ఉషస్తి సర్వాంతర విద్య)
యః పశ్యతి స పశ్యతి ॥ (సర్వ విద్య)

**28.** సరి సమముగ సర్వ భూతంబులందు
చేరి తిష్ఠించి యుండు పరమేశ్వరంబు
మరి నవి నశించినను దా నాశంబుగాదు
నరయ నట్లు జూచు వాడు సరి చూచు వాడు

**29.** సమం పశ్యన్హి సర్వత్ర (ఉపస్తి పరాంతర విద్య)
సమవస్థిత మీశ్వరమ్ । (ఉద్దాలక అంతర్యామి విద్య)
న హినస్త్యాత్మనాఽఽత్మానం
తతో యాతి పరాం గతిమ్ ॥

**30.** ప్రకృత్యైవ చ కర్మాణి (పంచాగ్ని విద్య)
క్రియమాణాని సర్వశః । (ఉపకోసల విద్య)
యః పశ్యతి తథాఽఽత్మానం (సత్యకామ విద్య)
అకర్తారం స పశ్యతి ॥ (సుపర్ణ విద్య)

**31.** యదా భూతపృథగ్భావ
ఏకస్థ మనుపశ్యతి । (అక్షరాక్షర విద్య)
తత ఏవ చ విస్తారం
బ్రహ్మ సంపద్యతే తదా ॥

**32.** అనాదిత్వాన్ని ర్గుణత్వాత్ (పరమపురుష విద్య)
పరమాత్మాయ మవ్యయః । (సుపర్ణ విద్య)
శరీరస్థోఽపి కౌన్తేయ (గార్గి అక్షర విద్య)
న కరోతి న లిప్యతే ॥

**33.** యథా సర్వగతం సౌక్ష్మాత్ (ఆకాశ విద్య)
ఆకాశం నోపలిప్యత్తే । (ఉద్దాలక ఆరుణి, అంతర్యామి విద్య)
సర్వత్రావస్థితో దేహే (సర్వాంతర విద్య)
తథాఽత్మా నోపలిప్యతే ॥ (సర్వ విద్య)

**34.** యథా ప్రకాశమత్యేకః (గాయత్రి విద్య)
కృత్స్నం లోక మిమం రవిః (అంతరాదిత్య విద్య)
క్షేత్రక్షేత్రీ తథా కృత్స్నం (మధు విద్య, ఉషస్తి కహోళ విద్య)
ప్రకాశయతి భారత ॥ (సర్వాంతర విద్య)

**35.** క్షేత్రక్షేత్రజ్ఞ యోరేవ (సత్యకామ విద్య)
అంతరం జ్ఞానచక్షుషా । (ఉపకోసల విద్య)
భూతప్రకృతిమోక్షం చ (ఉషస్తికహోళ, శ్రీమన్-న్యాస విద్య)
యే విదు ర్యాన్తి తే పరమ్ ॥ (పర్యంక విద్య)

**29.** సరి సమముగ సర్వ భూతంబులందు
చేరి తిష్ఠించు పరమాత్మ తన యాత్మ చూడ
మరి యట్లు దెలియు వాడు హింసించ బోడు
పర యాత్మ దన యాత్మ మరి హింస యెట్లు

**30.** సర్వ కర్మలు క్రియా మాణంబులన్ని
ప్రకృతి చేతనని నీవు దెలిసియుండు
కర్త ఆత్మకాదని దా తెలియు వాడు
మరి విజము యతడె దా దెలియు వాడు

**31.** వేరని భూతములు యనిపించు చుండు
పరమున భూతములు ఏకస్థముండు
పరము నుండి భూతములు విస్తరించు
నరయ నట్లు జూచు వాడు బ్రహ్మ పొందు

**32.** నిర్గుణత్వమ్ము మరి యనాదిత్వమ్ము
పరమాత్మ వినుము నవ్యయమ్ము
శరీరస్థమై యుండియు కౌంతేయ జూడ
కర్త గాదు మరి లిప్యంబు గాదు.

**33.** ఏ యెట్లు సర్వ గతమై సూక్ష్మమైనందు వలన
నా యాకాశము దేని చేత నంట బడదు
ఆ యట్లు సర్వావస్థితమై దేహమందు వున్న
ఈ యాత్మ యెపుడు దేని చేత నంట బడదు

**34.** స్వ ప్రకాశమై దాను వెలుగుచున్నందు వలన
సర్వ లోకముల వెలిగించు ప్రభాకరుడు
నా రీతి స్వయము ప్రకాశింప జేయు చుండు
సర్వ క్షేత్రముల దన వెలుగు తోన విభుడు

**35.** క్షేత్ర క్షేత్రజ్ఞుల నంతరంబు నట్లు
దాతెలియు నెవరు జ్ఞాన చక్షు తోన
భూత ప్రకృతి మోక్షము తోవ దెలియ
చెందుచుండ్రు దాము పరమంబు వారు

ఇట్లు
క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగము
బ్రహ్మవిద్యల సమన్వయము

# 7

# శ్రీ బాదరాయణీయ బ్రహ్మసూత్ర బోధామృత లహరి

## పునరావలోకనము

### డా॥ ముద్దు రామకృష్ణ

| సూత్రములు | వివరములు |
|---|---|

**I-1- <u>సమన్వయము</u>**

**స్పష్ట బ్రహ్మలింగ వాక్య విచారణ**

**1. అథాతో బ్రహ్మజిజ్ఞాసా**

కావున బ్రహ్మమును తెలుసుకొనుటకు వివేచన, విచారణ

**2. జన్మాద్యస్య యతః**

దేని వలన ఈ జగమునకు జన్మస్థితి, మం లయములు కలుగునో అదియే బ్రహ్మము.

**3. శాస్త్రయోనిత్వాత్**

శాస్త్రములకు మూలము బ్రహ్మము. అన్ని శాస్త్రములు బ్రహ్మ నుండియే జనించినవి.

**4. తత్తు సమన్వయాత్**

బ్రహ్మము గురించి చెప్పిన వేదాంత వాక్యముల సమన్వయము ద్వారా పరబ్రహ్మమును దర్శించుకొనుట.

**5. ఈక్షతేర్నాశబ్దమ్**

ప్రధానము, మూల ప్రకృతి జగత్తునకు కారణము కాదు. ఈక్షించెను అనునది బ్రహ్మమునకే వర్తించును.

**10. గతి సామాన్యాత్**

బ్రహ్మమే జగత్కారణము

**12. ఆనందమయోఽభ్యాసాత్**

ఆనందమయుడంటే పరమాత్ముడే తప్ప జీవుడు కాదు.

17. జీవాత్మకు పరమాత్మకు భేదము.

22. పంచభూతముల సృష్టి క్రమము.

చిదాకాశము → ఆకాశము → వాయువు → తేజము → జలము → పృథివి

23. ప్రాణములో సమస్త భూతములు లయమవుతున్నాయి మరియు ఉద్భవిస్తున్నాయి.

24. జగత్తంతా ఆ బ్రహ్మము యొక్క మహిమ. ఒక పాదము సర్వభూతములు, మూడు పాదములు "దివి" యందున్నాయి.

25,26,27. గాయత్రీ బ్రహ్మవాక్యము

28. ప్రాణము బ్రహ్మము.

**సారము**

చిదాకాశము బ్రహ్మము, గాయత్రీ బ్రహ్మము, ముఖ్యప్రాణము బ్రహ్మము.

## I-2- అస్పష్ట బ్రహ్మ లింగ సంబంధ వాక్య విచారణ

32. సర్వం ఖల్విదం బ్రహ్మ
శ్రుతులు సర్వమునకు కారణము బ్రహ్మమయని చెప్పుచున్నవి.

33. ఉపాస్య దైవము బ్రహ్మము.

34. బ్రహ్మముయే ఉపాస్యుడు.

37. జీవునికి బ్రహ్మమునకు భేదము ఉన్నది.

38. అన్ని ఆకాశములలో ఉన్నది దేవుడే.

39. జీవాత్మ పరమాత్మ భేదము

40,41 బ్రహ్మము సర్వ భోక్త

43-54 హృదయగుహలో ఉన్న జీవాత్మ పరమాత్మలు, బ్రహ్మము గురించి విశ్లేషణ.

55-63 అశ్వపతిరాజు యొక్క వైశ్వానర విద్య. నారాయణ చేతితో గీసిన చిత్రము, వైశ్వానరుడు పరబ్రహ్మ శబ్దానికి వాచకము.

## I-3- జ్ఞేయ బ్రహ్మ సంబంధ వాక్య విచారణ

64+ అన్నిటికీ ఆయతనము, ఆధారము బ్రహ్మయే.

70. ద్వాసుపర్ణా Philosophy జీవాత్మ, పరమాత్మ.

71. నారదునికి సనత్కుమారుడు చెప్పిన “భూమ” విద్య. చిత్రము చూడుము.

73. “అక్షరం పరంబ్రహ్మపరమం”

74. అక్షరం పరంబ్రహ్మ

76. ఓంకారము - అ,ఉ,మ,మాత్రలు, వాటి వివరణ.

70-86. దహర - పరమాత్మ

87-88. అంగుష్ఠమాత్రము - పరమాత్ముడు

89-92. మనుష్యులకు దేవతలకు బ్రహ్మవిద్యాధికారము వున్నది.

94. మధు విద్య. ఆదిత్యుడే దేవతలకు మధువు.

96. దేవతలకు బ్రహ్మవిద్యాధికారము కలదు.

100. శూద్రుల గురించి విపులమైన వివరణ మరియు బ్రహ్మవిద్యకు అర్హత. సత్యకామ జాబాలి కథ. నారాయణ వాక్యము చదువవలెను. వజ్ర సూచికోపనిషత్తులో బ్రాహ్మణుడు ఎవరో

అతని గుణములు చెప్పబడినవి.

102-106. ఆ పరబ్రహ్మము వలననే జగములు, జీవులు జనించి, ప్రాణమంది చలించుచున్నవి. బ్రహ్మము గురించి వివరణ.

**I-4- బ్రహ్మము కాని వాని నిరాకరణ**

1 ప్రధానము-ప్రకృతి బ్రహ్మము కాదు.

108 బీజము మరియు దాని పూర్వపు స్థితి.

121-126 ప్రధానము ప్రకృతి జగత్ కారణము కావు.

127,128 జీవాత్మ, పరమాత్మ యొక్క భేదము.

134 వరకు పతంజలి యోగము, కపిల సాంఖ్యము నిరాకరింపబడుట.

## అవిరోధము

**II-1- సాంఖ్యాది మత నిరాకరణ**

II-1-11 వరకు

135-146 స్మృతి, సాంఖ్య మరియు వేరే Philosophies విమర్శించి కాదనుట.

147 బ్రహ్మ-ఉపసాన నిమిత్త కారణము.

149 జగత్తు, బ్రహ్మ వేరు కాదు.

154 ఒక బ్రహ్మము తెలిస్తే సర్వము, సృష్టి తెలుస్తుంది.

158 సృష్టించుటకు బ్రహ్మకు ఏ పదార్థములు అవసరము లేదు.

166 ఒక బ్రహ్మము తెలిస్తే సర్వము, సృష్టి తెలుస్తుంది "తమ ప్రయోజనం కొరకు తమకు అందరూ ప్రియులు" యాజ్ఞ్యవల్క్యుడు.

169 లయము జరిగినపుడు జీవుడి కర్మ బీజ రూపములో ఉంటుంది.

170 బ్రహ్మము, జగత్తుని సృష్టి చేయుచున్నది.

**II-2- శ్రుత్యసమ్మత మార్గ నిరాకరణ**

II-2-1 ప్రధానము గురించి చర్చ.

శ్రుతి అసమ్మతి మార్గము నిరాకరణ

172 ప్రధానము జగత్కారణము కాదు.

174 ప్రధానము - బ్రహ్మము సంబంధము

175 సాంఖ్యమతము సిద్ధాంతములు సరి అయినవు కావు.

189-203 బౌద్ధ మత వాదము

200 కల కల్ల తెలివి తేట.

204-207 జైన మత వాదము
208-212 మహేశ్వర మతము మరియు పాశుపత మతము వాదన.
213-216 పాంచరాత్రము-అసమ్మతము. దేవుణితో నలుగురు ఉన్నారు అనేది సమ్మతంకాదని బాదరాయణ మతము. ఆది శంకరాచార్య కూడా అదే అన్నారు.

## II-3-సాంఖ్యాది మత నిరాకరణ

217 ఆకాశము గురించి విషయము
218-220 బ్రహ్మము నుండి ఆకాశము పుట్టినది. పంచభూతముల సృష్టి క్రమము.
221 తపస్సే బ్రహ్మము.
222-224 ఆకాశము బ్రహ్మకార్యమే.
225 బ్రహ్మము అన్నిటికీ ఉత్పత్తి కారణము.
230 సృష్టి మరియు లయం, అనులోమ, విలోమ పద్ధతిలో జరుగుతుంది.
231 సృష్టి
232 జీవాత్మ నిష్క్రమణ
233 జీవాత్మ నిత్యత్వము
234-236 జీవాత్మ నిష్క్రమణ, మరల రావడము.
237-238 జీవాత్మ అనుపరిమాణం కలదు.
239-243 ఆత్మ శరీరంలో వ్యాపించి యుండుట ఎటులనో వివరణ.
244 బుద్ధి మరియు ఆత్మ ఒకటి కాదు.
245 అంగుష్ఠమాత్రం, జీవాత్మ పరిమాణము.
247 ఆత్మ పరమాత్మగా పరివర్తన యగుట
248 అంతఃకరణము
249-253 అంతఃకరణము; జీవాత్మయే కర్త
254 జీవాత్మ యొక్క అవశము-పూర్వకర్మల వలన మంచి కర్మలు చేయలేకపోవుట.
255 సమాధిలో కర్మల అభావము
256 కర్తృత్వం - మోక్షము
257 జీవుణి కర్తృత్వము
258 శుభాశుభ కర్మలు - జీవాత్మ పరమాత్మ సంబంధం. Karma Philosophy
259 జీవాత్మ-అవిద్య. అవిద్య తొలగిపోతే జీవాత్మ పరమాత్మ అవుతుంది.
260 సృష్టి, పరమాత్మ Jiva has the potential to be like Paramatma.
262-268 పరమాత్మ-జీవుల పనులలో, పుణ్యాపాపాలతో అంటి యుండదు. ఈ విషయము గురించి వివరణ.
269 పరమాత్మ-జీవుల; అంశీ, అంశ భావము.

## II-4- ప్రాణాదివాక్య విరోధ పరిహారము

270 సమస్త ఇంద్రియములు, ప్రాణము పరబ్రహ్మము నుండి ఉద్భవించినవి.

271 ప్రాణోత్పత్తి బ్రహ్మము నుండి జరిగినది.

272,273 భూతములు బ్రహ్మము నుండి వచ్చినవి.

274 సప్తప్రాణములు సప్తఇంద్రియములే. అగ్ని యొక్క ఏడు జ్వాలలు, ఏడు లోకములు ప్రకటనమైనవి.

276-279 ప్రాణాలకు ప్రాణము ముఖ్యప్రాణము బ్రహ్మము నుండి ఉత్పత్తి అయినదే. ఇంద్రియాలు జ్ఞానసాధనాలే కాని విభువులు కావు.

280 ప్రాణము జీవాత్మ యొక్క కరణము.

281 పంచ ప్రాణముల యొక్క పంచవృత్తులు.

282 ముఖ్యప్రాణము సూక్ష్మము, సర్వవ్యాపకము.

283 అగ్ని మొదలైన అధిష్ఠాన దేవతలు బ్రహ్మమే.

284 జీవాత్మ శరీరమునకు అధిష్ఠాత

285 జీవాత్మకు ఉత్పత్తి లేదు. బ్రహ్మముతోబాటు జీవాత్మ శరీరములో ప్రవేశించును.

286 ప్రాణము ఇంద్రియము అని చెప్పబడలేదు.

287,288 ప్రాణాల కన్నా ఇంద్రియాలు భిన్నమైనవి.

289 త్రివృత్కరణము (Important)

291 తేజము, జలము, అన్నముతో జగత్తు రచన జరిగింది. (పట్టిక చూడగలరు.) అది పరమేశ్వరుణి కార్యము. జీవాత్మని కాదు. మనము భుజించే అన్నము ప్రకారము మన మనస్సు ఉంటుంది.

298 జీవాత్మ సూక్ష్మ తత్త్వాలతో ఒక శరీరము నుండి ఇంకొక శరీరానికి వెళ్ళుతుంది.

## <u>సాధన</u>

## III-1- దేహాంతర గమనము

299 శుభకర్మల వలన శుభ ఉచ్చ జన్మ లభిస్తుంది.
అశుభ కర్మల వలన అశుభ జన్మలు పొందుతారు.

300 తిరిగి రావడము గురించి కర్ష్ణాజిని ఆచార్యుడు చెప్పిన విషయము

304 చంద్రలోకము-యమలోకము శుభాశుభ కర్మల వలన లభిస్తాయి.

305 శుభ, అశుభ కర్మలు చేయువారి గతి

306 రౌరవాది నరకములు

308 దేవయాన, పితృయాన జననమరణ రూపమైన మూడవ మార్గము గురించి

311 ఆత్మహత్య చేసుకొనువారు భయానక లోకములకు, మరల మరల ప్రాప్తి అగుదురు. (అసురలోకములకు)

313 జీవాత్మ శరీరములో ప్రవేశించు విధానము.

317,318 జీవాత్మ, ధాన్యము, వీర్యము ద్వారా వచ్చి స్త్రీ గర్భమున ఎటుల ప్రవేశించునో వివరణ.

## III-2- జీవాత్మ పరమాత్మ తత్త్వ విచారణ

322 స్వప్నములు-వివరణ-శుభాశుభ సూచకములు

**నారాయణ వాక్యము :**

ఆయన స్వప్నములు మరియు Trans-Visions నిజముగా మారిన సూచనలు

1) వ్యాస మహర్షి దర్శనము 2) బ్రహ్మ దర్శనము

3) అద్వయానంద స్వామి మంత్రార్థము చెప్పుట బరోడా వృత్తాంతము.

323 జీవన్ముక్తి : పరమాత్మ స్వరూపము స్వప్నము,మాయ/సర్వవ్యాపకత, Glory and Excellence Inner Dvine Forces will be expressed when jnana dawns.

325,326 సుషుప్తి అవస్థలో శాంతి, ఇంద్రియములకు, శరీరమునకు శాంతి

327 సుషుప్తి దాని నుండి లేచుట వివరములు

328 ముగ్ధావస్థ. దీనిలో బ్రహ్మానుభూతి ఉండదు. (SWOON, COMA)

329 Nature of Brahman. సాకార, నిరాకార లక్షణములు కలిగి యున్నది.

331 త్రిపుటి - నారాయణ వాక్యము.

బ్రహ్మలక్షణములు- వాటి ప్రాముఖ్యత

జంధ్యంలోని మూడు దారములు

అ,ఉ,మ, బిందువులు - అద్వైతము అవుట.

III-2-14

332 పరబ్రహ్మ నిరాకారము, సాకారము రెండు అయినా, నిరాకారమే, అరూపత్వమే ప్రధానము.

334 మహా వాక్యములు

342 Six methods of Valid Knowledge

నారాయణ వాక్యము : అనుభవాలు, స్వప్నముల వివరణ.

గీతా యాగము,

బ్రహ్మదర్శనము-స్వప్న సత్యము,

శ్రీమతి సుజనాదేవి గారి సారూప్య అనుభవము

Darshan Vision of Vyasa, Understanding of the above Vision.

344 ఉపాధి నివృత్తి కాగానే బ్రహ్మైక్యము అవుతుంది. బ్రహ్మము నిర్గుణమే.

349 సేతువు - పరమాత్మ.

4 పాదములు, 8 డెక్కలు, 16 కళలు

351 బ్రహ్మము నిరవయవము, నిరాకారము.

359 పరబ్రహ్మమే కర్మఫల నిర్ణేత.

## III-3-1 అంతరంగ సాధన

360 రకరముల ఉపాసనలు శ్రుతులలో చెప్పబడినవి. వీటి ద్వారా బ్రహ్మము సాధ్యము.

361 పంచాగ్ని విద్య : సూత్రము 292 చూడుము రకరకాల అగ్నులు.

362 శిరోవ్రతము. బ్రహ్మ విద్య కొరకు అవసరము.

365 ప్రాణ విద్య

366 ఉద్గీథ విద్య

368 ఓంకార ఉపాసన

369 ప్రాణ విద్య

370 ఆనందము–ఆత్మ–బ్రహ్మము.
పంచకోశములు–రెండు పక్షి బొమ్మల రూపకల్పన,
ప్రాణాగ్నిహోత్ర విద్య– పట్టిక

371 ఆంనదమయ–ఆత్మ–బ్రహ్మము రూపకల్పన–పట్టిక

375–377 పంచకోశములు–ముందు కవరు పేజీ

378 శాండిల్య విద్య (అగ్ని రహస్య విద్య)

382 సత్య విద్య, శాండిల్య విద్య, దహర విద్య, ఉపకోసల విద్య – ఇవన్నీ వేరు వేరు.

383 పురుష యజ్ఞము – ఛాందోగ్య ఉపనిషత్తు

385 బ్రహ్మ ప్రాప్తి – వివరణ

386 మరణ సమయములో జ్ఞానికి పుణ్యపాపముల వీడిపోతాయి.

387 యమ నియమ ఫలం. (Important)

388 దేవయాన మార్గము
రెండు మార్గములు

389 ఇచ్చటనే ముక్తి బ్రహ్మజ్ఞానికి. సగుణ&నిర్గుణ ఉపాసనా ఫలాలు. గతుల ప్రాప్తి.

390 దేవయాన మార్గ మజిలీలు

391 Destination for all types of souls. Liberated and non-liberated ones.
బ్రహ్మవేత్తలు భగవంతుణి ఆదేశముతో మరల జన్మ తీసుకొనవచ్చును.

392 బ్రహ్మ తత్త్వం

393 "ద్వాసుపర్ణ" Philosophy of two birds on the Same tree

394 సర్వాంతర విద్య

401 ఓంకారోపాసన ఉత్కృష్టము.

402 సంవర్గ విద్య – ప్రాణము, వాయువు వేరు వేరు, వాటి విద్యలు వేరు వేరు.

403 అగ్ని రహస్యము.
36,000 అగ్నుల వివరణ, మన జీవితముతో పోల్చుట
36,000 మనోవృత్తులు.
ఈ అగ్నులు మనోవృత్తులు ఒక్కటియే.

404 1. ఏ ఫలము యజ్ఞయాగాదుల వలన లభిస్తుందో ఆ ఫలము, జపము, భజన, చింతన, మానసిక క్రియ ద్వారా లభిస్తుంది.

2. నచికేతాగ్ని - వివరణ.

413 ఆత్మానాం రథినం విద్ధిః, ఆత్మ-శరీరం వేరు వేరు.

414 ప్రతీకోపాసన - ఓంకారము, గాయత్రీ మంత్రము ఉపాసన సర్వజన సమ్మతము.

III-3-57

416-420 వైశ్వానర విద్య

విద్యలు : సర్వవిద్య, భూవిద్య, ఉపకోసల విద్య, శాండిల్య విద్య, వైశ్వానర విద్య, ఆనందమయ విద్య, అక్షర విద్య, ఎన్నియో కలవు.

ఉపాసనా పద్దతి - నారాయణ వాక్యము.

సూ॥ 416 నుండి 420 వరకు

417 కర్మ, ఉపాసన, కర్మానుష్ఠానము.

నారాయణ వాక్యము, నారాయణ భావము (Important)

425 బ్రహ్మ ఋత్విక్కు - Leadership

## III-4-1 బహిరంగ సాధన

పురుషార్థాధికరణము - ఈశ విద్య - (శ్రీమన్-న్యాసవిద్య)

426 ఆత్మజ్ఞాని శోకము నుండి తరిస్తూన్నాడు. ఆత్మజ్ఞానము, బ్రహ్మజ్ఞానము వలననే మోక్షము పురుషార్థము లభిస్తుంది. (బాదరాయణ అభిమతము)

బ్రహ్మవిదాప్నోతి పరం తై.II-1.

428 "ఆచార్య దర్శనాత్". ఆచార్యులను అనుసరించి తరించుట. ఉదా: జనకుడు, అశ్వపతి, ఉద్దాలకుడు, యాజ్ఞవల్క్యుడు.

433 విద్య అనేది కర్మ శేషము కాదు.

జ్ఞానము స్వతంత్రముగనే మోక్ష సాధనమని బాదరాయణుల మతము. ఇదియే సరియైనది.

434 ఉపనిషత్తులలో రెండు తీర్ల ఆచారము చెప్పబడినది.

జ్ఞానము : జనక, అశ్వపతి, ప్రవాహణుడు, అజాతశత్రు, రాజులు గృహస్థులై యజ్ఞములు చేసినారు. జీవన్ముక్తులైనారు. బిక్షాచరణము చేసి విరక్తులు, సన్న్యసించి, కర్మలు త్యజించి బ్రహ్మభూతులైనారు.

436 బ్రహ్మ జ్ఞానులకు కర్మలు ఇచ్చటనే నశించును. వారు కేవలం విద్యాబలము చేతనే బ్రహ్మననుభవించుచుందురు. వారికి రాకపోకడలు లేవు.

438 జ్ఞానము చేత బ్రహ్మము పొందుట

440 కొందరు విద్వాంసులు తమ పూర్వ ప్రకృతిననుసరించి జీవితాంతము కర్మలు చేయుచుందురు. మరికొందరు కర్మత్యాగము చేయుదురు. జ్ఞానులకు స్వాతంత్రమున్నది. వారి కర్మత్యాగము, కర్మము, రెండూ చేయుదురు.

441 Important III-4-16 నారాయణ వాక్యము బ్రహ్మవిద్యచే కర్మలు నశించును.
Karma and Jnana Philosophy explained

442-445 "బ్రహ్మవిద్యాధికారము" ఏ ఆశ్రమమునకు కలదు?
అందరూ అర్హులే-ఊర్ధ్వ రేతస్కులైన, బ్రహ్మ-చర్యము పాటించువారు అర్హులు.
See Flow Chart Diagram of బ్రహ్మవిద్యాధికారులు Opp Sutra 443.
Study the Commentary in Detail for abocve Sutras.

448 ఉపనిషత్తులలో ఉన్న విద్య కర్మాంగము కాదుయని బాదరాయణుల వారు నిశ్చయించినారు.
ఆయన జైమినికి మరియు ఇతర ఋషులకు ఇచ్చిన మాన్యత
"సర్వం జ్ఞానే పరిసమాప్యతే" దీని వివరణ చూడుము.

450 బ్రహ్మార్పణం : నారాయణ వాక్యము.

451 నారాయణ వాక్యము - కర్మ-జ్ఞానం-Comparison
కర్మము జ్ఞానమునకు దారి తీస్తుంది.

452 శమ దమ-షడ్గుణ సంపత్తు ఇవన్నీ మోక్షమునకు దారి తీయును.
See Chart శమదమాదుల మిత్రుత్వం అరిషడ్వర్గం.

453 ప్రాణపాయ పరిస్థితుల్లో నిషిద్ధమైన ఆహారం తినడం వాటి నియములు ఒక కథ.

454 ఆహార నియమాలు-శుద్ధి

456 పంచమహాపాపములు

457 ఆయా ఆశ్రమాల ధర్మములు పాటించవలెను. బ్రహ్మజ్ఞానము ప్రాప్తి అయినా కూడా పాటించవలెను. ఋషి గుణములు. బృ. ఉపనిషత్తు.

458 బ్రహ్మవిద్యకు కర్మ సహాయపడుతుంది. కర్మలోక సంగ్రహం కోసం బ్రహ్మజ్ఞానులు విముక్తులు చేయవలెను.

459 నిత్యకర్మలు జ్ఞానానికి సహాకార్యులు కాని జ్ఞానము, విద్య కర్మాంగము కాదు.

461 మంథెని అవధూతలు.
గొల్లగంగులు, పార్వతమ్మ, అవధానుల సరోజన, మధుసూదన్-గృహస్థ సాదువు.

462 శబరి, హస్తమాలక, జడభరతుడు, సూర్యభాస్కరేంద్ర సరస్వతి బ్రహ్మవిద్యా నిపుణులు.

463 గృహస్థులు, భార్య మరియు భర్తలను పోగొట్టుకున్నవారు, బీదవారు బ్రహ్మజ్ఞానము ధ్యానము, ఉపాసన, జపం ద్వారా పొందగలరు.

464 సన్యాసులు చ్యుతులు కాకూడదు.

465 వొజ్జల సిద్ధాంతిగారు బ్రహ్మానుభూతిపొందివారు.
యతులు చ్యుతి నొందకూడదు.
యతిధర్మము. నారాయణ వాక్యము. మంథనిలోని రామకృష్ణానందస్వాములవారు బ్రహ్మభూతులు.

466 చ్యుతులైనచో ప్రాయశ్చిత్తం - విచారణ

467 ఉపపాతికం - మహాపాతకం ప్రాయశ్చిత్తం గురించి నారాయణ వాక్యము.
సంత్‌జ్ఞానదేవ్ మహారాజ్ మరియు ఆయన తండ్రి జీవిత చరిత్ర ఈ సంబంధంలో

రెండు విధాల చర్చ ఇవ్వబడినది.
468 పతనమైన ఆశ్రమవాసులు – ఆత్రేయ మహర్షి మతము.
469 యజ్ఞము చేయు యజమానికే దాని ఫలము సమకూరును.
473 గృహస్థాశ్రమములో నాలుగు ఆశ్రమముల భావమున్నది.
475 బ్రహ్మజ్ఞాని బాలునివలె ఉంటాడు
476 బ్రహ్మజ్ఞానం ఏ జన్మలో ప్రాప్తిస్తుంది?
కర్మశేషం లేని జన్మలో

## <u>ఫలము</u>

### IV-1-1 జీవన్ముక్తి

478 ఉపాసనలో అభ్యాసం మరల మరల చేయవలెను.
నారాయణ అనుభవాలు – నారాయణ వాక్యంలో గీతాయోగం (18) రోజులు చేయడం.
479 1. సూర్యుడు అతని పుత్రుడు కౌశీతకీ సంవాదము – ఉద్గీథ ఉపాసన
2. ఉద్దాలకుడు – శ్వేతకేతువు "తత్త్వమసి"
3. వరుణుడు – భృగువు – "తపమే బ్రహ్మము" ఉపదేశం – ఆవృత్తి
480 "తత్త్వమసి", "అహం బ్రహ్మాస్మి"
శంకరాచార్యులవారు "ఏకశ్లోకి" లో చెప్పినారు.
481 ప్రతీకోపాసన
482 శ్రీమతి సుజనాదేవి గారి – శ్రీ లలితాంబికాదేవి వృత్తాంతము (బ్రహ్మదృష్టిరుత్కర్షాత్)
నారాయణ వాక్యము : స్వానుభావము ఆదిత్య ప్రకాశ కిరాణాలు.
బరోడాలో నారాయణ గారి అనుభవం.
"జ్యోతిర్దర్శనాత్" జ్యోతిదర్శనము.
Relevant Photographs, Sun and Washington, Sun and Meditation నారాయణ అనుభవము
484 ఉపాసన కొరకు ఆసనము
485 వ్రాయడం కూడా ఒక ధ్యానమే.
486 వ్రాయడం కొరకు అచంచలంగా ఉండడం ధ్యానము, ధ్యానము కొరకే.
నారాయణ వాక్యము : స్థిరత్వం–కదలిక–రెండింటి వివరణ.
488 ధ్యానం కోసము పద్ధతి – స్థల నిర్ణయము. గోదావరి జలము కొరకు
నారాయణ తపస్సు – అనుకూలమైన స్థలములో ధ్యానము చేయవలెను.
489 **నారాయణ వాక్యము :** మృత్యువు వచ్చు నప్పటి వరకు నిరంతర ఉపాసన చేయవలెను.
ఉదాహరణములు : చొప్పకట్ల చంటయ్య, మహాత్మాగాంధి

IV-1-3

490 బ్రహ్మజ్ఞానం కలిగిన తరువాత పూర్వోత్తర పాపాలు నశిస్తాయి. తామరాకు మీద నీరు

అంటనట్లు “జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం” జరుగుతుంది.

491 “భిద్యతే హృదయగ్రంథిః
ఛిద్యంతే సర్వసంశయః”
బ్రహ్మజ్ఞానులకు పాపపుణ్యాలు నశించుతాయి.

492 బ్రహ్మజ్ఞానులకు శరీరం విడిచేవరకు ప్రారబ్ధ కర్మ ఉంటుంది. మోక్షప్రస్తావన. మూడు రకాలు కర్మలు.

493 విద్వాంసులు, జ్ఞానులు కర్మలాచరించుట లోక సంగ్రహము కొరకే.

494 జ్ఞాని కర్మలాచరించినను బద్ధుడు కాడు. కామ్యకర్మలు జ్ఞానోత్పత్తికి ఉపకారాలు కావు.

496 జ్ఞాని యొక్క కర్మలు దగ్ధమవుతాయి. ప్రారనబ్ధకర్మ మిగిలి ఉంటుంది.

## IV-2-1 ఉత్క్రాంతి

దేహత్యాగం ఎలా జరుగుతుంది?

497,498 How the Senses (అంతఃకరణ) Gather into themselves before death

505-507 సూక్ష్మశరీరం గురించి విషయము.

508,509 బ్రహ్మజ్ఞాని ఇచటనే పరబ్రహ్మమును పొందును.

510 Gathering of Prana and Senses at death and Moksha for Jivanmukta

511,512 ఇంద్రియ విలీనము
See the Last Para on exit of "Sukshma Sharira" of Brahma Jnani

513 సగుణ బ్రహ్మవేత్త నిష్క్రమణ ఆయన పోవుదారి.

514 జ్ఞాని - పోయేదారి

516 పయనము - వివరణ
దక్షిణాయన ఉత్తరాయణ మార్గములు.

517 ఈ విషయంలో భగవద్గీత ఏమి చెప్పినది.

## IV-3-1 దేవయాన మార్గము

518 అర్చిరాది మార్గము

519 దేవయాన మార్గము (Flow Chart)

522 అర్చిరాది మార్గములో ప్రయాణము

527 కార్యబ్రహ్మ, అపరబ్రహ్మలోక ప్రాప్తి. బ్రహ్మజ్ఞానులు పొందుట
విద్యోపాసకులు పరబ్రహ్మ ప్రాప్తిని పొంది ముక్తులగుదురు.

530 బ్రహ్మనాడీ దారి.

532 ప్రతీకోపాసన చేయువారి దారి, బ్రహ్మజ్ఞాని దారి

533 పై సూత్రము విషయములో చర్చ.

## IV-4-1 విదేహముక్తి

534 జ్ఞాని తన సంకల్పముతో వివిధమైన లోకములకు వెళ్లుతాడు.

535 పరమాత్మను పొందిన ఉపాసకుడు సమస్త బంధముల నుండి విముక్తుడగును.
536 జ్యోతి అంటే ఆత్మయే. ముక్తి అనేది ఉపాసకుని దగ్గరనే ఉన్నది. సదా తనలోనే ఉన్నది.
537 ముక్తపురుషుడు, బ్రహ్మముతో అవిభక్త రూపములో ఉంటాడు.
ఆ బ్రహ్మకంటే వేరైనది, విభక్తమైనది వేరు ఏమీ లేదు.
538-544 ముక్తపురుషుని స్థితి. See Chart
జైమిని, ఔడులోమి, బాదరి, బాదరాయణ అభిమతములు. (538,539,540 సూత్రములు)
543-545 ముక్తాత్మస్థితి See Chart (543,544,545 సూత్రములు)
548 ముక్తాత్మ సమస్త శరీరములందు ప్రవేశజంచి దివ్యలోక భోగములను అనుభవించగలడు.
ఇవి లీలా మాత్రముకాని బంధన కారకములే గాని, పునర్జన్మ కారకులే గాని కావు.
549 ముక్తాత్మ.... మనస్సులో భోగాలననుభవించుట.
550 Liberated Souls have all powers except సృష్టి, స్థితి, లయ of Brahman.
Creation, Maintenance & Destruction is the sole prerogative of Brahman.
551 **నారాయణ వాక్యము :** ముక్తపురుషులు బ్రహ్మ సమానులే కాని బ్రహ్మము కారు.
555 **అనావృత్తి శబ్దాత్** చివరి సూత్రము
సగుణోపాసకులు కార్యబ్రహ్మకు ప్రళయకాలము సమీపించినపుడు జ్ఞానం ఉదయించి, కార్యబ్రహ్మ పరబ్రహ్మ రూపమునందినపుడు, ఆ కార్యబ్రహ్మతో బాటు పరబ్రహ్మ స్వరూపము పొందుతారు.
నిర్గుణ జ్ఞాన సంపన్నులైన వారికి ఆవృత్తి లేనే లేదు. ఆవృత్తి లేనే లేదు. (పునర్జన్మ లేదు)

## బ్రహ్మసూత్రముల తాత్పర్యము

సాధనలో వ్యక్తి ఉపాసనగా **స్పష్ట బ్రహ్మలింగ వాక్య విచారణ, అస్పష్ట బ్రహ్మలింగ సంబంధ వాక్య విచారణ, జ్ఞేయ బ్రహ్మ సంబంధ వాక్య విచారణ, బ్రహ్మము కాని వాని నిరాకరణ** మరియు **సాంఖ్యాదిమత నిరాకరణ, శ్రుత్యసమ్మత మార్గ నిరాకరణ, స్వావిరోధ నిరూపణ, ప్రాణాది వాక్య విరోధ పరిహారము** చేసి **దేహాంతర గమనము** విషయములో **జీవాత్మ పరమాత్మ తత్వ విచారణ** చేసి **అంతరంగ సాధన, బహిరంగ సాధన**తో పాటు చేసి నిర్గుణోపాసన వలన **జీవన్ముక్తి** నంది దేహపాతమైన వెంటనే **విదేహముక్తి** అయి తానే అయిన బ్రహ్మముగా నుండుట కాని సగుణోపాసన వలన **ఉత్క్రాంతి** తర్వాత **దేవయాన మార్గము**ను నంది బ్రహ్మసమాన స్వరూపము అందుట కాని బ్రహ్మ సూత్రముల తాత్పర్యము, మహావాక్యముల లక్ష్యము

# 8

# బ్రహ్మతత్త్వ సమీకరణ అక్షరమాల

# EQUATIONS - LETTERS AND SPIRIT

**16.12.1998**

| | | |
|---|---|---|
| A=B | Atman = Brahman | The inlight is supreme light. |
| B=C | Brahman = Consciousness | The supreme one is conciousness in all |
| C=D | Consciousness = Divinity | Conciousness in all is Divinity shining every where |
| D=E | Divinity = Energy | Divine one appears as Energy in physical world |
| E=F | Energy = Fire | Energy is same as Fire in the belly |
| F=G | Fire = God | Fire is First God in Vedas |
| G=H | God = Highest | God is the Highest, there is nothing higher |
| H=I | Highest = Inspiring | Highest one every where is Inspiring one inside |
| I=J | Inspiring = Judge | Inspiring one inside is also inner Judge |
| J=K | Judge = Kindest | Judge inside is Kind to all |
| K=L | Kindest = Loving | Kindest one is Loving all |
| L=M | Loving = Magnanimous | Loving one is Magnanimous giver |
| M=N | Magnanimous = Nature | Magnanimous giver is Nurturing nature |
| N=O | Nature = One | This Nature is That One |
| O=P | One = Power | Original one is Universal power |
| P=Q | Power = Quality | Power of universe is pure quality |
| Q=R | Quality = Reality | Pure Quality is Final reality. |
| R=S | Reality = Spirit | Final Reality is Spirit of all. |
| S=T | Spirit = Totality | Spirit of all is Totality of everything. |
| T=U | Totality = Universe | Totality of everything is This Universe |
| U=V | Universe = Vision | Universe is the Vision of supreme one |
| V=W | Vision = Winner | Vision of supreme one is Winner every time |
| W=X | Winner = Xcellence | Winner every time is Xcellence everywhere |
| X=Y | Xcellence = You | Xcellence is You. |
| Y=Z | You = Zenith | You are Zenith of this creation |
| Z=A | Zenith = Atman in all | Zenith of divinity is consciousness in All |

**Atman-Brahman-Consciousness-Divinity-Energy-Fire-God-Highest-Inspiring-Judge-Kindest-Loving-Magnanimous-Nature-One-Power-Quality-Reality-Spirit-Totality-Universe-Vision-Winner-Xcellence-You-Zenith are all that supreme one.**

***EVERY LETTER CONTAINS SPIRIT***

***EVERY PERSON CONTAINS DIVINITY***

***THIS = THAT***

***THIS IS THAT***

***THIS (EQUATION) IS THAT (EQUALISER)***

# 9
# శ్రీ బ్రహ్మవాక్య రత్నావళి

108 ఉపనిషత్తులలోని అధ్యాత్మిక రత్నములైన 1008 మహావాక్యములను శ్రీరామచంద్రుల వారు ఆంజనేయులకు తెలిపినట్లు ఇతిహాసము. ఉపనిషత్తులందు, బ్రహ్మసూత్రములందు, భగవద్గీతయందు బ్రహ్మతత్వమను ప్రకాశమును అధ్భుతముగా వెలిగించి తెలిపే ఆ వాక్యములు 20 ప్రకరణములలో పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ రామచంద్రేంద్ర సరస్వతి (శ్రీరామచంద్రయతి) వారిచే "మహావాక్య రత్నావళి" అనే అద్భుత రచనలో కూర్చబడినవి. ఈ శ్రీ బ్రహ్మవాక్య రత్నావళికి శ్రీ వెంపటి అమ్మన్న శాస్త్రి గారు (శ్రీ సదానందేంద్ర సరస్వతి) అద్భుతమైన వ్యాఖ్యానము-వివరణ వ్రాసినారు. అందులో వున్న వివిధ ప్రకరణములు మరియు వాక్యములు ఈక్రింది విధము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **1.** | **విధి వాక్యములు** | **66** | **11.** | **నానాలింగ వాక్యములు** | **32** |
| **2.** | **బంధ మోక్ష వాక్యములు** | **31** | **12.** | **పుంలింగ వాక్యములు** | **30** |
| **3.** | **అవిద్యన్నిందా వాక్యములు** | **21** | **13.** | **స్త్రీలింగ వాక్యములు** | **12** |
| **4.** | **జగన్మిధ్యా వాక్యములు** | **33** | **14.** | **నపుంసకలింగ వాక్యములు** | **39** |
| **5.** | **ఉపదేశ వాక్యములు** | **54** | **15.** | **ఆత్మ స్వరూప వాక్యములు** | **40** |
| **6.** | **జీవబ్రహ్మైక్య వాక్యములు** | **38** | **16.** | **సర్వ స్వరూప వాక్యములు** | **40** |
| **7.** | **మనన వాక్యములు** | **39** | **17.** | **బ్రహ్మ స్వరూప వాక్యములు** | **93** |
| **8.** | **జీవన్ముక్తి వాక్యములు** | **119** | **18.** | **అవశిష్ట స్వరూప వాక్యములు** | **36** |
| **9.** | **స్వానుభూతి వాక్యములు** | **118** | **19.** | **ఫల వాక్యములు** | **40** |
| **10.** | **సమాధి వాక్యములు** | **50** | **20.** | **విదేహముక్తి వాక్యములు** | **77** |

బ్రహ్మస్వరూప వాక్యములకు చెందిన 93 వాక్యములలో ప్రతి వాక్యము బ్రహ్మమును గూర్చి చెప్పబడినది.

పరబ్రహ్మము యొక్క తెలియరాని, చెప్పరాని అనంత రూపాన్ని అద్భుతంగా చెప్పటానికి యత్నము చేసిన ఈ 93 వాక్యములను, వాటి అర్థములను తెలిసికొని ఆనందించటానికి స్వాగతము.

# బ్రహ్మవాక్యములు - ఉపనిషత్తులు

మహావాక్య రత్నావళిలోని 93 బ్రహ్మవాక్యములలో ప్రతి వాక్యములో బ్రహ్మము గూర్చి అద్భుతముగా చెప్పబడినది. ఈ వాక్యములన్నీ కలిపి చూస్తే బ్రహ్మము యొక్క విభూతి, పరమాత్వ తత్త్వము ప్రకాశించి కొంత అవగాహన అవుతుంది.

ఈ 93 వాక్యములలో 88 వాక్యములు 33 ఉపనిషత్తుల నుండి ఎన్నుకొనబడినవి. ప్రతి వాక్యము చివర ఆ వాక్యము ఏ ఉపనిషత్తులో ఎక్కడ వున్న విషయము తెలుపబడినది. అయితే మిగతా 5 వాక్యముల ఉపనిషత్సంబంధములు రహస్యముగానే వున్నాయి. అటువంటి ఉపనిషత్తులను 'అనామిక ఉపనిషత్తు' అని ఇక్కడ అనబడినది.

బ్రహ్మవాక్యముల ఉపనిషత్తుల సంబంధము ఉపనిషత్తులు - బ్రహ్మవాక్య సంఖ్యలు" అనే తరువాతి పేజీలోని సూచికలో చూడవచ్చు.

93 వాక్యముల నుండి అన్నింటికన్న ఎక్కువ 18 వాక్యములు తేజోబిందూపనిషత్తుకు చెందినవి. తరువాత మహానారాయణ ఉపనిషత్తు-14, అన్నపూర్ణ ఉపనిషత్తు-8, కఠరుద్ర-4, ఆత్మ-4, వాక్యములు కలవు. మిగతా ఉపనిషత్తులలో 3,2,1 గా వున్నాయి. 19 ఉపనిషత్తులలో ఒకే వాక్యము వున్నది.

ఆ వాక్యములు ఏ సందర్భములో చెప్పబడినదో ఆయా ఉపనిషత్తులలో చూడవచ్చును.

# శ్రీ బ్రహ్మావాక్య రత్నావళి ప్రకాశము

| | | |
|---|---|---|
| 1. | సర్వంహ్యేతద్ బ్రహ్మ | మాం.ఉ. -2 |
| *2. | అయమాత్మా బ్రహ్మ | మాం.ఉ. -2 |
| *3. | సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ | తై.ఉ. II-1 |
| *4. | ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ | ఐ.ఉ. III-3 |
| *5. | తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనంతరబాహ్యమ్ అయమాత్మాబ్రహ్మ సర్వానుభూః | బృ.అ.ఉ. IV-5-19 |
| *6. | విజ్ఞానమానందం బ్రహ్మ | మహో.ఉ. II-3 |
| 7. | అజరో అమరో అమృతో అభయో బ్రహ్మాభయం వై బ్రహ్మ | బృ.అ.ఉ. VI-4-25 |
| 8. | సర్వభూతస్థమేకం నారాయణం కారణ పురుషం అకారణం పరంబ్రహ్మోమ్ | నారాయణ.ఉ.-4 |
| 9. | స్వయం ప్రకాశః స్వయం బ్రహ్మ | అనామికోపనిషత్తు |
| 10. | తదేతద ద్వయం స్వప్రకాశం మహానందం ఆత్మైవత దమృతం అభయం ఏతద్ బ్రహ్మ | నృ.ఉ.తా.ఉ.IX-1 |
| 11. | సదేవపురస్తాత్ సిద్ధం బ్రహ్మ | నృ.ఉ.తా.ఉ.IX-4 |
| 12. | ఆకాశవత్సూక్ష్మం కేవలసత్తామాత్ర స్వభావం పరం బ్రహ్మ | అనామికోపనిషత్తు |
| 13. | అద్వితీయం అఖిలోపాది వినిర్ముక్తం తత్సకలశక్త్యుపబృంహితమనాద్యనంతం శుద్ధం శివం శాంతం నిర్గుణమిత్యాది వాచ్యమనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ | నిరాలంబోపనిషత్తు-3 |
| 14. | ఏకమేవాద్వితీయం బ్రహ్మ | పైంగలోపనిషత్తు-12 |
| 15. | సర్వదా అనవిచ్ఛిన్నం పరంబ్రహ్మ | యోగచూడామణి ఉపనిషత్తు -14 |
| 16. | (భ్రూమధ్యే) సచ్చిదానంద తేజః కూటరూపం తారకం బ్రహ్మ | మండలబ్రాహ్మణోపనిషత్తు -2 |
| 17. | తన్నిత్యముక్తమ్ అవిక్రియం సత్యజ్ఞానానంతానంద పరిపూర్ణం సనాతనమ్ ఏక మేవాద్వితీయం బ్రహ్మ | పైంగల ఉపనిషత్తు-2 |
| 18. | చిత్స్వరూపం నిరంజనం పరంబ్రహ్మ | మహానారాయణ ఉపనిషత్తు-7 |
| 19. | తత్త్వం పదలక్ష్యం ప్రత్యగభిన్నం బ్రహ్మ | పైంగల ఉపనిషత్తు |
| 20. | అఖండార్థం పరంబ్రహ్మ | బహ్వృచోపనిషత్తు-2 |
| 21. | సర్వకాలాబాధితం బ్రహ్మ | మహానారాయణోపనిషత్తు-4 |

# శ్రీ బ్రహ్మవాక్య రత్నావళి ప్రకాశము

1. ఈ సంపూర్ణ జగత్తు నిశ్చయముగా బ్రహ్మరూపమే

*2. ఈ ఆత్మయే ఆ బ్రహ్మము.

*3. బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతమునైయున్నది.

*4. ప్రజ్ఞయే ప్రతిష్ఠించబడియున్నది, ప్రజ్ఞానమే బ్రహ్మము

*5. ఈ ఆత్మ అపూర్వము, పరములేనిది, అనంతరము, బాహ్యము లేనిది, అదియే పరబ్రహ్మము. సర్వ స్వరూపముతో సర్వమును అనుభవించుచున్న ఈ ఆత్మయే పరబ్రహ్మ స్వరూపము అని ఉపదేశము.

*6. విజ్ఞానము ఆనందము బ్రహ్మము

7. ఈతడు అజరుడు, అమరుడు, అమృతుడు, అభయస్వరూపమగు పరబ్రహ్మము.

8. సర్వభూతములందు స్థితమైన ఒక నారాయణుడే కారణపురుషుడై తనకు వేరు కారణము లేనివాడైన పరబ్రహ్మ, ఓం.

9. తానంతతాను ప్రకాశమై, తానై వున్నది బ్రహ్మము.

10. ఆ ఈ అద్వయము, స్వప్రకాశము, మహానందము అయిన
ఆత్మయే అమృతము, అభయము. బ్రహ్మ అభయము-అభయమే బ్రహ్మ.

11. సత్తుయై ముందుగానై సిద్ధమై వున్నది బ్రహ్మము

12. ఆకాశమువలె సూక్ష్మము మరియు కేవలము సత్తామాత్రమైన స్వభావము కలది పరబ్రహ్మము.

13. అద్వితీయము, సకలోపాధి నిర్ముక్తము, సర్వశక్తి సంపన్నము, ఆద్యంతములు లేనిది, శుద్ధమైనది, మంగళకరమైనది, శాంతమైనది, నిర్గుణమైనది, అనిర్వచనీయమునైదియును అయిన చైతన్యమే పరబ్రహ్మ.

14. ఒకటియే, రెండవది లేనిది, బ్రహ్మము

15. ఎప్పుడును అఖండమైనది పరబ్రహ్మ

16. భ్రూమధ్యమున సచ్చిదానంద ప్రకాశపుంజము, తరింపచేయునది బ్రహ్మము

17. ఆ సద్వస్తువైన బ్రహ్మము నిత్యముక్తము, అవికారము, అవిక్రియము, సత్యజ్ఞానానందమున పరిపూర్ణము, సనాతనము, ఒకటియే మరి రెండవది లేనిది.

18. పరబ్రహ్మము చైతన్యరూపము మరియు దేనినినంటనిది మరియు అన్నిటికన్నా పరమైనది.

19. "తత్-త్వమ్" - "అదియే నీవు" అన్న పదముకు లక్ష్యమై, ప్రత్యగాత్మకు (జీవాత్మకు) అభిన్నమైనది బ్రహ్మము.

20. "అఖండమునకు అర్థము పరబ్రహ్మము".

21. సర్వకాలాములందుండునిది బ్రహ్మము.

**22.** సగుణ నిర్గుణ స్వరూపకం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**23.** ఆదిమధ్యాంత శూన్యం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**24.** మాయాతీత గుణాతీతం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**25.** అనంతమప్రమేయమఖండ పరిపూర్ణం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**26.** అద్వితీయ పరమానంద నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్యస్వరూప వ్యాపకాభిన్న పరిచ్ఛిన్నం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**27.** సచ్చిదానంద స్వప్రకాశం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**28.** మనోవాచామగోచరం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**29.** అఖిల ప్రమాణాగోచరం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**30.** దేశతః కాలతో వస్తుతః పరిచ్ఛేద రహితం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–4

**31.** తురీయం నిరాకారమేకం బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–5

**32.** అద్వైతమనిర్వాచ్యమ్ బ్రహ్మ — మహానారాయణోపనిషత్తు–5

**33.** శివం ప్రశాంతం అమృతం పరం బ్రహ్మ — శాండిల్య ఉపనిషత్తు–II–1

**34.** యదేతమక్షరం నిష్క్రియం శివం సన్మాత్రం పరంబ్రహ్మ — శాండిల్య ఉపనిషత్తు–III–1

**35.** అసావాదిత్యో బ్రహ్మ — సూర్యోపనిషత్తు–2

**36.** ఓం ఇత్యేతదక్షరం పరంబ్రహ్మ — తారసారోపనిషత్తు–2

**37.** బ్రహ్మైవ ఇదమమృతం పురస్తాద్ బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ — ముండక ఉపనిషత్తు–II–2–12

**38.** అథోర్ధ్వంచ ప్రస్రుతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టమ్ — ముండకోపనిషత్తు–II–1–12

**39.** తదేవ నిష్కళం బ్రహ్మ. నిర్వికల్పం నిరంజనం — అమృతబిందూపనిషత్తు–8

**40.** చైతన్యమేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి — త్రిపురతాపిని ఉపనిషత్తు

**41.** బ్రహ్మ శబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకం — శుకరహస్యోపనిషత్తు–23

**42.** ఏతద్భావ వినిర్ముక్తం తద్బ్రహ్మ బ్రహ్మ తత్పరం — తేజోబిందూపనిషత్తు

**43.** చిన్మాత్రాత్పరం బ్రహ్మ, చిన్మాత్రా న్నాస్తికోపిహి — తేజోబిందూపనిషత్తు–II–35

22. సగుణ నిర్గుణ రూపకము బ్రహ్మము

23. ఆది, మధ్య, అంతములేనిది బ్రహ్మము

24. మాయాతీతము, గుణాతీతము బ్రహ్మము

25. అనంతము, అప్రమేయము, అఖండము, పరిపూర్ణము బ్రహ్మము

26. అద్వితీయము, పరమానందము, నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య స్వరూపము, వ్యాపకాభిన్నము, అపరిచ్ఛిన్నము బ్రహ్మము

27. సచ్చిదానంద స్వప్రకాశము బ్రహ్మము

28. మనోవాచామగోచరము బ్రహ్మము

29. అఖిల ప్రమాణములకు అగోచరము బ్రహ్మము.

30. దేశ, కాల, వస్తుపరిచ్ఛేదరహితము బ్రహ్మము

31. తురీయము, నిరాకారము, ఏకము బ్రహ్మము

32. అద్వైతము, అనిర్వాచ్యము బ్రహ్మము

33. శివము, ప్రశాంతము, అమృతము, పరబ్రహ్మము.

34. ఏదైతే అక్షరము, నిష్క్రియము, శివము, సన్మాత్రముయో అది పరబ్రహ్మము.

35. ఈ ఆదిత్యుడే ఆ బ్రహ్మము

36. ఓం అను ఈ అక్షరము పరబ్రహ్మము

37. ఇది అంతయును అమృతమైన బ్రహ్మరూపమే. ముందు, వెనుక, పైన, క్రింద, దక్షిణ దిక్కున, ఉత్తర దిక్కున అంతటనూ, అంతయునూ ఆ బ్రహ్మములోనే నిండివున్నది.

38. పైన, క్రింద, ఈ ప్రపంచమంతయు ఆ బ్రహ్మములోనే నిండివున్నది.

39. అట్టి బ్రహ్మ నిష్కళము గాను, నిర్వికల్పముగాను, నిరంజనము గాను వున్నది.

40. అన్నింటియందున్న చైతన్యము యొకటియే కనుక నాయందున్న ప్రజ్ఞానము కూడా బ్రహ్మము.

41. బ్రహ్మ శబ్దముతో చెప్పబడిన ఆ పరబ్రహ్మము స్వప్రకాశకముయైన ఆత్మయే.

42. ఈ జగద్భావము నుండి విడువబడినది ఆ బ్రహ్మము.
తద్ (అది) అని అనబడిన బ్రహ్మము అన్నిటికన్నా పరమైనది.

43. చిద్రూపముగానుండుటవలన బ్రహ్మము పరమ ఉత్కృష్టమైనది. చిన్మాత్రముకన్న పైన ఎవరును లేరు, ఏదియును లేదు.

**44.** అఖండైకరసం బ్రహ్మ చిన్మాత్రాన్నహివిద్యతే — తేజోబిందూపనిషత్తు-II-35

**45.** సదోదితం పరం బ్రహ్మ జ్యోతిషాముదయో యతః — తేజోబిందూపనిషత్తు-II-42

**46.** యస్మిన్ సంలీయతే శబ్దః తత్పర బ్రహ్మగీయతే — బ్రహ్మవిద్యాఉపనిషత్తు-13

**47.** సర్వశక్తి పరంబ్రహ్మ నిత్యమాపూర్ణమద్వయం — అనామికోపనిషత్తు

**48.** సత్తాసర్వపదార్థానాం గమ్యం బ్రహ్మేభిదం పరం — అనామికోపనిషత్తు

**49.** పరబ్రహ్మ పరంతత్త్వం సచ్చిదానంద లక్షణం — యోగశిఖా ఉపనిషత్తు-2

**50.** అక్షరం పరమం బ్రహ్మ నిర్విశేషం నిరంజనం — యోగశిఖా ఉపనిషత్తు-3

**51.** బ్రహ్మైవేకం అనాద్యంతం అబ్ధివత్ ప్రవిజృంభతే — అన్నపూర్ణోపనిషత్తు V-2

**52.** నకించిద్భావనాకారం యత్తద్బ్రహ్మ పరం విదుః — అన్నపూర్ణోపనిషత్తు V-6

**53.** ఏకేమేవాద్వయం బ్రహ్మ నేహానానాస్తి కించన — మహానారాయణోపనిషత్తు-3

**54.** బ్రహ్మైవ విద్యతే సాక్షాత్ వస్తుతోఽ వస్తుతోఽ పిచ — పాశుపతబ్రాహ్మణ ఉపనిషత్తు-8

**55.** తద్విద్యా విషయం బ్రహ్మ సత్యజ్ఞాన సుఖాద్వయం — కఠరుద్రోపనిషత్తు-5

**56.** శాంతంచ తదతీతంచ పరబ్రహ్మ తదుచ్యతే — యోగశిఖోపనిషత్తు-6

**57.** అనుభూతిపరం తస్మాత్సారం బ్రహ్మేతి కథ్యతే — అన్నపూర్ణ ఉపనిషత్తుIII-2

**58.** యదిదం బ్రహ్మ పుచ్ఛాఖ్యాం సత్యజ్ఞాన ద్వయాత్మకం — కఠరుద్రోపనిషత్తు-7

**59.** సద్రూపం పరమం బ్రహ్మ త్రి పరిచ్ఛేద వర్జితమ్ — కఠరుద్రోపనిషత్తు-7

**60.** తద్బ్రహ్మానందం అద్వందమ్ నిర్గుణం సత్య చిద్ఘనం — వరాహోపనిషత్తు II-60, కఠరుద్రోపనిషత్తు-8

**61.** సర్వాదిష్ఠానమద్వందం పరబ్రహ్మ సనాతనమ్ — రుద్రహృదయోపనిషత్తు-4

44. అఖండైక రసమైన బ్రహ్మము చిన్మాత్ర కన్న వేరు కాదు.

45. జ్యోతులు దేని నుండి ఉద్భవించినవో ఆ పరబ్రహ్మ సత్తు నండి వచ్చినది.

46. దేని యందు శబ్దము పూర్తిగా లీనమగుచుండునో అది పరబ్రహ్మమని గానము చేయబడుచున్నది. (దేనియందు అ,ఉ,మ, బిందువుల శబ్దమైన ఓంకారము పూర్తిగ లీనమగుచుండునో అదియే మౌన స్వరూపమైన పరబ్రహ్మమని గానము చేయబడెను.)

47. సర్వశక్తిమయమైన ఆ పరబ్రహ్మము నిత్యము. ఎల్లపుడుండునది, పరిపూర్ణము మరియు అద్వితీయము.

48. సర్వపదార్థములందుండు సత్తా-సత్తు-సత్యము-సత్త్వము-అయినది పరబ్రహ్మమని అనబడు పరమ పదము.

49. పరమతత్త్వము మరియ సద్-చిద్-ఆనంద లక్షణమైనది పరబ్రహ్మము.

50. ఎప్పుడును నశించనిది అన్నింటికిని పరమైనది అయిన
బ్రహ్మము నిర్విశేషమై గుణములులేనిది, నిరంజనమై దేనిని అంటనిది.

51. బ్రహ్మము ఒకటియే మరియు ఆది అంతములేనిది.
అది సముద్రమువలె (మాయ వలన) బాగుగ విజృంభించుచున్నది.

52. (సర్వసంకల్పములు శాంతించినపుడు) ఏ కొంచెమును భావానాకారము లేనిదిగా వుండునో
అదియే బ్రహ్మమని విదులు ఎరుగుదురు, తెలిసికొందురు.

53. ఒకటియే, రెండవది లేని, ఏ కొంచెమును వేరు లేనిది బ్రహ్మము.

54. వస్తువుగాను, అవస్తువుగాను కూడా బ్రహ్మమే యున్నది.

55. విద్యావిషయమైన ఆ బ్రహ్మము సత్య, జ్ఞాన, సుఖ స్వరూపమైనది.
(సత్య జ్ఞానానంద రూపము) అద్వయమును అయి వున్నది.

56. శాంతము శాంత్యతీము పరబ్రహ్మమని చెప్పబడినది.

57. అనుభూతిపరమైన దాని నుండి సారమైనదే బ్రహ్మమని చెప్పబడును.

58. బ్రహ్మపుచ్ఛమన్నదేది యున్నదో అది సత్యజ్ఞాన ద్వయాత్మకమై వున్నది.

59. సద్రూపమైన పరబ్రహ్మము త్రిపరిచ్ఛేద రహితమైనది.
(త్రిపరిచ్ఛేదములనగా మూడు చీలికలు సత్వము, రజస్సు, తమస్సుల ఛాయలైన సంశయములు, కామనలు, వాసనలనే మూడు చీలకలే త్రిపరిచ్ఛేదములు. బ్రహ్మము ఏ చీలికలు లేని పరిపూర్ణ, పరిశుద్ధ, పరమ సద్రూపము).

60. ఆ బ్రహ్మము ఆనందము, అద్వందము, నిర్గుణము, సత్య చిద్ఘనము

61. సర్వాధిష్ఠాన అద్వందము అయిన ఆ పరబ్రహ్మము సనాతనము.

**62.** ప్రజ్ఞానమేవ తద్బ్రహ్మ సత్యప్రజ్ఞాన లక్షణం | వరాహ ఉపనిషత్తు II-2
**63.** అస్తీత్యుక్తే జగత్సర్వం సద్రూపం బ్రహ్మ తద్భవేత్ | వరాహోపనిషత్తుII-6
**64.** భాతీత్యుక్తే జగత్సర్వం భావం బ్రహ్మైవ కేవలం | వరాహోపనిషత్తుII-6
**65.** బ్రహ్మమాత్రం చిదాకాశం సచ్చిదానంద మద్వయం | తేజోబిందూపనిషత్తు-VI-49
**66.** బ్రాహ్మణోఽన్యత్పరం నాస్తి బ్రాహ్మణోన్య జగన్నచ | తేజోబిందూపనిషత్తు-VI-49
**67.** బ్రాహ్మణోన్యదహంనాస్తి బ్రాహ్మోణ్యన్యత్ఫలం నహి | తేజోబిందూపనిషత్తు-VI-50
**68.** బ్రాహ్మణ్యోన్యత్తృణం నాస్తి బ్రాహ్యణోన్యత్పదం నహి | తేజోబిందూపనిషత్తు-VI-51

**69.** బ్రాహ్మణ్యోన్యద్గురున్నాస్తి బ్రాహ్యణోన్యదసద్వపుః | తేజోబిందూపనిషత్తు-VI-51
**70.** నిత్యానందమయం బ్రహ్మకేవలం సర్వదా స్వయం | తేజోబిందూపనిషత్తు-VI-102

**71.** బీజమాయా వినుర్ముక్తం పరం బ్రహ్మేతి కథ్యతే | అనామికోపనిషత్తు
**72.** మద్రూపమద్వయం బ్రహ్మ ఆదిమధ్యాంత వర్జితమ్ | వాసుదేవ.ఉ.-6
**73.** సర్వత్రవస్థితం శాంతం చిద్బ్రహ్మేతి అభిదీయతే | అన్నపూర్ణ ఉపనిషత్తుV-3
**74.** సిద్ధాంతోధ్యాత్మ శాస్త్రాణాం సర్వాపహ్నవ ఏవహి | అన్నపూర్ణ ఉపనిషత్తుV-14

**75.** నా విద్యాస్తీ హ నోమాయా శాంతం బ్రహ్మేమక్లమః | అన్నపూర్ణోపనిషత్తు V-14
**76.** స్వాత్మన్యారోపితాశేషాభాస వస్తు నిరాసత | అధ్యాత్మోపనిషత్తు 6
**77.** స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణమద్వయ మక్రియం | అధ్యాత్మోపనిషత్తు 6

**78.** రామఏవ పరబ్రహ్మ రామఏవ పరం తపః | రామరహస్య ఉపనిషత్తు-3
**79.** రామఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మ తారకం | రామరహస్య ఉపనిషత్తు-3
**80.** చిద్రూప మాత్రం బ్రహ్మైవ సచ్చిదానంద మద్వయం | తేజోబిందూపనిషత్తు III-26
**81.** ఋతం సత్యం పరం బ్రహ్మ సర్వసంసార భేషజం | దర్శన ఉపనిషత్తు IX-1
**82.** బ్రహ్మ చిద్బ్రహ్మ భువనం బ్రహ్మభూతపరంపరా | అన్నపూర్ణ ఉపనిషత్తు V-3

62. ప్రజ్ఞానమే అయిన ఆ పరబ్రహ్మ సత్య ప్రజ్ఞాన లక్షణము గలది.

63. అస్తి అన్నచో సర్వజగత్తు సద్రూపమైన ఆ బ్రహ్మము యగును.

64. భాతి, వెలుగుచున్నది, అన్న ఈ జగత్తు కేవలము బ్రహ్మమే.

65. బ్రహ్మరూపమైన చిదాకాశము సచ్చిదానందము మరియు అద్వయము - రెండవది కానిదై వున్నది.

66. బ్రహ్మము కన్న వేరు ఏమీ లేదు. బ్రహ్మము కన్న వేరు జగత్తు కూడా లేదు.

67. బ్రహ్మము కన్న వేరు "నేను" అనునది ఏమీ లేదు. బ్రహ్మము కన్న వేరు ఫలమేదియును లేదు.

68. బ్రహ్మము కన్న వేరు ఏ కొంచమైన, గడ్డిపోచయైనను లేదు.
బ్రహ్మము కన్న ఇతరమైన పదము కూడా లేదు.

69. బ్రహ్మము కన్న వేరు గురువు ఎవరు లేదు. బ్రహ్మము కన్న వేరు అసత్తు అనే శరీరము కూడ లేదు.

70. బ్రహ్మము ఎల్లపుడు ఆనందమయము.
బ్రహ్మము ఎల్లపుడును కేవలముగా స్వయముగా, తానే ఒకటిగానుండునది.

71. మూల ప్రకృతియైన బీజమాయ నుండి వదలబడినది పూర్ణచైతన్యమైనది పరమ బ్రహ్మ అని అన బడును.

72. 'నేను' అనబడే రూపము ఒకటియే, రెండవది లేని బ్రహ్మము మొదలు, మధ్య, తుది లేనిది.

73. అన్ని చోట్లను ఎప్పుడూ వున్న బ్రహ్మము శాంతము చైతన్యముగా అనుభూతి అగుచున్నది.

74. సిద్ధాంతము (బ్రహ్మ సూత్రములు) మరియు అధ్యాత్మ శాస్త్రముల (ఉపనిషత్తులు) ప్రకారము బ్రహ్మము కన్నవేరైనది అంతా మిథ్య అని తీసివేయబడవలెను.

75. అవిద్య, మాయలేని ఈ బ్రహ్మము దుఃఖములేనిదై శాంతమైనది, స్వచ్ఛమైన శమ రూపమైనది.

76. ఈ అసత్య పదార్థ ప్రపంచమంతయు బ్రహ్మమైన ఆత్మయందే ఆరోపించబడినది.

77. ఆరోపిత ప్రపంచమును నిరసించగా పూర్ణము అద్వయము,
క్రియారహితమైన పరబ్రహ్మ స్వయము తానె అగును, వుండును.

78. రాముడే పరబ్రహ్మ, రాముడే పరమ తపము

79. రాముడే పరమ తత్త్వము, శ్రీరాముడే తారక బ్రహ్మము

80. చిద్రూపమాత్రమైన బ్రహ్మమే సచ్చిదానందము అద్వయము

81. ఋతము, సత్యము అయిన పరమ బ్రహ్మము సర్వసంసారమునకు ఔషధము

82. బ్రహ్మము చిత్తు, చైతన్యము. బ్రహ్మము ఈ భువనము. భూతపరంపర అయిన ఆకాశము, వాయువు, తేజము, జలము, పృథివి అంతా బ్రహ్మమే.

**83.** బ్రహ్మాహం బ్రహ్మ చిచ్ఛత్రు బ్రహ్మచిన్మాత్ర బాంధవా అన్నపూర్ణోపనిషత్తు V-3

**84.** బ్రహ్మరూపతయా బ్రహ్మకేవలం ప్రతిభాసతే ఆత్మోపనిషత్తు-4

**85.** జగద్రూపం తథాప్యేత ఏద్బ్రహ్మైవ ప్రతిభాసతే ఆత్మోపనిషత్తు-4

**86.** విద్యావిద్యాది బేధేన భావాభావాది భేదత,
గురుశిష్య భేదేన బ్రహ్మైవ ప్రతిభాసతే ఆత్మోపనిషత్తు-4

**87.** ఇదం బ్రహ్మపరం బ్రహ్మ సత్యం బ్రహ్మ ప్రభుర్విసః తేజోబిందూపనిషత్తు-VI-37

**88.** కాలో బ్రహ్మ, కలా బ్రహ్మ సుఖం బ్రహ్మ స్వయం ప్రభం తేజోబిందూపనిషత్తు-VI-37

**89.** ఏకం బ్రహ్మ ద్వయం బ్రహ్మ మోహో బ్రహ్మ శమాదికం తేజోబిందూపనిషత్తు-VI-36

**90.** దోషోబ్రహ్మ గుణోబ్రహ్మ దమః శాంతః విభుః ప్రభుః తేజోబిందూపనిషత్తు-VI-36

**91.** లోకో బ్రహ్మ గురుర్బ్రహ్మ శిష్యో బ్రహ్మ సదాశివః తేజోబిందూపనిషత్తు-VI-37

**92.** పూర్వం బ్రహ్మ పరం బ్రహ్మ శుద్ధం బ్రహ్మ శుభాశుభం తేజోబిందూపనిషత్తు-VI-37

**93.** జీవ ఏవ సదా బ్రహ్మ స్వయం బ్రహ్మ సనాతనమ్ తేజోబిందూపనిషత్తు-VI-38

శ్రీ బ్రహ్మవాక్య రత్నావళి
సంపన్నము

83. బ్రహ్మమునేనే. బ్రహ్మమనే చైతన్యము శత్రువు, బ్రహ్మమనే చైతన్యము మిత్రులు, బాంధవులు.

84. బ్రహ్మరూపములో కేవలము పరబ్రహ్మమే ప్రకాశించుచున్నది. బ్రహ్మము వంటిది మరి వేరేది లేదు.

85. సమస్త జగము రూపములో బ్రహ్మమే స్వయము ప్రకాశిస్తున్నది.

86. విద్య అవిద్య అను భేదములో మరియు భావము, అభావము అను భేదములో
మరియు గురుశిష్య భేదములో బ్రహ్మమే వెలుగుచున్నది.

87. ఇది అంతా బ్రహ్మము. ఈ దాని కన్న మించినది, పరమైనది కూడా బ్రహ్మమే.
బ్రహ్మసత్యము. అతడే, ఆ బ్రహ్మమే ప్రభువు.

88. కాలము బ్రహ్మము, కళ, సుఖము, స్వయము వెలిగేది బ్రహ్మము.

89. ఒకటి, రెండు, మోహము మరియు శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అన్నియు బ్రహ్మమే.

90. దోషము బ్రహ్మము, గుణము బ్రహ్మము, మరియు దమము, శాంతము, విభువు, ప్రభువు అంతా బ్రహ్మమే.

91. లోకులు, లోకములు, గురువు, శిష్యుదు సదాశివము అయిన బ్రహ్మమే.

92. పూర్వము-పరము, శుభము-అశుభము, శుద్ధము అన్నియు బ్రహ్మము.

93. జీవుడు ఎప్పుడును బ్రహ్మమే. స్వయము బ్రహ్మము సనాతనము. తనంతట తానే ప్రకాశిస్తున్నది.

ఇట్లు

**శ్రీ బ్రహ్మవాక్య రత్నావళి ప్రకాశము సంపన్నము**

[**నారాయణ వాక్యము :** మహావాక్య రత్నావళిలో చెప్పబడిన వివిధ వాక్యముల సంఖ్యలు శ్రీ బ్రహ్మవాక్య రత్నావళిలో చూసినాము. ఇవి శ్రీ రామచంద్రయతి రచించిన "మహావాక్య రత్నావళి" మరియు శ్రీ వెంపటి అమ్మన్న శాస్త్రి గారు రచించిన "మహావాక్య రత్న ప్రభావళి" ప్రకారము ఉన్నవి.]

# ఉపనిషత్తులు - బ్రహ్మావాక్య సంఖ్యలు

| | | |
|---|---|---|
| 1. | తేజోబిందు ఉపనిషత్తు | 18 |
| 2. | మహానారాయణ ఉపనిషత్తు | 14 |
| 3. | అన్నపూర్ణ ఉపనిషత్తు | 8 |
| 4. | కఠరుద్ర ఉపనిషత్తు | 4 |
| 5. | ఆత్మ ఉపనిషత్తు | 3 |
| 6. | పైంగల ఉపనిషత్తు | 3 |
| 7. | యోగశిఖ ఉపనిషత్తు | 3 |
| 8. | వరాహ ఉపనిషత్తు | 3 |
| 9. | బృహదారణ్యక ఉపనిషత్తు | 2 |
| 10. | మాండూక్య ఉపనిషత్తు | 2 |
| 11. | నృసింహ ఉత్తరతాపిన్యుపనిషత్తు | 2 |
| 12. | ముండక ఉపనిషత్తు | 2 |
| 13. | అధ్యాత్మ ఉపనిషత్తు | 2 |
| 14. | శాండిల్య ఉపనిషత్తు | 2 |
| 15. | రామరహస్య ఉపనిషత్తు | 2 |
| 16. | తైత్తిరీయ ఉపనిషత్తు | 1 |
| 17. | ఐతరేయ ఉపనిషత్తు | 1 |
| 18. | మహా ఉపనిషత్తు | 1 |
| 19. | నారాయణ ఉపనిషత్తు | 1 |
| 20. | నిరాలంబ ఉపనిషత్తు | 1 |
| 20. | యోగచూడామణి ఉపనిషత్తు | 1 |
| 22. | మండల బ్రాహ్మణ ఉపనిషత్తు | 1 |
| 23. | బహ్వృచ ఉపనిషత్తు | 1 |
| 24. | సూర్య ఉపనిషత్తు | 1 |
| 25. | తారసార ఉపనిషత్తు | 1 |
| 26. | త్రిపురతాపిని ఉపనిషత్తు | 1 |
| 27. | అమృతబిందు ఉపనిషత్తు | 1 |
| 28. | శుకరహస్య ఉపనిషత్తు | 1 |
| 29. | బ్రహ్మవిద్య ఉపనిషత్తు | 1 |
| 30. | పాశుపత బ్రాహ్మణ ఉపనిషత్తు | 1 |
| 31. | వాసుదేవ ఉపనిషత్తు | 1 |
| 32. | దర్శన ఉపనిషత్తు | 1 |
| 33. | రుద్ర హృదయ ఉపనిషత్తు | 1 |
| 34. | అనామిక ఉపనిషత్తు | 5 |
| | | మొత్తం 93 వాక్యములు |

# 10

# అనుబంధము

# మహా వాక్య రత్నావళి

**శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య రామచంద్రయతి**
**కృత ఈశావాస్యాది అష్టోత్తర శతోపనిషదా సార సంగ్రహం**

మూలవ్యాఖ్య : **శ్రీ వెంపటి అమ్మన్న శాస్త్రి గారు**
**(శ్రీ సదానందేంద్ర సరస్వతి స్వామి గారు)**

సంశోధన ప్రచురణ : **శ్రీ వెంపటి విశ్వేశ్వర రావు, డా॥ హరి శివ కుమార్**

సేకరణ, ప్రస్తుతి : **నారాయణ**

## మహావాక్య రత్న ప్రభావళి (1920)

**నుండి సంపాదకులు (1988) డా॥ హరి శివ కుమార్** గారి
సమ్మతితో మరియు సౌజన్యముతో ఈ మహావాక్య రత్నావళి సేకరించబడినది.

ఓం
శ్రీ గణేశాయ నమః  శ్రీ సద్గురవేన్నమః

# మహా వాక్య రత్నావళి

## అవతారిక

**శ్లో॥ యో విధ్యాది విదేహాన్త మహావాక్యార్థ విగ్రహః ।**
**శ్రీరామచన్ద్ర రూపాయ తస్మై భూతాత్మనే నమః ॥**

మూలం॥ యః పూజ్యో యతిభి స్స్వధర్మ నిరతైర్ధ్యాయన్తి యం యోగినో ।
యేనాత్తం నిగమాన్తవేద్యమనిశం యస్మై హవిర్దీయతే ।
యస్మాత్థావర జఙ్గమం సమభవద్యస్యాం శమానోఽవరో ।
యస్మిన్లీనమిదం ప్రణౌమి సతతం తం వాసుదేవం గురుమ్ ॥

**శ్లో॥ నత్వా శ్రీవాసుదేవేన్ద్ర పాదపఙ్కేరుహద్వయమ్ ।**
**గ్రథ్యతేవై మహావాక్యరత్నావళిరియం మయా ॥**

మూలం॥ అథఖలు ఋగ్వేదాది విభాగేన వేదాశ్చత్వార ఈరితాః ।
తేషాంశాఖా హ్యనేకాస్స్యుస్తాసూపూపనిషద స్తథా ॥

ఋగ్వేదస్యతు శాఖాస్స్యు రేక వింశతి సంఖ్యయా ।
నవాధికశతం శాఖాయజుషో మారుతాత్మజ ॥

సహస్ర సంఖ్యయా జాతాః శాఖాస్సామ్నః పరన్తప ।
అధర్వణస్య శాఖాస్స్యుః పఞ్చాశద్భేదతో హరే ॥

ఏకై కస్యాస్తు శాఖాయా ఏకైకోపనిషన్మతా ।
తాసామేకా మృచం యేన పఠ్యతే భక్తితో మయి ॥

సమత్సాయుజ్య పదవీం ప్రాప్నోతి మునిదుర్లభాం ।
మాణ్డూక్య మేకమేవాలం ముమూక్షూణాం విముక్తయే ॥

తథాప్యసిద్ధంచేద్జ్ఞానం దశోపనిషదం పఠ ।
జ్ఞానం లబ్ధ్వాచిరాదేవ మామకం ధామ యాస్యసి ॥

తథాపి దృఢతా నోచే ద్విజ్ఞానస్యాఞ్జనాసుత ।
ద్వాత్రిం శాఖ్యోపనిషదం సమభ్యస్య నివర్తయ ॥

విదేహముక్తా విచ్ఛేచే దష్టోత్తర శతం పఠ ॥

మూలం॥ తత్రైక వింశతి (౨౧) శాఖా ఋచః । నవాధిక
శత (౧౦౯) శాఖా యజుషః । సహస్ర (౧౦౦౦) శాఖా
స్సామ్నః । పఞ్చాశ (౫౦) చ్ఛాఖా అధర్వణస్య ॥ ఏకైక
శాఖాయా మైకైకోపనిషత్ ॥ - అహత్యాశీతి సహిత
శతాధిక సహస్ర (౧౧౮౦) సంఖ్యాకాః ఉపనిషదః ॥
తాసు రామచన్ద్రేణ రామ దూతాయ సారతరోపని
షదోఽష్టోత్తరశత (౧౦౮) సంఖ్యాకాః ఉపదిష్టాః ॥
తథాచ ముక్తికోపనిషత్యాఽష్టోత్తర శతోపనిషన్నామ శ్లోకాలిఖ్యన్తే ॥

**శ్లో॥ ఈశ కేన కఠ ప్రశ్న ముణ్డ మాణ్డూక్య తి త్తిరిః ।**
**ఐతరేయఞ్చ ఛాన్దోగ్యం బృహదారణ్యకం తథా ॥** (మొదటి 10 ఉపనిషత్తులు)

**బ్రహ్మకైవల్య జాబాల శ్వేతాశ్వో హంస ఆరుణిః ।**
**గర్భో నారాయణో హంసో బిన్దు నాద శ్శిర శ్శిఖా ॥**

**మైత్రాయణీ కౌషీతకీ బృహజ్జాబాల తాపనీ ।**
**కాలాగ్ని రుద్ర మైత్రేయీ సుబాల క్షురి మంత్రికా ॥** (మొదటి 32 ఉపనిషత్తులు)

**సర్వసారం నిరాలమ్బం రహస్యం వజ్రసూచికమ్ ।**
**తేజో నాద ధ్యాన విద్యా యోగతత్వాఽత్మబోధకమ్ ॥**

**శ్లో॥ పరివ్రా ట్త్రిశిఖీ సీతా చూడా నిర్వాణ మణ్డలమ్ ।**
**దక్షిణా శరభం స్కన్దం మహానారాయణాహ్వయమ్ ॥**

**రహస్యం రామతపనం వాసుదేవఞ్చ ముద్గలమ్ ।**
**శాణ్డిల్యం పైఙ్గలం భిక్షుం మహా చ్ఛారీరకం శిఖా ॥**

**అవ్యక్తై కాక్షరం పూర్ణా సూర్యా క్ష్య ధ్యాత్మకుణ్డికా ॥**
**సావిత్ర్యా త్మా పాశుపతం పరంబ్రహ్మాఽవధూతకమ్ ।**
**త్రిపురాతపనం దేవీ త్రిపురా కఠ భావనా ॥**

**హృదయం కుణ్డలీ భస్మ రుద్రాక్ష గణ దర్శనమ్ ।**
**తారసార మహావాక్య పఞ్చబ్రహ్మాఽగ్ని హోత్రకమ్ ॥**

**గోపాలతాపనం కృష్ణం యాజ్ఞవల్క్యం వరాహకమ్ ।**
**శాట్యాయనీ హయగ్రీవం దత్తాత్రేయఞ్చ గారుడమ్ ॥**

**కలి జాబాల సౌభాగ్య రహస్యం ఋచ ముక్తి కేతి ॥** (మొత్తం 108 ఉపనిషత్తులు)

తత్ర దశోపనిషదః (౧౦) ఋగ్వేదగతాః శుక్లకృష్ణభేదేన యజుష ఏకపఞ్చాశత్ ॥ (౫౧) తత్ర, శుక్ల యజుష ఏకోనవింశతిః ॥ (౧౯) కృష్ణ యజుషో ద్వాత్రింశత్ (౩౨), సామ్నష్షోడశ (౧౬), అధర్వణ స్యైకత్రింశత్ (౩౧) ఆహత్యాష్టోత్తర శతమ్ ॥ (౧౦౮)

**["సర్వవేదాంత తాత్పర్య నిర్ణయాయ మహామునిః**
**చకార బ్రహ్మసూత్రాణి భగవాన్ బాదరాయణః"]**

మూలం॥ తత్ర గౌడపాదాచార్యై ర్మాణ్డూక్యోపనిష
ద్వ్యాఖ్యాతా శ్రీమచ్ఛఙ్కర భగవత్పాదాచార్యై
ర్దశోపనిషదః పఞ్చరుద్రాః నృసింహతాపనీచ ॥
శఙ్కరానన్దై స్సదాశివ బ్రహ్మేన్ద్రై స్స్వయం ప్రకాశాన
న్దాద్యైశ్చ ద్వాత్రింశదుపనిషదః (౩౨) విద్యారణ్యా
చార్యై రష్టోత్తర శతోపనిషదో వ్యాఖ్యాతాః ॥

**మూలం॥ రామచన్ద్రేణోపదిష్టే రామదూతాయ ధీమతే ।**
**ఈశా ద్యష్టోత్తర శతోపనిషద్యా దసాంపతౌ ॥**

**నిమజ్జ్యామత్ర మహావాక్యరత్నావళి రుదాహృతా ।**
**విభావ్యతే విభాగేన సా త్రయోదశధా పునః ॥**

**తత్రాదౌ విధివాక్యాని బన్ధమోక్ష పరాణిచ ।**
**అవిద్వద్ధేయవాక్యాని జగన్మిథ్యా పరాణిచ ॥**

**తథోపదేశ వాక్యాని జీవేశైక్య పరాణిచ ।**
**బ్రహ్మనిమ్నన నాఖ్యాని జీవన్ముక్తి పరాణిచ ॥**

**బ్రహ్మానుభూతి రూపాణి తత్సమాధి పరాణిచ ।**
**అష్టస్వరూప వాక్యాని ఫలవాక్యాన్యన న్తరమ్ ॥**

**విదేహముక్తి వాక్యాని లిఖ్యన్తేఽ న్విష్య తత్క్రమాత్ ॥**

మూలం॥ య స్స్వాశ్రమాచార రతః పరివ్రా డ్విజితేన్ద్రియః ।
సోధికారీమహావాక్య రత్నావళ్యాం నచారః ॥

మూలం॥ వాక్పూర్ణ సహనాప్యాయం భద్రం కర్ణేఽభి రేవచ ।
పఞ్చశాన్తీః పఠిత్వాదౌ పఠేద్వాక్యా న్యన న్తరమ్ ॥

## ఉపనిషత్తుల శాంతి మంత్రములు

**ఇపుడు ఓం వాఙ్మేమనసి ప్రతిష్ఠితా - ఓం పూర్ణమదః-ఓం సహనావవతు**
**ఓం అప్యాయంతు మమంగాని - ఓం భద్రం కర్ణేభిః**
**అను పంచశాంతి మంత్రములను పఠించవలెను.**
**(పేజీలు ② ③ ④ ⑤లు చూడగలరు.)**

# మహావాక్య రత్నావళి

## ప్రకరణములు

## I. విధివాక్య ప్రకరణము (1-66)

**(1) I.1.** సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత

**(2) I.2.** ఆత్మానయేవ వేదాహం బ్రహ్మే స్మీతి

**(3) I.3.* *ఆత్మావా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః*

**(4) I.4.** మహత్పదం జ్ఞాత్వా వృక్షమూలే వసేత్

**(5) I.5.** సచ్చిదానంద మాత్మన మద్వితీయం బ్రహ్మభావయేత్

**(6) I.6.** అహం బ్రహ్మోస్మీ త్యనుసంధానం కుర్యాత్

**(7) I.7.** సతద్జ్ఞో బాలోన్మత్త పిశాచవజ్జడవృత్యా లోకమాచరేత్

**(8) I.8.** బ్రాహ్మణ స్సమాహితోభూత్వా తత్త్వంపదైక్యమేవ సదా కుర్యాత్

**(9) I.9.** సర్వత్రాద్వైత బ్రహ్మబుద్ధిం కుర్యాత్

**(10) I.10.** అశాంబరోన నమస్కారోన స్వాహాకారోన స్వధాకారోన
నిందాస్తుతి ర్యాదృచ్ఛికో భవేత్

**(11) I.11.** సర్వతస్స్వరూపమేవ పశ్యన్ జీవన్ముక్తి మవాప్య ప్రారబ్ధ
ప్రతిభాసనాశ పర్వంతం స్వరూపానుసంధానేన వసేత్

**(12) I.12.** స్వరూపాను సంధానం వినాన్యథాచార పరోన భవేత్

**(13) I.13.** వేదాన్తశ్రవణం కుర్వన్యోగం సమారభేత్

**(14) I.14.** ఆకుంచనేన కుండలిన్యా కపాటముద్ఘాట్య మోక్షద్వారం విభేదయేత్

**(15) I.15.** యచ్ఛే ద్వాఙ్మనసి ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్జ్ఞాన ఆత్మని

**(16) I.16.** జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని

**(17) I.17.** ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతిపూరుషః

**(18) I.18.** కిమిచ్ఛన్కస్యకామాయ శరీర మనుసంజ్వరేత్

**(19) I.19.** తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః

**(20) I.20.** నానుధ్యాయేద్బహూమ్ శ్చబ్దాన్వాచో విగ్లాపనంహి తత్

**(21) I.21.** యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే

**(22) I.22.** అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా

**(23) I.23.** చిత్త మేవహి సంసార స్తత్ప్రయత్నేన శోధయేత్

* *శ్రీ మహావాక్య రత్నావళిలోని వివిధ ప్రకరణములలో, నారాయణ అభిమతము ప్రకారము, సారభూతమైన ప్రకరణార్థ నిదర్శనరూపమైన మహావాక్యములు ఇటాలిక్స్‌లో ఈ విధముగా చూపబడినవి.*

(24) I.24. దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చిన్తయేత్

(25) I.25. మాయాకార్య మిదం భేద మస్తిచే ద్బ్రహ్మభావనం

(26) I.26. దేహోఽహమితి దుఃఖీచే ద్బ్రహ్మోహమితి నిశ్చను

(27) I.27. హృదయగ్రంథి స్తిత్వే ఛేదనే బ్రహ్మచక్రకం

(28) I.28. సంశయే సమనుప్రాప్తే బ్రహ్మనిశ్చయ మాప్నుయాత్

(29) I.29. విజ్ఞేయోఽక్షరతన్మాత్రో జీవితం చాతిచంచలం

(30) I.30. విహాయ శాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతాం

(31) I.31. యస్యస్త్రీ తస్యభోగేచ్ఛా నిస్త్రీకస్య క్వభోగభూః

(32) I.32. స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీభవేత్

(33) I.33. చిత్తం కారణ మర్థానాం తస్మిన్సతి జగత్త్రయం

(34) I.34. తస్మిన్ క్షీణే జగత్క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః

(35) I.35. సుప్తే రుత్థాయ సుప్త్యంతం బ్రహ్మైకం పరిచిన్త్యతాం

(36) I.36. గచ్ఛం స్తిష్ఠ న్నుపవిశం శ్చయానో వాన్యథాఽపి వా

(37) I.37. యథేచ్ఛయా వసే ద్విద్వా నాత్మారామ స్సదామునిః

(38) I.38. జ్యోతిర్లింగం భ్రువోర్మధ్యే నిత్యం ధ్యాయే స్సదా యతిః

(39) I.39. ఆత్మాన మాత్మనాసాక్షా ద్బ్రహ్మబుద్ధ్వా సునిశ్చలం

(40) I.40. దేహజాత్యాది సంబంధాన్ వర్ణాశ్రమసమన్వితాన్

(41) I.41. వేదశాస్త్రపురాణాని పదపాంసుమివ త్యజేత్

(42) I.42. ఏకాకీ నిస్పృహ స్తిష్ఠేన్నహికేన సహాలపేత్

(43) I.43. దద్యాన్నారాయణేత్యేవం ప్రతివాక్యం సదా యతిః

(44) I.44. మునిః కౌపీనవాసాస్స్యా న్నగ్నోవా ధ్యానతత్పరః

(45) I.45. అధ్యాత్మరతి రాసీనో నిరపేక్షో నిరాశిషః

(46) I.46. ఆత్మనైవ ససహాయేన సుఖార్థీ విచరే దిహ

(47) I.47. సందిగ్ధ స్సర్వభూతానాం వర్ణాశ్రమ వివర్జితః

(48) I.48. అంధవ జ్జడవచ్చాపి మూకవచ్చ మహీం చరేత్

(49) I.49. యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్

(50) I.50. యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయేత్

(51) I.51. లభతే నాసయా యద్యత్త త్తదాత్మేతి భావయేత్

(52) I.52. జిహ్వయా యద్రసంహ్యాత్తి తత్తదాత్మేతి భావయేత్

(53) I.53. త్వచా యద్య త్స్పృశేద్యోగీ తత్తదాత్మేతి భావయేత్

(54) I.54. దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యే ద్బ్రహ్మమయం జగత్

(55) I.55. ద్రష్టృ దర్శన దృశ్యానాం విరామో యత్రవా భవేత్

(56) I.56. దృష్టి స్తత్రైవ కర్తవ్యా ననాసాగ్రావలోకినీ

(57) I.57. దేవాగ్న్యగారే తరుమూలే గుహాయాం వసే దసంగోఽలక్షితశీలవృత్తః

(58) I.58. నిరింధనజ్యోతిరివోపశాంతో నచోద్విజే దుద్విజేద్యత్రకుత్ర

(59) I.59. శాంతోదాంత ఉపరత స్తితిక్షుర్యోఽనూచానో హ్యాబిజ్ఞోఽసౌ సమానః

(60) I.60. త్యక్తేషణో హ్యనృణస్తం విదిత్వా మౌనీ వసే దాశ్రమే యత్రకుత్ర

(61) I.61. యమైశ్చ నియమైశ్చైవ ధ్యానైశ్చైవ సుసంయుతః

(62) I.62. నాడీశుద్ధించ కృత్వాదౌ ప్రాణాయామం సమాచరేత్

(63) I.63. సర్వచింతాం పరిత్యజ్య సావధానేన చేతసా

(64) I.64. నిర్వికల్పః ప్రసన్నాత్మా ప్రాణాయామం సమాచరేత్

(65) I.65. మరుదభ్యసనం సర్వం మనోయుక్తం సమభ్యసేత్

(66) I.66. ఇతరత్ర నకర్తవ్యా మనోవృత్తి ర్మనీషిణా

---

## II. బంధమోక్ష వాక్య ప్రకరణము (67-97)

---

(67) II.1. దేహాదీనాత్మత్వే నాభిమన్యతే సోఽభిమాన ఆత్మనో బంధః

(68) II.2. తన్నివృత్తి ర్మోక్షః

(69) II.3. కర్తృత్వాద్యహంకార సంకల్పో బంధః

(70) II.4. అణిమాద్యష్టైశ్వర్యాశాసిద్ధ సంకల్పో బంధః

(71) II.5. యమాద్యష్టాంగయోగ సంకల్పో బంధః

(72) II.6. దేవమనుష్యా ద్యుపాసనా సంకల్పో బంధః

(73) II.7. కేవల మోక్షాపేక్ష సంకల్పో బంధః

(74) II.8. సంకల్పమాత్రసంభవో బంధః

(75) II.9. నిత్యానిత్య వస్తువిచారాదనిత్య సంసార సుఖదుఃఖ విషయ
సమస్త క్షేత్రమమతా బంధక్షయో మోక్షః

(76) II.10. మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః

(77) II.11. బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతం

***(78) II.12. మమేతి బధ్యతే జంతుర్నిర్మమేతి విముచ్యతే**

(79) II.13. మమత్వేన భవే జ్జీవో నిర్మమత్వేన కేవలః

(80) II.14. స్వసంకల్పవశాద్బద్ధో నిస్సంకల్పాద్విముచ్యతే

(81) II.15. ద్రష్టాదృశ్యవశాద్బద్ధో దృశ్యాభావే విముచ్యతే

(82) II.16. ఇచ్ఛామాత్ర మవిద్యేయం తన్నాశో మోక్ష ఉచ్యతే

(83) II.17. భోగేచ్ఛామాత్రకో బంధః తత్త్యాగో మోక్ష ఉచ్యతే

(84) II.18. చిచ్చైత్యకలితో బంధః తన్ముక్తి ర్ముక్తి రుచ్యతే

(85) II.19. అనాస్థైవహి నిర్వాణం దుఃఖ మాస్థాపరిగ్రహః

(86) II.20. కర్మణా బధ్యతే జంతు ర్విద్యయాచ విముచ్యతే

(87) II.21. స్వరూపావస్థితి ర్ముక్తి స్తద్భ్రంశో హంఽ త్వవేదనం

(88) II.22. చిత్తే చలతి సంసారో నిశ్చలే మోక్ష ఉచ్యతే

(89) II.23. బంధోహి వాసనాబంధో మోక్షస్స్యా ద్వాసనాక్షయః

(90) II.24. పదార్థభావనాదార్ఢ్యం బంధిత్యభిధీయతే

(91) II.25. వాసనాతానవం బ్రహ్మన్ మోక్ష ఇత్యభిధీయతే

(92) II.26. నమోక్షో నభసః పృష్ఠే నపాతాలే నభూతలే

(93) II.27. సర్వాశా సంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీర్యతే

(94) II.28. మోక్షేమేఽ స్త్వితి చింతాం తర్జాతా చే దుత్థితం మనః

(95) II.29. మననోత్థే మనన్యేష బంధ స్సాంసారికోమతః

(96) II.30. తదమార్జనమాత్రంహి మహాసంసారతాం గతం

(97) II.31. తత్ప్రమార్జనమాత్రంతు మోక్ష ఇత్యభిధీయతే

## III. అవిద్వన్నిందావాక్య ప్రకరణము (98-118)

(98) III.1. అథ యోఽన్యాం దేవతా ముపాసతేఽన్యోసావన్యోహమస్మీతి నసవేద యథాపశుః

(99) III.2. అత్ర భిదామివ మన్యమానః శథధా సహస్రధా భిన్నో మృత్యోస్సమృత్యుమాప్నోతి

***(100) III.3. కర్తృత్వాద్యహంకార భావనారూఢో మూఢః**

(101) III.4. మృత్యో స్సమృత్యు మాప్నోతియ ఇహనానేవ పశ్యతి

(102) III.5. అనుభూతిం మూఢో వృథా బ్రహ్మణి మోదతే

(103) III.6. ప్రతిబింభితశాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్

(104) III.7. అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతం

(105) III.8. ఓంకారం యో నజానాతి బ్రాహ్మణో నభవేత్తు సః

(106) III.9. అతివర్ణాశ్రమం రూపం సచ్చిదానందలక్షణం

(107) III.10. యో నజానాతి సోఽ విద్వాన్ కదా ముక్తో భవిష్యతి

(108) III.11. కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనా స్సురాగిణః

(109) III.12. తేప్యజ్ఞానతయా నూనం పునరాయాన్తి యాన్తిచ

(110) III.13. కాష్ఠదండో ధృతో యేన సర్వాశీ జ్ఞానవర్జితః

(111) III.14. స్వాయత్త మేకాంతహింతం న్వేప్సితం త్యాగవేదనం

(112) III.15. యస్య దుష్కరతాం యాతం ధి క్తం పురుషకీటకం

(113) III.16. అద్వితీయం బ్రహ్మతత్త్వం నజానంతి యదాతదా

(114) III.17. భ్రాన్తా ఏవాఖిలా స్తేషాం క్వముక్తిః క్వేహవా సుఖం

(115) III.18. అజ్ఞానోపహతో బాల్యే యౌవనే వనితాహతః

(116) III.19. శేషే కళత్రచింతార్తః కింకరోతి నరాధమః

(117) III.20. ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన జంతవః

(118) III.21. ధరావివర మగ్నానాం కీటానాం సమతాం గతాః

## IV. జగన్మిథ్యావాక్య ప్రకరణము (119-151)

(119) IV.1. నాన్యత్కించన మిషత్

(120) IV.2. వాచారంభణం వికారో నామధేయం

(121) IV.3. అతోఽ న్యన్మార్తం

(122) IV.4. నతు తద్ద్వితీయ మస్తి

(123) IV.5. నాత్ర కాచన భిదాస్తి

(124) IV.6. నై వతత్ర కాచన భిదాస్త

(125) IV.7. సర్వం వికారజాతం మాయామాత్రం

(126) IV.8. సర్వత్ర సహ్యస్తి ద్వైతసిద్ధి ర్నాస్తి ద్వైతం కుతో మర్త్యం

(127) IV.9. ప్రపంచో యది విద్యేత నివర్తేత నసంశయః

(128) IV.10. మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః

(129) IV.11. వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్

(130) IV.12. ఉపదేశా దయం వాదో జ్ఞాతే ద్వైతం నవిద్యతే

(131) IV.13. ద్వితీయకారణాభావా దనుత్పన్న మిదం జగత్

(132) IV.14. యథై వహి నభశ్శూన్యం జగచ్ఛూన్యం తథై వహి

(133) IV.15. ఇదం ప్రపంచం యత్కించి ద్యద్యజ్జగతి వీక్ష్యతే

(134) IV.16. దృశ్యరూపంచ దృగ్రూపం సర్వం శశవిషాణవత్

(135) IV.17. అయం ప్రపంచో నాస్త్యేవ నోత్పన్నం నోత్థితం జగత్

(136) IV.18. చిత్తం ప్రపంచ ఇత్యాహు ర్నాస్తినాస్తే వ సర్వదా

(137) IV.19. మాయాకార్య మిదం నాస్తి మాయా నాస్తి భయం నహి

(138) IV.20. పరం బ్రహ్మాహ మస్మీతి స్మరణస్య మనో నహి

(139) IV.21. వంధ్యాకుమారవచనే భీతిశ్చే దస్త్విదం జగత్

(140) IV.22. శశశృంగేణ నాగేంద్ర మృతశ్చే దస్త్విదం జగత్

(141) IV.23. మృగతృష్ణాజలం పీత్వా తృప్త శ్చే దస్త్విదం జగత్

(142) IV.24. గంధర్వనగరే సత్యే జగద్భవతి సర్వదా

***(143) IV.25.** *గగనే నీలిమాసత్త్వే జగత్సత్యం భవిష్యతి*

(144) IV.26. మాసాత్పూర్వం మృతో మర్త్యోహ్యాగతశ్చే జ్జగద్భవేత్

(145) IV.27. గోస్త నా దుద్భవం క్షీరం పునరారోపణే జగత్

(146) IV.28. జ్వాలాగ్ని మండలే పద్మవృద్ధిశ్చే జ్జగ దస్త్విదం

(147) IV.29. జ్ఞానినో హృదయం మూఢై ర్జ్ఞాతంచే దిస్త్విదం జగత్

(148) IV.30. అజకుక్షా జగన్నాస్తి హ్యాత్మకుక్షా జగన్నహి

(149) IV.31. సర్వదా భేదకలనం ద్వైతాద్వైతం నవిద్యతే

(150) IV.32. నాస్తి నాస్తి జగత్సర్వం గురుశిష్యాదికం నహి

(151) IV.33. సచ్చిదానందమాత్రోహ మనుత్పన్న మిదం జగత్

## V. ఉపదేశవాక్య ప్రకరణము (152-205)

(152) V.1. స య ఏషోఽణిమైతదాత్మ్య మిదంసర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో

(153) V.2. అభయం వై జనక ప్రాప్తోఽసి

(154) V.3. బ్రహ్మచర్య మహింసాంచ సత్యం చాపరిగ్రహం యత్నేన హేరక్షత హేరక్షత హేరక్షతేతి

***(155) V.4.** *తత్త్వమసి త్వంతదసి*

(156) V.5. యన్మనసా నమనుతే యేనాహు ర్మనోమతం

(157) V.6. తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే

(158) V.7. యత్పరంబ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్

(159) V.8. సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేతత్

(160) V.9. అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవాంబుధౌ

(161) V.10. అంతశ్శూన్యో బహిశ్శూన్య శ్శూన్యకుంభ ఇవాంబరే

(162) V.11. మాభవ గ్రాహ్యభావాత్మా గ్రాహకాత్మాచ మాభవ

(163) V.12. భావనా మఖిలాం త్యక్త్వా యచ్ఛేషం తన్మయోభవ

(164) V.13. ద్రష్టృదర్శనదృశ్యాని త్యక్త్వా వాసనయాసహ

(165) V.14. దర్శన ప్రథమాభాస మాత్మానం కేవలం భజ

(166) V.15. చిత్తాకాశం చిదాకాశం ఆకాశంచ తృతీయకం

(167) V.16. ద్వాభ్యాం శూన్యతరం విద్ధి చిదాకాశం మహామునే

(168) V.17. ధ్యానతో హృదయాకాశే చితి చిచ్చక్రధారయా

(169) V.18. మనో మారయ నిశ్శంకం త్వాం ప్రబధ్నన్తి నారయః

(170) V.19. భోగై కవాసనాం త్యక్త్వా త్యజ త్వం భేదవాసనామ్

(171) V.20. భావాభావౌ తత స్త్యక్త్వా నిర్వికల్పస్థిరో భవ

(172) V.21. త్యజ ధర్మ మధర్మంచ ఉభేసత్యానృతే త్యజ

(173) V.22. ఉభేసత్యానృతేత్యక్త్వా యేన త్యజసి తత్త్యజ

(174) V.23. ఆత్మ న్యతీతే సర్వస్మా త్సర్వరూపేఽథవాతతే

(175) V.24. కోబంధః కశ్చవా మోక్షో నిర్మూలమననం కురు

(176) V.25. ఆశా యాతు నిరాశత్వ మభావం యాతు భావనా

(177) V.26. అమనస్త్వం మనో యాతు తవాసంగే నజీవితః

(178) V.27. ఏక మాద్యంతరహితం చిన్మాత్ర మమలంతరం

(179) V.28. ఖాదప్యతితరాంసూక్ష్మం తద్బ్రహ్మాసి నసంశయః

(180) V.29. రక్షకౌ విష్ణురిత్యాది బ్రహ్మాసృష్టే స్తు కారణం

(181) V.30. సంహారే రుద్రఇత్యేవం సర్వం మిథ్యేతి నిశ్చిను

(182) V.31. మత్త్యక్తం నాస్తి కించిద్వా మత్త్యక్తా పృథివీతు వా

(183) V.32. మయాతిరిక్తం యద్యద్వా తత్తన్నాస్తీతి నిశ్చిను

(184) V.33. అనాత్మేతి ప్రసంగోవా అనాత్మేతి మనోఽపివా

(185) V.34. అనాత్మేతి జగద్వాపి నాస్త్యనాత్మేతి నిశ్చిను

(186) V.35. ఆదిమధ్యావసానేషు దుఃఖంసర్వ మిదం యతః

(187) V.36. అతిస్సర్వం పరిత్యజ్య తత్వనిష్ఠో భవానఘ

(188) V.37. నిద్రాయా లోకవార్తాయా శ్శబ్దాదే రాత్మవిస్మృతేః

(189) V.38. క్వచిన్నావసరం గత్వా చింత యాత్మాన మాత్మని

(190) V.39. సర్వవ్యాపార ముత్సృజ్య అహం బ్రహ్మేతి భావయ

(191) V.40. అహం బ్రహ్మేతి నిశ్చిత్య త్వహంభావం పరిత్యజ

(192) V.41. ఘటాకాశం మహాకాశే ద్రవాత్మానం పరాత్మని

(193) V.42. విలాప్యాఖండభావేన తూష్ణీంభవ సదా మునే

(194) V.43. చిదహాస్తీతి చిన్మాత్ర మిదం చిన్మయమేవచ

(195) V.44. విత్త్వం చిదహమేతేచ లోకాశ్చిదితి భావయ

(196) V.45. సత్యచిద్ఘన మఖండ మద్వయం సర్వదృశ్యరహితం నిరామయం

(197) V.46. యత్పదం విమల మద్వయం శివం తత్సదాహమితి మౌనమాశ్రయ

(198) V.47. జన్మమృత్యు సుఖదుఃఖవర్జితం జాతి నీతి కులగోత్ర దూరగం

(199) V.48. చిద్వివర్త జగతోఽస్య కారణం తత్సదాహమితి మౌనమాశ్రయ

(200) V.49. పూర్ణ మద్వయ మఖండచేతనం విశ్వభేదకలనాది వర్జితం

(201) V.50. అద్వితీయ పరసం విదంశకం తత్సదాహమితి మౌనమాశ్రయ

(202) V.51. స్వాత్మనోఽన్యతయా భాతం చరాచర మిదం జగత్

(203) V.52. స్వాత్మమాత్రతయా బుధ్వా తదస్మీతి విభావయ

(204) V.53. విలాప్య వికృతిం కృత్స్నాం సంభవ వ్యత్యయక్రమాత్

(205) V.54. పరిశిష్టంచ చిన్మాత్రం చిదానందం విచిన్తయ

---

## VI. జీవబ్రహ్మైక్యవాక్య ప్రకరణము (206-243)

---

(206) VI.1. సయ శ్చాయం పురుషే

(207) VI.2. యశ్చాసావా దిత్యేతే

(208) VI.3. స ఏక !

(209) VI.4. సత్య మాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవాత్ర నవిచికిత్స్యం

(210) VI.5. త్వం బ్రహ్మాసి

(211) VI.6. అహం బ్రహ్మాస్మి

**(212) VI.7.** ఆవయో రంతరం న విద్యతే త్వమేవాహ మహమేవ త్వం

**(213) VI.8.** గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు

**(214) VI.9.** కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరేఽవ్యయే సర్వ ఏకీభవన్తి

**(215) VI.10.** యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ

**(216) VI.11.** స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం

**(217) VI.12.** చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వ గవాదిషు

**(218) VI.13.** చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి

**(219) VI.14.** పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణి

**(220) VI.15.** బుద్ధే స్సాక్షితయా స్థిత్వా స్ఫుర నహ మితీర్యతే

**(221) VI.16.** స్వతఃపూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః

**(222) VI.17.** అస్మీత్యైక పరామర్శ స్వేన బ్రహ్మ భవామ్యహం

**(223) VI.18.** ఏకమేవాద్వితీయం సన్నామరూప వివర్జితం

**(224) VI.19.** సృష్టేః పురాధునాప్యస్య తా దృక్త్వంతదితీర్యతే

**(225) VI.20.** శ్రోతు ర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితం

**(226) VI.21.** ఏకతాగ్రాహ్యతేసీతి తదైక్య మనుభూయతాం

**(227) VI.22.** స్వప్రకాశం పరోక్షత్వ మయ మిత్యుక్తితో మతం

**(228) VI.23.** అహంకారాది దేహాన్తా త్ప్రత్యగాత్మేతి గీయతే

**(229) VI.24.** దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే

**(230) VI.25.** బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం

**(231) VI.26.** మాయాఽవిద్యే విహాయైవాముపాధీ పరజీవయోః

**(232) VI.27.** అఖండం సచ్చిదానందం పరబ్రహ్మైవలక్ష్యతే

***(233)VI.28.** *సకారః ఖేచరీ ప్రోక్తః త్వంపదంచేతి నిశ్చితం*

***(234)VI.29.** *హకారః పరమేశ స్స్యాత్ తత్పదంచేతి నిశ్చితం*

**(235) VI.30.** సకారో ధ్యాయతే జంతుర్హకారోహి భవేద్ధ్రువం

**(236) VI.31.** అథోరా తత్పదార్థస్యా న్మకార స్త్వంపదార్థవాన్

**(237) VI.32.** తయో స్సంయోజన మసీత్యర్థే తత్త్వవిదో విదుః

**(238) VI.33.** నమ స్త్వమర్థో విజ్ఞేయో రామ స్తత్పద ముచ్యతే

(239) VI.34. అసీత్యర్థే చతుర్థీ స్యాత్ ఏవం మంత్రేషు యోజయేత్

(240) VI.35. క్షీరంక్షీరే యథాక్షిప్తం తైలంతైలే జలంజలే

(241) VI.36. సంయుక్త మేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః

(242) VI.37. ఘటేనష్టే యథా వ్యోమవ్యోమైవ భవతి స్వయం

(243) VI.38. తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయం

---

## VII. మనన వాక్య ప్రకరణము (244-282)

---

(244) VII.1. అహమన్న మహమన్న మహమన్నమ్

(245) VII.2. అహమన్నాదోఽహ మన్నాదోఽహమన్నాదః

(246) VII.3. అహమ్మను రభవం సూర్యశ్చ

(247) VII.4. అహమేవేదం సర్వ మశ్నామి

*(248) VII.5. *యథా ఫేనతరంగాది సముద్రా దుత్థితం పునః*

*(249) VII.6. *సముద్రే లీయతే తద్వ జ్జగస్మయ్యను లీయతే*

(250) VII.7. అనాత్మదృష్టి రవివేకనిద్రా మహం మమ స్వప్నగతిం గతోఽహం

(251) VII.8. స్వరూపసూర్యేఽభ్యుదితే స్ఫుటోక్తైర్గురోర్మహావాక్యపదైః ప్రబుద్ధః

(252) VII.9. ప్రాణాశ్చలంతు తద్ధర్మైః కామైర్వా హన్యతాం మనః

(253) VII.10. ఆనందబుద్ధిపూర్ణస్య మమదుఃఖం కథం భవేత్

(254) VII.11. నమే బంధో నమే ముక్తిః నమే శాస్త్రం నమే గురుః

(255) VII.12. మాయామాత్ర వికాసత్వా న్మాయాతీతోఽహ మవ్యయః

(256) VII.13. కర్తృత్వమపి నష్టం కర్తవ్యంవాఽపి నక్వచిత్

(257) VII.14. ఆత్మాన మంజసా వేద్మి క్వాప్యజ్ఞానం పలాయితం

(258) VII.15. బ్రాహ్మణ్యం కులగోత్రేచ నామసౌందర్య జాతయః

(259) VII.16. స్థూలదేహగతా ఏతే స్థూలా ద్భిన్నస్య మే నహి

(260) VII.17. క్షుత్పిపాసాంధ్యబాధిర్య కామక్రోధాదయోఽఖిలాః

(261) VII.18. లింగదేహగతా ఏతే హ్యలింగస్య నవిద్యతే

(262) VII.19. జడత్వ ప్రియ మోదత్వ ధర్మాః కారణదేహగాః

(263) VII.20. నసంతి మమ నిత్యస్య నిర్వికారస్వరూపిణః

(264) VII.21. చిద్రూపత్వా న్నమే జాడ్యం సత్యత్వాన్నానృతం మమ

